

శ్రీ పద్మసంభవుడు



శ్రీ సిద్ధేశ్వరానంద

హిమాలయ కైలాసపర్వతము

# సిద్ధాశ్రమ యోగులు




కుర్తాళం శ్రీ సిద్ధేశ్వరీ పీఠాధిపతులు, జగద్గురువులు

**శ్రీశ్రీశ్రీ సిద్ధేశ్వరానంద భారతీ మహాస్వామి వారు**

పుస్తకములను, మీ చిరునామాకు పంపించుటకు వివరములు

**Mantra - e-store**

Email Address : courtallamswamijisbooks @ gmail.com

**Online Store Address:**

https://mantra-estore-myshopify.com//

**Phone Numbers :**

**1) Andhra Pradesh**

Phone Number : 0-9063701687

Whatsapp Number : 0-9063701687

**2) Telangana :**

Phone Number : 0-8977788055

Whatsapp Number : 0-8977788055

3) **USA :**

Phone Number : 001-678-643-8133

Whatsapp Number : 001-678-643-8133

# విషయ సూచిక

# 1. సిద్ధభూమిక

సిద్ధాశ్రమం హిమాలయ పర్వతాలలో అత్యంత రహస్యమైన ఒక ప్రదేశం. పురాణాలలో మహర్షులెందరో ఇక్కడ తపస్సు చేసి దేవతానుగ్రహం పొందినట్లుగా చెప్పబడింది. మరీచి, వసిష్ఠుడు, అగస్త్యుడు, విశ్వామిత్రుడు, కపిలుడు మొదలైన ఋషులిక్కడ ఎన్నో సంవత్సరాలు కఠోరమైన తపస్సు చేశారు. కృతయుగంలో ప్రసిద్ధుడైన మహారాజు మాంధాత ఇక్కడనే తపస్సు చేశాడు. ఆయనపేరుతో మాంధాత పర్వతం కూడా ఈ ప్రాంతంలో ఉంది. త్రేతాయుగంలో భస్మాసురుడు, రావణుడు ఇచటనే క్రూరంగా తపస్సు చేసి మహేశ్వరుని అనుగ్రహం పొందారు. బ్రహ్మ కుమారుడు పులస్త్యుడు - అతని కుమారుడు విశ్రవుడు. అతని పుత్రుడు రావణుడు. అందరూ హిమాలయవాసులే. రావణుడు తర్వాత దక్షిణ సముద్రంలో తన అన్నయైన కుబేరుని ఆస్తియైన లంకా ద్వీపాన్ని జయించి ఆక్రమించుకొన్నాడు. రావణుడు తపస్సు చేసిన రక్షస్థల్ మానససరస్సు దగ్గరే.

దత్తాత్రేయ స్వామి కైలాస పర్వతప్రాంతంలో తరచుగా సంచరిస్తుంటాడని అక్కడ ఆయన నివాసమొక గుహ ఆశ్రమము ఉన్నవని పురాణకథనము.

ద్వాపరాంతంలో బృందావనధామం నుండి కృష్ణుడు మధురకు వెళ్ళిపోయిన తర్వాత రాధాదేవి సిద్ధాశ్రమానికి వెళ్ళి 100 సంవత్సరాలు తపస్సు చేసి శరీరాన్ని విడిచి పెట్టి గోలోకానికి వెళ్ళిపోయినట్లు పురాణాలలో ఉంది. కైలాసపర్వతంలో ఆమె తపస్సు చేసినగుహలో ఆ దేవి శరీరంమీద దత్తాత్రేయ స్వామి సువర్ణ రాధా విగ్రహాన్ని స్థాపించినట్లు యోగులు ఉద్ఘాటిస్తున్నారు.

దత్తాత్రేయుని అవతారమైన శ్రీపాద శ్రీవల్లభులు ఆంధ్రదేశములోని పిఠాపురంలో జన్మించారు. సిద్ధవల్లభుడైన ఆ మహనీయుడు హిమాలయాలకు వచ్చి అక్కడ కైవల్య పర్వత ప్రదేశంలో ఉండి అచట స్ఫటిక సరస్సులో స్నానం చేశాడట ! దానివల్ల ఆయనకు 16 సంవత్సరాల వయస్సు గల

దేహం నిలిచి పోయింది. వయస్సు పైబడినా ముసలితనం రానీయని ఆదివ్య జలప్రభావం అనుభవించిన యోగీశ్వరుడతడు. కైవల్యపర్వతమంటే కైలాస శైలమని స్ఫటిక సరస్సంటే మానససరస్సని కాదు వేరే అని రకరకాల అభిప్రాయాలు. మరొక విశేషం. ఈ సరస్సు అక్కడి శంబళగ్రామంలో ఉన్నదని శ్రీ వల్లభుల చరిత్రలో ఉంది. కలియుగాంతమునందు శంబళ గ్రామంలో కల్కి భగవానుడు ఉదయిస్తాడని భాగవతంలో ఉంది. ఈ శంబళ గ్రామమే సిద్ధాశ్రమమని కొందరు భావిస్తున్నారు. అమెరికన్ రచయితలు – హిమాలయ పరిశోధకులీ అభిప్రాయాన్ని బలపరుస్తున్నారు.

కృతయుగంలోని నలదమయంతుల కథలో నలుడు దమయంతిని అడవిలో విడిచివెళ్ళిపోయిన తరువాత ఆ పతివ్రత ఆత్మహత్యకు పూనుకొంటే సిద్ధాశ్రమ ఋషులు ప్రత్యక్షమై ఆమె పూనికను ఆపి త్వరలో భర్తను కలుసుకొంటావని వరమిచ్చినట్లు భారతంలో ఉంది. ఇది ఇలా ఉండగా శంబళ గ్రామాన్ని గురించి ఎందరో ఎన్ని రకాలుగానో వ్రాశారు. డాక్టర్ జాషువా డేవిడ్ స్టోన్ అనే రచయిత అమెరికన్ సేనాని ఎడ్మిరల్ బర్డ్ యొక్క అనుభవాలను అగర్తా అన్న గ్రంథంలో విచిత్రంగా ఉల్లేఖించాడు. దానిలోని అంశాలు అద్భుతంగా ఉన్నవి.

1947లో ద్వితీయ ప్రపంచ సంగ్రామం తర్వాత అమెరికా విమాన సేనా నాయకులలో ఒకడు ఎడ్మిరల్‌బర్డ్ ఒక చిన్నవిమానంలో ఆర్కిటిక్ – ఉత్తర ధ్రువ ప్రాంతాలవైపు వెళ్ళాడు. విమానం యాంత్రికలోపం వల్ల చెడిపోయింది. వెంటనే వద్దామని వెళ్ళినందువల్ల ఆహారం – నీరు ఎక్కువ లేవు. ఆ మంచులో మరణించక తప్పదన్న స్థితిలో ఒక మంచు పెళ్ళ పైకి లేచింది. అందులోనించి ఒక మానవుడు పైకి వచ్చి యితనిని పిలిచి ఆ మంచు పెళ్ళ క్రింద ఉన్న గుహలోకి తీసుకు వెళ్ళి చిక్కని ఆకుపచ్చ ద్రవం ఆహారంగా ఇచ్చాడు. దానిని తీసుకుంటే శక్తి – ఓపిక వచ్చింది. ఇప్పుడు నీకిచ్చిన ఆహారంకొన్ని రోజుల దాక బలాన్ని నిలుపుతుందని ఆ వ్యక్తి ఇతనికి చెప్పాడు. అక్కడ ఉన్న మరికొందరికి ఇతనిని పరిచయం చేశాడు. వారంతా వందల వేల సంవత్సరాల వయస్సు గలవారు. ఆ గుహలోపలికి వెళ్ళగా

ఇండ్లు, మనుషులు భూసొరంగాలలో కనిపిస్తున్నవి. మీ దేశాధిపతులు అణుబాంబులు ప్రయోగించి మానవజాతి నాశనానికి కారకులవుతున్నారు. అలా చేయవద్దని హెచ్చరించటానికే నిన్నిక్కడికి అనుమతించాము అని వారు బర్డ్‌కు తెలియజేశారు. అతని అభ్యర్థనపై అక్కడి విశేషాలు మరికొన్ని తెలిపారు.

భూమిలో ఇటువంటి పట్టణాలు ఎన్నో ఉన్నవట. వీటన్నిటి కేంద్రం శంబళ గ్రామం. అక్కడ భగవంతుడు పరిపాలకుడు. ఆయన సర్వశక్తి సంపన్నుడు. ఆయన పరివారంలోని వారే ఈ భూగర్భవాసులు. వీరంతా దీర్ఘ కాలజీవులు. ప్రపంచంలోని ఎన్నో ప్రదేశాలలో సొరంగాల ద్వారా ఈ పట్టణాలకు త్రోవలున్నవి. హిమాలయాలు, ఈజిప్టులోని పిరమిడ్లు, టిబెట్‌లోని లాసా ప్రాంత గుహలు, అమెరికాలోని కొలరాడో పర్వత కందరాలు - ఇటువంటి చోట్ల నుండి భూమిలోకి మార్గాలున్నవి. యమునానదిలోని ఒక రహస్య మార్గం ద్వారా ద్వాపరాంతంలో బృందావనంలోనందుని -వరుణభటుడు మకరరూపంలో వచ్చి తీసుకువెళ్తే శ్రీకృష్ణుడు వెళ్ళి తండ్రిని విడిపించి తీసుకువచ్చాడు. అమెరికాలో డెన్వర్ దగ్గర కొండ గుహలో మాయన్ జాతి అవతారపురుషుడు జ్వాలాకూలుడిప్పటికీ ఉండి శంబళ గ్రామంతో సంబంధాలు కలిగి ఉన్నాడు.

ఇటువంటి నమ్మలేని విశేషాలెన్నో ఎడ్మిరల్ బర్డ్ విన్నాడు. వారతని విమానం బాగు చేయించి పంపించారు. అతడు తిరిగి వచ్చి తనపై అధికారులకి విశేషాలు చెపితే వారు భ్రాంతులని కొట్టివేశారు. సైన్య నిబంధనలను బట్టి సర్వీసులో ఉండగా రహస్యంగా ఉంచి రిటైరైన తర్వాత ఇవన్నీ పుస్తకంగా వ్రాయించాడు.

ఈ గ్రంథంలో భూమిలోని ఈ జాతులను గురించి చాలా విశేషాలున్నవి. ఈజిప్టులోని గిజాపిరమిడ్‌లోని భూసొరంగం ద్వారా లోపలికి మార్గమున్నదట. లోపలివారు శక్తిమంతమైన ఛానెల్సు ద్వారా భూమి మీద కొందరితో సంబంధం పెట్టుకొంటుంటారు. ఎల్‌మొర్య అనే ఛానెల్‌కు నికొలస్ రోరిచ్ అనే రష్యన్ మీడియంగా ఉన్నాడు. భూమిలోపలి టెలోస్ అనే నగరం నుండి షర్మలా, షీల్డ్ అనే భార్యభర్తలు ఛానే అన్న స్త్రీని మీడియంగా ఎన్నుకొని అక్కడి

విశేషాలు తెలుపుతున్నారు. మౌంట్ శాస్త క్రింద పెద్దనగరం ఒకటి ఉన్నది. అందులో చాలామంది యోగులున్నారు. ఎమర్సన్ అనే రచయిత స్మోకీగాడ్ అన్న గ్రంథం 1908లో ప్రచురించాడు. అందులో ఓలాఫ్ జాన్సన్ అనే నార్వే దేశస్థుని అనుభవాలు వ్రాశాడు. ఆ జాన్సన్ రెండు సంవత్సరాలు భూగర్భ నగరంలో ఉన్నాడట. హిమాలయాలో షోన్షే అన్న రహస్య పట్టణం లామాల కాపలా క్రింద ఉంది. దాని జనాభా 3/4 మిలియన్లు. అలానే చైనా, మంగోలియాలో షింగ్వా అనే భూగర్భ నగరం జనాభా కూడా 3/4 మిలియన్లు. భారతదేశంలో జయపూర్ దగ్గర రామనగర్ - ఇటువంటిదే. వీరి సిద్ధాంతం ప్రకారం శ్రీరాముడు అగర్తా నుండి మరుద్వాహనం మీద ధర్మరక్షణకు, దుష్టశిక్షణకు వచ్చిన సిద్ధవీరుడు. ఈ జాతులలో ఎక్కువమంది 400-800 ఏండ్ల వయస్సులో ఉంటారు. ఈ నగరాలు, ఈ ప్రజలు, ఈ యోగులు అందరు శంబళ - విష్ణుదేవుని ఆజ్ఞప్రకారం నడచుకొంటుంటారు. పాశ్చాత్యులు ఈ సంప్రదాయానికి వైట్ బ్రదర్‌హుడ్ - శ్వేతసోదరవర్గము అని పేరు పెట్టారు. ఈ శంబళ గ్రామాన్నే టిబెట్‌లో షాంగ్రీలా అని అంటారు. పెమెకో అన్న పేరుకూడా కొన్ని చోట్ల ఉన్నది. సిద్ధాశ్రమ భాగాలలో 'శంబళ' ప్రధాన కేంద్రం.

ఇంతకు సిద్ధాశ్రమం ఎక్కడ ఉంది ? యక్షరక్షితమైన నిధివలె అత్యంతరహస్యంగా కైలాసపర్వత ప్రాంతంలో ఉన్నదని ఎరిగిన యోగులు చెపుతున్నారు. కైలాస పర్వతం చుట్టూ పద్మదళాకారంలో పర్వతాలున్నవి ఆ మధ్యప్రదేశమే సిద్ధాశ్రమ ప్రాంతమని దార్శనికుల అభిప్రాయము.

శివుని నివాసం కైలాసం. సతీవియోగంతో బాధపడుతున్న మహేశ్వరుడు హిమాలయాలలో దక్షిణామూర్తియై తపస్సు చేసి పరిచర్యకు హిమవంతుని పుత్రి పార్వతి వస్తూ ఉన్నరోజుల్లో తనను వ్యామోహితుని చేయటానికి వచ్చిన మన్మథుని మూడవకంటి మంటతో దహనం చేశాడు. ఆ తర్వాత పార్వతి శివుని గూర్చి కఠోర తపస్సు చేసింది. ఆ ప్రదేశంలో ఉన్న సరస్సుకు గౌరీకుండమని పేరు. ఆ దేవి అక్కడ రోజూ స్నానం చేసేదట ! ఆమె సాధనకు మెచ్చి శివుడు ప్రత్యక్షమైన తర్వాత వారి వివాహం జరిగింది.

ఆ దంపతుల నివాసమే కైలాస పర్వతం. మంచుతో కప్పబడి తెలుపురంగుతో ప్రకాశిస్తుంది గనుక దీనిని రజతపర్వతం వెండికొండ అంటారు. కేలాసం అంటే స్ఫటికం. దీనివలె అలరారుతుంది గనుక కైలాసం అన్న పేరు వచ్చిందని కొందరి అభిప్రాయం. కేళి అంటే క్రీడ. దాని మీద నుండి పుట్టిన శబ్దము కైలము. అస అంటే ఉండుట అని అర్థము. శివుని క్రీడలకు నెలవైన ప్రదేశము గనుక కైలాసమని నామం వచ్చిందని మరికొందరంటున్నారు. కైలాస శిఖరం పిరమిడ్ ఆకారంలో ఉంటుంది. అంటే నాలుగు త్రికోణాలు – త్రిభుజాలు కలిసిన అగ్రం. తూర్పువైపు స్ఫటికం వలె, దక్షిణంవైపు నీలమణి సుందరంగా, పశ్చిమ ముఖం మాణిక్యోల్లసితంగా ఉత్తర దిక్కు కాంచన కమనీయంగా ప్రకాశిస్తుంటవి.

మహాభారతంలో దీనిని హేమకూట పర్వతం అన్నారు. కొందరు దీనినే మేరు పర్వతమంటారు. మేరుస్సుమేరుః హేమాద్రిః అని దేవతలు నివసించే కొండకు పేరు. ఇది చైనాలో ఉన్నదని భౌగోళిక పరిశోధకుల అభిప్రాయం. సుమేరు – సుమేరియన్ నాగరికత – అన్నపేర్లు గ్రంథాలలో కనిపిస్తున్నవి. కొన్ని ప్రాచీన గ్రంథాలలో కైలాసానికి రత్నాద్రి, గణపర్వతం అన్న నామాలు కూడా ఇవ్వబడినవి. జైన సాహిత్యంలో దీనికి అష్టాపదపర్వతమని పేరు. వారి ప్రథమ తీర్థంకరుడు ఋషభనాథుడు ఇక్కడకు వచ్చి నిర్వాణానికి వెళ్ళాడని వారి గ్రంథాలలో ఉంది.

ఇక బౌద్ధ వాఙ్మయంలో శంవర అంటే బ్రహ్మానంద స్వరూపుడైన బుద్ధుడు. చక్రశంవరుడు కాలచక్రప్రభువు. ఆయన స్థానమే ఈ పర్వతం. ఈ శైలం మీద బుద్ధుడు 500 మంది బోధిసత్త్వులు నివసిస్తుంటారు. దీనిని కంగ్రిన్ పోష్ అని బౌద్ధులుపిలుస్తారు. అంటే మంచు వజ్రం అని అర్థం. బుద్ధుని ముఖ్య సేవకుడు ధర్మపాలుడు వ్యాఘ్రచర్మధారియై దమరుక త్రిశూలములతో కపాలమాలను దాల్చి తన భార్యయైన వజ్రవారాహితో కలసి యీ క్షేత్రాన్ని పరిపాలిస్తుంటాడు.

ఇక్కడి వృక్షాలలో కూడా మహిమాన్వితమైన వృక్షాలున్నవని ప్రజల విశ్వాసం. సర్వరోగములను పోగొట్టే మూలికలే కాక కొన్ని చెట్ల ఫలాలు

తింటే భూత భవిష్యత్ వర్తమానాలు తెలుస్తవని, మరి యొక దివ్యవృక్షఫలం అమరత్వాన్ని ఇస్తుందని చెపుతున్నారు.

బౌద్ధమతం టిబెట్‌లో అడుగుపెట్టక ముందు అక్కడ బోన్పాలనే మంత్ర మార్గీయులు నివసించేవారు. వారి గ్రంథాలలో కైలాసపర్వతాన్ని సంగ్రామశక్తి స్వరూపమైన కాన్‌గ్రీలబ్‌త్సాన్ అనే దేవత - పరిపాలిస్తుంటుందని వ్రాశారు. ఆ దేవత శూలాన్ని ధరించి జడల బర్రె నెక్కి సంచారం చేస్తుంటుంది. కైలాస నాథుడైన రుద్రుని రూపాన్నే బోన్పాలీవిధంగా భావించారని పరిశోధకుల అభిప్రాయం. కొందరు బోన్పాలు జడల బర్రెముఖం కలిగిన దేవతగా శైలాధి దేవతను వర్ణించారు. హిందూ తంత్ర గ్రంథాలలో కూడా ప్రత్యంగిరను సింహవాహనిగా, సింహముఖిగా వర్ణించడం కనిపిస్తుంది. యాక్ (జడలబర్రె) ను కూడా వారట్లే భావించి ఉండవచ్చు.

మరికొందరు గైకోడ్ అని పిలువబడే జడలబర్రె పురాణాలలో శివవాహనమైన నందికి ప్రతీకగా భావిస్తారు. కైలాసపర్వతాన్ని వీరు కాంగ్రిన్ బోక్‌ఫెన్గ - అనే తొమ్మిదంతస్థుల స్వస్తికభవనంగా వర్ణించారు.

మహాభారతంలో వ్యాసాది మహర్షులు ఈ ప్రాంతానికి తరచుగా వచ్చే వారని కనిపిస్తున్నది. కాశీ చేరకముందు అగస్త్యుడు వ్యాసుడు ఈ పర్వతం దగ్గరే నివసించేవారు. ఈ పర్వత పాదాల దగ్గర హనుమంతుని తపస్థానం ఉన్నదని టిబెట్ గ్రంథాలలో ఉంది. ధర్మరాజు రాజసూయ యాగం చేస్తున్నప్పుడు ఉత్తర దిగ్విజయానికి బయలుదేరిన అర్జునుడు ఇక్కడకు కూడా వచ్చాడట! ఆ తర్వాత పాండవులంతా ఒకసారి వచ్చి పరమశివుని దర్శించాలని ప్రయత్నించారు. అక్కడి ఒక లోయ మార్గంలో గోవృషభముల గుంపు నడుస్తున్నది. వాటిలో వృషభరూపంలో మహేశ్వరుడుంటాడని ఒక ఋషి వారికి చెప్పాడు. ఆలోచించి భీముడు తన శరీరాన్ని పెంచి ఆలోయపై అటు ఇటూ కొండ శిఖరాల మీద తన రెండు పాదాల నుంచాడట ! ఆవులు, ఎద్దులు ఆ కాళ్ళ క్రిందుగా వెళుతున్నవి. దేవుడు అలా వెళ్ళటానికి ఇష్టపడదు గనుక గుర్తుపట్టవచ్చునని వారి ఆశ. అలానే అన్నీ కదిలిపోయినవి. చివరకు ఒక వృషభం ఆగిపోయి భీముని చూచి దేహాన్ని భీముని కంటె ఎత్తుకు

పెంచిందట. అప్పుడు పాండవులు గుర్తించి ఆ వృషభరాజరూపుడైన మహేశ్వరునకు పాదాక్రాంతులై నమస్సులు సమర్పించారు. స్వామి వారిని ఆశీర్వదించాడు. ఇప్పటికీ ఆ కొండమీద వృషభదేవుని శిరస్సు, కర్ణముల గుర్తులు కనిపిస్తున్నవి. శివపురాణంలో కైలాసనాథుని వర్ణనగమనించండి.

**శ్లో॥ కైలాస శిఖరస్థంచ పార్వతీపతిముత్తమం**
**యథోక్త రూపిణం, శంభుం నిర్గుణం గుణరూపిణం**
**వేదైశ్శాస్త్రైర్యథాగీతం విష్ణుబ్రహ్మానుతంసదా**
**భక్తవత్సలమానందం శివమావాహయామ్యహం.**

కైలాస పర్వతంలో శివుడుంటాడనేది సర్వ సామాన్య వచనం. తీవ్రభక్తులు కొండమీది ప్రతిశిల శివుడే అని భావిస్తుంటారు. మహనీయుడైన పండితారాధ్యుడు శ్రీశైలం వెళ్ళి అక్కడి ప్రతిశిల శివలింగంవలె కనిపిస్తుంటే దాని మీద కాలుమోపటం పాపం గనుక కొండ యెక్కి లేదు.అయినా మల్లికార్జునస్వామి ఆశీర్వాదం లభించింది భక్తివల్ల. అలానే తిరుపతి కొండమీది ప్రతిశిలాఖండము అన్నమాచార్యులకు సాలగ్రామముగా దర్శనమిచ్చింది. భక్తివివశుల తీరు ఆ విధంగా ఉంటుంది.

13వ శతాబ్దంలో గేవా గోజంగ్బా అనే బౌద్ధ సాధువు కైలాసపర్వతానికి వెళ్తూ టీ చేసుకు వెళ్దామని ఆగాడు. టీ పాత్ర ఉంచటానికి ఏ రాయిని చూచినా ప్రతి దాని మీద బౌద్ధుల ప్రధానమంత్రమైన "మణిపద్మేహుం" కనిపిస్తున్నదట! టీ లేకుండానే అతడు ప్రయాణం చేశాడు. కైలాస పర్వతం చుట్టూ ఉన్న కొండలకు బౌద్ధులు – వజ్రపాణి, అవలోకితేశ్వర, మంజుఘోష, పద్మసంభవ ఇత్యాది పేర్లు పెట్టుకొన్నారు.

కైలాస పర్వతానికి ప్రదక్షిణం చేయటం యాత్రికులకు అత్యంత ప్రధానం. ప్రదక్షిణం అనే మాటకు ఉత్తర భారతంలో పరిక్రమ అంటారు. ఆ మంచులో, చలిలో స్వయంగా పరిక్రమ చేయలేనివారు ఇతరులచేత తమ కోసం చేయించుకొని ఫలితాన్ని ధారపోయించుకొంటారు. దానికి గాను కొంత దక్షిణ సమర్పిస్తారు. మరణించిన ఆత్మీయుల, బంధువులకు

ఉత్తమగతులు కలగటానికి ఇతరుల చేత పరిక్రమ చేయించటం కూడా ఇక్కడి ఒక ఆచారం. ఈ శివుని కొండకు ఒకసారి పరిక్రమ చేస్తే సమస్త పాపాలు పోతవని, పదిపరిక్రమలు చేస్తే రాబోయే జన్మలలో పాపాలు కూడా నశిస్తవని, 108 పరిక్రమలు చేస్తే జన్మరాహిత్యం, నిర్వాణం లభిస్తవని టిబెటన్ల నమ్మకం.

దండపరిక్రమ చేసే మరో ఆచారం కూడా ఉంది. పరిక్రమకు బయలుదేరి కైలాస శిఖరానికి సాష్టాంగ దండ ప్రణామం చేస్తారు. నమస్కారం చేసినప్పుడు చివరి చేతులు పెట్టిన చోట నుండి రెండో ప్రణామం. అలా పరిక్రమ అంతా చేయటానికి ఒక నెలపడుతుందట ! తిరుపతిలో ప్రధానాలయం చుట్టూ కొందరు పొర్లు దణ్ణాల పెడుతూ అంగ ప్రదక్షిణం చేస్తారు. ఇవన్నీ తపస్సులో భాగాలు ఈ పరిక్రమల వల్ల సర్వపాపక్షయమవుతుందని విశ్వాసము - పురాణవాక్కు. (కైలాస పరిక్రమదూరం 52 కి.మీ.)

పరిక్రమ ప్రదేశంలో శివస్థల్ ఉంది. ఇక్కడ సాష్టాంగ నమస్కారం చేసి యమధర్మరాజును ప్రార్థిస్తారు. సూదితో వేలు గుచ్చుకొని ఒకటి రెండు చుక్కలు నెత్తురు బొట్లు సమర్పిస్తారు. ధరించిన పాతగుడ్డలు కొన్ని వదిలేస్తారు. దీని వల్ల పాపాలన్నీ పోతాయని పుణ్యలోకాలు వస్తాయని నమ్మకం. కొందరు జుట్టులో కొన్ని వెంట్రుకలు కత్తిరించి సమర్పిస్తే మరికొందరు పూర్తి తలనీలాలు సమర్పిస్తారు.

కైలాస పర్వతానికి పరిక్రమ చేస్తారేగాని ఎవరూ ఎక్కటానికి సాహసించరు సాధ్యం కాదు కూడా. అది సాక్షాత్తు పరమశివ రూపం గనుక ఆరోహించటం పాపమని కొందరి అభిప్రాయం. ఒక్క బౌద్ధయోగి మిలారేపామాత్రం మంత్రశక్తితో గిరిపైకి వెళ్ళాడని ఆయనకథలో ఉంది. పురాణాలలో పుష్పదంతుడనే గంధర్వుడు కైలాస పర్వతాగ్రాన బ్రహ్మ నిర్మితమైన మహాద్వారం నుంచి లోపలికి వెళ్ళి పరమశివుని దర్శించాడట !

**శ్లో॥ యస్యాః ద్వారం మహాభాగే ఏకం కైలాస మూర్ధని**
**సంప్రాప్య కౌతుకావిష్టః పుష్పదంతోమహామతిః**

కైలాసనాథుని దర్శనం చేత పులకించిన ఆ గంధర్వుడు శివమహిమ్న స్తోత్రాన్ని రచించాడని విబుధుల ఉద్ఘాటన.

పరిక్రమ మార్గాన్ని కనుక్కోటానికి చాలా కాలం క్రింద గోత్ ఛుంగ్‌పా అనే లామా ప్రయత్నం మొదలు పెట్టాడు. కొంతదూరం వెళ్ళిన తర్వాత రెండు లోయమార్గాలు వచ్చినవి. ఎటు వెళ్ళాలో తోచలేదు. ఇంతలో ఒక జడల బర్రె వచ్చింది. దాని ముఖం సింహం ముఖంలాగా ఉంది. తనను అనుసరించమని తలతిప్పుతూ అది సూచించింది. లామా దాని వెంట వెళ్ళాడు. అది ఒక గుహదగ్గరకు వెళ్ళి అందులోకి పోయింది. లామాలోపలికి వెళ్ళి చూస్తే దాని కాళ్ళ, కొమ్ముల గుర్తులు కనిపించినవి. ఆ గుహకు ఆయన దీరాఫుక్ అని పేరు పెట్టాడు. దీ అంటే జడలబర్రె, రా అంటే కొమ్ములు. ఫుక్ అంటే గుహ అని టిబెట్ భాషలో అర్థం. ఆ గుహలో అతడు 3సంవత్సరాల, 3 నెలలు, 3 రోజులు ధ్యానం చేస్తూ గడిపాడు. ఆ తరువాత పరిక్రమ మొదలుపెడితే ఒక నక్క కనిపించింది. దాని వెంట నడుస్తుంటే నక్కల సంఖ్య 21కి పెరిగింది. అవన్నీ ఒక పెద్ద రాయి అడుగుకు వెళ్ళి మాయమైపోయినవి. ఆ గండశిలలో తారాదేవి సాక్షాత్కరించింది. ఆనాటి నుండి ఆ శిల పూజలందుకొంటున్నది.

నేను కైలాస మానస సరోవరయాత్ర చేసినప్పుడు మరుత్కుమారుడు, కౌశికుడు – అనే ఇద్దరు యోగులు కనిపించారు. వారు "నీవు, మేమిద్దరము – మనం ముగ్గురము ఇక్కడి వజ్రయోగినీ శ్మశానం (దానికే డాకినీ శ్మశానమని కూడా పేరు) లో క్రిందటి జన్మలో తారాదేవిని గురించి తీవ్రసాధన చేశాము. ఆ దేవత సాక్షాత్కరించి అనుగ్రహించింది. కారణాంతరాల వల్ల నీవు శరీరాన్ని విడిచి మరోజన్మ తీసుకోవలసి వచ్చింది. నిన్ను చూడాలనిపించి మేమే సంకల్పించాము. అందువల్ల నీకు రావాలనిపించి వచ్చావు. మనమైత్రీ చిహ్నంగా జగజ్జనని తారాదేవిని ఆవాహన చేస్తున్నాము" అన్నారు. దీర్ఘోన్నత దేహంతో మణిమకుటంతో సువర్ణాభరణాలతో దేదీప్యమానంగా ప్రకాశిస్తూ దేవి సాక్షాత్కరించి ఆశీర్వదించింది. అంతకుముందు కొన్ని సంవత్సరాల క్రింద అయిదు రాత్రులు ధ్యానం చేస్తే కనిపించి అనుగ్రహించిన సన్నివేశం

గుర్తుకు వచ్చింది. దీర్ఘకాల జీవులైన ఆ సిద్ధాశ్రమ యోగుల ఆత్మీయత ఎంతో సంతోషాన్ని కలిగించింది.

**ఓంకారోదితశక్తి ప్రేరిత సిద్ధి వికాసాం**
**త్రీం కారాంతర కీలాదీపిత యోగవిలాసాం**
**మైత్రీ మంజుల హృదయధ్యానోత్తేజిత సారాం**
**గాయామ్యుజ్వలవీరాం తారాం మహిమాకారాం**

అని తారాదేవిని స్తుతించాను. ఇద్దరు మిత్రులు సౌహార్ధభావుకులై తారాదేవితో సహా అదృశ్యులైనారు,

ఇక మరొక ముఖ్యమైన సంఘటన. కైలాసపర్వత పరిక్రమకు మాతో వచ్చిన వారు చాలామంది వెళ్ళారు. నా వంటి వృద్ధులు, నడవలేనివారు ఆగిపోయినారు. ఒక రోజు గడచిన తర్వాత ఫోనులో బాధాకరమైన వార్త వచ్చింది. ప్రయాణీకులలో ఒక మహిళ త్రోవలో గుండెపోటు వచ్చి పడిపోయినది. మరణిస్తుందని అందరూ భయపడుతున్నారు. చేయగలిగిన ప్రాధమిక చికిత్స చేశారు. ఇక్కడ మా వసతి దగ్గర ఆ వార్త అందుకొన్నవారు పరిగెత్తుకుంటూ వచ్చి ఆమె ప్రాణరక్షణ చేయమని ప్రార్థించారు. క్లిష్టసమయం. వెంటనే నా ఆదేశాన్ని అందుకొని ఒక షామియానా వేసి ఇటికెలతో తాత్కాలిక హోమకుండం నిర్మించి వస్తుసామగ్రి సమకూర్చి భైరవ హోమం ప్రారంభించాను. భైరవమంత్ర పురశ్చరణ చేసినవాళ్ళంతా ఆహుతులు వేస్తున్నారు. అందరి హృదయాలలో ఉద్విగ్నత! ఏమి కానున్నది ? రాత్రి సమయం. మంచుకురుస్తున్నది. గడ్డకట్టుకుపోయే శీతల వాతావరణం. అయినా ఒక వైపు ఆహుతులు వేస్తూ ఆపదలో ఆదుకొనే ఆ స్వామిని ప్రార్థించాను.

**శ్లో॥ నమో భూతనాథం నమః ప్రేతనాథం**
**నమః కాలకాలం నమో రుండమాలం**
**నమః కాళికా ప్రేమలోలం కరాళం**
**నమో భైరవం కాశికా క్షేత్రపాలం**

ఇంతలో అగ్నికుండంలో జ్వలిస్తున్న కాష్ఠద్యుతులమధ్య భీషణ సుందరమైన ఆకృతితో శ్వానరాజుతో భైరవుడు నిల్చున్నాడు.

**సీ॥ చంద్రఖండములతో సరివచ్చు ననవచ్చు**
**విమలదంష్ట్రా ప్రరోహములవాని**
**పవడంపుకొనలతో ప్రతివచ్చు ననవచ్చు**
**కుటిలకోమల జటాచ్ఛటలవాని**
**ఇంద్రనీలములతో ఎనవచ్చు ననవచ్చు**
**కమనీయతర దేహ కాంతి**
**ఉడురాజు రుచులతో ఒరవచ్చు ననవచ్చు**
**చంచన్మదాట్టహాసములవాని**

దర్శించి ప్రణామాలు సమర్పించాను

**సీ॥ మందార మైరేయ మధుపానమత్తాయ**
**భవ ! నమస్తే కాలభైరవాయ**
**కాళికాసురత శృంగారసంప్రీతాయ**
**వర ! నమస్తే కాలభైరవాయ**
**డమరుఖట్వాంగ ఖడ్గ కపాల హస్తాయ**
**భర్గా! నమః కాలభైరవాయ**
**అట్టహాసపలాయితాంతకాయ హరాయ**
**వందనం తే కాలభైరవాయ**
**గీ॥ భీషణశ్వానపరివార వేష్టితాయ**
**భూత బేతాళ గీతా సముత్థితాయ**
**వారణాసీ మహాక్షేత్ర పాలకాయ**
**భక్త సులభాయ తే నమో భైరవాయ**

భైరవుడు అనుగ్రహించాడు. ఆయనతో వచ్చిన శ్వానరాజు బయలుదేరాడు. హోమం పూర్తి అయింది. అక్కడ పరిక్రమ చేస్తూ పడిపోయిన మహిళ దగ్గరకు ఆ మంచుకొండలలో ఎక్కడి నుండి వచ్చిందో ఒక పెద్ద నల్లని కుక్క వచ్చి వాసన చూచింది. ఆ వనిత కండ్లు తెరిచి నెమ్మదిగా

లేచింది. పోతున్న ప్రాణం వెనక్కు వచ్చింది. అందరితో పాటు నడక మొదలైంది. పరిక్రమ పూర్తయై కొండ దిగి అందరూ తిరుగు ప్రయాణం చేస్తున్నంతవరకు ఆ శునక రాజు అలానే నిల్చుని మళ్ళీ వెనక్కు మంచుకొండలలోకి వెళ్ళిపోయినాడు. భైరవుని కరుణ అద్భుతం !

**సీ॥ కాశీ శ్మశానాన కాలభైరవునితో**
**చరియించు నెవడు కింకరత మెరయ**
**భయదరూపముతోడ పదునుకోరలతోడ**
**శ్రితవైరి నెవ్వాడు చీల్చి వేయు**
**కైలాసగిరి మీద కాపాడె నెవ్వాడు**
**మహిళ నొక్కతె కృపామహిమ వెలయ**
**మృత్యుదేవత పలాయిత జేసె నెవ్వాడు**
**సిద్ధేశు ప్రార్థన స్వీకరించి**
**గీ॥ ఎవ్వ దలవోక గర్జించె హిమగిరీంద్ర**
**దివ్యభూముల గుహలు ప్రతిధ్వనింప**
**ప్రజ్వలన్నేత్ర వక్త్ర భౌభౌరవుండు**
**ఆ మహాశ్వానరాజు నన్నోముగాక !**

కాశీ రక్షకుడైన కాలభైరవుని వాహనం శునకమైతే హిమగిరిలో వజ్రభైరవుని వాహనం పులి. వజ్రభైరవుని ఆలయాలు మంచుకొండలలో అక్కడక్కడ ప్రకాశిస్తున్నవి.

**శ్లో॥ పద్మసంభవారాధితం ప్రభుం**
**మర్మయోగినాం మంత్రసిద్ధిదం**
**వ్యాఘ్రవాహనం మృత్యువారణం**
**వజ్రభైరవం దేవమాశ్రయే.**

వజ్రయాన తాంత్రిక సాధనలలో వజ్రభైరవునకు, వజ్రయోగిని లేక వజ్రవారాహికి ప్రాధాన్యం ఎక్కువ.

వజ్రభైరవుని వలెనే మరో యిద్దరు భైరవ మూర్తులకు హిమాలయాలలో

ప్రాముఖ్యం. ఖట్మాండులో పశుపతి నాధునకు హరభైరవుడని పేరు. మానస సరోవర - అధిదేవునకు అమరభైరవుడని పేరు.

సిద్ధాశ్రమ ప్రాంతంలో మానస సరస్సు అత్యంత ప్రధానమైనది. స్కాంద పురాణంలో దీని మహిమ ఎంతో అద్భుతంగా వర్ణించబడింది. యాభై ఖండాలున్న స్కాందంలో మానస ఖండం ఈ సరస్సు విశిష్టతను విశదంగా వర్ణించింది. బ్రహ్మ మానస పుత్రులు సనక సనందనాదులు శివానుగ్రహం కోసం కైలాస పర్వతపాదంలో ద్వాదశ వర్ష తపస్సు చేశారు. ఆ సమయంలో అక్కడ క్షామము నీటి కరువు ఏర్పడ్డవి. సాక్షాత్కరించిన పార్వతీపరమేశ్వరుల అర్చనకు జలం లభ్యం కాకపోవటంతో తండ్రియైన బ్రహ్మదేవుని ప్రార్థిస్తే వాళ్ళ కోసం తన మనస్సంకల్పంతో ఈ సరస్సు సృష్టించాడు కమలగర్భుడు. బ్రహ్మ సృష్టించాడు గనుక బ్రహ్మ సరస్సనీ, ఆయన మానసంలో నుంచి పుట్టింది గనుక మానస సరస్సనీ పేరు వచ్చింది. దానిలో నుండి స్వర్ణ శివలింగం స్వయంభువుగా ఉదయించింది. ఆ దేవునికే అమరభైరవుడని పేరు. ఆ తీరంలోనే ఇటీవల త్రవ్వకాలలో సువర్ణ శునక విగ్రహం దొరికింది. భైరవుడు శ్వానవాహనుడు గదా ! సరస్సు ఒడ్డున ఉన్న అల్లోనేరేడు చెట్టు (జంబూవృక్ష) పండ్లు నీటిలోపడి -జం అని శబ్దం చేయటం వల్ల అదే జంబు అనబడిందని ఆ చెట్టుకు ఈ పేరు కూడా జం శబ్దాన్ని బట్టే వచ్చిందని, ఈ చెట్లు ఎక్కువగా ఉండి నెమ్మదిగా జంబూ ద్వీపమన్న పేరు వచ్చిందని పండితులు కొందరన్నారు.

సతీదేవి శరీరభాగాలు పడిన చోట్లు శక్తి పీఠాలైనవని అందరికీ తెలిసిన సంగతే. ఆమె దక్షిణ పాదం మానస సరస్సులో పడిందని అందువల్ల ఇది శక్తిపీఠమైనదని తంత్ర గ్రంతాలలో ఉంది. (కుడిచేయి అని ఒక చోట ఉంది) పీఠ దేవత దాక్షాయణి.

బౌద్ధులు ఈ సరస్సును అనవతప్త (వేడిలేనిది) అనే నామధేయంతో వర్ణించారు. గౌతమబుద్ధుని తల్లి మాయాదేవిని స్వప్నంలో దేవతలు తీసుకెళ్ళి ఈ సరస్సులో స్నానం చేయించి పరిశుద్ధి చేసిన తర్వాతనే ఆమె బుద్ధునకు జన్మనిచ్చిందని బౌద్ధ గ్రంథాలలో ఉంది.

జైనులు దీనిని పద్మహ్రదం అన్నారు. కైలాసగిరికి వలెనే ఈ సరస్సుకు కూడా పరిక్రమ చేస్తారు. దూరం సుమారు 105 కి.మీ. సరస్సు చుట్టూ ఉన్న బౌద్ధమఠాలను చూస్తూ యాత్రికులు ప్రదక్షిణం చేస్తుంటారు. ఇది కూడా అనంత పుణ్యప్రదాయకమని భక్తుల విశ్వాసం. కైలాస పర్వతానికి తూర్పున ఉన్న మానస సరస్సు నుండి పడమట ఉన్న మరో సరస్సులోకి నీరు ప్రవహిస్తున్నది. దానికి రావణ హ్రదమని పేరు. ఆ ప్రాంతాన్ని రక్షస్తల్ అంటారు. రావణాసురుడిక్కడే శివుని గూర్చి తపస్సు చేశాడు.

మానస సరస్సులో పద్మాలెక్కువగా ఉండటం వల్ల దానికి పద్మహ్రదమని పేరుండేది. ఇప్పుడు పద్మాలు లేవు. గ్రంథాలు వర్ణించిన రాజహంసలూ లేవు. భారతదేశంలో పూర్వకాలం ఉండేవని పురాణాలలో కావ్యాలలో వర్ణించారు. ఇప్పుడు రష్యాలో బాగా ఉన్నవని, వాటి యీకలతో చేసిన హంసతూలికాతల్పాలు ఆ దేశం పట్టణాల బజార్లలో అమ్ముతున్నారని వెళ్ళి వచ్చిన వారు చెపుతున్నారు.

మానస సరోవరంలో ఓంకారాకారంలో ఉన్న రాళ్లు దొరుకుతవి. వాటిని సేకరించి పూజిస్తారు. ఆప్తులకు కానుకగా ఇస్తారు. సరస్సు ఒడ్డున చాలామంది జాగరణ చేస్తారు. తెల్లవారుజాములోపు నక్షత్రాలు కొన్ని సరస్సులో పడటం ఎందరో చూచారు. దేవతలు స్నానం చేయటానికి వచ్చారంటానికి దీనిని గుర్తుగా భావిస్తారు. అమరులు జలకాలాడే ధ్వనులు, కాలిఅందెల గజ్జెల ఘలంఘలలు విన్నవారూ ఉన్నారు. దేవతలు ఈ సరస్సులో రోజు స్నానం చేయటానికి వచ్చే మార్గాన్ని కాంతిసేతువుగా – వెలుగువంతెనగా పురాణాలు వర్ణించినవి.

**శ్లో॥ దివ్యచ్ఛాయా పథస్తత్ర<br>నక్షత్రాణ్యనుమండలం<br>దృశ్యతే భాసురా రాత్రౌ<br>దేవీ త్రి పథగా తుసా.**

ఆదియుగాలలో దేవతలు భూమి మీదకు తరచుగా వచ్చి ఎక్కువ కాలం ఉండి వెళుతుండేవారు. మొదటవారు దేవికా నదీతీరంలో దిగినారని

పురాణాల ఉద్ఘాటన. హిమాలయాలు వారి నిత్యవిహార భూములు. కాళిదాస మహాకవి ఈ పర్వతాన్ని దేవతాత్మ అని వర్ణించాడు.

**శ్లో॥ అస్త్యుత్తరాస్యాం దిశి దేవతాత్మా**
**హిమాలయో నామ నగాధిరాజః**
**పూర్వాపరౌ వారినిధీ విగాహ్య**
**స్థితః పృథివ్యా ఇవ మానదండః**

తూర్పు పడమర సముద్రాల మధ్య భూమిని కొలిచే మానదండం (కొలబద్ద)వలె ఉన్నది హిమాలయం. ఆది దేవతలకు ఆత్మస్థానం. అందులోనిది మానస సరస్సు. భారతంలో ఈ సరస్సుకు బిందు సరస్సని పేరుంది.

**శ్లో॥ తస్య పాదే మహద్దివ్యం**
**సరః కాంచనవాలుకం**
**రమ్యం బిందు సరో నామ**
**యత్రరాజా భగీరథః**

కపిలమహర్షి కోపాగ్ని కాహుతియైన తన పూర్వులనుద్ధరించటానికి గంగావతరణ కోసం, దిగివచ్చే గంగను భరించటానికి శివానుగ్రహం కోసం ఇక్కడే తపస్సు చేశాడు. సిద్ధాశ్రమంలో తపస్సు చేశాడు గనుకనే సిద్ధి వేగంగా లభించింది. కైలాసనాథుని జటాజూటం నుండి గంగ దిగేటప్పుడు చిందిన జలబిందువులతో ఏర్పడినదే బిందు సరస్సు.

**శ్లో॥ తస్యాధోబిందవః కేచిత్**
**క్రుద్ధాయాః పతితాభువి**
**కృతంతు తైర్బిందు సరః**
**తతోబిందు సరస్స్మృతం.**

సిద్ధాశ్రమం ఈ ప్రాంతంలో ఉన్న గుప్త ప్రదేశం. అయితే ఇది ఒక చోట ఒక పరిమితమైన గ్రామం కాదని హిమాలయ శైలంలో అనేక స్థలాలలో దీని వివిధ విభాగాలున్నవని, భిన్న సంప్రదాయాలకు చెందిన యోగులు వర్గాలు అనేక ప్రదేశాలలో నివసిస్తున్నారని ఎక్కువమంది

అభిప్రాయపడుతున్నారు. ఉదాహరణకు కృష్ణ నిర్యాణానంతరం కృష్ణభక్తులు ఉద్ధవుని దగ్గరకు వచ్చి "కలియుగం ప్రారంభమైంది. తపస్సు చేసే వాళ్ళు తగ్గిపోతున్నారు. చేసినా యుగ ప్రభావం వల్ల ఫలిస్తుందన్న నమ్మకం కలగటం లేదు. దీనికి మీరే మార్గం సూచించాలి" అంటే అప్పుడు ఉద్ధవుడు హిమాలయ సిద్ధాశ్రమంలోని ఒక ప్రదేశాన్ని నిర్దేశించి ఇక్కడ తపస్సు చేస్తే శీఘ్రంగా ఫలిస్తుందని తెలియజేశాడట ! అక్కడ ఇటీవల జరిగిన ఒక విచిత్రమైన సన్నివేశం అద్భుతమైనది.

ఫ్రాన్సు రాజధాని పేరిస్ నగరంలో సోఫియా అని ఒక యువతి ఆధ్యాత్మిక భావన కలది. ఆమె కొక యోగి మంత్రోపదేశం చేశాడు. (లలితా కృష్ణమంత్రద్వయ సంఘటితమైన గోపాలసుందరీ మంత్రం) జపం, ధ్యానం చేస్తూండగా కొన్నాళ్ళకు హిమాలయాలలోని సిద్ధాశ్రమానికి రమ్మని మనో భూమికలో ఆదేశం అందింది. ఆమె కష్టపడి భారతదేశం వచ్చి హరిద్వార్, హృషీకేశ్ ప్రాంతం నుండి గంగోత్రి వైపు వెళ్ళింది. అంతవరకు తోడు వచ్చిన వారికి ఆపైన అనుమతి ఇవ్వబడలేదు. మిగతావారిని వెనక్కు పంపి సోఫియా ఒక్కతే ఆ మంచుకొండలలో ముందుకు వెళ్ళింది. కొంతదూరం నడిచిన తర్వాత మంచు కురిసి త్రోవ కనబడలేదు. వచ్చిన మార్గం కూడా తెలియటం లేదు. తన నిక్కడకు రమ్మని ఆదేశమిచ్చిన మహాత్ములు దోవ చూపించాలని ప్రార్థించింది. ఇంతలో చిరుగంటల గలగలు వినబడినవి. కండ్లు తెరిచి చూస్తే ఆవులు, దూడలతో ఒక బాలగోపాలుడు వస్తున్నాడు. తలపాగా దానిపై ఒక నెమలి ఈక, చేతిలో వేణువు, సాక్షాత్తు కృష్ణుడే అనుకొని మార్గదర్శనం చేయమని అభ్యర్థించింది. అత దంగీకరించి ఆమె చేయిపట్టుకొని నడిపించాడు. కండ్లు మూతలు పడి గాలిలో తేలిపోతున్నట్లని పించింది. కొంతదూరం వెళ్ళిన తర్వాత ఎదురుగా ఒక దేవాలయ గోపురం చూపించి ముందుకు వెళ్ళమని చెప్పి ఆ బాలుడు వెళ్ళిపోయినాడు.

సోఫియా ముందరికి వెళ్ళి చూస్తే ఆలయప్రాంగణంలో 6 అడుగుల ఎత్తున్న పెద్ద స్ఫటిక మేరువు కనిపించింది. (కొంతకాలం క్రింద కోయంబత్తూరులో ఎలా చేరిందోగాని ఒక మహమ్మదీయుని యింటికి 5

అడుగులపైన ఎత్తున్న పెద్ద స్ఫటికశిల చేరింది. అయితే వింత – ప్రతిరోజు ఒక హిందువు అక్కడకు వచ్చి కాసేపు కన్నీళ్ళు పెట్టుకొని భగవంతుని ప్రార్థించి వెళ్ళేవాడు. ఎందుకు ఇలా దుఃఖిస్తున్నావంటే అతడు తన కుమారుని జీవాత్మను శత్రుత్వంతో ఒక మాంత్రికుడీ స్ఫటికశిలలో బంధించాడనీ విముక్తి చేయటం చేతగాక శోకిస్తున్నానని అన్నాడు. ప్రతి రోజూ ఈ ఘోష భరించలేక ఆ మహమ్మదీయుడు దానిని ఒక సంపన్నుడికి అమ్మివేశాడు. మదరాసు చేర్చి దానిని అమ్ముకొందామని ఆ ధనికుడు ఒక వాహనంలో పంపాడు. ఆవాహనం ఇరుసు విరిగిపోయింది. ఇంకో బండిలో చేర్చారు. అదీ దోవలో చెడిపోయింది. ఇలా అయిదు వాహనాలు మారి అయిదురోజులకు గాని చెన్నై చేరలేదు. విలువైన పురాతన వస్తువని తెలిసి పోలీసు దానిని స్వాధీనం చేసుకొన్నారు. అధికార శక్తి గల ఒక పోలీసు ఉన్నతోద్యోగి దానిని కైంకర్యం చేశాడు. అయితే కొద్దికాలానికి అతడు సర్వనాశనమై పోయాడట! కొన్ని రత్నములున్నచోట ప్రమాదాలు, యుద్ధాలు జరిగినవని చరిత్ర చెపుతున్నది.)

దాని ముందు కూర్చొని ధ్యానం చేయాలనిపించింది. దివ్యమైన విద్యుత్తరంగాలు దానిలో నుండి ప్రసరిస్తున్నవి. కండ్లు మూతలు పడినవి. చాలా సేపు గడిచినట్లనిపించింది. ఇంతలో ఎవరో పిలిచారు. కళ్ళు తెరిస్తే ప్రసన్నమూర్తులు కొందరు కనిపించి తమతో రమ్మని ఆదేశించారు. వారితో వెళితే ఒక ధ్యానమందిరంలో సమావేశం జరుగుతున్నది. ముప్పై యేండ్ల యువకుడు ఆధ్యాత్మిక సాధనల గురించి ఎన్నో అమూల్యమైన విషయాలు చెపుతున్నాడు. సమావేశం పూర్తి అయిన తర్వాత బయటకు వచ్చినపుడు తను తీసుకు వచ్చిన వారితో ఆ ప్రసంగం చేసిన వ్యక్తిని గూర్చి అడిగింది. "ఆయన అసలు పేరు మాకు తెలియదు. ఇప్పుడు మాత్రం వారిని జనకమహారాజని పిలుస్తాము. దక్షిణ భారతదేశంలో తమిళనాడులో కుర్తాళం అని ఒక గ్రామం ఉంది. అక్కడ అగస్త్యమహర్షి ధరణీపీఠం స్థాపించాడు. పొదిగై కొండల నుండి ఓషధీరససమ్మిళిత జలపాతం పడే చోటది. ఆ ఊరికి దగ్గరి గ్రామంలో ఒక జమీందారుకు కుమారుడు పుట్టాడు. ఇంటి పురోహితుడు జ్యోతిష్కుడు. జాతక చక్రం వేసి ఈ బాలుడు గొప్పయోగియో సన్యాసియో అవుతాడని చెప్పాడు. ఆ గృహస్థు మాకు చాలా ఆస్తి ఉన్నది. దానిని

నిర్వహించేవాడు కావాలి గాని మాకు యోగులు సన్యాసులు ఎందుకు అన్నాడు. అయ్యా ! జాతకచక్రాన్ని బట్టి నాకు తోచింది చెప్పాను. ఆపైన ఈశ్వరేచ్ఛ అన్నాడు పురోహితుడు.

పిల్లవాడు పెరిగి పెద్దవాడై స్కూలు చదువులు చదువుతూ అప్పుడప్పుడు కుర్తాళం జలపాతాలకు వెళ్ళి స్నానం చేసి వచ్చేవాడు. ఒకసారి పురోహితుని సూచన ప్రకారం మౌనస్వామి తపస్సు చేసిన గుహలో ధ్యానం చేస్తుంటే అగస్త్యమహర్షి దర్శనమైంది. ఇలా అప్పుడప్పుడు దివ్యానుభవాలు కలుగుతున్నవి. స్కూలు దాటి కాలేజి చదువు లోకి వచ్చిన తర్వాత పాండిచ్చేరి వెళ్ళి అరవిందాశ్రమానికి వెళ్ళి శ్రీమాతను దర్శించాడు. ఆమె వాత్సల్యంతో ఇతని చేత సాధన చేయించింది. "జరామరణములు లేని మానవ సమాజం కోసం అరవిందులు, నేను తపస్సు చేశాము. కాని వయస్సు దాటిన తర్వాత ప్రారంభించటం వల్ల కోరినది సంపూర్తిగా సాధించలేకపోయినాము. నీవు హిమాలయాలకు వెళ్ళు. అక్కడి సిద్ధాశ్రమంలో నీకు ప్రవేశం దొరుకుతుంది. ఆ దివ్యభూమిలో సాధన చేసి సిద్ధస్థితిని పొందు" అని ఆమె మార్గదర్శనం చేసింది. అతడు ఇక్కడకు వచ్చి సాధించగలిగాడు. ఆయనకు ముసలితనం రాలేదు. మృత్యువురాలేదు. రాజవంశీయుడైన యోగి గనుక జనక మహారాజని పిలుస్తున్నాము. ఇంక ఇక్కడి పై భూమికలలో వేల సంవత్సరాల వయస్సున్న యోగులున్నారు. ఇక్కడి మహాత్ములకు నీయందు దయకలిగింది. పూర్వజన్మలో వీరితో అనుబంధం ఉన్నదానవు కావటం వల్ల నీకిచటికి రావటానికి అనుమతి లభించింది. కొద్ది రోజులిక్కడ ఉన్న తర్వాత నీవు మళ్ళీ వెనక్కు వెళ్ళాలి. నీ తపస్సుకు ప్రేరణ కలగటానికి ఈ అనుభవం ఉపకరిస్తుంది మళ్ళీ కొంతకాలానికి పిలుపు వస్తుంది."

వారి ఆజ్ఞ ననుసరించి కొద్ది రోజుల తర్వాత ఆమె మళ్ళీ ఫ్రాన్సు చేరుకొంది. తన అనుభవాలను ఒక రచయిత చేత గ్రంథంగా వ్రాయించింది. ఆ రచయిత దానిని ఆంగ్లభాషలో రచించాడు. అందులోని కుర్తాళం ఎక్కడ ఉందో అతనికి తెలియదు. నేను ఆమెరికా ఖండంలో బోస్టన్‌లో ఉండగా ఇంటర్నెట్‌లో కుర్తాళస్వామి ప్రవచనాలిస్తున్నారని చూచి వచ్చి దర్శనం చేసుకొని తన గ్రంథాన్ని సమర్పించాడు.

ఇలా అప్పుడప్పుడు సిద్ధాశ్రమానికి అనుమతించబడిన వారున్నారు. వారిలో దివ్యజ్ఞాన సమాజస్థాపకురాలు మేడమ్ బ్లావెట్స్కీ ఒకరు. కుతుమిబాబా అనే సిద్ధాశ్రమ యోగి ఆమె గురువు. పురాతన యోగి మరువు మోరియగా ఆమెకు కనిపించి అనుగ్రహించాడు. అక్కడ విశేషాలను ఆమె చక్కగా వర్ణించింది. అలానే ఇటీవలి కాలంలోని మంత్రవేత్త నారాయణదత్తశ్రీమాలి - నిఖిలేశ్వరానంద అన్న సన్యాసి వేల సంవత్సరాలు వయస్సుగల సచ్చిదానందస్వామి మొదలైన మహనీయుల సేవలో సాధనలు చేసి అద్భుత సిద్ధశక్తులు సాధించాడు. అలానే స్వామి విశుద్ధానంద సిద్ధాశ్రమ విభాగమైన జ్ఞానగంజ్‌లో మహాతప అనే సిద్ధయోగికి శుశ్రూషచేసి ఎన్నో మహిమలను పొందగలిగాడు. ప్రసిద్ధ పాశ్చాత్య జర్నలిస్టు పాల్‌బ్రంటన్ - మరణించిన జీవులను బ్రతికించిన సిద్ధునిగా ఈయనను రహస్య భారతంలో అన్వేషణ "అన్న తన గ్రంథంలో అభివర్ణించాడు. హిమాలయ యోగియైన స్వామి అచ్యుతానంద శిష్యుడైన మౌనస్వామి పై యిద్దరు యోగులకు మిత్రుడై తపస్సాధనలు చేసినట్లు తెలుస్తున్నది. శ్రీమాలి అక్కడ మహనీయుల గురించి వివరాలిచ్చారు. సిద్ధాశ్రమం స్వామి సచ్చిదానంద నేతృత్వంలో విరాజిల్లుతున్నదని, వేల సంవత్సరాల వయస్సుతో దివ్యతేజోమయ శరీరంతో ప్రకాశించే ఆ మహనీయుని ఆశీస్సుల కోసం దర్శనం కోసం దేవతలే ఎదురు చూస్తుంటారని ఆయన ఇప్పటికి ముగ్గురికి మాత్రమే దీక్ష ఇచ్చాదని వ్రాశారు. ఈ రోజు కూడా భౌతిక శరీరాలతో మహర్షి వసిష్ఠ, విశ్వామిత్ర, కణాద, పులస్త్య, అత్రి, భీష్మ, కృపాచార్య, గోరక్షనాథ, శంకరాచార్య ప్రభృతులు అక్కడ విలసిల్లుతున్నారు. సిద్ధాశ్రమం నుండి బయటి ప్రపంచం లోకి రాకపోకలు చేయటానికి అనుమతించబడిన వారిలో కొన్ని పేర్లు

1) యోగిరాజశంకరానంద 2) స్వామి పరమదేవ 3) సాధ్వి తేజోమయి 4) శంకరాచార్య 5) మహాతప భృగురాజ్ 6) గోరఖ్‌నాథ్ 7) లామా హేగాంగ్ 8) దాటియా బాబా 9) మా భైరవి 10) మహావతార్‌బాబా 11) కింకరస్వామి 12) బాబాతేజావతార్ 13) పార్వతీబాయి 14) ధీమాభాయ్‌చిమన్‌భాయ్ 15) రఘువర్ బలోత్కర్ 16) ఉరియా బాబా 17) యోగిరాజ్ అరవింద్

18) స్వామి విశుద్ధానంద 19) త్రిజటా అఘోరీ 20) విరాణ్‌గంగూలీ 21) గిరిధర్ పట్టియార్ 22) స్వామి విశ్వేశ్వరానంద 23) మా ఆనందమాయి 24) స్వామి గుణాతీతానంద 25) స్వామినిఖిలేశ్వరానంద (నారాయణదత్త శ్రీమాలి)

శ్రీమాలి గారు చెప్పిన దానిని బట్టి సిద్ధాశ్రమం మానస సరోవరానికి ఈశాన్య దిశలో వందల కిలోమీటర్ల ప్రాంతంలో విస్తరించి ఉంది. పైనుండి విమానంలో కనిపించేది కాదు. ఫోటోలకు అందేదికాదు. అక్కడ కొన్ని చోట్ల వేదఘోష, కొన్ని చోట్ల నిశ్శబ్ద తపస్సు, కొన్ని చోట్ల సాధనలను గూర్చిన ప్రవచనాలు, బ్రహ్మర్షుల అనుగ్రహభాషణలు జరుగుతుంటవి. ఎవరికి బాధలు, ఆందోళనలు, రోగములు, ముసలితనపు కష్టాలు ఉండవు. అప్సరసలు - మహర్షుల అనుగ్రహ కోసం ఆడుతూ పాడుతుంటారు. నిరంతర సమాధిలో ఎన్నో సంవత్సరాలుండే మౌనుల నక్కడ దర్శించవచ్చు.

సిద్ధాశ్రమం ఒక ఊహాప్రదేశం కాదు. నిజంగానే భౌతికంగా ఉన్నదని నిరూపించటానికి శ్రీమాలిగారు దేశవిదేశ ప్రముఖులను కొందరిని తీసుకువెళ్ళి కొన్ని గంటలపాటు ఆ ప్రదేశాలను చూపించి అక్కడి మహాత్ములను దర్శింప జేశారు. వారిలో ప్రఖ్యాత అమెరికన్ అణుశాస్త్రవేత్త జెఫ్, బ్రెజిల్ డాక్టర్లు - పూలింగ్, యూలే, హాలీవుడ్ సుందరి బీలే, శాస్త్రవేత్త ఎమర్సన్, ఖగోళ శాస్త్రవేత్త పహరిచ్, లండన్ శాస్త్రజ్ఞుడు బ్రూజీ, చంద్రగ్రహచోదన నిపుణుడు సిరాంగ్, కంప్యూటర్ విజ్ఞానాద్యుడుహోరీ ప్రభృతులున్నారు. వీరంతా ఏకకంఠంతో ఈ దివ్య ప్రదేశం యొక్క మహత్వాన్ని కొనియాడారు.

సాయికాకా అనే యోగి తాను చాలాసార్లు జ్ఞాన గంజ్‌కు సిద్ధమహాత్ముల సహాయం వల్ల వెళ్ళివచ్చానని అన్నాడు. అది శంబళ గ్రామ ప్రాంతంలో రహస్యంగా ఉంటుందని అటువంటి కేంద్రాలు హిమాలయాలలోనే గాక భూమిమీద మరికొన్ని ప్రదేశాలలో కూడా ఉన్నవని ఆయన తెలియజేశారు.

జేమ్సు హిల్టన్ నవల లాస్ట్ హారైజాన్ నవలలోని షాంగ్రిలా - ఈ శంబళ ప్రాంతంలోని ఒక భాగంగా పరిగణించబడుతున్నది. ఈ నవల సినిమాగా వచ్చి ప్రపంచ ప్రసిద్ధి పొందింది. అమెరికా అధ్యక్షుడు రూజ్‌వెల్ట్

దీని చేత ప్రభావితుడై తన నివాస భవనానికి షాంగ్రిలా అని పేరు పెట్టుకొన్నాడు.

కుర్తాళయోగి మహావతార్‌బాబా బదరీప్రాంతం కేంద్రంగా పెట్టుకొన్న జ్ఞాన్ గంజ్‌తో సన్నిహిత సంబంధం కలిగిన మహాత్ముడు. సిద్ధభూమి - జ్ఞానగంజ్ అని గోపీనాథ కవిరాజ్ రచించిన గ్రంథంలో ఇటువంటి ఎన్నో విశేషాలు వివరంగా చెప్పబడినవి. (ఈయన 1976 లో మరణించాడు).

ఈ ప్రదేశాలలో పరమసుందరమైన జలపాతాలెన్నో ఉన్నవి. వాటి నీరు ఒక చోట సరస్సుగా రూపొందింది. దానికి సిద్ధయోగ సరస్సని పేరు. శ్రీ పాద శ్రీవల్లభుల వారు స్నానం చేసిన స్ఫటికసరస్సదే కావచ్చు. దీని ఒడ్డుననే అమరత్వాన్ని, సర్వకామ్యములను ప్రసాదించే కల్పవృక్షం ఉన్నది. దీని ఫలాలు శ్రీ చక్ర మేరు ప్రస్తారంవలె ఉంటవి. సిద్ధాశ్రమం దాటి బయట ప్రపంచంలోకి ఈ ఫలాలను తీసుకువెళ్ళటానికి అనుమతి లేదు. అయితే ఇటీవల ఒక యోగి అచటి మహాత్ముల అనుమతితో 2001 లో ప్రయాగలో జరిగిన కుంభమేళాకు ఒక పండును తీసుకు వచ్చాడు. దానిని చూడటానికి కొద్దిమందికి అనుమతి ఇవ్వబడింది.

నారాయణ దత్త శ్రీమాలి చెప్పిన పట్టికలోని వారే గాక మరికొందరు దాక్షిణాత్య యోగులు కూడా అక్కడ ఉన్నారని మరి కొందరు మహాత్ములు చెపుతున్నారు. ఆంధ్రుడైన త్రైలింగస్వామి, ద్రావిడ దేశ ప్రసిద్ధులు - భోగనాథుడు, సుందరనాథుడు, కరువూరర్, పాంబట్టి, కొంగనార్, సత్తముని, రామదేవర్, మాచముని, వాన్‌మీగర్ మొదలైన పేర్లెన్నో వినిపిస్తున్నవి. పురాణాలలో చిరంజీవులుగా చెప్పబడిన అశ్వత్థామ, వ్యాసుడు, హనుమంతుడు, కృపుడు, పరశురాముడు మొదలైనవారు హిమాలయ సిద్ధభూములలో వుండి సాధకులను అనుగ్రహిస్తూనే ఉన్నారు. సువిశాల, సువిస్తరమైన సిద్ధాశ్రమ భూమికలలో బౌద్ధ, జైన, శైవ, శాక్తేయాది విభాగాలెన్నో ఉన్నవి. హైందవేతర మతస్థులలోని సిద్ధులు కూడా ఇక్కడ ఉన్నారు. తపస్సు - దైవనిష్ఠ మతములకు సంప్రదాయములకు, ఆచారములకు అతీతమైనవి. మహావతార్ బాబా శిష్యులలో అన్యమతస్థులున్నట్లు వారి చరిత్రలో ఉన్నది. మౌనస్వామి

హిమాలయాలలో తాను దర్శించిన మహిమాన్వితుడైన మహమ్మదీయ ఫకీరును గూర్చి చెప్పియున్నాడు. ఏసుక్రీస్తు హిమాలయ సిద్ధాశ్రమంలో శిక్షణ పొంది మహిమలవు సాధించాడని, శిలువ వేసినా మరణించక రక్షింపబడి రహస్యంగా తిరిగి హిమాలయాలకు వచ్చి కొంతకాలం ఉన్నాడని ఆయన సమాధి కాశ్మీర్‌లో ఇప్పటికి ఉన్నదని కొందరి అభిప్రాయం. చైనాలోని షామాన్ మాంత్రికులు కొందరు అక్కడ ఉన్నారని బోన్పా మతస్థుల విశ్వాసం. ప్రసిద్ధయోగిని ఆనందమాయి మరణించిన తర్వాత సిద్ధాశ్రమంలో ఉన్నదని శ్రీమాలి చెప్పటం వల్ల మంచుకొండలతో ఆమె అనుబంధం స్మరించదగినది. మహాత్ముడు వేల సంవత్సరాలు జీవించిన బృందావన యోగి దేవరహాబాబా దయవల్ల హిమాలయాలలో 20, 25 అడుగుల ఎత్తున్న ద్వాపరయుగ మానవులను తాను చూడగలిగానని ఆమె చెప్పిన విషయం ఆశ్చర్యకరమైనది. అలానే దలైలామా కార్యదర్శిగా, చైనా పోలీసులచే హింసించబడి మరణదశలో సిద్ధలామాల సంకల్పం వల్ల లండన్‌లోని బ్రిటిష్ డాక్టర్ శరీరంలో ప్రవేశించి థర్డ్ ఐ మొదలైన అద్భుత గ్రంథాలు రచించిన ట్యూస్‌డే‌లోబ్సాంగ్‌రాంపా "పురాతన గుహలు" అనే గ్రంథంలో పూర్వయుగాల మహనీయుల శాస్త్ర విజ్ఞాన రహస్యాలు హిమాలయ కందరాలలో ఎలా నిక్షిప్తమై ఉన్నవో వివరించాడు. ఆనాటి సిద్ధుల వివరాలు కొన్ని అతడు తెలియజేశాడు కూడా.

ఇంత ఆధునిక విజ్ఞానం పెరిగిన తర్వాత కూడా హిమాలయాలు ఎన్నో రహస్యాలకు స్థానమై ఉండి, మానవులు లౌకిక జ్ఞానంతో తెలుసుకోలేని విశేషాలెన్నో కలిగి ఉన్నవి. వాటి యెరుక లభించాలంటే తపస్సు చేయాలి. అక్కడ సిద్ధుల అనుగ్రహాన్ని పొందాలి. ఆ సిద్ధులు కొందరి చరిత్రలు సేకరించి ఒక గ్రంథంగా ప్రచురించటం జరుగుతున్నది. ఇటీవలి నా అమెరికా యాత్రలో బౌద్ధ యోగి పద్మసంభవుని చరిత్ర చదివినప్పుడు కలిగిన దివ్యానుభావాలు – ఈ రచనకు ప్రేరణ. ఈ గ్రంథంలో చెప్పబడిన వారు కాక ఇంకా ఎందరో సిద్ధాశ్రమ యోగులున్నారు. ప్రస్తుతానికి దీనిని సహృదయులు స్వీకరింతురుగాక!

D D D

## ౨. శ్రీ పద్మసంభవుడు



శ్వేతవరాహకల్పంలో వైవస్వత మన్వంతరం. 28వ మహాయుగంలో కలియుగం ప్రథమపాదం విక్రమశకంలో 7వ శతాబ్దం. దక్షిణాపథంలో శ్రీలంక. అందులో ప్రసిద్ధమైన మలయపర్వతం. ఈ శైలం మీద నుండి వచ్చే గాలులకు కొన్ని వందల మైళ్ళమేర చల్లగా ఉంటుంది. ఈ గిరి మీద చందన వృక్షాలు అసంఖ్యాకంగా ఉండటం వల్ల ఇది నాగజాతికి నివాసమైంది. ఋషుల ఆశ్రమాలు, గ్రామాలు ఇక్కడ అరణ్యప్రాంతాలలో మానవనివాసాలు.

అటువంటి ఒక చిన్నపల్లెలో ఒక బ్రాహ్మణ కుటుంబం. ఆస్తిపాస్తులు లేవు. పురాతనమైన చిన్న యిల్లు. కొండలు, గుట్టలు, అక్కడ పెద్దపంటభూములు లేవు. అడవిలో నివ్వరిధాన్యం కొంచెం లభిస్తుంది. పండ్లచెట్లు మాత్రం సమృద్ధిగా ఉన్నవి. కొద్దిగా గోసంపద. ఈ బ్రాహ్మణుడు కాస్త చదువుకొన్నాడు. సాయంకాలాలు పురాణప్రవచనం చేస్తుంటాడు. దగ్గరి కుటుంబాలవారు ఒక పది, పదిహేనుమంది వచ్చి వింటుంటారు. ఎప్పుడన్నా కొంచెం ధాన్యం, కాయగూరలు పండ్లు ఇస్తుంటారు. పంచాంగం చూచి మంచి చెడు చెపుతుంటాడు. జాతకభాగంతో అల్ప పరిచయం ఉంది.

కాలం గడచిపోతున్నది. సంతానం లేదు. తనకు తెలిసిన జ్యోతిష పరిజ్ఞానాన్ని బట్టి సంతానయోగం లేదు. వంశం నిలిచే అవకాశం కనబడటం లేదు. ఒకసారి దేవీ భాగవతం పురాణం చెపుతుండగా దేవదత్తుని కథ వచ్చింది. ఆ దేవదత్తుడు సంతానయోగం లేదని తెలుసుకొని ఒక మహర్షిని ఆశ్రయించాడు. ఆ ముని - పుత్రకామేష్టి యజ్ఞం చేస్తే సంతానం కలుగుతుందని సలహా యిచ్చాడు. దేవదత్తుడు మునిపల్లెలో ఉన్నవాడు. యజ్ఞానికి విప్రుల కేమి లోటు ? అంతో యింతో ఉన్నవాడు. దక్షిణలివ్వగలడు.

శాస్త్రోక్తవిధానంలో యజ్ఞం ప్రారంభించాడు. యజ్ఞంలో హోమాలు, అర్చనలు, పారాయణలు చాలా భాగాలుంటవి. గోభిలుడనే మహర్షి ఉద్గాతగా వేదపారాయణం చేస్తున్నాడు. ఎండాకాలం కావటం వల్ల అలసిపోయి ఒక చోట మంత్రస్వరం తప్పుగా ఉచ్చరించాడు. వింటున్న దేవదత్తునికి కోపం వచ్చింది. ఏమయ్యా! గోభిలా! నేను ప్రయోజనం కోరి యజ్ఞం చేస్తున్నాను. స్వరం దోషయుక్తమైతే ఫలితం ఎలా వస్తుంది ? అని గద్దించాడు. గోభిలునికి కోపం వచ్చింది. ఎండ వేడికి అలసిపోయి కాస్త పొరపాటు చేస్తే పదిమందిలో నన్ను అవమానిస్తావా ? నీకు మూర్ఖుడగు పుత్రుడు పుట్టును గాక ! అని శపించాడు. యాజ్ఞికులంతా విస్తుపోయి చూస్తున్నారు. దేవదత్తుడు పరిస్థితి గమనించాడు. శాపాయుధుడైన ఋషిని తానేమి చేయగలడు ? వెంటనే మహర్షీ! నన్ను క్షమించు. ఉద్రేకంలో తొందరపడ్డాను. అయితే మీ మాటవల్ల ఒక ఉపకారం జరిగింది. పుత్రుడు పుడతాడని నిశ్చయమైంది. అయితే వేదవేత్తల కుటుంబంలో మూర్ఖుడు ప్రభవిస్తే అంతకంటే బాధాకరమైన విషయం మరొకటి ఉండదు. పుట్టే పిల్లవాడు పండితుడయ్యేటట్లు ఆశీర్వదించండి" అని కాళ్ళమీదపడ్డాడు. గోభిలునకు మనస్సు కరిగింది. "విప్రుని అలుకయు తృణహుతాశనంబు దీర్ఘమగునె?" అన్నారు పెద్దలు. బ్రాహ్మణుని కోపం గడ్డిపరకకు అంటుకొన్న నిప్పువంటిది. ఎక్కువసేపుండదు. గోభిలుడు శాంతించి "దేవదత్తా! నీకుమారుడు మొదట మూఢుడైనా తర్వాత సరస్వతీదేవి అనుగ్రహం చేత విద్వాంసు డవుతాడు" అని వరమిచ్చాడు.

తరువాత కొన్నాళ్ళకు దేవదత్తునకు కుమారుడు పుట్టాడు. వాడు పెరిగి పెద్దవాడవుతున్నాడు. ఉపనయనం చేశారు. కాని శాపంవల్ల ఎంత కష్టపడ్డా చదువురాలేదు. ఆపిల్లవాడు మునిశాపంవల్ల తనకు విద్యరాదని విని తండ్రి అనుజ్ఞ తీసుకొని దూరప్రదేశానికి వెళ్ళి ఒక కుటీరం నిర్మించుకొని భగవద్ధ్యానం చేసుకుంటూ మంచిరోజుల కోసం ఎదురు చూస్తున్నాడు. ఎటువంటి పరిస్థితులలోను అబద్ధమాడేవాడు కాకపోవటం వల్ల అతనికి సత్యవ్రతుడనే పేరు వచ్చింది.

ఒక రోజు వేటగాడొకడు అడవి పందిని బాణం వేసి కొట్టాడు. ఆ దెబ్బకది తప్పించుకొని పరుగెత్తుతూ వచ్చి సత్యవ్రతుడున్న కుటీరం దగ్గరి

పొదలో దూరింది. బోయవాడు వచ్చి "అయ్యా ! సత్యవ్రతా ! మీరు అబద్ధమాడరని, నిజమే చెపుతారని అందరికీ తెలుసు. నేను ఆటవికుణ్ణి. వేట నా కులవృత్తి. ఇవాళ తిరగ్గా తిరగ్గా అడవిపంది దొరికింది. దానిని చంపి కొంతమాంసం ఇంట్లో పెళ్ళాం బిడ్డల ఆహారానికి ఉంచి మిగతాది అమ్ముకొని కుటుంబం పోషించుకోవాలి. దానిని బాణం వేసి కొట్టాను. అది తప్పించుకొని ఇటేవచ్చింది. మావాళ్ళంతా ఆకలితో ఉన్నారు. దాన్ని చంపి తీసుకెళ్ళాలి. అది ఎక్కడో ఇక్కడే దాక్కొని ఉండాలి. నీవు చూచే ఉంటావు. దయచేసి చెపితే నేను దాన్ని చంపి తీసుకెళ్తాను" అన్నాడు. సత్యవ్రతుడు చాలా ఇరకాటంలో పడ్డాడు. చూడలేదంటే అబద్ధమాడినట్లవుతుంది. ఇన్నేండ్ల తన సత్యవ్రతానికి భంగం. చూచాను అదుగో ! ఆ పొదలో ఉన్నదంటే వాడు దాన్ని చంపుతాడు. తనకు హత్యాపాతకం వస్తుంది. కనుక నిజం చెప్పకూడదు. కానీ అబద్ధమూ ఆడకూడదు. ఒకరోజు ఆహారం లేనంత మాత్రాన వాడి కుటుంబమేమీ మరణించదు. ఏ పండ్లో తిని ఉండవచ్చు అనుకుని ఇలా అన్నాడు.

"శ్లో॥ యా పశ్యతి న సా బ్రూతే యాబ్రూతే సా న పశ్యతి
అహో ! వ్యాధ ! స్వకార్యర్థిన్ ! కిం పృచ్ఛసి పునఃపునః

ఏది చూస్తుందో (కన్ను) అది పలుకలేదు. ఏది పలుకుతుందో (నోరు) అది చూడలేదు. కార్యార్థివైన ఓ బోయవాడ ! మళ్ళీ మళ్ళీ నీవు ఎంత అడిగినా నేనేమీ చెప్పగలను?"

ఆ వేటకాడు "అయ్యా ! మీరు మాట్లాడేదేమీ నాకు అర్థం కాలేదు. సరే ! లెండి ! నేవెళ్ళి వెతుక్కొంటాను" అని వెళ్ళిపోయినాడు. సత్యవ్రతుడు బోయవాడు వెళ్ళిన తర్వాత ఆలోచిస్తుంటే ఆ అడవిపంది ఆర్తితో అరచిన అరుపులో "ఐ" అనే ధ్వని వింతగా తోచింది. ఐఐ అంటూ దానినే మననం చేస్తున్నాడు. ఉన్నట్లుండి సరస్వతీదేవి సాక్షాత్కరించి "సత్యవ్రతా ! నీ భూతదయ నాకు తృప్తి కలిగించింది. నా మంత్ర బీజాక్షరం ఐం. బిందువు లేకుండా నీవు ఉచ్చరించినా నీకు మంత్రసిద్ధిని ప్రసాదిస్తున్నాను. నీవు మహాపండితుడవగుదువు గాక!" అని వరమిచ్చింది. సత్యవ్రతుడు

పులకించిపోయినాడు. ఆమె పాదాల మీద పడి "తల్లీ ! నాజీవితం తరించింది. మరుభూమిలో నీటిని సృష్టించినట్లు మూర్ఖుడనైన నాకు దివ్యజ్ఞానాన్ని ప్రసాదించావు. కృతజ్ఞుడనమ్మా !" అని నమస్కృతులు చేశాడు.

ఆ కథ చెపుతున్నపుడు బ్రాహ్మణునకు తాను కూడా పుత్రకామేష్టి చేస్తే సంతానం కలుగవచ్చుగదా ! అని అనిపించింది. కాని యజ్ఞం చేసే శక్తి తనకున్నదా? తాను నిరుపేద. నోటి మంచితనం వల్ల సంసారాన్ని ఎలానో నెట్టుకు వస్తున్నాడు. యజ్ఞానికి కావలసిన సంభారాలను సమకూర్చుకోవటం తనకు సాధ్యమా ? హోతలు, ఉద్గాతలు ఇంకా ఎందరో మంత్ర విదులైన బ్రాహ్మణులు కావాలి. తన ఊరిలో ఎవరూ లేరు. మహానగరానికి వెళ్లాలి. అక్కడి వారు తన మాట వింటారా? వారికి తృప్తికరంగా దక్షిణ లివ్వగల శక్తి తనకున్నదా? దక్షిణారహితమైన యజ్ఞం ఫలించదని శాస్త్రం చెపుతున్నది. కనుక యజ్ఞం తనవల్లకాదు. ఇంక ఉన్న దొకటే మార్గం.

**శ్లో॥ యద్దుష్కరం యద్దురాపం**
**యద్దుర్గం యచ్చ దుస్తరం**
**తత్సర్వం తపసా సాధ్యం**
**తపోహి దురతి క్రమం.**

మానవ ప్రయత్నంవల్ల పురుషకారంవల్ల సాధ్యంకానిది తపస్సువల్ల సాధ్యం. అయితే తపస్సు చాలా కష్టం. అందులోనూ వయస్సుపైన బడుతున్న ఈ దశలో కఠోర తపస్సు తనవల్ల అవుతుందా ? అసాధ్యం. ఇక ఒక్కటే మార్గం ఉన్నది. ఎవరైనా సిద్ధుడైన గురువు దయతలిస్తే కోరిక తీరవచ్చు. అయితే ఆ సద్గురువు లభించటం ఎలా ? తీర్థయాత్రలు చేస్తూ వెళ్తుంటే దివ్యక్షేత్రాలలో ఎవరైనా మహనీయులు కనపడవచ్చు. వారి కాళ్ళపైన బడి వేడుకొంటే కనికరించ వచ్చు. ఇలా సాగుతున్న ఆలోచనలతో భార్యతో సంప్రదించాడు. ఆమె అమాయకురాలు. భర్త ఏమి చెప్పినా కాదనదు. తీర్థయాత్రలు చేద్దామని ఆమె కూడా కోరింది.

ఇక ఉన్న యిల్లు. ఆ చిన్న ఇంటిని తెలిసిన వారికి అప్పగించారు. వేరే ఆస్తి ఏమీ చెప్పదగింది లేదు. కనుక ఇబ్బంది లేదు. ఆప్తులతో చెప్పారు.

"అయ్యా! తీర్థయాత్రలకు వెళుతున్నాము. త్వరలో తిరిగివస్తాము. అంతదాకా ఇల్లు జాగ్రత్తగా చూస్తుండండి" అని చెప్పిబయలుదేరారు.

నెమ్మదిగా ప్రయాణాలు చేస్తూ త్రోవలోని దివ్యక్షేత్రాలను దర్శిస్తూ వెళుతున్నారు. అప్పటి కింకా ప్రతిఊళ్ళోను ధర్మసత్రాలున్నవి. రెండు మూడు రోజులుండటానికి భోజనానికి ఇబ్బంది లేదు. ఎక్కడైనా గ్రామాలలో సత్రం లేకపోతే అక్కడి సంపన్న గృహస్థులెవరో ఆతిథ్యం ఇచ్చేవాళ్ళు. ఎవరినీ యాచించవలసిన అవసరం గాని ధనవంతులను ఆశ్రయించవలసిన పనిగాని లేదు. అతనికి భాగవతంలోని రచన గుర్తుకు వచ్చింది.

**కమనీయ భూమిభాగములు లేకున్నవే**
**పడియుండుటకు దూదిపరుపు లేల ?**
**సహజంబులగు కరాంజలులు లేకున్న వే**
**భోజన భాజన పుంజమేల ?**
**వల్కలాజిన కుశావళులు లేకున్నవే**
**కట్ట దుకూల సంఘంబు లేల ?**
**గొన కొని వసియింప గుహలు లేకున్నవే**
**ప్రాసాద సౌధాది పటలమేల ?**
**స్వాదు ఫలములనొసగవే ? పాదపములు**
**సరస జలముల నొసగవే ? సకల నదులు**
**పొసగ భిక్షలు పెట్టరే ? పుణ్యసతులు**
**ధనమదాంధుల కొలు వేల ? తాపసులకు.**

తనజీవితం కూడా ఇన్నాళ్ళుగా ఇలానే గడిచింది. ఇప్పుడు ఏదో మార్పు వస్తున్నది. దంపతులిద్దరూ బయలుదేరి తమ సింహళద్వీపంలో దేవాలయాలు చూస్తూ వెళ్తున్నారు. కొన్నాళ్ళకు కతిర్గమ అనే ఊరు చేరారు. సంస్కృతంలో అది కార్తికేయ గ్రామం. కార్తికేయుడంటే కుమారస్వామి. సుబ్రహ్మణ్యుడక్కడి ఆటవిక కన్యయైన శ్రీవల్లిని ప్రేమించి విహరించిన స్థలాలు ఎన్నో ఉన్నవి. కతిర్గమలో ఆ స్వామి ఆలయం ఉన్నది. గర్భగుడిలో విగ్రహము లేదు. పెద్ద సువర్ణయంత్రం ఉన్నది. దానికేపూజలు. ఏడాది కొకసారి దానిని బయటకు తెచ్చి గ్రామంలో ఊరేగించి మళ్ళీ తీసుకువెళ్ళి గర్భగుడిలో

ఉంచుతారు. వీరు వెళ్ళిన రోజు ఆ ఉత్సవం రోజు. అదృష్టం వల్ల దానిలో పాల్గొన్నారు. ఆ కుమారస్వామి భక్తుడు, మహాసిద్ధుడు. వనమూలికలతో విగ్రహం తయారుచేసి సుబ్రహ్మణ్యుని పళనిలో ప్రతిష్ఠించిన మహనీయుడు. చిరంజీవి, భోగనాథుడు. తమ పూర్వీకులకు గురువన్న విషయం గుర్తుకు వచ్చింది. ఆ సిద్ధ గురువుకు అంజలి ఘటించి కొద్దిరోజుల్లో సముద్రం పడవలో దాటి భారతదేశంలో అడుగు పెట్టారు.

పల్లెలు దాటి పట్టణాలు దాటి పోతుంటే ఒకరు వైదేశ్వరం కోయిల్‌లో నాడీ జాతకాల గురించి చెప్పారు. అక్కడికి వెళ్ళగలిగిన వారి జీవితాలన్నీ వ్రాసి పెట్టబడి ఉన్నవి- ఎన్నో వేలయేండ్ల క్రిందనే లిఖితమైనవి దొరుకుతవని తెలిసింది. ఇంతదూరం వచ్చాము. అక్కడికి కూడా వెళ్ళి చూద్దామని నిశ్చయించుకొన్నాడు. భార్యతో కలసి అచటి నాడీ జ్యోతిష్కులను కలిశాడు. వారు తన జాతకం వెదికి తాటాకు గ్రంథాల నుండి తీసి చదివి వినిపించారు. సహజంగా సంతానయోగం లేదని - కాని అగస్త్య నివాసమైన కుర్తాళం వెళితే అక్కడ ఒక సిద్ధుడు పిలిచి మంత్ర మొకటి ఇస్తాడని దానిని జపిస్తే మహాపురుషుడొకరు జన్మిస్తాడని మిగతా విశేషాలను ఆ సిద్ధుని నుండి తెలుసుకోవలసి ఉంటుందని వినిపించారు.

బ్రాహ్మణునకు ఆశ్చర్యమైంది. ఏదో దేవరహస్యం దీనిలో ఉన్నదనిపించింది. కుర్తాళం సిద్ధక్షేత్రం దానిని గురించి ఇంతకు ముందు కూడా విన్నాడు. తమ పూర్వీకులలో ఒకరు అగస్త్యుని శిష్యుడైన భోగనాథుడనే యోగి నుండి మంత్రోపదేశం పొందారని పెద్దలు చెప్పగా విన్న సంగతి మనసులో నిలచి ఉంది.

మళ్ళీ దంపతులు కతిపయ దినాలలో కుర్తాళం చేరుకొని పొదిగై కొండల మీద నుండి దూకుతున్న జలపాతంలో స్నానం చేశారు. వనమూలికలతో తడిసిన నీరుకావటం వల్ల ఆ జలంలో స్నానం చేస్తే ఎంతటి వ్యాధియైనా పోతుందని గ్రామస్థులు చెప్పగా విని సంతోషించారు. అగస్త్యమహర్షి స్థాపించిన ధరణీపీఠం అక్కడ ప్రకాశిస్తున్నది. ఆ పీఠంలోని కుర్తాళనాథేశ్వరుని, ఆ స్వామి భార్య పరాశక్తి వేణువాగ్వాదినీ దేవిని దర్శించి

ప్రసాదం తీసుకొని బయటకు వచ్చి కొద్ది దూరంలో జలపాతాల దగ్గర ఒక రాతి ప్రక్కన దంపతులు కూర్చున్నారు. జనం ఎవరూ పెద్దగా లేరు. దూరదూరంగా ఒకరు ఇద్దరు స్నానాలకు జలపాతాల దగ్గరకు వెళ్తున్నారు.

ఇంతలో సలిలకాషాయవస్త్రాలు - నీర్కావి గుడ్డలు ధరించిన వ్యక్తి నడుస్తూ వారివైపు వచ్చాడు. ఒక చేతిలో కమండులువు మరొక చేతిలో యోగదండమూ ఉన్నవి. మధ్యవయస్కుడు. కేశములు నల్లగా ఉన్నవి. చిరుగడ్డము. దరహాసభాసురుడై వస్తున్న ఆ యోగిని చూచి ప్రవర చెప్పుకొని సాష్టాంగ దండ ప్రణామాలు చేశారు దంపతులు. ఆ యోగి వారిని ఆశీర్వదించి ఇలా పలికాడు. ఓయీ ! బ్రాహ్మణుడా ! వైదేశ్వరం కోయిల్‌లో నాడీ జాతకం తెలుసుకొని వస్తున్నావు. సంతానం కోసం పరితపిస్తున్నావు. నీకొక రహస్యమైన మంత్రాన్ని ఉపదేశిస్తాను.

ఈ కుర్తాళక్షేత్రంలో మండల దీక్ష చెయ్యి. నలభై రోజులు జపం చెయ్యి. మంత్రం సిద్ధించినదనటానికి గుర్తుగా 40వరోజు రాత్రి నీకు దివ్యానుభూతి కలుగుతుంది. 41 వ రోజు బయలుదేరి స్వగ్రామానికి వెళ్ళు. నీ భార్య గర్భవతి అవుతుంది. నెలలు నిండి ప్రసవ సమయం వచ్చినప్పుడు మీ కొండశిఖరంమీది గుడికి వెళ్ళు. అది బుద్ధుని మందిరమని నీకు తెలుసు. శ్రీ లంకలో బౌద్ధమతం ప్రబలంగా ఉంది. కానీ నీవు వేదధర్మీయుడవు. బుద్ధ మందిరానికి వెళ్ళటమేమిటని అనుకోవద్దు. దేవరహస్యాలను తెలుసుకోవటం చాలా కష్టం. నీకు పుట్టబోయే బిడ్డ అమితాభబుద్ధుని అంశతో వస్తాడు. ఆ మందిరంలో నీ భార్య ప్రసవిస్తుంది. శిశువు విచ్చిన తామరపువ్వువంటి ముఖంతో ఉదయిస్తాడు. పద్మసంభవుడు - ఆ బాలునకు నిర్ణయించబడిన పేరు. జాతాశౌచాదులన్నీ పూర్తయిన తర్వాత మీరిద్దరు మీ బిడ్డతో మలయపర్వత శిఖరగ్రామం శాశ్వతంగా వదిలి ఉత్తర హిందూస్థానం తీర్థయాత్రలకు వెళ్ళండి.

కాశీ ప్రయాగ మొదలైన క్షేత్రాలు చూచి అచటి దేవాలయాలలోని దేవతలను దర్శించి చివరకు గయా క్షేత్రాన్ని చేరుకోండి. ఆ క్షేత్రదేవత మంగళచండి. ఆమెకు పూజచేసి బోధిగయలో బుద్ధభగవానుడు తపస్సు

చేసిన ప్రదేశాన్ని చూడండి. మహనీయుడైన గౌతమబుద్ధుని మందిరమక్కడ ఉన్నది. ఆయనను భక్తితో ఆరాధించండి.

**బ్రాహ్మణుడు :** స్వామీ ! మీరెవరో మహానుభావులు. మా జన్మాంతర సుకృతం వల్ల దర్శనమిచ్చారు. మీరు చెప్పిన విధంగానే ఆచరిస్తాము. అయితే బుద్ధుడు వేదధర్మవిరోధి అని పండితులు చెప్పగా విన్నాను. ఆయన అంశతో వైదికుడనైన నాకు కుమారుడు గలగటమేమిటో అర్థం కావటం లేదు.

**యోగి :** గౌతమబుద్ధుడు మహావిష్ణువు యొక్క అవతారమని భాగవతంలో ఉన్నది. నీవూ చదివావు గదా ! ఇప్పుడా చర్చల జోలికిపోవద్దు. నీకు సంతానం ఆయన కరుణవల్ల మాత్రమే కలుగుతున్నది.

**బ్రాహ్మణుడు :** తమ ఆజ్ఞ. నాకేమీ తెలియటం లేదు. శివభక్తుడను. నేను బుద్ధుని సేవించటం ఏమిటో ! అయినా నేను అల్పమతిని. నా తెలివికి అతీతమైన ఏదో మహాశక్తి నా జీవితంలో జోక్యం చేసుకొంటున్నదని మాత్రం అనిపిస్తున్నది. మీ వంటి మహానుభావులు నిర్దేశించిన తర్వాత మరొక ఆలోచన పెట్టుకోలేను. చూడగా చూడగా అగస్త్యుని శిష్యులు మా పూర్వీకుల గురుదేవులు అయిన భోగనాథులు మీరే ననిపిస్తున్నది.

యోగి నవ్వి ఎప్పుడు ఏది ఎంతవరకు తెలియాలో అంతవరకే తెలుస్తుంది. ప్రస్తుతం నీకు ఇది చాలు. దైవసంకల్పం. సిద్ధాశ్రమ ప్రణాళిక - అందులో నీకొక చిన్నపాత్ర కల్పించబడింది. నేను మళ్ళీ బోధిగయలో వస్తాను. అని మంత్రోపదేశం చేసి ఆ మహాపురుషుడు వెళ్ళిపోయినాడు. ఆయన నిర్దేశించిన ప్రకారం కుర్తాళంలో జప దీక్ష చేశాడు. యోగి చెప్పిన విధంగానే ఒక దివ్యతేజస్సు తమ దంపతులలోకి ప్రవేశిస్తున్న భవ్యానుభూతి కలిగింది. మళ్ళీ స్వగ్రామానికి చేరుకున్నారు. కొద్ది రోజులలోనే బ్రాహ్మణుని భార్య గర్భవతి అయింది. నెలలు నిండుతూ ఉండగానే ఆ మహానుభావుడు చెప్పిన ప్రకారం శైలశిఖరం మీద బుద్ధ మందిరానికి భార్యను తీసుకొని వెళ్ళాడు. ఆమె అక్కడ మగశిశువును ప్రసవించింది. శిశువునకు స్నానం చేయించి బుద్ధ విగ్రహం ముందున్న మణిపద్మ ఫలకం మీద ఉంచి నమస్కరించి కొండ దిగి క్రిందికి వచ్చి, పురుడు అయి పోయిన తర్వాత జాతకర్మ చేసి

పద్మసంభవుడని పేరుపెట్టారు. సిద్ధయోగి ఇచ్చిన ఆజ్ఞ ప్రకారం త్వరలోనే గ్రామం వదలుతూ తమ ఇల్లును బంధువులకు అప్పగించి ఉత్తర భారతయాత్రకు బయలుదేరారు. కతిపయ ప్రయాణాలు చేసి సముద్రం దాటి నదులు దాటి కొండలు అరణ్యాలు దాటి భార్యాబిడ్డలతో కాశీకి చేరాడు.

**శ్లో॥ విశ్వేశం మాధవం దుంఠిం దండపాణించ భైరవం**
**వందే కాశీం గుహాం గంగాం భవానీం మణికర్ణికాం॥**

కాశీ క్షేత్ర నాయకుడైన పరమశివుడు విశ్వనాథుడై అన్నపూర్ణయైన విశాలాక్షితో బ్రహ్మాండమైన ఆలయంలో విరాజిల్లుతున్నాడు. స్వామి ముందు మహిమాన్వితమైన ముక్తి మంటపం ఉంది. అక్కడ పురాణ ప్రవచనాలు, వేదశాస్త్ర చర్చలు, గోష్ఠులు నిరంతరం జరుగుతున్నవి. క్షేత్రపాలకుడైన దండపాణి, క్షేత్ర రక్షకుడైన భైరవుడు ఆదికేశవుడు, బిందుమాధవుడు, దుంఠిగణపతి, కాశీ నగరదేవత కొలువు తీరి ఉన్నారు. గంగాతీరమంతా ఎన్నో స్నానఘట్టాలున్నవి. మణికర్ణికా ఘట్టం దగ్గర కొలను వలె తీర్థం ఏర్పడి ఉన్నది. దాని మహిమ వర్ణించటం శక్యంకాదు. అటువంటిదే మత్స్యోదరీ తీర్థం. ఆ తీర్థంలో స్నానం చేసి ఓంకారేశ్వరుని చూడకపోతే మానవజన్మ వ్యర్థమని స్కాందపురాణం చెపుతున్నది.

**మనుజుండెవ్వడు కాశికిన్ జనదు శ్రీమత్స్యోదరీ తీర్థమున్**
**గన డోంకార శశాంక మూర్ధునకు మ్రొక్కం దద్దురాత్ముండహో !**
**మునిశార్దూల ! వినాశకారణము దోర్మూలాగ్ర కూలంకష**
**స్తన భారాలస సూక్ష్మమధ్య జననీ తారుణ్య సంపత్తికిన్**

కాశీనగరానికి ధర్మాధికారి దండపాణి – హరికేశుడనే యక్షుడు. కాంచన కుండలా పూర్ణభద్రుల పుత్రుడు. కాశీలో చిరకాలం కఠోరతపస్సు చేసి విశ్వనాథుని వల్ల నగరపాలక పదవి పొందాడు. అతని దగ్గర సంభ్రముడు, ఉద్భ్రముడు అనే సేవకులున్నారు. ఎక్కడెక్కడి వాళ్ళకు కాశీకిపోవాలనే సంకల్పం కలిగిస్తుంటాడు సంభ్రముడు. వచ్చిన తర్వాత వారి ప్రవర్తన సరిగా లేకపోతే ఏదో హేతువు కల్పించి వెళ్ళగొడతాడు ఉద్భ్రముడు.

అలానే కాశీనగర రక్షకుడు కాలభైరవుడు. ఆయన అనుజ్ఞలేకపోతే వారణాసిలో ఎవరూ అడుగు పెట్టలేరు. పంచక్రోశపరీతమైన ఆ క్షేత్రంలో మరణించిన జీవులనందరినీ క్షణమాత్రంలో పాపపుణ్యాల ననుభవింపజేసి శివునకు అప్పగిస్తాడు. ఆ క్షణాలలోనే జీవులకు ఎన్నో సంవత్సరాలు కర్మానుభవం కలిగిన అనుభూతి కలుగుతుంది. అప్పుడు విశ్వనాధుడు దక్షిణకర్ణంలో ప్రణవాన్ని ఉపదేశించి వారిని కైలాసానికి పంపుతాడు. పునరావృత్తిరహితమైన ఆ మోక్షభూమిలో జీవులు శాశ్వతంగా ఉండిపోతారు.

అటువంటి విశేషాలను తెలుసుకొంటూ బ్రాహ్మణ దంపతులు బుద్ధుడు దివ్యజ్ఞానాన్ని పొందిన తర్వాత ధర్మప్రబోధం మొదటిసారిగా ప్రారంభించిన సారనాథ్ దర్శించారు. అది కాశీకి ఊరిబయట ఒక వైపున్నది. గౌతమబుద్ధుని చరిత్ర గురించి అక్కడి భిక్షులు చెప్పిన విశేషాలను ఆసక్తితో వారువిన్నారు. అచటికి కొంచెం దూరంలో సారంగనాధుడైన శివుని ఆలయం ఉన్నది. ఆ సారంగపాణిని దర్శించి ఆ మహేశ్వరుని పేరు నుండే సారనాథ్ అనే పేరు పుట్టిందని అక్కడి వృద్ధులు చెప్పగా విన్నారు.

అన్నిటికంటే జైగీషవ్యుడు తపస్సు చేసిన గుహ చాలా ఆకర్షించింది. ఆ శైవశ్రేష్ఠుడు కఠోరంగా తపించి శివుని అనుగ్రహాన్ని పొందిన తీరు చాలా అద్భుతం అనిపించింది. ఆ గుహలో ఇప్పటికీ యక్షులు, పాతాళవాసులు ఉన్నారట ! కాశీ నగరం చుట్టూ ఎన్నో ఆశ్రమాలు, దేవాలయాలు ఉన్నవి. కాశీకి తపస్సు చేసుకోటానికి వచ్చేవారు విశ్వనాధుని దర్శించుకొని వేరే సౌకర్యాలున్న చోట కుటీరమో ఆశ్రమమో నిర్మించుకొని తపస్సు చేస్తారు. విశ్వేశ్వరాలయంలో కూర్చొని తపస్సు సుదీర్ఘకాలం చేయటానికి అవకాశాలుండవు. ఆయా మహర్షులు తపస్సు చేసిన ఆశ్రమాలు ఎన్నో ఉన్నవి. కాశీనగరం చుట్టూ పరిక్రమ (ప్రదక్షిణ) చేస్తే ఇటువంటి విశేషాలెన్నో చూడవచ్చు. ప్రదక్షిణ పుణ్యఫలం లభిస్తుంది.

బ్రాహ్మణుడిటువంటి వన్నీ చూస్తూ తీర్థ విధులు నిర్వర్తించి భార్యతో కుమారునితో సహా ప్రయాగ చేరాడు. అక్కడ మాధవుని అక్షయ వటవృక్షాన్ని దర్శించి, అష్టాదశ మహాశక్తి పీఠాలలో ఒకటైన లలితాదేవి మందిరాన్ని చూచి పూజ చేసుకొని ఆ క్షేత్ర విశేషాలు తెలుసుకొన్నాడు. ఎవరైనా ఆత్మహత్య

చేసుకొంటే ప్రేతత్వం వస్తుంది. కానీ ప్రయాగలో త్రివేణీ సంగమంలో తీరని కోరిక యేదైనా సరే కోరుకొని నదిలో పడి మరణిస్తే ప్రేతత్వము రాదు సరికదా ! తర్వాతి జన్మలో కోరిక తీరుతుంది. ఒకసారి వివాహం కాని పేదకన్యలు నలుగురక్కడికి వచ్చి వచ్చే జన్మలో వీరుడు భర్తకావాలని ఒకరు, చక్రవర్తి భర్త కావాలని మరొకరు, లలిత కళానిపుణుడు భర్తకావాలని ఇంకొకరు, మహామంత్ర సిద్ధుడు భర్తకావాలని వేరొకరు కోరుతూ వటవృక్షం ఎక్కి నీళ్ళలో దూకి మరణించారట! దీనిని చూస్తున్న యువకుడొకడు వీరంతా వచ్చే జన్మలో నా భార్యలు కావాలని నదిలో దూకి మృతి చెందాడు. ఆ యువకుడే అనంతర జన్మలో విక్రమార్క చక్రవర్తియైనాడని – ఆ నలుగురు కన్యలు అతని భార్యలైనారని ఒక ఐతిహ్యము.

ప్రయాగ నుంచి బ్రాహ్మణ దంపతులు గయ చేరారు. అక్కడ మంగళచండి క్షేత్ర దేవత. అష్టాదశ మహాశక్తి పీఠాలలో అది ఒకటి. ఆ దేవికి మ్రొక్కి బుద్ధ గయను దర్శించి ఆ మహాపురుషుడు తపస్సు చేసిన వటవృక్షం ఇప్పటికీ భక్తులకు దర్శనీయమైన పవిత్ర ప్రదేశంగా విరాజిల్లుతుండటం చూచి ఆశ్చర్యపడ్డారు. ఆ మహనీయుని మందిరాన్ని దర్శించి ఆ ప్రదేశంలో భక్తులు బుద్ధ జాతక కథలు చెపుతుంటే ఆసక్తిగా విన్నారు. మానవజీవితాలకు మూలమైన జన్మకర్మ సిద్ధాంతంలోని విశిష్టతను తెలుసుకొని, ప్రాచీన ఋషుల దార్శనికానుభూతులకు వారి దివ్యజ్ఞాన ప్రభావానికి ఎంతటివారైనా నతమస్తకులు కాకతప్పదని గ్రహించాడు.

ఆ ప్రాంతంలోనే చిన్న యిల్లు వసతి ఏర్పరచుకొని దంపతులు సత్సంగంతో దైవదర్శనాలతో కాలం గడుపుతున్నారు. పిల్లవాడు పెరుగుతున్నాడు. ఇంతలో ఒకరోజు కుర్తాళ యోగి వచ్చి దర్శనమిచ్చాడు. దంపతులు ఆయనకు ప్రణామం చేసి పిల్లవానిని వారి పాదాల దగ్గర ఉంచారు. పద్మాసనంతో పద్మాక్షులతో అలరారుతున్న ఆ బాలుని పద్మసంభవుని దీవించి ఆయన ఇలా అన్నాడు. “విప్రదంపతులారా ! ఈ పిల్లవాడు కారణజన్ముడు. ఇతని వల్ల భవిష్యత్తులో ఎన్నో మహాకార్యాలు నిర్వహింపబడ వలసి యున్నది. ఈ పసివానిని తీసుకొని మీరు బయలుదేరండి. కొంత దీర్ఘ ప్రయాణమే అయినా మీకు ఏ ఇబ్బందీ ఉండదు. మహాపురుషుడైన ఈ బిడ్డను దేవతలు

రక్షిస్తుంటారు. గాంధారదేశం వెళ్ళండి. అక్కడ జగన్మాత అవతరించిన ఓడ్యాణ పీఠం ఉన్నది. దానికి నైరుతి భాగంలో దానకోశమనే పెద్ద సరస్సున్నది. దీని నీరు పాలవలె తీయగా ఉండటం చేత క్షీరసరస్సు అనే పేరు వచ్చింది. అందులో తామరపూలు ఎన్నో ఉంటవి. మధ్యలో ఉన్న పెద్ద తామర పూవు మీద ఈ పసిబిడ్డను ఉంచండి ! కొద్ది సేపటిలో ఒకరాజు దైవప్రేరణ వల్ల వచ్చి ఈ బిడ్డను తీసుకు వెళ్తాడు. అయ్యో ! కన్నబిడ్డను విడిచి పెట్టడమేమిటి? లేక లేక పుట్టిన వాణ్ణి ముద్దుగా మురిపెంగా పెంచుకోవద్దా- అని అనుకోవద్దు. ఒక మహత్తర ప్రయోజనం కోసం ఎన్ను కోబడినవారు మీరు. మీ బిడ్డను ఆసరస్సులోని పద్మంపై ఉంచటంతో ఈ ప్రపంచంలో మీ పాత్ర ముగుస్తుంది. ఆ ప్రాంతరాజు మీ కుమారుని తన కుమారునిగా పెంచుతాడు. మీ బిడ్డను అతడు తీసుకెళ్ళటం వరకు మీరు కాస్త దూరంగా ఉన్న పొదల మధ్య నుండి చూడండి. కొద్ది సేపటికే ఏక కాలంలో మీకు మరణం సంభవిస్తుంది. ఆ తర్వాత పుణ్యశరీరాలతో మీ బిడ్డను చూడగలుగుతారు. ఇది దేవకార్యం - మీ కర్తవ్యాన్ని మీరు నిర్వర్తించండి" ఇలా చెప్పి ఆ యోగీశ్వరుడు వెళ్ళిపోయినాడు.

ఆ దంపతులకు సుఖమో దుఃఖమో తెలియని అనుభూతి. తాము మాట్లాడటానికి కూడా వీలులేకుండా ఆ మహాత్ముడు ఆజ్ఞలు జారీ చేసి వెళ్ళిపోయినాడు. ఈ వ్యవహారంలో తమ ఇష్టానిష్టాల ప్రసక్తి లేదు. మహాత్ముల ఆజ్ఞ పాటించక తప్పదు. మరునాడే బయలుదేరి కొన్ని నెలలు ప్రయాణం చేసి గమ్యస్థానం చేరుకొన్నారు. (ఓడ్యాణ పీఠం - పాకిస్తాన్ - ఆఫ్ఘనిస్తాన్ సరిహద్దు ప్రాంతంలో ఉన్నది). యోగీంద్రుడు చెప్పిన ప్రకారంగా పసిబిడ్డను దానకోశ సరస్సులోని పెద్ద తామర పూవుమీద ఉంచారు.

ఆ కాలంలో ఓడ్యాణ ప్రాంతానికి ఇంద్రబోధి అనే రాజుపాలకుడు. అపారమైన ఐశ్వర్యం - మంత్రులు, సేనలు, పరివారం - అన్నీ ఉన్నవి. తొమ్మిది అంతస్థుల మహాభవనంలో నివాసం. సౌందర్యవతి, అనుకూలవతి అయిన మహారాణి - కాని సంతానం లేని లోటు మనస్సును బాధిస్తున్నది. భిక్షుకులకు దానాలు చేస్తే కోరిక తీరుతుందని విద్వాంసులు సలహాయిస్తే - మహారాజు దానదీక్ష ధరించాడు. తన సమస్త సంపదను యాచకులకు -

భిక్షుకులకు దానం ఇచ్చాడు. కాని ఇంకా భిక్షుకులు కొందరు మిగిలిపోయినారు. వారికి కూడా దానం యిస్తేగాని వ్రతం పూర్తి కాదు. తన దగ్గరయేమీ మిగలలేదు. ఆస్థాన పురోహితుడొక మార్గం చెప్పాడు. అది మనసులో పెట్టుకొని తన రాజ్య పశ్చిమ భాగంలో ప్రవహిస్తున్న సింధునదిలో ఒక పడవ యెక్కి సముద్రమును చేరుకొన్నాడు. పశ్చిమ సముద్రంలో నాగరాజు కూతురైన చారుమతిని మంత్రసాధనతో సంతుష్టిపరచి ఆమె కిరీటంలోని దివ్యమణిని వరంగా పొందాడు. ఆ మణి సువర్ణాన్ని ప్రసాదించే చింతామణి. దాని ప్రభావము వల్ల అనంతమైన ధనం లభించింది. ఆ ధనంతో మళ్ళీ పడవలో తిరుగు ప్రయాణం చేస్తుండగా మతవ్యవహారాలు చూచే మంత్రి త్రికనాధజినుడు సింధునది ఒడ్డున ఆ నదీ జలాలతో ఏర్పడిన దానకోశ సరస్సులో ఒక అద్భుతమైన దృశ్యాన్ని చూపించాడు. ఆ సరస్సు మధ్య ఒక ఎర్రని మహాపద్మం – *దానిపై ఒక పసిబిడ్డ కనిపించారు. దేవతలు ప్రసాదించిన వరంగా భావించి రాజు ఆ పిల్లవానిని తీసుకొని బయలుదేరాడు. తర్వాత రాజ్యానికి ప్రభువుగా ప్రకటించాడు. చందన గోమశ్రీ అనే రాజుకూతురు ప్రభాధరి అనే అమ్మాయితో పద్మసంభవునకు పెండ్లి జరిగింది.

---

*పురాణ వాఙ్మయంలో ఇటువంటి సంఘటన ఒకటి ద్వాపరాంతంలో జరిగింది. యమునాతీరంలో బర్సానా ప్రభువు – వృషభాను మహారాజు – ఆయన రాణి కీర్తిదేవి. వారికి సంతానం లేక గోలోకేశ్వరియైన రాధాదేవిని గూర్చి తపస్సు చేశారు. ఆ దేవి సాక్షాత్కరించి దగ్గరలో ఉన్న రావల్ గ్రామంలో – ఊరిబయట ఉన్న సరస్సు మధ్య పద్మంలో పసిబిడ్డగా – తానుంటానని – తెచ్చి పెంచుకోవలసిందని పలికింది. ఆ రాజ దంపతులు మేళ తాళాలతో సపరివారంగా వెళ్ళేసరికి – భాద్రపదశుద్ధ అష్టమి నాడు తెల్లవారు జామున గం. 5–30 ని.లకు సరోవరం మధ్య పెద్ద తామరపూవులో చిన్న బాలిక కనిపించింది. వారు తెచ్చి పెంచుకున్నారు. ఆమెయే రాధాదేవి – కృష్ణప్రియ. భౌతికంగా ఆ బాలిక ఉశీనరరాజు దంపతుల బిడ్డ. పరమేశ్వరి ఆజ్ఞ ప్రకారం వారు రావల్ గ్రామ సరోవర పద్మంలో ఉంచి వెళ్ళిపోయినారు. బ్రహ్మవైవర్త పురాణంలో, గర్గసంహితలో ఈగాధకు సంబంధించిన విశేషాలు కనిపిస్తవి. ఇప్పటికీ రావల్ గ్రామంలో అవతరణోత్సవం వైభవోపేతంగా జరుగుతున్నది. భక్తులెక్కడ ఉన్నా రాధాష్టమినాడు, ధ్యానసాధన, పూజ చేస్తారు.

ఈ బాలుడు ఎవరి బిడ్డ? ఎవరితనిని ఈ సరస్సులో ఉంచారు ? ఏమో ఎవరికీ తెలియదు. మహారాజు బిడ్డను చేతుల్లోకి తీసుకొని లాలనగా "ఎవరయ్యా నీవు ? ఎక్కడి నుండి వచ్చావు? నీ తల్లిదండ్రులెవరు? నీ ఊరేమిటి ? పేరేమిటి? ఏకులం ?" అన్నాడు. పసిబిడ్డ నుండి సమాధానం ఆశించి కాదు. ప్రేమతో- కుతూహలంతో అన్న మాటలు మాత్రమే. అయితే ఆశ్చర్యం ! ఆ పసివాడు మాట్లాడటం మొదలు పెట్టాడు.

"నా తండ్రి స్వయంభువైన సమంతభద్రుడు. నా తల్లి సత్యరూపిణి - సమంత భద్రి. దివ్యజ్ఞాన ధర్మధాతువుల సమ్మేళనం నాకులం. నాపేరు పద్మ సంభవుడు".

మహారాజుకు- అక్కడి పెద్దలకు దిగ్భ్రాంతి కలిగింది. ఈ బాలుడు సామాన్యుడు కాదు. తథాగతుడైన బుద్ధుడు. నిర్మాణకాయుడై ఉదయించాడు. పసిబిడ్డలు మాట్లాడటం చాలా అరుదుగా కనిపిస్తుంది. మహాపురుషుల విషయంలో ఇటువంటి సంఘటనలు జరిగినట్లు అక్కడక్కడ వినిపిస్తున్నది. మహారాజు ఇంద్రబోధి పద్మసంభవుని తీసుకెళ్ళి పెంచి పెద్దజేశాడు. (దివ్యజ్ఞాన సమాజ స్థాపకురాలు మేడమ్ బ్లే వట్స్కి ఐసిస్అన్‌వీల్డ్ - అనే గ్రంథంలో 13వ దలైలామాను గూర్చిన ఇటువంటి విశేషం ఉదాహరించింది.

టిబెట్‌లో దలైలామా పరమపదిస్తే మళ్ళీ ఎక్కడ పుట్టాడన్నది తాంత్రికులైన లామాలు కనుక్కొంటారు. ఆ దేశంలోనే ఏదో కుటుంబంలో పుట్టి తీరుతాడని వారి విశ్వాసం. ధ్యానంవల్ల, దివ్యజ్ఞానం వల్ల ఆ పసిబిడ్డను తెలుసుకొన్న తర్వాత దలైలామా వాడిన వస్తువులను ఆ బాలుడు గుర్తించగలడా లేదా అన్నది పరీక్షిస్తారు. పరీక్ష విజయవంతమైతే ఆ బిడ్డను తర్వాతి దలైలామాగా ప్రకటించి - ప్రత్యేకంగా పెంచటం - శిక్షణ ఇవ్వటం - తమ ప్రభువుగా పట్టాభిషేకం చేయటం - మొదలైన కార్యక్రమాలను నిర్వహిస్తారు.

19వ శతాబ్దం మొదట 12వ దలైలామా మరణించిన తర్వాత మత పెద్దలు అన్వేషణ జరిపి అతడెక్కడ ఉదయించింది కనుక్కోగలిగారు. కొద్దిరోజుల వయస్సున్న ఆ పసిబాలుని తెచ్చి - ప్రధాన బుద్ధమందిరంలో ఒక ఉన్నత పీఠం మీద ఉంచారు. ఉన్నట్టుండి ఆ పసివాడు లేచి కూర్చుని పెద్దగా గంభీర

కంఠంతో "నేను బుద్ధుని ఆత్మను. మీ దలైలామాను. పూర్వశరీరం వృద్ధత్వం వల్ల జీర్ణమై శీర్ణమైతే దానిని వదిలి వేసి మళ్ళీ ఈశరీరంతో వచ్చాను" అన్నాడు. ప్రేక్షకులంతా మోకరించి నమస్కరించారు. ఆ సమావేశానికి ఫ్రాన్సు నుండి వచ్చిన ఫ్లోరంటైన్ అనే సైంటిస్టు ప్రత్యేకమైన అభ్యర్థన మీద అనుమతించబడ్డాడు. ఈ దృశ్యాన్ని అతడు నమ్మలేకపోయినాడు. వెంట్రిలాక్విజమ్ వల్ల ఈ మాటలు పుట్టించబడినవేమో అని అనుమానించాడు. దీని సత్యాన్ని పరిశీలించటానికి అనుమతించవలసినదిగా అతడు నిర్వాహకులను బ్రతిమాలాడు. ఎట్టకేలకు వాళ్ళు ఒప్పుకొన్నారు. ఈ ఫ్రెంచి శాస్త్రవేత్త ఆ పసిబాలుని చేతులలో పెట్టుకొని ఇతరుల గొంతులు వినిపించనంత దూరం తీసుకువెళ్ళాడు. ఆ బాలుడు మళ్ళీ స్థిరకంఠంతో ఇంతకు ముందు చెప్పిన మాటలనే మళ్ళీ అన్నాడు. ఆ శాస్త్రవేత్త తాను చూచింది, విన్నది తన మాతృసంస్థకు వ్రాసి పంపించాడు.

అబ్బేహక్ అనే క్రైస్తవ మత ప్రచారకుడు తాను చూచిన ఇటువంటి దృశ్యాలను వ్రాస్తే అతనిని సంస్థనుండి తొలగించారు. మోసెక్స్ అనే పాశ్చాత్యుడు ఇవి దయ్యాల పనులని – దైవ సంబంధము కాదని వ్రాశాడు. జాకస్ డ్యూబియస్ అనే రచయిత 1707లో 15 నెలల పసివాడు అద్భుతంగా మాట్లాడుతుంటే వాటిని దైవవాక్కులుగా భావించిన విషయం ప్రస్తావించాడు.

లాయడ్స్ వారపత్రికలో 1875 మార్చిలో జరిగిన ఒక సంఘటన వ్రాయబడింది. ఫ్రాన్సులోని సార్‌లూయిస్ అనే ఊరిలో ఒక పసిబిడ్డ పుట్టింది. పుట్టిన అరగంటకు ఆ బిడ్డ ఇలా మాట్లాడింది" 1875 మంచి సంవత్సరం కాని 1876 నెత్తుటి యేడుగా ఉంటుంది. ఇది మీకు తెలియ జేయటానికే నేను పంపించబడ్డాను" అని వెంటనే మరణించింది. ఆ మాటలు నిజమైనవి.

ఇటువంటి విశేషాలు అప్పుడప్పుడు గమనించవచ్చు)

యువరాజుగా పద్మసంభవుడు రాజ్యపాలనలో తన కర్తవ్యాన్ని నిర్వర్తిస్తున్నాడు. జుట్టుముడి వేసుకుంటూ ఉండటం వల్ల అతనికి శిఖాబంధరాజు అనే పేరువచ్చింది. అయితే మంత్రిమండలిలో ఉన్న ఒక అమాత్యుడు రాజబంధువు. అతనికి ఎక్కడి నుండో తీసుకు రాబడిన పద్మసంభవుడు రాజు కావటం ఇష్టంలేదు.

తన కుమారుడు రాజు కావాలని అతని కోరిక, పట్టుదల. కాని ఇంద్రబోధి రాజుగా ఉన్నంతకాలం ఏమీ చేయలేదు. అయినా మంత్రిమండలిలో తన బలం బాగా ఉంది కనుక ఎవడో – ఏజాతివాడో తెలియని వాడు తమకు రాజేమిటని అందరికి నూరిపోయటం మొదలుపెట్టాడు. దానికి తోడు పద్మసంభవుడు చిన్న వయస్సులో ఉన్నాడు. ఎక్కువ సమయం ధ్యానంలో గడుపుతుండేవాడు. అప్పుడప్పుడు ఆ నగరం చివర ఉన్న వజ్రపాణిబుద్ధుని ఆలయానికి వెళ్ళేవాడు. బౌద్ధమతం అక్కడ ప్రధానమతం. ప్రజలు చాలా వరకు బౌద్ధులు. అక్కడ వజ్రయాన సంప్రదాయం ప్రబలంగా ఉంది. ఆ గుడిలోని వజ్రపాణిని తాంత్రికులు వజ్రభైరవునిగా ఉపాసిస్తారు. రహస్యంగా బలులిస్తుంటారు. అహింస ప్రధానము – సర్వసంగపరిత్యాగులైన భిక్షుకుల సంప్రదాయము తగ్గి – పంచమకారములు మద్యం, మత్స్యం, మాంసం, మైథునం, ముద్ర వీటితో సిద్ధసాధనలు చేసే వజ్రయాన మార్గం బాగా ప్రచారంలోకి వచ్చింది. పద్మసంభవుడు కూడా దానియందు ఆసక్తి చూపిస్తున్నాడు.

ఇలా ఉండగా తన కుమారుని రాజును చేయాలనుకుంటున్న కుటిల మంత్రి–పద్మసంభవుడు, ఈ గుడికి ఎప్పుడెప్పుడు వెళ్తున్నాడో గమనిస్తున్నాడు. ఒక కృష్ణచతుర్దశిరాత్రి నాడు వజ్రభైరవుని గుడిలో ఉత్సవం జరుగుతున్నది. ఆ రోజు రాత్రి ప్రజలంతా వెళ్ళిన తర్వాత గుడిలో ధ్యానం చేస్తే దివ్యశక్తి లభిస్తుందని తన అనుచరుల చేత పద్మసంభవునకు చెప్పించాడు. సహజంగా సాధకుడైన పద్మసంభవుడు తప్పకుండా అక్కడ ధ్యానం చేయాలని నిశ్చయించుకొన్నాడు. పరివారం అన్ని ఏర్పాట్లు చేశారు. అయితే ఆ సేవకులు దుష్టమంత్రికి వశమై పోయినవారు. ఆ మంత్రి ఆలోచన – పద్మసంభవుడు ధ్యానం చేస్తుండగా తన కుమారుడు వెళ్ళి అతనిని హత్య చేస్తాడు. శవాన్ని తీసుకెళ్ళి రహస్యంగా పారవేసి – ఏమైనాడో తెలియలేదని ప్రకటించి తన కుమారుని రాజునుచేయటం – ఇలా జాగ్రత్తగా ప్రణాళికారచన చేయబడింది.

పద్మసంభవుడు రాత్రివేళ ఆలయానికి చేరుకొన్నాడు. ప్రజలంతా దర్శనం చేసుకొని – అర్చకుల పూజలన్నీ ముగిసిన తర్వాత – భటులు –అందరు వెళ్ళి పోయినారని నిశ్చయం చేసుకొని – ఏకాంతంగా యువరాజు ధ్యానం చేయటానికి

ఏర్పాట్లు చేశారు. పద్మసంభవుడు ధ్యానం మొదలుపెట్టాడు. ఇప్పటికే అనేక దివ్యానుభూతులు కలిగినవి. నిశ్శబ్దంగా నిరామయంగా ఉన్న ఆ దశలో ఉన్నట్లుండి ఒక కంఠం వినిపిస్తున్నది. "నిన్ను చంపటానికి మంత్రి కుమారుడు వస్తున్నాడు. నిన్ను చంపి అతడు రాజుకావాలని కోరుతున్నాడు. ప్రమాదం ముంచుకు వస్తున్నది. నీ వల్ల భవిష్యత్తులో ఎన్నో మహాకార్యాలు జరగవలసి ఉన్నది. నీవు మరణించటానికి వీలులేదు. కనుక కొద్ది నిమిషాలలో అతడు రాగానే వాడి కత్తితో వాడినే నరికి వజ్రభైరవునకు బలి సమర్పించు. తరువాత జరగవలసిన పరిణామాలు జరుగుతవి."

దైవవాణి ఇచ్చిన సందేశంతో జాగరూకుడై ఆ ప్రకారమే చేశాడు పద్మసంభవుడు. వజ్రభైరవ మంత్రోచ్చారణ చేస్తూ మంత్రి కుమారుని బలి యిచ్చాడు. కాసేపటికి బయట ఉన్న మంత్రి అనుచరులు లోపలికి వచ్చారు వాళ్ళు ఊహించింది, ఆశించింది వేరు. జరిగింది వేరు. వెంటనే పద్మసంభవుని చుట్టుముట్టి బంధించి మంత్రిగారికి కబురు చేశారు. ఆయన ఆగ్రహావేశాలతో దుఃఖంతో వచ్చాడు. కుమారుని శరీర ఖండాల మీద పడి శోకించాడు. తెల్లవారింది. పద్మసంభవుడు మంత్రికుమారుని హత్యచేశాడన్న వార్త అంతటా వ్యాపించింది. వృద్ధుడైన మహారాజుకు ఏమి చేయాలో పాలుపోలేదు. కొలువు కూటంలో విచారణ ప్రారంభమయింది. పద్మసంభవుడు హాజరు పెట్టబడ్డాడు. దుష్టమంత్రి మిత్రుడే న్యాయాధిపతి. అతడు సభలో యువరాజును ప్రశ్నించటం మొదలు పెట్టాడు.

**న్యాయాధిపతి :** పద్మసంభవా ! నీ మీద హత్యారోపణ చేయబడింది. దానికి నీ సమాధానమేమిటి ?

**పద్మ:** నేను ఆత్మరక్షణ కోసం చంపవలసి వచ్చింది. పవిత్రమైన సమయం గదా అని ఆలయానికి నేను ధ్యానం చేయటానికి వెళ్ళాను. నా దగ్గర ఏ ఆయుధమూ లేదు. మంత్రికుమారుడు సాయుధుడై ఆలయంలోకి వచ్చి అజాగ్రత్తగా ఉన్న నన్ను చంపటానికి ప్రయత్నించాడు. అలికిడికి కళ్ళు తెరిచాను. ప్రక్కకు తప్పుకొని గత్యంతరం లేక అతనిని సంహరించవలసి వచ్చింది.

**న్యాయాధిపతి :** నీవు నిజంగా ఏకాగ్రస్థితిలో ధ్యానంలో ఉంటే మరొకరి అలికిడి నీకు ఎలా తెలుస్తుంది ?

**పద్మ :** అంతః ప్రబోధం వల్ల

**న్యాయాధిపతి :** దీనికి సాక్ష్యమేమైనా ఉందా ?

**పద్మ :** ఎలా ఉంటుంది !

**న్యాయాధిపతి :** నీవు చెప్పింది నమ్మలేము. ఆయుధం అతడు తెచ్చాడంటున్నావు. నీవే తెచ్చావేమో ? నీవు యువరాజువు. దుస్తులలో దాచుకొని వెళ్ళావేమో ! నిన్నెవరూ పరీక్షించరు గదా ! అతడూ ధ్యానం చేయటానికే వెళ్ళాడని వింటున్నాము. నీకు వ్యతిరేకి అన్న కోపంవల్ల నీవే హత్యచేసి ఆత్మ రక్షణ అని వాదిస్తున్నావేమో ?

**పద్మ :** నాకు శత్రువు లెవరూ లేరు. నేనెవరినీ శత్రువులుగా భావించను.

**న్యాయాధిపతి :** నీవేమి విరాగివా ? బౌద్ధభిక్షువువా ? విరాగివైతే యువరాజుగా ఎందుకున్నావు ? పెండ్లి ఎందుకు చేసుకొన్నావు ?

**పద్మ :** మహారాజు గారి ఆజ్ఞవల్ల. నాకు రాజ్యము, యువరాజు పదవి అక్కరలేదని వారికి విన్నవించుకొన్నాను. ఎక్కడికో తపస్సు చేసుకోటానికి వెళ్తానన్నాను. కాని వారు అంగీకరించలేదు. నన్ను విడుదల చేయలేదు. పెండ్లి చేసి ఈ బాధ్యతలప్పగించారు.

**న్యాయాధిపతి :** నీవు చెప్పిన వాటి సత్యాసత్యాలు తెలియాలంటే మహారాజుగారిని ప్రశ్నించాలి. ఆ అధికారం మాకు లేదు. ఇప్పుడది కాదు. ముఖ్యమైనది. నీవు తాంత్రిక సాధనలు చేస్తున్నావని ఆరోపణలు వచ్చినవి. దానిలో భాగంగా నీవు ఏదో మంత్రసిద్ధి కోసం మంత్రి కుమారుని బలియిచ్చావని అంటున్నారు. కాకపోతే అతడి తలమీద, శరీరభాగం మీద కుంకుమచల్లబడి ఉంది. నిమ్మకాయ ముక్కలకు రక్తము, కుంకుమ అద్ది దేవత ముందుంచబడినవి. దీనిని బట్టి నీవు బలియిచ్చినట్లు స్పష్టంగా నిరూపణ అవుతున్నది.

**పద్మ :** ఆత్మరక్షణ కోసం మాత్రమే చంపాను. ఎలాగూ చంపాను గనుక ఎదురుగా వజ్రభైరవుడున్నాడు గనుక సమర్పణ చేశాను. బలికోసం చంపలేదు. తప్పనిసరి పరిస్థితిలో నరకవలసి వచ్చింది. నేను ఆ పూట ధ్యానంలో

వజ్రభైరవమంత్రం చేస్తున్నాను. ఆగని ప్రవాహంవలె అది సాగుతున్నది. అందువల్ల సంహరించేటప్పుడూ చేశాను తర్వాతా చేశాను. మిగతా పూజ - సహజ పరిణామం.

**న్యాయాధిపతి :** చంపిన తర్వాత ఏ మాత్రం బాధపడకుండా ఈ పూజ చేస్తూ ఉన్నావంటే నీ అసలు తత్వం అర్థమవుతున్నది. నీవు చెప్పేవి నమ్మశక్యంగా లేవు.

**పద్మ :** అది మీయిష్టము. ఇక నేను చెప్పవలసిందేమీ లేదనుకుంటాను.

***

రాజ సన్నిధిలోనే విచారణ జరిగింది గనుక రాజుగారు చూస్తూ ఉన్నాడు. న్యాయాధికారి, మంత్రిమండలి కలసి రాజకుమారుడు నేరస్థుడని ఉద్దేశపూర్వకంగా హత్యచేశాడని తమ అభిప్రాయాన్ని విన్నవించారు. తీర్పు విషయంలో మీ ఉద్దేశమేమిటని రాజు వారిని ప్రశ్నించాడు. శిక్షాస్మృతి ప్రకారం ఉరిశిక్ష వేయాలని అయితే రాజమతమైన బౌద్ధం అహింసా ప్రధానం గనుకను, నేరస్థుడు రాజుగారి పెంపుడుబిడ్డ గనుక దయదలచి దేశబహిష్కార శిక్ష విధించవచ్చునని వారు తెలియచేశారు. వృద్ధమహారాజు ఇంద్రబోధి - నగరంలో పరిస్థితి, మంత్రిమండలి అభిప్రాయము, న్యాయవిచారణ పరిశీలించి తన కుమారుడు నేరస్థుడుకాడని, కారణజన్ముడని తెలిసినా పరిస్థితులకు తలయొగ్గి దేశబహిష్కార శిక్ష విధించాడు.

పద్మసంభవుడు దూరంనుండే మహారాజుకు నమస్కరించి కొలువు విడిచి, ఊరువిడిచి, దేశం విడిచి వెళ్ళిపోయినాడు. దేశసరిహద్దుల వరకు రాజభటులు వెళ్ళి తర్వాత వెనక్కు వచ్చారు. ఇంద్రబోధి మహారాజు తన బంధువులలో ఒకరి కుమారుని దత్తత తీసుకొని రాజుగా ప్రకటించి మానసిక వేదనతో కొద్ది కాలానికే మరణించాడు.

ఇక పద్మసంభవుడు ఓడ్యాణ రాజ్యముదాటి నందనవనం అనే ప్రదేశంలో ఉన్న శ్మశానంలో తీవ్రసాధన ప్రారంభించాడు. తంత్ర గ్రంథాలలో వజ్రభైరవుని సాధన చేసిన తర్వాత వజ్రయోగినీ సాధన చేస్తే మహాసిద్ధి లభిస్తుందని ఉన్న అంశం తెలిసినవాడు గనుక ఆ మంత్ర ప్రక్రియ ప్రారంభించాడు.

వజ్రయోగిని, దశమహావిద్యా తంత్రంలో ఛిన్నమస్త. ఆ దేవత శిరస్సు ఆమె చేతిలో ఉంటుంది. ఆ దేవతను కావ్య కంఠగణపతిముని ఇలా వర్ణించారు.

శ్లో॥ నాభిస్థ శుక్లాబ్జగ సూర్యబింబే
సంసక్త రత్యంబుజ బాణ పీఠే
స్థితాం పదేనాన్యతరేణ సమ్య
గుత్క్షిప్త దీప్తాన్యతరాంఘ్రి పద్మాం

శ్లో॥ దిగంబరాం అర్కసహస్రభాసాం
ఆచ్ఛాదితాం దీధితి పంజరేణ
కంఠస్థలీ భాసురముండమాలాం
లీలాసఖీం దేవజనాధిపస్య

శ్లో॥ ఛిన్నంశిరః కీర్ణకచం దధానాం
కరేణ కంఠోద్గత రక్తధారాం
ధారాత్రయే తత్రచమధ్యధారాం
కరస్థవక్త్రేణ ముదాపిబంతీం

శ్లో॥ పార్శ్వే సఖీం భాసుర వర్ణినీం చ
పార్శ్వాంతరే భీషణడాకినీంచ
అన్యే పిబంత్యావసృగంబుధారే
నిరీక్షమాణాం అతిసమ్మదేన

శ్లో॥ భయంకరాహీశ్వర బద్ధమౌళిం
జ్వల ద్యుగాంతానల కీలకేశీం
స్ఫురత్ ప్రభాభాసుర విద్యుదక్షీం
చండీం ప్రచండాం విదధీత చిత్తే

ఆ దేవత చెలికత్తెలు వర్ణిని, డాకిని. ఆమె కంఠంలో నుండి మూడు రక్తధారలు ఎగసిపడుతుంటే మధ్యరక్తధారను తానే తన చేతిలోని శిరస్సు నందలి నోటితో తాగుతూ ఉంటుంది. మిగతా రెండు రక్తధారలను ఇద్దరు చెలికత్తెలు తాగుతూ ఉంటారు. వర్ణిని విద్యాదేవత –డాకిని యుద్ధదేవత.

శ్లో॥ చండచండి ! తవ యుద్ధపయస్యా
యోగి వేద్య నిజవీర్య రహస్యా
చేతసశ్చ భుజయోశ్చ సమగ్రం
డాకినీ దిశతుమే బలముగ్రం.

ఛిన్నమస్తా ! ప్రచండచండీ ! నీ సంగ్రామసఖి నాకు మానసిక, శారీరక బలమును ప్రసాదించునుగాక ! యోగులు మాత్రమే ఆ తేజోరహస్యాన్ని తెలుసుకోగలరు. అటువంటి ఆ డాకినికి బౌద్ధవాఙ్మయంలో ప్రాధాన్యం ఎక్కువ. డాకిని యొక్క శిరస్సును ఛిన్నమస్త కంఠం మీద ఉంచి ఆమెను వజ్రయోగిని, వజ్రవారాహి అని బౌద్ధ వజ్రయానసాధకులు భావించారని పరిశోధకుల అభిప్రాయము. ఆ సంప్రదాయంలో డాకినులకు చాలా ప్రాముఖ్యముంది. సంగీత సాహిత్యనిధులు, జ్ఞానమూర్తులు, శక్తిస్వరూపిణులు అయిన డాకినులెందరో ఉన్నారు. హిమాలయాలలో తిరిగే యాత్రికులకు అక్కడక్కడ ఎవరూ కనపడకుండా సంగీతం వినిపించటం ఉన్నది. ఆ గానం తాము విన్నామని విదేశ యాత్రికులు చాలామంది వ్రాశారు. పూర్వమెప్పుడో డాకినీ శ్మశానంలో నేను తపస్సాధన చేసిన స్మృతితో ఇలా వ్రాశాను.

హిమగిరిలో త్రివిష్టపము హేరుకదేవుడు నాట్యమాడుచున్
డమరుకనాదముల్ వినుచు డాకినులద్భుతగాన మోహినుల్
భ్రమలను ముంచుచుందురట పాంథుల వారి నుతించి కొల్చితిన్
కొమరుగ వజ్రభైరవుని, కోరి భజించితి క్రోధకాళికన్

వజ్రయోగిని ఇతర రూపాలే వజ్రవారాహి, క్రోధకాళి, క్రోధేశ్వరి, కృష్ణక్రోధిని. ఈమెను శిరస్సు గల ఛిన్నమస్తగా చెప్పవచ్చు. కాలభైరవునిపై అధిరోహించి అరుణవర్ణం గల కాళరాత్రి (కాళి) పురుషాయితం చేస్తూ కూర్చొని ఉంటుంది. వజ్రయోగిని తనకుడికాలును కాళరాత్రి వక్షస్థలం మీద ఉంచి ఎడమకాలుభైరవుని మీద ఉంచి నిల్చుని ఉంటుంది. కుడి చేతిలో వజ్రం, ఎడమ చేతిలో రక్తం నిండిన కపాలం ఉంటుంది. ఆమె ఎడమ భుజం మీద ఖట్వాంగం ఉంటుంది. దానికి డమరుకం వేలాడుతూ ఉంటుంది. ఒక గంట, మూడంచుల జెండా కూడా దానికి ఉంటవి. ఆమె శిరస్సుపై అయిదు కపాలాల కిరీటం అలంకృతమై అలరారుతూ ఉంటుంది. యాభై కపాలాల మాల కంఠంలో

వేలాడుతూ ఉంటుంది. కాంతిమంతమైన ఎర్రని శరీరంతో, మూడు కన్నులతో మహాడాకినియై ఆమె ప్రకాశిస్తుంటుంది.

టిబెట్‌లోని వజ్రయోగిని ఆలయాలలోని విగ్రహాలు, చిత్రాలు వీటిలో భైరవుని మీద ఎడమకాలుంచి నిల్చునట్లు, కుడికాలు కొంచెం ఎత్తి ఉన్నట్లు మాత్రమే కనిపిస్తున్నది. కాళరాత్రి విగ్రహం గాని పురుషాయిత ముద్రగాని కనపడవు. పురుషాయితం చేస్తున్న రతిమన్మథుల మీద అంటే మన్మథుడు క్రింద ఉంటాడు గనుక రతీదేవి మీద ఎడమకాలుంచి నిల్చున్నట్లు ఛిన్నమస్తా వర్ణనలో ఉంది. అలానే కాళీదేవి శివుని మీద ఒక కాలుంచి నిల్చున్నట్లు విగ్రహాలలో, చిత్రాలలో ఉంది. వజ్రవైరోచని, కాళి రెంటి సమ్మిళిత భావన – వజ్రయోగిని అని పరిశోధకుల అభిప్రాయం.

బుద్ధవజ్రధరుడు హేరుకుడై అవతరించి చక్రశంవర తంత్రాన్ని రచించి దానిలో వజ్రయోగినీ సాధన గూర్చి తెలియచేశాడు. ఇది మూడు పంథాలుగా ప్రచారంలోకి వచ్చింది. నారోఖాచోపరంపరలో నరోపా, మైత్రీఖాచో సంప్ర దాయంలో మైత్రీపా, ఇంద్రఖాచో పరంపరలో ఇంద్రబోధి – ఈ దేవతా సాధనలను శిష్యపరంపరకు అందించారు. ఈమెకు సర్వబుద్ధడాకిని అని పేరు. అంటే అందరు బుద్ధుల సారశక్తి స్వరూపం. అనుత్తరయోగ తంత్రంలో, హే వజ్రతంత్రంలో ఇంకా ఇతర గ్రంథాలలో ఈ దేవతాసాధన పద్ధతులు విపులంగా చెప్పబడినవి. గుహ్యసమయసాధనమాల అన్న గ్రంథం ప్రత్యేకంగా ఈ దేవతను గురించి విపులంగా తెలియచేస్తున్నది. వజ్రవారాహిగా ఈమె ప్రియుడు చక్రశంవరుడు. ఆమె ధరించే ఖట్వాంగం అతని సంకేతం. ఆమె ప్రియుడు జన సాగరుడని కొందరు అరుణ అవలోకితేశ్వరుడని కొందరు భావించారు.

బ్రహ్మచారులైన భిక్షుకులలోనే గాక భిక్షుకీ గణం లోపల కూడా ఈ దేవత నుపాసించిన వారు టిబెట్‌లో ఉన్నారు. 15వ శతాబ్దంలో గుంగ్‌దాంగ్ రాజకుమారి మహిళాతుల్కు (ఉపాసిక)గా ప్రసిద్ధి చెందింది. ఆమె పరంపరలో ఎందరో వచ్చారు. దలైలామావలె ఈ ఉపాసికలు మళ్ళీపుడుతుంటారని ఆ సంప్రదాయంలో నమ్మకం. అటువంటి ఒక యోగినిని – 'దోర్జెపాగ్మో'ను 1920లో ఛార్లెస్ ఆల్‌ఫ్రెడ్ బెల్ అనే పాశ్చాత్య యాత్రికుడు చూచి ఈ స్త్రీ లామాల

పరంపరను గూర్చి వర్ణించాడు. శూన్యాకాశంలో నర్తించే దిగంబరసుందరిగా బౌద్ధ గ్రంథా లీదేవతను అద్భుతంగా వర్ణించినవి. వజ్రేశ్వరియైన యీ దేవతను గూర్చి దశమహావిద్యలనే గ్రంథంలో నేను విశదీకరించాను. మహాతపస్వి గణపతిముని ఈమెను ఇలా వర్ణించారు.

**శ్లో॥ వందే వాసవశక్తేః పాదాబ్జం ప్రియభక్తం**
**ప్రాతర్భాస్కరరక్తం పాపధ్వంసన శక్తం**
**హూంకారానలకీలా దగ్ధారాతి సమూహాం**
**విద్యుద్భాసురవీక్షా నిర్ధూతాశ్రితమోహాం**
**దేవస్త్రీనిటలేందు జ్యోత్స్నా లాలిత పాదాం**
**మేఘశ్రేణ్యుపజీవ్య శ్రోత్రాకర్షకనాదాం**
**శక్తీనాం అధిరాజ్ఞీం మాయానాం అధినాథాం**
**చండాం కామపి చండీం గాయా మ్యద్భుత గాథాం....**

ఛిన్నమస్తా తంత్రంలో ఈ దేవతమంత్రాలు చాలా ఉన్నవి.

1) ఓం శ్రీం హ్రీం క్లీం ఐం వజ్రవైరోచనీయే హూం హూం ఫట్ స్వాహా.

2) హూం వజ్రవైరోచనీయేఫట్ స్వాహా.

3) హూం. మొదలైనవి

హూం బీజానికి క్రోధము, కూర్చము, ధేనువు అని సంకేతాలున్నవి. బౌద్ధ తంత్రాలలో ఈ బీజాక్షరాన్ని కొందరు హూంగ్ అని పలుకుతారు. వజ్రయోగినీ మంత్రాలు వారి గ్రంథాలలోనివి చూడండి.

1) ఓం వజ్రయోగిని హూంఫట్ స్వాహా.

2) ఓం ఓం ఓం సర్వబుద్ధ డాకినీయే వజ్రవర్ణనీయే వజ్రవైరోచనీయే హూం హూం హూం ఫట్ ఫట్ ఫట్ స్వాహా.

(వర్ణిని విద్యాదేవత, డాకిని యుద్ధదేవత – వీరిద్దరు వైరోచని సఖులు)

వజ్రమంటే పిడుగు – అశని – పురాణాలలో ఇది ఇంద్రుని ఆయుధం. రుద్రుని ఆయుధాలలో కూడా ఇది ఉన్నది. హనుమంతుని వజ్రాంగబలుడని

వర్ణిస్తారు. (బజ్రంగ్‌బలి) ముసలితనంలేని దృఢశరీరాన్ని వజ్రశరీరమంటారు. ఈ మంత్రసాధన చేసినవారిలో స్వామి విశుద్ధానంద (కాశీ) కావ్యకంఠ గణపతి ముని ప్రసిద్ధులు. ఈ సాధనవల్ల గణపతిముని జీవించి ఉండగానే కపాలభేదనం జరిగి అగ్నిజ్వాలపైకి ఎగచిమ్మింది. దృష్టి మాత్రం చేతనే విశుద్ధానంద ఒక వృక్షాన్ని దహించాడని ఆ శక్తి వజ్రవైరోచనీ మంత్రసాధనవల్ల ఆయనకు లభించిందని ప్రసిద్ధ మంత్రవేత్త నారాయదత్త శ్రీమాలి నా గ్రంధ మొకదానిని ఆవిష్కరిస్తూ పలికారు (పూర్వాశ్రమంలో). దాదాపు ఇరవై సంవత్సరాల క్రింద హరిద్వార్ నుండి ఒక ఆశ్రమాధిపతి నేనున్న గుంటూరులో మాయింటికి వచ్చారు. తాను గణపతిముని శిష్యుడనని వారివద్ద వైరోచనీమంత్రాన్ని ఉపదేశం పొంది సాధన చేస్తున్నాననీ, ధ్యానంలో నా దర్శనానుగ్రహాన్ని పొందిన సిద్ధయోగి గుంటూరులో ఉన్నాడు. వెళ్ళి దర్శనం చేసుకో అంటే వచ్చానని అన్నాడు. సరి !

వజ్రయోగినిని వజ్రవారాహి అని కొందరు భావిస్తారని చెప్పటం జరిగింది. వరాహము అంటే పంది. పందిముఖం గల దేవత వారాహి. బౌద్ధులు కొందరు వజ్రవారాహీ సాధన చేశారు. వజ్రయోగిని సుందరముఖం గల దేవత. వర + అహ అన్న శబ్దముల అర్థంలోకి వెళ్ళి వారాహి అన్నా శ్రేష్ఠ తేజస్విని– సుందరవనిత అని చెపితే చెప్పవచ్చు. ఒకసాధకుడు ఇంటర్‌నెట్‌లో వజ్రయోగిని మంత్రసాధన వివరాలు పెడతానంటే అతని గురువు యోగి చెన్ అంగీకరించలేదు. అయితే ఈ సాధకునకు ఒక రోజు కలలో చిన్న పందిపిల్ల వచ్చి కుడిచేతిని కొరికినట్లు కనిపించింది. ఆ విషయం విన్న తర్వాత యోగిచెన్ అంగీకరించాడు. ఆయన వివరణ “వజ్రయోగిని కిరీటం మీద వరాహ చిహ్నం ఉంటుంది. కలలో కుడిచేతిని కరిచినట్లు కనిపించటమంటే వ్రాయటానికీ, ప్రకటించటానికీ అంగీకరించినట్లు” అని. కనుక వజ్రయోగిని వరాహముఖంతో గాక మకుటంమీద ఆ చిహ్నంతో ఉంటుందనటంవల్ల బౌద్ధుల దృక్పథం స్పష్టమైంది. మా కుర్తాళ సిద్ధేశ్వరీపీఠ స్థాపకుడు మౌనస్వామి పూర్వజన్మలో హిమాలయ గుహలో వజ్రవారాహీ సాధన చేసి మూడువందల యేండ్లు జీవించినట్లు ధ్యానదర్శనంలో తెలియజేశాడు. మహాయోగి పద్మసంభవుడు ఈ సాధన చేసి సిద్ధత్వాన్ని సాధించినట్లు బౌద్ధ గ్రంథాలు స్పష్టం చేస్తున్నవి. అయితే ఆయన వామాచార,

శ్మశానాచార మార్గాన్ని అనుసరించి తీవ్రసాధనవల్ల వజ్రయోగిని కృప పొందగలిగాడు. దిగంబరుడై జుట్టు విరియబోసుకొని చితాభస్మాన్ని శరీరమంతా పూసుకొని రాత్రింబగళ్ళు వజ్రయోగినీ మంత్రాన్ని చేస్తున్నాడు. నెలలు గడుస్తున్నవి. దీక్షతో సాధన చేస్తూ అతడిలా భావిస్తున్నాడు.

**శ్లో॥ ఇహాసనే శుష్యతుమేశరీరం**
**త్వగస్థిమాంసాణి లయంచయాంతు**
**అప్రాప్యబోధంబహుజన్మ దుర్లభం**
**నావాసనాత్ కాయ మతశ్చలిష్యతి.**

**కూర్చుండిన స్థలములోనె కూలిన కూలుదును గాక !**
**ఎముకల గూడువలె మారి ఎండిన ఎండుదును గాక !**
**నామాంసము, నా చర్మము, నా దేహము శిథిలమైన**
**నిను వీడను నినువీడను నినుచూడక నే వదలను**

వజ్రయోగినీ ! వైరోచనీ ! అనుగ్రహించు. నీవు కాళివి, నీవు తారవు. నీవే ఛిన్నమస్తవు - ప్రచండ చండికవు. కాలభైరవుని శక్తివి నీవు. త్రినేత్రవై, కపాలమాలాధారిణివై రక్తపానం చేస్తున్న నిన్ను భజిస్తున్నాను.

**నమామి భైరవారూఢాం ఖడ్గఖర్పరధారిణీం**
**రక్తపానమహాక్రూరాం ముండహారాం దిగంబరాం**
**వరాహచిహ్నా విలసత్ కిరీటాం బుద్ధడాకినీం**
**వీరేణసురతాసక్తాం వందేహం వజ్రయోగినీం**

ఆకాశంలో నిరాలంబమైన ప్రదేశంలో నీవు నాట్యం చేస్తుంటే భైరవుడు తన శరీరం మీద నిలబడమని ప్రార్థించాడు. అందుచేత భైరవారూఢవై గగన నర్తకివై విరాజిల్లే నిన్ను వీరాచారపరులు శృంగారమూర్తిగా ఉపాసిస్తారు. నీవు వజ్రవైరోచనివి కృష్ణక్రోధినివి. క్రోధబీజమైన హూంకారము నీమూర్తి. యోగనాయికవు నీవు. కరుణామయీ ! సాక్షాత్కరించు నీకోసం క్షణమొక యుగంగా ఎదురు చూస్తున్నాను.

**శ్లో॥ దేహేనదుర్వార తపః కృశేన**
**భావేన నిర్యత్న సమాధి గేన**

**సదా సమీక్షే తవ మూర్తిమగ్రే**
**కృపాంనిరీక్షే తవ వజ్రనాథే!**

తపస్సుతో శరీరం కృశిస్తున్నది. మనస్సు అప్రయత్నంగా సమాధిస్థితిలోకి వెళ్తున్నది. మాతా ! నీకరుణకోసం నిరీక్షిస్తున్నాను.

**శ్లో॥ ప్రచండచండీం తపసాజ్వలంతీం**
**మంత్రేశ్వరాణాం వచసి స్ఫురంతీం**
**త్వాం యోగినీం వజ్రతనౌ నటంతీం**
**నమామి దేవీం గగనేచరంతీం**

తపస్సుతో జ్వలిస్తూ మాంత్రికుల వాక్కులలో ప్రకాశిస్తూ వజ్రశరీరంతో ఆకాశంలో నాట్యం చేసే యోగినివి నీవు దేవీ ! అనుగ్రహించు !

**శ్లో॥ ప్రక్షాళితం సత్తపసా సమస్తం**
**క్షేత్రీకృతం పాత్రమిదంశరీరం**
**తవావతరాయ సురాధినాథే!**
**మహోమహాశ్శక్తి విజృంభణాయ**

తపస్సు చేత నా దోషములు ప్రక్షాళితమైనవి. నా శరీరం నీ అవతరణకు తగిన క్షేత్రమైంది. మహాశ్శక్తితో విజృంభించి నాలోనికి రా తల్లీ !

ఈ విధంగా ప్రార్థిస్తూ జపం ధ్యానం చేస్తున్నాడు. ఒకరోజు ప్రక్క గ్రామం వారు చనిపోయిన ఒక కన్యశవం తీసుకువచ్చారు. వారి ఆచారం ప్రకారం ఖననం చేసి వెళ్ళిపోయినారు. శవం మీద కూర్చుని రాత్రివేళ జపం చేస్తే తీవ్ర విద్యలు వేగంగా సిద్ధిస్తవని తెలిసినవాడు గనుక వాళ్ళు వెళ్ళిన తర్వాత ఆ రాత్రి పూడ్చిపెట్టిన చోటు దగ్గరకు వెళ్ళాడు. ఆ స్థలం మీద ఆసీనుడై గాఢనిష్ఠతో మంత్రధ్యానం చేస్తుండగా అర్ధరాత్రి అయ్యేసరికి కూర్చున్న చోట ఏదో కదలిక కలిగింది. ఏమా అని చూస్తే తన క్రిందనే సంచలనం. క్రింద ఉన్న శవం కదులుతున్నది. ఆశ్చర్యం కలిగింది. మట్టి పెళ్ళగించి చూచాడు. శవం కళ్ళు తెరిచింది. శరీరంలో చలనం వచ్చింది. కళ్ళు జిగేల్‌మని మెరుస్తున్నవి. శవం మాట్లాడుతున్నది. "పద్మసంభవా ! నీ సాధనకు సంతృప్తి చెందాను. నిన్ను

అనుగ్రహించటం కోసం ఈ కన్యశరీరంలోకి ప్రవేశించాను. నన్ను రతిక్రీడతో సంతోషపెట్టు. ఫలితంపొందు" పరమేశ్వరియైన వజ్రయోగిని ఆజ్ఞ. ఆమె ఆజ్ఞాపించినట్లు చేయటానికి పూనుకొన్నాడు. తానెలాగూ దిగంబరుడుగానే ఉన్నాడు. ఆ కన్యవస్త్రములు తొలగించాడు. అద్భుత సౌందర్యరాశి - నాన్యోపభుక్తనవ యౌవన భూరిసార. ఆ మోహనమూర్తితో మనసు తీర శృంగార కేళీ విహారం చేశాడు. ఆమె అర్ధనిమీలిత నేత్రాలతో పరవశించింది. కొద్ది క్షణాలు అలా ఉండి మళ్ళీ మదోన్మత్తవలె లేచింది. అతనితో పురుషాయితం ప్రారంభించింది.

**శ్లో॥ వల్గత్ కుచం వ్యాకులకేశపాశం**
**స్విద్యన్ముఖం స్వీకృత మందహాసం**
**పుణ్యాతిరేకాత్ పురుషా లభంతే**
**పుంభావ మంభోరుహ లోచనానాం.**

స్తనములు ఊగుతూ ఉండగా కేశములు చిందర వందరకాగా ముఖమున చెమట పట్టగా చిరునవ్వుతో తనను చూస్తూ ఉపరిసురతం చేస్తున్న ఆ దేవతను ఆశ్చర్యంతో, ఆనందంతో విప్పారిన కన్నులతో పరికిస్తున్నాడు పద్మసంభవుడు.

**శ్లో॥ శ్మశానస్థే చితాతల్పే శవదేహే సముత్థితాం**
**మయా ప్రవీర భావేన ప్రహృష్టాం వరదాయినీం**
**శృంగార భావ సంపూర్ణాం మారయుద్ధం ప్రకుర్వతీం**
**భజే భగవతీం దేవీం ప్రసన్నాం వజ్రయోగినీం**

అలా స్తుతిస్తున్న పద్మసంభవునితో ఆ దేవత పలికింది. "పద్మసంభవా! నేను సంతృప్తి చెందాను. నీకు అద్భుతమైన సిద్ధశక్తులను అనుగ్రహిస్తున్నాను. అంతేకాదు. నీ జీవిత సాధనమార్గం ఇకముందు ఇదే. పంచాగ్ని మధ్యంలో నిలబడి సూర్యుని చూస్తూ, చలికాలం గొంతులోతు చన్నీళ్ళలో నిలబడి జపిస్తూ ఏకపాద అంగుష్ఠం మీద నిలబడి ఊర్ధ్వ బాహులై అచంచలమైన దీక్షతో తపస్వులు ఏది సాధిస్తారో దానిని నీవు శృంగారమార్గంలో సంపాదిస్తావు. ఋషులు పొందే బ్రహ్మానందం నీవు ఈ కామసాధనమార్గంలో పొందుతావు.

ఎందే దెందము కందళించు రహిచే ఏకాగ్రతన్ నిర్వృతిన్
చెందున్ కుంభగత ప్రదీపకళికా శ్రీదోపనెందెందు టో
కెందే యింద్రియముల్ సుఖంబుగను నా యింపే పరబ్రహ్మ మా
నందో బ్రహ్మ యటన్న ప్రాజ్ఞుదువు సంతర్పుద్ధి నూహింపుమా !
(మనుచరిత్ర)

బ్రహ్మానంద – దివ్యానుభూతి పొందటంతో పాటు ప్రకృతిని శాసించగల శక్తులెన్నో నీ వశమవుతవి. నేను సర్వబుద్ధ డాకినిని. ఇకముందు కొందరు డాకినీ లక్షణం గల స్త్రీలు నీ జీవితంలో ప్రవేశిస్తారు. వారు కన్యలా ఇతరుల భార్యలా అదే విచారణ నీకు పనిలేదు. మంత్రసహితమైన మైథున సాధన వారితో చెయ్యి. దివ్యశక్తుల మహత్వం పెరుగుతుంది. అయితే స్త్రీల కారణంగా వారి తండ్రులు, భర్తలు, బంధువులు –ఇంకా ఎందరితోనో శత్రుత్వం వస్తుంది. అయినా ఫరవాలేదు. నీవు జయిస్తావు. ఇప్పుడు నేను ప్రవేశించిన ఈ కన్య శరీరం మట్టిలో శిథిలం కాకూడదు. దీనిని తీసుకెళ్ళి ప్రక్కనే ఉన్న నదిలో విడిచిపెట్టు.

ఇక్కడ నుండి బయలుదేరి సీతావన, పరుషక వన, దానభూమి ద్వీప శ్మశానాలలో సాధన చెయ్యి. అక్కడ మరికొన్ని విశేషాలు పొందగలవు".

వజ్రయోగిని ఆజ్ఞాపించిన ప్రకారం ఆ యువతి శరీరాన్ని నదిలో నిమజ్జనం చేసి నిర్దిష్ట ప్రదేశాలలో తీవ్రసాధన చేశాడు. అచట ఇద్దరు డాకినులు సాక్షాత్కరించి వరము లిచ్చారు. డాకినులకు ఒక రహస్య భాష ఉంది. దాని నతడు తెలుసుకోగలిగాడు. దాని వల్ల చాలా ప్రయోజనాలు చేకూరినవి. ఆ భాషలోని గుహ్య మంత్రవిద్యలను అభ్యసించగలగటం, ఏ ప్రదేశంలోనైనా డాకినులను చూచి మాట్లాడగలగడం వచ్చింది. విశేషించి నాగవశీకరణ శక్తి లభించింది. క్రూరమృగములను భూతప్రేతములను శాసించగల ప్రభావం ప్రాప్తించింది. అరణ్యాలలో కొండలలో తిరగేటప్పుడు ఈ శక్తుల అవసరం ఎంతైనా ఉంది.

పద్మసంభవుడిప్పుడు సిద్ధవిద్యలు నేర్చినవాడు. వజ్రయోగిని కృపవల్ల తన జీవిత మార్గము గమ్యము తెలిసినవి. మహనీయమైన బుద్ధధర్మాన్ని ప్రచారం

చేయటం తన లక్ష్యం. ఆ లక్ష్యం నెరవేరాలంటే బౌద్ధ వాఙ్మయం మీద పట్టు సాధించాలి. బుద్ధ డాకిని కృపవల్ల తానిప్పుడు ఏక సంధాగ్రాహి. ఎక్కడ బుద్ధ భగవానుడు తపస్సుచేశాడో, ఎక్కడ దివ్యజ్ఞానస్వరూపుడైనాడో ఆ బుద్ధగయకు బయలుదేరి వెళ్ళాడు. పట్టణంలో ప్రవేశిస్తూనే కనిపిస్తున్న సంఘారామంలోకి వెళ్ళాడు. ప్రయాణశ్రమ తీర్చుకొన్న తర్వాత అక్కడివారు ఆ ఆశ్రమాధిపతి దగ్గరకు తీసుకు వెళ్ళాడు.

ఆశ్రమాధిపతి : నీవెవరు ? ఎక్కడి నుండి వస్తున్నావు ?

పద్మసంభవుడు : ఆర్యా ! దీనికి రెండు రకాల సమాధానాలు చెప్పవచ్చు. లౌకికము, అలౌకికము.

ఆశ్ర : రెండూ చెప్పు.

పద్మ : ఓడ్యాణదేశాధిపతి ఇంద్రబోధిమహారాజు దత్తపుత్రుణ్ణి ఇది లౌకిక విషయం. రెండవది నేను సమంతభద్రుణ్ణి. ఇప్పటి పేరు పద్మసంభవుడు.

ఆశ్ర : మొదటి అంశం నీ పరిచయం. బాగుంది. నీవు సమంతభద్రుడ వేమిటి? ఎవరైనా నవ్వుతారు. భగవంతుడైన బుద్ధుడొక్కడే సమంతభద్రుడు.

పద్మ : చిన్నప్పటి నుండి నా స్ఫురణ అది. దానికేమి ? పెద్దవారు మీరు. బౌద్ధ గ్రంథాలు అధ్యయనం చేద్దామని వచ్చాను. మార్గదర్శనం చేయండి.

ఆశ్ర : తప్పకుండా! అయితే ఇక్కడి మా ఆశ్రమం ధ్యాన ప్రధానమైన కేంద్రం. కొంత విద్యాబోధన కూడా ఉంది. నగరంలో విజ్ఞాన కేంద్రాలున్నవి. నీ నేర్చిన, నేర్వవలసిన దానిని బట్టి నిర్ణయించుకోవచ్చు.

పద్మసంభవుడు అక్కడి నుండి నగరంలోకి వెళ్ళి ఒక సంఘారామంలో నివాసం ఏర్పరచుకొన్నాడు. ప్రజల ఆదరణవల్ల, రాజపోషణవల్ల, యాత్రికుల కానుకలవల్ల విద్యార్జన కోసం, తపస్సు కోసం వచ్చినవారికి వసతి భోజనముల

లోటు లేదు. అక్కడి వాతావరణాన్ని గమనించాడు. సిద్ధశక్తులు, మహిమలు చూపించే వారి యందు ప్రజలకు భక్తి ఉంది. కష్టాలు తీరటానికి ఆశ్రయిస్తారు. కానుకలిస్తారు. అయితే పెద్ద సంఘారామంలో వందల వేల విద్యార్థులుంటారు. త్రిపిటకాదులను బోధించే ఆచార్యులుంటారు. మతచర్చలు, విద్యాగోష్ఠులు నిరంతరం జరుగుతూ ఉంటవి. శైవ, వైష్ణవ, శాక్తేయాదిమతాలను వైదిక సంప్రదాయాన్ని ఎదుర్కోటానికి కావలసిన పాండిత్యాన్ని సంపాదించటంలో విద్యార్థులు నిమగ్నులై ఉంటారు. జపధ్యాన సాధనల కక్కడ ప్రాధాన్యం కనిపించలేదు.

పద్మసంభవునకు ఆశ్చర్యం కలిగింది. ఎంతటి మహాపండితుడైనా ఒక క్షుద్రమాంత్రికుడు వాకట్టు కట్టితే – ఏమి వాదించగలడు ? చిన్న ప్రయోగాన్ని కూడా తట్టుకొనే శక్తి లేని వీరు ఎంతవరకు నిలబడగలరు ? కాపాలికులు, శాక్తేయులు రకరకాల వాళ్ళున్న ఈ సమాజంలో చిత్రమైన పరిస్థితి. ఎవరూ శక్తిని మంత్రప్రభావాన్ని గురించి ఆలోచించటం లేదు. బౌద్ధమతం ప్రారంభమైంది బుద్ధుని మహత్వం వల్లనే అన్న అంశాన్ని వీళ్ళు గుర్తించటం లేదు.

సిద్ధార్థ గౌతముడు బుద్ధత్వాన్ని పొందిన తర్వాత ప్రయాణిస్తూ త్రోవలో ఒక పెద్ద యజ్ఞశాలను చూచాడు. కొన్ని వందల జంతువులు యజ్ఞశాలలో చంపబడటానికి సిద్ధం చేయబడటంచూచి ఆయన హృదయం ద్రవించిపోయింది. యజ్ఞాన్ని చేస్తున్న ఆశ్రమాధిపతి మహాకాశ్యపుని దగ్గరకు వెళ్ళాడు. మహాకాశ్యపుడు పదివేలమంది శిష్యులకు అన్నంపెట్టి విద్యబోధించే కులపతి. ఈ జంతుహననం పాపమని యజ్ఞం మానుకోమని బుద్ధుడు కోరాడు. యజ్ఞంలో వధ హింసకాదని క్రతువు ఆగదని కాశ్యపుడు స్పష్టం చేశాడు. హింసను ఆపి తీరాలన్న పట్టుదలతో బుద్ధుడు నా అనుమతి లేక యజ్ఞంలో అగ్ని వెలగదని అన్నాడు. ఆయన అన్నట్లే అగ్ని ఎంత ప్రయత్నించినా వెలగలేదు. దిగ్భ్రాంతి చెందిన మహాకాశ్యపుడు బుద్ధునకు శరణాగతుడై శిష్యుడైనాడు. ఆనాటికాలంలో అతనిని మించిన పండితులు లేరు. అతడు బౌద్ధమతానికి పట్టుగొమ్మగా నిలిచి అన్ని ఇతర మతాల వాళ్ళను గెలిచిపెట్టాడు. దీనికి మూలకారణం బుద్ధుడు చూపించిన చిన్న మహిమ. అది తెలిసి కూడా దానికి ప్రాముఖ్యం ఇవ్వటం లేదు.

ఏదైనా తన కర్తవ్యం తాను చేయాలి. ఆనాడు బుద్ధ గుహ్యాచార్యుడు, శ్రీ సింహాచార్యుడు సుప్రసిద్ధులైన బౌద్ధ ధర్మవేత్తలు. వారి దగ్గర పద్మసంభవుడు అధ్యయనం చేసి విద్యలో పరిపూర్ణత సాధించాడు. ఇంకా ఎందరినో విద్వాంసుల నాశ్రయించి శాస్త్రరహస్యాలు తెలుసుకొన్నాడు. ప్రభాహస్తి అనే విద్వాంసుని దగ్గర కీలకమైన విద్యలెన్నో నేర్చుకొన్నాడు. ఎన్నో ప్రదేశాలకు, ఎన్నో ప్రాంతాలకు – ఎచట పండితులుంటే అచటికి వెళ్ళి బౌద్ధధర్మానికి సంబంధించిన సమస్త శాస్త్రాలలో అనుపమానమైన ప్రజ్ఞ సంపాదించాడు. ఈ యాత్రలో ఒక చోట "కుంగామో" అనే మహాయోగినిని గూర్చి విని ఆమె దర్శనానికి వెళ్ళాడు. ఆ గ్రామస్థులు చెప్పిన దాని ప్రకారం ఆమె ఆ ఊరిలో ఎంతకాలం నుండి ఉంటున్నదో ఎవరికీ తెలియదు. అరవై యేండ్ల వయస్సులో ఉన్నట్లు కనిపిస్తున్న ఆ యోగినిని ఇప్పటి వారి తాతలు వారి తాతల కాలం నుండి ఉన్నట్లు చెప్పేవారట. దీర్ఘాయువు సాధించిన ఆ మహాత్మురాలెవరో చూచి తీరాలి. ఇలా ఆలోచించి పద్మసంభవుడు ఆమె దర్శనానికి వెళ్ళాడు. చిన్న ఆశ్రమము. పెద్ద హంగామా యేమీ లేదు. కొద్దిపాటి పరివారం. అక్కడికి చేరుకొనేసరికి మధ్యాహ్న భోజన సమయం అవుతున్నది. ఒక కార్యకర్త ఇతనిని చూచి "మీరేనా పద్మసంభవులు" అని అడిగాడు. అవునని అనగానే అతడు "మాతాజీ మీరు వస్తారని చెప్పింది. మీకు ప్రత్యేకంగా ఒక కుటీరం ఏర్పాటు చేయబడింది. వసతి భోజనం అన్నీ సిద్ధంగా ఉన్నవి. ఈ పూట దర్శనాలు అయిపోయినవి. సాయంకాలం మీరు అమ్మగారిని చూడవచ్చు" అన్నాడు. తాను వస్తానని ఎవరితోను చెప్పలేదు. తనరాక విషయం ముందే తెలుసుకొన్న యోగిని అంటే ఆమె సామాన్యురాలు కాదు. పద్మసంభవుడు భోజనం చేసి విశ్రాంతి తీసుకొని దర్శనానికి వెళ్ళాడు. ఆమెను చూడగానే శరీరం జలదరించింది. పెద్దపాక. ఇరవై ముప్పైమంది కూర్చుని ఉన్నారు. దగ్గరకు వెళ్ళి నమస్కరించి వెనుకకు వెళ్ళి భక్తుల వెనుక గోడనానుకొని కూర్చుని ధ్యానం చేయటం మొదలు పెట్టాడు. ఈమె ఎవరు ? ఈమె శక్తి యేమిటి ? తెలుసుకోటానికి ఎంత ప్రయత్నించినా ఏమీ తెలియటం లేదు. నిరామయమైన ఆకాశంలో ఒక పెద్ద వెలుగు మాత్రం కనిపిస్తున్నది. దివ్యచక్షువు వికసించిన వాడు. భూతప్రేతములను దేవతలను చూడగలవాడు. తన దివ్యదృష్టి ప్రభావం ఏమయింది ? నెమ్మదిగా కళ్ళు

తెరిచాడు. భక్తులందరూ వెళ్ళిపోయినారు. ఆమె కూర్చునే ఉంది.తన వైపు చూస్తున్నది. "పద్మసంభవా ! నీయంతటి విజ్ఞానవేత్త, పండితుడు, మంత్రసిద్ధుడు – నా కుటీరానికి రావటం చాలా సంతోషంగా ఉంది. బౌద్ధ ధర్మపరిజ్ఞానంలో పరిపూర్ణత సాధించావని ఆచార్యులనుకొంటుంటే విన్నాను. బౌద్ధమత ప్రచారానికి నీవల్ల భవిష్యత్తులో కావలసిందెంతో ఉంది. ధర్మప్రచారానికి పాండిత్య మొక్కటే చాలదు. భౌతికంగా ఎదుర్కొని దండించటానికి, చంపటానికి ప్రయత్నించే దుష్టులుంటారు. మరొక వర్గం భూతప్రేత పిశాచశక్తులు సాధించి స్తంభన మారణాదులతో నాశనం చేయటానికి పూనుకొనే క్షుద్రమాంత్రికులుంటారు. పూర్వయుగాలలో కేవలం చూపుతో సంకల్పంతో, హుంకారంతో ఎదిరించిన వారిని భస్మంచేసే ఋషులుండేవారు. ఇది కలియుగం. మానవుల శక్తులు పరిమితమైనవి. అయినా నీవు భౌతిక, అభౌతిక శక్తులను జయించగల అద్భుత ప్రభావాన్ని సాధించాలి. ఇప్పటికి కొంత సాధించావు. కానీ ఇంకా సాధించవలసింది చాలా ఉంది. దానిలో నా పాత్ర కొంత ఉంది. అదేమిటో ఈ రోజు రాత్రి నీకు తెలుస్తుంది. ఈ నిశాసాధన నీవింతకు ముందు చేసిన పద్ధతిలోనే ఉంటుంది. రాత్రి మొదట జాము దాటిన తర్వాత ఎదురుగా ఉన్న తోటలోని నా ధ్యానమందిరంలోనికి రా ! ఆ తోట పేరు ఆనందవనం. కాశీకి ఆనందవనమని పేరు. అక్కడ భైరవుడు నాట్యం చేస్తుంటాడు. ఇదీ అటువంటిదే. ఆ మందిరంలో మిగతావిశేషాలు తెలుసుకొంటావు" అని ఆమెలోపలికి వెళ్ళిపోయింది. పద్మసంభవునకు ఆశ్చర్యం కలిగింది. తానామెను గూర్చి ఏమీ తెలుసుకోలేక పోయినాడు. ఆమె వ్యక్తిత్వం, మహత్వం ఊహలకందటం లేదు. ఆమె దీర్ఘాయువు యొక్క రహస్యమేమిటో ! ఈ రాత్రి నేనింతకు ముందు చేసిన పద్ధతిలోనే సాధన చేయాలని అన్నది. నందనవనంలో శ్మశానసాధన, శవంలో ఆవేశించిన వజ్రయోగినీ దేవతతో రతిసాధన చేశాడు. ఈ ఆనందవనంలో కూడా అలానేనా? ఈమెతోనా ? ఈమె వార్ధక్యం ముసలితనం ప్రవేశించిన పెద్దావిడ. ఈ వృద్ధురాలితో సురతక్రీడా ? ఏమో ? ఏం జరుగనున్నదో !

అతడు ఇలా ఆలోచిస్తూ భోజనశాలలోకి వెళ్ళి అల్పాహారం తీసుకొని తన కివ్వబడిన కుటీరంలోకి వెళ్ళి వజ్రయోగినీ మంత్ర జపం చేస్తూ కూర్చున్నాడు. ప్రథమయామం పూర్తి కాగానే బయటకు వచ్చి చూచాడు. కటిక చీకటి.

నెమ్మదిగా బయలుదేరి తోటలోని ధ్యానమందిరానికి చేరుకొని ఓరగా వేసి ఉన్న తలుపు తీసుకొని లోపలికి వెళ్ళాడు. చక్రశంవరుడైన అవలోకితేశ్వరునితో రతిక్రీడలో ఉన్న వజ్రయోగిని వర్ణచిత్రం పెద్దది గోడమీద కనిపిస్తున్నది. సుగంధభరితమైన అగరుధూపపువాసన గదిఅంతా వ్యాపించి ఉన్నది. మల్లెపూల మాలలు వేలాడుతున్నవి. శృంగారోద్రేకాన్ని కలిగించే వాతావరణం. ఇంతలో లోపలిగదిలో నుండి యోగిని కుంగామో వచ్చింది. పద్మసంభవుడొక్కసారి దిగ్భ్రాంతికి లోనైనాడు. ఆమెను చూస్తుంటే ఇరవై యేండ్ల యౌవనవతిగా ఉంది. ముఖాన్ని బట్టి గుర్తుపట్టటమే తప్ప లేకపోతే ఎవరో కొత్త యువతి అనుకోవలసివస్తున్నది. మెడలో ఎర్రని కెంపులమాల ప్రకాశిస్తున్నది. దివ్యలోకం నుండి దిగివచ్చిన అప్సరస. సందేహం లేదు. రాత్రివేళ వయసులోని యౌవనవతిగా మారే మంత్రవిద్యలున్నవని విన్నాడు గాని చూడలేదు. ఆమె చిరునవ్వు నవ్వింది. వెన్నెలలు కురిసినట్లుంది. పద్మసంభవా ! గుర్తుపట్టావు గదా ! నీ కోసం జవరాలినైనాను. నీ సాధనకు సహకరించాలని, సహాయం చేయాలని సిద్ధాదేశం వచ్చింది. అందుకే ఆహ్వానించాను. వజ్రయోగినీ దేవి అనుగ్రహం పొందినవాడవు. కామసాధనలో నీ సిద్ధియెంతో చూడాలనుకొంటున్నాను. రా ! అని ఆహ్వానించింది. ఉద్రేకాన్ని కలిగించే ఆమె చూపులు సమ్మోహకమైన ఆమె రూపం అతనికి మన్మథావేశాన్ని కలిగించినవి. ఆమె వస్త్రాలను తొలగించుకొన్నది. పాలరాతి శిల్పంవలె పరిపూర్ణమైన అవయవాలతో కుంభస్తనియై విరాజిల్లుతున్న ఆ జగదేకసుందరిని చూచి తాను దిగంబరుడై దగ్గరకు వెళ్ళి కౌగలించుకోబోయినాడు. ఆమె శరీరాన్ని తాకగానే ఏదో విద్యుద్ఘాతం తగిలినట్లయింది. ఎగిరి వెనక్కుపడ్డాడు. లేచి చూచుకొన్నాడు. శక్తిహీనుడైనట్లు తోచింది. నపుంసకుడనైనానా అనిపించింది. ఆమెలో ఏవికారమూ లేదు. "పద్మసంభవా ! మంత్రసిద్ధుడవు. ఏమయింది? అలా దిగాలుపడినిలుచున్నావేమిటి?" అన్నది. అతడు "మహాదేవీ ! నీవెవరు ? నా సిద్ధశక్తులేవీ పనిచేయటం లేదు. ఇంతకు ముందు ధ్యానంలో చూచాను. నీవెవరో తెలుసుకోలేకపోయినాను. నీ ముందు నా శక్తి చాలా అల్పమైనది. నా యందు దయతో సహాయం చేసి నన్ను తీర్చిదిద్దవలసినదిగా ప్రార్థిస్తున్నాను" అన్నాడు. కరుణార్ద్రమైన మందహాసం ఆమె ముఖంలో విలసిల్లుతున్నది. "తరుణుడా! నీ శక్తి నీకు తెలియాలనే ఇలా చేశాను. నాతో క్రీడించటం సామాన్యం కాదు.

కాని నేను పిలిచింది నిన్ను అవమానించటానికి కాదు. జగన్మాత వజ్రేశ్వరి, బుద్ధడాకిని, నిన్ను బౌద్ధ ధర్మప్రచారకునిగా, రక్షకునిగా రూపొందించమని ఆజ్ఞాపించింది. తపస్సు చేస్తే దేవతలు సాక్షాత్కరించి తపస్సుకు తగినంత వరము లిస్తారు. వజ్రయోగిని నిన్ను కరుణించింది. కనిపించి కొన్ని శక్తులిచ్చింది. కాని నీ కర్తవ్య నిర్వహణకు అవి చాలవు. నీవు అజేయుడవు, మృత్యుంజయుడవు కావాలి. దానికి సుదీర్ఘకాలం తపస్సు చేయాలి. అది అవసరం లేకుండా నేను సహాయం చేస్తాను. ఇప్పుడు నాపాదాల దగ్గర కూర్చో. ఏం జరుగుతుందో చూడు. పద్మసంభవుడు ఆమె చెప్పినట్లే చేశాడు. కుంగామో అతని భ్రూమధ్యాన్ని తన వేలితో స్పృశించింది. కళ్ళుమూసుకొన్న అతనికి ఏం జరుగుతున్నదో అర్థం కాలేదు. అపారమైన విద్యుత్తు తనలోకి ప్రసరిస్తున్నది. శరీరమంతా దహనమవుతున్నది. ఇప్పుడు తనకు శరీరం లేదు. ఒక జ్వాల. అది కూడా నిలవటం లేదు. కుంగామోలోకి వెళ్ళిపోతున్నది. ఆమె నోటిలో నుండి శరీరంలోకి ప్రవేశించింది.

**శబ్దం వినా నైవ కదాపి తేజః**
**తేజో వినా నైవ కదాపి శబ్దః**

శబ్దము లేక తేజస్సు లేదు. తేజస్సు లేక శబ్దము లేదు. తాను పంచభూతాత్మకమైన స్థితి నుండి తేజస్సుగా మారి – ఇప్పుడు ఆ స్థితి కూడా పోయి శబ్దంగా మారాడు. హూంకారం వినిపిస్తున్నది. తానే నాదం. తనను తానే వింటున్నాడు. తనను తానే చూస్తున్నాడు. చూడటానికి ఏముంది ? చూస్తున్నానని అనుకోవటం తప్పు. ఎంతసేపు, ఎన్నిగంటలు, ఎన్నినెలలు, ఎన్ని సంవత్సరాలు ఈ దశలో గడిచినవో మళ్ళీ అదే పరిణామంలో వెనక్కు వస్తున్నాడు. నెమ్మదిగా పంచభూతముల ఆకృతి వచ్చింది. కుంగామో పాదాల దగ్గర ఉన్న స్మృతి వచ్చింది. కండ్లు తెరచి చూచాడు. ఆమె తననే ప్రేమమయమైన చూపులతో చూస్తున్నది. పద్మసంభవుడామె పాదములు తాకి నమస్కరించాడు. ఆ యోగిని దయార్ద్ర హృదయంతో అంటున్నది "తరుణుడా ! నీవిప్పుడు ఇంతకు ముందు కంటె వందలవేల రెట్లు శక్తిని పొందావు. శక్తిపాత విధానంలో నీలోకి మహస్సు ప్రవేశపెట్టబడింది. నీకిప్పుడున్నది నూతన శరీరం. ఈ దేహంలో గజశక్తి, సింహవేగం, వ్యాఘ్రతీవ్రత విజృంభిస్తవి. ఈ క్షణం నుండి నాతో రమించగల

శక్తి నీకు లభించింది. నేను పురుష సంపర్కం వదలి ఎంతో కాలం గడచింది. మహావీరుడైన వజ్రభైరవుడు నా ప్రియుడు. నీలో ఆశక్తిని ప్రవేశపెట్టాను. ఇక ఈ రాత్రంతా మనది. ఇది నీ దేవత అయిన వజ్రయోగిని సంకల్పం."

ఆ రోజు నిశాదేవి నిద్రపోలేదు. చౌశీతిబంధములలో రతికేళి పరాకాష్ఠ నందుకొన్నది. అలసటలేదు. పరిమితి లేదు. తెలతెలవారేదాకా సాగిన ఆవీరవిజృంభణం వర్ణనాతీతం.

**అధరపీడనం మర్దిత స్తనం**
**తకిట ధింధిమి ధ్వనితరతిపథం**
**మణితబంధురం మదనమోహనం**
**పద్మసంభవ ప్రణయవైభవం.**

**అణ్వణుస్ఫురత్ దేహచుంబనం**
**కణకణ జ్వలత్ కామతాండవం**
**ధణధణంధణత్ దర్పకోద్యమం**
**పద్మసంభవ ప్రణయ వైభవం**
**మహిత చూషణం మధుర భాషణం**
**ముష్టిపీడనం దృష్టి లాలనం**
**దశన చిహ్నితం కృతనఖక్షతం**
**పద్మసంభవ ప్రణయ వైభవం.**

**కుంగమో మహాశక్తి చాలితం**
**అంగనామణీరక్తి లాలితం**
**వజ్రయోగినీ ప్రేమపాలితం**
**పద్మసంభవ ప్రణయవైభవం.**

**అట్టహాసకృత్ వజ్రభైరవం**
**లలితహాసయుక్ డాకినీ గణం**
**అప్సరోజనోల్లాస నర్తనం**
**పద్మసంభవ ప్రణయవైభవం.**

సుందరోత్సర స్సుందరీ సఖీ
స్పందనోజ్జ్వలం సుందరం జగత్
పద్మినీ తనూ పద్మరంజితం
పద్మసంభవ ప్రణయవైభవం.

తెల్లవారుజామున కుంగామో పలికింది. "పద్మసంభవా ! నీవిప్పుడు కామవీరుడవు, ధర్మవీరుడవు. నీపర్యటనలో డాకినీ లక్షణములు గల స్త్రీలు సన్నిహితమైనపుడు వారితో కామసాధనలు చేయి. నీకిప్పుడు వజ్రోలీశక్తినిచ్చాను. ఇంద్రియ వికారములను జయించి పూర్వఋషులు ఊర్ధ్వ రేతస్కులై మహాతపస్సు చేశారు. రతిస్ఖలిత వీర్యమును తిరిగి లోపలికి పీల్చుకొనే ఈ వజ్రోలి వల్ల నీవూ అటువంటివాడవు కాగలవు. నీకు సంతానం ఉండదు. నీవు బౌద్ధభిక్షువవు. వజ్రయాన సిద్ధుడవు. త్వరలో జరగబోయే సాధనల వల్ల నీవు మృత్యుంజయుడవు కావాలి. నీ కర్మక్షేత్రము త్రివిష్టపము – టిబెట్. బౌద్ధధర్మం ఆ భూమిలో నీవల్ల వ్యాపిస్తుంది. బౌద్ధగ్రంధాలను ఆ భాషలోకి అనువదింపచేయి. సంఘారామాలను నిర్మించు. ఇతర మతస్థులు – మతాచార్యులు నీ ముందు నిలువలేరు. అఖండమైన కాలంలో ఒక ఖండకాలం నీది. నీ ప్రభావం ప్రసరిస్తుంది. అంతా బుద్ధభగవానుని ఇచ్ఛ. ఈ ఉషః కాలంలో బయలుదేరి వెళ్ళు" పద్మసంభవుడు ఒక్క పూటతోనే ఆమె వియోగాన్ని భరించలేని స్థితిలోకి వచ్చాడు. "యోగినీ ! నిన్ను విడిచి ఉండలేననిపిస్తున్నది. నాకు వీడ్కోలు చెపుతున్నావు. మళ్ళీ మనం కలిసేదెప్పుడు?"

కుంగామో అన్నది. "నీకు ప్రబోధం కలిగించటానికి, శక్తిని అందించటానికి నేనిక్కడ ఇంతకాలము ఉన్నాను. హిమాలయ సిద్ధాశ్రమభూములలో నాకంటే అధికతర శక్తివిలసితులు వందలమంది ఉన్నారు. ఆ మహనీయులు కొందరిని భౌతిక ప్రపంచంలో మార్పులు తేవటానికి ధర్మప్రచారం చేయటానికి ఎన్నుకొంటారు. స్థలము, సమయము వారు నిర్దేశిస్తారు. ఎంపిక చేయబడిన వ్యక్తులకు కావలసిన శక్తి యివ్వబడుతుంది. అమితాభుని తేజస్సుతో అవలోకితేశ్వరుని కరుణతో వచ్చిన వాడవు నీవు. నిర్దేశింపబడిన కార్యం నిర్వర్తించటము నీపని. ఏది ఎప్పుడు చేయాలో నీకు తెలుస్తుంది. లౌకిక జగత్తుకు సంబంధించిన కష్టాలు, ఆటంకాలు వస్తవి. వాటిని అధిగమించగలవు. మళ్ళీ

మనం ఇప్పట్లో కలవము. నేనిక్కడ నుండి త్వరలో బయలుదేరి సిద్ధాశ్రమానికి వెళతాను. అరవై, డెబ్బై సంవత్సరాల తర్వాత నీ కర్తవ్యం పూర్తి చేసుకొని సిద్ధాశ్రమము లోని అంతర్భాగాలకు వస్తావు. అక్కడ నేనుంటాను. ప్రస్తుతానికి ఇంతవరకు– శుభం భూయాత్". పద్మసంభవుని దగ్గరకు తీసుకొని కౌగలించుకొన్న ఆమె కన్నులు చెమర్చినవి. పద్మసంభవుని నేత్రముల నుండి బాష్పబిందువులు రాలినవి.

**రమ్యాణి వీక్ష్య మధురాంశ్చ నిశమ్య శబ్దాన్**
**పర్యుత్సుకో భవతి యత్ సుఖితోపి జంతుః**
**తచ్చేతసా స్మరతి నూన మబోధపూర్వం**
**భావస్థిరాణి జననాంతర సౌహృదాని (కాళిదాసు)**

రమ్యమైన వానిని చూచి, మధురములైన శబ్దములు విని ఆనందం పొంది కూడా ఒక్కోసారి హృదయం ఎందుకో కదిలి ద్రవించిపోతుంది. ఏదో తెలియని వేదన. పూర్వజన్మల అనుబంధాలు అంతరాంతరములో కలిగించే అనుభూతుల స్పందన అది. జ్యోతిశ్శాస్త్రంలో ఒక శ్లోకం ఉంది.

**శ్లో॥ ఉషస్స్యాత్ గార్గ్య సిద్ధాంతం**
**శకునంచ బృహస్పతేః**
**మనశ్శుద్ధిర్వ్యాస సమతం**
**విప్రవాక్యం హరేర్మతం**

ఏ పనియైనా, ప్రయాణమైనా, ఉషఃకాలంలో ప్రారంభించాలని గర్గుడు సిద్ధాంతీకరించాడు. శకునం చూచుకొని చేయమని బృహస్పతి చెప్పాడు. మనస్సు పరిశుద్ధంగా ఉన్నప్పుడు ప్రారంభించమని వ్యాసుని అభిప్రాయం. మనోబలంతు మాండవ్యం అని కూడా పాఠాంతరం. మనస్సు బలంగా ఉన్నప్పుడు మొదలు పెట్టమని మాండవ్యుని సూచన. ఇవేవీ అక్కరలేదు. పెద్దల ఆశీస్సులు తీసుకొని ప్రారంభించమని హరివచనము.

మనస్సులో ఇది గుర్తుకు వచ్చి యోగినికి వీడ్కోలు చెప్పి పద్మసంభవుడు ఉషఃకాలంలో బయలుదేరాడు. గాలిలో తేలిపోతున్నట్లుగా ఉంది ప్రయాణం. అప్రయత్నంగా కంఠం నుండి కవిత ప్రవహిస్తున్నది.

నందామయా ! గురుడ ! నందామయా !

ఆనందదేవికి నందామయా !

నందామయా మేలుకొందామయా !

జయబుద్ధయనుచును అందామయా !

మలయపర్వతమందు బయలుదేరిన గాలి

హిమశైలశిఖరాల నూపేనయా !

బోధివృక్షపు ఆకులలరింపగా గాలి

త్రైవిష్టపము దుమ్ము దులిపేనయా !

నేపాళమాంత్రికుడు నిలువెత్తుగా లేచి

ముజ్జగమ్ముల మాయముంచేనయా !

సిద్ధాశ్రమము నుండి చెలరేగిన వెలుంగు

దశదిశల వెన్నెలయి కురిసేనయా !

మంచుకొండలలోన మసలు డాకినులందు

ప్రేమసామ్రాజ్యమ్ము వెలసేనయా !

భోగినులు రాగిణులు యోగినులుగా మారి

పద్మసంభవు నాశ్రయించేరయా !

బుద్ధులును ప్రత్యేక బుద్ధులును శ్రావకులు

వామమార్గపు రుచిని మరిగేరయా !

తీవ్రశక్తులు గల్గు భూతమాంత్రికులెల్ల

సద్గురువు పదములకు మ్రొక్కేరయా !

మర్మయోగి యొనర్చు మణి పద్మహుంకార

మఖిలజగమును మేలు కొలిపేనయా !

బుద్ధదాకుండైన సిద్ధేశ్వరస్వామి

ప్రవచనమ్ములు ప్రగతి తెచ్చేనయా !

యోగి బ్రహ్మంగారి దివ్యకాలజ్ఞాన

తత్వాలు పాటలై అలరేనయా !

పద్మసంభవుడన్న బ్రహ్మ ఆతని మాట

సత్యవాక్కై ధరణి సాగేనయా !

హీనయానము మహాయానమ్ము మసెలెక్క
మహా పజ్ఞయానమ్ము మసలేనయా !
ఖోగర్ మహాయోగి టోయాంగుగా మారి
చైనాకు తాంత్రికత చేర్చేనయా !
శాక్య సింహము చేయు క్షైత్రయాత్రలలోన
టిబెటు మొత్తము పరిమళించేనయా !

అలా సాగుతుంటే మహాకాళుని కర్పూరాదిస్తోత్రంలోని శ్లోకం గుర్తుకు వచ్చింది.

శ్లో॥ గతాసూనాంబాహు ప్రకరకృత కాంచీపరిలస
న్నితంబాం దిగ్వస్త్రాం త్రిభువనవిధాత్రీం త్రిణయనాం
శ్మశానస్థేతల్పే శవహృది మహాకాలసురత
ప్రసక్తాం త్వాం ధ్యాయన్ జపతి జడచేతా అపికవిః

శ్మశానంలో శవం మీద మహాకాలునితో పురుషాయితం చేస్తున్న కాళి, దిగంబర, త్రిలోచన, ఆమెను ధ్యానిస్తే జడుడు కూడా కవి అవుతాడట ! కాశీలో శవశివకాళి అనే పేరుతో ఆలయం కూడా ఉందట ! ఎప్పుడన్నా వెళ్ళిచూడాలి. బుద్ధభగవానుడు అక్కడి సారనాథ్ నుండే తన ప్రబోధం ప్రారంభించాడు. నా ప్రబోధం ఇప్పుడే మొదలైంది. భవిష్యత్తు కంటి ముందు కనిపించటం - జ్ఞానచక్షువు వికసించటంతో హిమగిరిశిఖరులనుండి దూకే

---

డాక - పుంలింగము; డాకిని - స్త్రీలింగము. తెలుగుదేశంలో క్షుద్రభూతము అనే అర్థంలో వాడుతున్నారు. కాని ఈమెకు ఉత్తరభారతంలో ఆలయాలున్నవి. లలితాసహస్రనామాలలో అమ్మవారి పరివారంలోని దేవతగా చెప్పబడింది. టిబెట్‌లో ఈమె గొప్ప దేవత. అలాగే డాకుడంటే దేవగణంలోని వాడు. అర్థవిపరిణామం జరిగి హిందీలో దుష్టుడన్న అర్థం వచ్చింది.

గంగవలె వాక్కు పరాపశ్యంతీ మధ్యమాదశలను దాటి వైఖరీస్థితిని అందుకొని అప్రయత్నంగా ప్రవహిస్తున్నది. మానవజాతి భవిష్యత్తు ఎలా ఉంటుందో ధర్మరక్షణకు ఏ జాగ్రత్తలు తీసుకోవాలో వాటినన్నింటినీ నెమ్మదిగా పరిశీలించి పురోగమించాలి అనుకుంటూ ప్రయాణం కొనసాగించాడు.

శ్లో॥ అస్త్యుత్తరస్యాం దిశి దేవతాత్మా
హిమాలయో నామ నగాధిరాజః
పూర్వాపరౌ వారినిధీ విగాహ్య
స్థితః పృథివ్యా ఇవ మానదండః (కాళిదాసు)

హిమాలయం దేవతాత్మ. తూర్పు పడమర సముద్రాల మధ్య ఉన్న భూమిని కొలిచే కొలబద్దవంటిది. ఈ పర్వత గుహలలో దేవతలుంటారు. సిద్ధులుంటారు. మహనీయులైన పూర్వుల ఆత్మలిక్కడ సంచరిస్తుంటవి. స్థూలశరీరాలతో కొందరు సూక్ష్మశరీరాలతో కొందరు ఇక్కడ తపస్సు చేస్తుంటారు. కొన్నాళ్ళు ఇవన్నీ చూడాలి. అని భావిస్తూ ముందుకు సాగాడు.

జరఠకచ్ఛపకులేశ్వరు వెన్నుగానరా
జగతికి మిన్నేరు దిగిన చోటు
నిడుదపెన్నెరి వేణి జడగట్ట సగరు ము
మ్మనుమండు తపము గైకొనిన చోటు
పుచ్చడీకతనంబు పోబెట్టి గిరికన్య
పతిగొల్వనాయాసపడిన చోటు
వలరాచరాచవా దలికాక్షు కనువెచ్చ
కరగిన అల కనికరపు చోటు
ఈ ప్రదేశాలన్ని చూచాడు.
అటజని కాంచె భూమిసురుడంబర చుంబి శిరస్సరజ్ఝరీ
పటలముహుర్ముహుర్లుఠదభంగ తరంగమృదంగ ని స్వన
స్ఫుటనటనానుకూల పరిపుల్ల కలాప కలాపిజాలమున్
కటక చరత్కరేణుకర కంపితసాలము శీతశైలమున్. (మనుచరిత్ర)

ఒక ప్రదేశము అతనిని ఎంతగానో ఆకర్షించింది. ఆకాశాన్నంటే శిఖరం నుండి జాలువారుతున్న సెలయేరు క్రిందరాళ్ళమీద దూకుతుంటే అలలు మద్దెల చప్పుళ్ళు చేస్తున్నట్లున్నవి. నెమళ్ళు నాట్యం చేస్తున్నవి. ఏనుగులు తిరుగుతున్నవి. తొండాలతో చెట్లను ఊపివేస్తున్నవి. సుందరమైన ప్రకృతి మిన్నులు పద్దచోటు అంటే ఇదేనేమో ! ఏదో అన్వేషణ కానలకంతలలో దేనికోసమో ? కానలంటే అడవులు. కంతలంటే గుహలు. ఏ గుహలో ఏముందో ? సింహవ్యాఘ్రాదులైన క్రూరజంతువులుండవచ్చు. జలపాతములు పడే చోట మహాసర్పములుంటవి. అటువంటి చోట్ల కొండరాళ్ళ క్రింద రాతిబొద్దు లేక రాతిమదం అని నల్లని జిగురువంటి పదార్థం ఉంటుంది. దానిని ఉండలు చేసి యోగులు ఉపయోగిస్తారు. వాటి సహాయం వల్ల చిరకాలం ఆహారం లేకుండా శరీరం బలహీనపడకుండా తపస్సు చేయవచ్చు. అయినా దానిని సంపాదించటం సులభము కాదు. మహాసర్పములను శాసించగలశక్తి గలవాడు మాత్రమే దానిని పొందగలడు. అయితే పద్మసంభవునకు వాటిని చూచి భయపడవలసిన పని లేదు. మహాసర్పములు, భయంకర మృగాలు, తనచూపుతో స్తంభించగలవు. ఎదురుగా కనిపిస్తున్న పెద్దగుహలోకి వెళ్ళాడు. లోపల భయంకరమైన వజ్రయోగినీ విగ్రహమున్నది. కపాలాసనం కనిపిస్తున్నది. ఎవరో అక్కడ తీవ్రసాధనలు చేశారు. తానుకొంతకాలం ఇక్కడ ఉండాలనిపిస్తున్నది. జలపాతములు ఫలవృక్షములు ఏ యిబ్బంది లేదు. ఏకాంతంగా తపస్సు మొదలు పెట్టాడు. ధ్యానంలో కూచున్నాడు. కనులు మూసుకొని ధ్యానభూమికలో ప్రవేశించగానే ఎవరో దీర్ఘోన్నతుడైన యోగి కనిపించాడు. తామ్రవర్ణం, జటాజూటం, గడ్డం ఇరవై అడుగుల ఎత్తున్నాడు. ద్వాపరయుగాంతపు జీవుడు. తపోధనుడు, తీవ్రశక్తి సంపన్నుడు, సిద్ధేశ్వరుడు- అతని గుహాయిది. గాఢ సమాధిలోకి వెళ్ళాడు. అతడే తానా అనిపిస్తున్నది. జన్మలు మారుతున్నవి. తాను బుద్ధభూమికలోకి ప్రవేశించాడు. ఆశ్చర్యకరమైన దృశ్యాలు కనిపిస్తున్నవి. బుద్ధభగవానుడు అవలోకితేశ్వరుని పిలిచి అన్ని విధాల వెనుకబడిన టిబెట్ భూమిలో ధర్మసంస్థాపన చేయవలసిందిగా ఆజ్ఞాపించాడు. ధరణిమీదికి దిగిన అవలోకితేశ్వరుడు పశుతుల్యులుగా జీవిస్తున్న ప్రజలను వారి

బాధామయజీవితాలను చూచి వేదనతో కన్నీరు కార్చాడు. ఆ బాష్పముల నుండి గంగ, గాంగ్ చుంగ్మా అన్న ఇద్దరు దేవతలు పుట్టారు. గాంగ్ చుంగ్మా ఒక రోజు దేవతా పుష్పాలను దొంగిలించింది. దాని ఫలితంగా కొన్నాళ్ళకు మృత్యువు వచ్చి దేవత్వం కోల్పోయి మానవస్త్రీగా హీనకులంలో పుట్టింది. అయితే అవలోకితాశ్రువుల నుండి ప్రభవించింది గనుక ధర్మము నందు ప్రబలమైన విశ్వాసం కలిగింది. నేపాలులోని ఖట్మాండు దగ్గర మహాస్తూపాన్ని నిర్మించాలని ఆమె కాంక్ష. కష్టపడి నిర్మాణం ప్రారంభించింది గాని పూర్తికాకముందే మరణించింది. దేచోగ్మా అన్న పేరు గల ఆ మహిళకు నలుగురు కుమారులు. తల్లి కోరిక తీర్చాలని ప్రతిజ్ఞ చేసి వారు శ్రమపడిస్తూపాన్ని పూర్తి చేశారు. స్తూపమయితే పూర్తి అయింది. కాని దానిని ధర్మకేంద్రంగా చేయాలని, ప్రజలను ధర్మంవైపు మళ్ళించాలని వారి కోర్కె. దాని కోసం చాలాకాలం తీవ్రంగా ఆ స్తూపం దగ్గర ధ్యానం చేసి కొంత కాలానికి మరణించారు. ఆధ్యానఫలితంగా ఒకరు టిబెట్‌లో రాజుగా, మరొకరు అక్కడే రాజోద్యోగిగా, ఇంకొకరు మహాపండితునిగా, వేరొకరు మహామంత్రవేత్తగా ఉదయించారు. తానే ఆ మంత్రవేత్తనని, ఒక సోదరుడు టిబెట్ 38 వ రాజు త్రిసంగద్యుతిసేనుడని, ఇంకొకరు ఆ రాజు దగ్గర ద్యోగి యని మరియొక సోదరుడు ధర్మవేత్త శాంతరక్షితుడని తెలుస్తున్నది. త్వరలో ఈ పాత్రల వల్ల బౌద్ధధర్మం వృద్ధి పొందుతుందని ధ్యానదర్శనం - ఇటువంటి అనుభవాలు పొందుతూ కొంతకాలం అక్కడ ధ్యానం చేసి మరికొందరు దేవతల అనుగ్రహాన్ని పొందగలిగాడు. ఆ ప్రదేశాలు - గుహలు సిద్ధాశ్రమ భాగాలని - వందల వేల సంవత్సరాల వయస్సు గల యోగులు అక్కడ తపస్సు చేస్తూ ఇప్పటికీ ఉన్నారని తెలుసుకోగలిగాడు.

ఆ రహస్య ప్రదేశం నుండి బయలుదేరి హిమాచల్ ప్రదేశ్‌లోని రేవాల్సర్ సరోవర ప్రాంతానికి వెళ్ళాడు. అది జాహోర్ సంస్థానంలోనిది. ఆ పట్టణం చేరుకొని అచట అవలోకితేశ్వరుని ఆలయం దగ్గర ఒక సంఘారామంలో వసతి లభించగా ఉంటున్నాడు. ఎవరో బౌద్ధ భిక్షువు వచ్చాడని ప్రజలు దర్శనానికి వచ్చారు. వాళ్లలో కొందరు తమ కష్టాలు సమస్యలు చెప్పుకోవటం,

పద్మసంభవుడు తన మంత్రశక్తితో వారి బాధలు పోగొట్టటం, సమస్యలు తీర్చటంతో జనం విపరీతంగా రావటం మొదలైంది. నెమ్మదిగా ఇది రాజుగారి దృష్టికి వెళ్ళింది. ఆ రాజు పేరు విహారధరుడు. ఆయన సకుటుంబంగా ఆశ్రమానికి వచ్చి ప్రత్యేకంగా పద్మసంభవుని దర్శనానికి వచ్చాడు. స్ఫురద్రూపి, యువకుడు, తేజస్వి అయిన ఈ భిక్షుకుడు రాజును ఎంతగానో ఆకర్షించాడు. రాజుపుత్రిక మందారవ మొదటి చూపులోనే అతనిని ప్రేమించింది. పద్మసంభవునకు ఆమెలో డాకినీ లక్షణాలు కనిపించినవి. రాజకుటుంబం వెళ్ళిపోయిన తర్వాత ఆ రోజు రాత్రి ఆమె విషయంలో ఏమి చెయ్యాలో నిర్దేశం కోసం వజ్రవారాహిని ఆవాహనం చేశాడు. తన శరీర లక్షణాలతో మందార ఉదయించిందని ఆమెతో తాంత్రిక సాధనలు చేయవలసిందని దేవత ఆదేశించింది.

మరునాడు రాజభవనం నుండి ఆహ్వానం వచ్చింది. మంత్రి ఒకరు వచ్చి మహారాజు తరపున రాజమందిరానికి రావలసిందిగా ఆహ్వానించాడు. అక్కడ బుద్ధదేవుని పూజలు చేయవలసింది గాను రాజును వారికుటుంబాన్ని ప్రత్యేకంగా ఆశీర్వదించవలసిందిగాను అభ్యర్థించాడు. పద్మసంభవుడు అంగీకరించి వెళ్ళాడు. రాజభవనాలలో ఒకటి ఈయన కోసం కేటాయించబడింది. ప్రతిరోజు పూజలు చేయటం రాజు, కుటుంబసభ్యులు వచ్చి ప్రసాదం తీసుకోవటం జరుగుతున్నది. ఒకరోజు రాత్రి ప్రథమయామం గడిచిన తర్వాత ఆకర్షణ మంత్రాన్ని ప్రయోగించాడు. రాజకుమారి ఎవరూ చూడకుండా చాలా జాగ్రత్తగా ఇతని వసతికి వచ్చింది.

రాజకుమారి – గురుదేవా ! మిమ్మల్ని చూచిన క్షణం నుండి నా మనస్సులో నిలచిపోయినారు. మీ ప్రేమ కోసం పరితపిస్తున్నాను. సాహసం చేసి యీ రాత్రి మీకోసం బయలుదేరి వచ్చాను. నన్ను స్వీకరించండి.

పద్మ : రాజపుత్రికా ! నీవు వస్తావని నాకు తెలుసు. జగదీశ్వరియైన వజ్రవారాహి ఇచ్ఛ ఇది. ఆమె అంశతో నీవు జనించావు. మనకలయిక వల్ల లోకకల్యాణం జరుగుతుంది. ఆవివరాలన్నీ నెమ్మదిగా నీకు తెలుస్తవి.

రాజ : స్వామీ ! మీవంటి సిద్ధపురుషులతో అనుబంధం ఏర్పడటం నా అదృష్టం. నేనెంతో నిగ్రహం కలిగినదానిని. కాని మిమ్ము చూచిన సమయంలో దానిని కోల్పోయాను. నేను మీ కోసమే పుట్టానని అనిపించింది. అందుకే తెగించి యిలా బయలుదేరాను. నారాక ఎవరికీ తెలియలేదనే భావిస్తున్నాను.

పద్మ : తెలియదు. నీవు వస్తున్నావని నాకు తెలుసు. మంత్రశక్తితో దిగ్బంధన చేశాను. నీవు నిర్భయంగా, నిస్సంకోచంగా ఉండవచ్చు. ఈ మొదటిరాత్రి దివ్యమైన మధురానుభూతులను మనకు ప్రసాదిస్తుంది. వజ్రయోగిని మన యిద్దరిని ఆశీర్వదిస్తుంది.

**భావోద్యానమునందు క్రొత్త వలపుంబందిళ్ళలో కోరికల్**
**తీవల్ సాగెను పూలు పూచెను రసార్ద్రీభూత చేతమ్ముతో**
**నీవేనేనుగ నేనె నీవుగ లతాంగీ ! యేకమై పోద మీ**
**ప్రావృణ్ణీరదపంక్తి క్రింద పులకింపన్ పూర్వ పుణ్యావళుల్.** (కరుణశ్రీ)

ఆరాత్రి నిద్రకు నిద్రరాలేదు. మందారవ పద్మసంభవునకు సర్వసమర్పణ ...సుకొంది. అతడామెలోని కామదేవిని మేల్కొల్పాడు.

**సీ॥ పతి పాణిపల్లవచ్యుత నీవిబంధన**
**వ్యగ్రబాలాహస్త వనరుహంబు**
**ధవకృతాధరబింబ దశనక్షతవ్యథా**
**భుగ్నలీలావతీ భ్రూలతంబు**
**ధరణి నాయకభుజాపరిరంభమండలీ**
**గాఢపీడిత వధూఘనకుచంబు**
**వరనఖాంకుర మృదువ్యాపార పులకిత**
**నీరజాక్షీ నితంబోరుయుగళి**
**గీ॥ అస్తి వామ్యభారమస్తి కౌతూహలం**
**బస్తి ఘర్మసలిలమస్తి కంప**
**మస్తి భీతి అస్తిహర్షమస్తివ్యథం**
**బస్తి వాంఛమయ్యెనపుడురతము (నైషధము - శ్రీనాథుడు)**

అతడు చీరముడి విప్పుతుంటే సిగ్గుతో ఆమె చేతితో దాచుకోటానికి ప్రయత్నించింది. అతడు పెదవిపై పండ్లగాట్లుంచితే ఆమె చిరుకోపంతో బొమలు చిట్లించింది. ధృఢంగా అతడు కౌగలించుకొంటే ఆమె వక్షోజములు నలిగినవి. అతడు గోళ్ళతో నెమ్మదిగా గుచ్చితే ఆమె పిరుదులు పులకించినవి. కొత్త గాబట్టి భయం, మొదటిసారి గనుక కొంచెం బాధ, సంతృప్తి, సంతోషం, మళ్ళీ కావాలన్న వాంఛ – ఇలా ప్రథమ సంగమం రాజకుమారికి అపూర్వమైన మధురానుభూతి కలిగించింది.

మందారవ జాగ్రత్తగా తన మందిరంలోకి వెళ్ళింది. ఇలా కొద్దిరోజుల నిత్యనిశాసంగమములతో సురతక్రీడలతో సాగింది. బుద్ధపూజలు పూర్తియై పద్మసంభవుడు రాచనగరు విడిచి వెళ్ళవలసిన సమయం సమీపించింది.

ఆరోజు రాత్రి అతడు ఏకాంతంగా తన వసతిలోనికి వచ్చిన మందారవతో ఈ విషయం చెప్పాడు. ఆమె "ఇక ఈ జీవితంలో మిమ్ము విడిచి ఉండటం జరగదు. మీతో వస్తాను మీతోనే ఉంటాను. దేనికైనా నేను సిద్ధంగా ఉన్నాను" అన్నది. అతడు "రాజకుమారీ ! నన్ను నమ్మి నాకు సర్వం సమర్పించావు. నాతో వస్తానన్నావు. నమ్మినవారిని నేనెన్నడూ విడిచిపెట్టను. ఇక నువ్వు ఈ రాత్రి పూర్తిగా ఇక్కడే ఉండు. ఏమి జరుగుతుందో చూడు" అన్నాడు. "ఏమి జరిగినా పరవాలేదు. మీ మహత్వం మీద నాకు నమ్మకమున్నది" అంటూ అతని గుండెమీద వాలిపోయింది. ఆ క్షణం వారిలో కామమున కతీతమైన దివ్య ప్రేమ వికసించింది. అతని ఒడిలో పడుకొని ఆమె సన్నగా గానం చేస్తున్నది.

**శారదశర్వరీ మధుర చంద్రిక– సూర్య సుతా స్రవంతికా**
**చారువినీల వీచిక ప్రశాంతనిశాపవనోర్మిమాలికా**
**చారితనీపశాఖిక కృశాంగిని గోపికనేను – నాడు బృం**
**దారమణీయసీమ వినినారము మోహనవేణుగానమున్.**

**(దేవులపల్లి కృష్ణశాస్త్రి)**

యమునా తీరంలో వెన్నెలలో చల్లని గాలి అలలు అలలుగా సోకుతుంటే నీ వేణుగానం వింటూ పరవశించి పోతున్న గోపికను నేను – నీవు

వంశీధరుడవైన కృష్ణుడవు.

**చల్లని స్వామీ - రసపథగామీ**
**నీకై వచ్చాను - ఇదిగో హృదయమిచ్చాను.**
**తేనెల సోనా ! వెన్నెలవానా !**
**గుండెను తెచ్చాను నీ కై గుడినే కట్టాను**
**తలచి తలచి నీ తలపులోననే**
**తరువుగనైనాను - చివరకు లతగా మారాను**
**నిలిచి నిలిచి నీ నీడలోననే**
**స్థాణువునైనాను - చివరకు - బొమ్మగ మారాను**
**అరచి అరచి ఆ ఆక్రందనమున**
**అంబుధినైనాను - నీ కొరకలనై దూకాను**
**కలగి కలగి నీ కావ్యము వ్రాయుచు**
**కలముగనైనాను - చివరకు - కలగా మిగిలాను**
**వెలిగి వెలగి నీవలపులోననే**
**కప్పురమైనాను - చివరకు మిగలకపోయాను**

తెల్లవారింది. రాజకుమారి బౌద్ధభిక్షువు దగ్గర రాత్రంతా ఉన్నదన్న సంగతి అందరికీ తెలిసిపోయింది. మహారాజు ఆగ్రహోదగ్రుడైనాడు. కూతురిని చూడటానికి కూడా ఇష్టపడలేదు. ఇద్దరినీ భటులచేత బంధించి కొలువుకూటానికి తెప్పించాడు. మంత్రులు, సేనాపతులు, అధికారులు, ప్రజాప్రముఖులు చూస్తుండగా విచారణ చేశాడు. తమ మధ్య సంబంధం ఏర్పడిందని వారు స్పష్టంగా అంగీకరించారు. కోపావేశంతో విహారధీరమహారాజు నగరమధ్యంలో వారిని సజీవంగా దహించవలసిందిగా ఆజ్ఞాపించాడు. ఎంపిక చేయబడిన ప్రదేశంలో చుట్టూ కట్టెలు పేర్చి నిప్పుముట్టించారు. ఆకాశమంత యెత్తు మంటలు లేచినవి. జనమంతా జాలితో చూస్తున్నారు. ఇంకా ఇంకా కట్టెలు తెచ్చి వేస్తున్నారు. మందారవా, పద్మసంభవులకు ఏమీ కాలేదు. కట్టిన గుడ్డలు కూడా అంటుకోలేదు.

బుద్ధం శరణం గచ్ఛామి
ధర్మం శరణం గచ్ఛామి
సంఘం శరణం గచ్ఛామి

అని త్రిశరణాలను ప్రశాంతంగా పఠిస్తున్నారు. చూస్తున్న రాజుకు ప్రజలకు దిగ్భ్రాంతి కలిగింది. పద్మసంభవుడు చిరునవ్వుతో "మహారాజా ! ఈ అగ్ని మమ్ములను ఏమీ చేయలేదు. బుద్ధభగవానుడు మమ్ము రక్షిస్తున్నాడు. ధర్మం మమ్ము కాపాడుతున్నది. సంఘుస్వరూపుడే పరమేశ్వరుడు. బౌద్ధ ధర్మప్రచారానికి భిక్షుకిగా మీ కుమారి ఎంపిక చేయబడింది. ఆమె నాతో తపస్సు చేసి దివ్యశక్తులు సంపాదించి ప్రజాసేవ చేస్తుంది. మేము వెళుతున్నాము. రహస్యంగా తప్పించుకొని లేచిపోయినారన్న అపఖ్యాతి రాకూడదనే ఇలా చేశాను. మమ్మెవరూ అడ్డగించలేరు. బుద్ధుని స్వరూపమైన వజ్రేశ్వరి నాకిచ్చిన శక్తి అప్రతిహతమైనది. నేను తలచుకుంటే ఈ అగ్నిని - ఈ మంటలను మీ మీదికి పంపగలను. కాని చేయను. ఎందుకంటే మీమీద నాకేమీ కోపం లేదు. ఒక రాజుగా, గృహస్థుగా మీరు వికృతిచెంది ఈ శిక్ష వేశారు. జరిగింది చూచారు. ఇకమేము వెళ్ళి వస్తాము" అన్నాడు. అంతటా కలకలం బయలుదేరింది. విహారధరుడు "పద్మసంభవా ! మీరింతవారని నేను ఊహించలేదు. జరిగిందేదో జరిగిపోయింది. నా కుమార్తెను నీకిచ్చి పెండ్లి చేస్తాను. నిన్నీ రాజ్యానికి రాజును చేస్తాను. మీరెక్కడికీ వెళ్ళవలసిన పనిలేదు. దయతో అంగీకరించు" అని అభ్యర్థించాడు. పద్మసంభవుడు అంగీకరించలేదు. "మహారాజా! ఒక రాజ్యానికి రాజునై పరిమిత ప్రదేశంలో ఉండడం నా ధ్యేయం కాదు.నా గమ్యం వేరు. హిమగిరి సీమలలో బౌద్ధధర్మాన్ని సువ్యాప్తం చేయాలి. దానికి చేయవలసింది చాలా ఉంది. మీరు మరోలా భావించవద్దు" అని వారిని ఒప్పించి మందారవతో బయలుదేరి నేపాల్‌లోని మరాటికా గుహ చేరుకొని అక్కడ కామ తపస్సు చేశారు.

మూడు నెలలు ఏకాగ్రంగా తీవ్రంగా సాధన సాగింది. కుంగామో యోగిని ఇచ్చిన శిక్షణ ఇక్కడ పూర్తిగా ఉపకరించింది. కామంలో నుంచి ప్రేమ - దానిలో నుండి భావస్థితి - ఆ దశనుండి మహాభావస్థితి -

నిద్రమేల్కొన్న మహాచైతన్యం - దివ్యభూమికల నుండి వారిలోకి మహాశక్తి అవతరించటం మొదలైంది.

**మూర్ధ్ని పతంతీ వ్యోమతలాత్**
**సంతతమంతస్సర్వ తనౌ**
**సంప్రవహంతీ దివ్య ఝరైః**
**వాసవశక్తిర్మాం విశతు.** (గణపతిముని).

అలలు అలలుగా రేణువులు రేణువులుగా అనంతాకాశ భూమికలనుండి వజ్రశక్తి వారిలోకి అవతీర్ణమైంది. వారి శరీరాలు ఇంద్రచాప వర్ణములలోకి మారినవి. బుద్ధులలో ఒకడైన అమితాయువు సాక్షాత్కరించి వారికి నిత్య యౌవనాన్ని దీర్ఘాయువును ప్రసాదించాడు. కామతపస్సుతో ముసలితనాన్ని మృత్యువును జయించిన ఏకైకవీరయోగి పద్మసంభవుడు.

మరాటికా గుహనుండి బయలుదేరి ఇద్దరూ ఓడ్యాణ రాజ్యానికి బయలుదేరి వెళ్ళారు. అది ఒకప్పుడతని స్వంతరాజ్యం. మహారాజు ఇంద్రబోధి మరణించిన తర్వాత రాజవంశీకులైన ఒక బంధువు యొక్క కుమారుడు రాజైనాడు. రాజధానిలో ప్రవేశించగానే పూర్వమంత్రి తాలూకు మనుషులతనిని పట్టుపట్టారు. బంధించి యిద్దరినీ రాజుముందు నిలబెట్టారు. రాజ్యం నుండి బహిష్కారశిక్ష విధించబడి బహిష్కరింపబడిన వ్యక్తి అనుమతి లేకుండా తిరిగి వచ్చాడంటే అది నేరం. దానికి మరణమే శిక్ష. సజీవంగా దహనం చేయాలని శిక్ష విధించబడింది. పద్మసంభవుని, మందారవను బంధించి చుట్టూ కట్టెలు పేర్చి నిప్పు ముట్టించారు. జాహోర్‌లో వలెనే ఇక్కడ కూడా. అగ్నిజ్వలిస్తూనే ఉన్నది. మంటలు మండుతూనే ఉన్నవి. అందరూ చూస్తుండగా అగ్ని ఆరిపోయింది. ఆ ప్రదేశమంతా ఒక సరస్సుగా మారిపోయింది. ఆ సరోవరం మధ్యలో ఒక పెద్ద తామరపూవు దానిపై మందారవ పద్మసంభవుడు దివ్యతేజస్సుతో దర్శనమిచ్చారు. ప్రజలు ఆశ్చర్యచకితులైనారు. శత్రువులకు నోట మాట రాలేదు. రాజు మహామహి మాన్వితుడైన పద్మసంభవునకు పాదాక్రాంతుడైనాడు. భక్తిశ్రద్ధలతో క్షమాపణ వేడి తనను శిష్యునిగా అంగీకరించమని ప్రార్థించాడు. పద్మసంభవుడు దయతో ఒప్పుకొన్నాడు.

రాజధానిలో ఒక సంఘారామం నిర్మించబడింది. మందారవ, పద్మసంభవుడు దానిని బౌద్ధధర్మ కేంద్రంగా తీర్చిదిద్దారు. రాజ్యమంతటా సంఘారామాలు స్తూపాలు నిర్మించబడినవి. 12 సంవత్సరాలు రాజగురువుగా పద్మసంభవుడక్కడ నివసించాడు. 13వ సంవత్సరం జరుగుతుండగా ఒకరోజు ధ్యానంలో తాను పూర్వం ఏకాంత తపస్సు చేసిన వజ్రయోగినీ గుహనుండి పిలుపు వినిపించింది. ఎవరో ఒక కన్య యొక్క మనస్సు తన కోసం ఆక్రోశిస్తున్నది. వేదనాభరితమైన ఆ ఆక్రందనకు హృదయం ద్రవించింది. మరునాడు మందారవను పిలిచి ఇలా చెప్పాడు. "ప్రేయసీ ! నేను మళ్ళీ హిమాలయ సిద్ధాశ్రమ ప్రాంతంలోని వజ్రయోగిని దగ్గరకు వెళ్ళవలసిన అవసరం ఏర్పడింది. ఇక్కడ ఒక పెద్ద ధార్మిక వ్యవస్థను ఏర్పరచాము. దీనిని నీవు నిర్వహిస్తూ ఉండు. మనం కలవటానికి దీర్ఘకాలం పట్టవచ్చు. సుఖభోగముల పరిపూర్ణత ననుభవించి దివ్యశరీరంతో ప్రకాశిస్తున్న దానివి నీవు. మానసికంగా మనకు వియోగం లేదు. భిక్షుకులచేత, భక్తుల చేత ధ్యానసాధనలు, ధర్మప్రచారము చేయించు. సిద్ధురాలివి. జ్ఞానస్వరూపిణివి. ఎప్పుడేమి చేయాలో నీకు తెలుసు" ఆమెను ఒప్పించి పద్మసంభవుడు బయలుదేరి కొద్దికాలంలోనే హిమాలయ పర్వతాలలోకి ప్రవేశించి వజ్రేశ్వరీ మందిరానికి చేరుకొన్నాడు. గుహలోకి వెళ్ళి దేవిని దర్శించి బయటకు వచ్చి ప్రకృతిని చూస్తూ నిల్చున్నాడు.

ఇంతలో ఒక పన్నెండేళ్ళ అమ్మాయి వచ్చింది. దిగంబర. చెట్ల ఆకులు కొన్ని నడుముకు చుట్టుకొన్నది. బలిష్ఠమైన పరిపుష్టమైన శరీరం. ఉన్నతమైన వక్షోజములు. విరబోసిన కేశపాశము, పద్మసంభవుని దగ్గరకు వచ్చింది. వింతగా చూస్తున్నది. కోతివలె కిచకిచమని ధ్వని చేసింది. చుట్టూ తిరిగింది. వస్త్రాలు పీకింది. మళ్ళీ నిల్చుని అదేపనిగా వీక్షిస్తున్నది. అతడామెను నిశితంగా పరిశీలించాడు. కోతి లక్షణాలు తప్ప మనిషి లక్షణాలు కనపడటం లేదు. మనుష్య భాష వచ్చినట్లు లేదు. ఈమె వివరాలు తెలుసుకోవాలి. తానీమె కోసం వచ్చినట్లుంది. ఈ మనిషికి భాష ఎందుకు రాలేదు ? ఒక్కసారి సమ్మోహినీ దేవతను స్మరించాడు. ఆ అమ్మాయి చెయ్యి పట్టుకొని ఒక పెద్ద రాతి బండ మీద కూర్చోబెట్టాడు. ఆ బాలిక కాదనలేదు. ఆ కన్య నొసలు

బొటనవేలితో తాకి సమ్మోహన నిద్రలోకి పంపాడు. ఆరాతి మీద ఆమె వెల్లికల పడుకొన్నది. కన్నులు మూతలు పడినవి. ఆ స్థితిలో అతడామెను ప్రశ్నిస్తున్నాడు.

పద్మ : బాలికా ! ఎవరువు నీవు ?

కన్య : సమాధానం లేదు - ఏదో మాట్లాడాలని ప్రయత్నం. కాని మాటలు రావటం లేదు.

పద్మ : నిద్రలోనికి వెళ్తున్నావు. గాఢనిద్రలో ప్రవేశించావు. నీకు మాట్లాడే శక్తినిస్తున్నాను. పలుకు ! నీవు పలుకగలవు.

కన్య : నెమ్మదిగా పెదవులు కదలుతున్నవి. "నేను డాకినిని. మధురగాయకిని. నర్తకిని. సౌందర్యవతిని. ఒకరోజిక్కడ తపస్సు చేసుకొంటున్న ఒక యోగికి నా పాటలతో, అరుపులతో ధ్యానభంగం కలిగించాను. అతనికి కష్టం వేసింది. కోతివలె ప్రవర్తించి నాకు ఇబ్బంది కలిగించావు. కోతివై పుట్టుదువు గాక ! అని శపించాడు. నా దివ్యశక్తులన్నీ పోయినవి. నా కంఠం మూగపోయింది. ఆయన కాళ్ళమీద పడి ఏడ్చాను. క్షమించమని ప్రార్థించాను. చాలా సేపటికి ఆయనకు దయ కలిగింది. శాపాన్ని కొంతమార్పు చేసి మనిషిగాపుడతావు గాని కోతుల మధ్య పెరుగుతావు. మనుషుల మధ్య ఉండవు. పన్నెండు సంవత్సరాల తర్వాత ఒక యోగి వల్ల శాపవిమోచనం కలుగుతుంది అని అనుగ్రహించాడు. నాశరీరం పతనమైంది. నేపాల్‌లోని ఒక శాక్య రాజవంశస్త్రీ గర్భంలో ప్రవేశించాను. నెలలు నిండుతుండగా ఆమె పుట్టింటికి భర్త అనుమతితో బయలుదేరింది. భటులు, పరివారం అంతా ఉన్నారు. ఒక పల్లకిలో ఆమె. ఆమె గర్భంలో నేను. ఈ ప్రాంతానికి వచ్చిన సమయంలో భయంకరమైన పులి వచ్చి దాడి చేసింది. ఒకరిద్దరు పరివారంలోని వారిని చంపి తిన్నంత మాంసం తిని వెళ్ళిపోయింది. హతశేషులు పరుగెత్తి పారిపోయినారు. ఆ స్త్రీ అక్కడే ప్రసవించి దిక్కులేని స్థితిలో మరణించింది. నన్నిక్కడి కోతులు పెంచినవి. ఈప్రదేశానికి తరువాత ఎవరైనా వచ్చారో లేదో నాకు తెలియదు. నాకు కొంచెం ఊహ వచ్చేసరికి ఈ కోతుల పెంపకంలో ఉన్నాను. ఇక్కడి పండ్లు ఆహారం, జలపాతం నీరు

తాగటానికి. ఇన్నేండ్లు ఎలా గడిచినవో తెలియదు. ఇప్పుడు మీరు వచ్చారు. నన్ను రక్షించండి"

పద్మసంభవుడామెను సమ్మోహనస్థితి నుండి సామాన్య సహజస్థితికితెచ్చాడు. అన్నీ గుర్తు నిలిచేలా చేశాడు. "శాక్యదేవీ ! నీవిప్పుడు పూర్ణమాననివి. భాష, భావం అన్నీ నీకు వశమైనవి. అయితే డాకినిగా మరణించి తల్లి గర్భం నుండి పుట్టావు గనుకను, శాపం వల్లను మరపు, శక్తివిహీనత వచ్చింది. మళ్ళీ నీవు డాకినీ శక్తులు పొందాలంటే తపస్సు చేయాలి" అన్నాడు. శాక్యదేవి "గురుదేవా! కరుణతో నన్నుద్ధరించి కాపాడారు. ఈ ప్రపంచంలో మీరు తప్పనాకెవరూ లేరు. నాసమస్తము మీరే ! గురువు, పతి, ప్రియుడు, దైవము అన్నీ మీలో చూస్తున్నాను. నన్ను స్వీకరించండి. ప్రేమ డాకినినైన నా చేత కామసాధన చేయించండి. నాకు మళ్ళీ దివ్యశక్తులు వచ్చేలా చేయండి" అన్నది. ఆమె అంతరంగ సంగీతం అతని హృదయాన్ని స్పందింపజేసింది.

ఆ కన్య కంఠంలో నుండి బాలపల్లవగ్రాస కషాయ కంఠకుహూ కల కాకలీధ్వనితో ఆర్తి, ఆవేదన, భక్తితో సమ్మిళితమైన మధురగానం అప్రయత్నంగా రస నిర్ఝరియై ప్రవహిస్తున్నది.

**దేవలోకమునుండి దిగిన అచ్చర నేను**
**తెలివెన్నెలకు విచ్చు కలువ పూవును నేను**
**మలయగిరి ఋషి చూచి మంత్రముగ్ధగనైతి**
**అందుకే హిమశైల మరుగుదెంచితి నేను**

**యుగయుగమ్ముల నాటి యోగినిని డాకినిని**
**మౌని శాపము చేత మతిలేని మానవిని**
**వానరమ్ముల మధ్య దీనురాలిని నన్ను**
**మనసున్న మనిషిగా మార్చితివి గురుదేవ !**

**పరువంపు వయసేమొ పరవళ్ళు తొక్కేను**
**నిలువు దోపిడి నీయ నీ కోసముంచాను**

మురిపెముగ యౌవనము ముదుపు కట్టితిమున్నె
ముందు చూపున నీకు విందుగా ఉంచాను
ఉప్పొంగు ఊహలా ఊయెలే కట్టాను
ఊగరావాస్వామి ! యోగపథగామీ !

పెరిగిన శిఖరాల ఒరిగిపోవా దేవ !
అరటిబోదెలమధ్య అందాల సరసుంది
అందులో పద్మమ్ము అరవిచ్చుకొని ఉంది
పద్మసంభవ దేవ ! రావా !
ఆనందరససిద్ధి తేవా !
చిరకాల ధ్యానాల సిద్ధేశ్వరుడవీవు
కలలోని యువరాజు నీవే
ఇలలోని ఋషిరాజు నీవే
మదనమాంత్రిక రాజ్యమత్స్యేంద్రనాథుడవు
యువతీవశీకరణ యోధానుయోధుడవు
బుద్ధదాకిని నేను బోధిసత్వుడవీవు
వజ్రయోగిని నేను వజ్రభైరవుడీవు
జన్మజన్మల నాటి సంబంధమయ్యా !
పునరుద్ధరింపుమో ! పురుషాగ్రగణ్యా !

పద్మసంభవ దేవ ! శరణం
ప్రణయ సుందరభావ ! శరణం
కైలాసగిరి గుహా ఘనతపో వ్రత దీక్ష !
కారుణ్యమయవీక్ష ! శరణం
మధురభక్తి విలాస ! మంత్రిణీ వీరేశ!
మంత్రయానమహేశ ! శరణం
రాసిక్య రాగిణీ రమ్యాంతరోదితా !
రజతగిరి రాజితా ! శరణం
సిద్ధాశ్రమఋషీంద్ర ! సిద్ధేశ్వరస్వామి
శృంగార రస సిద్ధ ! శరణం

హిమశైలసందీప ! హేరుకాధిపరూప !
జితకామ ! జితకోప ! శరణం

కళ్యాణ గుణధామ ! శరణం
కారుణ్య పరసీమ ! శరణం
కొండలో భైరవా ! శరణం
కోనలో భైరవా ! శరణం
గుడిలోని భైరవా ! శరణం - నా
గుండెలో భైరవా ! శరణం
వజ్రభైరవ దేవ ! శరణం
వరపద్మ సంభవా ! శరణం.

ఆగాన మోహిని పాటవిని అతడూ ప్రబోధ గానం చేశాడు.

మేలుకొనవే జీవహంసా !
మేలుకొనవే పరమహంసా !
మేలుకొనుము సజీవతంసా !
మేలుకొనగదవే !

ఎన్నిజన్మము లెత్తినావో
ఎన్ని తనువులు దాల్చినావో
ఎచట నుండీ వచ్చినావో
ఎరుకపొందగదే !

కాలవశమున శక్తి తగ్గును
కర్మవశమున బలము తగ్గను
కలియుగ ప్రభకట్టి వేయును
మేలు కొనుమింకన్

మాయక్రమ్ముట మరపువచ్చును
మాయవీడిన స్మృతిలభించును
మాయ తెర తొలగించగలిగిన
మంత్రమెరుగవలెన్

మాయకీశ్వరి మంత్రసుందరి
వజ్రయోగిని బుద్ధదాకిని
మాయతొలగగ ఆమె పదముల
మస్తకమ్మిడుమా !

కాలమును నడిపించు దేవత
కర్మమును శాసించు దేవత
కాటిలో నివసించు దేవత
కాళి నిలుపు మెదన్

తపము సేయుము తపముసేయుము
ధ్యానమును జపమాచరింపుము
సిద్ధగురు కృపనాశ్రయింపుము
చెందెదవు శక్తిన్

ఈశరీరమ్ముండగానే
ఇపుడె యీ జీవితమునందున
వరఫలమ్ముల తీవ్రతపమున
పడయ సాధ్యమగున్

మహాయానము మంత్రయానము
వజ్రయానము - కామయానము
ఈ ప్రయాణములోన నాతో
ఎపుడు నుందువికన్.

అలా పాడుతూ ఉంటే ఆమె కన్నులలో ఆనందబాష్పాలు జాలువారుతున్నవి. పద్మసంభవుడు ఆమెను హృదయేశ్వరిగా స్వీకరించాడు. మానవుల నెరుగని ఆదివ్యమానవి తన శరీరాన్ని మనస్సును సమస్తము అతనికి సమర్పించింది.

మృగనాభినికరంపు బుగబుగల్ గలచోట
జదలేటి తుంపురుల్ చెదరుచోట

వకుళవాటీగంధవహుడు పైకొనుచోట
కర్పూర తరుధూళి కప్పుచోట
పసమీఱు సెలయేఱు లిసుకవెట్టిన చోట
చిగురు మావుల సంజె నిగుడుచోట
నవమాలికల తీవె నట్లుట్టి పడుచోట
మాణిక్య దీపముల్ మలయుచోట
ప్రమదమున దేటు లెలుగెత్తిపాడు చోట
శారిక లనంగ శాస్త్రముల్ చదువుచోట
కీర కలకంఠములు క్రొవ్వి కేరుచోట
పావురము లారజంబులు పలుకుచోట (మనుచరిత్ర)

శాక్యదేవీ, పద్మసంభవ సురతక్రీడలు రససామ్రాజ్య సింహాసనాధిష్ఠిత వజ్రయోగినీ వరప్రసాదంగా సాగినవి. రతిపరవశశాక్యదేవీ మణిత కూజితములు, అమాయికయైన సుందరమూర్తి అనన్యప్రేమభావము, కలిసినప్పటి నుండి తనను క్షణం కూడ విడువలేని ఆ బాలిక మహాభావస్వరూపము తన ప్రియురాండ్రందరిలో ఆమె స్థానాన్ని సర్వోన్నతంగా తన హృదయపీఠంలో నిలిపింది.

సహసానఖంపచ స్తన దత్త పరిరంభ
మా మూల పరిచుంబితాధరోష్ఠ
మతిశయప్రేమ కల్పిత దంత సంబాధ
మగణితగ్లాని శయ్యాని పాత
మతివేల మణిత యాచ్ఛార్థ గల్ల చపేట
మతిదీన వాక్సూచితాత్మ విరహ
మంకురత్పులక జాలా విద్ధ సర్వాంగ
మానందకృతహారవానవాబ్జ
మాక్రమక్షీణ నుతివర్ణ మానిమీలి
తాక్ష మాస్విన్న గండ మాయత్త చేష్ట
మా స్తిమిత భూషణారవ మావధూటి
ప్రథమసురతంబు పద్మసంభవు గరంచె (మనుచరిత్ర)

కం॥ ఫుల్లలవలీనవైలా
వల్లిమతల్లికలతోడ వాసంతికలు
ద్వల్లీల నల్లి బిల్లిగ
నల్లుకొనిన ఒక లతా గృహాంతర సీమన్ (మనుచరిత్ర)

**వికసించిన ఏలా లతికలు**
**వెలుగొందే వెన్నెల తీగలు**
**అల్లిబిల్లిగా వాసంతికలు**
**అల్లుకొనిన పొదరిండ్ల లోపల**
**పున్నమి వెన్నెల పూలపందిరుల**
**మదనమహీపతి మధుర రాజ్యమున**
**సాగెను చక్కని ఆట**
**కొనసాగెను కమ్మనిపాట.**

ఆరమణీయ వాతావరణంలో పగలు రాత్రి అనే తేడా లేకుండా ఆశాక్య సుందరితో సురతానంద సుఖభూమికలలో సంతత వజ్రయోగినీ మంత్ర జపంతో ధ్యానంతో శబ్దంలో నుండి తేజస్సులోకి ప్రయాణం జరిగింది.

అత్యంత సుఖశక్తి సమన్విత సురత శబ్దయోగ భావాతీతధ్యానదశకు చేరిన వారికి సమంతభద్రభవ్యానుభూతి లభించింది. ఆ స్థితిలో నాల్గు పారవశ్య భూమికలు దాటిన వారికి వజ్రసత్వ హేరుక దర్శనం లభించింది. శక్తిసాధనలో ఆ దశను మించినది లేదు. పరిపూర్ణమైన మహాజ్ఞానము, దివ్యమహాముద్రాస్థితి వారిని వరించినవి. ఆ నేపాల శాక్యదేవి నిజంగా బుద్ధదాకినియై ప్రకాశించింది. పద్మసంభవుడు అపరబుద్ధుడైనాడు.

ఈ విధంగా కొంతకాలం గడిచింది.

ఒకరోజు పద్మసంభవుడు శాక్యదేవితో అన్నాడు. "దేవీ ! ఈరోజు ధ్యానంలో బుద్ధగయకు వెళ్ళమని ఆదేశం వచ్చింది. అక్కడ వివిధ ప్రదేశాల నుండి వచ్చిన భిన్న మతస్థులు అయిదు వందల మంది బౌద్ధపండితులతో వాదిస్తున్నారు. నా మిత్రుడు శాంతరక్షితుడు, ఇతర ధర్మాచార్యులు

ఆవాదఘర్షణలో సతమత మవుతున్నారు. దానికి తోడు ఆ వచ్చినవారిలో కొందరు మంత్రవేత్తలున్నారు. వారు మన విద్వాంసులను బాగా ఇబ్బంది పెడుతున్నారు. వెంటనే అచటికి చేరుకోవాలి. ఇంక ఇక్కడ ఈ నిర్మానుష్య ప్రదేశంలో నీవుండవలసిన పనిలేదు. నాతో వద్దువుగాని. నేపాల్‌లో నీ తల్లిదండ్రులున్న పట్టణం వెళ్దాము. నీవు నీ తల్లి పోలికతో ఉండటం వల్ల మీ బంధువులు నిన్ను సులభంగా గుర్తుపడతారు. అక్కడ నా భక్తులు చాలా మంది ఉన్నారు. మీ రాజవంశీయులు ఆ భక్తుల సహకారంతో ఒక ఆశ్రమం నిర్మించేలా చేస్తాను. మీ బంధువర్గానికి సమీపంలో ఈ వసతి ఉంటుంది. బౌద్ధభిక్షుకిగా అక్కడ ఉండి వజ్రవారాహీమంత్ర సాధన చేద్దువుగాని. ఆ దేవత యొక్క మనశ్శక్తివి నీవు. సుప్తమైన ఆ శక్తి త్వరలో నీ యందు పూర్ణజాగృతిని పొందుతుంది. దానివల్ల ప్రజలకు మేలు చేసే ప్రభావం నీకు ప్రాప్తిస్తుంది. నీకు ఏ యిబ్బంది రాకుండా సిద్ధస్థితి వచ్చేలా నేనుచూచు కొంటాను. నన్ను విడిచి నీవుండలేవని నాకు తెలుసు. కాని దేవకార్య సముద్యతులం మనం. ఆ కర్తవ్య నిర్వహణ కోసం కొంత త్యాగం చేయకతప్పదు. పద ! వెళుదాము!".

ఆమె అతని గుండెపై వ్రాలి కన్నీరు కార్చింది. కొండలలో, కోనలలో కోతుల మధ్య అమాయకంగా పెరిగిన పిల్ల తన సర్వస్వమనుకొన్న స్వామితో వియోగాన్ని భరించే శక్తిలేదు. ఇప్పుడిప్పుడే వికసిస్తున్న మనస్సు నెమ్మది నెమ్మదిగా విషయాలు తెలుసుకోగలుగుతున్నది. స్వామితో కలసి ప్రయాణం చేసి తన వంశీయులను, బంధువులను కలుసుకొంది. ఊహించని ఈ అద్భుతానికి వారు ఆనందపరవశులైనారు. ఆ బాలిక నక్కడ అప్పగించి ప్రయాణమై వీలైనంత వేగంగా బుద్ధగయ చేరుకొన్నాడు. శాంతరక్షితుడు, మిగిలిన ప్రముఖాచార్యులు పద్మసంభవుని కలసి పండితవాదుల విషయాన్ని గూర్చి కూలంకషంగా చర్చించారు. శైవ వైష్ణవ శాక్తేయ గాణాపత్య సౌరాది మతాలను గూర్చి అద్వైత, ద్వైత, విశిష్టాద్వైత, శివాద్వైత, శాక్తాద్వైత, శుద్ధాద్వైతాది సంప్రదాయాలను గూర్చి ఎవరితో ఎవరెవరు వాదించాలో, ఇంతకుముందు జరిగిన వాదాల సంఘర్షణలలో ఎవరు దెబ్బతిన్నారో,

దెబ్బతిన్నవారిలో వాదశక్తి వల్ల ఓడిపోయిన వారెందరు, క్షుద్రప్రయోగాల వల్ల ఇబ్బందులు పడ్డవారెవరు ఇవన్నీ పరిశీలించారు. పకడ్బందీ వ్యూహంతో పద్మసంభవుని నేతృత్వంలో ప్రణాళికారచన జరిగింది.

వాద సంగ్రామానికి అన్నివర్గాల వారికి ఆహ్వానాలు వెళ్ళినవి. పద్మసంభవుడనే ఉద్దండుడు బౌద్ధధర్మరక్షకుడుగా వచ్చాడని అతడు శాస్త్రవేత్త మాత్రమే కాక గొప్ప మాంత్రికుడని వార్తలు బయలుదేరినవి. ఎవరి జాగ్రత్తలు వాళ్ళు పడ్డారు. అధికసంఖ్యాకులైన భిన్న మతస్థులుండటం వల్ల కొన్ని నెలల పాటు విద్వత్సభలు జరిగినవి. వాద ప్రతివాదాలు జరుగుతున్నప్పుడు మంత్రవేత్తలూ వూరుకోలేదు. నెత్తురు కక్కటం, నోళ్ళుపడిపోవటం, కాళ్ళు చేతులు శరీరభాగాలు పక్షవాతం రావటం ఇంతకు ముందు జరిగినవి. ఇప్పుడు కూడా ఆప్రయోగాలు జరిగినవి. కాని ఒక్కటి కూడా పని చేయలేదు. క్రోధోద్రిక్తులైన మాంత్రికులు కలసి దీనికి కారకుడైన పద్మసంభవుని మీద ఆభిచారిక ప్రయోగం చేసి చంపటానికి ప్రయత్నించారు. వాళ్ళంతా వ్యాధిగ్రస్తులైనారు. ఇది జరిగిన మరునాడు విద్వత్సభలో పద్మసంభవుడు ప్రసంగించాడు.

“సభాసదులారా ! చాలాకాలంగా ఇక్కడ మతసభలు - వాద ప్రతివాదాలు జరుగుతున్నవి. ఇందులో గెలుపోటములు సిద్ధాంతబలంమీద, పండితుల శాస్త్రబలం మీద ఆధారపడి ఉంటవి. వాదంలో నిలబడలేక క్షుద్రప్రయోగాలు చేయటం ధర్మసమ్మతం కాదు. మంత్రశక్తి ఏ ఒక్కరి సొమ్ముకాదు. ఒకని మించిన వాడు మరొకడుంటాడు. తాడిదన్నేవాడొకడైతే తలదన్నేవాడింకొకడు. కరుణామయుడైన బుద్ధుడు పుట్టిన భూమి యిది. ఇక్కడ హింసకు తావులేదు. హింసకు ప్రతిహింస సమాధానం కాదు. ఇచటికి వచ్చిన వారిలో కొందరు వాదం చేయలేక ప్రయోగాలు చేశారు. ఇది మహాపాపం. భగవంతుడైన బుద్ధదేవుడు ధర్మరక్షణ కోసం నాకు శక్తిని ప్రసాదించాడు. ఆ శక్తితో హెచ్చరిస్తూ చెపుతున్నాను. బౌద్ధులెవరూ ఇతరుల మీద మంత్రప్రయోగాలు చేయలేదు. బౌద్ధపండితుల మీద ప్రయోగాలు చేసిన వారి ప్రయోగశక్తి, మంత్రసిద్ధి నశిస్తుంది. ఈ జీవితంలో వారికింక ఏ

దేవతా పలకదు. మరొకమాట కూడా చెప్తున్నాను. ఈ అనంతమైన కాలంలో ఒక్కొక్కరికి ఒక్కొక్క కాలం యోగిస్తుంది. ఇది బౌద్ధులకు అనుకూలమైన కాలం. ఇప్పుడు మమ్మెవరూ జయించలేరు. ఈ వాదాలలో బౌద్ధం విజయం సాధించిన సంగతి అందరూ చూస్తున్నారు. తథాగతుని బోధలతో దశదిశలు ప్రతిధ్వనిస్తున్నవి. అందరూ బౌద్ధధర్మాన్ని స్వీకరించండి. విరాగులు భిక్షుకులు కండి!"

వాదసభలు ముగిసినవి. బౌద్ధధర్మం విజయం సాధించింది. పండితులంతా ఎవరి స్థానాలకు వారు వెళ్ళిపోయినారు. శాంతరక్షితుడు, పద్మసంభవుడు, ఇతరముఖ్యులు బౌద్ధధర్మాన్ని సుస్థిరం చేయటానికి కావలసిన పనులన్నీ చేయిస్తున్నారు. సంఘారామాలు, గ్రంథాలయాలు, సుశిక్షితులైన మతప్రచారకులు – పెద్దయెత్తున కృషి జరుగుతున్నది.

ఇది ఇలా ఉండగా ఒక రోజు రాత్రి ధ్యానం చేస్తూ ఉంటే దూరం నించి ఎవరో పిలుస్తున్నట్లు అనిపించింది. మధుర మంజులమైన సంగీతం వినిపిస్తున్నది. అది మానుషమైన గానం కాదు. దేవలోకపు అంచుల నుండి ఏ అప్సరసో పాడుతున్నపాట. ఆ పాటతో పాటు విచిత్రమైన పరిమళం వస్తున్నది. పద్మసంభవుడు ఆశ్రమం నుండి ఒక్కడే బయలుదేరి అలా ఆ పిలుపు వచ్చిన చోటికి బయలుదేరాడు. ఆ పాట అలలు అలలుగా దగ్గరగా కాసేపు దూరంగా కాసేపు ఎవరో వశీకరణ మంత్రం ప్రయోగించినట్లుగా లాగుతున్నది. చాలా దూరం వెళ్ళిన తర్వాత ఒక నిర్మానుష్య ప్రదేశంలో చిన్న కుటీరం. చుట్టూ పూల మొక్కలు. ఆ కుటీరంలోకి ప్రవేశించాడు. లోపల ఎవరో అమ్మాయి ధ్యానం చేస్తున్నది. ఎదురుగా తన చిత్రమే పూజ అందుకొని ఉన్నది. ఆమె కన్నులు తెరవలేదు. పెదవి కదపటం లేదు. ఆమె అంతరంగ సంగీతమది. పరిమళంతో పల్లవిస్తున్న నాదం. ఆమె జపిస్తున్న తన నామంతో కూడిన సిద్ధగురుమంత్ర తరంగాలు తననిక్కడకు పిలుచుకు వచ్చినవి. ఒక్కక్షణం కండ్లు మూసుకొని చూచాడు. ఆమెలో తనను కోరుతున్న డాకిని కనిపించింది. ఆమె శిరస్సుపై చేయి ఉంచాడు. ఆ విద్యున్మయ హస్త స్పర్శతో ఆమె నెమ్మదిగా కండ్లు తెరచింది. ఎదురుగా తన ప్రభువు. స్వామీ

! సాక్షాత్కరించావా ? ఎన్నాళ్ళకు దయకలిగింది! అంటూ పాదాల మీద వాలిపోయింది. ఆ యౌవనవతియైన యోగినిని లేవనెత్తి కౌగిలించుకొన్నాడు. పశ్చిమోత్తర భారత భాగం నుండి వచ్చిన కళాసిద్ధి అన్న భిక్షుకి ఆ కన్య. దగ్గరకు వచ్చి కోరటానికి ధైర్యం చాలక అంగీకరిస్తానో లేదో అన్న భయంతో ఈ ఉపాసన మార్గంలోకి ప్రవేశించింది. దేవతానుగ్రహం వల్ల ఇష్టసిద్ధిని సాధించుకొన్నది. సిద్ధగురుమంత్ర ప్రభావం అసామాన్యమైనదని నిరూపించింది. మందారవ, శాక్యదేవి తాను తీర్చిదిద్దిన కామయోగినులు ఈమె తన దగ్గరకు వచ్చేసరికే మంత్రసుందరియై అలరుతున్నది. ఆమెతో చేస్తున్న కామసాధనలలో ఒక అద్భుతాన్ని అతడు గమనించాడు. కళాస్థానముల రహస్య జ్ఞానం ఆమెకున్నంతగా ఎవరికీ ఉండదేమో అనిపించింది. కళాసిద్ధి అన్న పేరు సార్థకమైనదని ఆమెతో అన్నాడు. కామసాధనతో ఆమెను మరింత సిద్ధురాలిగా తీర్చిదిద్దాడు. ఆమె కన్య. అనన్యపురుష సంగమ. కాని అత్యంత ప్రౌఢబహుళానుభవ సిద్ధ లక్షణాలు ఎలా వచ్చినవా అని పద్మసంభవుడు భావించాడు. ఆమె అన్నది "మహావీరా మీరు కామధర్ములు - ధర్మకాములు. సిద్ధేశ్వరులు. నా విషయంలో మీ ఆలోచన నాకు తెలుసు. చిన్నప్పుడు నాకలలలో ఒక అప్సరస తరచుగా కనిపించేది. ఆ దేవత ఎన్నో కామ విషయాలు నాకు బోధించింది. యోగసాధనలు నేర్పింది. వాటి ఫలితంగా నాకొక యోగితరచుగా కనిపించేవాడు. అతడు నా గురువు నా ప్రియుడు. నా సర్వస్వము. అతనికి సమర్పించటం కోసం నా యౌవనం ముడుపుగా కట్టి ఉంచాను. మత మహాసభలలో మిమ్ము మొదటిసారి చూచినప్పుడు నాకలలలోని రాజకుమారుడు మీరేనని తెలుసుకొన్నాను. కాని నన్ను మీరు తెలుసుకోవాలి గదా ! అందుకే గౌరీదేవి శివుని కోసం తపస్సు చేసినట్లు నేను మీ కోసం చేశాను. అన్నట్లు పర్వత పుత్రిక తపస్సు చేసిన గౌరీ కుండం నేను చూచాను. హిమాలయ యాత్రలో కైలాస పర్వత ప్రాంతంలో ఆ మహనీయురాలు స్నానం చేసిన కుండమది. అక్కడ తపస్సు చేస్తే చాలా వేగంగా సిద్ధిస్తుందని పెద్దలు చెప్పగా కొంతకాలం ధ్యానసాధన చేశాను. ఆ సమయంలో మీతో అనుబంధం ఉన్న కుంగామోయోగిని పరిచయమైంది. అచట ఒక ఆశ్రమంలో

నూతనాగంతుకులకు ధ్యానమార్గంలో శిక్షణ ఇస్తున్నది. నాయందెంతో వాత్సల్యంతో సాధన రహస్యాలను ఎన్నో నేర్పి మిమ్ము గురించి తెలియజేసింది. పద్మసంభవుని జీవితంలో అయిదుగురు స్త్రీలు ప్రముఖ పాత్ర వహిస్తారని అందులో నీవొక దానివని నాతో ఆమె అన్నది. కామసాధనలు మీతో చేసి సిద్ధస్థితిని పొంది బౌద్ధధర్మ ప్రచారం కొంతకాలం నిర్వర్తించి సిద్ధాశ్రమ భూమికకు రావలసినదని ఆదేశించింది. మీరు, నేను మరికొందరు పూర్వం అక్కడివారమే. అచటి నుండి వచ్చాము. మళ్ళీ వచ్చిన పని పూర్తయిన తర్వాత ఆ చోటికి వెళ్ళవలసిన వారమే. అయితే వీరయోగీ ! మన అనుబంధాలు ఈ జన్మతో ఆగిపోయేవి కాదు. మీకు గాని మాకు గాని ముక్తి ఇప్పట్లో లేదు. లోకకళ్యాణం కోసం జన్మలెత్తక తప్పదు. నావంటి వారు కొందరు కొన్ని జన్మల పాటు మీతో రాక తప్పదు. శిష్యురాండ్రుగా, ప్రియురాండ్రుగా అందరూ మీతో, అనుబంధం పొందుతారు. గోపకన్యలు కృష్ణునితో ఎలానో మేమూ మీతో అలానే మధురాను బంధం కలిగి ఉంటాము. భైరవగణానికి చెందిన కృష్ణభైరవుడనాలో లేక వజ్రయోగినీ కృపాపాత్రుడైన వజ్రభైరవుడనాలో ఏదైనా వజ్రయాన పంథాలో మిమ్ము మించినవారు లేరు. ఇక ముందు ఉండబోరు. "న భూతో నభవిష్యతి" పంచ మకారములతో సమ్మిళితమైన వామాచారము, రుద్రభూమిలో చేసే శ్మశానాచారము సమన్వయం పొందిన మార్గం మీది. మహాశ్మశానంలో చితాతల్పం మీద మహాకాళునితో పురుషాయితం చేసే మహాకాళి మనకాదర్శము.

**శ్లో॥ శ్మశానస్థే చితాతల్పే శవస్య హృది సంస్థితాం**
**మహాకాలేన దేవేన మారయుద్ధం ప్రకుర్వతీం.**

మనం ఉపాసించే వజ్రయోగినిని క్రోధకాళి అని కొందరన్నారు గాని నా దృష్టిలో ఆమె కామకాళి. కామంలో నుండి శక్తినిపుట్టించే దేవత - కామకాళి - అస్సాంలోని గౌహతిలో యోనిపీఠనివాసినియై ప్రకాశిస్తున్నది. గురుదేవా! మీ తరువాతి గమ్యస్థానం అదేనని నాకు అనిపిస్తున్నది. మీకు చెప్పగలిగినంత దానను కాదు గాని అక్కడకు మీరువెళ్లాలి. ఏవో అనూహ్యమైన విశేషాలు జరుగుతవని తోస్తున్నది".

పద్మసంభవుడు విస్ఫారిన కండ్లతో చూచాడు. "కళా ! నీవింతటి జ్ఞానశక్తి సంపన్నురాలి వనుకోలేదు. సముద్రము వలె గంభీర, వ్యోమము వలె నిశ్చల - బుద్ధులచే ప్రత్యేకబుద్ధులచే, శ్రావకులచే నిషేవితమైన ప్రజ్ఞాపారమితవునీవు. అనుపమానమైన జ్ఞానశక్తి నీలో ఉప్పొంగుతున్నది. నా సంగమం వల్ల క్రియాశక్తి నీలో వికసిస్తుంది. మహాయోగినివై బౌద్ధధర్మ పరివర్తనలో ప్రధానపాత్రను పోషించి నీ కర్తవ్యాన్ని నెరవేర్చు. అవలోకితేశ్వరుని ప్రభావం వల్ల నీ యందు అద్భుత వశీకరణ శక్తి విజృంభిస్తుంది. వాయవ్య భారతమంతా నీ కనుసన్నలలో నిలుస్తుంది. కొంతకాలం ధర్మప్రచారం చేసి సంఘారామకేంద్రాలను పెంపొందించి నా దగ్గరకు వద్దువుగాని. హిమాలయాలలో టిబెట్ నా ప్రధాన ధర్మప్రచార కేంద్రం కాబోతున్నది. అయితే ఈలోపు నీవు చెప్పిన విధంగా కామాఖ్య వెళ్ళి వస్తాను. అక్కడి శక్తి తంత్ర విశేషాలు కొన్ని నేర్చుకోవలసినవి ఉన్నవి. పంచమకార సాధకుడు ముఖ్యంగా కామయోగమార్గీయుడు కామాఖ్య వెళ్ళకపోతే పరిపూర్ణుడు కాలేడు. మహావిద్య లెక్కడ ఉంటే అక్కడకు వెళ్ళి నేర్చుకోవాలి. నేనెంత సిద్ధుడనైనా నిత్య విద్యార్థిని."

పద్మసంభవుని జీవితంలో మరొక అధ్యాయం మొదలైంది. కామాఖ్యకు ప్రయాణం. కొంత ఎక్కువ కాలం పట్టినా త్రోవలో ఎన్నో క్షేత్రాలు - ఆశ్రమాలు దర్శిస్తూ బ్రహ్మపుత్రానదీ తీరంలో ఉన్న గౌహతి చేరుకొన్నాడు. అక్కడ కుబ్జికాపీఠం ఉన్నది. కుబ్జ అనే పేరుతో జగన్మాత ఆ స్థానంలో వెలసి ఉంది. ఆమె పేరు ద్వాపర యుగంలో కంసునికి సుగంధద్రవ్యాలు - చందనాదులు తీసుకు వెళ్ళే స్త్రీకి ఉండేది. త్రివక్రయైన ఆమెను కృష్ణుడు అనుగ్రహించి సౌందర్యవతిగా మార్చాడు. కృష్ణునకామెయందు పుట్టినవాడే ఉపశ్లోకుడు. తన తండ్రియైన వాసుదేవ కృష్ణుని భగవంతునిగా ప్రకటిస్తూ నారదుని అనుగ్రహం చేత పొందిన దివ్యజ్ఞానంతో సాత్వత సంహిత అనే గ్రంథం రచించాడు. అతని తల్లి పేరు ప్రాగ్జ్యోతిషములోని పీఠదేవత పేరు. ఆ కుబ్జ యేకుబ్జిక. బాల బాలికవలె. ఆ పీఠం అలా ఉండగా ఆ స్థలంలో సతీదేవి శరీరంలోని యోని పడి అది యోని పీఠమైంది. ఆ దేవత పేరు

'కామ' - కామదేవి. కామాఖ్య అంటారు. (ఆఖ్యా - ఆహ్వా - అభిధానంచ - అని అమరకోశం).

ఆఖ్య అంటే నామం. కామ అనే పేరు గల దేవి. బ్రహ్మాండ పురాణంలోను ఉపపురాణమైన కాళికా పురాణంలోను ఆమె చరిత్ర ఉన్నది. పద్మసంభవుడు దానిని ఆసక్తితో చదివాడు. శివుని చేత దహనమైన మన్మథుడు మళ్ళీ లలితాదేవి చేత బ్రతికించబడి ఆమె యందలి కృతజ్ఞతా పూర్వక భక్తితో ఆమెను ప్రాగ్జ్యోతిషంలోని యోని పీఠంలో ప్రతిష్ఠించాడు. (ఒకప్పటి ప్రాగ్జ్యోతిషమే ఇప్పటి గౌహతి). లలితాదేవి చతుర్భుజ - చెరకువిల్లు, పుష్పబాణాలు, పాశము, అంకుశము - నాలుగు చేతుల్లో ధరించి ఉంటుంది. పాశాంకుశములు లేకుండా కేవలం ఇక్షుధనువు, కుసుమశరములు గల దేవతగా ఆ కామేశ్వరిని అక్కడ ఆవాహన చేశాడు. అరుణవర్ణ విరాజితయైన ఆ లలిత - కామదేవి - కాలపరిణామంలో కాళికగా మార్పుచెందింది. కామాఖ్యకాళిగా ఉపాసించబడుతూ భక్తులను అనుగ్రహిస్తున్నది. ఆమెను వామాచార మార్గంలో, పంచమకారాలతో ఉపాసించాడు నరకాసురుడు. సాధనలో అది ఒక మార్గం. ఇష్టమైనవారు ఆ పద్ధతిలో చేస్తారు. అయితే నరకాసురుడు రాజకన్యలను బలవంతంగా చెరబట్టి తెచ్చి వారిని చెరిచి తన కామసాధనకు ఉపయోగించుకొన్నాడు. ఆ పాపఫలితంగా కృష్ణుని చేత వధించబడినాడు. తానెప్పుడూ అటువంటి పనిచేయడు. ఇష్టమైన స్త్రీలతో మాత్రమే మైథునసాధన చేశాడు. చేస్తున్నాడు. అయితే దుష్టుడైనా నరకుని సిద్ధశక్తి సామాన్యమైనది కాదు. త్రేతాయుగంలో రావణుడు, ద్వాపరయుగంలో నరకుడు వయస్సును జయించినవారు. కృతయుగంలోని మాంధాతకాలంనాటి వాడు రావణుడు. త్రేతాయుగంలోని జనకమహారాజు కాలంనాటి వాడు నరకుడు. ఆ మిథిలాపతి చేత పెంచబడిన నరకుడు తరువాత విష్ణుదేవుని అనుగ్రహం వల్ల ప్రాగ్జ్యోతిష ప్రభువైనాడు. కామసాధనలతో యోని పీఠేశ్వరిని సంతోషపెట్టి అవక్ర పరాక్రమాన్ని కాల విజయాన్ని సాధించాడు. పాపం పండి రావణుడు రాముని చేత, నరకుడు కృష్ణుని చేత సంహరించబడినారు గాని లేకపోతే వారికి సహజమైన మరణం ఉండేది కాదేమో ! పద్మసంభవుడు

ప్రతిరోజు కామాఖ్య కాళిని దర్శిస్తున్నాడు. దేవి ఆలయంలో ఒక ప్రక్కన కూర్చుండి ధ్యానిస్తున్నాడు. తానెవరో తెలియకుండా గుప్తంగా వ్యవహరిస్తున్నాడు. ఒక రోజు అమ్మవారిని దర్శించటానికి వచ్చిన వారిలో ఒక సుందరకన్య అతనిని ఆకర్షించింది. ఆమె వైపు చూచి 'మంగళా' అనిపిలిచాడు. ఆమె వెనక్కు తిరిగి దగ్గరకు వచ్చింది.

కన్య : ఆర్యా ! మీరు నన్ను పిలిచారా !

పద్మ : నేను మంగళా ! అని పిలిచాను. నీ పేరదేనా ?

కన్య : నా పేరు తాషీ కేద్రెన్.

పద్మ : అయితే నీవెందుకు వచ్చావు ?

కన్య : నన్ను పిలిచినట్లనిపించింది.

పద్మ : నిజమే నీ పేరదే ఒకప్పుడు. అందుకే నీకు తెలియకుండా వెనక్కు తిరిగావు. పిలుపందుకొని వచ్చావు.

కన్య : ఒకప్పుడంటే !

పద్మ : పూర్వజన్మలో.

కన్య : నా పూర్వజన్మ మీకెలా తెలుసు ?

పద్మ : నాకు తెలియనిదేదీ లేదు. పూర్వజన్మలో ఈ కామాఖ్య కాళి భక్తురాలివి. ఈ దేవతను గూర్చి తపస్సు తీవ్రంగా చేశావు. కాని పరిపూర్ణ సిద్ధిరాకముందే మరణం వచ్చింది. ఆ సంస్కారం చేత ఇప్పుడు సిక్కింలో పుట్టావు. నిన్ను అనుగ్రహించటానికి – కాళీదేవి నిన్ను ఆకర్షించింది.

కన్య : నన్ను కాళీదేవి అనుగ్రహిస్తుందా ? ఎప్పుడు ? పూర్వం తపస్సు చేశానన్నారు ? ఇప్పుడు మళ్ళీ ఎంతకాలం చేయాలి ? అది నాకు సాధ్యమవుతుందా?

పద్మ : అవుతుంది. అయితే ఆనాటివలె సంవత్సరాల పాటు అక్కరలేదు. చాలా వేగంగా వచ్చేట్లు చేస్తాను. నాతోరా ! ఇక్కడ కాదు. అదుగో ! ఇక్కడికి

కొద్ది దూరంలో వజ్రవైరోచనీదేవి ఆలయం ఉన్నది. అక్కడ జనసమ్మర్దం ఉండదు. ప్రశాంతంగా ఉంటుంది.

కన్య : ఎందుకో మీమాటకాదనలేక పోతున్నాను. ఏదో ఆకర్షణ మీలో ఉంది – పదండి !

వజ్రేశ్వరి ఆలయంలోని ఏకాంత ప్రదేశంలో వారు కూర్చున్నారు. పద్మసంభవు డాఅమ్మాయిని కండ్లు మూసుకొని ధ్యానం చేయమన్నాడు. తాషీకేడ్రెన్ అలానే అమ్మవారి ఎదురుగా కూర్చుని ధ్యానం చేస్తున్నది. ఏదో మగత, నిద్రవంటిది, ఆవహించింది. కంటి ముందు ఏవో దృశ్యాలు కనిపిస్తున్నవి. ఈ ప్రాంతంలోనే ఒక పేద కుటుంబంలో జననం. తండ్రి కాళీభక్తుడు. ఇలవేలుపు కామాఖ్యకాళి. కొద్దిపాటి పొలం ఒక ఆవు వాళ్ళ ఆస్తి. ఆ పంట – ఈపాడి వీటితో కాలం ఎలానో వెళ్ళిపోతున్నది. కాస్త వయస్సు వచ్చిన తర్వాత ఒకనాడు తల్లి గుండెపోటుతో మరణించింది. తండ్రి ప్రేమతో పెంచాడు. తల్లి లేని లోటు రాకుండా వాత్సల్యంతో సాకాడు. అలా గడుస్తూ ఉన్నది. ప్రతిరోజూ ఒక భిక్షుకుడు ఇంటిముందు భోజన సమయానికి వచ్చేవాడు. వానికి ఉన్నంతలో కాస్త ఆహారం పెట్టి పంపించేది. ఇలా చాలా కాలం గడిచింది. ఒక రోజు అతనికి అమ్మవారికి నైవేద్యం పెట్టిన పాయసం పెట్టింది. అది తిని ఆ భిక్షుకుడు సంతృప్తి చెందాడు. "అమ్మా ! పాయసం చాలా రుచిగా ఉంది. నాకు ఎంతో సంతృప్తి కలిగింది. నీ కొక మంత్రం చెపుతాను నేర్చుకొంటావా ? అన్నాడు. మంత్రాలంటే భయం. నేను చేయగలనా ? అన్నది. "పెద్దగా చేయవలసిన పని లేదు. వచ్చే నాలుగురోజుల్లో గ్రహణం వస్తున్నది. అప్పుడు చెయ్యి. చాలు. నేనిచ్చేది పాము మంత్రం. నాగరాజు దానికి దేవత. దానివలన నీకు విషసిద్ధి లభిస్తుంది. సిద్ధగురువు నాకిచ్చిన మంత్రమది. ఇది నీకు ఇచ్చి నేను వెళ్ళిపోతాను. చాలా కాలం నాకు అన్నం పెట్టావు. నీ ఋణం తీర్చుకోవాలి. నీ జీవితంలో ఈ మంత్రవిద్య నీకు ఎంతో ఉపయోగిస్తుంది" అని ఆ అమ్మాయిని ఒప్పించి మంత్రమిచ్చాడు. ఆమె "తాతా! ఎక్కడికో వెళ్ళిపోతానన్నావు. మీ ఊరికా ?"అన్నది. "లేదమ్మా ! నాకు ఊరు లేదు.

పేరు లేదు. నేను ఆగమ్మ కాకిని. గాలికి తిరుగుతూ అదుగో ఆ దూరంగా కనిపించే కొండల్లో ఒక గుహ దగ్గరకు వెళ్ళాను. అక్కడ ఒక సాధు మహాత్ముడున్నాడు. ఆయనకు కొంతకాలం సేవ చేశాను. ఆయన నాకీమంత్రమిచ్చాడు.

ఆమంత్ర ప్రభావం వల్ల ఎందరినో పాముకరిచి మరణించే వారిని బ్రతికించాను. రోగాలు బాగుచేశాను. నేను పిలిస్తే పుట్టలోని పాము లేచి వస్తుంది. నీకంతకంటే ఎక్కువ శక్తి వస్తుందని నాకు అనిపిస్తున్నది. మా గురువుగారి దగ్గరనుండి నాకు పిలుపు వచ్చింది. ఆయన బాగా వృద్ధుడైనాడట ! వారికి సేవచేస్తూ అక్కడే ఉండిపోవలసి వస్తుంది. బహుశా నేను తిరిగి రాకపోవచ్చు. ఈ విద్య నీకు బాగా ఉపకరిస్తుంది" అని ఆ భిక్షుకుడు వెళ్ళిపోయాడు. ఆయన చెప్పినట్లు గ్రహణ సమయంలో జపం చేసింది. కండ్ల ముందు ఏదో ఒక పెద్దపాము కదలుతున్నట్లు అనిపించింది. ఇంటిపనులతో ఎక్కువ కుదిరేది కాదుగాని రోజు కాసేపైనా ఆ మంత్రాన్ని మనస్సులో అనుకొంటూ ఉండేది.

తండ్రి ముసలివాడైనాడు. ఇంటిపనులకు తానే ఎక్కువగా బయటకు వెళ్ళవలసి వచ్చేది. ప్రక్కవీధిలో ఆకతాయి కుర్రవాళ్ళు తన వెంటబడి వేధించేవారు. ఒకసారి తెలిసిన వారింటికి పనిమీద వెళ్ళి వస్తుంటే చీకటిపడింది. వీధిలో జనం లేరు. ఆ అల్లరి కుర్రవాళ్ళు నలుగురు తనను నోరు నొక్కి బలవంతంగా ఎక్కడకో మోసుకెళ్ళారు. ఆ రాత్రి తనను మానభంగం చేశారు. తరువాత కదలకుండా కట్టివేశారు. తెల్లవారింది. తానెక్కడ ఉన్నది తెలియదు. మధ్యాహ్నానికి అన్నం తెచ్చి తినమన్నారు. తాను తినలేదు. కొట్టి హింసించారు. ఆ దెబ్బలు తినలేక కొంత తీసుకొంది. ఇలా ఆ యింట్లో నాలుగు రోజులు గడచింది. వాళ్ళకు కావలసినప్పుడల్లా క్రూరంగా అనుభవించేవారు. అయిదవరోజు ఎవరో కొత్త వారు వచ్చారు. వారికి ఈ యువకులు తనను అమ్మివేశారు. కొన్నవారు యవన వర్తకులు. వారు తనను రహస్యంగా తీసుకొని వెళ్ళారు. నిస్సహాయస్థితిలో వారితో వెళ్ళకతప్పలేదు. రెండు మూడునెలల ప్రయాణం తర్వాత వారి దేశంలో ఒక

ధనవంతునికి అమ్మివేశారు. అతని యింట్లో చాలామంది బానిసలున్నారు. అది ఒక కోట వంటిది. ఎవరూ తప్పించుకుపోలేరు. అక్కడ దాసీపని. యజమాని బుద్ధిపుట్టినప్పుడు అనుభవించేవాడు. అక్కడి భాష నేర్చుకొన్నది. తప్పదు గనుక శ్రద్ధగా సేవచేసింది. కొంతకాలానికి యజమానికి బాగా నమ్మకం కుదిరింది. ఏదైనా పనులకు బజారుకు పంపేవాడు. ముందెవరినో కాపలాగా తోడిచ్చి పంపేవాడు. తరువాత ఒక్కతే వెళ్ళేది. ఎవరూ ఆ ఊరి నుండి తప్పించుకొని వెళ్ళలేరు. బయటకు వెళ్ళేమార్గాలలో సైనికులు కాపలా ఉంటారు. విదేశీయులను పరిశీలిస్తారు. బానిసలను సులభంగా గుర్తుపట్టి శిక్షించి యజమానికి అప్పగిస్తారు. పరిణామాలు దారుణంగా ఉంటవి. అందువల్ల ఎవరూ ఆ ప్రయత్నాలు చేయరు.

ఆ యింటికి కొద్దిదూరంలో గోరీల దొడ్డి ఉన్నది. అక్కడి కాపలాదారు తన యజమాని సేవకుడే. అతనిని మంచి చేసుకొని అక్కడ ఎక్కువ సేపు ఉండేది. కొన్నాళ్ళు పగలు యజమాని సేవచేసి రాత్రుళ్ళు గోరీలదొడ్డిలో కూర్చుని ఈ నాగమంత్రం చేయటం మొదలు పెట్టింది. నెలలు గడుస్తున్నవి. ఒకనాటి అమావాస్య అర్ధరాత్రి బ్రహ్మాండమైన నాగశిరస్సు గల ఒక మూర్తి సాక్షాత్కారించింది. "అమ్మా ! ఈ మృతశరీరాల మధ్య భయం లేకుండా నా మంత్రం చేశావు. నీకు సిద్ధి కలిగింది. నేను నాగభైరవుణ్ణి. నీకేం కావాలి ? చెప్పు" అన్నాడు. "దేవా ! నాగరాజా ! నన్నీ దారుణస్థితికి తెచ్చిన నలుగురు యువకులను చంపాలి. నా తండ్రి ఎలా ఉన్నాడో – ఏమైనాడో తెలియదు. నాకు కర్తవ్యాన్ని ఉపదేశించు" నాగభైరవుడు కరుణతో అన్నాడు. "తల్లీ ! నీ పగ తీరుతుంది. నా ప్రభావం వల్ల నీ యజమాని నీకు స్వేచ్ఛనిస్తాడు. నీలో నా శక్తి ప్రవహిస్తుంది. నన్ను స్మరించి నా మంత్రం మనస్సులో పఠించి నీవెవరిదేహం మీద దంతక్షత, నఖక్షతములు చేస్తావో వానిలోనికి నీ పండ్లగాట్ల ద్వారా గోళ్ళు గ్రుచ్చటం ద్వారా నా విషంప్రవేశిస్తుంది. ఎంతవాడైనా మరణిస్తాడు.

మరొక వరం కూడా ఇస్తున్నాను. ఇక్కడకు దగ్గరలో ఒక పెద్దరావి చెట్టున్నది. దానికి కొంచెం దూరంలో ఒక పుట్ట ఉన్నది. అక్కడకు వెళ్ళు.

నీవక్కడకు వెళ్ళగానే నా సంకల్పం వల్ల అందులోని మహాసర్పం వెళ్ళిపోతుంది. అక్కడ త్రవ్వు. ఒక నిధి దొరుకుతుంది. దాన్ని తీసుకో. ఆ తర్వాత ఏం చేయాలో నీకే తెలుస్తుంది."

నాగభైరవుని కృపవల్ల స్వేచ్ఛ పొంది ఆ ధనంతో తను స్వస్థలం చేరింది. స్వగృహంలో ఇన్నేండ్ల కాలంలో దుఃఖంతో మంచంపట్టిన ముసలితండ్రిని చూచి శోకార్తయై విలపించింది. చిక్కి శల్యావశిష్టుడైన తండ్రి బిడ్డను దగ్గరకు తీసుకొని ఆనందబాష్పాలు రాల్చి గద్గదకంఠంతో పరామర్శించాడు. ఆ గ్రామంలోని వైద్యుల కంటే కొంచెం దూరంగా ఉన్న పెద్దనగరంలో ఘన వైద్యులున్నారు. వారిచేత తండ్రికి వైద్యం చేయించాలని నిశ్చయించుకొని అక్కడికి చేరింది. ఇప్పుడు తాను ధనవంతురాలు. దూరదేశం నుండి వచ్చిన ధనవంతురాలని జమీందారిణి అని చెప్పి పరివారాన్ని, పరిచారకులను సమకూర్చుకొని పెద్ద భవనం తీసుకొని నివసించటం ప్రారంభించింది. సమర్థులైన వైద్యుల పర్యవేక్షణలో తండ్రి కోలుకొంటున్నాడు.

ఈలోపు తన శత్రువులు తన నాశనానికి కారకులైన నలుగురు ఆ నగరంలో వివిధ రంగాలలో ప్రముఖులుగా ఉన్నారని తెలుసుకొంది. విలువైన వస్త్రాలతో రత్నాభరణాలతో గుర్తుపట్టలేని విధంగా వారి రాజప్రముఖులయిండ్లకు రాకపోకలు సాగించి వారిని విందులకు ఆహ్వానించేది. ఆ విందులలో సంగీత నృత్య ప్రదర్శనలు నిపుణులచే చేయించేది. ఖరీదైన మద్యం ఇవ్వబడేది. రకరకాల రుచ్య పదార్థాలతో విందులు జరిగేవి. ప్రముఖులు ఆమె విందుకు ఎప్పుడాహ్వానం వస్తుందా అని ఎదురు చూచే స్థితి వచ్చింది. ఆ నలుగురిని ఊరిపెద్దలతో పాటు ఒక రోజు రాత్రి విందుకు ఆహ్వానించింది. ఆమెను ఇన్నేండ్ల తర్వాత దీపాల జిలుగు వెలుగులలో రత్నాభరణాల తళతళలలో వారు గుర్తుపట్టలేదు. ఇండ్లకు వెళ్ళిన తర్వాత కొద్దిరోజులకు రహస్యంగా రాత్రివేళ విందుకు, మందుకు, పొందుకు రమ్మని ఒకరికి తెలియకుండా మరొకరికి అలా నలుగురికి రహస్యంగా చేటికల ద్వారా వర్తమానం వెళ్ళింది. మురిసిపోయి వచ్చిన ఆ నలుగురు ఇండ్లకు తిరిగి వెళ్ళలేదు. విడి విడి గదులలో వారి దగ్గరకు వెళ్ళి శృంగారానికి

ప్రేరేపించి కౌగలించుకొని నాగరాజువరంతో వారికి దంతక్షత, నఖక్షత విషప్రయోగం చేసింది. మరణసమయంలో తానెవరో వారికి తెలిపింది. మృతశరీరాలను రహస్యంగా ఖననం చేయించింది. వారు రహస్యంగా వచ్చారు గనుక వారి కుటుంబ సభ్యులకు తెలియలేదు. వెదికిస్తున్నారు. తన వరకు వారి కథ ముగిసింది. కొంతకాలానికి వృద్ధజనకుడు సహజ మరణం పొందాడు. తాను పరిమిత పరివారంతో దేశాటనం చేస్తున్నది.

ఒకనాడు ప్రసిద్ధ క్షేత్రం హరిద్వార్ చేరింది. దానికి మాయాపురి అని కూడా పేరు. కొండమీద ఉన్న మానసాదేవిని దర్శించి అక్కడి ఆచారాన్ని అనుసరించి నాగోత్సర్జనం చేసింది. పల్లెటూళ్ళలో మొక్కుకున్నవారు వృషోత్సర్జనం చేస్తారు. కోడెదూడను స్వేచ్ఛగా విడుస్తారు. అది ఆబోతై ఆవులకు సంతానాన్ని కలిగిస్తుంది. అది ఏ పొలంలో వెళ్ళి పంటను తిన్నా ఎవరూ ఏమీ అనరు. హరిద్వార్‌లో మానసాదేవి–నాగేశ్వరి. వాసుకి చెల్లెలు – మహాతపస్విని. ఆమెకు సంతోషం కలిగించటం కోసం సంతానం కలగటం కోసం, నాగమును కొని స్వేచ్ఛగా వదిలిపెడతారు. అక్కడ పాములను అమ్మే పాముల వాళ్ళుంటారు. మ్రొక్కు కొన్నవారు పామును కొని పూజచేసి పాములవాని చేతనే విడిచిపెట్టిస్తారు– ముట్టుకోటానికి భయం గనుక. తాను కూడా పామును కొని తానే పట్టుకొని విడచిపెట్టింది. ఆ పాము వెళ్ళిపోకుండా ఆమె కాళ్ళమీద పడగపెట్టి పడుకొంది. "అహితుండికులకు ఆశ్చర్యం కలిగింది. దాన్ని బుజ్జగించి పంపివేసింది. ఇంతలో ఒకరు పాలు తెచ్చి ఇచ్చారు. ఆపామును మళ్ళీ వెనక్కు పిలిచి పాలు తాగించి పంపించింది. ఆమె మహా మాంత్రికురాలని అందరు సాష్టాంగపడ్డారు.

అక్కడి నుండి బయలుదేరి గంగాతీరంలో కొంతదూరం వెళ్ళింది. అచట ఒక చిన్న ఆశ్రమం కనిపించింది. మధ్యాహ్నవేళ ఆశ్రమంలోకి వెళ్ళగానే భోజన ఘంటారావం వినిపించింది. అక్కడివారు సాదరంగా తీసుకువెళ్ళి తనకు పరివారానికి భోజనం పెట్టారు. ప్రశాంతమైన ఆ వాతావరణం బాగా నచ్చింది. కొద్దిరోజులు ఉందామనిపించింది. కోరగా వసతి ఏర్పాటుచేశారు.

ఆశ్రమాధిపతి పేరు సిద్ధేశ్వరయోగి. ఆయన భైరవోపాసకుడట !

మహాశక్తి సంపన్నుడైన మాంత్రికశిరోమణియని అక్కడి వారు చెప్పారు. సాయంత్రం వారి ప్రవచనం విన్నది. భైరవోపాసకుడంటే చాలా తీవ్రంగా తామసమూర్తిగా ఉంటాడని ఊహించింది. కానీ తీరా చూస్తే పరమశాంతునిగా, అత్యంతసాత్వికుడుగా అఖండబ్రహ్మతేజస్విగా కనిపించాడు. మాటలు కూడా మనసుకు హత్తుకొనేలా నిర్మలమైన గంగాప్రవాహం మైదానంలో ప్రవహిస్తున్నట్లుగా ఉంది. ఏదో దివ్యలోకం నుండి ఒక దైవీవాక్కు ఆశరీరాన్ని నిమిత్తమాత్రంగా చేసుకొని బహిర్గతమవు తున్నట్లున్నది. కండ్లు మూతలుపడి ధ్యానస్థితిలోకి వెళ్ళింది. కొన్ని వేల మైళ్ళ ఎత్తున ఉన్న కాళీమండలంలో నుండి ఒక శ్యామసుందరి భూలోకంలో వచ్చి తానైనట్లు అనిపిస్తున్నది. దిగివచ్చేటప్పుడు ఆకాశం నుండి హిమశైలసానువులలోకి ప్రవేశించి అక్కడి గుహలలో మహనీయులైన సిద్ధులెందరో తపస్సు చేస్తుండటం కనిపించింది. కైలాసపర్వతం చుట్టూ ఉన్న కొండలు పద్మాకారంలో ఉండి కైలాసం మధ్యలో కర్ణికవలె భాసించింది. నెమ్మదిగా మెలకువ వచ్చి జాగ్రదవస్థలోకి వచ్చింది. ఆ మహనీయుడు ప్రవచనం పూర్తిచేసి తనను 'మంగళా' అని తెలిసిన వానివలె పిలిచాడు. "రేపుదయం కొండమీదికి నాతో వద్దువుగాని విశ్రాంతి తీసుకో" అని పంపించాడు. ఆయనతో ఏవో మాట్లాడాలనుకొంది. నోరు పెగలలేదు. ఏదో శక్తి తనలోకి ప్రవేశిస్తున్నట్లు అనిపిస్తున్నది.

మర్నాడు ఉదయం ఆ యోగి వెళ్తున్నాడు. అప్రయత్నంగా ఆయన వెంట నడుస్తున్నది. అడవిలో వెళుతుంటే మహాసర్పాలు కనిపించినవి. ఆయన నవ్వుతూ అదిగో ! మీ మాంత్రికురాలు వస్తున్నది అంటున్నాడు. అవి తలయెత్తి చూచి ప్రక్కకు తప్పుకొంటున్నవి. తన పేరు, తనమంత్రసిద్ధి అన్నీ తెలిసిన మహామనిషి ఆయన. కొంత దూరం పోయి కొండ ఎక్కుతున్నారు. ఒక గుహ కనిపించింది. ఆ గుహలోకి ఆయన వెంట తానూ వెళ్ళింది. ఆ పర్వత కందరంలో కాళీభైరవుల సుందర విగ్రహాలున్నవి. ఇంతలో ఒక పెద్దపులి వచ్చింది. ఆ యోగి దేవతల ముందు కూర్చుని పూజ చేస్తుంటే ఈ పులి ఆయన ప్రక్కన పిల్లివలె కూచుంది. ఆయన అన్నాడు "నీవు కాళీ పరివారంలోని దానివని తెలుసుకొన్నాను. పగతీర్చుకోటానికి నీవు చేసిన

మారణకాండవల్ల వచ్చిన దోషం పోయి పరిశుద్ధురాలివి కావాలి. నాగభైరవుని అనుగ్రహం నీకు లభించింది. ఇప్పుడు వజ్రభైరవుని కృప సాధించాలి. పరమేశ్వరియైన కాళి దయను సంపాదించాలి. ఇది నీతపస్స్థానం. ఈ గుహలో నిన్ను వదలినేను వెళుతున్నాను. నా వెంట నీవిప్పుడు రాకూడదు. రాలేవు కూడా. భవిష్యత్తులో నీవల్ల మహాకార్యమొకటి కావలసి ఉంది. దానికవసరమైన శక్తి యీతపస్సువల్ల వస్తుంది. కొద్ది క్షణాలలో నీకు కాళీమంత్రం వినిపిస్తుంది. అది జపం చేస్తూ ఉండు. ఏమవుతుందో చూడు" ఆ మహాపురుషుని పాదములపై వ్రాలింది. ఎందుకో కంటి వెంట అశ్రువులు రాలుతున్నవి. ఆ మహాత్మునితో పెద్దగా అనుబంధం కూడా లేదు. ఏదో జన్మాంతర బంధం ఆయనను విడిచి పెట్టలేని వియోగదుఃఖం కలిగిస్తున్నది. ఆ ఋషి జాలిగా ప్రేమగా తన తల నిమిరాడు. త్వరలో నన్ను కలుసుకొంటావు అని ఆశీర్వదించి వెళ్ళిపోయాడు. ఆయన ఆదేశాన్ని అనుసరించి శ్రుతమైన కాళీమంత్రం జపిస్తూ తాను కూర్చున్నది. మహాంధకారం. అందులో నుండి చిన్న వెలుగు. అది పెద్దదై ప్రభాతసూర్యుని వంటి అరుణారుణ తేజఃపుంజం - మధ్యలో కాళీమూర్తి- నమస్కరించి కండ్లు తెరిచింది. గుహబయటికి వచ్చి చూచింది. తను వచ్చినప్పుడున్న చిన్న మొక్క ఇప్పుడు పెద్ద చెట్టయి ఉన్నది. కొన్ని సంవత్సరాలు తాను సమాధిస్థితిలో ఉన్నట్లు గ్రహించింది. మహాత్ముడైన సిద్ధేశ్వర గురుదేవునకు మనసులో నమస్కరించి, గుహలోని దేవతలకు మ్రొక్కి బయలుదేరి గ్రామాలు, పట్టణాలు దాటి కామాఖ్య చేరింది. కాళీదేవి సన్నిధిలో కొంతకాలం శరీరపతనం దాకా నిత్యధ్యానం చేసింది. ఎక్కువ భాగం భావసమాధిలో గడిచింది. పరిపూర్ణమైన తపస్సిద్ధి కలుగుతున్న దశలో ఆయువు తీరి దేహం రాలిపోయింది. ఇప్పుడీ జన్మ - కంటిముందు మరొక అద్భుతదృశ్యం. కనులు తెరిచింది. పద్మసంభవునితో మంగళాదేవి మాట్లాడుతున్నది. "మహాయోగీ! మీ అనుగ్రహం అనన్యమైనది. నేనెవరో తెలుసుకొనేలా చేశారు. మీ కృపవల్ల నాకు కలిగిన దివ్యానుభూతిలో చివర ఒక విచిత్ర దృశ్యం కనిపించింది. నా గురుదేవులు - సిద్ధేశ్వరయోగి మీలో కనిపించాడు. వారే శరీరం వదలి మీరుగా పుట్టారా ? లేక నారాయణ కృష్ణుని శరీరంలోనికి గోలోకకృష్ణుడు ప్రవేశించినట్లు పుణ్యమూర్తులైన మీలోనికి

శ్రీ సిద్ధేశ్వరులవారు ప్రవేశించి యున్నారా ? అర్థం కావటం లేదు".

పద్మసంభవుడు మందహాసం చేశాడు. "మంగళా! ఇది దేవరహస్యం. దానిని గురించి చెప్పమని ఒత్తిడి చేయవద్దు. అనంతమైన కాలంలో ఇటువంటివి అరుదుగా జరుగుతవి.

ప్రస్తుతం నేనే నీగురువును. పూర్వజన్మలో ఇష్టంలేని భయంకర కామానుభవాలు పొందావు. ఇష్టమైన మధురశృంగారానుభవములు ఎలా ఉంటాయో తెలుసుకోవలసిన యోగం నీకు పట్టింది. వజ్రయోగిని కాళి యొక్క సంకల్పమిది. ఈ కామయాన మార్గంలో నీకు కాళీసాక్షాత్కారము సిద్ధశక్తులు లభిస్తవి. బౌద్ధధర్మాభివృద్ధికి సాధకులకు సహాయం చేయటానికి అవి ఉపయోగపడ గలవు. ఈశాన్యభారతంలో కామాఖ్య కేంద్రంగా నీవు పనిచేయవలసి ఉంటుంది. వజ్రవారాహీ దేవత క్రియాశక్తి నిన్ను నడిపిస్తుంది."

---

దక్షిణదేశంలో సుప్రసిద్ధుడైన రమణమహర్షిని గురించి తపోనిధియైన కావ్యకంఠగణపతిముని చెప్పాడు. కుమారస్వామి మూడు జన్మలు ఎత్తవలసి వచ్చిందని ఒకటి మహాపండితుడైన కుమారిలభట్టు, రెండు శివభక్తుడైన జ్ఞాన సంబంధర్, మూడు రమణుడు. మరోసారి వారే స్థూలశివుడనే ప్రాచీనముని రమణమహర్షిగా ఉదయించాడని, ఆశరీరములోనికి కుమారస్వామి శక్తి ప్రవేశించిందని అన్నారు.

అలానే మహాత్మాగాంధీలో కూడ ఒక సిద్ధాశ్రమయోగి ప్రవేశించి స్వాతంత్ర్య సమరము, సత్యాగ్రహాలు చేయించి బ్రిటిష్ వారు ఈ దేశం వదిలిపెట్టి పోయేలా చేశాడని కొంతకాలానికి అతడు ఈ దేహాన్ని వదిలిపోయిన తర్వాత ఏదో ఒక నిమిత్తం వల్ల మహాత్ముడు మరణించాడని ధ్యానయోగులు కొందరి విశ్వాసము.

అదే విధంగా ప్రఖ్యాత దైవీమూర్తి – జిల్లెళ్ళమూడి అమ్మను గూర్చి కూడా ఒక ధ్యానయోగి చెప్పాడు. "కుళంద అనే బ్రహ్మచారిణియైన యక్షిణి ఆమె శరీరంలోకి ప్రవేశించింది. ఆమె ప్రభావం వల్ల ఈ జిల్లెళ్ళమూడిఅమ్మ – మాతృశ్రీ అనసూయాదేవి సాంసారిక వ్యవహారాలు విడిచి బ్రహ్మచారిణిగా మారి దివ్యతేజస్సుతో వేలమందికి ఆకర్షణ కేంద్రంగా రూపొందింది.

మంగళాదేవి "మహాత్మా ! మీరు నాచేత ధ్యానం చేయించిన క్షణం నుండి నాలో స్ఫురణ పెరుగుతున్నది. ఏవేవో విషయాలు ఎన్నెన్నో విశేషాలు గుర్తుకు వస్తున్నవి. మీరు నాచేత పూర్వజన్మలో తపస్సు చేయించిన గుహ చూడాలని ఉన్నది. దయతో ఒకసారి అక్కడకు తీసుకువెళ్ళండి" అన్నది. పద్మసంభవుడు "మంగళా ! ఎక్కడి మాయాపురి ? ఎక్కడి కామాఖ్య ? అయినా నీ కోరిక తీర్చటం నా ధర్మం. దీనికి ఒక కొత్త ఆలోచన చేస్తున్నాను. నేను వచ్చిన మార్గంలో ఇక్కడ నుండి బయలుదేరి వెళ్ళవచ్చు. లేదా నీకు సుపరిచితమైన సిక్కిం, భూటాన్‌ల మీదుగా హిమాలయాలలో తిరుగుతూ సెలయేళ్ళ నీరు త్రాగుతూ వన్యఫలాలు తింటూ కొండగుహలలోనూ ఏ చెట్టు నీడలలోనో శయనిస్తూ చివరకు హరిద్వార్ చేరుకోవచ్చు. ఇది ఎవరూ చేయని, చేయలేని ప్రయాణం. కానీ మనకు అసాధ్యం కాదు" అన్నాడు. మంగళ చిరునవ్వుతో "స్వామీ ! ఇదే బాగుంది. అడవులతో సంసారం. గుహలలో కాపురం. నిరాడంబరమైన జీవితం. సంపదలకు, ఐశ్వర్యాలకు అతీతమైన రీతిలో ప్రకృతిలో కలిసిపోయే స్థితి.,

**కొండలలో జలధరములు గుంపులుగా కదలు చోట**
**కోనలలో జలపాతస్నానమ్ములు కుదురు చోట**
**గుహలలోన పూర్వ ఋషుల గుర్తులు కనిపించుచోట**
**కాపురమును చేసెదమో ! భూపురముల నేలెదమో**

**కాళిదేవి కనువెలుగుల కలువలు వికసించు వేళ**
**మహానటుని జటలలోని మందారము వాలయువేళ**
**దేవాంగన లాకసమున ధింధిమ్మని ఆడువేళ**
**సంధ్యానాట్యములు చేసి సాగుదమో మును ముందుకు**

**ఉషః కాంతికిరణమ్ముల ఊయెలలో ఊగెదమో**
**మలిసంజల కనకాంబరమాలలతో తూగెదమో**
**తెలివెన్నెల వెలుగులలో తేలుచు తెరతీయుదమో**
**ఓ స్వామీ ! నీయిచ్ఛావ్యూహమ్మది నాదు బ్రదుకు**

ఈ ప్రకృతియే ఒక ఆనందవనం. కాశీని ఆనందవనమంటారని విన్నాను.

కాలభైరవు డానందరూపుడై కాళీదేవితో విహరిస్తాడట ! ఇక్కడ కూడా కామాఖ్య కాళీప్రియుడు ఆనందభైరవుడే. మంత్రశాస్త్రంలో ఆనందభైరవ ద్వంద్వం అని మంత్రములున్నవి. మన మాజంటవంటి వారమని నా విశ్వాసము. మహాసిద్ధుడైన మత్స్యేంద్రనాథుడు ఈ ప్రాంతపు రాజకుమారికను పెండ్లాడి కొంతకాలం ఇక్కడ ఉన్నాడని పెద్దలు చెప్పగా విన్నాను". పద్మసంభవు డిలా అన్నాడు." నిజమే. మత్స్యేంద్రనాథుడు రామాయణకాలంలో హనుమంతుని స్వేదబిందువు వల్ల పుట్టినవాడు. వీరుడు, యోగీశ్వరుడై నిర్మాణకాయుడై యుగాన్ని బట్టి కొత్త శరీరాలు నిర్మించుకొన్నాడు. ఇటీవల కలియుగంలో అతడు హిమాలయ యోగియై ప్రత్యేకంగా నాథ సంప్రదయాన్ని స్థాపించాడు. అతని శిష్యుడు గోరఖ్‌నాథ్. ఒకసారి మత్స్యేంద్రుడు దేశసంచారానికి వెళ్ళివస్తానని శిష్యునితో చెప్పి బయలుదేరాడు. ఈ ప్రాంతానికి వచ్చి ఇక్కడి ఒక రాజకుమారిని పెండ్లి చేసుకొని ఆ దేశానికి రాజై పరిపాలిస్తున్నాడు. నిర్ణీత సమయం దాటిపోయినా గురువుగారు రాకపోయేసరికి గోరఖ్‌నాథ్ వెతుకుతూ బయలుదేరి అతికష్టం మీద ఇక్కడున్నాడని తెలుసుకొన్నాడు. అయ్యో! గురువుగారు యోగసాధనలు మరిచిపోయి స్త్రీలంపటుడై, సుఖభోగాల మైకంలోపడి, ఐశ్వర్య అధికారాల వ్యామోహంలోపడి – తనను తాను మరిచిపోయినాడని బాధపడి తన సిద్ధశక్తితో గురువుగారిని ఆకర్షించి వెంట తీసుకొని అడవులు కొండలు నదులు దాటి ఆశ్రమానికి చేరుకొన్నాడు. తీరా వెళ్ళేసరికి ఆశ్రమంలో గురుపీఠం మీద మత్స్యేంద్రనాథుడు కూర్చుని ఉన్నాడు. తన వెంట వచ్చిన రాజరూపుడు ఆయనలో కలసి పోయినాడు. అవధూత, మహాత్ముడు –అయిన గురువును అర్థం చేసుకోలేక తప్పుగా ప్రవర్తించానని తెలుసుకొని ఆ మహనీయుని కాళ్ళమీదపడి క్షమాపణ వేడుకొన్నాడు గోరఖ్‌నాథ్.

మనం వెళ్ళే దోవలో ఖోజార్‌నాథ్ ఆలయం వస్తుంది. అక్కడికి వెళ్ళినప్పుడు వివరంగా చెపుతాను. ప్రస్తుతం మనం విశ్రాంతి తీసుకొని రేపు బయలుదేరుదాము" అన్నాడు. తాషీకేద్రెన్ తన వసతికి వెళ్ళి సామాను సర్దుకొని ప్రయాణానికి సిద్ధమై వచ్చింది. ఆమె కుటుంబ విషయాలు, తల్లిదండ్రులు వారికెలా నచ్చజెప్పింది ఇవన్నీ పద్మసంభవుని దృష్టిలో చిన్న విషయాలు.

కర్మప్రభావం అన్నింటినీ ఏర్పాటు చేస్తుంది. సాయంత్రం ఇద్దరూ యోని పీఠాధిష్ఠాన దేవతయైన కామకాళిని దర్శించారు.

తాషీ : స్వామీ ! కాళీదేవి మీతో ఏమి చెప్పింది ?

పద్మ : నీకేమీ చెప్పిందో నాకూ అదే చెప్పింది.

తాషీ : ముందు మీరు చెప్పండి.

పద్మ : మొదటి మూడు రాత్రులు ఆమె సన్నిధిలో కామయాన సాధన చేసి తర్వాత బయలుదేరమన్నది.

తాషీ : నాకు అలానే వినిపించింది. కామకాళి ఆజ్ఞ ఉల్లంఘించరాదు.

ఆమూడు రోజులు చాలా వేగంగా గడచిపోయినవి. ఉదయం, సాయంత్రం దేవీదర్శనం. మిగతా సమయమంతా కామక్రీడలు. పద్మసంభవుడు ఉపయోగించిన మూలికలవల్ల, మంత్రసాధనవల్ల వారికి ఆహారనిద్రల అవసరం లేదు. అతడు కామానందభైరవుడు. ఆమె కామాఖ్య కాళి.

నాలుగోరోజు బయలుదేరి మత్స్యేంద్రనాధుడు వెళ్ళిన మార్గాన్ని అనుసరించి ప్రయాణం ప్రారంభించారు. త్రోవలో బర్బరీకుని ఆలయం కనిపించింది. అది తాషీకి సుపరిచితమైన గుడి. ఆ ఆలయ విశేషాలు పద్మసంభవునితో చెప్పింది.

"బర్బరీకుడు మహాశివభక్తుడు. స్కాందపురాణంలో ఇతని కథ ఉంది. కఠోర తపస్సు చేసి పరమేశ్వరుని అనుగ్రహాన్ని సాధించినవాడు. ఘటోత్కచునికి కాలకటంకట యందు పుట్టినవాడు. భారతంలో ఘటోత్కచుని పాత్ర ప్రసిద్ధమైనది.

---

ఆ మహాపురుషుడు మత్స్యేంద్రనాథ్ ప్రభావము ప్రసరించి నేపాల్ దేశంలోని ఖట్మాండూ నగరంలోని శివుని పశుపతి నాధుడన్నారు. ఇంద్రుని కూడా ఇంద్రనాధుడంటారు. మహేంద్రనాథ్, దేవేంద్రనాథ్ టాగూరు, రవీంద్రనాథ్ టాగూరు బెంగాలులో ప్రసిద్ధనామాలు. ఈ ప్రభావ ఫలితాలే యముని యమనాథుడని నన్నయభట్టు భారతంలో ఒక పద్యంలో వ్రాశాడు. జైన సంప్రదాయంలో ఋషభనాధుడు, పార్శ్వనాధుడు మొదలైన తీర్థంకరుల పేర్లు కనిపిస్తున్నవి. ఇవి కూడాసిద్ధసంప్రదాయానికి చెందినవే.

హిడింబా భీమసేనుల పుత్రుడైన ఇతని కథ ఆసక్తిని కలిగిస్తుంది. భారతంలో లేని కథ ఇక్కడ పెద్దలు చెపుతున్నారు.

దేవతలంతా విష్ణుదేవుని దగ్గరకు వెళ్ళి నరకాసురుని దురాగతాలను వివరించి వానిని సంహరించ వలసిందిగా ప్రార్థించారు. విష్ణుమూర్తి అంగీకరించి భూలోకంలో మానవునిగా అవతరించి ఒక్క నరకాసురునే కాక దుష్టరాక్షసులనందరినీ సంహరించి శాంతిని నెలకొల్పుతానని మాట ఇచ్చి వారిని పంపించాడు. ఆ తరువాత షుమారు 250 సంవత్సరములు గడవగా దేవకీ, వసుదేవుల కుమారునిగా, విష్ణుమూర్తి, కృష్ణుడన్న పేరుతో ఉదయించాడు. మధురలో పుట్టి బృందావనంలో పెరిగి పన్నెండేండ్ల వయసులో తిరిగి మధుర వచ్చి కంససంహారము చేసి జరాసంధుని దండయాత్రల నుండి యాదవులను రక్షించటం కోసం యాదవులనందరినీ తీసుకొని సుదూరంగా పశ్చిమ సముద్రతీరంలోని ద్వారకకు వెళ్ళిపోయి అక్కడ రాజ్యాన్ని స్థాపించి, తన మాతామహుడు, కంసుని తండ్రి అయిన ఉగ్రసేనుని రాజుగా ఏర్పాటు చేశాడు. కాలక్రమాన రుక్మిణీ, సత్యభామ మొదలైన అష్టమహిషులను పెండ్లిచేసుకొన్నాడు.

ఈ విధంగా కృష్ణుడు ద్వారకలో ఉండగా దేవవల్లభుడైన మహేంద్రుడు వచ్చి దర్శనం చేసుకొని నరకాసురుని దురాగతాలను వివరించి వానిని సంహరించ వలసిందిగా ప్రార్థించాడు. కృష్ణుడు అంగీకరించి సైన్యంతీసుకొని బయలుదేరాడు. ముద్దులభార్య అయిన సత్యభామ తానుకూడా వస్తానని మారాం చేసింది. సర్వజ్ఞుడైన కృష్ణుడు, భూదేవి యొక్క అంశయైన సత్యభామ నరకాసురుని వధకు తోడ్పడటం మంచిదని భావించి అంగీకరించాడు. సేనానివహంతో బయలుదేరి కామరూపదేశంలో ప్రవేశించాడు. నరకుని రాజధాని అయిన ప్రాగ్జ్యోతిషాన్ని ప్రవేశించాలంటే దానికి ముందు నిర్మోచనపురం ఉన్నది. అది పేరుకు పట్టణమే కాని నరకుని సైనిక స్కంధావారము. ప్రధానమంత్రి అయిన మురాసురుని కుమారులు పరివారమైన రాక్షసవీరులు ఆరువేలమందితో దానిని రక్షిస్తుంటారు. ఖడ్గపాశధరులైన వారందరిని శ్రీకృష్ణుడు సంహరించాడు. వారిని దాటి రాజధానిలో ప్రవేశిస్తుండగా నరకుని ప్రధాన సైన్యంతో యుద్ధం చేయవలసి వచ్చింది. యుద్ధరంగంలో ముఖ్యులైన మురాసురుడు, హయగ్రీవుడు, మొదలైన

వారందరినీ కృష్ణుడు చంపివేశాడు. ఇక నరకుడు స్వయంగా యుద్ధరంగంలోకి దూకాడు. తనకంటె ముందు పుట్టిన ఒక యాదవునితో అసురేశ్వరుడైన తాను యుద్ధం చేయవలసిరావటం నరకునికి నామోషి అనిపించింది. ఎన్ని వందల ఏండ్ల నుండి జీవిస్తున్నా కామాఖ్యకాళి ఇచ్చిన వరముల వల్ల అతడికి ముసలితనము రాలేదు. రణరంగంలో భార్యతో సహా వచ్చిన కృష్ణుని చూచి అతనికి ఆశ్చర్యము వేసింది. 'ఏమి సాహస మితనికి ?' అని ఆశ్చర్యపడ్డాడు. ఇంతలో మురాసురుని పుత్రిక 'కామకటంకట' అను పేరు గల కన్య నరకాసురుని దగ్గరకువచ్చి "మహారాజా ! నా తండ్రిని, సోదరులను అందరినీ ఈ కృష్ణుడు వధించాడు. ఇతనిని నేను సంహరిస్తాను. కామాఖ్యాదేవి నాకు అజేయత్వమును వరంగా ఇచ్చింది. అనుమతించు" అని ప్రార్థించింది. ఆమె తీవ్రమైన ఆకాంక్షను చూచి కాదనలేక నరకుడు సరేనన్నాడు. ఆమె కృష్ణుని మీదకు వెళ్ళి మాయాశక్తి వల్ల ఆయుధ వర్షాన్ని కురిపించింది. శ్రీకృష్ణుడు ఆ మాయాజాలాన్నంతటిని తొలగించి ఆమెను వధించటానికి చక్రం తీసుకున్నాడు. అప్పుడు కామాఖ్యా దేవి ప్రత్యక్షమై కృష్ణదేవా! ఈ బాలికను చంపవద్దు. ఈమెకు అజేయత్వాన్ని, అవధ్యత్వాన్ని వరంగా ఇచ్చాను అన్నది. అప్పుడు వాసుదేవుడు, కాళీదేవి మాటను గౌరవించి ఘటోత్కచుని స్మరించాడు. స్మరణ మాత్రం చేత వచ్చిన ఘటోత్కచునితో 'ఈ అమ్మాయి సంగతి నీవు చూడు' అని తాను నరకుని మీదకు వెళ్లాడు. నెమ్మదిగా ప్రధాన యుద్ధరంగంలో నుంచి పక్కకు తప్పించి ఆమెతో యుద్ధం మొదలు పెట్టాడు ఘటోత్కచుడు. పేరుకు యుద్ధమే. అతడు ఏమీ యుద్ధం చేయటం లేదు. ఆమెకు ఆశ్చర్యంగా ఉంది. కృష్ణుని ముందు నిలువలేక పోతున్న తనతో వీడెవడో వచ్చి యుద్ధం మొదలు పెట్టాడు. అవతల కృష్ణ నరకాసురుల యుద్ధం మొదలయింది. ఇటువైపు వీడెవడో తమ రాక్షసజాతి వాని వలె ఉన్నాడు. వీడు కృష్ణుని వైపు వచ్చి యుద్ధం చేస్తున్నాడేమిటి? ఏమైనా శత్రువు - శత్రువే. ఘటోత్కచుని మీద ఆసురియైన మాయను ప్రయోగించి బాణములు ఆయుధాలు కురిపించింది. ఘటోత్కచుడు ఆమె మీద ఏ ఆయుధ ప్రయోగమూ చేయలేదు. ఆమె ప్రయోగించిన ఆయుధాలన్నింటిని ఈగలను, దోమలను తోలినట్లుగా ప్రక్కకు నెట్టివేస్తున్నాడు. ఆమె ప్రయోగించిన మాయలు ఏవీ అతని మీద పనిచేయటం లేదు. ఘటోత్కచుడు ఇంతకంటె అధికమయిన మాయాశక్తులు

కలవాడు. రాక్షసి అయిన హిడింబకు, పాండవుడయిన భీమునకు పుట్టినవాడు. అతడు సరాసరి ఆ ఆయుధవర్షం మధ్యలో నడుస్తూ వెళ్ళి కామకటంకట సమీపం చేరుకొని ఆమెను కౌగలించుకొని ముద్దుపెట్టుకొన్నాడు. "యుద్ధం చేయక ఇదేమి పని ?" అని ఆమె అంటూంటే, "చేసిన యుద్ధం చాలు, నాతో కామయుద్ధం చేద్దువులే. దానిలోనైనా గెలవగలవేమో చూద్దాము" అన్నాడు ఘటోత్కచుడు. వారిద్దరి యుద్ధం ఆ రకంగా ముగిసింది. నరకాసురవధ తరువాత వారిద్దరికి వివాహం జరిగినట్లు స్కాందపురాణంలోని కౌమారీ ఖండంలో చెప్పబడింది. వారి కుమారుడైన బర్బరీకుడు కఠోరసాధనలు చేసి శివత్వమును పొందగలిగాడు. అతనికి ఆలయం నిర్మించారంటే ఎంతటి మహత్వమును సాధించాడో ఊహించవచ్చు. బర్బరీకుని గూర్చి మరొక ప్రాంతీయ కథ కూడా ఉన్నది. పరమేశ్వర ప్రీతి కోసం శిరస్సు ఖండించుకొని సమర్పించాడని అంటారు.

అక్కడ నుండి బయలుదేరి తపస్వుల గుహలు, ఆలయాలు చూస్తూ మహనీయమైన ఖోజార్‌నాథ్ ఆలయం చేరారు. సీతారామలక్ష్మణులు మానస సరస్సులో తీర్థస్నానం చేసి కైలాస పర్వత ప్రదక్షిణ చేసి ఇక్కడ విశ్రాంతి తీసుకొన్నారని దానికి గుర్తుగా ఈ గుడి నిర్మించబడిందని హిందువుల విశ్వాసం – ప్రాచీనమైన మానసఖండ గ్రంథంలో (175 వ అధ్యాయం) దీని ప్రస్తావన ఉంది. ఇంద్రుడు విశ్వకర్మను పిలిచి కైలాసనాథునకు ఒక రమ్యమందిరాన్ని నిర్మించవలసిందిగా కోరాడు. విశ్వకర్మ మానస సరస్సు దగ్గరి ఇంద్రపర్వత ప్రాంతంలో ఖేచరపురిని నిర్మించి (ప్రస్తుతం ఖోచార్‌పురి) అందులో అద్భుతమైన మహాకాల మందిరాన్ని రూపొందించాడు. ఆ శివునకు అమరభైరవుడని పేరు. మూలవిరాట్టుకు ముందు ఒక స్వర్ణశునకవిగ్రహం కూడా పెట్టాడు. ఇటీవలి తవ్వకాలలో ఆ బంగారు కుక్క విగ్రహం దొరికింది. దానిని దలైలామకు విన్న

---

చైనావారు1959 లో టిబెట్ ఆక్రమించుకొన్న తర్వాత మఠాలను, ఆలయాలను ధ్వంసం చేశారు. ఖోజార్‌నాథ్ ఆలయం కూడా ఆ విపత్తుకు గురియైంది. ఇప్పటికి మిగిలిన ఒక కుడ్యచిత్రంలో కైలాస అధిష్ఠాన దేవత "దేమ్‌ఛోక్' ముండమాలతో వ్యాఘ్రచర్మధారణతో కనిపిస్తుంది. 1990లో ఆలయాల పునరుద్ధరణకు అనుమతించటం వల్ల మళ్ళీ విగ్రహాలను నిర్మిస్తున్నారు.

విస్తే ఆ విగ్రహాన్ని అక్కడే ఆలయంలో ఉంచమని చెప్పాడు. వాటితో పాటు గంధర్వ యక్ష విగ్రహాలు ఎన్నో శిల్పీకరించబడినవి. కాలక్రమాన బౌద్ధమతం ఈ ప్రాంతంలోకి ప్రవేశించిన తర్వాత ఈ ఆలయం బౌద్ధమఠంగా మారింది. విగ్రహాలు మారినవి. పేర్లు మారినవి. ఇప్పుడు అవలోకితేశ్వరుడు, మంజుశ్రీ (మంజు ఘోషుడు) వజ్రపాణి విగ్రహాలున్నవి. కలియుగం ప్రారంభమైన రెండు వేల అయిదువందల సంవత్సరాల తర్వాత వచ్చిన పెనుమార్పులివి. ఇప్పటికీ హిందువులు దీనిని ఖేచరీతీర్థమంటారు. బౌద్ధులు ఖోజార్‌నాథ్ మఠం అంటారు. టిబెటన్ భాషలో ఖోర్ అంటే రావటం చార్ అంటే స్థిరపడటం. అదే ఖోజార్ అని మార్పుచెందింది.

ప్రధాన విగ్రహాన్ని గూర్చి ఎన్నో కథలు పుట్టినవి. భారతదేశానికి చెందిన ఏడుగురు ఆచార్యులు కార్దుంగ్‌రాజు దగ్గరికి వచ్చి ఏడు పెద్దగోతాల వెండి నాణెములు ఇచ్చి దాచి ఉంచమని తొమ్మిదేళ్ళలోపు తాము రాకపోతే మీరు స్వేచ్ఛగా వాడుకోవచ్చునని చెప్పివెళ్ళారు. చెప్పిన సమయం దాటినా వారు రాలేదు. ఆ రాజు ఆలోచించి మంత్రుల సలహాపై దైవ విగ్రహాన్ని నిర్మించమని శిల్పులకు ఆజ్ఞయిచ్చాడు. వారు వెండిని కరిగించి బొమ్మచేయాలనుకుంటుంటే దానంతట అదే విగ్రహంగా రూపొందింది. భగవంతుని లీల అని భావించి దాన్ని ఊరేగింపుగా తెస్తుంటే ఒక చోట ఆగిపోయింది. అక్కడే ఆలయం నిర్మించి విగ్రహాన్ని ప్రతిష్ఠించమని ఆకాశవాణి చెప్పింది. ఆ ప్రకారం కార్దుంగ్‌రాజు ఖోజార్ నాథుని ఆలయం కట్టించాడు.

ఊరేగింపు ఆగిన చోటు గురించి మరొక కథ ప్రచారంలో ఉంది. అచటి ఇసుక తిన్నెల దగ్గర ఒక లామా ఆయన శిష్యుడు ఉండేవాడు. ప్రతిరాత్రి బయట నీళ్ళ కోసం వెళ్ళే శిష్యునికి ఒక కాంతిపుంజం కనిపించేది. కొన్నాళ్ళు గడిచిన తర్వాత ఈ విషయం గురువుగారికి చెప్పాడీ శిష్యుడు. ఆ తేజస్సు కనిపించిన చోట రాళ్ళను గుట్టగా పెట్టమని గురువుగారు చెప్పాడు. శిష్యుడలాగే చేశాడు. మరునాడు గురువుగారు వచ్చి చూస్తే ఆ రాళ్ళన్నీ ఒక పెద్ద బండరాయిగా మారినవి. ఆ తేజఃపుంజం జాంబ్యాంగ్ ఆత్మరూపమని శిష్యునకు లామా తెలియజేశాడు. ఊరేగింపుతో వస్తున్న దైవవిగ్రహం అక్కడకు వచ్చేసరికి

ఆగిపోయింది. అప్పుడు జాంబ్యాంగ్ ఆత్మ ఆ విగ్రహంలోకి ప్రవేశించింది. విగ్రహం స్వయంభువు. దివ్యాత్మ దానిలోకి ప్రవేశించింది. అక్కడనే కార్డుంగ్ రాజు ఆలయాన్ని నిర్మించాడు.

ఆ విగ్రహం అప్పుడప్పుడు మాట్లాడేదని కథలెన్నో వ్యాపించినవి. ఊరేగింపు బండరాయి దగ్గరకు వచ్చేసరికి విగ్రహంలో నుండి ఖోర్ఛాక్ అని వినిపించిందట! 'నేనిక్కడకు వచ్చాను ఇక్కడే ఉంటాను' అని దాని అర్థం. మరొకసారి దగ్గర ఉన్న మాప్ఛూనది పొంగే ప్రమాదం ఏర్పడింది. నది ఉప్పొంగితే మఠం మునిగి పోతుంది. అప్పుడు విగ్రహంలో నుండి నదిని చూస్తూ ఉండేలా తారాదేవి విగ్రహాన్ని పెట్టమని ఆదేశం వచ్చింది. దానితో రక్షణ ఏర్పడింది.

ఇంకోసారి ఆ ప్రాంతపు రాజుభార్యలు సంతానంలేక ఎన్నో పూజలు చేశారు. కానీ ఫలితం లేదు. అక్కడకు వచ్చినప్పుడు మూడుసార్లు మొక్కమని ఆదేశం విగ్రహంలో నుండి వచ్చింది. వారలా చేశారు. ఖోజార్‌నాథుని కృపవల్ల వారికి సంతానం కలిగింది. వేరొకసారి దుష్టులైన సైనికులు కొందరు వచ్చి మఠంలో గందరగోళం చేశారు. ఒకడు తన కత్తితో విగ్రహం తొడమీద పొడిచాడు. అక్కడ పాలుకారినవి. అయితే విగ్రహంలో నుండి "ఓరి పాపాత్ముడా!" అని వినిపించింది. వాడక్కడే నెత్తురు కక్కి మరణించాడు.

అలానే ఆశ్చర్యకరమైన మరొక విశేషం జరిగింది. ఒక మాంత్రికుడు కాగితం మీద పక్షి బొమ్మ గీసి ప్రాణప్రతిష్ఠ చేసి జాంబ్యాంగ్ విగ్రహం వెనకాల పెట్టాడు. అది కొంతకాలానికి నిజమైన పక్షిగామారి ఎగిరినప్పుడు విగ్రహం ముక్కలైపోతుంది. ధాంగ్ న్యూన్ అనే లామా అక్కడకు దర్శనానికి వస్తే విగ్రహం ఈ విషయం చెప్పింది. అతడా కాగితం బొమ్మను చూచాడు. అప్పటికే అది చాలా వరకు పక్షిగా మారి ఉన్నది. అతడు దానిని పట్టకారుతో పట్టుకొని మంటల్లో వేశాడు. ప్రయోగశక్తి నశించింది.

ఇటువంటి అద్భుతాలెన్నో ఆ విగ్రహాన్ని గురించి చెపుతుంటారు. ఒకప్పుడది పురాణ శివాలయం ఇప్పుడు బౌద్ధాలయం. అప్పుడూ ఇప్పుడూ అది మహిమాన్వితమైన దైవశక్తికి కేంద్రం.

ఇలా త్రోవలో ఎన్నో విశేషాలు చూస్తూ హరిద్వార్ ప్రాంతారణ్యంలోని

సిద్ధేశ్వరగుహకు చేరుకొన్నారు. అక్కడ గుహలో వజ్రభైరవుని విగ్రహం ప్రకాశిస్తున్నది. మానవసంచారం లేని ఆ ప్రదేశంలో విగ్రహానికి గంధం, పుష్పమాలలు - అలంకరించబడి ఉండటం ఆశ్చర్యం కలిగంచింది. ఎవరి అడుగుజాడలూ లేవు. ఎవరో అంతరిక్ష చరులైన సిద్ధులు, దేవతలు వచ్చి అర్చనచేసి ఉండాలి. ఎన్నో సంవత్సరాల క్రింద తాను ఉపయోగించిన జపమాల, కూర్మయంత్ర సహిత దారుపీఠము, సిద్ధేశ్వరస్వామి వారి కమండలము. ఇటువంటి పూర్వ వస్తువు లక్కడ ఉండటం తాషీకేడ్రెన్ చూచింది.

తాషీ : గురుదేవా ! మీ కరుణ అపారమైనది. నేనెవరో గుర్తుచేశారు. నా కర్తవ్యం తెలియజేశారు. సిద్ధగురువుల మహిమాన్వితమైన దృక్, స్పర్శల ప్రభావం ఎంతటిదో తెలుసుకొనే అదృష్టం కలిగింది. కామయాన పంథాలో బ్రహ్మానందాను భవాన్ని పొందగలిగాను.

**శా॥ అపూర్వముగ మొదట మనుష్యానందము పొందినాను**
**అనంతరము గంధర్వానందమ్మును చెందినాను**
**పరవశమగు స్థితిలో బ్రహ్మానందము నందినాను**
**అతీంద్రియ ప్రాతిభమగు అనుభూతిని ఎరిగినాను**

**(మనుచరిత్ర)**

స్వాయంభువ మన్వంతరం చివర వరూధిని అనే అప్సరస ప్రవరుడనే బ్రాహ్మణుని శృంగారానుభవానికి ప్రేరేపిస్తూ ఆనందో్బ్రహ్మ అంటే ఇదేనని చెప్పింది. దీనిలోని సత్యాన్ని ఆ విప్రుడు తెలుసుకోలేక పోయినాడు గాని నా కర్థమైంది.

సరి ! కానీ నాకు మరొక వరాన్ని మీరు ప్రసాదించాలి. ఈ గుహను చూస్తుంటే దీనిలో ఏవో రహస్యాలు నిక్షిప్తమై ఉన్నవనిపిస్తున్నది. వాటిని తెలుసుకోవాలని చాలా కుతూహలంగా ఉంది.

పద్మ : తాషీ! మంచి కోరికనే కోరావు. ఈ గుహ అత్యంత పురాతనమైనది. కపిలమహర్షి ఇక్కడ కొంతకాలం ధ్యానసమాధిలో ఉన్నాడు. ఆ ముని శిష్యమిత్రుడు జైగీషవ్యుడు కొంతకాలం ఇచటనే తపస్సు చేసి తర్వాత కాశీ వెళ్ళాడు. వారణాసిలో

ఇటువంటి గుహనే ఏర్పాటు చేసుకొని అక్కడ శివలింగాన్ని స్థాపించి దాని ముందు తపస్సు చేసి విశ్వనాథుని అనుగ్రహాన్ని పొందాడు. అతడే సిద్ధాశ్రమంలో మరొక శరీరం ధరించి సిద్ధేశ్వరుడైనాడు. కలియుగంలో అతడు ఎన్నో జన్మలెత్తాడు. భైరవసాధన చేసి ఆస్వామి దయపొంది అపార సిద్ధశక్తులు సాధించాడు. తాంత్రికులు ఆ యోగీశ్వరుని భైరవనాథుడన్నారు. అవతారపురుషుడైన మత్స్యేంద్రనాథుడు పెట్టిన పేరది. ఆ తరువాత కూడా మరికొన్ని జన్మలెత్తవలసి వస్తుంది. ఎన్ని జన్మలెత్తినా ఈగుహతో సంబంధం పోదు. రాబోయే శతాబ్దాలలో ధర్మరక్షణ కోసం భిన్న శరీరాలు ధరించవలసి వస్తుంది. అయినా ఈ బంధం – అనుబంధం ఎప్పుడూ ఉంటుంది.

తాషీ : గురువర్యా ! మీరు ఈ గాథలను ఉత్తమపురుషలో కాక ప్రథమ పురుషలో ఎందుకు చెపుతున్నారు ?

పద్మ : పూర్వప్రశ్నే ! సమాధానమూ ఇదివరకటిదే. దేవరహస్యము. అది అంతే.

తాషీ : అది మీ యిష్టం. జవాబు కోసం కాకపోయినా మరొక అనుభూతి విన్నవిస్తాను. ఈ గుహలో ధ్యానవేళ మీలో ప్రచండుడైన రావణాసురుడు కనిపిస్తున్నాడు. నాకు మరొక అంతరవలోకనం. మహాయోగులు దేవతాతుల్యులు వారు తమ అంశతో ఒక మనిషిని పుట్టించి లోకకల్యాణం చేయిస్తుంటారు. అంటే సిద్ధులు ఒకటి కంటె ఎక్కువ శరీరాలతో ఉండగలరన్న మాట. ఏక సమయంలో అనేక శరీరాలతో వ్యవహరించిన యోగులున్న సంగతి తెలిసినదే గదా ! అంటే సిద్ధేశ్వరుని అంశతో పుట్టిన మీలోకి రావణుడు ప్రవేశించి ఉండవచ్చు. రావణుడు త్రేతాయుగంనాటి వాడు. రాముడాతనిని సంహరించిన తర్వాత అతడు ద్వాపరయుగంలో శిశుపాలుడుగా పుట్టి కృష్ణుని చేత సంహరించబడి పూర్వపు స్థానాన్ని చేరుకొన్నాడు. అయినా అతడు ఖడ్గరావణ మంత్రాధిదేవతగా ప్రకాశిస్తున్నాడు. ఆ మంత్రవల్లభుడు మీలోకి ప్రవేశించటం వల్ల మీరు కామయాన సాధకులైనారు.

రావణాసురుడు మహాకాముకుడు ఆ కామశక్తి మీలో విజృంభించి ఉన్నదనిపిస్తున్నది.

అంతేకాదు. మనం ఖోజార్‌నాథ్ ఆలయం చూచి కైలాసగిరి గుహలు దర్శిస్తూ మానస సరస్సులో స్నానం చేసి వస్తూ రక్షస్థల్ ప్రాంతానికి వచ్చినప్పుడు అటువైపు చాలా సేపు చూస్తూ ఉండిపోయినారు. అక్కడ రావణాసురుడు తపస్సు చేసిన చోటున్నదని నాకు తెలుసు. నేను అటు పోదామా ! అని అంటే ఇప్పుడు కాదులే అన్నారు మీరు. ఆ స్థలాలతో మీకు సన్నిహిత సంబంధం ఉన్నదని నేను విశ్వసిస్తున్నాను. అయితే ఇంత తీవ్రభావుకుడైన జీవుడు పరమశాంతమైన బౌద్ధధర్మ ప్రచారకుడు కావటం ఆశ్చర్యకరం. బుద్ధభగవానుడి సంకల్పం చాలా విచిత్రమైనది. సిద్ధేశ్వర యోగీంద్రుల దివ్యశరీరం, బోధిసత్వుల తేజస్సు, రావణభావుకత – ఇన్నింటి కలయిక ఎలా సాధ్యమో నాకు అంతుపట్టటం లేదు. వీటిలో ఏది ? ఎంత ? ఎవరెవరు ? మహాత్మా ! ఈ నా భావనకు, నా ధ్యానశక్తికి అతీతమైనది మీ వ్యక్తిత్వం.

పద్మ : తాషీ ! తర్కము, దార్శనికత సమ్మిళితమైన నీభావ అభివ్యక్తీకరణ సముచితంగా ఉంది. చాలావరకు అందుకొన్నావు. ఎప్పుడు ఏది ఎంత తెలియజేయబడవలసి ఉంటే అంత అందుతుంది. ప్రస్తుతానికి ఇది చాలు. ఇక బయలుదేరుతాము పద !

భైరవగుహనుండి బయలుదేరి మాయాపురి చేరుకొని వేగంగా పయనించి బుద్ధగయ చేరారు. తన వసతికి చేరుకొని పద్మసంభవుడు కొన్నాళ్ళు ధర్మప్రబోధము శిష్యులకు బౌద్ధవాఙ్మయములోని విశేషాంశములను బోధించటం నిత్య కార్యక్రమంగా పెట్టుకొన్నాడు. బౌద్ధధర్మ ప్రచారానికి తాషీని తగిన విధంగా తయారు చేయటం మీద ప్రత్యేక శ్రద్ధ వహించాడు. నిశితమైన మేధాశక్తితో ఆమె విద్యా వ్యాసంగాన్ని కొనసాగించింది. రాత్రివేళ మాత్రం కామయాన సాధనలతో వారిద్దరు సుఖపర మావధిని చేరుకోవటమే కాక ప్రజ్ఞాపారమిత కరుణను కూడా సాధించ గలిగారు. పద్మసంభవుని ఇచ్ఛాశక్తివల్ల, వజ్రభైరవుని కృపవల్ల తాషీకేడ్రెన్ క్షేత్రదేవత మంగళచండి యొక్క రూపాంతరమా అన్న విధంగా మార్పు చెందింది. సమావేశాలలో, తరగతులలో తరచుగా ఆమె పాడుతూ ఉండేది. ఆమె పాడుతుంటే చిన్నలు, పెద్దలు అందరూ పరవశించి పోయేవారు. బాలపల్లవ గ్రాస కషాయ కంఠ కలకంఠ కుహూకల కాకలీధ్వని ఆమె కాంఠంలో పొంగులు వారుతూ వచ్చేది. దివినుండి భువికి దిగివచ్చిన ఏ

విద్యాధర కాంతయో అనిపించేది. ఆమె గాంధర్వగానానికి మెచ్చి ఆమెనే అవలోకితేశ్వరుడు రెప్పవాల్చకుండా కన్నులవిప్పార చూస్తున్నాడని అనేవారు. ఒక రోజామె పాట ఇలా గాలిలో తేలుతూ వచ్చింది.

**ధ్యానము చేయుమురా జీవా ! మౌనము బూనుమురా !**
**మౌనమంత్రమున మహాయోగివై జ్ఞానము పొందుమురా !**
**ఉచ్ఛ్వాసమ్మును నిశ్వాసమ్మును ఊరక చూడుమురా !**
**విష్ణుదేవునకు వాయువె బలమని వేదము చెప్పెనురా !**
**వాయువు నెరుగుమురా ! జీవా ! భావము విడువుమురా !**
**కన్నులు మూయుమురా ! జీవా ! కలలో కేగుమురా ?**
**కలల లోకమున కాంతిమండలము కన్నుల నిలుచునురా !**
**వాయుబలముతో భ్రూమధ్యమ్మున ద్వారము తెరువుమురా !**
**తలుపు కావల త్రైలోక్యాద్భుత దర్శనమందుమురా !**
**పలుకని కొమ్మలు పలికే బొమ్మలు పలురకముల పరికింపుమురా !**

**పంచవన్నెలా రామచిలుకవై పైపై కెగురుమురా !**
**చిలకసముద్రము చివరి ఒడ్డున చిత్రము చూడుమురా !**
**చిత్రములోన జీవరహస్యము చివరకు తెలియునురా**
**జననము, మరణము మళ్ళీ మళ్ళీ జనని జఠరగమునశయనము పయనము**
**మరపు తప్పనీ మారక యోగము మరియొక తనువున మారని వేదన**
**ఎవ్వరు నీవో ఎటు వచ్చావో ఎందులకెచటికి చేరావో**
**ఎరుకలేని ఈ విస్మృతి నుండీ ఎప్పుడు బయటకు వస్తావో**
**తెలిపే అచ్చపు తెలివికోసమై దేవయానమున పోదమురా !**
**మంత్రయానమున మహావీరుడ పద్మసంభవుని చేరుమురా**
**కాలచక్రమును త్రిప్పే స్వామి కలచో టిదియని తెలియుమురా !**
**పద్మసంభవుడు వజ్రభైరవుడు పద్మసంభవుడు బోధిసత్వుడు**
**పద్మసంభవుడు సిద్ధేశ్వరుడు పద్మసంభవుడె గురువరుడతడే**
**ధర్మరూపుడు సంఘరూపుడు బుద్ధదేవుడని యెరుగుమురా !**

**బుద్ధం శరణం గచ్ఛామి**
**ధర్మం శరణం గచ్ఛామి**
**సంఘం శరణం గచ్ఛామి**

శరణఘోషతో అందరూ కంఠం కలిపేవారు. సంఘారామాలలో నూతన చైతన్యం ప్రవహిస్తున్నది. భారతభూమి నలుమూలలా బౌద్ధమత ప్రభావం విస్తరిస్తున్నది. అయినా కొన్ని ప్రాంతాలలో ఇతర మతాలు చెలరేగుతూనే ఉన్నవి. వాయవ్య భారతానికి కళాసిద్ధిని పంపినట్లే తూర్పుభాగానికి కూడా అవసరం ఏర్పడింది. చైనా నుండి వచ్చిన బోన్‌పా మతప్రచారకుల ప్రభావానికి మంత్రశక్తులకు బౌద్ధులు తట్టుకోలేకుండా ఉన్నారని వార్తలు వస్తున్నవి. తప్పనిసరి పరిస్థితులలో తాషీకేడ్రెన్ అక్కడకు బయలుదేరవలసి వచ్చింది. స్వప్రాంతమే అయినా పద్మసంభవుని విడిచి పెట్టడమన్న బాధ దుర్భరమైంది. ఎలాగో ఆమెను ఒప్పించి పంపించాడు పద్మసంభవుడు.

ఇలా కాలం గడుస్తుండగా

కొద్దికాలానికి టిబెటు 38వ రాజు త్రిసంగద్యుతిసేనుడు తన రాజ్యంలో బౌద్ధధర్మ ప్రచారం చేయవలసిందిగా బుద్ధగయ సంఘారామాలకు వార్తాహరులను పంపాడు. వారు పద్మసంభవుని, శాంతరక్షితుని కలిశారు. బుద్ధగుహ్యాచార్యాది వృద్ధులను కలిశారు. పరిస్థితులను దృష్టిలో పెట్టుకొని మళ్ళీ లోగడ వాదాలలో, ప్రయోగాలలో పరాజితులైన మాంత్రికులు తమ ప్రాంతాలలోని ఇతర మంత్రవేత్తల సహాయంతో దాడికి వచ్చే అవకాశం ఉన్నదని వార్తలు వస్తుండటం వల్ల పద్మసంభవుడిక్కడే కొంతకాలం ఉండాలని శాంతరక్షితుడు టిబెట్ వెళ్ళాలని నిర్ణయమైంది.

టిబెట్ వార్తాహరులతో శాంతరక్షితుడు గమ్యస్థానం చేరిన తర్వాత రాజసహకారంతో ధర్మ ప్రచార కేంద్రా లేర్పరచాడు. బుద్ధాలయాలు నిర్మింపజేశాడు. నగరాలు పల్లెలు తిరిగి ధర్మతత్వాన్ని గురించి ప్రబోధాలు చేశాడు. భగవంతుడైన బుద్ధుని పూజలు బాగా జరిగే ఏర్పాట్లు చేశాడు. ప్రజలు ఆకర్షితులై అర్చనలు, ధ్యానసాధనాలు చేస్తున్నారు. ఈ సంరంభం చూస్తున్న

ఇతర మతస్థులకు కన్నుకుట్టింది. కోపించిన షామాన్ మాంత్రికులు శాంతరక్షితుని మీద ప్రయోగం చేశాడు. ఫలితం - శాంతరక్షితుడు వ్యాధిగ్రస్తుడై మంచం పట్టాడు. మహారాజుకు వార్త పంపి ఆయన రాగానే ఇలా చెప్పాడు. "మహారాజా! మీరు యువకులు. ధర్మాసక్తులు. మీ అభ్యర్థన మీద వచ్చి చేతనైన ధర్మప్రచారం చేశాను. వాదించిన పండితులను ఓడించాను. బాధ, కోపము చెందిన ఆ శాస్త్రవేత్తలు నామీద క్షుద్ర ప్రయోగాలు చేయించారు. వాటిని తట్టుకోగల శక్తి నాకు లేదు. నేను మాంత్రికుణ్ణి కాదు. నేనిక్కడ ఉండలేను. ఉండటం వల్ల ప్రయోజనం కూడా లేదు. ఈ దేశంలో బౌద్ధమతం నిలబడాలంటే మహామంత్రవేత్త సిద్ధపురుషుడు, విశేషించి ఉద్ధండ పండితుడు పద్మసంభవుడు రావాలి. అతనిని బతిమిలాడి వచ్చేలా చేయండి! లేకపోతే ఈ మహత్తర కార్యం ఆగిపోతుంది. నేను ప్రయోగ పీడితుడనై కదలలేని స్థితిలో ఉన్నానని నా అభ్యర్థనగా కూడా తెలియజేయండి. తప్పకవస్తాడు"

మహారాజు విషయం గ్రహించి తనకు పరమాప్తుడయిన ముఖ్యానుచరుని తగిన సహాయము, మందీమార్బలము ఇచ్చి పద్మసంభవుని ఎలానైనా ఒప్పించి ప్రార్థించి తీసుకురావలసినదిగా ఆజ్ఞాపించాడు.

టిబెట్ రాజు పంపిన వార్తాహరుడు చెప్పిన సందేశము విన్న తర్వాత అక్కడికి పోక తప్పదన్న నిశ్చయానికి వచ్చాడు పద్మసంభవుడు. శాంతరక్షితుని కాపాడాలి. బౌద్ధధర్మప్రచారం దక్షతతో నిర్వహించాలి. దీనికోసం తనకు లభించిన కాయత్రయసిద్ధి ఉపయోగించాలి. ధర్మకాయము, సంభోగ కాయము, నిర్మాణకాయము ఈ మూడింటిలో మొదటిది ధర్మకాయము. అతికఠోరమైన తపస్సు వల్ల అమితాభుని అంశ కావటం వల్ల దీనినతడు సాధించాడు. వజ్రశక్తి సారమే జ్యోతిర్మయమై అతనిలో ప్రవేశించింది. మారని కాంతిమయుడు, మూలరక్షకుడుగా అతడు రూపొందాడు. ఇక సంభోగకాయం - శృంగారంలోనించి సృష్టిస్థితి లయ శక్తులను, ఆనందంలోనించి అవలోకితేశ్వరత్వాన్ని పొందవచ్చునని నిరూపించిన మంత్రయాన మహాయోగి అతడొక్కడే. అయిదుగురు కన్యలు - డాకినుల మానవ జన్మరూపాలు - అతనికి సాధనలో సహకారిణులు.

సంభోగకాయంలో శివతత్వమును, రుద్రతత్వమును, వజ్రోలీసిద్ధిని పొందిన వీరసాధకాగ్రేసరుడతడు. త్వరలోనే టిబెట్ వస్తానని చెప్పి ద్యుతిసేనుడు పంపిన వేగజాంఘాలికులను పంపివేశాడు. సూటిగావెళ్ళే త్రోవలో గాకుండా నేపాల్ టిబెట్ మధ్య ఉన్న మాంగ్యుల్ చేరాడు. ఎన్గారి,చాంగ్, దోఖం పట్టణాలకు వెళ్ళి ఆయా ప్రదేశాలలో బౌద్ధ ధర్మ బోధకు అనుకూలంగా లేని 12 తెన్మా దేవతలను, 13 గుర్లహోయక్షులను, 21 జిన్ యెన్ భూతాలను వశం చేసుకొన్నాడు. ఇంకా ఎన్నో పిశాచములు అతనికి పాదాక్రాంతమైనవి.

అక్కడనుండి మధ్య టిబెట్‌లోని తమారిస్క్ అరణ్యాలలో ఎర్రకొండ - అరుణపర్వతం దగ్గర టిబెట్ రాజును కలుసుకొన్నాడు. అచటి హిపోరీ శిఖరం మీదకు వెళ్ళి తనకు వశమైన దేవతలను, భూతగణాన్ని అక్కడ సమావేశపరచి తన ఆజ్ఞాబద్ధులుగా వారిని నిబంధించి బౌద్ధధర్మాభివృద్ధికి అపూర్వము, అనన్య సాధ్యము అయిన మహాశక్తి నిర్మాణం చేశాడు.

మహారాజుతో కలసి రాజధానికి చేరి అతని సహాయంతో బ్రహ్మాండమైన సంఘారామాన్ని అయిదు సంవత్సరాలలో నిర్మించాడు. శాంతరక్షితుడు స్వస్థుడై ఈ మహకార్యంలో ప్రధానపాత్ర వహించాడు.

ఆ రాజ్యంలో ఖెన్పో అనే పేరుతో యోగ సాధనమండలిని ఏర్పరచి ప్రథమంగా ఏడుగురికి సన్యాసదీక్ష యిచ్చి భిక్షుకులుగా మార్చాడు. భారతదేశంలో నుండి త్రిపిటకములలో, ఇతర బౌద్ధ గ్రంధాలలో పండితులను పిలిపించి వాటిని టిబెట్ భాషలోకి అనువాదం చేయించాడు. వైరోచన, కావాపాల్ట్సేగ్, చోగ్రోలూయి గ్యాల్ట్సేన్ మొదలైన టిబెట్ విద్వాంసులు ఈ అనువాద కార్యంలో పాల్గొన్నారు. వారిలో వైరోచన, నామ్‌ఖాయ్‌నింగ్‌పో భారతదేశానికి పంపించబడినారు. అక్కడ వారు శ్రీ సింఘపండితుని దగ్గర శాస్త్రాలను హూంగ్‌కార యోగి దగ్గర విశుద్ధ హేరుక తంత్రాలను అభ్యసించారు.

మహారాజు ధ్యానంలో దివ్యానుభవాలను ప్రసాదించవలసిందిగా పద్మసంభవుని ప్రార్థించాడు. సామ్యే సంఘారామానికి పైన కొండలమీద చింపూ ఋషి వాటికలో రాజుతో సహా తొమ్మిది మంది శిష్యులకు అష్టహేరుక మండల

రహస్య సాధనలు నేర్పి పద్మసంభవుడు వారికి దివ్యానుభవాలను సిద్ధులను ప్రసాదించాడు.

పద్మసంభవుని రాకముందు రాజకుటుంబంలో వేరే ఒక కథ మొదలైంది. దాని మలుపులు గమనించాల్సినవి.

మహారాజుకు ఎందరో భార్యలున్నారు. వారి వల్ల చాలామంది కుమారులను పొందాడు. ఆ భార్యలలో చివరి భార్య యేషేచోగ్యాల్ వయస్సులో చాలా చిన్నది. అతిలోక సౌందర్యవతి. సహజంగానే ఆమె అంటే మహారాజుకు చాలా ప్రేమ. కాని వారి దాంపత్య జీవితం విచిత్రమైనది. మొదటి రాత్రి ఎంతో ఆవేశంతో కామోద్రేకంతో ఆమె మందిరానికి వచ్చాడు రాజు. ఆమె కూడా ఎదురు చూస్తూనే ఉంది. రమ్యమైన మృదులాసనాలలో ఇద్దరూ కూర్చున్నారు. ప్రేమ ప్రసంగాలు చేశాడు రాజు. ఆమె సిగ్గుతో వింటున్నది. నెమ్మదిగా ఆమె చేయి అందుకోబోయినాడు. లజ్జతో లేచి ఒక అడుగు వెనక్కు వేసింది. ఆమె చీర కొంగు రాజు చేతికి దొరికింది. లాగాడు. పోక ముడి ఊడుతున్నది. ఆమె కదులుతూ అనురాగంతో చూస్తూ రత్నదీప స్తంభపు క్రీనీడలో నిల్చున్నది.

**మృదుతల్పంబు వికారలీల దిగి ధమ్మిల్లంబు చేబూని రా**
**గద దృగ్జాలముతోడ కౌను నులియూగన్ మోము మార్వెట్టుచున్**
**వదలన్ జారిన నీవి పట్టుకొని అవ్వామాక్షి అట్లేగెడిన్**
**సదన భ్రాజిత రత్నదీపకళికాస్తంభంబు క్రీనీడకున్**

**(అల్లసాని పెద్దన కుమార్తె)**

రాజు ఉద్రేకంతో వెళ్ళి ఆమెను కౌగలించుకొన్నాడు. ఒక్కసారి ప్రచండమైన విద్యుత్ ఘాతం సోకింది. వెనక్కు విరుచుకుపడ్డాడు. పడిన రాజును ఆమె లేవదీయబోయింది. "వద్దు వద్దు ముట్టుకోవద్దు" అని అరిచాడు రాజు. నెమ్మదిగా లేచాడు. "రాణీ ! నీ శరీరం విద్యున్మయంగా ఉంది. తాకితే ప్రమాదం. ఏమిచిత్రమిది? ఇంత సౌందర్యరాశిని – భార్యను తాకటానికి వీలులేని పరిస్థితిని బుద్ధభగవానుడు ఎందుకు కల్పించాడో" అన్నాడు. ఆమె నిర్ఘాంతపోయింది. అతనితో పాటు ఆమె కూడా క్రింద కూర్చున్నది. ఇద్దరూ చాలాసేపు మాట్లాడుకోలేదు. తర్వాత రాజు – యేషే ! నేను భ్రాంతి చెందలేదు గదా !

మరొకసారి తాకి చూస్తాను అని ఎంతో నెమ్మదిగా చెయ్యి చాచి మునివేళ్ళతో తాకాడు. మళ్ళీ అంతే. విద్యుత్ ప్రకంపనలు. ఇప్పుడింక నిశ్చయమైంది. ఆమెను తాను తాకలేదు. ఈ స్థితి ఎంతకాలం నుండి ఉన్నది అని అడిగాడు. ఆమె "ప్రభూ ! నాకేమీ తెలియదు. మా అమ్మ నన్ను తాకుతూనే ఉంది. నా చెలికత్తెలు సేవ చేసే టప్పుడు తాకుతూనే ఉన్నారు. నా శరీరం ఇటువంటిదని నేనెరుగను. నా జీవితం ఏమి కావాలి ఇంక" అని కన్నీళ్ళు పెట్టుకుంది. రాజామెను ఓదార్చాడు.

"యేషే ! ఇది వజ్రపాణి బుద్ధుని లీల. వజ్రశక్తి నీలో నర్తిస్తున్నది.

పరమేశ్వరియైన వజ్రవైరోచని ఏ సంయమి శరీరంలోకి ప్రవేశిస్తే ఆశరీరం విద్యుద్యంత్రం వలె మారిపోతుంది.

నీవు మామూలు మనిషివికావు. ఏ బుద్ధడాకినివో ఇలా పుట్టావు. నీ భవిష్యత్తు ఎలా మారుతుందో చూద్దాం. రాణిగా నీకు ఎటువంటి లోటూ రానీయను. నేను రాజకార్యాలలో ఉన్నా అప్పుడప్పుడు వచ్చి నీతో కాసేపు మాట్లాడి వెళుతూ ఉంటాను" అని చెప్పి మహారాజు వెళ్ళిపోయినాడు.

ఆమె దిగాలుపడి అలా కూర్చుండి పోయింది. తానెవరు ? ఏమిటీ విచిత్రానుభవం ? తనకింక సంసార సుఖం లేదా ? తనను ముట్టుకొన్న పురుషుడెవరైనా ఇంతేనా ? అయినా తాను వివాహిత. ఇంకొకరిని తానుగాని, తనను ఇంకొకరు గాని ముట్టుకుండే ప్రశ్నేలేదు.

ఇలా ఎంతసేపు గడిచిందో – తెల్లవారుజామున మగత నిద్రపట్టింది. ఆ నిద్రలో ఒక ఆశ్రమం అందులో ఒక యోగి బంగారు రంగుతో ప్రకాశిస్తున్నాడు. విరబోసినజుట్టు. మీసాలు, నున్నని గడ్డం. దీర్ఘోన్నత దేహం.

**కమ్మని కుందనంబు కసుగందని మే నెలదేటిదాటులన్**
**బమ్మెరవోవ జేయు తెగబారెడు వెంట్రుక లిందు బింబమున్**
**కిమ్మన నీదు మోము గిరిక్రేపులు మూపులు కౌను కానరా**
**దమ్మక చెల్ల ! వాని వీక చాంబకముల్ శతపత్రజైత్రముల్.**

(అల్లసానిపెద్దన)

విశాలవక్షుడు, పద్మాక్షుడు (మగవారి కన్నులను, ఆడవారి కన్నులను తామరలతో పోలుస్తారు. అయితే కమలాక్షుడన్నమాట విష్ణుమూర్తికి రూఢమైంది. అందుచేత కొందరు ప్రాచీనులు పురుషులను వృషభాక్షులన్నారు. అంటే ఆబోతు కన్నులవంటి ముదమత్తలోచనములు కలవాడని అర్థం). అయిన ఇతడెవరు? వ్యాఘ్రచర్మధారియైన ఆయోగి ముందుకు వస్తున్నాడు. దూరం నించి నడుస్తూ చేతిలో పూలు పండ్లూ ఉన్న వెదురు తట్టతో తానొక వనసుందరిగా వస్తున్నది. దగ్గరకు వచ్చి నమస్కరించి ఆ పూలతట్ట ఆయనకు అందించింది.

**ఉ॥ అందము చిందు వందు చెవియందలి చెందొవ జారుచుండ పూ**
**లందుకొనుం దటంచు సుమనోంజలి అల్లనసాచి శైలరా**
**ణ్ణందన వంగె చెంగున అనంగుని చాపము వంగె, వంగె బా**
**లేందుధరుండు కాన్కలు గ్రహింపగ ఉన్నమితోర్ధ్వకాయుడై**

**(కరుణశ్రీ)**

---

1) ఇంతకు ముందు కుంగామోను తాకిన పద్మసంభవునకు కూడా ఇటువంటిది విద్యుద్ఘాతం తగిలింది. అయితే వజ్రేశ్వరి సంకల్పం వల్ల ఆ యోగిని ఇచ్చువల్ల వెంటనే తాకగల శక్తి వచ్చింది.

2) వజ్రవైరోచనీ మంత్రసిద్ధివల్ల జీవించి ఉండగానే కపాలభేదన సిద్ధి పొందిన తర్వాత కావ్యకంఠ వాసిష్ఠ గణపతిముని శరీరం కూడా విద్యున్మయమైనట్లు ఆయన జీవితచరిత్ర" నాయనలో కనిపిస్తున్నది.

**శ్లో॥ ఉదీర్యసే ! నిర్జరరాజపత్ని !**
**త్వం వజ్రదేవీ యమినాం తనూషు (ఛిన్నమస్తా)**
**ఉజ్జృంభణే విశ్వసవిత్రియస్యాః**
**కాయంభవేత్ వైద్యుతయంత్రతుల్యం (గణపతిముని)**

ఆ వ్యక్తి సాక్షాత్తు శివునివలెనే ఉన్నాడు. తానందించిన పూసజ్జ అందుకొని పక్కన శిలావితర్దిపై ఉంచాడు. తానా మహాత్ముని పాదాలకు నమస్కరించింది. ఆ యోగి రెండు చేతులతో తన్ను పట్టుకొని లేవదీశాడు. చేయి పట్టుకొని నడిపిస్తూ ఆశ్రమాన్ని ఆనుకొని ఉన్న నదీతీరంలో ముందుకు వెళుతున్నాడు. వారిని చూచి చెట్టు మీద కోకిల కుహూ కుహూ అని కూత పెట్టింది. ఆ రావానికి ఆమెకు మెలకువ వచ్చింది. ఆనాటి నుండి రాత్రివేళ అప్పుడప్పుడు ఆయన స్వప్న దర్శనం ఇస్తున్నాడు. కొద్దికాలానికి వైశాఖపూర్ణిమ బుద్ధజయంతి పండుగరోజు వచ్చింది. ఆ రోజు ఉపవాసం ఉండి ఆయనను స్మరిస్తూ నిద్రపోయింది. కలలో ఆ మహాత్ముడు దర్శనమిచ్చి ఒక అద్భుతమైన మంత్రాన్ని ఉపదేశించాడు. అది వజ్రగురు మంత్రం. ఈ మంత్రం రోజూ రాత్రివేళ నలభై రోజుల పాటు చేస్తే భౌతికంగా దర్శనమిస్తానని చెప్పి అదృశ్యమైనాడు. ఆనాటి నుండి ప్రతిరోజు రాత్రి ఉపవాసం ఉంటూ మంత్రం చేస్తున్నది. నలభై రోజులు పూర్తి అయినవి. కాని ఎటువంటి దర్శనానుభూతి కలుగలేదు.

నలభై ఒకటో రోజు ఉదయం దూరప్రాంతానికి వెళ్ళిన మహారాజు భారతీయ యోగినెవరినో తీసుకొని వస్తున్నాడన్న వార్తను చెలికత్తెలు చెప్పారు. ఆయనకు రాజమందిరాలలో ఒక దానిలో వసతి ఏర్పరచారు. వస్తూనే అతడు అంతకు ముందు వచ్చిన బౌద్ధభిక్షువు శాంతరక్షితుని దగ్గరకు తీసుకు వెళ్ళమన్నాడు. వ్యాధిగ్రస్తుడై మంచాన పడిఉన్న ఆ మిత్రుని చూచి నూతనాగంతుకుడైన యోగి చాలా బాధపడ్డాడు. "మిత్రుడా ! ఏమయింది నీకు ? ఎలా ఉన్నావు ? ఈ టిబెట్‌లో నా మొదటి భోజనం నీతోనే చేయాలి. లేచిరా!" అన్నాడు. శాంతరక్షితుడు "పద్మసంభవా ! నేను కదలగల స్థితిలో లేను. బౌద్ధవిరోధులైన మాంత్రికులు నామీద క్షుద్ర ప్రయోగం చేశారు. దానిని నిరోధించగల శక్తి నాకు లేదు. నాగతి యిలా అయింది" అన్నాడు. వెంటనే ఆ యోగి శాంతరక్షితుని భ్రూమధ్యాన్ని తన వేలితో స్పృశించాడు. "మిత్రుడా ! వజ్రయోగిని ప్రసాదించిన శక్తితో నీలోని ప్రేతాన్ని బయటికి పంపిస్తున్నాను. నీవీ క్షణం నుండి పూర్వం వలెనే ఉంటావు. నీవు లేవగలవు. లే ! భోజనానికి వెళదాము" అన్నాడు. ఆశ్చర్యం !

మహారాజు దిగ్భ్రాంతితో చూస్తున్నాడు. శాంతరక్షితుడు లేచి పూర్తి ఆరోగ్యంతో జవసత్వాలతో లేచి నిల్చున్నాడు. ఒక నిమిషంలో ఇంతటి అపూర్వశక్తిని చూపిన యీ మహామాంత్రికునకు రాజు పాదాక్రాంతుడైనాడు. రిన్‌పోచే ! (గురుదేవా!) ఈనాటి నుండి రాజగురువుగా ఉండి మా రాజ్యాన్ని కాపాడండి ! బౌద్ధధర్మాన్ని దుర్మతవాదుల నుండి దుష్టమాంత్రికుల నుండి కాపాడి - బోధిసత్వుని - తథాగతుని బోధలను ప్రచారం చేయండి ! ఈ రాజ్యమంతా మీ వశంలో ఉంటుంది. నేను మీ ఆజ్ఞానువర్తిగా ఉంటాను. అని ప్రార్థించాడు. పద్మసంభవుడు మందహాసం చేశాడు. బుద్ధపూర్ణిమనాటి వెన్నెలవలె ఆ చిరునవ్వు అలలు అలలుగా ఆ ప్రదేశమంతా తెల్లని వెలుగులను విరజిమ్మింది.

ఆ రోజు సాయంత్రం కొలువు కూటంలో జరిగిన సభలో మంత్రులు, సేనాపతులు, అంతఃపుర కాంతలు, ప్రజాప్రముఖులు అందరి ముందు పద్మసంభవుని రాజగురువుగా రిన్‌పోచేగా ప్రకటించాడు మహారాజు. రాణులందరితో సభలో కూర్చున్న యేషే పద్మసంభవుని చూచి ఆశ్చర్యానంద వివశురాలైంది. తనకలలోని రాజయోగి ఇతడే. భౌతికంగా దర్శనమిస్తానన్నాడంటే యిదేనన్నమాట. సరిగా మంత్రం మొదలుపెట్టిన నలభై యొకటవరోజు. తనకు మంత్రసిద్ధి కలిగిందని అర్థమవుతున్నది.

పద్మసంభవుడు కొంచెం ఎరుపుకు తిరిగిన తెల్లనిరంగుతో ఇరవై యేండ్ల యువకునివలె ఉన్నాడు. నల్లని పొడవాటి అంగరఖా ధరించిపైన కాషాయరంగు పట్టుశాల్వా వేసుకొన్నాడు. చేతిలో త్రిశూలం ఉంది. దానికేవో వెంట్రుకలు కట్టి ఉన్నవి. తలమీద పంచదళ పద్మాకృతి గల టోపీ ఉంది. దానిపై మూడు మొనలు, అయిదు రంగులతో అలంకారము కలిగి ఆ పైన ఒక గ్రద్దయీక గ్రుచ్చబడి ఉంది. ఇంకా ఏవో చిత్రమైన వస్తువులు భూషణములుగా ప్రకాశిస్తున్నవి. వాటన్నింటికి యోగశాస్త్రపరమైన అర్థాలేవో ఉన్నవట !

సభలో మహరాజు స్వాగత వచనాలు పలికి బౌద్ధధర్మానికి రక్షకుడైన మహాయోగి మంత్రసిద్ధుడు ఈ రాజ్యానికి రావడం అందరి అదృష్టమని అన్నాడు. ఆ తర్వాత పద్మసంభవుడు- బౌద్ధమతానికి సంబంధించి భారతదేశంలో ఉన్న పరిస్థితులు, ధర్మప్రచారానికి అనుసరించవలసిన పద్ధతులు వివరిస్తూ

ప్రసంగిస్తున్నాడు. యేషేకు ఒక్క ముక్క కూడా ఎక్కటం లేదు. మనస్సెక్కడో ఉంది. ఒక్క మాట కూడా వినలేకపోతున్నది. కన్నులు నిమీలితములైనవి. ఏదో చెప్పలేని అనుభూతి. కాసేపటికి సమావేశం అయిపోయింది. రాజకుటుంబీకులు, మంత్రులు, సేనాపతులు, పురప్రముఖులు అందరూ రిన్‌పోచేకు పాదనమస్కారం చేశారు.

అందరూ వెళ్ళిపోయిన తర్వాత అంతఃపుర కాంతలకు అనుమతి ఇవ్వబడింది. వారితో పాటు తాను వెళ్ళి వివశురాలైంది. ఆయన చూపులో ఏదో వింత మార్పు వచ్చినట్లు తాను భావించింది. ఎవరూ దానిని గమనించలేదు. సమావేశం ముగిసింది. ఎవరి మందిరాలకు వారు చేరుకొన్నారు. ఆ రోజు రాత్రి నలభై ఒకటవ రాత్రి ఉపవాసదీక్ష విరమించి అల్పాహారం తీసుకొన్నది.

రోజులానే ధ్యానంలో కూర్చున్నది. ఎంతసేపు గడిచిందో తెలియదు. కంటి ముందు ఒక తేజఃపుంజం కనిపిస్తున్నది. అది నెమ్మదిగా పురుషాకృతి ధరించింది. రిన్‌పోచేగా మారింది. ఆయన చేతిలో త్రిశూలం లేదు. తలపై టోపీ లేదు.

---

ఎవరెస్టు శిఖరాన్ని ఎడ్మండ్ హిల్లరీతో కలిసి అధిరోహించిన టెన్‌సింగ్ నార్కే భార్యపైన ఇటువంటి విషప్రయోగం జరిగింది. టిబెట్‌లోని ఒక ప్రాంతంలో భూతమంత్ర సిద్ధి కోసం నరబలు లీవిధంగా ఇస్తుంటారు. గోళ్ళలో విషం ఉంచి వేళ్ళు దానిలో ముంచి అతిథికి పానీయం ఇవ్వడం ఆ పద్ధతి. టెన్‌సింగ్ భార్య మరణిస్తూ నాకు మరణమంటే భయం లేదు. పెమెకో (సిద్ధాశ్రమ) యోగులను దర్శించిన దానిని మరణానంతరం వారి దగ్గరకు చేరుతాను అన్నది. ఒక అమెరికన్ హిమాలయ యాత్రికుడీ విషయాన్ని తన గ్రంథంలో వ్రాశాడు.

1) టిబెట్ గ్రామాలు కొన్నింటిలో మాంత్రికులు ఈ విద్య నేర్చిన వారున్నారని ఒక విదేశ యాత్రికుడు వ్రాశాడు. అతడొక ఊరికి వెళ్ళినప్పుడు ఆతిథ్యమిచ్చిన గృహయజమానిని ఆ యింటిలోని వారు రాత్రికాగానే ఒక దృఢమైన గదిలో బంధించారు. ఇదేమిటని అతడాశ్చర్యపడితే – ఈ యజమాని రాత్రిపూట పులిగా మారి దొడ్డిలోని మేకలను చంపుతాడు. అందుకని

అస్థిమాల లేదు. పుష్పమాల ధరించిన పరమ సుందర సువర్ణమూర్తి. ఆ కన్నులలో కామంతో నిండిన ప్రేమ తొణికిసలాడుతున్నది. రెండు చేతులు బార్లా చాచి తనను ఆహ్వానిస్తున్నాడు. తనలో ఇన్నాళ్ళుగా నిద్రాణమైన కామవాంఛ విజృంభిస్తున్నది. వలపు వెల్లువై ప్రవహిస్తున్నది. చెలరేగుతున్న కోరిక. ఉప్పొంగుతున్న వక్షోజాలతో ముందుకు వెళ్ళి ఆయన కౌగిటిలో వాలిపోయింది. మధురాధర చుంబనములతో శృంగారచేష్టలతో ఉద్రేకం పరవళ్లు తొక్కుతున్నది. పట్టెమంచం మీదకు తీసుకు వెళ్ళాడు యేషేను పద్మసంభవుడు.

**ఉ॥ శయ్యకు తార్పగా తురుముజారె అదంతట చక్క దిద్దబో**
**పయ్యెద జారె అయ్యదిరిపాటున గ్రక్కున నీవిజారె రా**
**జయ్యెడ అవ్విలాసిని ఒయారము చూచె కవుంగిలించెనొ**
**నెయ్యెడ మేలె చూతురు గణింపరు జాణలు జారుపాటలన్.**

**(చేమకూర వెంకటకవి)**

బంధించాము. ప్రొద్దుననే మళ్ళీ మామూలు రూపం వస్తుంది, అప్పుడు తలుపు తెరుస్తామన్నారు. స్వయంగా చూచాడు గనుక ఆ యాత్రికుడు తన అనుభవాన్ని గ్రంథంలో వ్రాశాడు.

2) కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ పులిమ్రుగ్గు అనే నవలలో మనుషులు మంత్ర తంత్రప్రభావంతో పులులుగా మారటాన్ని విపులంగా వర్ణించాడు.

3) ఆంధ్రదేశంలో గుంటూరుజిల్లా పెదారికట్ల గ్రామంలో మాసాబత్తుల వారు ఇటువంటి విద్యలలో ప్రవీణులుగా ప్రసిద్ధి. పులిమీద స్వారీచేస్తూ, బెండ్ల వల్లకీ మీద ప్రయాణం చేస్తూ వారు వస్తే ఆయా గ్రామాలవారు భయభ్రాంతులయ్యేవారు. సహజంగా పులులను వశం చేసుకోవటం ఒకవిద్య. మనుష్యులను పులులుగా మార్చటం మరొక విద్య.

4) పద్మసంభవుని వజ్రగురుమంత్రం చేసిన వారికి ఆయన వాహనమైన పులి సాక్షాత్కరిస్తుంది. అలానే వజ్రభైరవ మంత్రం చేసినా కూడా ఆ అనుభూతి కలుగుతుంది. వజ్రభైరవుని వాహనం పులి.

రతిక్రీడాపరవశయైన యేషే కంఠం నుండి వచ్చిన మణిత ధ్వనులతో ఆశయ్యామందిరం కలితకాకలీ కలరవోల్లలితమైంది. పరవశస్థితిలో ఎంత సమయం జారిపోయిందో ! కన్నులు తెరిపిడి పడటానికి చాలాసేపు పట్టింది. తెరిచి చూచేసరికి అక్కడ ఎవరు లేరు. వేసిన గడియలు వేసినట్లే ఉన్నవి. మూసిన తలుపులు మూసినట్లే ఉన్నది. దంతక్షత నఖక్షతాలు కనిపిస్తున్నవి. రహస్య భాగములు పరికించింది. కన్నె పొర చినిగిపోయింది. యోనిలో వీర్యం గోచరిస్తున్నది. అంటే తనకు కలిగినది స్వప్నానుభూతికాదు. ధ్యానానుభూతి కాదు. సత్యమైన శృంగారనుభవం. తానెంత అదృష్టవంతురాలు ! తన స్పర్శ వల్ల విద్యుద్ఘాతం పొందని మహాపురుషుడు పురుషోత్తముడు. ఆ మహనీయుడే తన నిజమైన భర్త గురువు, దేవుడు, సమస్తము. తన దివ్యశక్తితో తేజోరూపంతో వచ్చి తనతో క్రీడించి వెళ్ళాడు. ఇకపై తనజీవితం ఆయనతో ముడిపడి ఉన్నదన్నమాట.

తెల్లవారిన తర్వాత చెలికత్తెలతో రిన్‌పోచే గూర్చి వాకబు చేసింది. ఎందరో స్త్రీ పురుషులు వారిదర్శనానికి వచ్చి వెళుతున్నారని తెలిసింది. అంతఃపుర పరివారాధికారిణి ద్వారా మహారాజుకు రిన్‌పోచే దర్శనానికి వెళ్ళటానికి అనుమతి కోరింది. రాజు అంగీకరించాడు. అందరూ వెళ్ళి పోయి దర్శనాలు ఆపుతున్న సమయంలో ఆమె సఖీగణంతో పరివారంతో వెళ్ళింది. రాణిగారు వచ్చారని భటులు ప్రత్యేకదర్శనం ఏర్పాటు చేశారు. ఆమె లోపలికి వెళ్ళి ఆయన పాదాలు తాకి నమస్కరించింది.

పద్మసంభవుడు : యేషే ! నాకు రాజుకు తగిలినట్లుగా విద్యుద్ఘాతం తగలదు. నీ స్పర్శవల్ల మరొకరకమైన విద్యుదనుభూతి కలుగుతున్నది.

యేషే : రినోపోచే ! ఆ సంగతి రాత్రే తెలిసింది. నాజీవితానికి తొలి రాత్రి – మధురరాత్రి అదే.

పద్మ – నాకు తెలుసు. వజ్రేశ్వరి పరివారంలోని సుందర డాకినివి నాకోసం నిన్ను మానవిగా పుట్టించిందా కృష్ణక్రోధిని. నీవెవరో నీకు తెలియదు. కొంతకాలం నాతో కామసాధనలు చేస్తేగాని నీలోని దివ్యత్వం వికసించదు.

యేషే : అది ఎలా సాధ్యం – రాజభటరక్షితమైన మందిరాలు. కంచుకీజనపరివృతమైన గృహం. రాత్రివచ్చినట్లుగా రావాలే తప్ప మామూలు పద్ధతిలో కుదరదు గదా !

పద్మ : త్వరలో కుదురుతుంది. రేపటి నుండి భక్తులకు మంత్రదీక్ష లిస్తాను. నీకు ఇదివరకే వజ్రగురు మంత్రం ఇవ్వబడింది. రాజానుమతితో వజ్రయోగినీ మంత్రం నీవు స్వీకరిద్దువు గాని. బౌద్ధ ధర్మప్రచారంలో భాగంగా కొద్ది కాలంలోనే భిక్షు భిక్షుకీ దీక్షలు ఇవ్వటం మొదలవుతుంది. ఈ సన్యాస దీక్షాధారులు మత ప్రచారానికి చాలా అవసరం. ఈ లోపు మహారాజుకు కొన్ని ధ్యానానుభూతులను ప్రసాదిస్తాను. నా యందు పూర్ణ విశ్వాసం కలుగుతుంది. ఈ కాలంలో అత్యంత పరిమితాహారంతో నీవు నిరంతరం ధ్యానం చేస్తూ ఉండు. బయటకు రావటం మానివెయ్యి. ఈ విషయం రాజుకు తెలుస్తుంది. నీవు ఎలానూ తనతో సంసారానికి పనికిరావు గనుక ఈ మార్పు రాజుకు సంతోషాన్నే కలిగిస్తుంది.ఆ దశలో భిక్షుకీ దీక్ష తీసుకొంటానని రాజును అభ్యర్థించు. అంతఃపురకాంతలు అలా మారటానికి రాజకులీనులు ఒప్పుకోరు. అయినా నా సంకల్పశక్తి వల్ల రాజు అంగీకరిస్తాడు. భిక్షుకులైన తర్వాత అంతఃపురంలో ఉండటానికి వీలులేదు. ఊరి బయట కట్టే బృహత్ – సంఘారామంలోనికి నీవు వస్తావు. నేనక్కడే ఉంటాను. ప్రతిరాత్రీ మనమక్కడ కలుస్తాము. వజ్రయాన తాంత్రికసాధనలలో నీవు మహాసిద్ధు రాలివవుతావు.

యేషే : మహాత్మా ! మీ పాదరేణువును నేను. మీ ఆజ్ఞాబద్ధురాలినై జీవిస్తాను.

అంతా అనుకొన్న ప్రకారమే జరిగింది. యేషే రాణి – బౌద్ధభిక్షుకియై సంఘారామవాసిని యైంది. పద్మసంభవునితో ఆమె రహస్య కామక్రీడలు చేస్తున్నదని బయటకు పొక్కింది. రాజుగారికి చెప్పే ధైర్యం ఎవరికీ లేదు. నిరూపించకపోతే శిరశ్ఛేదం చేయవచ్చు. అయినా రాజగురువు ఇవాళ చండమార్తాండునిగా ప్రకాశిస్తున్నాడు. టిబెట్‌లో ఆయన మాట కెదురు లేదు. బౌద్ధధర్మం, సంఘారామాలు, అసంఖ్యాక గ్రంథాలు వీర విజృంభణంగా ఉన్నవి.

రాజ వంశీయులలో కొందరు ఏమైనా సరే పద్మసంభవుని హతమార్చాలని నిశ్చయించుకొన్నారు. కాని వారి ప్రయత్నాలు ఫలం కావటం లేదు. వాళ్ళ కుట్రలో భాగంగా ఒక సంస్థానాధీశ్వరుడు పద్మసంభవుని ధర్మప్రవచనాలకు ఆహ్వానించాడు. అక్కడ కార్యక్రమాలు పూర్తి అయిన పిమ్మట రాజుగారి మందిరంలో విందు జరిగింది. విందు చివర ఒక ఫలరసపాత్ర సేవకులు తెచ్చారు. అందులో నుండి ఒక చిన్నిపాత్రలో కొంత తాను పోసుకొని మరొక చిన్న పాత్రలో పోసి పద్మసంభవునకిచ్చాడు. ఇద్దరూ త్రాగారు. అక్కడ రాజొక దుర్మార్గం చేశాడు. పద్మసంభవునకు పాత్రను స్వయంగా ఇస్తూ జాగ్రత్త కోసం చేసినట్లు ఒక వేలు పాత్రలో పెట్టి పట్టుకొన్నాడు. ఆ వేలి గోటిలో భయంకరమైన విషం ఉంచాడు. * అది ఫలరసంతో కలసిపోయింది. దానిని తాగిన పద్మసంభవునకు వసతి చేరుకోగానే ఉదరకోశంలో శరీరంలో వచ్చిన మార్పువల్ల విషప్రయోగం జరిగిందని తెలుసుకొన్నాడు. వెంటనే తనకు సిద్ధించిన నాగవిద్యను స్మరించాడు. ఒక మహానాగరాజు కంటి ముందు సాక్షాత్కారించి తనలోకి ప్రవేశించాడు. తానే నాగభైరవవుడైనట్లు అనుభూతి కలిగింది. శరీరంలోని విషం నిర్విషమైంది. నాగదేవుని మనసారా స్తుతించాడు. తనకు మరణం లేదు. వజ్రయోగిని అనుగ్రహం వల్ల ఇంద్రచాపకాంతి దేహం తనది. అయినా ఇటువంటి గండాలకు జాగ్రత్తలు తీసుకోవాలి. మర్నాడు రాజుకు కబురు చేసి వీడ్కోలు చెప్పి దిగ్భ్రాంతుడైన అతనికి చిరునవ్వే సమాధానంగా సూచించి వెళ్ళిపోయినాడు.

తనను సంహరించటానికి ఇటువంటి ప్రయత్నాలెన్నో జరిగినా పద్మసంభవుడు లెక్కచేయలేదు. ఒకసారి వీటిని చూచి విసిగిపోయి తనకు తెలిసిన వ్యాఘ్రపరిణామ విద్య సహాయంతో యేషే చోగ్యాల్‌ను పులిగా మార్చాడు. ఆ వ్యాఘ్రంపై కూర్చుండి ఆకాశమార్గంలో ప్రయాణం చేసి కైలాసపర్వతానికి అటువైపున్న భూటాన్ చేరి అక్కడి కొండమీది గుహలో యేషేతో కలిసి తీవ్ర తాంత్రిక సాధనలు చేశాడు. అక్కడ ఆమెకు సిద్ధస్థితి లభించింది. ఇప్పటికీ ఆ గుహలో వారి చిత్రాలు గోడపై రంగులతో ప్రకాశిస్తున్నవి. భూటాన్‌లో కొంతకాలం గడిచిన తర్వాత త్రిసంగద్యుతిసేనుని నుండి మళ్ళీ వార్త వచ్చింది. జరిగిన

సంఘటనలు తన దృష్టికి వచ్చినవని, ఇక ముందు అటువంటివి జరగకుండా జాగ్రత్తలు తీసుకొంటానని కనుక క్షమించి తిరిగి రావలసిందని ప్రార్థన పంపించాడు. దానితో మళ్ళీ టిబెట్ చేరాడు. అక్కడి సంఘారామంలో ఉంటూ ప్రశాంతంగా ధర్మప్రబోధం చేస్తూ నలభై యెనిమిది సంవత్సరాలున్నాడు. ఆయువు తీరి ముసలితనం వచ్చి మహారాజు మరణించాడు. పద్మసంభవునకు గాని యేషేచోగ్యాల్‌కు గాని వృద్ధత్వం రాలేదు. వారు నిత్యయౌవనంతో ప్రకాశిస్తున్నారు. దీనితో యేషే భిక్షుకికి కూడా గౌరవం వచ్చింది. మంత్రసిద్ధురాలన్న కీర్తి వచ్చింది. మహారాజుకు 21 యేండ్ల వయస్సులో (క్రీ.శ.810) టిబెట్ చేరిన పద్మసంభవుడు రాజు 69వ యేట మరణించిన తర్వాత ఆయన కుమారుని సింహాసనాధిష్ఠితుని చేసి ఆ కొత్తరాజు అభ్యర్థన మీద 7 సంవత్సరాల 6 నెలలు ఉండి ధర్మబోధ చేశాడు.

మొత్తం మీద పద్మసంభవుడు టిబెట్‌లో 50 సంవత్సరాల మూడు నెలలున్నాడని ఎక్కువమంది పరిశోధకుల అభిప్రాయం. స్వయంగా 21 మంచుకొండలలో సంచారం చేసి, మధ్య టిబెట్‌లో 21 సాధన కేంద్రాలను, దోషం ప్రాంతంలో 25 పవిత్ర ప్రదేశాలను, మూడు రహస్యమైన లోయలను, ఇంకా ఎన్నో ధ్యాన కేంద్రాలను నెలకొల్పాడా మహనీయుడు.

బోధిసత్త్వులు నిర్దేశించిన కార్యక్రమాలు పూర్తి అయిన తర్వాత దివ్యభూమి కల నుండి పిలుపు వచ్చింది. సిద్ధాశ్రమంలోని రహస్యభాగాలకు వెళ్ళవలసిన సమయం సమీపించింది. బౌద్ధధర్మ ప్రచారానికి వీలైనంత మంది సిద్ధసాధకులను తయారు చేసిన సంతృప్తితో ఇక వెళ్ళిపోవాలని నిశ్చయించుకున్నాడు.

భావికాలాల వారికి ఉత్తేజము, విశ్వాసము కలగటం కోసం తన శరీరముద్రను బుంటాంగ్‌లో, హస్త ముద్రలను నామ్‌ట్సో చుగ్మోలో, పాదముద్రలను పారోద్రాకర్‌లో ఉంచాడు.

అందరి దగ్గర వీడ్కోలు తీసుకొనే సమయం వచ్చింది. మహారాజు, శిష్యులు, భక్తులు ఎంతో ప్రార్థించారు. దైవనిర్ణయం తప్పదని వాళ్ళందరినీ ఓదార్చి అశ్వారూఢుడై రక్షస్థల్‌వైపు వదిలివెళ్ళిపోయినాడా మహాయోగి. రావణుడు తపస్సు

చేసిన ఆ ప్రదేశంలో ఒక కొండగుహలో ఆ సిద్ధుని కేశములు, గోళ్ళు వస్త్రములు రక్షితములై ఉన్నది. ఆ గుహలో 7 రోజులున్నాడట ! ఛివూగోంపామది ఆ స్థానం నుండి సిద్ధాశ్రమంలోని ఆంతర భాగాలకు వెళ్ళి అక్కడ నుండి సాధకుల ననుగ్రహిస్తున్నాడని టిబెట్ యోగుల అనుభవం - దర్శనం. సిద్ధవిద్యాధరుడై 3,600 సంవత్సరాలు భౌతిక శరీరంతో ఉంటాడని కొందరు దార్శనికుల అభిప్రాయం. మైత్రేయబుద్ధుడు తుషితలోకం నుండి భూమి మీద అవతరించినపుడు పద్మ సంభవుడు మళ్ళీ ప్రపంచంలోకి వస్తాడని బౌద్ధుల విశ్వాసం.

---

అతని శిష్యులు ముఖ్యులు 25 మంది. రెండవ తరగతి వారు 38 మంది. ఇంద్రచాప శరీరాలు పొందినవారు 80 మంది. 108 మంది ధ్యానయోగంలో దివ్యానుభూతులు పొందారు. 30 మంది తాంత్రికులైనారు. 50 మంది దివ్యజ్ఞానం పొందారు. శిష్యరాండ్రలో 25 మంది డాకినీ సిద్ధిని, 7 గురు యోగినీ దశను పొందగలిగారు. ఇంక ఎందరో సాధనలో ముందుకు వెళ్ళగలిగారు.



## 3. కపిలుడు



హిమాలయాల నుండి బ్రహ్మావర్త - ఆర్యావర్తభూములలో జేగీయమానంగా ప్రకాశించిన కర్దమ ప్రజాపతి కుమారుడు కపిలుడు. శీతశైలగుహలలో తపస్సు చేసిన జన్మసిద్ధుడతడు. ఆ మహనీయుని ఆశ్రమం కైలాన పర్వత ప్రాంతంలో ఇప్పటికీ విరాజిల్లుతున్నది. మహర్షి విష్ణుదేవుని అంశ-సాక్షాద్విష్ణువే అనటానికి ఒక అద్భుతమైన కథ ఉత్తరరామాయణకాలంలో ఉంది. రాక్షసేశ్వరుడైన రావణాసురుడు జైత్రయాత్ర చేస్తూ ఒక అరణ్యప్రాంతంలో విడిది చేశాడు. అక్కడ ఒక మహాపర్వతం ఉన్నత శిఖరంతో ప్రకాశిస్తున్నది. అందొక కోన - అచట ఒక శిలావితర్ది మీద ఒక మహాపురుషుడు ధ్యానంలో ఉన్నాడు. సమాధిస్థితిలో ఉన్న ఆ యోగీంద్రుని చుట్టూ అదృశ్యతేజోవలయమేదో ఉన్నట్లున్నది. రావణుడాకాంతి మండలంలోకి ప్రవేశించాడు. వెంటనే ఆమహనీయుని కన్నులలో నుండి అగ్నిశిఖలు విజృంభించినవి. శరీరములో నుండి మరుత్తులు, వసువులు, రుద్రులు ఉదయించారు. దేవదానవులెందరో ఆయన దేహభాగాలలో కనిపిస్తున్నారు. ఆ వింతలను చూచి రావణునకు కోపం వచ్చింది. ఇతడెవరో ఐంద్రజాలికుడు. నా ముందు టక్కుటమారాలు చూపిస్తున్నాడు - అనుకొని ఆయనపై దివ్యాస్త్రాలు ప్రయోగించి పెద్దగా అట్టహాసం చేశాడు.

అప్పుడా మహాపురుషుడు లేచి "ఓరీ ! చెడుగా! నన్ను సాధించటానికి ఇక్కడకు కూడా వచ్చావా?" అంటూ నిప్పులు కురిసే కండ్లతో కోపంగా చూచి ఒక్క ముష్టి ఘాతం ఇచ్చాడు - చిన్నపిల్లవాడిని చెంపదెబ్బకొట్టినట్లు. ఆ చిన్న పిడికిటి పోటుకే రావణాసురుడు తుఫాను గాలికి కూలిన చెట్టులా స్పృహదప్పి పడిపోయినాడు. అతని మంత్రులు, సేనాపతులు కపిలునిపైకి దూకారు. ఒక్క హుంకారంతో వారిని భయభ్రాంతులను చేసి అక్కడ గుహలోపలికి వెళ్ళిపోయినాడు.

కాసేపటికి మూర్ఛదేరి - లేచి రావణుడు నన్ను ముష్టితో నొంచిన వాడెటు వెళ్ళాడని తన వారిని అడిగాడు. "అయ్యా ! అతడు మిమ్ము జూచి భయపడి ఈ కొండ గుహలోకి వెళ్లాడు. పరాఙ్ముఖుడైన వాని మీదకు మీ వంటి బలాఢ్యులు పోతారా? అదీ కాక ఇతడెవరో మహాత్ముని వలె ఉన్నాడు. అతడి జోలి ఎందుకులెండి" అన్నారు. రావణుడు కోపించి అతడు ప్రళయాంతకుడైనా పోనిస్తానా? మీరు మాట్లాడకుండా ఇక్కడే ఉండండి - అని నిర్భయుడై గుహలోపలికి వెళ్ళాడు. ముందంతా చీకటి. మూర్ఖుని మనస్సువలె ఉంది. ఇంకా ముందుకు వెళ్తే కండ్లు మిరుమిట్లు కొలిపే కాంతి. అతిభీషణాకారులు ఘోరశస్త్రాస్త్రధారులైన వీరులు, చూపులతోనే బ్రహ్మాండములను భస్మము చేసే సిద్ధులు, శంఖచక్రగదా ఖడ్గములు దాల్చిన చతుర్భుజములు - మహాతేజస్సుతో అక్కడ ప్రకాశిస్తున్నారు. వారిని చూచి రావణునకు భయం పుట్టింది. ఇంకా చూస్తుంటే ఒక శరచ్చంద్ర చంద్రికా ధవళశయ్యమీద ఒక బాలిక కాళ్ళొత్తుతూ ఉంటే కండ్లు మోడ్చి నిద్రపోతున్న ఒక దివ్యపురుషుని చూచాడు. ఆ కన్యను చూచి కామోద్రేకంతో దగ్గరకు పోబోయినాడు. ఇంతలో ఆ మహాపురుషుడు లేచి సరభసంగా అట్టహాసం చేశాడు. ఆ భయంకర ధ్వనికి అసురవల్లభుడు భీతితో వివశుడై కొంతసేపటికి తేరుకొని "మహాత్మా! నీవెవరు ? దయచేసి తెలుపవలసినది.

సీ॥ రుద్రుని కనుగొంటె రుద్రునకిటువంటి
దారుణోన్నిద్ర రౌద్రంబుగాన
జమునితో మార్కొంటి జమునకునిటువంటి
కర్కశోదగ్ర విగ్రహము గాన
తపనుని బొడగంటి తపనునకిటువంటి
ప్రతిమాతిగ ప్రతాపంబుగాన
కనకాద్రిపై నుంటి కనకాద్రి కిటువంటి
అతిదుర్నివార ధైర్యంబుగాన

గీ॥ ఇంద్ర చంద్రాది దివ్యుల నెల్లగంటి
వారియందీ ప్రభావ మెవ్వరికి గాన
నిగురులో నిప్పు తీరున నీచరిత్ర
మెరుగబడదన్న నగియతడిట్టులనియె

ఇపుడే నన్ను ఎరుగవచ్చునే ? ఇకమీద నీవే తెలుసుకొంటావు. ఇంతలోనే నేనింతవాడనని వివరించబోను. అది అలా ఉండనియ్యి !

**శా॥ బ్రహ్మేశాన వరంబులన్ భువనముల్ బాధించి బ్రహ్మణ్యుల**
**బ్రహ్మణ్యంబులు వెట్టగామెలగినన్ బ్రహ్మోక్తి సైరించితిన్**
**బ్రహ్మఘ్నున్ నిను నింకమీద ననిలో బాహాబలం బేర్పడన్**
**బ్రహ్మేశాది సురేంద్రు లడ్డుపడినన్ భంజింపుదున్ రావణా !**

బ్రహ్మరుద్ర వరాలవల్ల పొగరెక్కి లోకాలను బాధిస్తున్నావు. వాళ్ళెవరడ్డు పడినా త్వరలో నిన్ను రణరంగంలో సంహరిస్తాను. నేనెవరనుకొంటున్నావో నా నిజరూపం చూచి నా మహిమను నా నామమును తెలుసుకో ! అని ఆ మహనీయుడు నోరు తెరిచాడు. విశ్వరూపం అందులో కనిపించింది. సమస్త లోకములు దేవదాన వాదులంతా గోచరిస్తున్నారు.

**సీ॥ జ్వలనకీలాసహస్రములర్క కరలక్ష**
**లైందవరుచికోటు లచట తోచె**
**నరసురాసురవియచ్చర సిద్ధ సాధ్య రు**
**ద్రాహి గుహ్యక తతులచట తోచె**
**అఖిల సముద్రంబు లఖిలాంతరీపంబు**
**లఖిలసరిద్వన్యలచట తోచె**
**నభముభూమియుగాడ్పు నక్షత్రములు గిరు**
**లామ్నాయముఖవిద్యలచట తోచె**
**గీ॥ అట్టి ముఖములు పెక్కువేలమిత కర్ణ**
**నయన నాసాపుటంబులనంత పదము**
**లమితబాహువు లమితభూషాంబరాదు**
**లమిత శస్త్రంబులమ్మూర్తి యందు తోచె**

ఆ యద్భుత తేజోనిధిముందు ఏనుగుముందు దోమవలె దైత్యరాజు తేజోహీనుడై ఒళ్ళు వణుకుతుంటే కళ్ళు మూసి నమస్కరించి "దేవా ! యుద్ధంలో నీ చేతిలో చావటం కంటె అదృష్టమేముంటుంది" అని మ్రొక్కి బయటకు వచ్చి మారీచాదులతో కలసి వెళ్ళిపోయినాడు.

అలాగే మరొకకథ. సూర్యవంశీయుడైన సగర మహారాజు షట్చక్రవర్తులలో ఒకడు. ఎన్నో యజ్ఞములు చేసి దేవతలను సంతుష్టి పరిచాడు. అశ్వమేధయాగాలు చేయటం మొదలుపెట్టాడు. నూరశ్వమేధాలు చేస్తే ఇంద్రపదవికి అర్హత వస్తుంది. 99 చేసి నూరవది చేస్తుంటే ఇంద్రునకు భయం కలిగింది – తన పదవికి భంగం కలుగుతుందేమో అని. యాగాశ్వాన్ని దొంగిలించి పాతాళంలో కపిల మహర్షి ఆశ్రమంలో ఉంచి వెళ్ళిపోయినాడు. సగరపుత్రులు ప్రపంచమంతా వెదికి ఎక్కడా కనబడక చివరకు భూమిని త్రవ్వి పాతాళంలో కపిలాశ్రమంలో కనుక్కొన్నారు. కపిలుడే దొంగ అని భావించి ఆయన మీదకు వెళ్ళారు. ఆయన కోపించి తన తపోగ్నితో వారిని భస్మం చేశాడు. అనంతరకాలంలో సగర వంశీయుడైన భగీరథుడు కపిలుని ప్రార్థించి ఆయన ఆశీస్సులు పొంది ఘోరతపస్సు చేసి గంగను అవతరింప జేసి తనపూర్వుల శరీరభస్మరాసులపై ప్రవహింపజేసి వారికి దివ్య లోకప్రాప్తి కలిగించాడు. మహామహిమాన్వితుడైన కపిలుని ప్రభావం వర్ణించటం సాధ్యం కాదు.

ఇవాళ అమెరికాలో కొలరాడో పర్వతాలలో కపిలాశ్రమమని ఒక ప్రదేశం చూపించబడుతున్నది. ఒక గ్లోబు తీసుకొని హిమాలయాలున్న చోట చిల్లిపెట్టి ఒక పుల్ల దూరిస్తే ఈ ప్రక్క అది కొలరాడో పర్వతాలలోని ప్రస్తుత ప్రదేశంలోకి వస్తుంది. అమెరికాలోని ఈ ప్రాంతమునే ఆ రోజులలో పాతాళమని భావించారని కొందరు చారిత్రకుల అభిప్రాయం. పురాణాలలో వర్ణించబడిన స్వర్గ పాతాళాలు చర్మచక్షువులకు కనబడేవి కావు. సూర్యమండలం నుండి ధ్రువ నక్షత్రంగా ఉన్న ప్రదేశమే స్వర్గమని పురాణాలు చెపుతున్నవి. "ఆసూర్యాద్ధ్రువం రాజన్ స్వర్లోక ఇతి కథ్యతే"– అలానే పాతాళమంటే భూలోకం క్రింది ఒక భూమిక. అందులో అదృశ్య రూపాలతో రాక్షస, నాగజాతుల వారుంటారు. భూలోకంపైని భువర్లోకంలో విద్యాధర యక్షసిద్ధ సాధ్య కిన్నరాది దేవయోని జాతులవారుంటారు. ఆపై సువర్లోకం – అదే స్వర్గం. అక్కడ దేవతలుంటారు. ఆపైన తపోలోకాదులు ఉన్నవి.

తిరుపతిలో కపిలతీర్థమున్నది. కపిలుడు అక్కడ తపస్సు చేశాడని స్థలపురాణకథ. దివ్యశక్తి సంపన్నులైన మహర్షులు ఎన్నో ప్రదేశాలకు వచ్చి

తపస్సులు చేసి దేవాలయాలు ప్రతిష్ఠించారు. అలానే తిరుపతి యేడుకొండల మొదట అందమైన జలపాతాలున్న చోట కపిలేశ్వరుడు స్థాపించబడి పూజలందు కొంటున్నాడు.

భగవద్గీతలో శ్రీకృష్ణుడర్జునునితో "సిద్ధానాం కపిలోస్మ్యహం" అన్నాడు. సిద్ధులలో నేను కపిలుడను అన్నాడు. అంతటి మహాపురుషుడు ఔపనిషద తత్వవేత్త – దేవహూతి అనే తన తల్లికి తత్వబోధ చేసి ఆమెకు ముక్తిమార్గాన్ని ప్రసాదించాడు.

కపిలుడొకసారి జైగీషవ్యుడనే మిత్రుని – మహర్షిని తీసుకొని అశ్వశిరుడనే రాజు చేస్తున్న యజ్ఞానికి వెళ్ళాడు. ఆ రాజు విష్ణుమూర్తి అనుగ్రహం ఏ విధంగా లభిస్తుందో తెలియజేయమని ప్రార్థించాడు. విష్ణు స్వరూపుడగు కపిలుడు తానే విష్ణుశునని తనను సేవిస్తే కరుణిస్తానని అన్నాడు. రాజుకివి అహంభావవచనాలుగా అనిపించి కోపం వచ్చింది. కాని నిగ్రహించుకొని విష్ణువు గరుడవాహనుడు, శంఖచక్ర గదాధారిగదా! మీరసు అలా లేరు – అన్నాడు. అప్పుడు జైగీషవ్యుడు గరుత్మంతుని రూపాన్ని ధరించగా కపిలుడు శంఖ చక్రధారియై విష్ణువు యొక్క ఆకృతిని ధరించాడు. రాజు దీనిని మాయా ప్రదర్శనగా భావించి శ్రీహరికి నాభియందు కమలముంటుంది. అందులో బ్రహ్మ ఉంటాడు అన్నాడు. కపిలుని నాభియందు పద్మం గోచరమైంది. జైగీషవ్యుడు బ్రహ్మయైనాడు. అప్పటికీ అశ్వవిరుడు నమ్మలేదు. మునులిద్దరు అదృశ్యమైనారు. యజ్ఞవాటిక క్రూరజంతువులతో నిండిపోయింది. భయపడిన రాజు వారిని రక్షించమని ప్రార్థించాడు. కపిలుడు ప్రత్యక్షమై జంతుబాధ తొలగించి విష్ణువును అఖిల పదార్థముల యందు అలరే సర్వాత్మునిగా భావించి ప్రార్థించు భక్తికి వశమవుతాడు. ఇది నీకు బోధపడటానికేమేమిలా చేశాము అని బోధించి సమిత్రుడై వెళ్ళిపోయినాడు.

కపిలుని శిష్యమిత్రుడైన జైగీషవ్యుడే కాశీలోని ఒక గుహలో తపస్సు చేసి శివానుగ్రహం పొందాడు. అతడే కాలాంతరమున సిద్ధేశ్వరయోగియైనాడని దార్శనికుల అనుభూతి. అది వేరే కథలో వివరంగా వస్తుంది.

# 4. జైగీషవ్యుడు

హిమాలయ పర్వతాలలో కర్దమ ప్రజాపతి ఆశ్రమం ఉంది. ఆయన కుమారుడు కపిలుడు. విష్ణువు యొక్క అంశవల్ల పుట్టటం దివ్యస్ఫురణ ఉండడం వల్ల అతడు సహజంగా ఏ సాధన లేకుండానే సిద్ధుడైనాడు. చిన్నప్పుడు పాఠశాలలో ఆయనతో పాటు జైగీషవ్యుడనే ఋషి కుమారుడు కూడా తోటి విద్యార్థి. ఇద్దరూ చాలా ఆప్తులుగా ఉండేవారు. కొన్ని సంవత్సరాలు వేదాది విద్యలు పూర్తి అయిన తర్వాత జైగీషవ్యునికి తపస్సు చేసి దివ్యశక్తులు సాధించాలన్న కోరిక కలిగింది. మిత్రుడైన కపిలుని సలహాతో కైలాసపర్వత ప్రాంతంలోని సిద్ధాశ్రమానికి వెళ్ళి అక్కడ కొన్ని సంవత్సరాలు కఠోరనియమాలతో కైలాసనాథుని గూర్చి తపస్సు చేశాడు. మహేశ్వరునకు కరుణ కలిగింది. సాక్షాత్కరించాడు. అయితే ఆయన నీలలోహితుడై వజ్రధరుడై దిగంబరుడై భీషణ సుందరమూర్తితో ఉన్నాడు. జైగీషవ్యునకు ఆశ్చర్యం కలిగింది. హరుడు చిరునవ్వుతో అన్నాడు "ఓయీ! నీ ఆశ్చర్యం చూస్తున్నాను. నీవు తపస్సు చేసిన యీ చోటు డాకినీ శ్మశానం. నీవు రుద్రభూమిలో చేసిన యీ సాధన స్థల ప్రభావం వల్ల ఇక్కడి సిద్ధయోగుల కరుణవల్ల శీఘ్రఫలప్రదమైంది. ఇక్కడ నేను వజ్రకాళీవల్లభుడనై విహరిస్తుంటాను. మహాభైరవుడనై నీకు తీవ్రశక్తులను ప్రసాదిస్తున్నాను. ఈ అనంతకాలంలో నీవు నా ప్రతినిధిగా నిర్వర్తించవలసిన పాత్ర ఉంది. నీ మిత్రుడైన కపిలుడు విష్ణుదేవుని అంశావతారము. సమస్త సిద్ధులు అతని వశంలో ఉంటవి. ఆ మహాపురుషుని మైత్రి నీకు శ్రేయస్కరము. ఇక్కడ నుండి నీవు కాశీమహాక్షేత్రానికి వెళ్ళు. అక్కడి గుహలో మరికొంత కాలం ధ్యానదీక్షలలో ఉండు. వారణాసీ వల్లభుడైన విశ్వనాథుడు, ఆ దివ్యక్షేత్ర రక్షకుడైన కాలభైరవుడు నిన్ను అనుగ్రహిస్తారు. కాలమునకు అధిపతియైన ఆ భైరవుని కృపవల్ల అఖండకాలములో నీ పాత్రను సమర్థతతో నిర్వర్తించగలుగుతావు" అని వరములిచ్చి అదృశ్యుడైనాడు.

ఆ స్వామి ఆజ్ఞప్రకారం కాశీలో గుహావాసియై అహోరాత్రములు భేదం లేకుండా చిరకాలం ధ్యానం చేసి ప్రమథగణంలో స్థానం పొందగలిగాడు. ఒక

రోజు దేవల మహర్షి గొప్ప తపస్సంపన్నుడని విని అతని ఆశ్రమానికి వెళ్ళాడు. అక్కడి శాంతవాతావరణం ఆయనకు వచ్చింది. ఆ స్థలంలో కొంతకాలం ఉందామనిపించింది. ఆయన ఆసక్తిని చూచి దేవలుడు "ఆర్యా ! మీరు మా ఆశ్రమంలో ఎంతకాలమైనా ఉండవచ్చు. తపస్సు చేసుకోవచ్చు. కావలసిన సౌకర్యాలన్నీ చేస్తాను. మీరు కోరిన సిద్ధి లభించిన దాకా మీ యిష్టదేవతా సాధనచేయండి" అన్నాడు. అతనికి జైగీషవ్యుని మహత్వాన్ని గురించి తెలియదు. సామాన్యుడైన మునిమాత్రునిగాను, ఇంకా సాధనదశలో ఉండి దేవతానుగ్రహం కోసం కృషిచేస్తున్న తపోభావుకునిగాను భావించాడు. జైగీషవ్యుడు కూడా దేవలుని అపరిపక్వతను గమనించి, ఏమీ తెలియని సామాన్యునిగా ఆ ఆశ్రమంలో నిత్యము జపధ్యానములు చేస్తూ గడుపుతున్నాడు. కొంతకాలం గడిచిన తర్వాత తన తపశ్శక్తిని, మహత్తులను జైగీషవ్యునకు చూపించాలన్న కుతూహలము, చాపల్యము దేవలునకు కలిగినవి. కలిగి ఇలాఅన్నాడు "జైగీషవ్యా ! ఈ రోజు నాకు కొంచెం పని ఉండి ఆకాశమార్గంలో దివ్యలోకాలకు వెళ్ళి వస్తాను. నీకేయిబ్బంది లేకుండా ఏర్పాట్లు చేశాను. నీకింకా అటువంటి శక్తులురాలేదు గదా! ఎప్పటికైనా రావచ్చు. శ్రద్ధగా సాధనచేస్తూ ఉండు" అని చెప్పి ఖేచరుడై కొన్ని వందల యోజనముల దూరంలో ఉన్న సముద్రం దగ్గరకు వెళ్ళి స్నానానికి దిగాడు. తీరా చూస్తే ఒడ్డుననే ధ్యానం చేస్తూ కండ్లు మూసుకొని ఉన్న జైగీషవ్యుడు కనిపించాడు. దిగ్భ్రాంతి కలిగింది. అక్కడి నుండి గగన పథంలో ప్రయాణించి సిద్ధలోకానికి వెళ్ళాడు. అక్కడ సిద్ధులంతా జైగీషవ్యుని పూజిస్తున్నారు. కొంత కనువిప్పు కలిగింది. "ఈయన సామాన్యుడనుకున్నాను. మహనీయులైన సిద్ధులచే పూజలందు కొంటున్నాడు. అయినా ఇంకా పైలోకాలకు వెళ్తాను. అక్కడకు కూడా చేరుకోగల శక్తి ఉన్నదా లేదా చూస్తాను" అని అగ్నిలోకము, సోమలోకము, వసులోకము, రుద్రలోకము, బృహస్పతిలోకము మొదలైన ఊర్ధ్వలోకాలకు వెళ్ళాడు. ఆశ్చర్యంగా ప్రతిచోట జైగీషవ్యుడు పూజించబడుతూ కనిపించాడు. చివరకు తపోలోకానికి వెళ్ళినా అంతే. జైగీషవ్యుని దగ్గరకు వెళ్ళి మాట్లాడదామని ప్రయత్నిస్తున్నాడు. ఇంతలో ఆయన ఇంకా ఊర్ధ్వలోకానికి ఎగిరివెళ్ళిపోయినాడు. అక్కడ తపోనిధులను దేవలుడు జైగీషవ్యుని గూర్చి ప్రశ్నించాడు. వారు "ఆయన

యోగీశ్వరుడని, అసమాన అద్భుతశక్తి సమన్వితుడని ప్రస్తుతం ఇక్కడ నుండి బ్రహ్మలోకానికి వెళ్ళాడని - నీవింకా కొన్ని వేల సంవత్సరాలు తపస్సు చేస్తే గాని అక్కడకు వెళ్ళలేవని - ఆమహాపురుషునిలో లక్షోవంతు శక్తికూడ నీకు లేదని" తెలియజేశారు.

అప్పుడు దేవలుడు ఆ లోకమునుండి క్రిందికి దిగి తన ఆశ్రమానికి వస్తే అక్కడ జైగీషవ్యుడు ప్రశాంతంగా కూర్చుని ఉన్నాడు. మహర్షి ఆ మహానుభావుని కాళ్ళమీదపడి ఆయన అనుగ్రహంతో అనేక తత్వవిద్యారహస్యాలను తెలుసుకొన్నాడు.

అక్కడ కొన్నాళ్ళున్నతర్వాత జైగీషవ్యుడు బయలుదేరి తన మిత్రుడు మహనీయుడు అయిన కపిలమహర్షిని చూడాలనిపించి హిమగిరిలోని వారి నివాసానికి వెళ్ళాడు. ఆ మహాత్ము డిప్పుడు క్రౌంచద్వీపంలో ఉన్నట్లు తెలిసి ఆకాశమార్గాన ఆ ప్రదేశానికి చేరుకొన్నాడు. అది అరుణగిరిప్రాంతంలో ఉంది. (క్రౌంచద్వీపమంటే అమెరికా. కొలరాడో పర్వతాలే అరుణగిరి). చుక్క తెగిపడినట్లుగా అచట దిగి ఒక అశ్వత్థవృక్షం క్రింద ఆసీనుడై ఉన్న ఆ మహాపురుషునకు సాష్టాంగ ప్రణామం చేశాడు. కపిలుడు సాదరంగా ఆహ్వానించాడు.

**కపిల :** మిత్రుడా ! కుశలమే గదా ?

**జైగీ :** మీ దయవల్ల కుశలమే. మిత్రుడా అని నన్ను మీరాదరించారు. కానీ నేను మీ శిష్యుడను. మీ భక్తుడను.

**కపిల :** ఇద్దరమూ కలసి చిన్నప్పుడు చదువుకొన్నాము కనుక నాకు సతీర్థ్యుడవు, ఆప్తుడవు.

**జైగీ :** ఏదో నా పూర్వపుణ్యవశమున లభించిన అదృష్టము. విష్ణ్వంశ సంభూతులైన మీరు అవతారపురుషులు. మీ కృపవల్ల మీకు సఖుడను కాగల భాగ్యము లభించింది. సిద్ధులలో మిమ్ము మించినవాడు లేడు.

**కపిల :** తపస్సు వలన నీవు కూడా కొన్ని సిద్ధశక్తులు సాధించావు. అతి మానుషమైన శక్తులు నీకూ కొన్ని ఉన్నవి కదా!

**జైగీ :** నిజమే, కాని అవి కొన్ని మాత్రమే. దివ్యశక్తులు కొంత లభించిన మాట సత్యమే కాని, దివ్యజ్ఞానము మీకున్నంత నాకులేదు.

**కపిల :** అది యథార్థమే. దాని హేతువులు దానికున్నవి. నీకు గుర్తున్నది కదా! చాలాకాలం క్రింద ఒక రాజ్యంలో మనముండగా ఆరాజు మన దర్శనానికి వచ్చాడు. నీవు నన్ను గురించి చెపుతూ, సాక్షాత్ విష్ణుమూర్తి యొక్క అవతార మీ కపిలమహర్షి అని అన్నావు. ఆ రాజు నమ్మలేదు. దివ్యశక్తులు కొన్ని చూపించినా అతడికి విశ్వాసం కలుగలేదు. చివరకు నీ కోరికమీద నాస్వస్వరూపమైన నారాయణా కృతిని ధరించాను. నీవు గరుత్మంతుడవై నాకు వాహనమయినావు. అతడేదో కొంత నమ్మినట్లు కనిపించి వినయపూర్వకంగా నమస్కారాలు అర్పించాడు. ఆ ఆకారాలతోటే మన మాకాశమార్గంలో మన ఆశ్రమానికి వచ్చాము.

**జైగీ :** ఋషివల్లభా ! నాకు గుర్తున్నది. ఇదే కాదు రావణాసురుని మీరు శిక్షించిన సంఘటన కూడా మీ అవతార మహత్వానికి నిరూపణగా గంధర్వులు కీర్తిస్తున్నారు.

**కపిల :** అవసరమై ఆవిధంగా చేయవలసి వచ్చింది. నేను హిమాలయాలలోని ఒక గుహలో నిద్రిస్తున్నాను. బలవంతుడైన రావణాసురుడు, ఎటో జైత్రయాత్ర వెడుతూ ఈ గుహలో ఏముందో చూదామని లోపలికి వచ్చాడు. లోపల శయనించి ఉన్న నన్ను చూచి ఎవరక్కడ అని పెద్దగా అరిచాడు. వాడి అరుపుకు ఎవరైనా నిద్రలేస్తారు. నేను లేవలేదు. వాడు ఆగ్రహించి నా మీద దెబ్బ వేయబోయినాడు. క్షణంలో నేను లేచి వానికొక ముష్టిఘాతం ఇచ్చాను. ఆ దెబ్బకు కళ్లు తిరిగి క్రిందపడ్డాడు. తమాయించు కొని లేచి దిగ్భ్రాంతి చెంది నన్ను చూచి ఇలా అన్నాడు. "అయ్యా ! నీ వెవరో నాకు అర్థం కావటం లేదు. ఒక్క దెబ్బతో నన్నిలా పడగొట్టినవాడు ఇంత వర కెవ్వరూ లేరు. నేను బ్రహ్మవరం వల్ల అజేయుడను. నేను రుద్రుని చూచాను. ఇంద్రుని ఎరుగుదును. యముని, అగ్నిని, తెలిసినవాడను. వా రెవ్వరికీ ఇంతటి పరాక్రమము, రౌద్రము లేవు. నీ వెవ్వరో తెలియచేయవలసినది" అనగా నేను వానితో "మూర్ఖుడా! అహంకారముతో బలముతో విర్రవీగుతూ లోకాలను బాధిస్తున్నావు. బ్రహ్మ ఇచ్చిన వరము నందు మర్యాదనుంచి నిన్నింతకాలము ఉపేక్షించాను. త్వరలో మానవునిగా అవతరించి

నిన్ను సంహరిస్తాను. నే నెవరైతే నేమి ? బ్రహ్మరుద్రాదుల కతీతుడైన సర్వాత్మకుడను, జగన్నాథుడను నేను. వెళ్ళు" అన్నాను. వాడు తలవంచుకొని వెళ్ళిపోయినాడు.

**జైగీ :** మహాత్మా ! ఈ సంఘటన నేను విన్నాను. ఇది ఎప్పుడో త్రేతాయుగం నాటి కథ కదా ? అప్పుడు నే నెక్కడ ఉన్నాను.

**కపిల :** ఆత్మీయుడా ! ఇది దేవరహస్యము. అయినా నీ మీది ప్రేమ వలన చెబుతున్నాను. నేను ఆదియుగముల నాటి సిద్ధుడను. అనేక యుగములలో అవసరమయినప్పుడల్లా శరీరాన్ని నిర్మించుకొంటూ ఉంటాను. నేను నిర్మాణకాయుడను. వసిష్ఠుడు, అగస్త్యుడు, విశ్వామిత్రుడు మొదలైనవారు ఇట్టివారే. మేము లాంఛనముగా ఎవరికో సంతానముగా పుట్టినట్లు కనపడవచ్చు. కానీ పూర్వస్మృతి పోవటం కానీ దివ్యశక్తులు నశించటం కానీ ఉండవు. ఈ ద్వాపరంలో ఉన్న ఈ శరీరానికి ఇందులోని జీవునకు నీవు ఆప్తుడవు. నేను రావణాసురుని శిక్షించిననాడు – జమదగ్ని కుమారుడయిన భార్గవరాముని, పరశువులో నీవున్నావు. ఆ రేణుకాపుత్రుడు కైలాసములో మహేశ్వరుని సేవించి ఆయన శిష్యుడై ఆయుధవిద్యలు నేర్చుకొంటున్న రోజులలో భూతేశుడు, పరశుధరుడు, మహాదేవు డతని యందు కరుణించి తన పరశువు నుండి మరొక పరశువును సృష్టించి తన తేజః కిరణమయిన నిన్ను దానిలో నిక్షేపించి పంపించాడు. రుద్రశక్తివల్ల, మహాకాలుడి సంకల్పం వల్ల అతనిలో ప్రవేశించి అతని మనస్సును ప్రభావితం చేసి సర్వక్షత్రియ సంహారము చేసింది నీవు. వైష్ణవ శక్తి కూడా అతనిని ఆవేశించి విష్ణువు యొక్క అంశావతారమని పేరు తెచ్చింది. పరశురాముడు శ్రీరాముని ఎదిరించినపుడు అవసరమైన క్షత్రియ సంహారకాండ అప్పటికి పూర్తి అయి ఉన్నది కనుక, వైష్ణవతేజస్సు దాశరథిలోనికి వెళ్ళిపోయింది. నీవూ పరశురాముని వదిలి అంతరిక్షంలోకి వెళ్ళి ఆతరువాత కొంతకాలానికి నీవే మునికుమారునిగా జన్మనెత్తావు. నాకు సతీర్థ్యుడవై మిత్రుడవై ఇన్నాళ్ళు గడిపావు. ఇప్పుడు త్వరలో మరొక మార్పు రానున్నది.

**జైగీ :** మీరిన్ని యుగాలు ఎలా జీవించగలిగారు ? నేనెందుకు జన్మ లెత్తుతున్నాను? నాకు రాబోయే మార్పు ఏమిటి ? ఆ మార్పు రాకుండా మీరు ఆపకూడదా ?

**కపిల :** స్నేహితుడా నాకు శరీరము నిమిత్త మాత్రము. నేను ఆద్యంత రహితుడను. అయినా మానవశరీరంలో ఉంటున్నాను కనుక సహజంగా కొన్ని అనుబంధాలు ఏర్పడుతాయి. వానియందు సముచితమైన ఆదరాన్ని చూపిస్తాను. విష్ణ్వంశ వల్ల నాకీ శాశ్వతత్వము లభించింది. విష్ణువు యొక్క అంశలలో నేనూ, దత్తాత్రేయుడు ఇటువంటివారము. నేను చేసే ప్రతి పనికి ఒక కారణం ఉంటుంది. నేనీ క్రౌంచ ద్వీపంలో నివాసమేర్పరచుకొన్న తరువాత తమ యజ్ఞాశ్వాన్ని అపహరించినవాడినని భావించి సగరపుత్రులు నన్నవమానించి నా క్రోధాగ్నికి దగ్ధులయినారు. వారికి సద్గతులు కలిగించటం కోసం వారి వంశీయుడైన భగీరథుడు తపస్సు చేసి గంగను భూమికి తెచ్చాడు. సగరపుత్రులు హిమాలయము నుండి ఇక్కడి దాకా సొరంగమార్గము త్రవ్వారు. ఆ గంగ కొంతభాగం ఆ సొరంగంలో గుండా ఇక్కడకు వచ్చి, ఇక్కడ భస్మరాశులను తడిపి వాళ్ళకు ఉత్తమగతులు కల్పించింది. ఈ సొరంగమార్గం గుండా నీవు హిమాలయాలకు వెళ్ళు. ఈ గంగామార్గాన్ని అనుసరించి విశ్వనాథుని నెలవైన వారణాసికి చేరుకో. ఆ కాశీక్షేత్రంలో గంగాతీరంలోని ఒక గుహలో తపస్సు చేయి (అక్కడ ఇప్పుడూ జైగీషవ్యగుహలున్నవి). అక్కడ నీకు శరీర పతనం జరుగుతుంది. కొద్దికాలానికే బ్రహ్మపుత్రానదీ ప్రాంతంలోని నాగభూమిలో నీవు జన్మిస్తావు. మనుష్యశరీరం ప్రధానంగా ఉండి అవసరమయినపుడు నాగదేహాన్ని ధరించగల్గిన నాగజాతిలో నీపుట్టుక కలుగుతుంది. పరోక్షంగా నిన్ను నేను కాపాడుతూనే ఉంటాను. విధి ప్రభావం వల్ల పరమేశ్వరుని ఇచ్ఛానుగుణంగా జరిగే ఈ ప్రయాణాన్ని ఆపాలని కోరవద్దు. భూమి మీద ఎవరెవరి వల్ల ఏ పనులు చేయించవలసి ఉన్నదో ఆ కార్యనిర్వహణకోసం దేవజాతుల వారు సిద్ధమండలిలోని వారు ఎంపిక చేయబడి పంపించబడతారు. ఆ విధంగా ఎన్నుకోబడిన వారిలో నీ వొకడవు. ప్రాణమిత్రుడా! ఈ మార్పును గురించి బాధపడవద్దు. నాగవంశంలో ఉదయించిన తరువాత అక్కడికి దగ్గరలో ప్రాగ్జ్యోతిషపురంలో అవతరించి ఉన్న కామాఖ్య కాళి దగ్గరకు వెడతావు. ఆమె అనంతర కర్తవ్యాన్ని నీ కుపదేశిస్తుంది. శుభం భవతు.

**జైగీ :** మీ ఆజ్ఞ. నేనేమీ మాట్లాడలేకుండా ఉన్నాను. మీరు నన్నెప్పుడూ పరిరక్షిస్తూ ప్రబోధిస్తూ ఉండాలని ప్రార్థన.

కపిల : తథాస్తు.

***

జైగీషవ్యుడు నాగజాతిలో జన్మించాడు. పెరిగి పెద్దవాడవుతున్నప్పటి నుండి పూర్వజన్మ సంస్కారబలం వల్ల సిద్ధసాధువుల యందు ఆసక్తి ఎక్కువగా ఉండేది. మహర్షుల ఆశ్రమాలకు, దివ్యక్షేత్రాలకు ఎక్కువగా తిరుగుతూ అక్కడి పెద్దల మాటలు వింటూ భగవద్ధ్యానం చేస్తుండేవాడు. సిద్ధులను, క్షేత్రాలను పట్టుకొని తిరుగుతూ ఉండడం వల్ల అతనిని సిద్ధనాగుడనేవారు. ఆ కాలంలో నాగజాతి నివాసాలు ఎక్కువగా బ్రహ్మపుత్రానదీ తీర ప్రాంతంలో, 'ఇక్షుమతి' నదిఒడ్డున, కురుక్షేత్రంలో, దక్షిణాపథం లోని కొన్ని ప్రదేశాలలో వ్యాపించి ఉండేవి. గంగానది యొక్క ఉత్తర భాగంలో శక్తిమంతమైన నాగరాజ్యం ఉండేది. ఐరావత, ధృతరాష్ట్రాది వంశాలకు చెందిన నాగజాతివారు అక్కడ ప్రభువులుగా ఉండేవారు. ప్రసిద్ధమైన ఖాండవవనం నాగుల అధీనంలోనే ఉండేది. క్రొత్త స్థలాలు చూడాలన్న కోరికతోను బంధువర్గంవారు తెలిసినవారు తమ జాతికి చెందినవారు విస్తరించి ఉండటం వల్లను సిద్ధనాగుడు సంచారం చేస్తూ అనేక ప్రదేశాలకు వెళ్ళాడు. ఆ యాత్రలో భాగంగా ఒకసారి గంగాతీరంలోని ఒక ఆశ్రమానికి వెళ్ళాడు. అక్కడి వాతావరణం ఎంతో నచ్చింది. ఆ రోజుల్లో ఋషుల ఆశ్రమాలకు వెడితే ఆతిథ్యానికి ఏ లోటూ ఉండేది కాదు. ఎంతో ప్రేమతో ఆహార వసతులు ఏర్పాటు చేసేవారు. అక్కడ కొన్నాళ్ళుండగా ఒక రోజు భృగువంశీయుడైన పరశురాముడు అక్కడకు వచ్చాడు. ఆ ఆశ్రమాధిపతి ఆయన శిష్యుడు కావటం వల్ల గురువుగారికి ఎంతో భక్తి శ్రద్ధలతో పూజ చేసి, గౌరవమర్యాదలతో తమ ఆశ్రమంలో వీలయినంతకాలం ఉండమని ప్రార్థించాడు. ఆ మహాపురుష దంగీకరించి ఏదో గ్రంథరచన చేయటం ప్రారంభించాడు. ఆయనను గురించిన కొన్ని విశేషాలు ఆశ్రమ వాసులద్వారా సిద్ధనాగుడు తెలిసికొన్నాడు. రామాయణకాలం నుండి జీవిస్తూ చిరంజీవిగా ఉన్న ఆ మహర్షి ఇటీవల తన శిష్యుడైన భీష్ముని చేతిలో విధి వశాన పరాజితుడై పూర్తి వైరాగ్యం కలిగి వెడుతూ ఇటువైపు వచ్చాడట. సర్వక్షత్రియ సంహారం చేసిన మహావీరునిగా జగత్ప్రసిద్ధుడైన ఆ మహనీయుడు తనలోని వైష్ణవతేజస్సు దశరథరామునిలో

ప్రవేశించిన తరువాత ఆ మహత్వము తగ్గినా ఆయన సర్వ శస్త్రాస్త్ర కోవిదుడే. దేవజాతికి చెందిన వసువులు తమవాడని భీష్మునకు సహాయం చేసినందువల్ల మానవశరీరంలోని ఈ మహనీయుడు అపజయాన్ని అంగీకరించవలసి వచ్చింది. "శిష్యాదిచ్ఛేత్ పరాజయం" అన్నారు కనుక దానికి పరశురాముడు బాధపడలేదు. అయితే, లోకంలో తన పాత్ర యొక్క అవసరం తీరిపోయిందని గ్రహించిన ఋషివర్యుడు లోకోపకారం కోసం ఒక మంత్రశాస్త్ర గ్రంథాన్ని రచిస్తున్నాడు. ఆ విషయం విన్న సిద్ధనాగునకు ఆయనకు సేవచేసి ఆ రహస్యాలు నేర్చుకోవాలన్న ప్రబలమైన కాంక్ష కలిగింది. ఆయన శిష్యులను ప్రార్థించి కొన్ని సేవలు చేయటానికి అనుమతిని పొందాడు. ఆయనకు కావలసిన వస్తువులు పూలు, పండ్లు, పాలు మొదలైనవి నిత్యాగ్ని హోత్రములకు కావలసిన సమిధలు మొదలైనవి సమకూరుస్తూ రోజూ సాష్టాంగ దండప్రణామాలు చేస్తూ దూరంగా చేతులు కట్టుకొని నిల్చుండేవాడు. నిశిత మేధా సంపన్నుడయిన భార్గవుడు ఇతని సేవలను గ్రహించి ఆదరాన్ని చూపిస్తున్నాడు. కొంతకాలం గడచిన మీదట ఆయన కితని మీద వాత్సల్యం కలిగింది. గ్రంథరచన పూర్తిచేసి ఆశ్రమం విడిచి వెళ్ళిపోయే సమయం వచ్చినప్పుడు సిద్ధనాగుని పిలిపించాడు. అతడు వచ్చి సాష్టాంగ దండప్రణామం చేసి నిల్చొన్నాడు.

**పరశు :** యువకుడా ! నీ సేవలు గమనిస్తున్నాను. నీ భక్తి శ్రద్ధలను నిర్మల మయిన నీ వినయసౌశీల్యాలను నేను తెలుసుకొన్నాను. ఏమి కోరి నా సేవచేశావు ? నీ కేమి కావాలి ?

**సిద్ధ :** ఋషివల్లభా ! బ్రాహ్మ్యము, క్షాత్రము మూర్తీభవించిన అవతార పురుషులు మీరు. మీ వంటి మహనీయుల సేవచేసే అవకాశం కల్గటం నా జన్మాంతర సుకృతం. మిమ్ము చూడగానే కారణము తెలియని భక్తిగౌరవములు నాకు కల్గినవి. నేను ఏ ప్రతి ఫలము ఆశించి సేవచేయలేదు. దయాభరితమైన మీ అనుగ్రహాన్ని నా యందు ప్రసరింప చేయండి ! చాలు.

**పరశు :** ఓయీ నీ మాటలు మరింతగా నా మనస్సును ఆకట్టుకొన్నవి. నాకు చేసిన సేవ ఎన్నడూ వ్యర్థం కారాదు. నే నివ్వగలిగిన దేదైనా నీవు కోరుకో. అయితే ఒక నిబంధన ఉన్నది. నా దగ్గర అస్త్రవిద్యలున్నాయి. బ్రాహ్మణేతరులకు వానిని ఉపదేశించను. నా చరిత్ర గురించి నీవు విని

ఉంటావు. నా జీవిత అవసరాలను బట్టి అటువంటి నియమము ఏర్పరచుకోవలసి వచ్చినది. కనుక అవికాక ఇంకేదైనా నీవు అర్థించవచ్చు.

**సిద్ధ :** గురుదేవా ! నన్ను శిష్యునిగా స్వీకరించటానికి అంగీకరించినందుకు కృతజ్ఞుడను. నేను నాగజాతివాడను. ద్విరూపధారణశక్తి కలిగినవాడను. ఏ కారణం వల్లనో మా వంశంలోని ఇతరులవలె లౌకిక భోగములందు నా కాసక్తి లేదు. రాజ్యాధికారము లందు కోరిక లేదు. నా జాతిలో కులవ్యవస్థ లేదు. నా జాతిలోని కన్యలను బ్రాహ్మణులు, క్షత్రియులు వివాహమాడిన సంఘటనలు మీరు వినే ఉంటారు. సహజంగా జాతిలక్షణముతో వచ్చిన శక్తులు గాక మా వారిలో కూడా కొందరు తపస్సు నందు ఆసక్తి కలిగి ఆదిశేషునివలె విష్ణుదేవుని అనుగ్రహాన్ని, వాసుకివలె పరమశివుని అనుగ్రహాన్ని, కద్రువవలె ఇంద్రుని దయను పొందాలని సాధనచేస్తున్నారు. నేనుకూడా ఆ మార్గము నందు అపేక్ష కలిగి ఋషుల ఆశ్రమాల చుట్టూ తిరుగుతున్నాను. దివ్య క్షేత్రాలను దర్శిస్తున్నాను. ఇంతకాలానికి మహావీరులు, మహాయోగులయిన మీరు నాయందు దయ చూపించారు. ఏ సాధన నా జీవితాన్ని ఉద్ధరిస్తుందో దేనివలన నేను పరిపూర్ణమైన పరమేశ్వరానుగ్రహాన్ని పొందగలనో ఆ విద్యను నాకు ఉపదేశించండి.

**పరశు :** నేను మంత్రశాస్త్ర రచన చేస్తుండగా నీవు వచ్చావు. నా గ్రంథంలో శాక్తేయ సాధనలు చేసే పద్ధతులు వివరించాను. నేను సహజంగా శివభక్తుడను. మహాదేవుని అనుగ్రహం వల్ల ఆయన నుండి దివ్యమైన పరశువును పొంది సర్వక్షత్రియ సంహారం చేశాను. ఆ పరశువు యొక్క తేజోమయమైన ఆకృతి నీలో భాసిస్తున్నది. నీయందు వాత్సల్యం కలగటానికి, అభిమానం కలగటానికి ఇది ఒక కారణం. శివభక్తుడనైన నేను చిత్రమైన పరిస్థితిలో దేవీభక్తునిగా మారాను. తండ్రి ఆజ్ఞవల్ల నా తల్లిశిరస్సును నేను ఖండించాను. అప్పుడామెలో పరమేశ్వరి ప్రవేశించింది. అపరాధ రహిత, త్యాగమూర్తి అయిన ఆమె దేవత అయిన సంగతి దత్తాత్రేయస్వామి చెప్పినదాకా నాకు తెలియలేదు. నా ప్రార్థనను మన్నించిన నా తండ్రి జమదగ్నిమహర్షి యొక్క తపశ్శక్తి వలన ఆమె పునరుజ్జీవితురాలయినదని మాత్రమే అనుకొన్నాను. నా మాత రేణుకాదేవి జగన్మాత అయినదని తెలుసుకొన్న తరువాత నాకు శాక్తేయమార్గము నందు అభిరుచి కల్గింది. అందుకే 'పరశురామకల్పం' అన్న పేరుతో ఈ మంత్రశాస్త్ర

గ్రంథాన్ని రచించాను.సరే ! దాని సంగతి అటుంచు.

నీలోని జిజ్ఞాసను, అన్వేషణను నీ జీవుని వేదనను చూస్తున్నాను. నీవలన దేవకార్యములు కొన్ని కావలసి ఉన్నవి. దానికి కావలసిన శక్తులు పొందటానికి నీవు కాళీసాధన చేయాలి. నీకు కాళీమంత్రాన్ని ఉపదేశిస్తున్నాను. దీనిని గ్రహించి కామాఖ్యలోని కాళీసన్నిధికి వెళ్ళి సాధన చెయ్యి. అక్కడ ఇప్పుడు నరకాసురుడు పరిపాలిస్తునాడు. వాడు దుశ్శీలుడు, దుర్మార్గుడు. వానితో నీకు సంబంధం లేదు. ఆమె సన్నిధిలో కొన్నాళ్ళు తపస్సాధన చేయి. ఆ దేవత అనుగ్రహం కలుగుతుంది." సిద్ధనాగుడు భార్గవ రాముని నుండి కాళీమంత్రాన్ని పొంది మళ్ళీ ప్రయాణాలు చేస్తూ ప్రాగ్జ్యోతిషపురాన్ని చేరుకొన్నాడు. నరకాసురుని పాలనలో ఆ దేవి మహావైభవంతో ప్రకాశిస్తున్నది. పరమ శివుని భార్య అయిన సతీదేవి దక్షయజ్ఞంలో ప్రాణత్యాగం చేసినపుడు. ఆ యజ్ఞాన్ని వీరభద్రుని చేత ధ్వంసం చేయించిన తరువాత మహేశ్వరుడు వచ్చి భార్య కళేబరాన్ని చూచి బాధపడి ఆ శరీరాన్ని చేతులతో ఎత్తి పట్టుకొని ఆవేశంతో తాండవం చేశాడు. ఆ తాండవోద్ధతిని భరించలేక భువనములు కదలిపోయి కల్లోలితమవుతుంటే దేవతల ప్రార్థనమీద విష్ణుదేవుడు తన చక్రంతో ఆమె శరీరాన్ని ఖండములు చేశాడు. ఆ దేహభాగములు పడిన చోట్లు శక్తిపీఠములయినవి. ఆమె 'యోనిభాగం' పడిన చోటు ఈ కామాఖ్య. ఈ ప్రాంతానికి పరిపాలకుడయిన నరకుడు నిరంతర మద్యమాంసముల నీ దేవికి సమర్పించి వామాచారమార్గంలో సాధనచేసి అజేయ పరాక్రమాన్ని అమిత వశీకరణశక్తిని పొంది 16,000 మంది రాజకుమారికలను తెచ్చి వారిని బలవంతంగా అనుభవించాడు. వాని కామదాహానికి ఆహుతి అయిన కన్యలెందరో. ఇంతటి దుష్టునకు వరములిచ్చి వాడు దుష్కార్యములు చేస్తున్నా కాళీదేవి ఎందు కుపేక్షిస్తున్నదో తెలియదు. అయినా వీటిని గురించి ఆలోచించటం నాకర్తవ్యం కాదు. గురూపదిష్టమార్గంలో నా సాధన నేను కొనసాగించాలి. మధుకైటభసంహారిణి, శుంభ నిశుంభ వినాశిని, మహిషాసురమర్దిని రాక్షస సంహారిణి అయిన, ఆ మహాశక్తిని పూజించి ఆమె అనుగ్రహాన్ని పొందాలి. అని నిశ్చయించుకొని సిద్ధనాగుడు తన సాధనను ప్రారంభించాడు. తన జన్మస్థానమయిన నాగభూమికి దగ్గరగా ఉన్న ప్రదేశమిది. తమవారంతా భారతదేశంలోని ఇతర ప్రాంతాలకు వెళ్ళేటప్పుడు, ఈ రాజ్యం

గుండానే వెళ్ళాలి. నాగజాతికి అసురజాతికి అప్పుడు పెద్దగా విరోధాలు లేవు కనుక రాకపోకలకు కాని, కొన్నాళ్ళు ఉండటానికి గాని ఆంక్షలు, అడ్డంకులు లేవు. ఆలయానికి దగ్గరలో ఒక వసతి ఏర్పరచుకొని ఆహార విహారాది కఠోరనియమాలతో దృఢ దీక్షతో జపధ్యానములు చేశాడు. కొంతకాలం గడచిన తరువాత అతనియందు కాళీదేవికి అనుగ్రహం కలిగింది. ఒకనాటి అర్ధనిశాసమయంలో తేజోమండలం మధ్య దేవి సాక్షాత్కరించి "సాధకుడా! నీ తపస్సుకు సంతోషించాను. నీ జీవితగమనంలో మార్పులు రాబోతున్నాయి. సుమారు రెండు వందల సంవత్సరాల తరువాత నీకు మృత్యు గండమున్నది. నీజాతిని నశింపచేయటానికి ఒక రాజు సర్పయాగం తలపెడతాడు. మహాప్రభావసంపన్నులయిన బ్రాహ్మణుల మంత్రశక్తి వల్ల మీ జాతివారు కొన్ని లక్షలమంది హోమాగ్నిలోపడి దహనమవుతారు. నా భక్తుడవైన నిన్ను నేను కాపాడదలచుకొన్నాను. నేను రేపటి నుండి ఈ క్షేత్రంనుండి అదృశ్యమవుతున్నాను. భగవంతుడయిన నారాయణుడు నరకాసురాది దుష్టసంహారం కోసం అవతరించాడు. ఆయనలో నా శక్తి కూడా కలుస్తుంది. తపస్సు చేసిన వారికి మేము వరములిస్తాము. వారు దుర్మార్గాలు చేస్తే శిక్షిస్తాము. నీకు కృష్ణమంత్రాన్ని ఉపదేశిస్తున్నాను. ఇక్కడ నుండి నీవు బృందావనం వెళ్ళి అక్కడ ఈ మంత్రజపసాధన చేయి. నీకు కృష్ణానుగ్రహం కలుగుతుంది" అని అని చెప్పి అదృశ్యమయింది. మరునాడు రాత్రి బ్రహ్మణ్యుడైన వసిష్ఠమహర్షి అక్కడకు వచ్చాడు. ఆయన దేవాలయ ప్రాంగణానికి వచ్చేసరికి కాళీ మందిర ద్వారాలు మూసివేయబడినవి. కాళీదర్శనం కోసం వచ్చానని, తలుపులు తెరిపించమని అక్కడి అధికారులను అడిగాడు. "దర్శన సమయం దాటిపోయింది. మహారాజు ఆజ్ఞఇస్తే తప్ప ఇప్పుడింక తలుపులు తెరవటం ఉండదు. కావాలంటే సార్వభౌముల నడగండి" అని వారు జవాబు చెప్పారు. వసిష్ఠమహర్షి సరాసరి నరకాసుర భవనానికి వెళ్ళి కాళీదర్శనం వెంటనే చేయాలని, తానెవరో కూడా చెప్పాడు. మద్యపానపు మత్తులో ఉన్న నరకుడు మహర్షి మాటలు పట్టించుకోలేదు. తిరస్కార పూర్వకంగా ఇప్పుడు వీలుకాదు పొమ్మన్నాడు వసిష్ఠునకు ఆగ్రహం కలిగింది. "నాకు దర్శన మివ్వని కాళి ఇక్కడ నుండి అదృశ్యమగును గాక!' అని అక్కడ నుండి వెళ్ళి పోయినాడు. మరునాడు తెల్లవారేసరికి గర్భగుడిలో దేవతలేదు.

అమ్మవారి లీలను గ్రహించిన సిద్ధనాగుడు అక్కడి నుండి బయలుదేరి వేగంగా బృందావనం చేరుకొన్నాడు. యమునాతీరంలో ఒక కుటీరం ఏర్పరచుకొని మిగతా ప్రపంచంతో సంబంధం లేకుండా కఠోర తపస్సు మొదలుపెట్టాడు. సర్పములలో ఒక లక్షణమున్నది. ఆహారం లేకుండా దీర్ఘకాలం జీవించగలవు. అంతేకాక అతడు ఓషధీ పరిజ్ఞాత. కొండలమీద నుండి జలపాతములు పడేచోట్ల మహాసర్పములు నివసించే సందుల దగ్గర రాతిబొద్దు లేక రాతిమదం అనే పదార్థం ఉంటుంది. అది కొంచెం మింగితే నెలల తరబడి ఆహారం లేకుండా ఉండవచ్చు. తాను నాగరాజు కనుక దానిని సులభంగా సంపాదించ గలిగాడు. తన నాగభూమిలో హిమాలయపర్వత శిఖరాలపై నుండి ఎన్నో జలపాతాలు పడుతుంటవి. అక్కడ ఈ పదార్థం సమృద్ధిగా దొరకుతుంది. కావలసినంత సేకరించి దగ్గర ఉంచుకొన్న సిద్ధనాగుడు దాని సహాయం వల్ల ఆహారంతో అవసరం లేకుండా సర్వకాల సర్వావస్థలలో కృష్ణమంత్రసాధన చేస్తున్నాడు. ఎన్నాళ్లు గడచిందో ఎంతకాలం గడచిందో ఎన్ని సూర్యోదయ, అస్తమయాలు జరిగిపోయినవో, ఎన్ని పగ ళ్ళెన్ని రాత్రులు కరిగిపోయినవో తెలియటం లేదు.

ఒకనాటి సంధ్యాసమయంలో యమునాతీరమంతా కలకలంతో నిండిపోయింది. యక్షులు, గంధర్వులు మొదలైన దేవజాతుల వారు కనిస్తున్నారు. వారిలో కొందరితో పూర్వ పరిచయం కూడా తనకున్నది. వారి నడిగితే వారు వివరాలు చెప్పారు. “ఈ రోజు రాత్రి యమునాతీరంలో శ్రీకృష్ణదేవుడు, రాధాదేవితో రాసక్రీడలు జరుపబోతున్నాడు. నేడు కార్తీక పూర్ణిమ. ఆ దివ్య శృంగారదృశ్యాలను చూడటానికి ఊర్ధ్వలోకాల నుండి దేవతలు విమానాలలో వస్తున్నారు వారంతా ఆకాశంలో దూరంగా తమ విమానాలలో ఉండి ఆ రాధాకృష్ణలీలలను చూస్తారట. ఈ విషయాన్ని మహనీయులైన పెద్దలు చెప్పగా విని మేము కూడా వచ్చాము. అయితే రాసక్రీడలు జరిగే దివ్యభూమికలో పురుషులెవ్వరికీ ప్రవేశముండదు. పరమేశ్వరుడయిన కృష్ణుడొక్కడే పురుషుడు. ఆయన ఎన్నివేల లక్షల శరీరాలనయినా ధరించగలడు. మనవంటి వారికి అందులో ప్రవేశము ఉండదు కనుక మేమంతా పక్షుల రూపాలను ధరించి ఇక్కడి చెట్లపై ఉండి కనులారా ఆ గోపసుందరుని దివ్యలీలలను దర్శించాలని అనుకొంటున్నానాము. నీవు కూడా మా వలెనే రూపం మార్చుకో, సరిపోతుంది”. “మీ వలె పక్షిరూపాన్ని నేను ధరించవలసిన

పనిలేదు. మానవేతరమైన ఏ రూపమయినా ఫరవాలేదని మీ మాటలను బట్టి అర్థమవుతున్నది. నాకు సహజమైన నాగరూపాన్ని ధరించి దట్టమైన ఏ పొద దగ్గరో ఉండి గోవిందుల దర్శనం చేసుకొంటాను" అన్నాడు సిద్ధనాగుడు. పదహారు కళలతో చంద్రుడు సంవత్సరంలో ఒక్క కార్తీక పూర్ణిమరోజుననే ప్రకాశిస్తాడు. లలితకళాప్రపూర్ణుడైన కృష్ణచంద్రుడు రాసేశ్వరి అయిన రాధాదేవితో కలసి ఆడుతూ, పాడుతూ విహరించిన దృశ్యాలను చూచే అదృష్టం కలిగింది. శ్రీకృష్ణుని దివ్యమైన మురళీనాదం వినే అదృష్టం, బృందావనేశ్వరి అయిన రాధాదేవి నృత్యం చేస్తూంటే చూచే భాగ్యం అతనికి లభించినవి. దట్టమైన పొదల గుబురులమధ్య పడగయెత్తి చూస్తున్న అతనిని ఒక్క క్షణం పాటు కృష్ణచంద్రుడు వీక్షించాడు. గోవిందు డటువైపు ఎందుకు చూస్తున్నాడా అని రాధాదేవి కూడా చూచింది. ఆది దంపతులైన ఆ ప్రేమమూర్తుల కరుణార్ద్రదృష్టి ప్రసరించి తన తపస్సు ఫలించిందని అనిపించింది. "నాయనా ! బృందావనధామంలో ఉండటానికి నీకు అనుమతి నిస్తున్నాము. సర్పయాగ ప్రమాదం నిన్నంటదు. నీవెంట ఒక గోపిక ఉండి నిన్ను ఎప్పుడూ రక్షిస్తుంటుంది" అన్న సందేశం వినిపించింది. ఆ రాత్రి పూర్తయిన తరువాత నుండి బృందావన ధామంలోనే నివసిస్తున్నాడు. నిరంతర కృష్ణమంత్రాన్ని జపిస్తూనే ఉన్నాడు. కొంతకాలం గడచిన తరువాత ఒకనాటి నిశీథసమయంలో కృష్ణుని మురళీనాదం వినిపించటం మొదలు పెట్టింది. అంతరిక్షం నుండి దివ్యతేజస్సు గల ఒక బాలిక దిగి వచ్చింది. "ఓయీ! చిరకాల కృష్ణమంత్ర జపం చేత రాధాసాధన చేయగల అర్హత నీకు లభించింది. నీ తపస్సు భావాత్మకంగా పరిణమించి దివ్యప్రేమామృతాన్ని అందుకోవటానికి రాసేశ్వరి కృపకావాలి. రాధాకృష్ణుల ఆజ్ఞవల్ల నీకు రాధామంత్రాన్ని ఉపదేశించటానికి వచ్చాను" అని ఆదివ్యమూర్తి అతనిని శ్రీరాధారసోపాసనలోనికి ప్రవేశపెట్టింది. ఆ సాధన వల్ల ఎన్నో దివ్యానుభూతుల నతడు పొందగలిగాడు.

కలియుగం ప్రారంభమైంది. భౌతికంగా శ్రీకృష్ణదేవుడు శరీరాన్ని పరిత్యజించిన తరువాత ప్రపంచంలో చాలా మార్పులు వచ్చినవి. బృందావనము, ఆ ప్రాంత ప్రదేశాలు అన్నింటికి రాజధానిగా ఉండే మధురకు శ్రీకృష్ణుని మునిమనుమడయిన 'వజ్రుడు' రాజయినాడు. పాండవులు మహాప్రస్థానానికి

వెళ్ళిపోయినారు. అర్జున పౌత్రుడయిన పరీక్షిత్తు కురుసామ్రాజ్యానికధిపతి అయి సుమారు 60 సంవత్సరాలు పరిపాలించి మునిశాపం వల్ల తక్షక సర్పదష్టుడై మరణించాడు. అతని కుమారుడు జనమేజయుడు రాజై ఉదంక మహర్షి ప్రేరణవల్ల సర్పయాగం చేశాడు. తమజాతి వారు లక్షలమంది యాజ్ఞికుల మంత్రశక్తి చేత ఆకర్షింపబడి హోమకుండంలో పడి దగ్ధమయినారు. నాగరాజుల పరాక్రమాలు, దివ్యశక్తులు బ్రహ్మదండ ప్రభావంముందు పనిచేయలేదు. నాగప్రభువు, వాసుకి చెల్లెలయిన జరత్కారువునకు అదే పేరు గల మహర్షికి పుట్టిన అస్తీకుడనే మహర్షి సర్పయాగాన్ని ఆపించాడు. సర్పకులంలో మూడువంతులు నశించి పోయినవి. రాధాగోవిందుల అనుగ్రహం వల్ల తనకే ప్రమాదం జరుగలేదు తనవారిలో ఎందరు మిగిలి ఉన్నారో ఒక్కసారి తన స్వస్థానానికి వెళ్ళి చూచిరావాలని అనిపించింది. బృందావనం నుండి బయలుదేరి కౌరవరాజ్యాన్ని దాటి మగధసామ్రాజ్యము లోనికి ప్రవేశించాడు. జరాసంధుని వంశం వారు అక్కడ పరిపాలిస్తున్నారు. ఆ రాజ్యం నుండి బయలుదేరి హిమాలయ ప్రాంతాలకు చేరి, బ్రహ్మపుత్రానదీ ప్రాంతం ద్వారా ప్రాగ్జ్యోతిష పురం చేరుకొన్నాడు. తన ఇష్టదేవత అయిన కామాఖ్య కాళీ ఆలయానికి వెళితే ఆనందస్వరూపిణిగా ఆమె దర్శనమిచ్చింది. ఆనాడు వసిష్ఠుని వాక్కువల్ల కాళీదేవి అదృశ్యమైన సంగతి తనకు గుర్తున్నది. తరువాత జరిగిన సంఘటనలను అక్కడ విన్నాడు. కాళీదేవి ఎక్కడకు పోయిందో తెలియక నరకాసురుడు శుక్రాచార్యుని ఆహ్వానించి మళ్ళీకాళీదేవిని రప్పించమని ఆహ్వానించాడు. తిరుగులేని వసిష్ఠుని వాక్ ప్రభావాన్ని ఎరిగిన శుక్రుడు దేవిని తాను తిరిగి రప్పించలేనని చెప్పి అసురనాథుని సంతృప్తి కోసం కొన్ని యజ్ఞాలు చేసి అదనపు శక్తులు సమకూర్చి వెళ్ళిపోయినాడు. ఆ తరువాత కొంత కాలానికి శ్రీకృష్ణుడు తన ముద్దుల భార్య అయిన సత్యభామతో కలిసి నరకాసురుని మీదికి యుద్ధానికి వచ్చాడు. యుద్ధరంగంలోకి ప్రవేశించిన నరకుడు తన శత్రువైన కృష్ణుని వెనుక తనకు వరము లిచ్చిన కాళీదేవి ఉండటాన్ని గమనించాడు. తనకిక పరాజయం తప్పదని గ్రహించిన నరకుడు కృష్ణునితో పోరాడి వీరమరణం చెందాడు. శ్రీకృష్ణుడు కాళీదేవిని మరలా కామాఖ్య పీఠంపై ప్రతిష్ఠింపచేసి నరక పుత్రుడైన భగదత్తుని రాజును చేసి నరకుడు చెరపట్టిన 16000 మంది రాజకుమారికలను వివాహమాడి

తనతో ద్వారకకు తీసుకొని వెళ్ళాడు. ఆ భగదత్తుడు తన తండ్రిని చంపిన కృష్ణుని మీది కోపంతో మహాభారతయుద్ధంలో దుర్యోధనుని పక్షంలో చేరి సంగ్రామంలో అర్జునుని చేత సంహరించబడ్డాడు. ఆ భగదత్తుని పుత్రుడు ఇప్పుడు రాజ్యమేలుతున్నాడు.

సిద్ధనాగుడు కామాఖ్య నుండి బయలుదేరి తన జన్మభూమికి చేరాడు. అక్కడ తన వంశీయులు, బంధుమిత్రులు ఇతనిని చూచి ఎంతో సంతోషించారు. అచ్చట అన్ని వంశాలవారు సర్పయాగానంతరము ఎవరెవరు మిగిలి ఉన్నారో లెక్క పెట్టుకొనే స్థితిలో ఉన్నారు. తెలిసినవారందరిని చూచి పలకరించి హతశేషులను పరామర్శించిన తరువాత ఒకనాడు హఠాత్తుగా తన బాల్యమిత్రుడు శివనాగుడు కనిపించాడు. పట్టరాని ఆనందంతో చెట్టాపట్టా లేసుకొని ఇద్దరూ ఒక తోటలో కూర్చున్నారు. కుశల ప్రశ్నలు అయిన తరువాత ఇక్కడి విశేషాలు చెప్పవలసినదిగా అతడు శివనాగును ప్రశ్నించాడు. శివనాగుడు ఇలా అన్నాడు. "మిత్రుడా! చిన్నప్పటి నుండి మన ఇద్దరి అభిరుచులు ఒక్కటే. ఏదో సాధించాలన్న తపన మన పూర్వులయిన నాగరాజుల వలె తపస్సు చేసి పరమేశ్వరానుగ్రహం పొందాలన్న బలమైన కోరిక మన యిద్దరికీ ఉండేది కదా? నీ మార్గంలో నీవు అన్వేషిస్తూ ఎటో వెళ్ళిపోయినావు. నా మార్గంలో నేనూ బయలుదేరాను. మన కులపెద్ద అయిన వాసుకి పరమశివుని భక్తులలో ఒకడని తెలుసు గదా ! అతడు నన్ను శివుని గూర్చి తపస్సు చేయమని ప్రేరేపించాడు. సమస్త భారతదేశానికి మణిమకుటమయిన శివక్షేత్రం వారణాసి. అక్కడికి వెళ్ళి గంగాస్నానం చేసి విశ్వనాధుని దర్శించి కాశీ క్షేత్రమంతా తిరుగుతున్నాను. నాపూర్వ పుణ్యవశాన భోగనాధుడనే ఒక యోగితో పరిచయమయింది. అగస్త్యమహర్షి శిష్యుడైన ఆ మహానుభావుడు వేలఏండ్ల నుండి జీవిస్తున్నవాడు. ఆయన పాదములు ఆశ్రయించాను, సేవించాను. ఆ యోగి వర్యుడు దయతో నన్ను శిష్యునిగా స్వీకరించాడు. ఆ మహర్షి అప్పుడప్పుడు ఉత్తరకురుభూములలో హిమాలయ పర్వతాలకవతల సుదూర ప్రాంతంలో ఉన్న సుమేరు పర్వత భూములకు వెడుతూ ఉంటాడు. నన్ను కూడా తనతో తీసుకొని వెళ్ళాడు. హ్రస్వాంగులు పీతవర్ణులు అయిన చీనజాతి వారి స్థానమిది. పరకాయప్రవేశ విద్య శక్తివలన మా గురువుగా రొకసారి అచ్చటి స్థానికుని మృతశరీరంలో

ప్రవేశించి కొంతకాలం దానిలో ఉండి ఆ దేశీయులకు తాంత్రిక విద్యలు నేర్పారు. నా చేత కూడా ఆయన ఎన్నో చిత్ర విచిత్ర సాధనలు చేయించారు. ఓషధీ పరిజ్ఞానాన్ని నేర్పారు. మూలికా రహస్యాలను తెలిపారు. ఒక వస్తువును మరొక వస్తువుగా మార్చే విద్య, బంగారాన్ని తయారుచేసే విధానం ఆ మహాయోగి నా కుపదేశించారు. ఆయన ఆజ్ఞవలన కొంతకాలం కాశీలో ఉన్నాను. హిమాలయాల లోని దేశాలన్నీ నాకు సుపరిచితమైనవి. వారి అనుగ్రహం వల్ల సర్పయాగం నుండి నేను రక్షించబడ్డాను. నీ సంగతులేమిటో తెలుసుకోవాలని ఉన్నది. నీవు కామాఖ్య వెళ్ళావని అక్కడ నుండి బృందావనం వెళ్ళావని మాత్రం విన్నాను. తరువాత సంగతులు నీవు చెప్తే వింటాను."

సిద్ధనాగుడు తన ఆప్తమిత్రునికి జరిగిన సంఘటనలన్నీ తెలియచేశాడు. కొద్దిరోజులలోనే భోగనాథుని నుండి కాశీకి రావలసినదిగా శివనాగునకు మానసిక సందేశం వచ్చింది. తన స్నేహితుడయిన సిద్ధనాగుని కలుపుకొని వారణాసికి బయలుదేరాడు. ఇద్దరు మిత్రులూ కాశీకి చేరి గురువుగారి ఆశ్రమానికి వెళ్ళి ప్రణామాలు చేశారు. సిద్ధనాగుడు కూడా రావటం తనకు సంతోషంగా ఉందని ఆ యోగివర్యుడు చెప్పి "త్వరలో ఇక్కడ సిద్ధుల సమావేశం ఏర్పాటు చేయవలసి ఉన్నది. కలియుగ ప్రభావం వల్ల దెబ్బతింటున్న ధర్మాన్ని రక్షించటానికి ప్రపంచంలోని సిద్ధుల సమావేశాన్ని ఏర్పాటు చేస్తున్నాను. దానిని మీ రిద్దరూ నిర్వహించండి" అన్నారు. వారి మాట శిరసావహించి సిద్ధమహాసభ ఏర్పాటు చేయటం ఇతర ద్వీపాల నుండి కూడా సిద్ధులు రావటం జరిగింది. క్రౌంచద్వీపం నుండి ప్రత్యేకంగా కపిలాశ్రమయోగులు మయాసురజాతికి చెందిన కొందరు అరుణయోగులు కూడా ఆ సదస్సుకు వచ్చారు. వేదవ్యాసుని అధ్యక్షతన జరిగిన ఈ సభలో రకరకాల సూచనలు, చర్చలు జరిగినవి. కలియుగంలో జనులు అలసులు, మందబుద్ధులు, జరారోగపీడితులు, అల్పాయుష్కులు కావటం వల్ల తీవ్రమైన తపోయోగ సాధనలు చేయలేరు కనుక భక్తిమార్గాన్ని ప్రోత్సహించాలని హిమాలయ ఋషులు ఎక్కువమంది సూచించారు. వ్యాసమహర్షి దానికి ఆమోద ముద్ర వేయటంతో భక్తిని ప్రధాన సాధనంగాచేయాలని నిర్ణయం జరిగింది.

ఆతరువాత కొద్ది వందల సంవత్సరాలు గడిచిన అనంతరం దక్షిణ భారతంలోని కుర్తాళ క్షేత్రంలో అగస్త్య మహర్షి ఆశ్రమంలో మరొకసారి యోగుల సమావేశం జరిగింది. అక్కడ వివిధ కోణాలలో సాధక బాధకాలను చర్చించి ఋషిశ్రేష్ఠుడైన అగస్త్యుని అధ్యక్షతలో భోగనాథయోగి కొన్ని క్రొత్త ఆలోచనలను తీర్మానరూపంగా ప్రకటించాడు.

1) అపారశక్తి సంపన్నులయిన సిద్ధయోగుల పర్యవేక్షణలో వివిధ ద్వీపాలలో ధర్మాభిరతి ఏరకంగా ఉన్నదో పరిశీలిస్తూ అధర్మం పెచ్చుమీరకుండా జాగ్రత్తలు తీసుకోవాలి. యుగధర్మాన్ని బట్టి సిద్ధశరీరాలతో ఇక ముందు సామాన్య మానవులకు కనిపించరాదు. మన శరీర ప్రమాణాలు తేజస్వంతమైన ఈ ఆకృతులు బహిరంగ పరచటానికి వీలుండదు.

2) దీనిని దృష్టిలో ఉంచుకొని కొందరు సిద్ధులు మానవుల శరీరాలలో ప్రవేశించి వారికి తెలియకుండానే వారి మనసులను ప్రభావితం చేసి తమ దివ్యశక్తుల ద్వారా ఆ శరీరముల చేత మహాకార్యములు చేయించాలి. ఆ పనిపూర్తికాగానే వారా శరీరముల నుండి ఇవతలకు వచ్చి తమ స్వస్థానములో స్వస్వరూపములతో ఉండవచ్చు. ఆ ఆవేశం పొందిన మానవుడు ఆ మహాకార్యములను తామే చేశామని అనుకొంటారు. ప్రజలూ అలానే భావిస్తారు. వారి నలానే నమ్మనివ్వండి. మనకు దైవకార్యసిద్ధి ప్రధానం గాని, కీర్తి ప్రధానం కాదు. కొన్ని వేల సంవత్సరాల వరకు ఎప్పుడెప్పుడు ఎవరు ఎవరి శరీరాలలో ప్రవేశించాలో తెలియచేయబడుతుంటుంది. దీనికి సిద్ధులు సహకరించ వలసినదిగా కోరుతున్నాము.

3) ఇక్కడ సమావేశమయిన సిద్ధయోగులలో వివిధ దేవతా సాధనలు చేసి సిద్ధత్వమును పొందిన వారున్నారు. కొందరిలో ఇచ్ఛాశక్తి, కొందరిలో జ్ఞానశక్తి, కొందరిలో క్రియాశక్తి తర తమ భేదాలను బట్టి వికసించి ఉన్నవి. వీరిలో కొందరు మానవులుగా పుట్టవలసి ఉంటుంది. మీరంతా వ్యాసమహర్షి రచించిన పురాణ వాఙ్మయాన్ని చదివినవారే. భారతకాలంలో పూర్వయుగాలలోని రాక్షసులు మానవులుగా పుట్టి అధర్మకార్యాలు చేస్తూ దైవద్రోహం చేస్తూ తమ బలప్రభావం చేత బలహీనులను బాధిస్తుంటే వారిని శిక్షించటం కోసం సాక్షాత్

నారాయణుడే దిగిరావలసి వచ్చినది. ఆయన ఇచ్ఛానుగుణంగా భువర్లోక సువర్లోకములలోని దేవతలు దేవయోనులు విద్యాధర గంధర్వాదులు అసంఖ్యాకంగా జన్మించారు. అవసరమయినప్పుడు తప్పని ప్రక్రియ ఇది. దీనికి కూడా మీరు ఆమోదం తెలుపవలసిదిగా కోరుతున్నాను. అయితే ఒక్క హామీమాత్రం వారికి ఇవ్వవలసి ఉంటుంది. మానవజన్మ ఎత్తినప్పుడు తామెవ్వరో మరచిపోవటం సహజపరిణామం అది ఎవ్వరికీ ఇష్టం ఉండదు. విధి నిర్ణయం కనుక అవి తప్పవు. జన్మ తీసుకోవలసి వచ్చిన వారికి ప్రధమశ్రేణిలో ఉన్న సిద్ధులు సహాయం చేస్తూ ఉండాలి. వారి మనస్సులను ప్రేరేపించి తపోయోగసాధనలు చేయిస్తూ పూర్వజన్మ స్మృతిని వారికి కలిగిస్తూ ధ్యానభూమికలో వారికి అప్పుడప్పుడు కన్పిస్తూ కర్తవ్యాన్ని ఉపదేశిస్తూ దానికి కావలసిన శక్తిని సమకూరుస్తూ ఉండాలి.

ఈ విషయాలను గురించి మరింతలోతుగా చర్చించిన తరువాత సమావేశం ముగిసి ఎవరి దేశాలకు, ప్రదేశాలకు వారు వెళ్ళిపోయినారు. ఆ తరువాత మిగిలిన వారిలో ముగ్గురిని భోగనాధుడు పిలిపించాడు. వారు శివనాగుడు, సిద్ధనాగుడు, రాజనాగుడు. మూడవ వ్యక్తి శివనాగుని కంటె ముందు ఆయన శిష్యుడైనవాడు. వారితో ఆ మహాయోగి ఈ విధంగా చెప్పాడు. "యువకులారా! ఇష్టదేవతా సాధనలు చేసి ఆ దేవతల అనుగ్రహాన్ని కొంతవరకు సాధించినవారు మీరు. దేవకార్యం సిద్ధించటానికి పరమేశ్వర సంకల్పానుసారం సిద్ధమండలి తలపెట్టిన ప్రణాళికలు అమలుచేయటానికి మీ వంటి వారి సహకారం చాలా అవసరం. సిద్ధఋషులవలె దీర్ఘకాలం జీవిస్తూ ఉండాలన్న మీ కోరిక నాకు తెలుసు. దేవతా సాధనల వల్ల మీకు అజరత్వం వచ్చింది కాని అమరత్వం రాలేదు. మీ రిప్పటికి దాదాపు 1500 సంవత్సరాల నుండి జీవించి యున్నారు. ఈశరీరాలు పతనమయ్యే సమయం సమీపించింది. ఈ విధి నిర్ణయాన్ని తప్పించటానికి ఇప్పటి మీ తపశ్శక్తి చాలదు. కనుక దానికి బద్ధులై మీరు మరణించి మళ్ళీ జన్మలెత్తవలసి ఉన్నది. మీ ముగ్గురిలో రాజనాగుడు తపస్సులో అధికుడు. అతడు కొంతకాలం తరువాత ఈ దక్షిణాపథంలో జన్మించి నా శిష్యుడై యోగసాధనలు చేసి కుర్తాళం వచ్చి అగస్త్య మహర్షిని గూర్చి తపస్సుచేసి ఆయన అనుగ్రహం వల్ల సిద్ధుడై దీర్ఘకాలజీవియై మహావతార్‌బాబా అన్నపేరుతో ప్రసిద్ధిచెంది శ్రీకృష్ణుడు బోధించిన క్రియాయోగ మార్గాన్ని

పునరుద్ధరించి సాధకు లెందరికో సహాయం చేసి ఆధ్యాత్మికరంగంలో పురోగమింపచేస్తాడు. ఇక మీ రిద్దరు కొన్ని జన్మలెత్తి ప్రతిజన్మలోను దేవతల భక్తిని నిలుపుకొంటూ సిద్ధులతో అనుబంధాన్ని ఎప్పటికప్పుడు పునరుద్ధరించు కొంటూ ముందుకు వెడుతుంటారు. ఇప్పటికి రెండువేల సంవత్సరాల తరువాత మరొక దేశంలో పుట్టి మన సిద్ధమండలిలోని ఒక యోగీశ్వరునకు శిష్యులవుతారు. ఆ తరువాత 1500 సంవత్సరాలు గడచిన అనంతరం బృందావనధామంలో మళ్ళీ కలుస్తారు. ఆ తరువాత 500 సంవత్సరాలకు మళ్ళీ కలుసుకోవటం జరుగుతుంది. మిగతా విషయాలు అవసరమయినంత వరకు మీకు తెలియచేయబడుతుంటవి. నేనెప్పుడూ మిమ్ము ఒక కంటకనిపెడుతూ ఉంటాను. రాజనాగుడు కూడా మీతో ఆత్మీయమైన అనుబంధం కలిగి ఉంటాడు. ఈ పరిణామాలకు మీ మనస్సులలో కలుగుతున్న వేదనను నేను గుర్తించగలను. సర్వశక్తి సంపన్నుడయిన పరమేశ్వరుని ఇచ్ఛననుసరించి నడవవలసిన వారలమే మనమంతా –కాకపోతే కొంచెం ముందు వెనుకలు, హెచ్చుతగ్గులు, ఈ భేదము, వైవిధ్యము తప్పవు". వారు గురుదేవుని ఈ మాటలు విని నిశ్శబ్దంగా ఆయన పాదములకు ప్రణమిల్లి నిర్దేశించబడిన పథంలో ప్రయాణీకులయినారు.

సిద్ధసంకల్పాన్ని అనుసరించి, గురువుల ఆజ్ఞననుసరించి ముగ్గురు యువకులూ తమ తమ జన్మపరంపరలలోకి వెళ్ళిపోయినారు. కాలాంతరమున రాజనాగుడు మహావతార్‌బాబాగా పరిణామం చెందాడు. శివనాగుడు మౌనస్వామి అన్నపేరుతో కుర్తాళంలో సిద్ధేశ్వరీ పీఠాన్ని స్థాపించాడు. సిద్ధనాగుడు తీర్థయాత్రలు చేస్తూ ఉజ్జయినికి వెళ్ళి అక్కడ మహాకాళిని, భైరవుని దర్శించి శివరాత్రి ప్రాణాలు వదిలాడు. భైరవాను గ్రహం వల్ల తరువాత జన్మలో భైరవనాథుడన్న పేరుతో పుట్టి ప్రచండమైన భైరవసాధన చేసి తీవ్రమైన శక్తులు సాధించి వెయ్యేండ్లకు పైగా జీవించి మరణించాడు. తదనంతరం విదేశాలలో మహాయోగి అయిన ఏసుక్రీస్తుకు శిష్యుడై 'జాన్' అన్నపేరుతో గురుబోధలను ప్రచారం చేశాడు. ఆ తరువాత మళ్ళీ భారతదేశంలో భానుదేవుడన్న పేరుతో రాజవంశంలో పుట్టి ఒక చిన్న రాజ్యానికి ప్రభువై మధ్యవయస్సులో శత్రువుల చేతిలో ఓడిపోయి రాజ్యభ్రష్టుడైనాడు. ఏ విధంగానైనా రాజ్యం పొందాలన్న కోరికతో మత్స్యేంద్రనాథుని శిష్యుడైన గోరఖ్‌నాథుని ఆశ్రయించాడు. ఆ

మహాయోగి దివ్యదృష్టితో చూచి "భానుదేవా ! ఈ చిన్న రాజ్యానికిమళ్ళీ ప్రభుత్వం సంపాదించటం కోసం నన్నాశ్రయించావు. నీ పూర్వసంస్కారాన్ని అనుసరించి నీవీ చిన్నపరిధికి పరిమితం కావలసిన వాడవు కావు. వెనుక ఒక జన్మలో కాళీభక్తుడవు. ఆదేవి అనుగ్రహం నీమీద ఉంది. నీకు కాళీ మంత్రాన్ని ఉపదేశిస్తాను. తీవ్రసాధన చెయ్యి. కాళీదేవి అనుగ్రహించి తీరుతుంది. అప్పుడామెను ఏమికోరుతావన్నది నీఇష్టం" అని మంత్రోపదేశం చేశాడు. ఆ సిద్ధుడు చెప్పిన విధంగా సాధన మొదలు పెట్టి పట్టుదలతో చేశాడు భానుదేవుడు. కఠోరదీక్షలతో కొన్ని సంవత్సరాలు కష్టపడవలసి వచ్చింది. చివరకు కాళీదేవి సాక్షాత్కరించి "నాయనా! నీకు ఏమి కావాలో కోరుకో" అన్నది. ఇన్ని సంవత్సరాల కఠోర శ్రమలో అతనికి లౌకిక సుఖభోగవాంఛ నశించింది. మళ్ళీ రాజ్యం పొందాలన్న కోరిక తొలగిపోయింది. "అమ్మా ! సమ్రాట్టును కావాలని సాధన మొదలుపెట్టాను. ఇప్పు డా వాంఛలేదు. కానీ నాకు పూర్తి వైరాగ్యమూ కలుగలేదు. అందువల్ల సిద్ధశక్తులతో లోకకల్యాణం చేస్తూ నీ సేవకునిగా ఉండాలని ఉన్నది. ఒక వేళ నేను మళ్ళీ జన్మలెత్త వలసి వచ్చినా ఎప్పుడూ నీ భక్తుడనై ఉండేటట్లుగా నన్ను అనుగ్రహించు" పరమేశ్వరి దయార్ద్రమైన చూపులతో చిరునవ్వు వెన్నెలను కురిపిస్తూ అతడు కోరిన వరమిచ్చి అదృశ్యమయింది. ఆ శరీరంలో కొంత దీర్ఘకాలం జీవించి మళ్ళీ హిమాలయాలలోని డెహ్రాడూను ప్రాంతంలో ఒక కాళీ భక్తుల ఇంట్లో పుట్టటం జరిగింది. తమవంశంలో ఉన్న కాళీపూజ, మంత్రసాధన సహజంగానే అబ్బినవి. ఆ ప్రాంతంలో ఒక దేవి ఆలయం ఉన్నది. ఆ ఆలయం లోని దేవీమూర్తి అంటే అతనికి ఆకర్షణ ఏర్పడింది. ఆ దేవతను చూచినప్పుడల్లా మాతృభావన కాక మధుర ప్రేమభావన కలిగేది. పరమేశ్వరి విషయంలో ఈ భావన తప్పుకదా ! అనిపించేది. కానీ ఆ భావం నిల్చేది కాదు. పాశం వేసి లాగుతున్నట్లుగా అతని హృదయం ఆ దేవత వైపు బలంగా ప్రేమభావనతో మోహితమైంది. అతడు మంత్రశాస్త్ర గ్రంథాలను క్షుణ్ణంగా పరిశీలించాడు. భాగవతాన్ని చాలా సార్లు చదివాడు. కృష్ణోపాసనలో గోపికాభావానికి ఉన్న ప్రాధాన్యాన్ని జాగ్రత్తగా అనుశీలనం చేశాడు. బృందావనంలో గోపకుల భార్యలు కృష్ణుని తమ ప్రియునిగా భావించి ఉపాసించి తరించారు. తల్లిగా, తండ్రిగా, అన్నగా, బంధువుగా, స్నేహితునిగా, ప్రియునిగా

ఏ విధంగానైనా పరమేశ్వరుని భావించవచ్చు. చివరకు శత్రువుగా కూడా భావించవచ్చు. భావములో తీవ్రత, ఉద్దామధ్యాననిష్ఠ ప్రధానమని నారదుడు ధర్మరాజుతో చెప్పిన శ్లోకాలను పదేపదే మననం చేశాడు. పరమేశ్వర చైతన్యం గుణ, లింగ, నామరహితమైనది. పురుషరూపాన్ని కాని, స్త్రీరూపాన్ని కాని ఏది కావాలనుకుంటే అదిధరించకలదు. పరమేశ్వరుని పురుషునిగా తన ప్రియునిగా భావించిగోపికలు తరించినట్లు ఆ అనంత చైతన్యము స్త్రీగా భావించి ప్రియురాలిగా ఎందుకు ఉపాసించరాదు ? తాంత్రిక గ్రంథములలో "వీరమార్గము" అన్న పేరుతో ఈ పద్ధతి కన్పించింది. దానితో ఒక నిర్ణయానికి వచ్చి ఆ గుడిలో కూర్చొని ప్రేమభావంతో శ్యామకాళీమంత్రసాధన చేశాడు. కొద్దికాలం చేయగానే ఆ గుడిలోని దేవత సాక్షాత్కరించింది. "సాధకుడా ! నీ తపస్సుకు నేను సంతృప్తిని చెందాను. నీలో కలిగిన ప్రేమభావము తప్పు కాదు. దానికి కారణం నేనే. దేవాలయాలలో ఒక రహస్యమున్నది. ప్రతి దేవాలయంలోను ఎప్పుడూ ఆ దేవత ఉండదు. ఆ దేవత పరివారంలోని వారు ఆమె ఆజ్ఞవల్ల అక్కడ ఉంటూ భక్తుల కోరికలను వారి యోగ్యతను బట్టి ప్రసాదిస్తుంటారు. నేను భువనేశ్వరి పరవారంలోని అనూరాధ అనే దేవతను. పూర్ణ మానవశరీరంతో నీతో కొంతకాలం కాపురంచేస్తాను. నీకు దివ్యసుఖాల నందిస్తాను" అని వరమిచ్చింది. ఆ ప్రకారంగానే కొన్ని సంవత్సరాలు అతనితో ఆమె సంసారం చేసింది. ఆ దాంపత్య ఫలితంగా వారికొక కుమారుడు పుట్టాడు. వాడికి అయిదుఏండ్ల వయస్సు వచ్చిన తరువాత ఆ దేవత "మన దాంపత్య సమయంపూర్తయిపోయింది నేను వెడుతున్నాను. నీ జీవితంలో మళ్ళీ ఇక నేను కనపడే అవకాశం లేదు. కుమారుని జాగ్రత్తగా పెంచి పెద్దవాడిని చెయ్యి" అని వీడ్కోలు చెప్పి అదృశ్యమయింది. ఇన్ని సంవత్సరాలు ఆమెతో శృంగార క్రీడలో మునిగి కాళీసాధన సరిగా చేయలేదు. తన తపః ఫలమో లేక పూర్వపుణ్యమో పూర్తి అయిపోయింది. ఈ జన్మలో తనకింక సుఖం లేదు.పోనీ మళ్ళీ వెళ్ళి తపస్సుకు కూర్చుందాము అంటే ముద్దులొలికే చిన్నవాడిని విడిచిపెట్టి పోలేదు. తనకీ జన్మ కింతే అని మనసు కుదుట పరచుకొని ప్రేమస్వరూపిణి అయిన తన భార్య చెప్పిన విధంగా బిడ్డను పెంచి పెద్దచేశాడు. వానిని సంసారంలో స్థిరపరచేసరికి తనకు ముసలితనం వచ్చి ఆయువు తీరిపోయింది. సామాన్య

సాధనయే తప్ప కఠిన తపస్సు చేయటానికి శరీరం సహకరించని స్థితిలో పడినాడు. మరణం సమీపించినప్పుడు కాళీమాతను ప్రార్థించాడు. "తల్లీ! ఏ జన్మలో ఏమి సుకృతము చేశానో ఈ జన్మలో నీ భక్తుడనయ్యే అదృష్టం కలిగింది. కానీ, ఇంద్రియములకు లొంగిపోయి కామవశుడనై ఒక దేవతనే భార్యగా చేయమని నిన్ను ప్రార్థించాను. నీ వనుగ్రహించి ప్రసాదించావు. కానీ, ఆ భోగంలో పడి తపస్సు విస్మరించాను. వచ్చే జన్మలో నయినా తపస్సు చేసి నీ పరిపూర్ణమయిన అనుగ్రహ సిద్ధిని పొందేలాగా కరుణించు" అని కాళీదేవిని మనస్సులో నిల్పుకొని ఆ దేవి మంత్రాన్ని జపిస్తూ తుదిశ్వాస వదిలాడు.

తరువాత జన్మలో మళ్ళీ కాళీసాధకుడయ్యాడు స్వప్నంలో కాళీదేవి స్వయంగా తన మంత్రాన్ని ఉపదేశించింది. ఈ జన్మలో సంసారంలేదు. చిన్న వయస్సులోనే దేవతా సాక్షాత్కారం పొందాలన్న తపన బయలుదేరింది. ఇంట్లో తల్లితండ్రుల బాధ్యత వహించవలసినది తనకంతగా లేదు. తన అన్నలున్నారు. విద్య యందు కాని లౌకిక విషయాల యందు కాని తనకు ఆసక్తి లేదు. ఎప్పుడూ గుళ్ళూ గోపురాలు పట్టుకొని తిరిగేవాడు. పెద్దలు ఎంత చెప్పి చూచినా అతను మారలేదు. కొంతకాలం తరువాత వీడు నలుగురి వంటివాడు కాదని నిశ్చయించుకొని ఇంట్లోవాళ్లు పట్టించుకోవటం మానివేశారు. అతడికి కావలసినదీ అదే. ఎప్పుడూ అమ్మవారి గుడికి వెళ్ళి అక్కడ కళ్ళు మూసుకొని కూర్చుండేవాడు. అప్పుడప్పుడు వారి ఇంటికి హరిద్వారంలో ఒక ఆశ్రమాధిపతిగా ఉంటున్న ఒక వృద్ధయోగి వచ్చేవాడు. ఒక పర్యాయం వచ్చినప్పుడు ఇతడు ఆయనను హరిద్వారానికి తీసుకొని వెళ్ళమని ప్రార్థించాడు. ఆయన ఆశ్రమంలో వేదపాఠశాల ఉన్నది. అక్కడికి వెడితే అక్కడి పిల్లల సహవాసంతోటైనా చదువులో పడవచ్చునేమో అని ఆయనతో వెళ్ళటానికి తల్లిదండ్రు లనుమతించారు. అది అతనికి పెద్దవరమయింది. ఆ వృద్ధయోగితో హరిద్వారం చేరుకొన్న తరువాత కొన్నాళ్ళు ఆశ్రమంలో ఉండి ఆయనతో తనకు తపస్సునందు ఉన్న ఆసక్తిని విన్నవించి తాను ఏకాంతంగా తపస్సు చేసుకోవటానికి అనుమతివ్వమని అర్థించాడు. ఇతని లక్షణాన్ని నిశ్చలమయిన పట్టుదలను సాధనలోని ఏకాగ్రతను గమనించి ఆ వృద్ధుడు దానికి సంతోషంగా అనుమతించి సాధనలో తీసుకోవలసిన జాగ్రత్తలు తనకు తోచినవి చెప్పాడు. అక్కడ నుండి హిమాలయ పర్వతాలలో

కొంతదూరం వెళ్ళి ఆ కొండలలో ఒక చిన్నగుహను ఎన్నుకొని అక్కడ తపస్సు ప్రారంభించాడు. క్రూరమృగాలు లేని చోటు జనావాసాలకు మరీ దూరంకాని చోటది. గంగాజలం సమృద్ధిగా ప్రవహించే స్థలం. పండ్లు, పండ్లచెట్లు చాలా ఉన్నవి శరీరాన్ని నిలపటానికివి చాలు. ఆహార విహారాది కఠోర నియమాలతో ఒక వైపు శరీరాన్ని జాగ్రత్తగా రక్షించుకుంటూ కాళీమంత్ర జపసాధన చేయటం మొదలు పెట్టాడు. రోజులు, నెలలు, సంవత్సరాలు గడుస్తున్నవి. ఋతుగమనంలో మార్పులు వచ్చినట్లే అతని శరీరంలోనూ మార్పులు వస్తున్నాయి. ఆ ప్రాంతంలోని పొదలలోని కొన్ని చెట్ల పండ్లు చిన్నవి తింటే బాగా బలంగా ఉన్నట్లు అనిపించటాన్ని గమనించాడు. కొన్నిఫలాలు ఆకులు, తింటే రోజుల తరబడి ఆహారం యొక్క అవసరం లేకపోవటం గుర్తించాడు. ఈ విధంగా ఆయా వస్తువులనుపయోగించుకొంటూ ప్రాణరక్షణ చేసుకొంటూ మంత్రసాధన చేస్తున్నాడు.

**కూర్చుండిన స్థలములోనె కూలిన కూలుదునుగాక!**
**ఎముకలగూడు వలె మారి ఎండిన ఎందుదునుగాక!**
**నా మాంసము నా చర్మము నా దేహము శిథిలమైన**
**నిను వీడను నిను వీడను నిను చూడక నే వదలను**

ఈ కూర్చొన్న ఆసనంలో నాశరీరము శుష్కించిన శుష్కించును గాక! నా శరీరములోని మాంసము, చర్మము, ఎముకలు నశించిపోయిన పోవును గాక! నేను కోరిన దివ్యానుగ్రహాన్ని పొందకుండా ఇక్కడ నుండి కదలను.

తల్లీ! నెలలు, సంవత్సరాలు గడిచిపోతున్నవి. కాలాన్ని గణించే శక్తి కూడా నశించింది. ఎప్పటికైనా నిన్ను చూచి తీరాలి అన్న సంకల్పం ఒక్కటే మిగిలి ఉన్నది. ఎన్నో జన్మల నుండి నిన్నుకొలుస్తున్నానని క్షణక్షణము అనిపిస్తుంది. నీదర్శనం కోసం తపించి తపించి ఎండిన మోదువలె అయిపోతున్నాను. ఏడ్చిఏడ్చి కన్నీళ్ళు కూడా ఇంకిపోయినాయి. ఆర్తుడను దీనుడను అయిన నన్ను కాపాడు.

**కాళి నమస్తే – ఖాళి* నమస్తే**

కాళి కాళి కంకాళి నమస్తే
నీలగగన దిక్చేళి నమస్తే

మునిహృదయాంబుజ హేళి - నమస్తే
సంగర కవితాచూళి - నమస్తే
జిహ్వాద్యుతి కంకేళి - నమస్తే
పదసంశ్రిత దేవాళి - నమస్తే
శివశిరస్థపదధూళి - నమస్తే
నమద్భైరవీపాళి - నమస్తే
మాయామాళవ గౌళి - నమస్తే
దనుజదళనదంభోళి - నమస్తే
నాగాలంకృత మౌళి - నమస్తే
సేవాపరబేతాళి - నమస్తే
కరధృత ఖడ్గకరాళి - నమస్తే
శ్యామకాంతిరింఛోళి - నమస్తే
బహువర్ణోత్సవ హోళి - నమస్తే
భీషణసౌందర్యాళి - నమస్తే
కాంతిచకితభూగోళి - నమస్తే
రాగోల్లసితవరాళి - నమస్తే
నీలశరీర తమాలి - నమస్తే
చండినమస్తే ముండి నమస్తే
చండ చండి చాముండి - నమస్తే
అమరి నమస్తే భ్రమరినమస్తే
శాత్రవభీకర భిదురి - నమస్తే
శాంతి నమస్తే కాంతి - నమస్తే
సకలలోక విక్రాంతి - నమస్తే
కాళినమస్తే ఖాళి - నమస్తే
మకార పంచక కేళి - నమస్తే

మూలాధారిత కీలి - నమస్తే
శూన్యభావ వైశాలి - నమస్తే
కరుణకవితలోజాలి - నమస్తే
గానలహరిలో లాలి - నమస్తే
కవిహృదయములో హాళి - నమస్తే
కాళి నమస్తే ఖాళి నమస్తే
హృదయశ్రీగిరి ఖేళి నమస్తే
సిద్ధేశ్వర హృత్కేళి నమస్తే

భక్తి భరితమైన ఈ వేదనకు, అతని చిరకాల కఠోర తపస్సుకు కాళీ దేవి కనికరించి, దయామయి అయిన ఆజగజ్జనని అతనిముందు సాక్షాత్కరించింది. "బిడ్డా! నీ కఠోరమైన తపస్సుకు నేను కదలివచ్చాను. పూర్వజన్మలలోనూ నీవు నా భక్తుడవు. ఎప్పుడూ నిన్ను అనుగ్రహిస్తునే ఉన్నాను. రెండు జన్మల క్రింద నీవు మహాసిద్ధుడవు. నీవు సుఖ భోగములను త్యజించి క్రూర తపస్సు చేసి కాపాలిక సాధనలు చేసి ఆనాడు నా అనుగ్రహాన్ని సాధించావు. అప్పుడు నీవు తపస్సు చేసిన చోటు కూడా ఇదే. నాటి నీ భౌతిక శరీరం నీ ఆజ్ఞ వల్ల నీ శిష్యులు ఈ గుహలో ఖననం చేశారు. నా సంకల్పం వల్ల నీ జీవు డిక్కడికి ఆకర్షించబడ్డాడు. మధ్యలో వచ్చిన జన్మలు నీ అంత రాంతరాలలో ఉన్న సుఖ భోగ కాంక్షలు తీరటానికి సరిపోయింది. ఈ జన్మలో మళ్ళీ ఇక్కడకు వచ్చి ఆనాటి నీ సమాధి మీదనే నీవు కూర్చోని జపం చేశావు. కాలవశాన వచ్చిన మార్పుల వల్ల ఆ చిహ్నాము లేవీ పైకి కన్పించక పోవడం వల్ల నీకు తెలియలేదు. నేనే, నీకు స్వప్నంలో మంత్రాన్ని ఇచ్చాను. నేనే, నిన్ను ఇక్కడకు రప్పించాను. నీ చేత తపస్సు చేయించాను. నీకు దివ్య శక్తులను ప్రసాదిస్తున్నాను. ఈ శరీరంలో నీవు మూడు వందల సంవత్సరాలు జీవిస్తావు నీకు తోడుగా నేను ఎప్పుడు ఉంటాను." అని కాళీదేవి పలికింది. ఆ యోగి "అమ్మా! నీ అనుగ్రహం వల్ల నేను ధన్యుడనయినాను. ఎప్పుడూ నీ ఉపకరణంగా ఉంటూ నీవు సంకల్పించిన పనులను చేసే సేవకునిగా నన్ను నియమించు నీవు నాతో ఎప్పుడూ ఉంటానన్నావు. భౌతికంగా కూడా అది జరిగేలా చెయ్యి అన్నాడు. కాళీదేవి నవ్వి "ఓయీ!

చిత్రమైన కోరిక కోరావు. ఇది కలియుగం. నేను నీ వెంట దివ్యాకృతితో ఉండడం ఉచితంకాదు. కానీ నీ వంటి భక్తుని కోరికను కాదనలేను. చిన్న విగ్రహ రూపంలో నీతో ఉంటా. ఆ విగ్రహంలో నీకు కన్పిస్తాను, మాట్లాడుతాను. నీ బుద్ధిని ప్రచోదిస్తూ ఉంటాను. అయితే ఈ విగ్రహం అన్ని విగ్రహాల వంటిది కాదు. పసిబిడ్డ పెరిగి పెద్దదయినట్లే ఇదికూడా పెరిగి పెద్దదవుతూ ఉంటుంది. ఇది జీవత్ విగ్రహం అనడానికి నిరూపణగా దీనికి ఉఛ్వాస నిశ్వాసలుంటాయి. నాడీ స్పందన ఉంటుంది. ఇక్కడ నుండి నా విగ్రహంతో నీవు బయలుదేరి దేశ సంచారం చెయ్యి ఎందరో యోగులు, సిద్ధులు నీకు తటస్థిస్తుంటారు. ఆధ్యాత్మిక మార్గంలోకి ప్రజలను మలుస్తూ యోగసాధనలలో తపస్సాధనలలో మరింత ముందుకు పోయేలా చేస్తూ నీవు పురోగమించు. ఈ విగ్రహం పెరిగి పెద్దదవుతూ ఉంటుంది. ఇప్పటి మనుష్యప్రమాణం వచ్చిన తరువాత దానినొకచోట స్థాపించి ఆలయాన్ని నిర్మిద్దువుగాని ఎప్పుడు ఏమి చేయ వలసినదీ నేను నిర్దేశిస్తూంటాను" అతనిముందు తేజస్వంతమైన ఒక చిన్న విగ్రహం అవతరించింది.

ఆ విగ్రహంతో హిమాలయాల నుండి బయలుదేరి యావద్భారత దేశము సంచారించాడు కాళీయోగి. ఉత్తరాపథంలో బృందావనంలో కొంత ఎక్కువకాలం ఉండవలసి వచ్చింది. అక్కడి రాధాకృష్ణ భక్తులైన రూపగోస్వామి, సనాతనగోస్వామి, మొదలైన ప్రేమయోగులతో అనుబంధం పెరిగింది. ఆధామంతో తనకున్న పూర్వజన్మ బంధాలు గుర్తుకువచ్చినవి. ఒకసారి హితహరివంశమహరాజ్ అనే రాధాభక్తుడు తన ఆశ్రమానికి ఆహ్వానించి తాను రచించిన రాధాసుధానిధి అనే గ్రంధం వినిపించాడు.తనను రాధాసఖిగా భావించుకొని అతడు చేసిన ఆ రచన తననెంతో ఆకర్షించింది. సంస్కృతంలో అంతటి రసవంతమైన రచన భక్తి ప్రేమామృతాన్ని వర్ణించే రచన మరొక్కటి లేదని అనిపించింది. అతడు కాళీయోగిని కాళీ రూపంగానే భావించేవాడు. కాళి కూడా రాధాసఖులలో ఒకరని వాదించేవాడు. ఆ రసిక భక్తునితో గడిపిన కాలం మరచిపోలేనిది. ఇక రూపగోస్వామితో మైత్రి చాలా గాఢమైనది. కాళీతంత్రంలో నుండి ఇతడుదాహరించిన ఒక సూత్రం అతనికి బాగా నచ్చింది. ఉచ్ఛ్వాసనిశ్వాసముల గమనాగమనములను కండ్లుమూసుకొని ఏకాగ్రతగా

చూడటమే కాలమును జయించే కాళీసాధన అని ఆ వాక్యం. గోస్వామి కృష్ణభక్తికి సంబంధించిన ఒక గ్రంథం రచిస్తూ రాత్రులు కొంతకాలం ఈ సాధన చేశాడు. ఆ సాధన ఫలితంగా ఒక శాకంభరీ పీఠ సిద్ధుడతనికి సాక్షాత్కరించాడు. గోస్వామి యందు ఆదరం చూపించి కాళీ కృష్ణులు ఒక్కటే అని చెప్పి దివ్యానుభూతులను, కొన్ని శక్తులను ప్రసాదించాడు. ఆకాశ సంచార శక్తిగల ఆ సిద్ధుడే తర్వాత రామకృష్ణపరమహంసగా జన్మించాడు. ఆ కాళీసిద్ధుడు ఇతని విగ్రహంలోని కాళీదేవిని పూజించడమేగాక జన్మమారిన తర్వాత రామకృష్ణునిగా కూడా ఇతని చివరి రోజులలో వచ్చి దర్శించి అమ్మను అర్చించి వెళ్ళాడు. కొంత కాలం కాళీయోగి కాశీలో ఉన్నాడు. అక్కడ త్రైలింగస్వామి అనే యతి శ్మశానకాళీ సాధన చేసి ఇతనివలె మూడు వందల యేండ్లు జీవించే వరం పొందాడు. అతడూ ఈ కాళీ దేవతామూర్తిని అర్చించాడు. అక్కడి నుండి యోగి కొన్నాళ్ళు దక్షిణాపథంలో తిరిగాడు. చిత్రానదీ తీరంలోని కుర్తాళం అతనిని ఆకర్షించింది. ఆ పవిత్రస్థలంలో కొన్ని నెలలు ధ్యానం చేసుకుంటూ అక్కడి ఆర్తుల కష్టాలు తీరుస్తూ గడిపాడు. తిరిగి ఉత్తర భారతానికి బయలుదేరగా దోవలో ఆంధ్ర ప్రాంతంలో శ్రీనాధుడనే కవివర్యునితో పరిచయం కలిగింది. చింతామణి మంత్రసిద్ధుడై రాజ పూజితుడైన ఆ విద్వాంసుని కవిత్వ పాండిత్య ప్రాభవానికి అతడు ముగ్ధుడైనాడు. ఆ కవి–అతిథిగా తన భవనంలో కొంతకాలమైనా ఉండవలసినదిగా ప్రార్థించాడు. ఆతని ఆత్మీయ భావానికి సంతోషించి కొన్నాళ్ళున్నాడు. విపరీతంగా స్త్రీలోలుడు, కాముకుడు – అయిన ఆ కవి చిత్తవృత్తి చాలా చిత్రమనిపించింది. ఆనన్యమైన అతని శివభక్తి, తనకెంతో నచ్చింది. కాళీయోగి అక్కడినుండి బయలుదేరే రోజు ఆ కవిరాజు తన భవిష్యత్తును గూర్చి చెప్పమని ప్రార్థించాడు. ధ్యానంలో చూచి ఇలా చెప్పాడు. "మహాకవీ!" మీది చాలా గొప్ప జన్మ . ఆ విషయం నేను ప్రత్యేకంగా చెప్పనక్కరలేదు. ఒక సిద్ధగురువు నీకు దివ్యమంత్రాన్ని ఉపదేశించాడు. ఆ సమయంలో అతడు నీకు కొన్ని నియమాలు పెట్టాడు. ఆ మహామహుని దయ వల్ల నీకు వాక్సిద్ధి లభించింది. నీ రంగంలో నీ ముందు నిలువగల వారుండరు. దిగ్విజయం చేసి సమ్రాట్టులచే కనకాభిషేకాలు పొందుతావు. ఎంతటి రాజులయినా నీ వశులవుతారు.

మహాభోగాలు అనుభవిస్తావు. కానీ నీ స్త్రీలోలత నిన్ను దెబ్బతీస్తుంది. నీ పతనానికి దారి తీస్తుంది. ఇప్పుడే కాదు ఇంకా చాలా సంవత్సరాల తర్వాత. ఇప్పుడు నీ ప్రభజగజ్జేగీయ మానంగా వెలుగుతోంది. ఏనాడు నీ సిద్ధగురువు పెట్టిన నియమాన్ని ఉల్లంఘిస్తావో ఆనాడు నీ శకం ముగుస్తుంది. మరపువల్ల, కామంవల్ల, నీవు దోషం చేస్తావని, తదనంతరం నీవు హత్యచేయబడి ప్రేతమై కొన్ని వందల సంవత్సరాలు గాలిలో తిరుగుతుంటావని తోస్తున్నది. నీ పురుషకారం వల్ల, దైవభక్తి వల్ల నీ భవిష్యత్తు నేమైనా మార్చుకోగలవేమో ఆలోచించుకో" శ్రీనాధుడు "యోగిశేఖరా! కాళీదేవి అనుగ్రహపాత్రులైన మీరు ఎన్నో విశేషాలు తెలియజేశారు. మీరు చెప్పిన ప్రయత్నం చేస్తాను. కానీ ఎంత కృతకృత్యుడనవుతానో! ముక్కుకుత్రాడు వేసి గంగిరెద్దును దానిని ఆడించువాడు లాక్కువెళ్ళి ఆడించే విధంగా విధినాతో ఆడుకుంటున్నది. నాకు మనశ్శాంతి లేదు. చిన్నప్పుడే నా తల్లి దండ్రులు మరణించారు. నా స్వగ్రామం క్రాల్పట్టణం ఉప్పెన వచ్చి సముద్రంలో కొట్టుకుపోయింది. నా మేనమామ సనత్కుమారభట్టు నన్ను పెంచి పెద్ద చేశాడు. ఆయన కూతురును నాకు పెండ్లి చేయాలని ఆశించాడు. ఆ అమ్మాయి చాలా వికారంగా ఉంటుంది. నా జీవలక్షణం సౌందర్యోపాసన. ఆ అమ్మాయిని పెండ్లి చేసుకోనని తిరస్కరించాను. కృతఘ్నుడవని నన్ను దూషించాడు. నన్ను ఇంట్లో నుండి వెళ్ళగొట్టాడు. ఆయన పెద్ద అధికారపదవిలో ఉండడం వల్ల నా కెవ్వరూ ఆశ్రయమివ్వలేదు. ఆగమ్మకాకినై ఊళ్ళు పట్టుకు తిరిగాను. ఒక సిద్ధుడైన మహానుభావుడు కరుణించి మంత్రోపదేశం చేశాడు. అది సిద్ధించింది. దాని వల్ల వాగ్దేవి అనుగ్రహించింది. మహా కవియైన మా తాతగారు కమలనాభామాత్యుని వారసత్వంగా కవిత్వం వచ్చింది. సరస్వతీ చింతామణీదేవి ఇచ్చిన శక్తి వల్ల సాహిత్యరంగంలో అప్రతిహత పరాక్రమంతో ప్రకాశిస్తున్నాను. దాని వల్ల సిరిసంపదలు లభించినవి. మీ వంటి మహానుభావులకు ఆతిధ్యమిచ్చి పూజించుకోగల అవకాశం లభించింది. అయితే మీరు నా భవిష్యత్తును గూర్చి చెప్పిన విషయాలు విన్నప్పుడు దిగులు కలుగుతున్నది. నా సాధనశక్తి చాలా పరిమితమైనది. దానివల్ల విధిని మార్చగలనని నాకు నమ్మకం లేదు. నన్ను మీరే రక్షించాలి. బ్రతుకు బాటలో ముండ్ల మీద ఉండవలసి వచ్చింది. ఎన్నో మలుపులు వచ్చినవి. వాటిని మీ ముందు ఏకరువుపెట్టను. ఆ పరిస్థితులలో

స్త్రీలోలుడనైనాను. అయితే వేశ్యాగమనం చేస్తున్నాను గాని - యే పతివ్రత జోలికి పోలేదు. నా మంత్ర గురువులు మీకు తటస్థించవచ్చు. నేను ఎప్పుడైనా తప్పుచేస్తే నన్ను దయతో క్షమించమని వారికి చెప్పండి. వారిని మళ్ళీ చూచే అవకాశం ఉన్నదో, లేదో వా రెక్కడ ఉన్నారో ? ఏదైనా నన్ను మీరు కాపాడాలి. అని ప్రార్థించాడు. మనసుకరిగిన కాళీయోగి మరోసారి నిమీలితనేత్రుడై ధ్యానించి "శ్రీనాధకవీ! చాలకాలం తర్వాత నీ యాత్రలో ఒక మంత్రవేత్త నీకు పరిచయమవుతాడు. అతడు నీకు పరకాయప్రవేశవిద్యను నేర్పుతాడు. అతని పేరు శివరాయప్ప - కన్నడిగుడు. సిద్ధవిద్య నేర్చుకోవాలన్న మోజులో అక్కడి మతంగ పర్వతం మీద 40 రోజులు సాధన చేస్తావు. ఆ విద్య సిద్ధిస్తుంది. దానిని పరీక్షచేసి చూడాలన్న కోరికతో ఒక యువకుని మృత శరీరంలో ప్రవేశిస్తావు. నీ కిష్టమైన సుందర యౌవనవతితో మూడు రోజులు శృంగారక్రీడలలో మునిగి ఉంటావు. ఆ సమయంలో నీ శత్రువుల అనుచరుడొకడు నీ అసలు శరీరంలో ప్రవేశించి తానే శ్రీనాధునిగా నటిస్తూ ఆంధ్ర దేశానికి వెళ్ళిపోతాడు. నీవు మూడురోజుల తర్వాత చూస్తే నీ శరీరం దొరకదు. ఆ యువకుని శరీరంలోనే ఉండిపోవలసివస్తుంది. నిస్సహాయ స్థితిలో ఉన్న నీ మాటలను ఎవరూ నమ్మరు. ఆ ప్రాంతంలో ఆంతకుముందు నిన్ను ఆదరించిన రాజుతో చెప్పుకొన్నా అతడు విశ్వసించడు. ఆంధ్రదేశానికి వెళ్ళి నిరూపించుకొందామని నీవు చేసే ప్రయత్నం విఫలమవుతుంది. విషప్రయోగంతో నీవు హత్యచేయబడతావు. ఇప్పటికి తెలుస్తున్న విషయాలివి. నీవు రక్షించమని ప్రార్థిస్తున్నావు. కాని అప్పటికి నేనెక్కడ ఉంటానో బహుశా నీ హత్యా సమయానికి నేనీ శరీరంతో ఉండక పోవచ్చు. అయితే ఎక్కడ ఉన్నా నీ విషయంలో శ్రద్ధ వహిస్తాను. జగన్మాతకు నివేదించి నిన్ను రక్షించడానికి ప్రయత్నిస్తాను. శుభం భవతు "అని వీడ్కోలు పల్కి కాళీయోగి కళింగ సీమలో ప్రవేశించాడు.

అప్పటికి విగ్రహం పెరిగి పెద్దదయింది. ఒరిస్సాలోని భువనేశ్వర్‌కు దగ్గర ఉన్న ఒక అరణ్యంలో ఆశ్రమం నిర్మించుకొని భక్తుల సహకారంతో కాళీదేవికి ఆలయం నిర్మించాడు. కాళి అనుగ్రహం వల్ల ముసలితనం ఎక్కువ ఇబ్బంది పెట్టకపోయినా శరీర పతనం తప్పలేదు. దానికి కొద్ది కాలం ముందే

భైరవీబ్రాహ్మణి ఒకరు శిష్యురాలుగా చేరింది. ఆమె తాంత్రికసాధనలో ప్రవీణురాలు. ఎందరి చేతనో ఆ సాధనలు చేయించి కొన్ని సిద్ధశక్తులు వచ్చేలా చేయగలిగింది. ఆమె వద్ద ఆ సాధనలలో కృషి చేసిన వారిలో రామకృష్ణపరమహంస ఒకరు. ఆ భైరవి కాళీపూజ శ్రద్ధాభక్తులతో చేస్తున్నది. మరికొందరు శిష్యులు కూడా ఉన్నారు. వారికి ఆలయాన్ని అప్పగించి కాళీయోగి ప్రాణములు వదిలాడు.

ఆ తరువాత కొంతకాలానికి ఆంధ్రదేశంలో విజయనగరంలో శ్రీపాదవంశంలో జన్మించటం జరిగింది. (ఇటీవలి గొప్పసంగీత విద్వాంసుడు శ్రీపాద పినాకపాణికి నాలుగుతరాల ముందు) పెరిగిపెద్దవాడై దక్షిణదేశ తీర్థయాత్రలు చేస్తూ కంచిలోని కామాక్షీ దర్శనం చేసి ఆమెను గూర్చి అక్కడే చాలాకాలం మంత్రజపహోమదీక్షలు చేసి కామాక్షీదేవి దర్శనం – అనుగ్రహం పొందాడు. తరువాత ఒక కొండమీది దేవాలయంలో తీవ్రసాధన జరిగింది. పూర్వజన్మస్ఫురణ – శక్తి సమాగమనం జరిగింది. అయినా కంచి ప్రధానదీక్షా కేంద్రంగా భావనలో నిలచింది. మహిమాన్వితుడై ప్రకాశించటం వల్ల అందరూ పరమాత్మ స్వామి అని పిలిచేవారు. స్వస్థలమైన విజయనగరంలో ఒక యిల్లు ఉండేది. అక్కడ అప్పుడప్పుడు నివసించేవాడు. ఆ యింటిపై ఒకసారి దొంగలు దాడిచేస్తే వాళ్ళ నెదిరించి పారద్రోలిన భక్తులిద్దరు ఇటీవల శిష్యులై మంచి సాధన చేస్తున్నారు. అందులో ఒకరు పోలీసు శాఖలో అత్యున్నత పదవి నలంకరించాడు.

కాశీలో ఉండగా పూర్వజన్మ శిష్యురాలైన భైరవీ బ్రాహ్మణి వచ్చి దర్శించి స్వామి అనుగ్రహం వల్ల స్ఫురణ పొందింది. ఆంధ్రదేశం నుండి వచ్చిన పోతరాజు రామకవి అనే గొప్ప శివభక్తుడు స్వామిని చూచి ఏదో జన్మాంతర బంధ ప్రేరణ వల్ల ఇతడు తన వంశంలో పుట్టాలని భైరవుని ప్రార్థించాడు. ఆ ప్రార్థన ఫలించింది.

ఎక్కడ తిరిగినా భువనేశ్వరి లోని కాళీమందిరానికి వెళ్ళి అక్కడ కొంతకాలం గడిపేవాడు. అక్కడ కొందరు తాంత్రికులు కలవటం వల్ల వామాచార సాధనలు శ్మశాన సాధనలు చేసి కాళి కృపను వేగంగా పొందటం జరిగింది. ఆనాటి

తోటి సాధకులలో ఒకరు లీలానంద ఠాకూర్ అనే బెత్తరాహుడు. అతడు కళింగా శ్రమంనుండి తనస్వస్థలం వెళ్ళి అక్కడ నుండి బృందావనం చేరి రాధాకృష్ణ భక్తుడై జీవితాన్ని చరితార్థం చేసుకొన్నాడు. అక్కడ అతనిని ఇబ్బంది పెట్టిన దుష్టులనుండి కాళీదేవి రక్షించింది. అతని కోర్కె ప్రకారం అతడు మరణించిన తర్వాత అతని సమాధి మీద కాళీ విగ్రహాన్ని స్థాపించా రతని శిష్యులు. ఈనాడు బృందావనంలో పాగల్ బాబా మందిరం సుప్రసిద్ధమైనది. తోటి సాధకులలో మరొక వ్యక్తి తరువాతి జన్మలో అద్దంకి కృష్ణమూర్తి అన్న పేరుతో విఖ్యాతుడైన మాంత్రికుడు. అప్పుడొక యాత్రలో మౌనస్వామి కలిసి కుర్తాళానికి ఆహ్వానించాడు. ఆనా డది సమకూడలేదు దాని ఫలితంగా తర్వాత జన్మలో మౌనస్వామిపీఠానికి ఆధిపత్యం స్వీకరించవలసివచ్చింది.

ఈ విధంగా ఆటుపోటులతో సుఖదుఃఖాలతో ఆ జీవితం సుమారు ఒక శతాబ్దం కొనసాగి మృత్యుకుహరంలోకి వెళ్ళి పోయింది. అనంతరం వచ్చిన ఇప్పటి జన్మ ఆంధ్రదేశంలో సంభవించింది. అనంత కాలంలోకి చొచ్చుకొనిపోయే దేవతల దృష్టి అపారమైనది. ఖండకాలానికి పరిమితం కాని వారి ప్రణాళికలు అందరికీ అర్థంకావు. అర్థమైన సిద్ధయోగులు దాదాపు పదిమంది తెలుగు దేశంలో పుట్టారు. కొందరు కాస్త ముందు – వెనకా – కొందరు సమకాలికులు. సింధువులో బిందువులు – మహాగ్ని కుండంలోని విస్ఫులింగాలు – పరమేశ్వరుడనే సూర్యబింబం నుండి బయలుదేరిన ఒక్కొక్క కిరణం వంటివారు. ఎవరి నిర్దిష్ట కార్యక్రమాన్ని వారు చేస్తూ – మధ్య మధ్యలో కలుస్తూ విడిపోతూ ఉంటారు.

## కాళీసాధన

ఇప్పుడు గుంటూరులోని స్వయంసిద్ధకాళీ పీఠంలో అర్చిస్తున్న కాళీవిగ్రహం విషయం నాకు తెలియటానికి కొంత సమయం పట్టింది. ఒకరోజు ధ్యానంలో విశిష్టమైన అనుభూతి కల్గింది. నేను ఎక్కడో అడవిలో వెడుతున్నాను. నాతో మరికొందరు ప్రయాణీకులు ఉన్నారు. ఆ రాత్రి విశ్రమించి ప్రొద్దున లేచేసరికి ఎవ్వరూ లేరు. ఒక్కడినే ముందుకు వెడుతున్నాను అడవిలో కన్పించిన దోవలో ముందుకు పోతున్నాను. ఒక ఆశ్రమం వచ్చింది. చామనచాయతో బలంగా ఉన్న ఒక దీర్ఘదేహుడు విరబోసిన జుట్టు గడ్డము కలవాడు నాకు స్వాగతం చెప్పాడు. కఠిన తపస్సు చేత ఆయువును పెంపొందించుకొన్న ఆ మధ్య వయస్కుడు

"ఆర్యా ! నేను మీ శిష్యపరంపరలోని వాడిని. ఈ కాళీదేవతను చాలా సంవత్సరాల నుండి నేను పూజిస్తున్నాను. నా వయస్సు ఇప్పుడు 160 సంవత్సరములు. హిమాలయాలకు వెళ్ళాలని అనిపిస్తున్నది. మీ ఆజ్ఞకోసం వేచిఉన్నాను అన్నాడు. అతని తండ్రి కూడా అక్కడ ఉన్నాడు. కొంచెం పొట్టిగా బంగారురంగుతో ఉన్న ఆ వృద్ధుని వయస్సు 300 సంవత్సరాలు. అతడు ఇలా అన్నాడు. "సిద్దేశ్వరా ! జన్మ మారటం వల్ల ఈ విషయాలన్నీ మీ స్మృతికి రావటానికి కొంత సమయం పడుతున్నది. మా కుమారుడు మీకు ఇక్కడి విషయాలు చెప్పాడు. నేనూ మీ పూర్వపరిచితుడనే గురుకృప వల్ల నాకు దివ్యత్వం లభించింది. నా శరీరం కూడా సువర్ణచ్ఛాయకు మారిపోయింది. నా కుమారుడుకూడా అలా కావాలని నా వాంఛ. వాడు ఈ సాధన పూర్తిచేయడం కోసం హిమాలయాలకు వెళ్ళవలసి ఉన్నది. అందువల్ల ఈ కాళీవిగ్రహాన్ని మీకు మళ్ళీ అప్పగిస్తున్నాము".

ఆ దర్శనం జరిగిన కొద్ది రోజులకు వారు సంకల్పించిన సిద్ధసహకారం వల్ల కాళీ విగ్రహం గుంటూరులోని మా ఆశ్రమంలో ప్రత్యక్షమయింది. దానికి ఆలయం కట్టించి పూజలు చేయటం జరుగుతున్నది. అక్కడ ఒక హోమకుండాన్ని అమ్మవారి ఎదురుగా ఏర్పాటు చేసి దానిలో నిత్యమూ హోమములు జరిగేటట్లుగా ఏర్పాటు చేశాను.

ఇక్కడ నుండి సిద్ధేశ్వరానందభారతీస్వామి జీవితగాథలు. అవి వేరే గ్రంథంలో వస్తవి. ఇప్పుడు నడుస్తున్న చరిత్ర జైగీషవ్యుని నుండి ఇప్పటి జన్మకు ముందున్న విశేషాల వరకు - ఈ విభాగంలో ఇవ్వబడినవి.

# 5. అంగిరసుడు

సృష్టికర్తయైన బ్రహ్మసృష్టిని పెంపొందించటానికి మొదట ప్రజాపతులను సృష్టించాడు. ముఖము నుండి పుట్టినవాడు అంగిరసుడు. అంగిరసుడు మొదలైన తొమ్మిదిమంది ఋషులు బ్రహ్మచే నియోగించబడి అసంఖ్యాక ప్రజాసృష్టికి కారణమైనాడు.

1) మరీచి 2) అత్రి 3) అంగీరసుడు 4) పులహుడు 5) పులస్త్యుడు 6) క్రతువు 7) భృగువు 8) వసిష్ఠుడు 9) అథర్వుడు – వీరికి నవబ్రహ్మలని పేరు వచ్చింది.

భారతము ప్రకారము అంగిరసుడు బ్రహ్మవదన సంజాతుడు. ఐతరేయ బ్రాహ్మణము ప్రకారము బ్రహ్మ తన పుత్రికయైన సరస్వతితో మోహవశుడై క్రీడింపగా పతనమైన వీర్యమును దేవతల ప్రార్థనపై అగ్ని ధరించాడు. ఆయన అంగారముల నుండి పుట్టినవాడే అంగిరసుడు. శతపథ బ్రాహ్మణములో కూడా ఇలానే ఉంది. గోపథబ్రాహ్మణములో తపస్సు చేస్తున్న వరుణుని శరీరము నుండి వేడిచే పుట్టిన శ్రమజలము. దివ్యరసము కాగా దానినుండి పుట్టినవాడు అంగిరసుడు – అంగ – అంగి – రసము – అంగిరసుడు.

ఇతడు చిన్న తనములోనే కఠోరమైన తపస్సు చేసి దివ్యశక్తులు సాధించాడు. కర్దమప్రజాపతికూతురైన శ్రద్ధను వివాహమాడి గార్హస్థ్య ధర్మాన్ని నిర్వర్తిస్తూ ఋషులతో అగ్రగణ్యునిగా ప్రకాశిస్తున్నాడు. ఉతథ్యుడు, బృహస్పతి, సంవర్తుడు మొదలైన ఏడుగురు కుమారులను, భానుమతి, రాక, సినివాలి మొదలైన ఏడుగురు కుమార్తెలను కన్నాడు. ఈయన వంశంలో బృహస్పతి, ఆయాస్యుడు, ఘోరుడు, కుత్సుడు, విరూపుడు మొదలగువారు ప్రసిద్ధులు.

పూర్వం అగ్నిహోత్రునకు దేవతలపై కోపం వచ్చి ఎవరికి కనపడకుండా వెళ్ళిపోయి ఎక్కడో అడవిలో తపస్సు చేస్తున్నాడు. అగ్ని లేక కర్మలన్నీ ఆగిపోయినవి. దేవతలు నిస్సహాయులై బ్రహ్మదేవుని దగ్గరకు వెళ్ళి ప్రార్థించారు. విధాత ఆలోచించి అంగిరసుని అగ్నిస్థానంలో నియమించాడు. తపోబల సంపన్నుడైన అంగిరసుడు

యజ్ఞములలో వేయబడే ఆహుతులను హవ్యవాహనుడై దేవతలకిస్తూ వారికి సంతోషాన్ని కలిగించాడు. అంతేకాక వారికి కావలసిన అన్ని సహాయాలు చేసేవాడు. మహామంత్రవేత్త కావటం వల్ల దేవతల శత్రువులు బలవంతులై వారికి అవధ్యులై బాధిస్తుంటే ఆధర్వణ ప్రయోగహోమములు చేసి కృత్యలను పుట్టించి వానిని వైరి మారణానికి నియోగించేవాడు. అంతటి మాంత్రికుడు మరొకడు లేడని ఆ కాలంలో అంగిరసునకు పేరు వచ్చింది.

ఇలా జరుగుతుంటే అసలు అగ్నిదేవుడు ఈ విషయం విని తననెవరూ పట్టించుకొనేవారు లేరని గ్రహించి తన పూర్వస్థానానికి వచ్చాడు. కాని ఆస్థానంలో అపరిమిత తేజస్సుతో దుర్నిరీక్షుడై ప్రకాశిస్తున్న అంగిరసుని చూచి భయపడి తిరిగి అడవులకు వెళ్ళిపోదామని వెనుదిరిగాడు. కాని అంగిరసుడు చూచి అగ్నికి నమస్కరించి "మహానుభావా ! నీవు లేకపోవటం వల్ల బ్రహ్మ ఆజ్ఞచే నేనీపని చేస్తున్నాను. నీ స్థానాన్ని నీవు పరిగ్రహించవలసినది" అని భక్తితో ప్రార్థించాడు. అగ్నిదేవుడు ఊహించని ఈ వినయానికి ముగ్ధుడై "మహర్షీ! నీవు తపస్సులో, తేజస్సులో నాకంటె అధికుడవు. నేనూ ఒకప్పుడు తపస్సు చేసి ఈ స్థానానికి వచ్చినవాడనే. అయితే నీవింత మంచివాడవు. నీమాటకాదనలేను. అయితే నీవు ప్రధమాగ్నిగా ఉండు. నేను ద్వితీయాగ్నిగా ఉంటాను" అన్నాడు. కానీ అంగిరసుడు "అగ్నిదేవా! అలా కాదు. నీవు పెద్దవాడవు. నీవే ప్రధమాగ్నిగా ఉండు. నేనే ద్వితీయాగ్నిగా ఉంటాను" అని బ్రతిమలాడి ఒప్పించాడు. అప్పుడగ్నిదేవుడు పొంగిపోయి "నీవు ద్వితీయాగ్నిగా ఉండటమే కాదు. నీ కుమారుడు బృహస్పతిని తృతీయాగ్నిగా ఉంచుదా"మని అన్నాడు.

కశ్యపమహర్షివల్ల సమస్తతీర్థప్రభావము విని తీర్థయాత్ర చేసి తాను మళ్ళీ గౌతమఋషికి ఆయా విశేషాలన్నీ బోధించాడు. అలానే శౌనకమహర్షికి పరమగుహ్యమైన బ్రహ్మవిద్యావిశేషాలను, ఔపనిషదతత్వాన్ని బోధించాడు. ఆ బోధనలే ముండకోపనిషత్తులో ప్రతిపాదితమైనవి. లోకంలో ఎలా ఉండాలి? ఆచారములు - అనాచారములు - ఆశ్రమ ధర్మాలు, పుణ్యాపాపాలు - ఇవీనీన ప్రజలకు తెలియజేయటం కోసం స్మృతిరచన చేశాడు. అది ఇప్పుడు ఉపలభ్యం

కావటం లేదు. అయితే విశ్వరూపుడు మొదలైన ధర్మశాస్త్ర వ్యాఖ్యాతల గ్రంథాలలో అంగిరసస్మృతిలోని విశేషాలు కనిపిస్తున్నవి.

యజ్ఞములలో అంగిరసుల పాత్ర ప్రధానము. మొదట అరణిని మధించి అగ్నిని పుట్టించినవారు వీరే. ఇతర ఋషుల కంటె దేవతలతో వీరికి మైత్రి యెక్కువ. ఇంద్రునికి పట్టాభిషేకం జరిగినప్పుడు వీరే దివ్యసింహాసనాన్ని పంపించారు. స్వర్గానికి వారు మంత్రశక్తితో వెళుతుంటే కొందరు రాక్షసులు వారితో వెళటానికి ప్రయత్నించారు. హరివర్ణ సామమంత్ర పఠనంతో ఆ శబ్దముల నుండి పుట్టినశక్తికి రాక్షసులు భయపడి వెనక్కు వెళ్ళిపోయారు.

యజ్ఞాలలో - అగ్నిష్టోమం చేస్తూ కొద్దిపాటి మాత్రమే త్రాగుతూ ఉండటం వల్ల అంగిరసులకు ఒకసారి నీరసం వచ్చింది. అప్పుడు వారు మేఖల ధరిస్తే బలం వచ్చింది. అప్పటి నుండి యజ్వులు మేఖల ధరించే ఆచారం వచ్చిందని శతపథ బ్రాహ్మణము చెపుతున్నది.

మహారాజులు అశ్వమేథ యాగాలు చేసేటప్పుడు అంగిరసులు అధర్వవేదం పారాయణం చేసేవారు. అందలి మంత్రములు వారికి సిద్ధించి ఉండటం వల్ల వారి పారాయణం శక్తి సంయుతమై యజ్ఞవిఘ్నములను తొలగించి పరిపూర్ణతను, విజయాన్ని ప్రసాదించేది. అందుచేత అధర్వవేదానికి అంగిరోవేదమని పేరు వచ్చింది.

ఉపనిషత్తులలో అంగిరసులు బ్రహ్మావిద్యా వేత్తలుగా, తత్త్వప్రబోధకులుగా పేరు గాంచారు. వారిలో ఘోరాంగిరసుడు శ్రీకృష్ణునకు ఆత్మతత్వాన్ని బోధించాడు. మధువిద్యాబోధకుడైన గౌతముడు, అతిదీర్ఘతపస్సు చేసి సూర్యుని అనుగ్రహం పొందిన భరద్వాజుడు - అలానే అగ్నివేశ్యుడు, ఆయాస్యుడు మొదలగువారు ఈ గోత్రంలో సుప్రఖ్యాతులు. ప్రాణవాయువును ఉద్గీథరూపంలో ఉపాసించటం వల్ల అంగిరసునకు ఉద్గీథుడన్న పేరు కూడా వచ్చింది. ఆ మహర్షి బ్రహ్మజ్ఞాని, త్రికాలవేత్త - వేదాంత విజ్ఞాన సునిశ్చితార్థుడు. అయినా ధర్మరక్షణ కోసం కృత్యా ప్రయోగాలు చేశాడు. దుష్ట సంహారం చేశాడు. ప్రత్యంగిరా ఋక్కులు ఆ

మహర్షి దర్శనములే. అధర్వణ వేదంలో ఆయన వంశీయుడైన పిప్పలాదునిశాఖలో ఇవి శత్రు సంహారవిద్యలుగా ప్రచారంలో ఉన్నవి. ప్రత్యంగిర ఎంత భయంకర విద్య అంటే – ప్రత్యంగిర చేసేవాడి పంచన ఉండకూడదన్న మాట లోకంలో పుట్టింది. ఎక్కడో హిమాలయాలలో పుట్టిన విద్యలైనా దక్షిణ భారతంలో ముఖ్యంగా తమిళనాడులో ప్రస్తుతం ఆంధ్రప్రదేశ్‌లో కూడా ప్రచారంలోకి వచ్చినవి. కుంభకోణంలో అయ్యావరం అనే పట్టణంలోని మహాప్రత్యంగిర ఆలయం ప్రసిద్ధమైనది. ఇంకా ఎన్నో పట్టణాలలో ఇప్పుడు ప్రత్యంగిర గుడులు వచ్చినవి. మా పూర్వస్వామి కుర్తాళంలో పాతాళ ప్రత్యంగిరను స్థాపించారు. గుంటూరులో, విశాఖపట్టణంలో పాతాళ ప్రత్యంగిరా మందిరాలు మా పీఠములలో వచ్చినవి. విజయవాడలోను, హైదాబాదులోను మా పీఠ విభాగాలలో ప్రత్యంగిర పూజలందు కొంటున్నది. శత్రువినాశనానికి, కష్టనివారణకు, ఇవాళ పెద్ద యెత్తున ప్రత్యంగిరా హోమాలు జరుగుతున్నవి. ప్రత్యంగిరా మంత్రోపదేశాలు పొంది సాధన చేసేవాళ్ళ సంఖ్య బాగా పెరుగుతున్నది.

దీనికంతటికి మూలం అంగిరసుని మహత్వం. ఆయన వల్ల ఆయన వంశీయులే కాక భృగువంశీయులు, అత్రివంశజులు, వాసిష్ఠులు మొదలైన వారందరూ ఈ విద్యను ఉపయోగించుకొన్నారు. అత్యంతశక్తి సంపన్నమైన ఈ విద్య గురించి ఇటీవల ఒక గ్రంథం రచించాను. దానిలోని ప్రధానమైన భాగం – అంగిరసుడు దర్శించిన ఋక్కులను ఇక్కడ అందిస్తున్నాను. 45 ఋక్కులు – 15 అధికపాఠాలు.

## అధర్వణ వేదంలోని ప్రత్యంగిరా ఋక్కులు

1) యాం కల్పయంతి నోరయః క్రూరాం కృత్యాం వధూమివ
తాం బ్రహ్మణాపనిర్ణుద్మః ప్రత్యక్ కర్తార మృచ్ఛతు

నా శత్రువులు స్త్రీ రూపముగా నున్న క్రూరమైన కృత్యగా దేనిని కల్పించినారో ఈ వేదమంత్ర శక్తి చేత దానిని వేరొక చోటికి ప్రేరేపించుము (వేరు మార్గము లేనిచో) వెనుకకు తిరిగి అది కర్తనే పొందును గాక!

2) శీర్షణ్వతీం కర్ణవతీం విషరూపాం భయంకరీం
యః ప్రాహిణో దిహోద్య త్వాం వితంత్వం యోజ యాసుభిః

భీషణమైన స్థూలశిరస్సుతో పెద్ద చెవులతో విషమరూపముతో భయంకరివైన నిన్ను ఎవడు పంపినాడో వాని ప్రాణములను నీవు నాశనము చేయుము.

3) యేన దిష్టేహ వహసి ప్రతికూల మఘాయిని
తమే వేతో నివర్త్యేష మాస్మాన్ ఋచ్ఛే అనాగసః

పాపమును చేయుదానా! ఎవనిచేత నీవు పుట్టించబడి, విడిచి పెట్టబడి, ప్రతికూలముగా వచ్చినావో ఇక్కడనుండి తిరిగివెళ్ళి వానినే దహించుము. పాపరహితులమైన మా దగ్గరకు రావద్దు.

4) అభివర్తస్వ కర్తారం నిరస్తా స్మాభి రోజసా
ఆయురస్య నికృంతస్వ ప్రజాంచ పురుషాదిని

మా మంత్ర ప్రభావముచేత అన్యత్ర ప్రేరితవై ప్రయోగించిన వాని కభిముఖముగా వెళ్ళుము. వాని ఆయువును ఛేదించుము. మనుష్యులను తినుదానా! వాని సంతానమును నాశనము చేయుము.

5) **యస్త్వా కృత్యే ! చకారేహ తం త్వం గచ్ఛ పునర్నవే !**
**అరాతీన్ కృత్యే! నాశయ సర్వాంశ్చ యాతుధాన్యః**

ఓ కృత్యా! ఎవడు నిన్నిటులు చేసి ఇక్కడకు పంపినాడో నీవు మరల క్రొత్త దానివై వానిమీదికే వెళ్ళుము.నా శత్రువులను, సమస్త రాక్షసులను కూడా నాశనము చేయుము.

6) **క్షిప్రం కృత్యే! నివర్తస్వ కర్తురేవ గృహం ప్రతి**
**పశూం శ్చైవాస్య నాశయ వీరాం శ్చాస్య నిబర్హయ**

ఓ కృత్యా! నిన్ను సృష్టించినవారి యింటికే తిరిగి శీఘ్రముగా వెళ్ళుము. వాని పశువులను, పుత్రులను మారణము చేయుము.

7) **యస్త్వా కృత్యే ప్రజిఘాయ విద్వాన్ అవిదుషో గృహాన్**
**తస్యై వేతః పరేత్యాశు తనుం కృంధి పరుష్పరుః**

కృత్యోత్పాదన సమర్థుడైన ఎవడు నిన్ను అజ్ఞానినైన నాయింటిమీదకు పంపినాడో ఓ కృత్యా! నీవు వాని మీదకే పోయి వాని శరీరములోని అంగమంగమును ఛేదింపుము.

8) **ప్రతీచీం త్వాపసేధతు బ్రహ్మ రోచి ష్ణమిత్రహా**
**అగ్నిశ్చ కృత్యే! రక్షోహా రిప్రహా చాజ ఏకపాత్**

ఓ కృత్యా! నా కభిముఖముగా వచ్చు నిన్ను వేద మంత్రముచే ప్రకాశించువాడు, శత్రువులను చంపువాడు, రాక్షసహంత, అజుడు, ఏకపాదుడు నైన అగ్ని త్రిప్పిపంపును గాక!

9) **యథా త్వాంగిరసః పూర్వే భృగవ శ్చాప సేధిరే**
**అత్రయశ్చ వసిష్ఠాశ్చ తథైవ త్వాప సేధిమ**

పూర్వము అంగిరసులు, భార్గవులు, ఆత్రేయులు, వాసిష్ఠులు ఏవిధముగా నిన్ను తిప్పిపంపినారో మేము కూడా అట్లే నిన్ను అన్యత్ర పంపెదము.

10) యస్తే పరూంషి సందధౌ రథస్యేవ విభు ర్ధియా

తం గచ్ఛ తత్ర తే జనః అజ్ఞాత స్తే అయం జనః

నిన్ను పుట్టించిన ఎవడు అవయవములతో - భాగములతో - రథమును పంపినట్లు నిన్ను ఇక్కడకు తోలినాడో అక్కడకే వానిమీదకే పొమ్ము, వాడెవడో తెలియవలసిన పనిలేదు.

11) యో నః కృత్యే! రణస్థో వా కశ్చి ద్వాన్యో భి హింసతి

తస్య త్వం ద్రో రివేద్ధోగ్నిః తనూం ఋచ్ఛస్వ హేళితా

ఓ కృత్యా! నిన్ను ఉత్పాదించినయెవడు రణస్థుడు గాని ఇతరుడు గాని నన్ను హింసించునో చెట్టునందు రగిల్చబడిన అగ్నివలె అత్యంత క్రోధముతో వాని శరీరములోనికి పొమ్ము.

12) భవా శర్వా దేవహేళి మస్య తం పాపకృత్వనే

హరస్వతీ త్వంచ కృత్యే! మోచ్ఛిష స్తస్య కించన

ఓ కృత్యా! దేవ క్రోధియై నాయందు పాపమును చేయు వానిని హింసించు దానవు కమ్ము! క్రోధవతివై వానిని కొంచెముకూడా మిగిల్చక దహించుము.

13) యో నః కశ్చి ద్ద్రుహోరాతిః మనసా హ్యభిదాసతి

దూరస్థో వాంతికస్థో వా తస్య హృద్య మస్ను క్పిబ

ఏ శత్రువు ద్రోహబుద్ధితో నాకు హింసను తలపెట్టినాడో వాడెవడైనను దగ్గర ఉన్నను లేక ఎంత దూరమున నున్నను వాని గుండె నెత్తురు త్రాగుము.

14) యేనాసి కృత్యే! ప్రహితా ధూ ర్ధియాస్మ జ్జిఘాంసయా

తస్య వ్యనచ్చావ్యనచ్ఛ హినస్తు హరసా శనిః

ఓ కృత్యా! నన్ను చంపుటకు ఎవడు నిన్ను పంపించాడో వానిని వాని యింటిలోని వారిని విచక్షణ లేకుండా పిడుగువలె దహింపుము.

**15)** యే నో శివానః పంథానః పరా యాంతి పరావతం
లై ర్దేవి రాత్ర్యాః కృత్యానో గమయ స్వానుకృంతయే

ఏవి అశివములైన మార్గములలో (పర ప్రేషిత కృత్యలు) మమ్ముగూర్చి వచ్చు చున్నవో ఆ మార్గములలోనే రాత్రి సంబంధములగు కృత్యలను మా కొరకు ఉచ్ఛేదనము చేయుము. ఖండింపుము.

**16)** య ద్యుపైషి ద్విప ద్యస్మాన్ యదివైషి చతుష్పదీ
నిరస్తేతో ప్రజాస్మాభిః కర్తు రష్టాపదీ గృహాన్

మా పైకి నీవు ద్విపదివై - రెండు కాళ్ళు గల రూపముతో వచ్చు చున్నావో లేక చతుష్పదివై - నాలుగు కాళ్ళుగల ఆకృతితో వచ్చు చున్నావో - ఏమైనా మాచేత తిరస్కరించబడి ఇక్కడనుండి అష్టాపదివై ఎనిమిది కాళ్ళ భీషణ రూపముతో కర్తయొక్క గృహమునకు శీఘ్రముగా పొమ్ము.

**17)** యో న శ్శపా దశపతో యశ్చన శ్శపత శ్శపాత్
వృక్షమివ విద్యుదాశు తమామూలా దనుశోషయ

ఎవడు శపించని మమ్ము శపించుచున్నాడో, ఎవడు మమ్ము దూషించుచు శపించుచున్నాడో వానిని, పిడుగు చెట్టును ఆమూలముగా దహించునట్లు దహింపుము.

**18)** యం ద్విష్మో యశ్చ నో ద్వేష్టి అఘాయు ర్యశ్చ నశ్శపాత్
శునే పైష్టమివ క్షామం తం ప్రత్యస్యస్వ మృత్యవే

ఎవనిని మేము ద్వేషించు చున్నామో, ఎవడు మమ్ము ద్వేషించు చున్నాడో, ఎవడు మమ్ము పాపాత్ముడై శపించు చున్నాడో కుక్కకు భక్ష్యమును పడవేసినట్లుగా వానిని మృత్యువునకు పడవేయుము.

**19)** యశ్చ సాపత్న శ్శపథో యశ్చ జామీ శపాతి నః
బ్రహ్మాచ యత్ క్రుద్ధ శ్శపాత్ సర్వం తత్ కృుంధ్యధస్పదం

నా తల్లి సవతి కొడుకులుగాని, నా భగిని-సోదరలుగాని, లేక నాయందు కోపించిన బ్రాహ్మణుడుగాని ఎవరు నన్ను శపించినను ఆ శాపము నన్నంటకుండా నాశనము కావింపుము.

20) సబంధు శ్చాసబంధుశ్చ యో అస్మాన్ అభిదాసతి
తస్య త్వం భింధ్యధిష్ఠాయ పదా విస్ఫూర్య తచ్ఛిరః

సహోపనయన, సహాధ్యయనాది సంబంధములు కలవాడు గాని, అనగా చుట్టములతో కూడిగాని, కూడకగాని, ఎవడు మా నాశనము కోరుచున్నాడో వాని గుండెపై కాలుపెట్టి తల పగులగొట్టుము.

21) అభిప్రేహి సహస్రాక్షం యుక్త్వాశు శపథం రథే
శత్రూ నన్విచ్ఛతీ కృత్యే! వృకీ వావివతో గృహాన్

బహు చక్రములు గల రథము నెక్కి శత్రువుల నన్వేషించుచున్న కృత్యా! తోడేలు గొర్రెల శాలలో ప్రవేశించి వానిని చంపినట్లు వేగముగా పరకృతమును నాశనము చేయుము.

22) పరిణో వృఙ్ధి శపథాన్ దహ న్నగ్ని రివ హ్రదం
శత్రూ న్నేవాభితో జహి దివ్యా వృక్షమి వాశనిః

అడవిని దహించు కార్చిచ్చు మధ్యలోని కొలనును ఏవిధముగా వర్జించునో అటులే శత్రువులు నాకు చేయు పావ కార్యములు నన్నంటకుండా చేసి ఆకాశమునుండి పడిన పిడుగు, చెట్టు నెట్లు దహించునో నా శత్రువుల నట్లే చంపివేయుము.

23) శత్రూన్ మే ప్రోథ శపథాన్ కృత్యాశ్చ సుహృదో ఽసుహృాన్
జిహ్మో శ్మక్ష్ణాశ్చ దుర్హృదః సమిద్ధం జాత వేదసం

నా శత్రువులను వారి శాపములను వారి కృత్యలను, వారి మిత్రులను ప్రాణహరణముచేసి తాడింపుము. కుటిలులై పైకి మెత్తగా కనిపించు ఆదుష్టచిత్తులందరిపైన మండే నిప్పవేసి తగులపెట్టుము.

24) అనపత్యం పురస్తాన్నః శివం దక్షిణత స్కృధి
అభయం సతతం పశ్చాత్ భద్ర ముత్తరతో గృహే

మా యింటికి తూర్పున శత్రువులు లేకుందురుగాక! దక్షిణమున శుభమును చేయుము. ఎప్పుడును పడమట భయము లేకుండును గాక! అటులే ఉత్తరమున భద్రస్థితి ఉండును గాక!

25) పరేహి కృత్యే మాతిష్ఠ విద్ధస్యేవ పదం నయ
మృగస్య హి మృగారిః ప్రణత్వా నిష్కర్తు మర్హతి

పరులు పంపిన కృత్యా! ఇక్కడ క్షణముకూడ నిలువవద్దు. బాణముచే కొట్టబడిన జంతువునుండి కారు నెత్తురును బట్టి వేటకాడు ఏ విధముగా దానిని గుర్తించునో అటులే మంత్రబలముచే శక్తులమైన మాకు నమస్కరించి పంపినవాని మీదికే వెళ్ళుము.

26) అభ్యక్తాక్తా స్వలంకృతా సర్వం నో దురితం వహ
జానీథా శ్చైవ కృత్యానాం కర్తౄన్ నౄన్ పాపచేతసః

సుగంధ తైలాదుల అనులేపనము గలిగి అంజనాదులచే అలంకరింప బడిన దానా! నాయందు చేయబడిన పాపకార్యమును అన్యత్ర పొందింపుము. మాపైకి కృత్యలను పంపించిన మనుష్యులను (పాముజాడ పాముకు తెలిసినట్లు) నీ వెరుగుదువు. (ఇక్కడ వహ బదులు దహ అను పాఠాంతరము కలదు. పాపిని దహించు అని దానికి అర్థము చెప్పాలి.)

27) యథా హంతి పురాసీనం తథైవే ష్వాశుక్ర న్నరః
తథా త్వయా యుజా వయం నికృద్మ స్థాస్ను జంగమం

శత్రువు తనపైకి వదలిన బాణమును లేక ఆయుధమును హస్తలాఘవము కలవాడేవిధముగా పట్టుకొని శత్రువుపైకి విసరునో అదేవిధముగా నీసహాకారముచేత మాపైకి వచ్చిన దానిని త్రిప్పివేసి వైరుల స్థావర జంగమ పరివారమును నాశనము చేసెదము.

28) ఉత్తి ష్ఠైవ పరే హీతో అజ్ఞాతే కిమిహేచ్ఛసి
గ్రీవాస్తే కృత్యే పాదౌ చాభికృత్స్యామి విద్రవ

ఓ కృత్యా! వెంటనే ఇక్కడనుండి పరాభవముతో లేచిపొమ్ము! నా సంగతి నీకు తెలియదు. నాప్రభావము నీవెరుగవు. నీవేమి చేయవలెనని కోరుచున్నావు? ఇంత చెప్పినా పోకపోతే నీగొంతు కోసెదను. నీకాళ్ళు నరికెదను. ఇతర అవయవములను ఛేదించెదను. వెంటనే పరుగెత్తి పొమ్ము.

29) స్వాయసా స్సంతి నో ఉసయో విద్మచైవ పరూంషితే
తైస్తై ర్నికృధ్మ స్తాన్యుగ్రే యది నో జీవయ స్యరీన్

ఓ భీషణీ! క్రోధ రూపిణీ! నీమర్మములు, వర్ధతలు, శస్త్రములు, మేమెరుగుదుము. మాకును సుతీక్షణములైన ఇనుప కత్తులున్నవి. నీవు వెనుకకు వెళ్ళి మా శత్రువులను చంపక ప్రాణములతో ఉంచినచో ఆయా ఆయుధములతో నీ అవయవములను ఛేదించెదము.

30) మాస్యోచ్ఛిషో ద్విపదం మోత కించి చ్చతుష్పదం
మాజ్ఞాతీ ననుజాన్ పూర్వాన్ మావేశి ప్రతివేశినౌ

నా శత్రువు యొక్క యింటిలోని పురుషులను, స్త్రీలను, జంతువులను, జ్ఞాతులను, తమ్ములను, వారిముందువారిని, వారి యిండ్లలోని, వారికి సంబంధించిన పురారామములందలి సర్వజనులను ఒక్కరినికూడా మిగుల్చక చంపివేయుము.

31) శత్రూయతా ప్రహితాసి మాం యేనాభి యథా యతః
తత స్తథా త్వా నుదతు యో య మంత ర్మయి స్థితః

ఎక్కడనుండి ఏవిధముగా ఎవనిచేత శత్రుత్వముతో నాపైకి పంపబడినావో నాహృదయాంతరాళమునందు వర్తించెడి పరమాత్మ నిన్ను ఉత్పాదించిన వాని మీదకు - అక్కడకు- అటులే ప్రేరేపించును గాక!

32) ఏవం త్వం నిక్కృతాస్మాభిః బ్రహ్మణా దేవి సర్వశః
య థైవ మాశ్చితో గత్వా పాపధీ నేవ నో జహి

మేము చేసిన జివ తవశ్శక్తి చేత తిరస్కరించబడి మా నుండి మా స్థలములనుండి పొమ్ము. ఇక్కడనుండి వేగముగా పోయి మాయందు పాపబుద్ధులైనవారిని అక్కడనే చంపుము.

33) యథా విద్యుద్ధతో వృక్షః ఆమూలా దనుశుష్యతి
ఏవ సప్రతి శుష్యతు యో మే పాపం చికీర్షతి

పిడుగుపడిన చెట్టు మొదలునుండి ఎటులు మాడిపోవునో అటులే నాకు పాపము చేయగోరువాడు మాడిపోవునుగాక!

34) యథా ప్రతిశుకో భూత్వా తమేవ ప్రతిధావతి
పాపం తమేవ ధావతు ద్వేష్టారం ప్రతిగచ్ఛతు

లోకములో రాజక్రీడనార్థము శుకాది పక్షులను మాలిమిచేసి శిక్షణయిచ్చి ఇతరశుకములను పట్టితెచ్చుటకు పంపెదరు. అవి అటులే వెళ్ళి తమజాతివానినే ఆక్రమించి పట్టి తెచ్చును. ఆవిధముగానే నాశత్రువుచేత నాపై చేయబడిన ప్రయోగము నన్ను ద్వేషించినవానిమీదకే పోవునుగాక!

35) యోనిస్త్వో అరుణో యశ్చ యోహి నిష్ట్యో జిఘాంసతి
దేవా స్తం సర్వే ధూర్వంతు బ్రహ్మ వర్మ మమాంతరం

ఏ దరిద్రుడు, ఖలుడు, చండాలుడు నన్ను చంపుటకు కోరుచున్నాడో వానిని సర్వదేవతలు హింసింతురుగాక! నాహృదయములోని బ్రహ్మమే నాకు రక్షాకవచము. (బ్రహ్మము - దివ్యశక్తి చైతన్యము)

36) ఊత్వా మందంతు స్తోమాః కృణుష్వ రాధో అద్రివః
అవ బ్రహ్మ ద్విషో జహి

బ్రహ్మ! నిన్ను మా యజ్ఞములు సంతోష పెట్టును గాక! భానురుడవై మాకోరికలను తీర్చుము. మమ్ము రక్షింపుము! మాశత్రువులను నాశనము చేయుము.

37) యో మే కరోతి ప్రద్వారే యోగారే యో నివేశనే
యో మే కేశనఖే కుర్యా దంజనే దంతధావనే

శత్రువులపై ప్రయోగము చేయువారు వారు తొక్కిన మట్టిని, యింటిలోని వస్తువును, ఆవ్యక్తి యొక్క జుట్టు, గోళ్ళు, ధరించేకాటుక, పండ్లు తోమిన పుల్లలు మొదలైన వానిని సంపాదించి పుత్తళి ప్రయోగాదులు చేయుదురు. అంతేగాక ప్రయోగ వస్తువులను శత్రువు ఇంటిలో ద్వారము క్రింద లేక పైన నివసించు గదిలో పెట్టుదురు. అట్టివానివలన నాకు అపకారము జరుగ కుండునుగాక!

38) ప్రతిసర ప్రతిధావ కుమారీవ పితుర్గృహాన్
మూర్ధాన మేషాం స్ఫోటయ పదమేషాం కులే కృధి

కుమార్తె తండ్రి ఇంటికి ఎటుల వెళ్ళునో ఓ కృత్యా! నీ వటులే నిన్ను పంపిన వాని మీదకు పరిగెత్తుకుంటూ వెళ్ళుము. వాని తల పగుల గొట్టుము వాని కాళ్ళు విరగ గొట్టుము. వాని స్థానము నాశనము చేయుము.

39) యేద్రుహ్యు ర్ఋజవే మహ్య మగ్నే కదా ధియో దుర్మదా అశ్మనాసః
ఆబద్ధ్యైతాం చ్ఛోచిషా విధ్యతంతూన్ వైవస్వతస్య సదనం నయస్వ

ఏ ద్రోహులు దుర్మద బుద్ధితో నాప్రాణములు తీయుటకు ఆలోచించు చున్నారో ప్రయోగములు చేయుచున్నారో వారిని త్రాళ్ళతో కట్టివేసి మంటపెట్టి కాల్చి యమునింటికి నడుపుము.

40) యే నో రయిం దుశ్చరితాసో అగ్నే జుహు ర్మర్తాసో అనృతం వదంతః
తేషాం వపూం ష్యర్చిషా జాతవేదః శుష్కంను వృక్ష మభిసందహస్వ

మమ్ము, మా సంపదలను నాశనము చేయుటకు అబద్ధములాడు ఏదుశ్చరిత్రులు హోమము చేయుచున్నారో ఓ అగ్నీ! వారి శరీరములకు మంటపెట్టి ఎండిన చెట్టునువలె తగల బెట్టుము.

41) అగ్న్యాస్యే ఘోరరూపేచ విషరూపే వినాశిని
జృంభితా ప్రతిగృహ్ణీష్వ స్వయ మాదాయ చాద్భుతం

ఓ అగ్నిముఖీ! విషమమైన భయంకర రూపము గలదానా! వినాశకశక్తీ! నీవు విజృంభించి అద్భుతము చేసి నా శత్రువులను ప్రతిగ్రహింపుము.

42) త్వమింద్రో యమో వరుణః త్వ మాపోగ్ని రథానిలః
త్వం బ్రహ్మైవ రుద్రశ్చ త్వష్టాచైవ ప్రజాపతిః

నీవే ఇంద్రుడవు, యముడవు, వరుణుడవు. నీరు, నిప్పు, గాలి నీవే! నీవే బ్రహ్మవు, రుద్రుడవుకూడ. నీవే త్వష్టవు, ప్రజాపతివి.

**43)** ఆవర్తధ్వం నివర్తధ్వం ఋతవః పరివత్సరాః
అహోరాత్రా స్తథాబ్దాశ్చ త్వం దిశః ప్రదిశశ్చమే

నీవే కాలమును ఆవర్తింతువు, నివర్తింతువు. పగళ్ళు, రాత్రులు, ఋతువులు, సంవత్సరములు నీఅధీనములు. నీవే నాకు దిక్కులు- విదిక్కులు-అన్నింటిని నాకు కావలసినట్లు చేయుము.

**44)** త్వమింద్రం యమం వరుణం సోమ మగ్ని మథానిలం
అత్రాహృత్య పశూంశ్చైతా నుత్పాదయసి చాద్భుతం

నీవు ఇంద్రుని, యముని వరుణుని, సోముని, అగ్నిని, వాయుదేవుని ఇక్కడకు తెచ్చి ఏసంపదలనైనా, జీవజాలమునైనా అద్భుతముగా సృష్టించెదవు.

**45)** యే మే దమే దారుగర్భే శయానం ధియా సహితం పురుషం నిజఘ్నుః
కుంభీపాకం నరకం గ్రీవబద్ధా హతా ఏవం పురుషాసో యమస్య

ఎవరు ఆభిచారిక హోమముచేసి మండే కట్టెలనుండి అగ్నిరూపుడైన పురుషుని నాపైకి విడిచినాడో వానిని మెడవట్టుకొని కుంభీపాక నరకమున పడవేయుము. అటులే ఆ ప్రయోగ పురుషుని కూడా యముని కడకు కొట్టి పంపుము.

**46)** కృష్ణవర్ణే మహద్రూపే బృహత్కర్ణే మహద్భయే
దేవి దేవి మహాదేవి మమ శత్రూన్ వినాశయ

పెద్ద చెవులతో నల్లని గొప్ప ఆకారముగలదానా! మహత్వవంతులకు కూడ భయము గొలుపుదానా! ఓ మహాదేవీ! నాశత్రువులను నాశనము చేయుము.

**47)** కుబేరం తేముఖం రౌద్రం నంది న్నానంద మావహ
జ్వరం మృత్యు భయం ఘోరం విషం నాశయ మే జ్వర!

ఓ జ్వర శక్తీ! నీముఖము వికృతము, భయంకరము అయినది. అట్టి నీవు ఆనంద స్వరూపిణివై నాకు ఆనందమును ప్రసాదింపుము. నా జ్వరమును, దానికి కారణమైన భయంకర విషమును, మరణభయమును నాశనము చేయుము.

48) వర్షంతు తే విభావరి దివో అభ్రస్య విద్యుతః
రోహంతు సర్వ బీజా న్యవ బ్రహ్మ ద్విషో జహి

ఓ రాత్రిదేవీ! నీ దివ్య విద్యుత్కాంతులు ఆకాశమునుండి వర్షించును గాక! సర్వబీజములు మొలకెత్తును గాక! మా తపస్సును రక్షింపుము. మా శత్రువులను సంహరింపుము.

49) ఋతం దేవి! మహాసూయే! కృత్యే! మాహేశ్వరప్రియే
శత్రోర్బలందహిత్వాశు పశుపుత్రాన్ వినాశయ

ఓ కృత్యాదేవి! మహేశ్వరప్రియా! సత్యముగా నీవు గుణారోపణశక్తివి. నాశత్రువుల బలమును వేగముగా దహించి వారి పశువులను, పుత్రులను నాశనము చేయుము.

50) ఖట్ఫట్ జహి మహాకృత్యే! విధూమాగ్ని సమప్రభే!
హన శత్రూం స్త్రిశూలేన క్రుద్ధాస్యే! పిబ శోణితం

ఓ మహాకృత్యా! పొగలేని మంటవలె ప్రకాశించుదానా! నాశత్రువులను శూలముతో పొడిచి కొట్టిచంపుము. కోపించిన ముఖము గలదానా! వారి నెత్తురు త్రాగుము.

51) త్రిపాత్ భస్మ ప్రహరణః త్రిశిరా రక్తలోచనః
సమే ప్రీత స్సుఖం దద్యాత్ సర్వామయపతి ర్జ్వరః

మూడు పాదములు, మూడు తలలు, ఎర్రని కన్నులు కలవాడు, సర్వరోగములకు ప్రభువు-భస్మమను ఆయుధముతో కొట్టువాడు అయిన జ్వరపురుషుడు నాయందు ప్రేమగలవాడై సుఖము నిచ్చునుగాక!

52) జ్వరరాజాయ విద్మహే త్రిశిరస్కాయ ధీమహి
తన్న స్త్రిపాత్ ప్రచోదయాత్

మూడుపాదములుగల జ్వరరాజును తెలుసుకొని ఆమూడుతలలు గల స్వామిని ధ్యానించుచున్నాము. అతడు మమ్ము నడుపునుగాక!

**53)** గృధ్ర కర్ణి! విరూపాక్షి! లంబస్తని! మహోదరి!
హన శత్రూం స్త్రిశూలేన క్రుద్ధాస్యే పిబ శోణితం

గద్దచెవులు గలదానా! విరూపమైన అనగా బేసి సంఖ్యగల కన్నులుగలదానా! విరూపాక్షుడైన రుద్రుని శక్తీ! నా శత్రువులను త్రిశూలముతో పొడిచి చంపుము. కోపించిన ముఖముగలదానా! వారి నెత్తురు త్రాగుము.

**54)** లంబకర్ణే! లంబజిహ్వే! లంబస్తని! మహోదరి!
ఆదిశక్తే! మహాశక్తే! మమ శత్రు ర్వినశ్యతు

వ్రేలాడు చెవులు, నాలుక, కుచములు, పెద్దపొట్ట గలదానా! ఆదిశక్తీ! మహాశక్తీ! నాశత్రువు నశించునుగాక!

**55)** బ్రహ్మశక్తే! విష్ణుశక్తే! పరశక్తే! పరాపరే!
మహామాయే! మహాభీమే! మచ్ఛత్రూన్ దహ సంహర!

ఓ బ్రహ్మశక్తీ! విష్ణుశక్తీ! పరశక్తీ! పరాత్పరీ! మహామాయా! మిక్కిలి భయంకరమైన దానా! నాశత్రువులను తగల బెట్టుము, చంపుము.

**56)** ద్రుతం గచ్ఛ మహామాయే! కృత్యే! మాహేశ్వర ప్రియే!
రిపోర్బలం నిహత్యాశు పశుపుత్రాంశ్చ నాశయ

ఓ మహామాయా! మహేశ్వర ప్రియురాలా! కృత్యా! వేగముగా పొమ్ము! నాశత్రువుయొక్క బలమును వెంటనే దెబ్బతీసి వాని పశువులను పుత్రులను నాశనము చేయుము.

**57)** వజ్రీవ వృత్రం వినిహంతి కృత్యే యథా దవాగ్ని ర్దహతే తృణాని
తథా సపత్నాం త్వమరే జహాయ భూయశ్చ తాన్నాశయ నాశయాశు

ఓ కృత్యా! వజ్రధరుడైన ఇంద్రుడు వృత్రుని చంపినట్లుగా, కార్చిచ్చు గడ్డిని దహించి నట్లుగా నాజ్ఞాతులను శత్రువులను యుద్ధములో చంపి వెంటనే వారినందరిని నాశనము చేయుము.

**58)** యో మా నక్తం దివా సాయం ప్రాతశ్చాహ్నో నిపీయతే
అద్యా తమింద్ర వజ్రేణ ద్విషంతం శోచయామసి

ఉదయము, మధ్యాహ్నము, సాయంకాలము, రాత్రి ఎవడు నన్ను గ్రసించ వలెనని పూనినాడో ఇప్పడే ఆ శత్రువును ఇంద్రుని వజ్రముతో దహించెదను.

**59)** యో మాం ద్వేష్టి జాతవేదో యంచాహం ద్వేష్టి యశ్చమాం
సర్వాం స్తానగ్నే సందహ యాం శ్చాహం ద్వేష్టి యేచ మాం

ఎవడు నన్ను ద్వేషించు చున్నాడో, నేను ఎవరిని ద్వేషించు చున్నానో ఓ జాత వేదా! అగ్నీ! వారందరినీ బాగుగా దహింపుము.

**60)** ఓం శత్రుకార్య హానికరి! మమకార్య సిద్ధికరి!
శత్రూణాం ఉద్యోగ విఘ్నకరి! మమసర్వోద్యోగ వశ్యకరి!
ప్రత్యంగిరే! స్వాహా

నావైరుల పనులకు హానిచేయుదానా! నాపనులను సిద్ధింప జేయుదానా! శత్రువుల ప్రయత్నములకు విఘ్నము కల్గించుదానా! నాకు సర్వోద్యోగములను వశము చేయుదానా! ప్రత్యంగిరా! నిన్ను ఆవాహన చేస్తున్నాను.

ఇత్యాధర్వణే పిప్పలాదశాఖీయం సపరిశిష్టం
ప్రత్యంగిరా సూక్తం సమాప్తం.



# 6. ఉపమన్యుమహర్షి

పూర్వకాలంలో వ్యాఘ్రపాదుడనే మహర్షికి ఉపమన్యువు పెద్దకుమారుడు. ధౌమ్యుడు చిన్న కుమారుడు. ఒకసారి బంధువుల యింటిలో క్షీరాన్నము - పాయసము తిని దాని రుచి చాలా బాగా ఉండటం చేత ఇంట్లో చేసి పెట్టమని తల్లిని కోరారు. ఆవులు వారికి లేకపోవటం వల్ల పాలు లేవు. పిండినీళ్ళతో తయారు చేసి యిస్తే వారికి నచ్చలేదు. పాలు ఎలా వస్తవని తల్లిని అడిగితే ఈశ్వరుని అనుగ్రహం వల్ల వస్తవని తల్లి చెప్పింది. ఆ అనుగ్రహం ఎలా లభిస్తుందంటే తపస్సు వల్ల అని ఆమె అన్నది. పరమేశ్వరుడు బహునామములు, బహురూపములు – బాల తరుణ వృద్ధాకారములు, సింహ వ్యాఘ్రాదిరూపాలు ధరిస్తాడని సర్వశక్తి సంపన్నుడని ఆమె వర్ణించింది.

ఉపమన్యువు తల్లిదండ్రుల ఆశీస్సులు తీసుకొని హిమాలయాలలో ఏకాంత ప్రశాంత ప్రదేశాన్ని ఎన్నుకొని ఎడమ కాలిబొటన వ్రేలిపై నిలబడి తపస్సు ప్రారంభించాడు. నూరేండ్లు ఫలాహారంతో, ఇంకో నూరేండ్లు రాలిన ఆకులతో, మరో నూరేండ్లు నీటితో తరువాత గాలిని మాత్రమే ఆహారంగా తీసుకుంటూ మొత్తం వెయ్యేండ్లు కఠోరంగా శివుని ధ్యానించాడు.

పరమేశ్వరుడు ప్రసన్నుడై ఇతనిని పరీక్షించటానికి ఇంద్రాకృతితో వజ్రధరుడై, ఐరావతారూఢుడై వచ్చి "వత్సా ! నీ కఠోర దీక్షకు సంతృప్తి చెందాను. నీకేమి వరంకావాలో కోరుకో" అన్నాడు. ఉపమన్యుడా మహేంద్రుని చూచి "అయ్యా! నేను శివుని నుండి తప్ప వేరెవరి నుండి యేవరమును తీసుకోను. మీరు త్రిభువన రాజ్యవిభూతినిస్తామన్నా నాకక్కరలేదు.

**శ్లో॥ ననాకపృష్ఠం నచదేవరాజ్యం నబ్రహ్మలోకం నచనిష్కలత్వం**
**న సర్వకామాన్ అఖిలాన్ వృణోమి హరస్యదాసత్వమహంవృణోమి.**

స్వర్గలోకాధిపత్యముగాని, బ్రహ్మలోకముగాని, మరి యే కోరికలు గాని నేను కోరటం లేదు. నేను శివునకు దాసుడను కావాలని ఆకాంక్షిస్తున్నాను" అని విన్నవించాడు. దానిని విని దేవేంద్రుడు "ఓయీ! శివుడు శివుడంటున్నావు?

అతడెవడు? ఎటువంటివాడు ? తెలుసునా?" అని ప్రశ్నించాడు. దానికి ఉపమన్యువు "దేవరాజా ! ఆ మహాపురుషుడు వ్యక్తుడు, అవ్యక్తుడు. ఆదిమధ్యాంతశూన్యుడు పరమాత్మ. అచింత్యుడు. జ్ఞానస్వరూపుడు. సమస్తైశ్వర్య ప్రదాత" అని చేతనైన రీతిలో వర్ణించి తన దృఢ నిశ్చయాన్ని తెలియజేశాడు. అతని నిష్ఠకు సంతోషించి ఇంద్రరూపాన్ని వదిలి స్వస్వరూపంతో మహేశ్వరుడు సాక్షాత్కరించాడు. తీక్ష్ణాగ్రమైన త్రిశూలమును, నాగకంఠమువలె ఉన్నతాగ్రము గల పరశువును, ఏడుతలల మహాసర్పముపైన గల పినాకధనువు ధరించి మహేశ్వరుడు ఉపమన్యునకు దర్శనమిచ్చాడు. పులకాంకురితదేహుడై ఆ మునిశివుని ఇలా స్తుతించాడు.

## ఉపమన్యుకృత శివస్తోత్రము

జయశంకర ! పార్వతీ పతే మృడ శంభో శశిఖండమండన,
మదనాంతక భక్తవత్సల ప్రియ కైలాస దయాసుధాంబుధే
సదుపాయ కథా స్వపండితో హృదయే దుఃఖశరేణఖండితః,
శశిఖండ శిఖండ మండనం శరణం యామి శరణ్య మీశ్వరమ్॥

మహతః పరితః ప్రసర్పత స్తమసోదర్శన భేదినో భిదా
దిననాథ వివస్వ తేజసా హృదయవ్యోమ్నిమనా గుదేహినః
నవయం తవచర్మ చక్షుషా పదవీ మప్యుపవీక్షితుం క్షమాః
కృపయాభయదేన చక్షుషా సకలేనేశ విలోకయాశు నః ॥

మధురం హి పయస్స్వ భావతో నను కీ దృక్సితశర్క రాన్వితమ్,
సవిషోప్యమృతాయ తే భవాన్ శవ ముండా భరణోపి పావనః
భవ ఏవ భవాంతక స్సతాం సమదృష్టిర్విషమేక్షణోఽపి సన్,
అపిశూలధరో నిరామయో దృఢవైరాగ్యరతోఽపి రాగవాన్ ॥

అపిభైక్ష్యచరో మహేశ్వర శ్చరితం చిత్రమిదం హితే ప్రభో
వితర త్యభివాంఛితం దృశా పరిదృష్టః కిల కల్పపాదపః

హృదయేస్మృతిరేవ ధీమతే ననుతేఽభీష్ట ఫలప్రదో భవన్
సహసైవ భుజంగ పాశవాన్ వినిగృహ్ణాతి న యావదంతకః ॥

అభయం కురు తావదాశుమే గతజీవస్య పునః కిమౌష ధైః
సవిషై రివ భీమ పన్న గైః విషయైరౌభికలం పరిక్షతమ్
అమృతైరివ సంభ్రమేణ మాం అభిషించాశు దయావలోకనైః
మునయో బహవోఽద్య ధన్యతాం గమితాస్స్వాభిమతార్థ దర్శినః ॥

కరుణాకరయేనతేన మాం అవసన్నం ననుపశ్య చక్షుషా
ప్రణమామ్యథ యామి చాపరం శరణం కం కృపణాఽభయప్రదమ్
విరహీవ విభో ప్రియామయం పరిపశ్యామి భవన్మయం జగత్
బహవో భవతాను కంపితాః కిమితీశాన నమాను కంపసే ॥

దధతాకిము మందరాచలం పరమాణుః కమఠేన దుర్ధరః
అశుచిం యది మానుమన్యసే కిమిదం మూర్ధ్ని కపాలదామతే
ఉతశాఠ్య మసాధు సంగినం విషలక్ష్మాఽపి నకింద్విజిహ్వాధృక్
క్వదృశం విదధామి కింకరో మ్యను తిష్ఠామి కథం భయాకులః
క్వనుతిష్ఠసి రక్ష రక్షమాం, అయి శంభో శరణాగతోఽస్మితే ॥

విలుఠామ్యవనౌ కిమాకులః కిమురోహన్మి శిరశ్ఛినద్మి వా
కిమురోదిమి రారటీమికిం కృపణం మాం నయదీక్షసే ప్రభో
శివసర్వగ శర్మదప్రభో ప్రణతో దేవదయాం కురుష్వమే
నను ఈశ్వర నాథ దిక్పతే పునరేవేశ నమో నమోఽస్తుతే ॥

శరణం తరుణేందుశేఖర శ్శరణం మేగిరి రాజకన్యకా
శరణం పునరేవ తావుభౌ శరణం నాన్య దుపైమి దైవతమ్
ఉపమన్యుకృతం స్తవోత్తమం జపత శ్శంభు సమీపవర్తినః
అభివాంఛిత భాగ్య సంపదః పరమాయాః ప్రదదాతి శంకరః
ఉపమన్యుకృతం స్తవోత్తమం ప్రజపేద్యస్తు శివస్య సన్నిధౌ
శివలోక మవాప్య సోచిరా త్సహతే నైవ శివేన మోదతే ॥

పరమేశ్వరుడు చాలా సంతోషించి ఏ వరములు కావాలన్నా ఇస్తాను - కోరుకోమన్నాడు. ఉపమన్యువప్పుడు "దేవాదిదేవా ! మా గృహమందు అక్షయ క్షీరప్రాప్తిని, నాకు భూత భవిష్యద్వర్తమాన జ్ఞానాన్ని, నీ యందు అచంచల భక్తిని ప్రసాదించు" అని ప్రార్థించాడు. వాటిని ఇస్తూ సదాశివుడు అదనంగా "నీవు పిలిచినప్పుడల్లా వచ్చి కనిపిస్తానని" వాత్సల్యపూరితంగా వరాన్ని ప్రసాదించాడు.

తరువాత తల్లిదండ్రుల దగ్గరకు వెళ్ళి కొంతకాలం ఉండి అనుజ్ఞ తీసుకొని హిమాలయాలలో తాను తపస్సు చేసిన ప్రదేశానికి వచ్చి అక్కడ ఆశ్రమాన్ని నిర్మించుకొని ప్రశాంత తపోమయ జీవితాన్ని గడుపుతున్నాడు. శివానుగ్రహం పొందిన తపస్వి గనుక ఎందరో మహర్షులు అక్కడకు వచ్చి పోతూ ఉండేవారు. మరికొందరు సాధకులు తపస్సిద్ధి కోసం అక్కడకు వచ్చి తీవ్రసాధనలు చేసేవారు. శివగణములు, దేవగణములు, మునిగణములు మొదలైనవారిచే ఆశ్రమము ఎప్పుడూ సందడిగా ఉండేది.

ఇలా ఉండగా ఒకనాడు ద్వారకనుండి శ్రీకృష్ణుడు వచ్చి మహర్షి దర్శనం చేసుకొని తాను వచ్చిన పని విన్నవించుకొన్నాడు. "మునివరా! నా అష్టమహిషులలో రుక్మిణి పట్టమహిషి– ఆమె యందు నాకు ప్రద్యుమ్నుడనే కుమారుడు పుట్టాడు. కాని ప్రసవగృహంలోనే ఎవరో అదృశ్యరూపంతో వచ్చి అపహరించుకొని పోయినాడు. కొన్ని సంవత్సరాలు గడిచింది. ఏమైనాడో ఎక్కడున్నాడో తెలియదు. ఇటీవల నా భార్య జాంబవతి తనకు సంతానం కావాలని ప్రార్థించింది. ఏమి చేయాలో ఆలోచించగా శివుని గూర్చి తపస్సు చేస్తే కార్యసిద్ధి కలుగుతుందని అనిపించింది. అందుకే శివభక్తులైన మీ దగ్గరకు వచ్చాను. నన్ను అనుగ్రహించండి" ఆ మాటలు విని ఉపమన్యు మహర్షి యిలా పలికాడు. "కృష్ణా! నీవు కారణజన్ముడవు. అవతారపురుషుడవు. లోకాదర్శ దృష్టితో నీవే తపస్సు సంకల్పించావు. తథాస్తు!

ఇక్కడ తపస్సు చేస్తే త్వరగా సిద్ధిస్తుంది. ఈస్థల ప్రభావం అటువంటిది. హిరణ్యకశిపుడు, అతని కుమారుడు మందరుడు, శతమఖుడనే రాక్షసుడు,

న్యాలాంబువనే మహనీయుడు, యాజ్ఞవల్క్యముని, వ్యాసుడు, వాలఖిల్యులు, శాకల్యుడు - ఇలా ఎందరో ఇచట తపస్సు చేసి శివుని వలన అభీష్ట సిద్ధిని పొందారు. కనుక నీవు కూడ ఈ పవిత్ర ప్రదేశంలో దీక్షతో తపస్సు చేయి. భక్త సులభుడైన బోళాశంకరుడు తప్పక నిన్ను అనుగ్రహిస్తాడు. దానికి అనుగుణంగా నీకు పాశుపతదీక్ష యిస్తాను" అని కృష్ణునకు ముండనం చేయించి, దండమిచ్చి ప్రత్యేకమైన పిలిపిలి - మిలిమిలి అనే బీజాలతో కూడిన శివమంత్రాన్ని ఉపదేశించాడు (అగ్నిపురాణం)

శ్రీకృష్ణుడు అత్యంతభక్తితో శివుని గూర్చి కొన్ని సంవత్సరాలు ఆ ఆశ్రమంలో దీక్షితుడై సాధన చేశాడు. తత్ఫలితంగా శివుడు పార్వతీ సమేతుడై ప్రత్యక్షమైనాడు. సాక్షాత్కరించిన సాంబశివునితో తనకు పుత్రసంతాన వరాన్ని ప్రసాదించమని వేడుకొన్నాడు. అప్పుడు మహేశ్వరుడు "కృష్ణా! నీవు వైకుంఠనాధుడవైన విష్ణుదేవుడవు. భూమి మీద దుష్ట శిక్షణ కోసం, శిష్ట రక్షణ కోసం అవతరించావు. నీ తపస్సు నిమిత్తమాత్రం. నీకు కోరిన పుత్రప్రాప్తిననుగ్రహిస్తున్నాను" అన్నాడు. ఆ మాటలు విని కృష్ణుడు "పరమేశ్వరా ! నీవు చెప్పినట్లే అప్పుడప్పుడు ఋషులు వచ్చి నన్ను నారాయణుడవంటుంటారు. కాని నాకు వైకుంఠ వల్లభుడననే స్ఫురణలేదు. నా కుమారుని ఎవరో ఎత్తుకుపోతే ఎక్కడున్నాడో తెలియలేదు. మోహస్థితిలో అజ్ఞానస్థితిలో ఉన్నాను. నా పరిస్థితి నాకే చాలా దయనీయంగా ఉంది" అని విలపించాడు. (దేవీభాగవతం) శివపార్వతులతనిని ఓదార్చి "మానవశరీరంలో ప్రవేశిస్తే ఇలానే ఉంటుంది. అవతార ప్రయోజనం తీరి మళ్ళీ పైకి వచ్చినపుడు మావలెనే సర్వశక్తులతో ఉంటావు. అంతదాకా తప్పదు. బాధపడవద్దు. అన్ని వేళల మేము నిన్ను జాగ్రత్తగాచూస్తూ ఉంటాము" అని చెప్పి అదృశ్యమైనారు. శివానుగ్రహం పొంది ఉపమన్యుమహర్షి దగ్గరకు వెళ్ళి కృతజ్ఞతలు చెప్పి, శ్రీకృష్ణుడు ద్వారకకు బయలుదేరాడు.

త్రోవలో మంచుకొండలలో ఒక చోట ఘంటాకర్ణుడనే కృష్ణభక్తుడున్నాడు. అతడు మాంసాశనుడు. తను తినే ఆ మాంసాన్నే రోజూ కృష్ణ విగ్రహానికి సమంత్రకంగా నైవేద్యం పెట్టేవాడు. మార్గంలో అసురుని దగ్గరకు వెళ్ళి భక్తితో పూజించిన ఆ రాక్షసుని దయతో అనుగ్రహించి ఇలా చెప్పాడు. "ఘంటాకర్ణా!

నీ భక్తికి సంతోషించాను. కాని నీవు పెట్టే నైవేద్యం నాకు ఇబ్బంది కలిగిస్తున్నది. నేను శుద్ధశాకాహారిని. ఇకముందు నాకు మాంస పదార్థములు నైవేద్యం పెట్టవద్దు" తమ ఆజ్ఞప్రకారం చేస్తానని ఘంటాకర్ణుడు విన్నవించుకొన్నాడు. అక్కడి నుండి శ్రీకృష్ణుడు ద్వారకకు చేరుకొన్నాడు.

ఉపమన్యునికి సంబంధించిన బాల్యకథ ఒకటి భారతంలో ఉంది. వ్యాసుడు హిమాలయాలలో గంగోత్రి దగ్గర సరస్వతీనదీతీరంలో చాలా కాలం ఒక గుహలో తపస్సు చేశాడు. త్రివేణీ సంగమందగ్గర సరస్వతి అంతర్వాహినియే గాని హృషీకేశ్‌పైన ఇప్పటికీ ఆ నదీ ప్రవాహం ఉన్నది యాత్రికులక్కడ స్నానం చేసి వస్తుంటారు. ఆ రోజులలో వ్యాసుని దగ్గర చదువుకొన్న శిష్యులు – పైలుడు, వైశంపాయనుడు, జైమిని, సుమంతుడు. నలుగురూ నాలుగ వేదాలలో ప్రత్యేకంగా నిపుణులు. పైలుడు విద్యాభ్యాసం పూర్తియై వివాహం చేసుకొని గృహస్థె ఆశ్రమ నిర్మాణం చేసుకొని శిష్యులకు విద్యలు బోధించే గొప్ప గురువైనాడు. ఆయన శిష్యులలో ఉదంకుడు, ఉపమన్యువు ఆరుణి. గురుసేవ వల్ల ముగ్గురూ తరించారు. ఉపమన్యువు గురువుగారి ఆవులు కాచేవాడు. ప్రొద్దుననే లేచి ఆవులు తోలుకొని ఊరిబయట అడవికి వెళ్ళితే ఆ గోవులు గడ్డి సమృద్ధిగా తిని, నీరుతాగి బాగా ఉండేవి. మళ్ళీ సాయంకాలం వాటిని ఆశ్రమానికి తోలుకు వచ్చేవాడు. కొంతకాలం గడిచిన తర్వాత పైలునకు శిష్యుని దీక్షను పరీక్షించాలనుకొన్నాడు. ఉపమన్యువు పిలిచి ఒరే ! రోజూ అన్నం ఎక్కడ తింటున్నావు అని అడిగాడు. ఆశ్రమంలో అమ్మగారు పెడుతున్నారు అని జవాబు చెప్పాడు. ఈ వేళ్టినుండి ఆశ్రమంలో తినవద్దు అన్నాడు గురువు. సరేనన్నాడు శిష్యుడు. కొన్నాళ్ళ తరువాత గురువుగారు మళ్ళీ పిలిచి ఏమిరా ! పుష్టిగానే ఉన్నావు. ఆహారం ఎక్కడ తింటున్నావు అని అడిగాడు. ఆశ్రమంలో వద్దన్నారు గదా! అందుకని బయట ఇండ్లలో భిక్షాటనం చేసి తింటున్నాను అన్నాడుపమన్యువు. "ఈరోజు నుండి ఎక్కడా భిక్ష యాచించవద్దు" అన్నాడు గురువుగారు. మళ్ళీ కొన్నాళ్ళ తర్వాత చూచి "ఏమిరా! బాగానే ఉన్నావు. ఆహారం ఎక్కడిది అని అడిగాడు గురువుగారు. "ఆవులున్నవి గదండీ ! వాటి పాలు పిండుకొని త్రాగుతున్నాను" అన్నాడు శిష్యుడు. "దూడలకు కావాలి గదా! అందుచేత అదీవద్దు" అన్నాడు గురువుగారు.

మళ్ళీ కొన్నాళ్ళకు "ఇప్పుడూ పుష్టిగానే ఉన్నావు. ఏం ఆహారము తీసుకొంటున్నావు" అని ప్రశ్నించాడు గురువుగారు. "దూడలు త్రాగగా మిగిలిన నురుగు తీసుకొంటున్నాను" అన్నాడు శిష్యుడు. "అదీవద్దు" అన్నాడు పైలమహర్షి. సరేనన్న ఉపమన్యువునకు ఇంకేం ఆహారమూ లేదు. ఆవులను తోలుకు వెళ్ళి అడవిలో ఆకలికి తట్టుకోలేక గురువు ఆజ్ఞను మీరరాదు గనుక – ఆవులజోలికి పోక జిల్లేడు ఆకులు త్రుంచి ఆ పాలు త్రాగాడు. ఆ పనిలో అరిచింది కండ్లలో పడినవి. కంటిచూపు పోయింది. ఆవులను ఇంటికి తోలుకు వస్తూ త్రోవకనపడక ఒక పెద్ద గోతిలో పడ్డాడు. పైకి రాలేక ఆ గోతిలోనే ఉన్నాడు. ఆవులన్నీ వచ్చినవి కాని ఉపన్యుడు రాలేదు. ఆదుర్దాతో గురువుగారు మనుషులను శిష్యులను తోడుతీసుకొని వెదుకుతూ ఎక్కడ ఉన్నావని కేకలు పెడితే చీకట్లో గోతిలో నుంచి సమాధానం చెప్పాడు ఉపమన్యువు. జరిగిన సంగతి విని తన మాట దాటని శిష్యుని భక్తికి సంతోషించి పైలమహర్షి దయతో "నాయనా! అశ్వినీదేవతలు – దేవవైద్యులు. వారిని స్తోత్రం చెయ్యి చూపు వస్తుంది" అన్నాడు. ఉపమన్యువు కవికాడు. అయినా మహర్షి వాక్కుతో అతని నోటి వెంట ఋక్కులు రావటం మొదలైంది.

## ఉపమన్యుకృత అశ్వినీస్తుతి

1. ప్రపూర్వగౌ పూర్వజౌ చిత్రభానూ గిరావాశంసామి తపసాహ్యనంతౌ
దివ్యౌ సుపర్ణౌ వరజౌ విమానావధిక్షి పంతౌ భువనాని విశ్వా

2. హిరణ్మయౌ శకునీ సాంపరాయౌ నాసత్య దస్రౌ సువసౌ వైజయంతౌ
శుక్రం వయంతౌ తరసాను వేమా వధివ్య యంతా వసితం వివస్వతః

3. గ్రస్తాం సుపర్ణస్య బలేన వర్తికా మముంచతా మశ్వినౌ సౌభగాయ
తావత్సువృత్తా వనమంత మాయయావసత్త మాగా అరుణా ఉదావహన్

4. షష్టిశ్చ గావ స్త్రిశశశ్చధేనవః ఏకం వత్సం సువతే తం దుహంతి
నానాగోష్ఠా విహితా ఏకదోహనాస్తావశ్వినౌ దుహతో ధర్మ్యముక్థమ్

5. ఏకాం నాభిం సప్తశతా అరాశ్రితాః ప్రధిష్వ న్యా వింశతి రర్పితా అరాః
అనేమి చక్రం పరివర్తతే జరం మాయాశ్వి నౌ సమనక్తి చర్షణీ

6. ఏకం చక్రం వర్తతే ద్వాదశారం షణ్ణాభిమేకాక్ష మృతస్య ధారణమ్
యస్మిన్ దేవా అధివిశ్వే విషక్తాస్తావశ్వినౌ ముంచతౌ మావిషీదతమ్.

7. అశ్వినా విందు మమృతం వృత్తభూయో తిరోధత్తా మశ్వినౌ దాసపత్నీ
హిత్వాగిరి మశ్వినౌ గాముదాచరం తౌ తద్వృష్టి మహ్నాప్రస్థితా బలస్య

8. యువాం దిశోజనయథో దశాగ్రే సమానం మూర్ధ్ని రథయాతం వియంతి
తాసాం యాత మృషయ్యోఽను ప్రయాంతి దేవా మనుష్యాః క్షితిమాచరంతి

9. యువాంవర్ణాన్ వికురుథో విశ్వరూపాంస్తేఽ ధిక్షిపంతౌ భువనాని విశ్వా
తే భానవోఽ ప్యనుసృతాశ్చరంతి దేవా మనుష్యాః క్షితిమాచరంతి.

10. తౌనాసత్యా వశ్వినౌ వాం మహేహం స్రజంచయాం బిభృథః పుష్కరస్య
తౌనాసత్యావమృతావృతా వృథా వృతాదేవాస్త త్ప్రపదేన సూతే

11. ముఖేన గర్భం లభతాం యువానౌ గతాసురేతత్ ప్రపదేన సూతే
సద్యోజాతో మాతర మత్తి గర్భస్తావశ్వినౌ ముంచథో జీవసేగాః

అశ్వినీ దేవతలా ఋఙ్మంత్రములతో సంతృప్తి చెంది ఉపమన్యువుకు చూపు ప్రసాదించారు. పైల మహర్షి కృపవల్ల ఉపమన్యుడు మంత్రద్రష్టయైనాడు - అంతేకాదు సర్వవిద్యలు వాటంతట అవి ప్రాప్తించినవి. ఆ విధంగా గురుకరుణవల్ల విద్యలు పూర్తి చేసుకొని ఆశ్రమం వదలి వచ్చి హిమాలయాలలో వేరే ఆశ్రమం నిర్మించుకొని శివుని గూర్చి తపస్సు చేసి ఆ పరమేశ్వరుని అనుగ్రహం పొంది శ్రీకృష్ణభగవానునకు గురువయ్యే స్థాయి పొందగలిగాడు.

## 7. ఋషభుడు

స్వాయంభువ మనువు వంశంలో నాభి ఉత్తమ సంతానం కోసం విష్ణువు గూర్చి తపస్సు చేశాడు. నారాయణుడు సంతోషించి తన అంశతో పుత్రుని ప్రసాదించాడు. ఆ కుమారుడే ఋషభుడు. ఋషభుడు రాజైన తర్వాత అతని ప్రభావానికి అసూయపడి ఇంద్రుడు వానలు కురవకుండా చేసి క్షామం కలిగించాడు. కాని ఋషభుడు తనయోగశక్తి వల్ల వర్షాలు కురిపించి పంటలు పండేలా చేశాడు. ధర్మబద్ధంగా పరిపాలన చేసి ప్రజలంతా సుఖశాంతులతో నిత్యసంతుష్టులై ఉండేలా చేశాడు. వారు ఇహలోకఫలం కోరే స్థితిని దాటి పారలౌకిక ఫలకాములు మాత్రమే అయినారు.

కం॥ **జనవర ఋషభుని రాజ్యం**
**బున నైహిక ఫలము గోరు పురుషుని నొకనిన్**
**కనుగొన నెరుంగ మెన్నాడు**
**ఇన తేజుండతని మహిమలేమని చెప్పన్ (భాగవతం-5-65)**

ఋషభుడు సాంసారిక బంధాలకు అతీతుడై కేవలా నందానుభవుడై యీశ్వరుడై ఉండి కూడా కాలానుగతములైన ధర్మకార్యాలు చేసేవాడు. సర్వవేద శాస్త్ర రహస్యవేదియైన తెలియని వానివలె బ్రాహ్మణోపదేశ పూర్వకంగా ఎన్నో యజ్ఞాలు చేశాడు. ఈ విధంగా కొంతకాలం రాజ్యపాలన చేసి ప్రధమపుత్రుడైన భరతుని చక్రవర్తిగా పట్టాభిషేకం చేశాడు. కుశావర్తుడు, ఇలా వర్తుడు, బ్రహ్మావర్తుడు, ఆర్యావర్తుడు మొదలైన వారిని వివిధ ప్రాంతాలకు పాలకులుగా నియమించాడు. వారి పేర్లతో ఆయా ప్రాంతాలు ప్రసిద్ధి కెక్కినవి. అనంతర కాలంలో భరతుని పరిపాలన అపూర్వంగా జరిగి ఈ దేశానికి భరతవర్షమనే పేరు వచ్చింది.

ఋషభుడు పుత్రులకు సదసద్వర్తన గురించి బోధించి ఆశీర్వదించి సమస్తము త్యజించి వేశాడు. వారితో ఇలా అన్నాడు. "కుమారులారా ! లోకంలో ధనము ఆస్తులు సంపాదించి సంతానికి ఇస్తారు. అది పెద్ద విశేషం కాదు. ముక్తిమార్గం అందించే తండ్రి నిజమైన తండ్రి. ఆధ్యాత్మయోగము,

ఏకాంత భక్తిభావము, ఇంద్రియ విజయము, బ్రహ్మచర్యము, వాక్సంయమనము, కర్తవ్య పరాయణత, జాగరూకత ప్రధానము. అజ్ఞానం నుండి పుట్టిన లౌకిక బంధనమనే లతను అప్రమత్తయోగమనే మహాఛురికచే (చురకత్తి) తెంపి వేయాలి. కన్నులున్నవాడు కాననివానికి తెరువు చూపినట్లు జ్ఞానియైన గురువు అజ్ఞానులకు మాయను తొలగించి మోక్షమార్గోన్ముఖులను చేయాలి. శుద్ధ సత్వమయమయిన నా శరీరము నుండి పుట్టిన వారు మీరు. నా దేహము దుర్విభావ్యము. నా మనస్సు సత్వయుక్తము ధర్మ సమేతము పాపరహితము. అందుకే పెద్దలు నన్ను ఋషభుడన్నారు. మీ సోదరులలో అగ్రజుడైన భరతుని నన్నుగా భజించండి. ప్రజాపాలన చేయండి" అని సత్ ప్రబోధం చేసి ఋషభుడు కర్మపరిత్యాగం చేసి, దిగంబరుడై, ఉన్మత్తాకారుడై, ప్రకీర్ణకేశుడై (జుట్టు విరియబోసుకొని), అగ్నుల నాత్మారోపణము చేసుకొని జడునివలె, గ్రుడ్డివానివలె, చెవిటివానివలె, మూగవానివలె, పిశాచము వలె, పిచ్చివానివలె అవధూతవేషముతో మౌనియై దుర్జనులు తిట్టినా, కొట్టినా, ఉమ్మేసినా, దుమ్మెత్తిపోసినా మలమూత్రములుపైన వేసినా పట్టించుకోకుండా జోరీగలను లెక్కచేయని అడవియేనుగువలె ముందుకు వెళ్ళిపోయేవాడు. ఏ స్థితిలో ఉన్నా శరీరం సుగంధం విరజిమ్మేది. కాంతితో ప్రకాశించేది. తనలో సర్వభూతాంతర్యామియైన వాసుదేవుని ప్రత్యక్షంగా చూస్తున్న ఆ మహానుభావుని సిద్ధులు వరించినవి. ఆకాశగమనము, మనోవేగము, పరకాయ ప్రవేశము, అదృశ్యవిద్య, దూరశ్రవణ, దూరదర్శనాదులైన యోగసిద్ధులు తమంత తాము వచ్చినవి. కాని అతడు వానిని స్వీకరించలేదు. కోరికలు లేని వానికి సిద్ధులతో పని యేముంది ?

ఇలా కొంతకాలం గడిచిన తర్వాత ఋషభుడు శరీరాన్ని విడవటానికి నిశ్చయించుకొని హిమాలయాలలోని సిద్ధాశ్రమానికి వెళ్ళి అక్కడ దేహత్యాగం చేశాడని, సిద్ధశరీరంతో ప్రకాశిస్తున్నాడని జైన గ్రంథములు వర్ణిస్తున్నవి.

భాగవతంలో మాత్రం దక్షిణ కర్ణాటకదేశం వెళ్ళి కుటకాచలోప వనంలో తన నోటిలో రాళ్ళు పెట్టుకొని అవే కబళంగా తీసుకుంటూ ఉన్మత్తునివలె వికీర్ణ కేశుడు, దిగంబరుడునై తిరుగుతూ వెదురు పొదల రాపిడిలో కార్చిచ్చు పుట్టి అడవినంతా తగలబెట్టుతుంటే దానిలో దగ్ధుడైనాడు. అతని జీవిత

విధానం ప్రజలు చెపితే విని అర్హతుడనే ఆ రాష్ట్రాధిపతి అందరూ అలానే ఆచారరహితులై ఉండాలని అదే గొప్పమతమని అనుశాసనం చేశాడు. అవధూతలు బాలోన్మత్త పిశాచముల వలె ఉంటే ఆ పద్ధతి అందరికోసం కాదుగదా! అది తెలియక అనాచారపరమైన పాషండ మతాభినివేశంలో కలి వ్యామోహితుడై ఆ రాజు అజ్ఞానాంధుడైనాడు. ఏదైనా అతులదివ్య ప్రకాశకుడు పరమపురుషుడు మహాత్ముడు నైన ఋషభుని చరిత్ర పరమపూజ్యమైనది. ఒక వేళ భాగవతంలో చెప్పినట్లు కర్ణాట వనములో కార్చిచ్చులో కాలిపోయినా సిద్ధశరీరంతో సిద్ధాశ్రమానికి వెళ్ళటానికి అభ్యంతర మేమీ లేదు. ఇతర స్థలాలలో మరణించిన యోగులు కొందరు సిద్ధాశ్రమంలో ఉన్నట్లు నారాయణ దత్త శ్రీమాలివంటి వారి రచనల్లో కనిపిస్తున్నది.

**ఋషభపుత్రులు**

| నవనారాయణులు | నవనాథులు |
|---|---|
| 1. కవి | మత్స్యేంద్రనాథుడు |
| 2. హరి | గోరఖ్‌నాథ్ (గోరక్ష) |
| 3. అంతరిక్షుడు | జాలంధరనాథుడు |
| 4. ప్రబుద్ధుడు | కానీఫా |
| 5. పిప్పలాయనుడు | చర్పటనాథుడు |
| 6. ఆవిర్హోత్రుడు | నాగేశనాథుడు |
| 7. ద్రుమిళుడు | భర్తరీనాథుడు |
| 8. చమసుడు | రేవణనాథుడు |
| 9. కరభాజనుడు | గహనీనాథుడు |

నవనాథుల కథలు ఎన్నో అద్భుతాలతో నిండి ఉన్నవి, మత్స్యేంద్రనాథుడు దేశ సంచారం చేస్తుండగా ఒక గృహిణి సంతానం కోసం ప్రార్థించింది. అతడు భస్మం మంత్రించి యిచ్చాడు. ఆమె ఆ భస్మాన్ని ధరించకముందే ఆమె భర్త వచ్చి ఈ గోసాయిలు మోసగాళ్ళని నమ్మవద్దని చెప్పి ఆ భస్మాన్ని పారేయమని ఆజ్ఞాపించాడు. భర్తమాట కాదనలేక ఆమె చెత్తపారవేసే దిబ్బ మీదకు విసిరేసింది. కొంతకాలం తర్వాత మళ్ళీ మత్స్యేంద్రనాథుడు వచ్చి

నా వరం వల్ల పుట్టిన కుమారుడేడి ?" అని అడిగితే ఆమె జరిగిన సంగతి చెప్పింది. అతడాపెంటకుప్ప దగ్గరకు వెళ్ళి "బిడ్డా ! లేచిరా !" అన్నాడు. అప్పటికప్పుడు సద్యోయౌవనంతో ఒక యువకుడు ఆ దిబ్బలో నుండి లేచి వచ్చాడు. ఆవుపేడ కుప్పలో నుండి ఉద్భవించాడు. గనుక గోరక్షనాధుడని పేరు పెట్టాడు గురువుగారు. ఆ పదమే గోరఖ్‌నాధ్‌గా మారింది. గోరఖ్ ఎప్పుడూ గురువుగారిని అంటిపెట్టుకొని సేవ చేస్తుండేవాడు. ఒకసారి మత్స్యేంద్రుడు శిష్యునితో నేను తీర్థయాత్రలకు వెళ్తున్నాను. నీవు ఆశ్రమాన్ని జాగ్రత్తగా చూస్తుండు అని ఆజ్ఞాపించాడు. కొన్ని నెలలు గడిచినవి. గురువుగారు వస్తానన్న సమయానికి రాలేదు. గోరఖ్ విచారణ చేస్తే బ్రహ్మపుత్రానదీ తీరప్రాంతం లోని ఒక రాజ్యంలో రాజకుమారిని పెండ్లిచేసుకొని కామక్రీడలలో మునిగితేలుతున్నాడని తెలిసింది. 'అయ్యో! గురువుగారు పతనమైనాడే ఆయనను కాపాడుకోవాలి' అని బయలుదేరి ఆ రాజ్యానికి వెళ్ళి వారికి అన్నీ గుర్తు చేశాడు. కానీ మత్స్యేంద్రుడు వినలేదు. అప్పుడు తన మంత్రశక్తితో ఇచ్ఛాశక్తితో గురువుగారిని సమ్మోహితుని చేసి ఆకర్షించి తన వెంట ఆశ్రమానికి తీసుకువచ్చాడు. తీరా అక్కడికి వెళ్ళేసరికి ప్రధానాసనం మీద మత్స్యేంద్రుడు కూర్చుని చిరునవ్వు నవ్వుతున్నాడు. తన వెనకాల ఆ ఆకారమే. గోరఖ్‌నాధ్ దిగ్భ్రాంతితో చూచి కాసేపటికి మాయాశక్తి సంపన్నుడు మహనీయుడు అయిన గురువుగారి ప్రభావం తెలుసుకోలేకపోయినానని సిగ్గుపడి కాళ్ళమీద పడ్డాడు. మత్స్యేంద్రుడు మందహాసంతో శిష్యుని అనుగ్రహించాడు. ఈ మహాసిద్ధుని కథలు గ్రంథాలు, సినిమాలు వివిధభాషలలో వచ్చినవి.

క్రీ.శ.4వ శతాబ్దంలో నేపాల్‌లో భయంకరమైన క్షామం వచ్చింది. పెద్దల సలహామీద మహారాజు – నరేంద్రదాస్ అస్సాం వెళ్ళి అక్కడ ఉన్న మత్స్యేంద్రనాధుని ఆహ్వానించాడు. ఆ మహాయోగిరాజును పంపించి తాను హిమాలయాలలో మంచు కొండలమధ్య ఏ ప్రాణి సంచరించలేని మార్గంలో ప్రయాణం చేసి నేపాల్ చేశాడు. ఆయన అడుగుపెట్టగానే వానలు కురిసి పంటలు పండినవి. కృతజ్ఞతతో, భక్తితో రాజు ఆ మహనీయుని పూజించి ఖట్మాండూలో మత్స్యేంద్రనాధాలయం నిర్మించాడు. అయితే ఇది చిత్రమైన ఆలయం. స్థిరప్రతిష్ఠ లేదు. మూలవిరాట్టును నగరంలోని నాలుగురోడ్ల

కూడలిలో రథం మీద తెచ్చి ఒకటి రెండు నెలలుంచి పూజిస్తారు. అలా ఆ విగ్రహం కొన్ని నెలలు గుడిలో, కొన్ని నెలలు శృంగాటకాలలో (నాలుగు బాటల కూడలి) ఉంటుంది.

మత్స్యేంద్రనాధుని వల్ల నాథసంప్రదాయం హిమాలయాలలో, దేశంలోని వివిధ ప్రాంతాలలో వ్యాపించింది. పశుపతినాథుడు, ఖోజార్‌నాధుడు, భైరవనాధుడు మొదలైన దేవతనామాలు ఈ యోగీంద్రుని ప్రభావం వల్లనే అంటారు. ప్రతియుగంలో కాలానికి తగిన ఆకారంతో నిర్మాణకాయుడై సిద్ధశక్తులతో ఈ సిద్ధేశ్వరుడు సంచరిస్తుంటాడు. ఉజ్జయినిలో ఈయన పేరుతో ఒక సమాధి ఉంది. అక్కడ ధ్యానం చేస్తే చాలామందికి ఆలఖ్ నిరంజన్ అని వినిపిస్తుంది. సిద్ధశరీరంతో విహరించే ఈ యోగీశ్వరుని ఆశ్రమం ఇప్పటికి సిద్ధాశ్రమంలో ఒక విభాగంలో ఉన్నదని యోగుల దర్శనానుభూతి.

## నవనాధులు

మత్స్యేంద్రనాధుని శిష్యపరంపర - నాధ సంప్రదాయం - ప్రవర్ధమానమైంది. ఋషభ పుత్రులైన నవనారాయణులు మహాయోగులు. వారందరు హిమాలయాలలో తపస్సు చేసిన సిద్ధాశ్రమ తపస్వులే. దత్తాత్రేయుని ఆజ్ఞవల్ల వారు ధర్మరక్షణ కోసం వివిధ ప్రదేశాలలో జన్మతీసుకొన్నారు. మొదటి యిద్దరిని గురించి చెప్పటం జరిగింది. తరువాత అంతరిక్షుడు జాలంధరనాధునిగా ఉదయించాడు. బృహద్రధుడనే రాజు యజ్ఞం చేస్తున్నప్పుడు ఆ హోమకుండం నుండి ఇతడు ఉత్థితుడైనాడు. బ్రహ్మ - సరస్వతిని చూచి మోహతీవ్రతతో స్ఖలించగా ఆ వీర్యము హిమాలయములోని ఒక మహాగజము చెవిలో పడింది. దాని నుండి కర్ణ కానీఫా అనే పేరుతో ప్రబుద్ధుడు జన్మ తీసుకొన్నాడు. పార్వతీ పరమ శివ వివాహవేళ పురోహితుడుగా ఉన్న ధాత గౌరిని చూచి కామవివశుడు కాగా వీర్యం స్రవించింది. ఎవరికీ తెలియకూడదన్న ఉద్దేశంతో ఆ బ్రహ్మ కాలిమడమతో రుద్దివేశాడు. అయితే అమోఘమైన ఆ తేజస్సునుండి 60 వేల మంది వాలఖిల్యులు ప్రభవించారు. ఇంకా మిగిలిన భాగము గంగానదిలోని ఒక రెల్లు పొదలో చిక్కుకొన్నది. పిప్పలాయనుడు దాని నుండి చర్పటనాధునిగా ఉద్భవించాడు.

మరొకసారి బ్రహ్మ వీర్యమొక నాగిని శిరస్సున పడింది. భక్ష్యమని భావించి మింగగా ఆమె గర్భవతి అయింది. ఆమె తక్షకుని కూతురు పద్మిని. జనమేజయుని సర్పయాగాన్ని ఆపటానికి వెళ్తున్న అస్తీకుడు ఈమె నొక మర్రిచెట్టు తొర్రలో దాచి ఉంచాడు. ఆమె పెట్టిన గుడ్డులో నుండి అవిర్హోత్రుడు వటసిద్ధనాగనాథునిగా పుట్టాడు. అతనినే నాగేశనాథుడంటారు. కౌశికుడనే మహర్షి భిక్షాటనకు బయలుదేరుతూ తన భిక్షా పాత్రను కుటీరం బయట ఉంచగా దానిలో సూర్యుని వీర్యం పడింది. దాని నుండి భర్తరీనాథుడుదయించాడు (భర్తరి అంటే భిక్షాపాత్ర). వేరొకసారి బ్రహ్మదేవుని వీర్యము దేవానది యందు (నర్మద) పడగా దానినుండి చమనుడు రేవణసిద్ధునిగా పుట్టాడు. గోరఖ్‌నాథ్ మట్టితో మనుష్యుని బొమ్మ చేసి సంజీవనీ మంత్రాన్ని జపించగా కరభాజనుడు గహనీనాథుడన్న పేరుతో ప్రభవించాడు.

నాథయోగుల అనుగ్రహం వల్ల సారంగధరుడు సిద్ధులలో ప్రవేశించిన కథ ఆంధ్రదేశంలో ప్రసిద్ధి చెంది నాటకాలుగా, సినిమాలుగా వచ్చింది. రాజమండ్రి రాజధానిగా పాలించిన రాజరాజనరేంద్రునకు రత్నాంగి చిత్రాంగి భార్యలు. రత్నాంగి కుమారుడు సారంగధరుడు. చిత్రాంగి ఇతనిని కామించి కోరింది. సారంగధరుడు తిరస్కరించాడు. ఇతడే తనను బలవంతం చేసినట్లు చిత్రాంగి మహారాజుకు చెప్పింది. రాజరాజనరేంద్రుడు నమ్మి కుమారునకు కరపాదచ్ఛేదన శిక్ష విధించాడు. తలారులు శిక్ష నమలు చేశారు. త్రోవనపోతూ చూచిన నాథసిద్ధుడితనిని రక్షించి తీసుకువెళ్ళి సిద్ధసాధనలు చేయించాడు. అయితే ఈ కథ ఆంధ్రదేశంలో జరిగిన కథ కాదని (ఎందుకంటే రాజరాజనరేంద్రునకు చారిత్రకంగా సారంగధరుడనే కొడుకు లేడు) మహారాష్ట్రలో జరిగిందని పరిశోధకుల అభిప్రాయయు. సారంగధరుడే చౌరంగి - అనే పేరుతో ప్రఖ్యాతి చెందిన సిద్ధుడు. ఇతనిని మత్స్యేంద్రనాథుడు కాపాడాడని కథ. మొత్తం మీద నాథ సంప్రదాయం హిమాలయాల నుండి భారతదేశం నలుమూలలా వ్యాపించింది.

## 8. మత్స్యేంద్రనాథుడు



త్రేతాయుగంలో రామ కార్యార్థం హనుమంతుడు సముద్రం దాటుతున్నప్పుడు అలసటవల్ల, సూర్యతాపం వల్ల చెమటబట్టి ఆ స్వేదబిందువులు సముద్రంలోపడినవి. ఒక మత్స్యకన్న నోటిలో పడిన బిందువు వల్ల గర్భం ధరించింది ఆమెకు పుట్టినవాడే మత్స్యేంద్రనాథుడు. అతడు పుడుతూనే సద్యోయౌవనుడైనాడు. మహాబలిశాలి. తల్లి సముద్రవాసిని గనుక పాతాళ ద్వారపాలకునిగా నియమించాడు. అతడు రావణుని అభ్యర్థన మీద రామలక్ష్మణులను తెచ్చి పాతాళంలో బంధించినపుడు వారి కోసం వచ్చిన హనుమంతుడు ద్వారపాలకుడైన మత్స్యపుత్రునితో యుద్ధం చేయవలసి వచ్చింది. అతని పరాక్రమం ఆంజనేయునకు ఆశ్చర్యం కలిగించింది. ఇంతలో ఈ సంగతి తెలిసి అతని తల్లి వచ్చి నీవు హనుమత్పుత్రుడవని కుమారునకు తెలియజేసింది. దానితో మత్స్యేంద్రుడు హనుమంతునకు త్రోవయిచ్చాడు. తండ్రివలె ఇతడు కూడా చిరంజీవియైనాడని కథ. కలియుగంలో మత్స్యేంద్రనాథుడు సిద్ధసార్వభౌముడు. హిమాలయాలలో ఇతని ఆశ్రమం. ఇతని పుట్టుక గురించి చాలా కథలున్నవి. ఒక కథలో ఉపరిచరుడనే వసువు ఊర్వశిని చూచి మోహించాడు. ఆ కామతీవ్రతతో వీర్యస్ఖలనమైంది. అతడు ఆకాశంలో పోతుండగా జరిగిన యీ సంఘటన వల్ల ఆ వీర్యం యమునలో పడింది. దానినొక మత్స్యం మింగింది. దాని నుండి పుట్టినవాడు గనుక మత్స్యేంద్రనాథుడన్న పేరు వచ్చింది. ఇటువంటి సంఘటనే ఇంకోసారి జరిగినప్పుడు ఉపరిచరవసువు వీర్యం చేపమింగగా మత్స్యకన్య పుట్టింది. ఆమెయే సత్యవతి. వ్యాసమహర్షి తల్లి. అది వేరే కథ.

ఆదియుగం – స్వాయంభువమన్వంతరంలో అతని కుమారుడు ప్రియవ్రతుడు – అతని కుమారుడు ఆగ్నీధ్రుడు. అతని పుత్రుడు నాభి. అతని కుమారుడు ఋషభుడు. అతని కెందరో పుత్రులు. వారిలో తొమ్మిదిమందికి నవనారాయణులని పేరు. సిద్ధపురుషులైనవారు. కలియుగంలో ధర్మోద్ధరణకు సిద్ధ సంప్రదాయ ప్రవర్ధనకు నవనాథులుగా అవతరించారని దత్తాత్రేయ కథలలో ఉంది.

# 9. దత్తాత్రేయుడు



హిమాలయాలతో దత్తాత్రేయుని సంబంధం పురాణాలలో ఆయన కథ ఉన్న ప్రధాన విభాగములం దంతగా కనపడదు. అయితే స్కాందపురాణంలోని మానసఖండం చదివితే కైలాస పర్వతమానస సరోవర ప్రాంతములన్నీ ఆ మహనీయుని సంచారం చేత పవిత్రీకృతమైన ప్రదేశాలే అని గోచరిస్తున్నది. ధన్వంతరి అనే చక్రవర్తికి ఆ మహర్షి ఎన్నో వివరాల ప్రదేశాలను గురించి చెప్పినట్లు కనిపిస్తున్నది. సత్యయుగంలో కైలాస పర్వత మానస సరస్సులను స్మరించినంత మాత్రం చేతనే బ్రహ్మలోకప్రాప్తి కలిగేదట !

**శ్లో॥ వేదాంత విజ్ఞాన సునిశ్చితార్థాః**
**సన్యాస యోగా ద్యత య శ్శుద్ధ సత్వాః**
**తే బ్రహ్మలోకేతు పరాంతకాలే**
**పరామృతాత్ పరిముచ్యంతి సర్వే**

విరాగులు, జ్ఞానులు, బ్రహ్మలోకం చేరి ప్రళయం దాకా అక్కడే ఉంటారట! అటువంటి స్థితిపై రెంటి స్ఫురణ, స్మరణవల్ల కలుగుతవంటే అవి యెంత మహిమాన్వితమైనవో ఊహించవచ్చు. సింధు, గంగ, బ్రహ్మపుత్ర సరయూనది మొదలైన వాని జన్మస్థానం అదే. మానససరస్సు మధ్య నుండి చూస్తే హిమగిరి శిఖరాలెన్నో దర్శనమిస్తవి - ఇటువంటి విశేషాలెన్నో దత్తాత్రేయస్వామి ఆ మహారాజుకు తెలియజేశాడు.

కైలాస పర్వత ప్రాంతంలోని సిద్ధాశ్రమంలో బృందావనం నుండి వచ్చి రాధాదేవి - గోలోకంలో కృష్ణ సఖుడైన శ్రీదాముడిచ్చిన శాపాన్ని అనుభవించ టానికి నూరుసంవత్సరాలు తపస్సు చేసి శరీరాన్ని విడిచి గోలోకానికి వెళ్ళిపోయింది. ఆమె శరీరం కైలాసగిరిలోని ఒక గుహలో ఉన్నదని దానిపై సువర్ణరాధా విగ్రహాన్ని దత్తస్వామి సృష్టించాడని ధ్యానయోగుల దర్శనం.

ఆ పర్వతంలో దత్తాత్రేయుని నివాసంగా ఒక గుహ చెప్పబడుతున్నది. అక్కడికి తపస్వులెందరో ఆ స్వామి దర్శనానికి వెళుతుంటారు. ఇటీవలి కాలంలో ఒక యోగి ఆయన దర్శనం కోసం ఆ గుహప్రాంతానికి బయలుదేరాడు. తన ఆశ్రమం నుండి అక్కడకు చేరటానికి ఆ మంచుదారులలో కొండ చరియల మధ్య చాలా శ్రమపడవలసి వచ్చింది. ఎట్టకేలకు 15 గంటలు ప్రయాణం చేసి అచటచూస్తే ఎవరూ లేరు. నిరాశపడక ధ్యానంలో కూర్చున్నాడు. ఆ స్థలం గౌరీ కుండం దగ్గరగా ఉంది. కుండంలో నీరుగడ్డ కట్టుకొని పోయి ఉంది. ప్రాణవాయువు చాలడం లేదు. ఊపిరిపీల్చడం శ్రమగా ఉంది. దత్తగురుదర్శనం కాకుండానే ప్రాణం పోతుందేమో ? ఏమైన సరే ! అని అతడు తెచ్చుకొన్న పులిచర్మం పరుచుకొని కైలాస పర్వతానికి నమస్కరించి ఉత్తర దిక్కు వైపు తిరిగి సిద్ధాసనంలో కూర్చుని ధ్యానం చేయటం ప్రారంభించాడు. భక్తితో, ఆర్తితో అతడు చేసిన ప్రార్థన ఫలించింది. దత్తస్వామి కంఠం వినిపించింది రూపం కనులుముందు కనిపించింది. కండ్లు తెరవాలనిపించి తెరిచాడు. ఎదురుగా భౌతికరూపంతో దత్తాత్రేయుల వారు దర్శనమిచ్చారు. అనుగ్రహించి సన్యాసదీక్ష ప్రసాదించారు. ఆ క్షణం నుండి ఆ యోగి "శ్రీ హంస" అయినాడు. అతడు తన మనస్సు నిరంతరము స్వామి యందు లగ్నమై ఉండే విధంగా వరమిమ్మని ప్రార్థించాడు. భక్తసులభుడైన స్వామి కరుణించి కోరిన వరమిచ్చాడు. అంతేకాక అతనిని 15 నిమిషాలలో ఆశ్రమానికి చేర్చాడు.

దత్తాత్రేయుని గురించి యిటువంటి లీలలు, కథలెన్నో ఆ ప్రాంతంలో చెపుతుంటారు. అయితే బ్రహ్మ, విష్ణు, మహేశ్వరమూర్తిత్రయాత్మకుడై త్రిముఖుడైన దేవునిగా కంటే జటాధారియైన ఋషిగానే సిద్ధాశ్రమవాసులాయనను భావిస్తుంటారు - దర్శిస్తుంటారు. దత్తాత్రేయుని అవతారాలకు సంబంధించిన ఒక కథలో ఆయన తల్లి అనసూయాదేవి కపిల మహర్షి సోదరిగా చెప్పబడింది. నేపాల్‌లో చిత్రకూట ప్రాంతంలోని ఒక కొండకు అనసూయా పర్వతమని పేరు. అత్రిమహర్షి పత్నియైన ఆ మహాపతివ్రత పేరుతో ఒక శైలం ప్రకాశించటంలో ఆశ్చర్యమేమీ లేదు. దీనిని బట్టి దత్తాత్రేయుడు ఉదయించింది - హిమాలయ పర్వత భూములలోనే అని తెలుస్తున్నది.

# 10. దేవాపి

ఇతడు చంద్రవంశీయుడైన ప్రతీపమహారాజు కుమారుడు. శంతనుడు, బాహ్లికుడు, ఇతని సోదరులు. దేవాపికి చిన్నతనము నుండి లౌకిక విషయము లందాసక్తి లేదు. వేదాది విద్యలయందభిరుచి లేదు. ఎప్పుడు నిర్గుణ నిరాకార పరబ్రహ్మాభావనతో ఉండేవాడు. కర్మిష్ఠులగు వేదవేత్తలితనిని నాస్తికునిగా భావించారు. పెరిగి పెద్దవాడైన తర్వాత నిస్సంగుడై ఇతడు అడవులకు వెళ్ళిపోయివాడు. ప్రతీపుని తర్వాత పెద్దకొడుకు అడవులు పట్టి పోయినాడు కనుక శంతనునకు పట్టం గట్టి మహారాజును చేశాడు. శంతనుడు రాజైన తర్వాత పన్నెండు సంవత్సరాలు దేశంలో వర్షాలు లేవు. బ్రాహ్మణులను కారణం చెప్పమని ప్రార్థిస్తే రాజ్యార్హుడైన అన్న ఉండగా నీవు రాజుకావడమే కారణం అది శాస్త్రవిరుద్ధమన్నారు. అప్పుడు కానలు వెదికించి దేవాపిని తెచ్చి మహారాజు పదవి స్వీకరించమని కోరారు.కాని అతడు శాస్త్రోక్త కర్మలు చేయటానికి, ఆచారాలు పాటించటానికి ఇష్టపడలేదు. వైదికులాతనికి పాషండునిగా భావించి వదిలేశారు. దేవాపి మళ్ళీఅరణ్యాలలోకి వెళ్ళిపోయినాడు. అంతట వేదవేత్తలు శంతనునిచేత యజ్ఞములు చేయించి వానలు కురిపించారు. శంతనుని కుమారుడు భీష్ముడు శంతునడు తర్వాత వ్యాసమాత సత్యవతిని వివాహమాడటము విచిత్ర వీర్య చిత్రాంగదులను కనటం - భారత కథ. దేవాపి హిమాలయాలకు వెళ్ళి యోగసిద్ధుడై కలాపగ్రామంలో తన నివాసం ఏర్పాటు చేసుకొన్నాడు. ఆ గ్రామం శంబళ ప్రాంతములోనిది. ఇదంతా సిద్ధాశ్రమ ప్రదేశం. కలియుగాంతము నందు కల్కి భగవానుడు ఉదయించినప్పుడు దేవాపి మానవులను దైవ చైతన్యయుక్తులను చేయటానికి తనయోగశక్తులను ఉపయోగిస్తాడు. ఆ కర్తవ్యం నెరవర్చటానికి ఆ మహాయోగి సిద్ధాశ్రమ కలాపగ్రామంలో ఉన్నాడు.

# 11. మరువు

ఇతడు శీఘ్రుడను మహాపురుషునికుమారుడు. వీరిది కుశుని వంశము. సూర్యవంశీయుడైన మరువు కఠోర తపస్సు చేసి యోగసిద్ధి సాధించాడు. శంతనుని అన్నయైన దేవాపి - ఇతడు మంచి స్నేహితులు. దేవాపి వలెనే యితడు కూడా సిద్ధాశ్రమ - కలాప గ్రామములో కలియుగాంతము దాకా ఉండి ధర్మస్థాపనకు తనశక్తిని వినియోగిస్తాడు. మేడమ్ బ్లావెట్ స్కీ ఇతనిని చూచింది. మోరియా అనే పేరుతో కనిపించిన ఇతని చిత్రం ఐసెస్ ఆన్వీల్డ్ గ్రంథంలో ఆమె ప్రచురించింది.

# 12. రాధాదేవి



ఉశీనరమహారాజు రాధాదేవి భక్తుడు. అతడు అతని భార్య పెద్దవారై వానప్రస్థాశ్రమంలో ఉండగా ఒక ఆడపిల్ల పుట్టింది. రాధాదేవి ఆజ్ఞతో మంచిబిడ్డను రావల్ గ్రామ సరస్సులో మధ్య ఉన్న పద్మంలో పెట్టి వెళ్ళిపోయినారు. ఆ బిడ్డను బర్సానా ప్రభువు వృషభాను మహారాజు, ఆయన భార్య కీర్తిదేవి రాధాదేవి ఆ దేశం వల్ల పెంచుకొన్నారు. ఆ బాలికలోకి జగదీశ్వరి రాధాదేవి ప్రవేశించింది. ఆమె కృష్ణుని ప్రేమించింది. వారు ఏకాంతంగా దివ్యశరీరాలతో రాత్రివేళ కలుసుకొన్నప్పుడు తమ అవతార రహస్యాలు ముచ్చటించుకొనేవారు. మధ్య మధ్య శ్రీ కృష్ణుడు మన జీవితవిశేషాలు గోలోక కార్యక్రమాలు గుర్తున్నవి కదా! అని స్మృతికి తెచ్చేవాడు. కృష్ణుడు మధురకు బయలుదేరిన తర్వాత భౌతికశరీరం నుండి గోలోక కృష్ణుడు బయటకు వచ్చినట్లే గోలోకనాయిక రాధ - రాజకుమారి శరీరంలో నుండి బయటకు రావటం తర్వాత సిద్ధాశ్రమానికి వెళ్ళి తపస్సు చేయటం జరిగింది. అనంతవరం కొంతకాలానికి ద్వారకనుండి జాంబవతి కోరికపై పుత్రసంతానం కోసం బయలుదేరి నారాయణ కృష్ణుడు కైలాస పర్వత సిద్ధాశ్రమంలో శివుని గూర్చి తపస్సు చేసి పరమేశ్వర సాక్షాత్కారం, కోరిన వరము పొందాడు. భౌమ భూమికలోని రాధాకృష్ణులిద్దరూ సిద్ధాశ్రమవాసులై సాధన చేసినవారే. ప్రధానంగా రాధాదేవి కథ యిక్కడ ఇవ్వబడుతున్నది.

## గోలోక ధామము

సృష్టి ప్రారంభం కావడాన్ని గురించి వేదములలో, శాస్త్రములలో, పురాణములలో బహురీతులుగా చెప్పబడింది.

"అసద్వా ఇదమగ్ర అసీత్ సదేవ సౌమ్యే దమగ్ర ఆసీత్ నాసదాసీన్నో

సదాసీత్" మొదట "అసత్" గానే ఉండేది. సృష్టికి ముందు లోకము నామరూపరహితమై అసత్ వలె ఉండెను. ఇది సృష్టికి ముందు "సత్" అయిన బ్రహ్మము వలెనూ ఉండెను. ఇది అసత్‌గా లేదు. సత్‌గానూ లేదు. ఇత్యాది శ్రుతివాక్యములచే నిర్ణయించబడిన సృష్టికి ముందు నిర్విశేషముగా చిన్మాత్రరూపము ఉన్నది. అనగా ఏకమేవ అద్వితీయం బ్రహ్మ". రెండవది అంటూ లేని ఏకవస్తువు బ్రహ్మము. ఆ బ్రహ్మము రెండుగా అయినది. బృహదారణ్య కోపనిషత్ ఆ విషయాన్ని ఇలా చెపుతున్నది.

**"ఆత్మానం ద్వేధా పాతయ త్తతః పతిశ్చపత్నీశ్చా భవతాం" బ్రహ్మకల**

'ఛాందోగ్యోపనిషత్‌లో కూడా ఈ విషయం ఈ విధంగా ఉద్ఘాటితమైనది.

**"సదేవ సోమ్యేద మగ్ర మాసీత్ ఏక మేవాద్వితీయం"**

**"తదైక్షత బహుస్యాం ప్రజా యేతి"**

సృష్టి కంటే ముందు రెండవది లేని ఒకే పదార్థము ఉండేది. అసద్రూపమైన బ్రహ్మము బహురూపములు కావాలని సంకల్పించింది. అపుడక్కడ ఉన్నది ఒక్క కాలం మాత్రమే, దానికి అవధులు లేవు, మొదలు తుది లేదు, ఏ గుణమూ లేదు, ఏ ఆకారమూ లేదు. పదార్థము అనడానికి వీలులేని పదార్థము. అనంతమైన నీలాకాశము. ఆ స్థితిలో అక్కడ ఒక మెరుపు మెరిసింది.

**"నీలతోయద మధ్యస్థాత్ విద్యుల్లేఖేవ భాస్వరా**
**నీవార శూకవత్ తన్వీ పీతా భాస్వ త్యణూపమా**
**తస్యా శ్శిఖాయా మధ్యే పరమాత్మా వ్యవస్థితః"**

వరిముల్లు అంత సన్నని పచ్చని వెలుగు. దానిలో నుండి 'అ'కార 'ఉ'కార 'మ' కారములతో గూడిన 'ఓం' కారనాదము. ఇంకా సరిగా చెప్పవలసి వస్తే ముందే నాదము. ఆ నాదమే ఆకారాన్ని ధరించిందా అన్నట్లు ఆ వెలుగు పెద్దదై బంగారు రంగు గల్గిన ఒక స్త్రీ మూర్తి ఆకారము రూపుదాల్చినది. పరబ్రహ్మము ధరించిన మొదటి ఆకృతి అది. ఆ ఆకృతి సృష్టి చెయ్యాలని సంకల్పించింది. ఆ సంకల్పము రస రూపము. పరబ్రహ్మము

యొక్క లక్షణము ఆనందము. అది రసము వల్లనే పుడుతుంది. శ్రుతి వాక్యము చూడండి.

**"రసస్య బ్రహ్మామృతస్య శేవధిః నిధిః రసోవైసః రసం. హ్యేవాయం లబ్ధ్వానందీ భవతి ఇతి శ్రుతేః బ్రహ్మాండేఽపి" రస ఏవ పరంబ్రహ్మ రస ఏవ పరాగతిః రసోహి కాంతిదః పుంసాం రసోరేత ఇతి స్మృతః. రసోవై రసం లబ్ధ్వాహ్యానందీ భవత్యపి వేదప్రామాణ్య సంసింద్ధ్యా రసః, ప్రాణతయా స్థితః, కో హ్యే వాన్యాచ్చుకః, ప్రాణ్యాత్ ఇత్యపి శ్రుతి భాషితః ప్రాణాత్మవో రసః ప్రోక్తః ప్రాణదః ఇతి –**

రస పారమ్యమును వేదము నిర్వచించగా బ్రహ్మాండపురాణము. దానిని మరికొంత వివరించినది. రసమే పరబ్రహ్మ. రసమే పరాగతి. రసమేకాంతి నిస్తుంది. రసమే రేతస్సు. రసస్వరూపుడు రసమును పొంది ఆనందిస్తాడు. రసమే ప్రాణము. ప్రాణము నిచ్చేది రసమే. అటువంటి రసదేవత అనంత ఆకాశమునందు అవతరించింది. ఆ అవతరణను "కేన" ఉపనిషత్తు ఇలా వర్ణించింది.

**"ఆకాశే స్త్రియా మా జగామ ఉమాం హైమవతీం బహు శోభమానాం"** హిరణ్యవర్ణంతో ఆ దేవత ఆకాశము నందు వ్యాపించింది. రసము ఆనందముగా పరిణమించినట్లుగా 'అ' కార 'ఉ' కార 'మ'కారములతో గూడిన ప్రణవము. 'ఉ'కార 'మ'కార 'అ'కారములతో 'ఉమ' అయినది. ఆ పరమేశ్వరి సృష్టి చేయాలని సంకల్పించగానే ఆకాశం 'రసాకృతి' ధరించినది. ఆనందరూపమయిన రసము సృష్టికి మూలము. ఆమెలో నుండి రసరూపుడైన నీల శ్యామల కోమల దేహుడొకడు ఉదయించాడు. 'దేవీభాగవతము' ఆమెను ఎలా వర్ణించిందో చూడండి.

**శ్లో॥ నిర్గుణా నిరహంకారా నిర్లిప్తాత్మస్వరూపిణీ.**
**నిరీహా, నిరహంకారా పరమానందరూపిణీ.**
**పరావరా పారభూతా పరమాద్యా సనాతనీ**
**పరమాహ్లాదరూపాచ సంతోషా హర్షరూపిణీ !**

**యథాంబరే నవఘనే నీలా సౌదామినీ ప్రభా**
**వహ్నా శుద్ధాంశుకధరా నానాలంకార భూషితా**
**కోటిచంద్ర ప్రభాపుష్ట సరశ్రీయుక్తవిగ్రహా**
**రాసమండలసంవాసా రాసమండల మండితా**
**రసదేవీ సురసికా రాసక్రీడాధినాయికా.**

రసస్వరూపిణి, ఆనందమూర్తి అయిన ఆ దేవతపేరు. 'రాధాదేవి'. ఆమెయే. ఆదిశక్తి, బ్రహ్మస్వరూపిణి. అకృత్రిమ నిత్య సత్యరూప, నిర్లిప్త, నిర్గుణ, ప్రకృతికి పర. ఆమె తన ఇచ్ఛ చేత, సృష్టి చేయాలని భావించింది. దాని కోసమే కృష్ణుని సృష్టించింది. ఆ కృష్ణుని ఆకృతి పురాణములలో వర్ణించబడిన తీరును చూడండి.

**"అతీవ కమనీయంచ శరీరం సుమనోహరమ్ ।**
**ద్విభుజం మురళీహస్తం స్ఫురన్మకరకుణ్డలమ్ ॥**
**ఈ షద్ధాస ప్రసన్నాస్యం భక్తానుగ్రహ కాతరమ్ ।**
**మణిరత్నేన్ద్ర సారాణాం భూషణైశ్చ విభూషితమ్ ॥**
**నవీన నీరదశ్యామం శోభితం పీతవాససా ।**
**చన్దనాగరు కస్తూరీ కుంకుమమద్రవ చర్చితమ్ ॥**
**శరత్పార్వణ చన్ద్రాస్యం బిమ్బాధర మనోహరమ్ ।**
**మయూరపుచ్ఛచూడం చ సద్రత్నముకుటోజ్జ్వలమ్ ॥**
**త్రిభంగి వక్రమధ్యం చ వనమాలా విభూషితమ్ ।**
**శ్రీవత్స వక్షసం చారు కౌస్తుభేన విరాజితమ్ ।**
**కిశోరవయసం శాన్తం కాన్తం బ్రహ్మేశయోః పరమ్ ॥"**

రెండు చేతులతో మురళీధరుడై పీతాంబరమును ధరించి మణిమయ మకుటము నందు నెమలియీక దాల్చి వనమాలా విభూషితుడై శ్యామసుందరుడు అవతరించాడు. క్షణంలో దివ్యధామమయిన "గోలోకము" సృష్టించబడింది.

ఆ లోకము నాశనము లేనిది, చిన్మయమయినది. అందులో 'విరజా'నది ప్రవహిస్తున్నది. దాని ఒడ్డు తళతళా మెరుస్తూ సుకుమారంగా

అలరారుతున్నది. అది దాటంగానే 'శతశృంగ' పర్వతము. దాని మధ్యలో రానమండలం. రత్నములు పొదిగిన బంగారు గోడలతో ఉన్న మహాభవనములు. కల్పవృక్షములతో అలరారే ఉద్యాన వనములు. ఆ తోటలలో మణిమయవేదికలు, సువర్ణమండపాలు సువాసనగల నీటితో నిండిన సరస్సులు, కోట్లసంఖ్యలో గోవులు, గోపకులు, గోపికలు. కోటియోజనముల విస్తీర్ణమైన దా లోకము. సర్వేశ్వరి అయిన రాధాదేవి కృష్ణుని కోసం 'రాధిక' అన్న పేరుతో తన అంశను 'గోలోకం'లో ఉంచింది. ఆమె పూర్ణ స్వరూపము. గోలోక ధామము కృష్ణునకు కూడ అతీతమైనది. ఇక గోలోకములో అధీశ్వరులుగా ఉన్న రాధికాకృష్ణులే' ఆది దంపతులు. వ్యవహార సౌలభ్యం కోసం రాధ, రాధిక అన్న పేర్లు ఒకటిగా ఇకపైన వ్యవహరింపబడుతుంది. ఈ రాధాకృష్ణుల లీలలు అనంతములు, అనూహ్యములు వారి రాసక్రీడలు భువనైక ప్రేమమోహనములు. 'శృంగారరస' సంవాహనములు. సఖులతో కలసి ఒకప్పుడు పాడుతుంటారు. ఒకప్పుడు ఆడుతూ ఉంటారు. ఒకరిపై ఒకరు అలుగుతూ ఉంటారు. మళ్ళీ విరహాన్ననుభవిస్తుంటారు. ఇరువైపులా సఖులు రాయబారాలు జరుపుతుంటారు. శ్రీకృష్ణుడు రాధతోనే గాక ఇతర గోపికలతోనూ క్రీడిస్తుంటాడు. రాధాదేవి కొన్నిసార్లు ఈర్ష్యపడుతుంది. మరికొన్ని సార్లు కోపిస్తుంది. ఇలా శృంగార రసజగత్తులోని సకలభావములకు వారి క్రీడలు ఆలంబనలు.

వారి క్రీడామయమయిన లీలలో నుండి అపారమైన సృష్టి ప్రారంభమయినది. ముందు త్రిమూర్తులు ప్రభవించారు. విష్ణువు, బ్రహ్మ, మహేశ్వరుడు. వారి కోసం వైకుంఠము, సత్యలోకము, కైలాసము నిర్మించబడ్డాయి. వారికి సర్వలోకాధికారము అప్పగించబడినది. సృష్టి, స్థితి, లయకారులుగా బ్రహ్మ, విష్ణు, మహేశ్వరుల పరిపాలన మొదలు అయినది. వారిచే పై నుండి క్రిందివరకు ఊర్ధ్వలోకములు, అధోలోకములు నిర్మితమయినవి. సత్యలోకము తరువాత, తపోలోకము. ఆ క్రింద జనలోకము, ఆ క్రింద మహర్లోకము. అదే వరుసలో సువర్లోకము, భువర్లోకము, భూలోకము నిర్మింపబడినవి. అధోలోకములు ఏడు. అతల, వితల, సుతల, తలాతల, రసాతల, మహాతల, పాతాళములు. నక్షత్రమండలము, నవగ్రహములు

ఇంద్రాది, దిక్పాలకులు, దేవతలు, విద్యాధర, అప్సరో, యక్ష, రక్షో, గంధర్వ, కిన్నర, పిశాచ, గుహ్యక, సిద్ధ, భూతగణములు సృష్టించబడినవి. భూలోకములో ప్రకృతి చరాచరములు, జంతువులు, మనుష్యులు, సృజియించబడినవి. ఇదంతా కలసి ఒక బ్రహ్మాండము. రాధాకృష్ణుల చేత ఇటువంటి బ్రహ్మాండములు కొన్ని వేలు లక్షలు అనంతముగా సృష్టించబడినవి. ప్రతి బ్రహ్మాండములోను త్రిమూర్తులు, ఇంద్రాదులు, పైన చెప్పబడిన వానిలో వలెనే ఉంటారు. ఇలా జరుగుతుండగా ఈ శ్వేతవరాహ కల్పములో 199 కోట్ల పైన సంవత్సరములు గడచిన పిదప ఒక మహాద్భుత లీల ప్రారంభమయినది. దానిని చూడడం కోసం మళ్ళీ గోలోకం దగ్గరికి వెళ్దాము.

గోలోకంలో జరిగే ఈ లీలా విలాసాల మధ్య ఒక దివ్యకథ ప్రారంభమయినది. అదీ వారి ఇచ్ఛా విశేషమే. ఒకనాడు కృష్ణుడు రాధాదేవితో ఏకాంతప్రదేశములో శృంగార క్రీడలు చేసాడు. ఆ మధురానుభవముతో రాధాదేవి పరవశించిపోయినది. అదే సమయంలో గోలోకంలో ఉన్న విరజాదేవి అనే అద్భుత సౌందర్యవతి తనను అనుగ్రహించమని కృష్ణుని ప్రార్థించింది. కృష్ణుడు ఆమెతో కలసి మరొక రమణీయ హర్మ్యములో క్రీడిస్తున్నాడు. అక్కడ పరవశించి ఉన్న రాధకు మెలుకువ వచ్చింది. కృష్ణుడు లేడు. చెలికత్తెలు కృష్ణుడు విరజాదేవితో ఉన్న సంగతి చెప్పారు.

రాధకు కోపం వచ్చింది. వెంటనే ఒక దివ్యరథాన్ని ఆరోహించి చెలులతో సహా విరజా శ్రీకృష్ణులు విహరిస్తున్న భవనం దగ్గరికి వెళ్ళింది. లోపలికి ప్రవేశించబోగా కృష్ణుని అనుచరులు. శ్రీదాముడు అనే గోపకుమారుడు ద్వారానికి అడ్డంగా నిలిచి ఆమెను ఆమెతో వచ్చిన గోపికలను లోపలికి పోనీయలేదు. గోపికలు శ్రీదామునిపై అరిచారు. పెద్ద కోలాహలం జరిగింది. ఈ రణధ్వని లోపల ఉన్న విరజాకృష్ణులకు వినిపించింది. రాధాదేవి కోపంతో వచ్చిందని తెలుసుకొని కృష్ణుడు మాయమయినాడు. ఆయనతో పాటు శ్రీదాముడు కూడ వెళ్ళిపోయినాడు. శయ్యాగారంలో ఉన్న విరజాదేవికి చాలా భయంవేసింది. రాధాదేవి యేమి చేస్తుందో అని ఆమె యోగమార్గాన ప్రాణత్యాగం చేసింది. ఆమె శరీరం వెంటనే ఒక నదిరూపాన్ని ధరించి కోటి యోజనముల విస్తీర్ణంతో సుదీర్ఘరూపంతో గోలోకమును చుట్టివేసింది. రాధాదేవి

అంతఃపురాన్ని ప్రవేశించే సరికి విరజాదేవి లేదు. జరిగిన విషయాన్ని చూసి రాధాదేవి తన అంతఃపురానికి వెళ్ళిపోయింది. అయితే కృష్ణునికి విరజాదేవి మీద మోహం తీరలేదు. విరజానదీ తీరానికి వెళ్ళి ఆమెను ప్రేమతో ఆహ్వానించాడు. "విరజా నీవు లేనిది నేను జీవించలేను. నా కోసం మళ్ళీ పూర్వం కంటె సుందరమయిన ఆకారాన్ని ధరించు. నా ఆశీర్వాదము వల్ల సమస్త నదులకు అధిష్ఠాన దేవతగా ఉండే వరాన్ని నీకు ప్రసాదిస్తున్నాను" అన్న ఆ పరమేశ్వరుని కోరిక ప్రకారము విరజానదీదేవి అధికతర లావణ్యమూర్తియై కృష్ణుని దగ్గరకు వచ్చింది. వారి శృంగారక్రీడల ఫలితంగా ఆమెకు ఏడుగురు కుమారులు ప్రభవించారు. వారే తరువాత సప్త సముద్రాలు అయినారు. ఈ విషయాలన్నీ సఖులు రాధాదేవికి చేరవేశారు. ఆమెకు తీవ్రమయిన అగ్రహం కల్గింది. రాజాంతఃపురాలలో మహరాణులకు కోపంవస్తే దానికోసం ప్రత్యేకంగా కోపగృహాలు ఏర్పాటు చేయబడి ఉంటాయి. రాధాదేవి అంతఃపురంలో కూడ అటువంటి విభాగం ఉంది. ఆమె కోపగృహాన్ని ప్రవేశించి భూమిమీద శయనించింది. ఈ వార్త కృష్ణునికి చేరగానే శ్రీదామునితో కలిసి ఆమె అలక తీర్చడానికి కోపగృహమునకు వచ్చాడు. కాపలా ఉన్న గోపికలు కృష్ణుని లోపలకు పోనీయలేదు. కృష్ణుడు వచ్చిన వార్త చెలులు చెప్పగా విన్న రాధాదేవి తలుపు దగ్గరకు వచ్చి కృష్ణుని కఠిన వచనములతో అధిక్షేపించినది. "కృష్ణా ఇక్కడి నుండి వెళ్ళిపో. నాతో నీకు ఏమి పని ? నా కంటె ప్రియమైన కాంతలు నీకు చాలా మంది ఉన్నారు. ఆ విరజ దగ్గరకే వెళ్ళు. ఆమె నది అయినది గదా ! దాని ఒడ్డుననే ఇల్లు కట్టించుకొని ఆమెతో కులుకుతూ ఉంటూ ఆమెతో మోజుతీరితే రాజులు నూతనప్రియులు గదా! పద్మావతి యింటికో, రత్నమాల గృహానికో వనమాల చెంతకో వెళ్ళు" అని కసిరి రాధాదేవి లోపలికి వెళ్ళిపోయింది. పోతూ పోతూ ఎట్టి పరిస్థితులలోను కృష్ణుని లోపలికి రానీయవద్దని చెలికత్తెలకు ఆజ్ఞ యిచ్చినది. ఆమె ఆజ్ఞను అందుకొన్న గోపికలు కృష్ణుని అక్కడ నుండి వెళ్ళిపొమ్మని చెప్పారు. కొందరు గోపికలు కృష్ణా! దేవి కోపం తగ్గిందాకా దూరంగా వెళ్ళు. ఇపుడు కోపించింది గాని ఆమె మాత్రం నిన్ను విడిచి వుండగలదా ? అలక తీరేదాకా కొంతకాలము అవతల వేచియుండుట మంచిది". మరికొందరు ఆమె కోపాన్ని పోగొట్టడానికి

మార్గమేదైనా ఆలోచించుకొమ్మన్నారు. ద్వారపాలికలు మాత్రం నిష్ఠురంగా నిన్ను లోపలికి పోనీయము, వెళ్ళిపొమ్మని దర్పంతో పలికారు. ఇందరూ ఇన్ని మాటలంటున్నా కృష్ణుని ముఖాన చిరునవ్వు చెదరలేదు. ఆ గోలోకనాయకుడు నెమ్మదిగా వెనక్కు వెళ్ళిపోయినాడు. దేవదేవుడు వెళ్ళిపోయినా ఆయన అనుచరుడు ఆత్మసఖుడు అయిన శ్రీదాముడు కదలిపోక ఆగ్రహావిష్టుడై కఠినంగా ఇలా అన్నాడు. "రాధాదేవీ ! తెలిసీ తెలియక పరుష వాక్కులతో ప్రభువును నొప్పించావు. కృష్ణుడు ఎవరనుకున్నావు? ఈశ్వరుడు, పరముడు, సచ్చిదానంద విగ్రహుడు, ఆదియు, అనాదియును అయినవాడు, సర్వకారణ కారణుడు, స్వాత్మారాముడు, పూర్ణకాముడు. ఆయన అనుగ్రహం వల్ల, ఆయన పాదపద్మాలు సేవించడం వల్ల గోపీమండలిలో నీకు శ్రేష్ఠత్వము వచ్చింది. ఆయన ప్రేయసి కావడం వల్ల దేవతలు ఋషులు నిన్ను పూజిస్తున్నారు. సర్వేశ్వరుడు అయిన నా కృష్ణుడు తలచుకుంటే నీవంటి వారిని కోట్లమందిని సృష్టించగలడు. ఆయన దయవల్ల అధికారాన్ని పొందిన నీవు గొప్పదానవనుకుని. జగన్నాథుని మీదనే కోపం ప్రదర్శించావు. మానవివలె క్రోధానికి వశురాలవై అనుచితముగా ప్రవర్తించావు. ప్రేమతో దగ్గరకు వచ్చిన కృష్ణదేవుని తిరస్కరించావు. దీని ఫలితముగా మానవలోకంలో పుట్టి కృష్ణుని వియోగాన్ని అనుభవించెదవు గాక" అన్నాడు. రాధాదేవి ఆ కఠినోక్తులు విని శ్రీదాముని ఉద్దేశించి ఈ విధంగా పలికింది. "మూర్ఖుడా ! సర్వజ్ఞుడను అనుకునే అజ్ఞానివి నీవు. నన్ను గురించే కాదు. నీ ప్రభువును గురించి గూడా నీకు ఏమీ తెలియదు. అల్పుడా ! కృష్ణుడు నీకు మాత్రమే ప్రభువా ? నాకు కాదా ? కోపములు, అలుకలు, బ్రతిమలాడటం, రసప్రపంచంలోని విన్యాసాలు, కేవలం దాస్యభావంతో కృష్ణుని వెంట ఉండే నీకు మధుర ప్రేమ భక్తిలోని సన్నివేశాలు ఎలా అర్ధమవుతాయి ? తెలియని వాడివి తెలియనట్లుండక హద్దుమీరి అసురునివలె ప్రవర్తించావు. ప్రేమమయమయిన ఈ లోకంలో ఉండే అర్హత నీకు లేదు. భూమి మీద అసురుడవై జనియింతువు గాక". శ్రీదాముని ద్వారపాలికలు బయటకు పంపివేశారు. అతడు శ్రీకృష్ణుని సన్నిధికి వెళ్ళి జరిగిన విషయాన్ని నివేదించి రాధాదేవి శాపం వల్ల వచ్చే కృష్ణ వియోగాన్ని భరించలేనని శోకించడం మొదలు పెట్టాడు. శ్రీకృష్ణుడు అతనిని

ఓదార్చి "వత్సా ! రాధాదేవి శాపము అనుల్లంఘనీయము. ఆమె ఆజ్ఞను కాదనడం ఎవరికీ శక్యం గాదు. కొన్నాళ్ళు గోలోక నివాసం నీకు వీలులేదు. శంఖచూడుడను పేరుతో అసురుడవయి జన్మించి తపస్వివై అజేయుడవై 50 యుగాలు భూమిని పరిపాలించి శివుని త్రిశూల ఘాతం వల్ల మరణించి మళ్ళీ యిక్కడకు చేరుకుంటావు" అన్నాడు. శ్రీదాముని పాత్ర ఇక్కడ తాత్కాలికంగా ముగిసింది. అయితే రాధాదేవి మానవలోకంలో అవతరించడానికి అది దారి తీసింది.

తరువాత శ్రీకృష్ణుడు రాధాదేవి వద్దకు వెళ్ళి శ్రీదాముడు ఇచ్చిన శాపాన్ని గురించి ప్రస్తావించాడు. రాధాదేవి "నీ భక్తుడు ఇచ్చిన శాపాన్ని అనుభవించడం ధర్మం. మన భక్తుల వాక్కులు వ్యర్థం కారాదు" అన్నది. కృష్ణుడు "మనకు వియోగం అనేది లేదు. మానవలోకంలో నీ అంశ శాపాన్ని అనుభవించును గాక. మానవులు నీవు కృష్ణవియోగంతో నూరు సంవత్సరాలున్నట్లు అనుకుంటారు. దానికి తగిన ప్రణాళిక పరిస్థితి ఏర్పడుతుంది. ఏకాత్మలమయిన మనకు వియోగమనేది ఎన్నడూ ఉండదు" అన్నాడు. రాధాదేవి ఆ మాటలు విని స్వామీ నేను భూమిపై అవతరించడానికి కావలసిన సన్నివేశం ఏర్పడింది. మరి మీరు ఏ కారణం వల్ల అవనిపై అవతరిస్తారు"? అని ప్రశ్నించింది. గోలోక నాయకుడు దరహాసంతో 'ఆ సంగతి రేపు చూచుకుందాము. శతశృంగ పర్వతము మీది నుండి వస్తున్న ఆ చంద్రుని వెన్నెల వెలుగులలో విహరిద్దాము పద" అన్నాడు. ఇద్దరూ అటువైపు తరలి వెళ్ళారు.

## అవతార భూమిక

సృష్టి ప్రారంభమయి ఏడవ మన్వంతరం నడుస్తున్నది 28వ మహాయుగంలో త్రేతాయుగం పూర్తయి ద్వాపరం గూడా చివరకు వచ్చేసింది. పూర్వయుగాలలో విష్ణువు చేత హతులయిన రాక్షసులెందరో మళ్ళీ భూలోకంలో జన్మ ఎత్తారు. కలియుగం సమీపిస్తుండడంతో అధర్మ ప్రభావం ఎక్కువ అయింది. యజ్ఞ యాగాదులు సన్నగిల్లినవి. అన్యాయాలు, అక్రమాలు, దౌర్జన్యాలు పెరిగిపోయినవి. అజేయ బలసంపన్నులయిన రాక్షసులు. కంసుడు,

నరకుడు, బాణుడు మొదలయినవారు ధర్మవినాశనం చేస్తున్నారు. వారిని అడ్డుకోగలవారు ఎవరూ కనబడడం లేదు. ఆ దారుణ పరిస్థితిలో భూదేవి ఇంద్రాది దిక్పాలకులను కలుపుకొని బ్రహ్మ దగ్గరకు వెళ్ళింది. బ్రహ్మ ఆమె విన్నపాన్ని విన్నాడు. పాపుల భారాన్ని భరించలేకున్న భూదేవి గోడు విని బ్రహ్మదేవుడు ఇలా అన్నాడు. "భూదేవీ! ఇంద్రాదిదేవతలారా ! లోకంలో పాపం పెరిగినపుడు, అసురశక్తులు విజృంభించినపుడు రక్షకుడు విష్ణుమూర్తి మాత్రమే. ఆయన ప్రతిజ్ఞ మీకు తెలుసు గదా.

**శ్లో॥ యదా యదాహి ధర్మస్య గ్లానిర్భవతి భూతలే**
**అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానం సృజామ్యహం.**
**శ్లో॥ పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతాం**
**ధర్మ సంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే. - భగవద్గీత**

కనుక మనమంతా వైకుంఠధామానికి వెళ్ళి విష్ణుమూర్తిని ప్రార్థిద్దామని అన్నాడు. బ్రహ్మాండంలో ఊర్ధ్వభాగాన బ్రహ్మయొక్క సత్యలోకానికి నూరు కోట్ల యోజనముల పైన అప్రాకృత వ్యోమము నందు వైకుంఠధామము విలసిల్లుతున్నది. ఆ ధామములోనికి దేవతలు గూడ మామూలుగా ప్రవేశించలేరు. అటువంటి దివ్య చిన్మయధామానికి బ్రహ్మ ముఖ్యులైన శివేంద్రాదులతో కలిసి వెళ్ళాడు. ద్వారపాలకులు కొలువుకూటలంలో ఉన్న స్వామి వద్దకు వెళ్ళి విన్నవించగా ఆ విష్ణుదేవుడు లక్ష్మీసహితుడై వారికి దర్శన మిచ్చాడు. రత్నసింహాసనాసీనుడై రత్నాలంకారభూషితుడై పీతాంబరధారియై వనమాలా విభూషితుడై చతుర్భుజుడై సునందుడు, నందుడు, కుముదుడు మొదలైన పార్షదులు సేవిస్తుండగా దయాపూర్ణమైన చూపులతో సుందరదరహాసంతో దర్శనమిచ్చిన పద్మాక్షునకు అందరూ సాష్టాంగ దండ ప్రణామాలు చేశారు. వారా మహాపురుషుని భక్తిభరితులై ఈ విధంగా స్తోత్రం చేశారు.

"నమామి కమలాకాన్తం శాన్తం సర్వేశ మచ్యుతమ్ ।
వయం యస్య కలాభేదాః కలాంశకలయా సురాః ।
మనవశ్చ మునీన్ద్రశ్చ మానుషాశ్చ చరా చరాః ।
కలాకలాంశకలయా భూతా స్త్వత్తో నిరంజన ॥

త్వా మక్షయ మక్షరం వా రామ మవ్యక్త మీశ్వరమ్ ।
అనాది మాది మానన్దరూపిణం సర్వరూపిణమ్ ॥
అణిమాదిక సిద్ధీనాం కారణం సర్వకారణమ్ ।
సిద్ధిజ్ఞం సిద్ధిదం సిద్ధిరూపం కః స్తోతుమీశ్వరః ॥
వేదే నిరూపితం వస్తు వర్ణనీయం విచక్షణైః ।
వేదేఽ నిర్వచనీయం యత్తన్నిర్వక్తుం చ కః క్షమః॥
యస్య సమ్భవనీయం యద్గుణరూపం నిరంజనమ్ ।
త త్తోతిరిక్తం స్తవనం కిమహం స్తౌమి నిర్గుణమ్ ॥
బ్రహ్మాదీ నామిదం స్తోత్రం షట్ శ్లోకోక్తం మహామునే ।
పఠిత్వా ముచ్యతే దుర్గాత్ వాంఛితం చ లభేన్నరః ॥"

నేను, దేవతలు, మనువులు, ఋషులు, మనుష్యులు, చరాచరములు, సమస్త సృష్టి, నీ కలలో, అంశములో వాని అల్పభాగములో. అన్నింటికి మూలమయిన సర్వేశ్వరుడవు, అచ్యుతుడవు, లక్ష్మీకాంతుడవు, నిరంజనుడవు, అట్టి నీకు నమస్కరిస్తున్నాను. నాశనము లేనివాడవు, ఆత్మారాముడవు, అవ్యక్తుడవు, ఈశ్వరుడవు, అది అనాది అయిన వాడవు, అణిమాదిసిద్ధులకు కారణమయిన వాడవు, సిద్ధిదాతవు, సిద్ధిస్వరూపుడవు అయిన నిన్ను స్తుతించడానికి ఎవరు సమర్ధులు ? వేదములలో నిరూపితమైన దానిని పండితులు వర్ణించవచ్చును. కానీ అనిర్వచనీయమని శ్రుతులు వర్ణించిన దానిని కూర్చి పలకడం ఎవరికి సాధ్యమవుతుంది. దేనికి పుట్టుక ఉన్నదో, గుణమున్నదో, రూపమున్నదో దానిని కీర్తింపవచ్చును. అవిలేని దానిని నిర్గుణము, నిరంజనము, అజము అయిన నీ తత్వమును మే మెలా స్తుతించగలము.

ఈ విధముగా భక్తితో తనను స్తోత్రము చేస్తున్న బ్రహ్మాదులతో వైకుంఠాధిపతి ఈ విధంగా పల్కాడు.

"బ్రహ్మా, శివాది దేవతలారా ! మీరెందుకు వచ్చారో నాకు తెలుసు. భూదేవి పాపుల భారాన్ని భరించలేకపోతున్నది. మిత్రద్రోహులు, కృతఘ్నులు, గురుదేవ నిందకులు, విశ్వాసఘాతకులు ఎక్కువ అయినారు. దైవభక్తి తగ్గిపోయింది. విశేషించి పూర్వయుగాలలో మరణించిన కాలనేమి

మొదలయిన రాక్షసులు మళ్ళీపుట్టారు. వారిని సామాన్యులు సంహరించలేరు. ఇపుడా కాలనేమిని నేను కూడా చంపడానికి వీలులేదు. వాడు దేవాసుర యుద్ధంలో నా చేత చంపబడిన తరువాత శుక్రాచార్యుడా రాక్షసుని తన సంజీవినీ విద్యాబలంతో మళ్ళీ బ్రతికించాడు. వాడు నా చేతిలో చావు, రాకుండా వుండాలని సంకల్పించి మందరపర్వతం మీద 'గరిక రసం' మాత్రమే త్రాగుతూ నూరు సంవత్సరములు తపస్సు చేసాడు. బ్రహ్మదేవా ! నీవే అతని తపస్సునకు మెచ్చి నా చేతిలో మృత్యువు రాకుండా వరమిచ్చావు. నీ మాట నిలబెట్టడం నా ధర్మం. అందుచేత కంసుని నేను సంహరించరాదు. అదే విధంగా నేను శ్వేత వరాహ రూపాన్ని ధరించినపుడు ఈ భూదేవి నా వలన సంతానాన్ని అపేక్షించింది. ఆమె కోరిన సమయం అసుర సంధ్యావేళ కావడం వల్ల ఆమెకు రాక్షసుడుదయించాడు. లోకాపకారకుడు అయిన రాక్షసుడు తన కుదయిస్తాడన్న భయంతో కొన్ని కోట్ల సంవత్సరాలు ఈమె ఆ గర్భాన్ని మోస్తూనే యున్నది. ఇటీవల నెప్పులు భరించలేక బాధపడుతుంటే నా శంఖముతో ఆమె గర్భాన్ని స్పృశించి బాధలేకుండా సుఖప్రసవం అయ్యేలా చేశాను.

ఈ ధరాదేవి ఆ పిల్లవానిని పెంచమని మిథిలాపతి అయిన జనకునికి అప్పగించినది. వాడు పెరిగిపెద్దవాడయి బల యౌవన సంపన్నుడయి ఆటలలో జనకపుత్రుని హింసిస్తున్నాడు. రాజకుమారుడు దానిని భరించలేక ఈ బాలుడయిన నరకుని మీద తండ్రి దగ్గర ఆరోపణలు చేసాడు. అతడు భూదేవికి మళ్ళీ ఆ బాలుని యిచ్చాడు. భూదేవి నన్ను ప్రార్థించగా ఇటీవలెనే వానికి కామరూప రాజ్యము యిచ్చి ప్రాగ్జ్యోతిషము రాజధానిగా పట్టాభిషేకము చేశాను. వాడు అసురుడు గనుక వామాచార మార్గంలో అక్కడి అష్టాదశ మహాపీఠములలోని 'యోని' పీఠ దేవత అయిన 'కాళి'ని ఆరాధించి కొన్ని తీవ్రశక్తులను సాధించాడు. వానిని దుర్వినియోగం చేసి దేశంలోని 16000 రాజకుమార్తెలను పట్టి తెచ్చి బలాత్కరించి అనుభవించాడు. వారంతా వాడి చేతిలో బందీలుగా ఉన్నారు. నీకూ తెలుసు, వాడు ఇంద్రుని కూడ జయించాడు. దేవమాత అయిన అదితిదేవి కుండలము లపహరించాడు. వాని పాపము పండుతున్నది. అసురుడయినా నా కుమారుడు గనుక నేను వానిని

సంహరించడం ఉచితం గాదు. ఇటువంటి సమస్యలు మరికొన్ని ఉన్నవి. కనుక వీటి పరిష్కారానికి వేరే మార్గమాలోచించాలి.

అంతట బ్రహ్మ - "కమలాకాంతా ! చక్రధారీ ! నీవే ఈ విధంగా పల్కితే ఇంక ఈ లోకాలకు దిక్కెవరు ? నీ కంటె మహనీయులెవరున్నారు. రక్షించగల్గిన మహా ప్రభు వెవ"రన్నాడు. దానిని విని విష్ణుదేవుడు" ఉన్నాడు. నా కంటే అత్యధికుడు, పరిపూర్ణతముడు, బ్రహ్మాండాతీతుడు అయిన మరొక ఆదిదేవు డున్నాడు. పదునాల్గు లోకాలతో, నక్షత్ర గ్రహమండలంలో ఉన్న యీ బ్రహ్మాండానికి ఆవల మరొక దివ్యధామమున్నది. దాని పేరు గోలోకము. దాని కధీశ్వరులు రాధాకృష్ణులు. మన మక్కడికి వెడదాము. ఆయనకు విన్నవించుకొని మన సమస్యలకు పరిష్కారం పొందుదాము" అన్నాడు. బ్రహ్మాదులకు చాలా ఆశ్చర్యం కల్గి "వైకుంఠవల్లభా ! మీ కంటె వేరొక మహత్తర పురుషుడున్నాడని మేము ఊహించలేకుండా ఉన్నాము. ఈ బ్రహ్మాండములకు అతీతయిన ఆ లోకాన్ని ఆ ఆది దంపతులను మాకు దయచేసి దర్శింపచేయండి" అని అడిగాడు. విష్ణుదేవుడు వీరిని తీసుకుని వైకుంఠం లోకానికి పైన బ్రహ్మాండము యొక్క శిరోభాగాన ఉన్న ఒక ఛిద్రము దగ్గరకు తీసుకొని వెళ్ళాడు. అది అక్షయమయిన బ్రహ్మద్రవజలంతో నిండి ఉన్నది. సొరంగం లాగా ఉన్న ఆ జలమార్గం గుండా ప్రయాణించి, బ్రహ్మాండము దాటి పైకి వచ్చి చూస్తే బ్రహ్మాండమంతా ఒక 'తుంబీ'ఫలము లాగా కన్పించింది. అలా పైకిపోతూ పోతూ ఉంటే ఆ బ్రహ్మద్రవము ఒక మహాసముద్రము లాగా ఉండి బ్రహ్మాండాలు ఎన్నో దానిలో 'ఇంద్రాయణ' ఫలములు లాగా దొర్లుతూ ఉన్నవి. అలా కోట్ల యోజనములు దాటి వీరంతా గోలోకాన్ని చేరారు. అక్కడ పరమ సుందరమయిన విరజానది ప్రవహిస్తున్నది. అవి దాటి అద్భుతమైన శతశృంగ పర్వతాన్ని చూశారు. ఆ ప్రదేశంలో కన్నులు మిరుమెట్లు గొలిపే ఒక మహానగరం కన్పించింది. అక్కడ అడుగు పెట్టగానే మహానగర ద్వారము దగ్గర కావలి కాస్తున్న పాలికాగణము వారిని అడ్డగించారు. ఆ కావలిభటులకు నాయిక అయిన 'శతచంద్రానన' అనే అధికారిణి మీ రెవరు? ఏ బ్రహ్మాండము నుండి వచ్చారు ? మీ పేర్లు అధికారాలు ఏమిటి ? అన్నది. బ్రహ్మాదులు ఏమి చెప్పాలో తోచని స్థితిలో ఉండగా విష్ణుదేవుడు ఈ విధంగా

జవాబు చెప్పాడు. "పృశ్నిగర్భము నుండి సనాతన త్రివిక్రమ భగవానుడు అవతరించిన బ్రహ్మాండము నుండి మేము వచ్చాము. అక్కడ సృష్టి, స్థితి, లయములు చేసే బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులము మేము. మాతో వచ్చినవారు దేవతా ముఖ్యులు, భూదేవి. మా రాకను మహాప్రభువయిన కృష్ణస్వామికి విన్నవించి వారి దర్శనానికి అవకాశాన్ని కల్పించవలసినది" అన్నాడు. శత చంద్రానన లోపలకు వెళ్ళి ప్రభువనుజ్ఞ తీసుకొని వచ్చి వారిని లోనికి పంపింది. మహానగర ద్వారము నుండి కొలువుకూటానికి వెళ్ళే లోపల వారెన్నో రమణీయమైన దృశ్యాలను చూసారు. గోవర్ధనమనే పేరుగల పర్వతము అక్కడ శోభిల్లుతూ ఉన్నది. వసంతోత్సవంతో ఆ ప్రదేశమంతా వైభవోపేతంగా ప్రకాశిస్తున్నది. మందార వృక్షములు, కల్పలతలు, గోపికలు, గోవులు అసంఖ్యాకంగా ఉన్నవి. నల్లని యమునానది ప్రవహిస్తున్నది. నదిలో సువర్ణకమలాలు వాటిపై తుమ్మెదలు ఒడ్డున కుండములు, అదంతా ఒక దివ్యమయిన బృందావనము. నలుపు, తెలుపు, పసుపు, ఎఱుపు వన్నె గల్గిన గోవులు, వాటి కొమ్ములకు బంగారు తొడుగులు, వాని మెడలలో చిరుగంటల దండలు, అదే విధంగా వివిధ వర్ణాలతో సౌందర్యమే మూర్తీభవించిన దా అన్నట్లుగా ఉన్న వేలమంది గోపికలు. అదంతా పెద్ద పండుగ వాతావరణముగా ఉన్నది. ప్రధాన రాజభవనంలోకి ప్రవేశించగానే ఒక పెద్ద సహస్రదళ పద్మము, దానిపై 16 దళాల పద్మము, దానిపై ఎనిమిదిదళాల కమలం దాని మీద ఉన్నత సింహాసనము. మణిగణ సహితమైన సింహాసనముపై ఆసీనులయి రాధాకృష్ణులు వీరికి దర్శనమిచ్చారు. ఒక వైపు మోహిన్యాది అష్టసఖులు మరొకవైపు శ్రీ దామాది అష్టగోపాలురు ఆ దేవీ దేవులను సేవిస్తున్నారు. ద్విభుజుడు, మురళీధరుడు అయిన శ్రీకృష్ణుని, సువర్ణవర్ణోల్లసితమైన రాధాదేవిని దర్శించి ఆనందాశ్రువులతో పులకిస్తూ ప్రణమిల్లి వినయంతో ఈ స్తోత్రం చేశారు.

శ్లో॥ కృష్ణాయ పూర్ణపురుషాయ పరాత్పరాయ
యజ్ఞేశ్వరాయ పరకారణ కారణాయ ।
రాధావరాయ పరిపూర్ణతమాయ సాక్షాద్
గోలోక ధామ ధిషణాయ నమః పరస్మై ॥

**యో రాధికా హృదయసుందర చంద్రహారః**
**శ్రీ గోపికా నయన జీవన మూలహారః ।**
**గోలోక ధామ ధిషణ ధ్వజ ఆదిదేవః**
**సత్వం విపత్సు విబుధాన్ పరిపాహి పాహి ॥**

పూర్ణపురుషుడు, పరాత్మరుడు, యజ్ఞేశ్వరుడు, పరకారణకారణుడు, పరిపూర్ణతముడు, గోలోకాధీశ్వరుడు, రాధావరుడు అయిన కృష్ణునికి నమస్కారము. రాధా హృదయమున అందమయిన చంద్రహార రూపమున ఉండువాడు, గోపికల ప్రాణాధారమయిన వాడు, ఆదిదేవుడు అయిన గోలోకవల్లభుడు మమ్ము ఆపదల నుండి కాపాడును గాక. గోపాల రూపమున లీలావిహారము సేయువాడా!గోవులను వర్ధిల్లచేయువాడా! దేవతల నుద్ధరించువాడా! వేదములకు అధీశ్వరుడా! ధర్మమును ఉద్ధరించవలసినది.

సజలాంబుద వర్ణాభుడు చిరునవ్వుతో అందమయిన రూపుగలవాడు, మూడు లోకములను మోహింపచేయువాడు, పరమాహ్లాదకరమైన ఆకృతి కలవాడు, మకర కుండలకాంతులు ప్రతిఫలిస్తున్న గండస్థలము కలవాడు, హరిద్రావర్ణము గల్గిన వస్త్రముతో విరాజిల్లువాడు, దొండపండువలె ఎఱ్ఱనైన పెదవి కలవాడు, కౌస్తుభాలంకృతమైన వక్షః కవాటుడు, మురళీధరుడు, ద్విభుజుడు అయిన కృష్ణదేవుని స్తుతించి ఆయన పక్కనే ఆసీనురాలయిన రాధాదేవిని కూడ స్తుతించారు.

**శ్లో॥ "అత్ర తేజసి చ రాజ్ఞీం దదృశుః రాధికాభిదామ్ ।**
**పశ్యన్తీం సస్మితం కాన్తం పశ్యన్తీం వక్రచక్షుషా ॥**
**ముక్తాపంక్తి వినిన్ద్యైక దన్తపంక్తి విరాజితామ్ ।**
**ఈష ద్ధాస్య ప్రసన్నాస్యాం శరత్పఙ్కజ లోచనామ్ ॥**
**బన్ధు జీవప్రభామోష్యా ధరౌష్ఠ రుచిరామ్బరామ్ ॥**
**రణన్మంజీర యుగ్మేన పాదామ్బుజ విరాజితామ్ ।**
**మణీన్ద్రాణాం ప్రభామోషి నఖరాజీ విరాజితామ్ ॥**
**కుఙ్కుమాభాస మాచ్ఛాద్య పాదాఙ్గధోరాగభూషితామ్ ।**
**అమూల్య రత్న సారాణాం పాశకశ్రేణీ శోభితామ్ ॥**

హుతాశన విశుద్ధాంశు కామూల్యజ్వలితోజ్జ్వలామ్ ।
మహామణీన్ద్ర సారాణాం కింకిణీమధ్య సంయుతామ్ ॥
సద్రత్నహార కేయూర మణికంకణ భూషితామ్ ।
రత్నేన్ద్ర రచితోత్కృష్ట కపోలోజ్జ్వల కుణ్డలామ్ ।
కర్ణోపరి మణీన్ద్రాణాం కర్ణభూషణ భూషితామ్ ॥
ఖగేన్ద్ర చంచు నాసాగ్రే గజేన్ద్ర మౌక్తి కాన్వితామ్ ।
మాలతీ మాలయా వక్రాం భిభ్రతీం కబరీం తథా ॥
మణీనాం కౌస్తుభే ంద్రాణాం వక్షఃస్థల సుశోభితామ్ ।
పారిజాత ప్రసూనానాం మాలాజాలోజ్జ్వలామ్వరామ్ ॥
రత్నాంగులీయ నికరైః కరాంగులి విభూషితామ్ ।
దివ్యశంఖ వికారైశ్చ చిత్రరాగ విభూషితైః ।
సూక్ష్మ సూత్ర కృతై రమ్యై ర్భూషితాం శంఖభూషణైః ॥
సద్రత్నసార గుటికా రక్తసూత్రాక్తశోభితామ్ ।
ప్రతప్త స్వర్ణవర్ణాభా మాచ్ఛాద్య చారువిగ్రహమ్ ॥
నితమ్బశ్రోణి లలితాం స్తనపీనోన్నతాం తథా ।
భూషితాం భూషణైః సర్వైస్తత్ సౌందర్యేణ భూషితైః ॥
విస్మితాస్త్రి దశాః సర్వే దృష్ట్వేశ మీశ్వరీం పరామ్ ।
తుష్టువుస్తే సురాః సర్వే పూర్ణ సర్వ మనోరథాః ॥

తేజోమధ్యంలో భర్తను చిరునవ్వుతో వాలుచూపులతో చూస్తూ రాధాదేవి ప్రకాశిస్తున్నది. ఆమె దంతములు ముత్యముల వరుసలాగా ఉన్నవి. శరత్కాలపు పూర్ణ చంద్రునిలాగా ఆమె ముఖము అలరుతూ ఉన్నది. కన్నులు పద్మముల లాగా, విశాలముగా ఉన్నవి. చిరుగజ్జెల పట్టెడలతో పాదములు విరాజిల్లుతున్నవి. నఖములు మణుల కాంతులతో విలసిల్లుతున్నవి. పాదముల అడుగుభాగము కుంకుమవలె ఎఱ్ఱగా ఉన్నది. అగ్నివలె ప్రకాశిస్తున్న ఎఱ్ఱని చీర ధరించి క్వణత్ కింకిణులతో గూడిన కాంచీదామాన్ని నడుముకు ధరించి, మెడలో రత్నహారములు, బాహువులకు కేయూరములు, ముంచేతులకు మణికంకణములు, చెవులకు రత్న కుండలములు, కేశపాశము నందు మాలతీ పుష్పమాల ఈ విధంగా ఎన్నో ఎన్నో భూషణాలతో సౌందర్యసారసర్వస్వమై

అలరుతూ వున్న రాధాదేవిని దేవతలు భక్తిపూర్వకముగా స్తుతించారు.

బ్రహ్మ, విష్ణు, మహేశ్వరాదులు, భూమిపై కల్గిన ఆపదలను, అసురుల విజృంభణాన్ని భూభారమును తగ్గించవలసిన అవసరమును విన్నవించారు. ఆ విజ్ఞప్తులు ఆలకించిన కృష్ణభగవానుడు ఈ విధంగా సమాధానము చెప్పాడు. "త్రిమూర్తులారా! దేవతలారా ! భూదేవీ ! పృథివి మీద ఎందరో రాజులు, మనుషులు, ఉదయించడం, తమతమ కర్మపరిపాకం వల్ల కాలగర్భంలో కలసిపోవడం మీకు తెలిసినదే. అసురుల విజృంభణము వారి వినాశము రెండూ మీకు క్రొత్తగాదు. అయితే ఎప్పటికప్పుడు అవసరాన్ని బట్టి, పరిస్థితులను బట్టి ప్రణాళిక వేసుకొని కార్యసిద్ధిని సాధించాలి. ఈ సారి వచ్చిన ఇబ్బంది కంస నరకాదులవల్ల. బ్రహ్మవిష్ణువుల వరాలవల్ల వారు వైకుంఠవల్లభుని చేతిలో హతులు కావడానికి వీలులేదు. ఈ సందర్భముగా ఏమి చేయాలో తోచక మీరంతా నా దగ్గరకుల వచ్చారు. గోలోక తత్వా న్ననుసరించి, మధురమైన ప్రేమ మార్గం తప్ప మరొక మార్గాన్ని రాధాదేవి కానీ, నేనుగాని అంగీకరించము. నేను స్వయముగా జోక్యము చేసుకొని, రాక్షస సంహారము చేయడం ఉచితమూ గాదు. అవసరమూ లేదు. మీరంతా నా కళాంశ స్వరూపులే ఇటువంటి దుష్టసంహార కార్యాలు ఎపుడు ఎవరి చేత చేయించాలో అలా చేయిస్తూ ఉంటాను. రాధాదేవి కూడ అంతే. ఆమె దుర్గ అయి, చండిక అయి, కాళియై, మహిషాసుర, శుంభనిశుంభాదులను వధించింది. ఇక్కడ ఆమె హ్లాదినీ శక్తిగా నేను రసస్వరూపునిగా మాత్రమే ఉంటాము. మీ కోరిక ప్రకారము ఈసారి మేము గూడా భూమిపై అవతరిస్తాము. భూమిపై ప్రేమభక్తిని మాధుర్యాత్మకమైన మహాభావాన్ని అందించడానికి రాసమండలిని నిర్మించి 'మహారాస' ద్వారా జీవులకు దివ్యప్రేమ స్వరూపాన్ని తెలియచేస్తాము. రసానందానుభూతిని అందుకోగల్గిన భక్తులను ఎంపిక చేసి వారి ద్వారా లోకంలో మధురభక్తిని, రసోపాసనను ప్రస్థాపన చేస్తాను. ఇక అసుర సంహారం చేయడానికి ఈ పర్యాయము 'శ్వేతద్వీపాధిపతి అయిన నారాయణుని ఆశ్రయించండి. పూర్వము జరిగిన దేవాసుర యుద్ధంలో దేవతలకు గెలుపు సాధించి పెట్టిన ఆ మహావీరుడు మీకు తెలిసినవాడే. వైకుంఠ వల్లభుడయిన విష్ణువు తప్ప మిగిలనవారు

అతని దగ్గరకు వెళ్ళండి. యుద్ధంలో అలసిపోయిన నారాయణుడు మేరుపర్వతగుహలో నిద్రిస్తున్న సంగతి మీకు తెలిసినదే. అక్కడకు వెళ్ళి అతనిని నిద్రలేపి ఈ పని కోసం అభ్యర్థించండి. అతడు భూమి మీద అవతరించిన తరువాత ఏదో ఒక కారణాన్ని కల్పించి విష్ణువతనిని తన స్థానానికి పిలుపించుకొని చూడవచ్చు. అసుర సంహారం కోసం ఎవరెవరు భూమిపై ప్రభవించాలో అవన్నీ బ్రహ్మ నిర్ణయిస్తాడు. కంస నరకాసుర వధలతో బాటు రాక్షసవర్గ నిర్మూలనకు మహాభారత యుద్ధం జరుగుతుంది. అవన్నీ ఎపుడు ఎలా జరగాలో నా సంకల్పాన్ని అనుసరించి జరుగుతవి. మీరు మీలోకాలకు వెళ్ళి కర్తవ్యోన్ముఖులు కండి.

## రావల్ నుండి బర్సానా

పూర్వయుగంలో పితృదేవతలు ముగ్గురు మానసకన్యలను ఉదయింప చేశారు. ఆ బాలికలకు కళావతి, రత్నమాల, మేనక అని పేర్లు పెట్టారు. రత్నమాలను విదేహ రాజు జనకునకు, మేనకను హిమాలయ పర్వతరాజునకు, కళావతిని నృగ మహారాజు కుమారుడైన సుచంద్రునకు యిచ్చి పెళ్ళి చేశారు. రత్నమాలా జనకులకు సీతాదేవి కుమార్తె అయినది. జనకుడు యజ్ఞము కొరకు భూమిని దున్నుతుంటే నాగేటి చాలున దొరికిన బిడ్డకు 'సీత' అని పేరు పెట్టి పెంచి, పెద్దచేసి దశరథపుత్రుడైన శ్రీరామునకు యిచ్చి వివాహం చేశాడు. మేనకా హిమవంతులకు దక్షపుత్రిక అయిన సతీదేవి కూతురుగా పుట్టింది. ఆ బిడ్డ పార్వతి అను పేరుతో ప్రసద్ధి చెంది తపస్సు చేసి శివుని భర్తగా పొందింది. ఈ రెండు కథలు పురాణ వాఙ్మయము ద్వారా అందరికీ తెలిసినవే. కళావతీ, సుచంద్రులకు చిరకాలము సంతానము కలుగలేదు. ముసలితనము వచ్చిన తరువాత వారు నైమిశారణ్యమునకు వెళ్ళి జగత్ పిత అయిన బ్రహ్మను గూర్చి తపస్సు చేశారు. చాలా కాలానికి బ్రహ్మదేవుడు ప్రత్యక్షమయి సుచంద్రుని ఏమి కావాలో కోరుకోమన్నాడు. వైరాగ్యము పండిన సుచంద్రుడు తనకు మోక్షము కావాలని ప్రార్థించాడు. అలాగే అని బ్రహ్మవరం యిచ్చాడు. ఆ తరువాత బ్రహ్మ కళావతిని చూచి అమ్మా నీకు ఏమి కావాలి ? అని అడిగాడు. కళావతి విధాతతో "స్వామీ! – నా భర్త ముక్తి కోరుకున్నాడు.

ఆయన లేనిది నేను జీవించలేను. నాకు ఇంకా ముక్తి కోరేటంత జ్ఞానోదయం కాలేదు. నాకు సంతానం కావాలి. నా చెల్లెలు రత్నమాలకు సీతాదేవి పుట్టి విష్ణుదేవుని అవతారమయిన శ్రీరాముని భార్య అయి లోకపూజ్యతను పొందింది. అలానే మరొక చెల్లెలు - మేనక కుమార్తె పార్వతి పరమశివుని భార్య అయి జగన్మాత అయినది. నాకు సీతను పార్వతిని మించిన బిడ్డ కావాలి. ఆ కూతురుని నేను పెంచి పెద్ద చేసి రాముని కంటె శివుని కంటె గొప్పవాడయిన వ్యక్తికి యిచ్చి వివాహం చేయాలి. నాకు ఈ వరాన్ని ప్రసాదించండి" అని వేడుకున్నది.

బ్రహ్మదేవుడు ఆమెతో "అమ్మా ! అసామాన్యమయిన వరం కోరావు నీ పతిభక్తికి తపశ్శక్తికి సంతోషించి నీవు కోరిన వరం యిస్తున్నాను. నీ భర్తకు మోక్షము నిస్తానన్నాను కాని వెంటనే యిస్తానని అనలేదు. నీ కోరిక తీరిన తరువాత యిద్దరికీ ఒకేసారి ముక్తి లభిస్తుంది. నీ అభిమతం తీరాలంటే ఈ యుగంలో సాధ్యం కాదు. మీరు వృద్ధులయినారు. కొద్దికాలంలోనే శరీర పతనం జరుగుతుంది. దివ్యశరీరాలతో కొంతకాలం స్వర్గంలో ఉంటారు. తదనంతరం ద్వాపర యుగాంతంలో మీరు మానవ లోకంలో జన్మిస్తారు. అప్పుడు నీ కోరిక తీరుతుంది. నాకూ, హరిహరులకు కూడా పూజ్యులైన గోలోక నాయికా నాయకులు శ్రీరాధాకృష్ణుల అనుగ్రహం మీకు కల్గుతుంది. గోలోకేశ్వరి అయిన రాధాదేవి - జనకునకు సీత లభించినట్లుగా మీకు దొరుకుతుంది. ఆమెను పెంచి పెద్ద చేస్తారు. ఆమె గోలోకేశ్వరుడయిన శ్రీకృష్ణభగవానుని పెళ్ళి చేసుకుంటుంది. తదనంతరం మీ యిద్దరికీ మోక్షప్రాప్తి కల్గుతుంది."

బ్రహ్మవచనం ప్రకారం కళావతి సుచంద్రులు దివ్యలోకంలో కొంతకాలం ఉండి తరువాత భూమి మీద ఉదయించారు. సూర్యభగవానుని పరమేశ్వరుడుగా నమ్మిన సురభానుడనే చిన్నరాజునకు కుమారునిగా సుచంద్రుడు ఉదయించాడు. అతనికి 'వృషభాను' నామం పెట్టబడింది. అదేవిధంగా కళావతీదేవి కూడ కన్యాకుబ్జ ప్రభువు భలందనుడనే రాజు యజ్ఞం చేస్తుంటే హోమకుండంలో నుండి ప్రకటిత అయి "కీర్తిదేవి" అన్న పేరు పొందింది. కాలక్రమాన యిద్దరూ పెరిగి పెద్దవారయిన తరువాత

కీర్తిదేవి వృషభానులకు వివాహం జరిగింది. వీరికి చాలా కాలం సంతానం కలుగలేదు. తమ కులదైవమైన సూర్యుని భక్తిశ్రద్ధలతో చిరకాలం అర్చించారు. ఆ సాధన ఫలితంగా త్రిమూర్తి స్వరూపుడయిన సూర్యదేవుని అనుగ్రహము వారికి లభించింది. ఒక రోజు కలలో సూర్యమండలంలో నుంచి ఒక సందేశం వారికి వినిపించింది. "వృషభానూ! ఈ నెల భాద్రపద శుక్లపక్ష అష్టమి రాబోతున్నది. మీ దంపతులిద్దరూ మీ నివాసమైన బర్సానా నుండి కొద్దిదూరంలో ఉన్న 'రావల్' గ్రామానికి వెళ్ళండి. అక్కడ ఊరిబయట ఒక తోట ఒక సరస్సు ఉన్నవి. ఆ సరస్సు మధ్యలో ఒక పద్మం మీద ఒక చిన్న బాలిక ఉంటుంది. ఆమెను తెచ్చి పెంచుకోండి. ఇది విధి సంకల్పం. పరమేశ్వరి కరుణకు పాత్రులయిన మీకు ఇవ్వబడుతున్న అనుగ్రహమిది". కలలో వినిపించిన ఈ దివ్య సందేశము భార్యాభర్తలిద్దరికి ఒకేసారి ఒకే విధంగా వచ్చింది. ఇద్దరూ ఆనంద పరవవశులయినారు. తగిన పరివారముతో బయలుదేరి అష్టమి నాడు సాయంకాలం రావల్ గ్రామానికి చేరుకున్నారు. నిర్దేశించబడిన ప్రదేశానికి వెళ్ళి భక్తితో దైవప్రార్థన చేస్తూ ఎదురు చూస్తున్నారు.

తెల్లవారుఝామున 5 గంటల ప్రాంతంలో ఆకాశమంతా మబ్బులు క్రమ్ముకున్నవి. కాసేపు చిమ్మచీకటి, ఏమీ కనపడలేదు 5.30 గంటల ప్రాంతంలో మెఱుపు మెరిసినట్లయింది. మబ్బులన్నీ నెమ్మది నెమ్మదిగా తొలిగిపోయి ఆకాశంలో కొద్ది కొద్దిగా వెలుగు కనిపించడం మొదలు పెట్టింది. సరస్సు మధ్యలో పెద్ద తామర పూవులో ఒక పసి బాలిక కనిపిస్తున్నది. ఆ బాలికను భార్యాభర్తలిద్దరూ వెళ్ళి తీసుకు వచ్చారు. మేళతాళాలతో ఊరేగింపుగా తమ పట్టణానికి తీసుకు వెళ్ళారు. కీర్తిదేవి అంతఃపురంలో బంగారు ఉయ్యాలలో బాలికను పరుండబెట్టారు.

తెలతెలవారుతున్నది. ఆ గది చుట్టూ కాపలా ఉన్న పరిచారికలు మహారాణి కీర్తిదేవి రాజు వృషభానుడు అలసిపోవడం వల్లనా అన్నట్లుగా నిద్రపోయినారు. నిద్రపోయినారు అనడం కంటె నిద్ర వారిని ఆవహించింది అనడం సముచితం. అంతరిక్షం నుండి దేవఋషి అయిన నారదుడు మహతీనాదం చేస్తూ అక్కడ దిగాడు. గోలోకనాయిక 'రాధాదేవి' అక్కడ

అవతరించి ఉండడాన్ని అతడు దర్శించాడు. ఆ పసిబిడ్డలో అతనికి 'రాధాదేవి' కన్పిస్తున్నది. ఆమెను భక్తితో స్తుతించాడు.

**నమస్తే పరమేశాని రాసమండలవాసిని**
**రాసేశ్వరి నమస్తేస్తు కృష్ణ ప్రాణాధిక ప్రియే**
**నమస్త్రై లోక్యజనని ప్రసీద కరుణార్ణవే**
**బ్రహ్మావిష్ణ్వాదిభిర్దేవైః వంద్యమాన పదాంబుజే**
**నమస్సరస్వతీరూపే ! నమస్సావిత్రి ! శంకరి !**
**గంగా పద్మావతీరూపే షష్ఠి మంగళచండికే**
**నమస్తే తులసీ రూపే నమో లక్ష్మీ స్వరూపిణి !**
**నమో దుర్గే భగవతి నమస్తే సర్వరూపిణి**
**మూలప్రకృతి రూపాంత్వాం భజామః కరుణార్ణవాం**
**సంసార సాగరా దస్మాన్ ఉద్ధరాంబ ! దయాంకురు.**

"రాసేశ్వరీ ! జగన్మాతా ! గోలోకవల్లభుడయిన శ్రీకృష్ణుడు యశోద ప్రసూతి గృహంలో అవతరించడం ఎరుగుదును. వసుదేవుడు తన బిడ్డ అయిన నారాయణునితో వచ్చి యశోద ప్రక్కలో తన బిడ్డను పడుకోబెట్టడం, నారాయణ కృష్ణుడు, గోలోకకృష్ణుడు, ఒకటి కావడం నేను తెలుసుకోగలిగాను. కానీ నీ విక్కడ అవతరించడం నా దృష్టికి అందలేదు. ఇప్పటికి నీ అనుగ్రహం వల్ల తెలిసింది. నీ దివ్యదర్శనంతో నేను కృతార్థుడనయినాను" అని స్తుతిస్తూ ఆనంద బాష్పాలు రాలుస్తూ భావ పారవశ్యంలో స్పృహతప్పిపోయినాడు. రాధాదేవి సఖులయిన 'లలిత' 'విశాఖ' అతడి ముఖం మీద చల్లని నీళ్ళు చల్లి చెవిలో రాధా నామస్మరణం చేశారు. లలితాదేవి స్పృహలోకి వచ్చిన నారదమహర్షితో ఈ విధంగా అన్నది. "నారదా! అమ్మ అనుగ్రహం వల్ల నీకు ఈ దర్శనం ఇవ్వబడింది. రసదేవత అయిన రాధాదేవి ఈ బిడ్డలో ప్రవేశించి కొంతకాలం తన లీలలను చూపుతుంది. రాధాభక్తుడయిన 'ఉశీనర' మహారాజు వానప్రస్థాశ్రమంలో ఉండగా ఈ బిడ్డను కన్నాడు. అమ్మ ఆదేశంపై అతడా బిడ్డను 'రావల్' గ్రామంలో సరస్సు మధ్యలోని పద్మంపై ఉంచి వెళ్ళిపోయినాడు. అతడూ అతని భార్య శరీరాలను విడిచిపెట్టి గోలోకానికి చేరుకున్నారు. ఈ బిడ్డ రాధాదేవిగా

పెరుగుతుంది. అక్కడ గోకులంలో గోలోకవల్లభుడు, నారాయణ కృష్ణుని శరీరంలో అవతరించి పెరుగు తున్నాడు. వీరి లీలలు నీవు తరువాత తెలుసుకుంటావు. ఈ క్షణం నుంచి మేము అదృశ్యమవుతున్నాము. తరువాత నీవు రాజదంపతులను ఆశీర్వదించి వెళ్ళవచ్చు" అన్నారు.

ఆ నిర్దేశాన్ని అనుసరించి నారదమహర్షి అప్పటికి అదృశ్యుడయి తరువాత అప్పుడే కొత్తగా వస్తున్న వానివలె రాజభవనంలోకి అడుగుపెట్టాడు. వృషభాను మహారాజు భక్తిశ్రద్ధలతో నారదమహర్షిని పూజించి తమ బిడ్డను ఆశీర్వదించమని ప్రార్థించాడు. నారదుడు కూడ అలానే అని ఆ శిశువును చూచి "మహారాజా ! నీవు ఎంతో అదృష్టవంతుడవు జగన్మాత అనుగ్రహానికి పాత్రుడివయినావు. మీ దంపతులు మీ వంశము మీ బిడ్డవల్ల శాశ్వతమయిన కీర్తిని పొందుతారు. అని దీవనలు యిచ్చి వెళ్ళిపోయినాడు.

పసిబిడ్డ కేరు కేరు మంటున్నది. పాలు త్రాగిస్తే త్రాగుతున్నది. కానీ కళ్ళు తెరవడం లేదు. రోజులు గడుస్తున్నవి. రాజపుత్రికను, ఎందరో వస్తున్నారు, చూస్తున్నారు, వెడుతున్నారు. కళ్ళు ఎందుకు తెరవదో ఎవరికీ అర్థంగాలేదు. కారణం తెలుసుకుందామంటే ఏ మహనీయునో అడగాలి. నారదుడి వంటి మహానుభావుని అడుగుదామంటే ఆయన తనకు తాను వచ్చి దర్శనమిస్తే తప్ప ఎప్పుడు వస్తాడో ఎక్కడ ఉంటాడో ఎవరికీ తెలియదు. ఆ ఆశలేదు. ఇక కులపురోహితుడు, తపస్సంపన్ను దయిన గర్గాచార్యులవారు చెప్పాలి. వృషభానుమహారాజు వార్తాహరులను పంపితే ఆయన ఆశ్రమంలో లేడు. దూరదేశానికి వెళ్ళాడనీ, ఒక వారంలో వస్తాడనీ కబురు తెలిసింది. వయోవృద్ధులు తమకు తోచిన సలహాలు చెపుతున్నారు. పుణ్యవతులయిన వృద్ధాంగనలు దిష్టితీయడం వంటి పనులు చేస్తున్నారు. అయినా ఫలితం కనబడడం లేదు. ఈ వార్త ఆ నోట, ఆనోట పడి గోకులం దాకా ప్రాకింది. యశోదానందులకు కూడా ఈ వార్త తెలిసింది. వృషభానుమహారాజు అందరికీ కావలసిన వాడు. కీర్తిదేవి, యశోదను కలిస్తే చిన్నబిడ్డ లాగా ఎంతో భక్తితో సేవిస్తుంది. వెంటనే బిడ్డను చూడాలని యశోద, కృష్ణుని ఎత్తుకుని బయలుదేరింది.

మంచి వృషభాలు కట్టిన బండిమీద గోకులంనుండి సపరివారంగా బయలుదేరి 'బర్సానా' చేరుకుని సరాసరి రాజమందిరానికి వెళ్ళింది. కీర్తిదేవి ఎంతో ప్రేమతో స్వాగతం చెప్పి తన బిడ్డ ఉన్న గదిలోనికి తీసుకువెళ్ళింది. పసివాడయిన కృష్ణుడు యశోద చంకలోనే ఉన్నాడు. ఆ గదిలోకి ప్రవేశించి ఉయ్యాల దగ్గరికి వెళ్ళగానే యశోద కంటే కృష్ణుడు పాపను ముందుకు వంగి చూస్తున్నాడు. కృష్ణుడు ముందుకు వంగగానే ఆ పసిబిడ్డ కళ్ళు తెరిచింది. భూలోకంలోకి వచ్చిన తరువాత మొదటిసారి కృష్ణుని చూడాలని రాధాదేవి కోరిక. అందుకే ఇన్నిరోజులు కళ్ళు తెరవకుండా ఉంది. ఎప్పుడయితే కృష్ణుడు వచ్చాడో సంతోషంతో పరవశించి కనులారా కృష్ణుని చూచింది. యశోద కుమారుని చూచి అమ్మాయి కనులు తెరిచిందన్న వార్త క్షణంలో అంతటా ప్రాకింది. అందరూ గుంపులు గుంపులుగా వచ్చి అటు రాజుగారి అమ్మాయిని యిటు యశోద కృష్ణుని చూచి వెడుతున్నారు పెద్ద తిరునాళ్ళ లాగా అయింది. ఆ పూట ఉండి యశోద కృష్ణుని తీసుకుని గోకులానికి వెళ్ళిపోయింది. గోకులంలో కృష్ణుడు, బర్సానాలో రాధా పెరుగుతున్నారు.

## ప్రేమాయణం

రాధాదేవి పెరిగి పెద్దదవుతున్నది. వృషభాను మహారాజు సంపన్నుడు కావడం వల్ల అమ్మాయి పుట్టిన రోజుకు ప్రతిసారి దానధర్మాలు బాగా చేసేవాడు. రాధాదేవి కొంచెం పెద్దది కాగానే ఆమె చేతనే భిక్షుకులకు దానాలు ఇప్పించేవాడు. ఒక సంవత్సరం పుట్టినరోజు యాచకులు బారులు తీరి నిల్చున్నారు. వరుసగా అందరికీ రాధమ్మ దానాలు ఇస్తున్నది. వరుసలో చిట్టచివరకు ముగ్గురు మిగిలిపోయినారు. ఆమె ఇచ్చిన పదార్థాలు తీసుకువెళ్ళడానికి వారి దగ్గర పాత్రలు లేవు. భిక్షా పాత్ర కూడా లేనంత దరిద్రులు వారు. బాలరాధకు వారి యందు చాలా దయకల్గింది. వారి దీనతకు ఆమె గుండె కరిగిపోయింది. వెంటనే ఆమె తనకు దగ్గరలో ఉన్న బంగారు పాత్రలను తెప్పించి వాటి నిండా వివిధ పదార్థములు నింపి పాత్రలతో సహా దానము చేసింది. అటువంటి అపురూపమయిన దానగుణం ఆమెలో చూచి ప్రజలు ఎంతో హర్షించారు.

రాధాదేవికి ముఖ్య సఖులు ఇద్దరు. వారు లలిత, విశాఖ అంతః పురంలో ఉన్న రాధకు బయట జరిగే వార్తలన్నీ వారు చేరవేసేవారు. ఆ రోజుల్లో ఎవరి నోట విన్నా కృష్ణుని గాథలే. యశోదానందులకు కుమారుడయిన శ్రీకృష్ణుడు. ఎందరో రాక్షసులను అవలీలగా చంపడం కథలు కథలుగా వారు రాధకు చెప్పేవారు. పరాక్రమవంతుడే కాక అతడు చాలా అందగాడని రాజకుమారికి చెప్పగా చెప్పగా ఆమె మనస్సు కృష్ణునివైపు ఆకర్షితమయింది. అతడెలా ఉంటాడో చిత్రం గీసి చూపించమని తన చెలికత్తెలను రాధ కోరింది. ఆ సఖులిద్దరు తమ నేర్పు కొద్దీ నందనందనుని బొమ్మ గీసి రాధకు చూపించారు. ఆ వర్ణ చిత్రాన్ని చూసిన వృషభాను పుత్రికకు కృష్ణుని చూడాలన్న కోరిక ప్రబలమైనది. లలిత, విశాఖ నెమ్మదిగా రాయబారాలు నడపడం మొదలు పెట్టారు. ఒకరోజు యమునాతీరంలో ఒక కడిమి చెట్టు క్రింద కృష్ణుడు ఒంటరిగా (కూచుని) ఉండడం చూచి లలితాదేవి కృష్ణుని దగ్గరకు వెళ్ళి "వృషభానుకుమారిక అయిన రాధాదేవి నిన్ను ప్రేమిస్తున్నది. నీ విరహంతో తపించి పోతున్నది. ఎలాగయినా, నీవు ఒకసారి ఆమెకు దర్శనమివ్వు" అని ప్రార్థించింది. రాజకుమారి కనుక అంతఃపురంలోకి ప్రవేశించడానికి పురుషులకు అనుమతి ఉండదు. కనుక రాజభవనం ముందు ఉన్న వీధిలో కృష్ణుడు నెమ్మదిగా వెడుతుంటే రాధాదేవి మేడపై నుండి చూడవచ్చునని ఆలోచన చేశారు. కృష్ణుడు అంగీకరించి మరునాడు వరసా (బర్సానా) పట్టణానికి వచ్చి రాజవీధిలో నెమ్మదిగా వెడుతూ ఉన్నాడు. ముందరే అనుకున్న ప్రకారం లలితా సఖి చేసిన ఏర్పాటు వల్ల రాధాదేవి మేడమీద నుంచి క్రిందికి చూస్తూ కృష్ణునికై వేచి ఉన్నది. కృష్ణుడు ఆ వీధిలో వెడుతుండగానే రాధాదేవి ఆ త్రిజన్మోహనుని, నీల శ్యామల కోమలదేహుని దర్శించింది. కృష్ణుడు కూడ తలఎత్తి మెరుపుతీగ లాగా బంగారు రంగుతో ప్రకాశిసున్న రాజకుమారిని చూచి దిగ్భ్రాంతి చెందాడు. రాధాదేవి పరవశించి మూర్ఛపోయింది. లలిత విశాఖలు ఆమెను లోపలకు తీసుకుని వెళ్ళి మంచంపై పడుకోబెట్టి ఉపచారాలు చేసి స్పృహ తెప్పించారు. స్పృహ వచ్చిన రాధ కృష్ణుని చూడకుండా ఉండలేనని సఖులతో చెప్పి ఎలాగయినా తాము కలుసుకునే ఏర్పాటు చేయమని కోరింది. లలితా సఖి మరునాడు

కృష్ణుని వద్దకు వెళ్ళి రాధాదేవి విరహ బాధను వివరించి ఏ విధంగా నయినా రాధాదేవిని కలుసుకోవలసినదిగా కోరింది. శ్రీకృష్ణుడు తాను కూడా రాధాదేవిని ప్రేమిస్తున్నట్లు చెప్పి, దానికి తగిన విధము ఆలోచిస్తానని బదులిచ్చాడు. అనంతరం కొద్దిరోజులలోనే సూర్యునికి సంబంధించిన పూజాదినము ఒకటి వచ్చింది. అది రథసప్తమి. యమునా తీరంలో ఉన్న సూర్యదేవాలయానికి రాధాదేవి చెలికత్తెలతో– కలిసి, తండ్రి అనుమతి తీసుకుని బయలుదేరి వెళ్ళింది. ఆ దేవాలయంలోని అర్చకునకు కృష్ణుడు మాయమాటలు చెప్పి కానుకలు ఇచ్చి ఇంటికి పంపివేసి తానే అర్చకుని వేషం వేసుకుని సిద్ధంగా ఉన్నాడు. రాధాదేవి చెలికత్తెలతో రాగానే ఈ మాయార్చకుడు, సూర్యపూజ చేయించి ప్రసాదము, పూలు, తీర్థం ఇచ్చే మిషతో రాధాదేవి చేతిని స్పృశించాడు. తన చేతిలో ప్రసాదం పెడుతున్న ఈ క్రొత్త అర్చకుని చూసి ఎప్పుడూ పూజ చేయించే అర్చకుడు కాదే ! ఎవరు ఈతడు ? అని తల ఎత్తి చూసింది. అతని స్పర్శ తన శరీరంలో విద్యుత్తు ప్రసరింప చేస్తుండగా అతని కన్నులలోని ప్రేమభావ ప్రసారాన్ని అందుకుని కృష్ణుడని తెలుసుకొని ఆనందానుభూతిని చెందింది. చెలికత్తెలు ఇద్దరూ ఏదో మిషపై బయటకు వెళ్ళారు. కొద్ది క్షణాలు రాధాకృష్ణులు ఇద్దరే అక్కడ. చూపులే తప్ప నోట మాటలేదు ఇద్దరికీ. పరస్పర దర్శన పరవశులైన ఆ జంటకు మెళకువ కలిగించడానికా అన్నట్లు దైవ దర్శనానికి వచ్చిన జనులు గంటలు మ్రోగించారు. ఘంటానాదంతో ఇద్దరికీ శరీర స్పృహ వచ్చింది. లలితా విశాఖలు రాకుమారిని నెమ్మదిగా అవతలకు తీసుకొని వెళ్ళారు.

బృందావనంలో కృష్ణునకు ఎలాగైనా రాధాదేవిని కలుసుకోవాలన్న కోరిక తీవ్రంగా ఉదయించింది. అతడొక గోపకాంత వేషాన్ని ధరియించి వృషభానుని అంతఃపురం దగ్గరకు వెళ్ళాడు. రాజభవనంలోకి ప్రవేశించడానికి ఆడవాళ్ళకి పెద్ద ఆటంక మేమీ లేదు. రాజకుమారిని చూడటానికి వచ్చాననంగానే లోపలికి వెళ్ళడానికి అనుమతి దొరికింది. ఆ సమయానికి రాధాదేవి ఉద్యానవనంలో విహరిస్తున్నది. రకరకాల రంగులతో అలరారే పూలచెట్లు, వివిధములయిన ఫలవృక్షాలు ఆ తోటలో అలరారుతున్నవి. కోకిలల కుహూ, కుహూ నినాదములు వినిపిస్తూ ఉన్నవి. నెమళ్ళు పురివిప్పి ఆడుతూ

ఉన్నది. అటువంటి సుందరమయిన తోటలో తిరుగుతున్న రాధాదేవి దగ్గరకు ఈ గోపదేవి వెళ్ళింది. అక్కడ పరిచారికలు రాధాదేవితో అమ్మా ! నిన్ను చూడడానికి బృందావనం నుంచి ఈవిడ ఎవరో వచ్చింది. అని చెప్పి వెళ్ళారు. 'బృందావనం నుంచి వచ్చింది, అన్న మాట వినగానే రాధాదేవికి చాలా సంతోషం కల్గింది. ఆమెను తన ప్రక్కనే తిన్నె మీద కూర్చోబెట్టి ఆమె పేరు, ఇతర వివరాలు రాధాదేవి అడిగింది. కృష్ణుడు తనపేరు గోపదేవి అని బృందావనంలో నందరాజు ఇంటికి ఉత్తరాన ఉన్న ఒక గృహంలో తాను ఉంటానని రోజూ తాను పాలు, పెరుగు అమ్ముకోడానికి మధురకో, బర్సానాకో వస్తుంటానని చెప్పాడు. అప్పుడు రాధాదేవి గోపదేవితో "యశోదాపుత్రుడయిన కృష్ణుని గూర్చి నీకేమయినా తెలిస్తే ఆ విశేషాలు చెప్పు. ఆతని గూర్చి వినాలని నాకు కుతూహలంగా ఉంది అంది. అది విని గోపదేవి "అమ్మా ! రాజకుమారీ! నందనందనుడంటే నీకు ఏమో ఆసక్తి కలిగినట్లుగా ఉంది. అతడు వట్టి మోసగాడు. అల్లరి చిల్లరపిల్లవాళ్ళను వెంట వేసుకుని ఇళ్ళలో దూరి పాలు పెరుగు దొంగతనంగా త్రాగుతూ తోటి వారికి పంచిపెడుతూ ఉంటాడు. అతడు చేసే కొంటెపనులకు అంతులేదు. చిన్నతనంలో ఇటువంటి చిలిపి పనులు ఎక్కువ చేసేవాడు. ఇప్పుడు కాస్త వయస్సు వచ్చింది. గడిదేరాడు. ఇప్పుడు మరొక రకమయిన కొంటెతనం బయలుదేరింది. ఆడపిల్లల వెంట పడుతున్నాడు. నేను మొన్న, అమ్ముకోడానికి పెరుగుకుండ నెత్తిన పెట్టుకుని ఈ ఊరికి వస్తున్నాను. త్రోవలో అతడు అడ్డంగా వచ్చి నన్ను ఆపివేశాడు. తాను పన్ను వసూలు చేసే అధికారినని, తనకు పన్ను కడితే గాని అమ్ముకోడానికి పోనీయనని దబాయించాడు. నా దగ్గర ఏమీ ధనం లేదు. డబ్బేమీ నా దగ్గర లేదని చెప్పాను. కోపగించి పెరుగుకుండ పగులకొట్టాడు. అతడు మంచివాడు కాదమ్మా. అతనిని గురించి నీకు ఎందుకు ఈ ఆసక్తి ?" అన్నది. "నీ మాటలు నేను నమ్మలేకున్నాను. అతని గూర్చి నే విన్నది వేరు. నీవు చెప్పుతున్నది వేరు. నీ కేదో వ్యక్తిగతంగా అతడంటే ఇష్టమున్నట్లు లేదు. ఏవేవో కల్పించి చెపుతున్నావు. అజేయపరాక్రముడైన కంసుని అనుచరులెందరినో సంహరించిన వీరుడు. గో గోపకులను ఎన్నో ప్రమాదాల నుండి కాపాడిన శూరునిగా ఆతని గాథలను

ఎన్నో విన్నాను. అంతటి అద్భుతవ్యక్తిని గురించి అబద్ధాలు చెపుతున్న నీ మాటలు నేను వినదలచుకోలేదు. ఇక్కడ నుండి నీవు వెళ్ళిపోవచ్చు" అని రాధ కఠినంగా పలికింది. ఆ పలుకులు విని గోపదేవి మళ్ళీ "రాజకుమారీ ! నీ మాటలు వింటూంటే నీ వతనిని ప్రేమిస్తున్నట్లు అర్థమవుతున్నది. నీ వంటి రాజకుమారికి ఆ నల్లనివాడు ఈడూ జోడూ కాదు. ఐశ్వర్యంలోనూ నీతో తులతూగలేదు. మీ కుటుంబ మర్యాదకు అతడు తగినవాడు కాదు. బంగారు చాయ కల అందాలరాశివి. మహారాజ పుత్రికవు. నీ కంటె చాలా తక్కువవాడు, ధనహీనుడు, దరిద్రుడు, నల్లనివాడు, కురూపి అయిన ఆ కృష్ణయ్యను నీ మనసులో నుండి తొలివేస్తే మంచిది" అన్నది. ఆ మాటలు వింటూనే రాధాదేవికి భరించలేనంత కోపం వచ్చింది. ఆగ్రహంతో పెదవు లదురుతుండగా కన్నులు ఎర్రబడగా కొట్టడానికి చెయ్యి ఎత్తింది. ఆ చేతిని పట్టుకొంది గోపదేవి. మరుక్షణమే రాధాదేవి శరీరం విద్యుత్ ప్రకంపనలతో నిండిపోయింది. గోపదేవి నెమ్మదిగా ఆమెకు మాత్రమే వినిపించేటట్లుగా "రాధా, నేను" అంటూ ఆమె కన్నులలోకి చూశాడు. ఆ స్పర్శ ఆ చూపు రాధాదేవికి అవగతమయినవి. "కృష్ణా! నన్ను ఈ విధంగా పరీక్షిస్తున్నావా !" అంటూ ఆనందబాష్పాలు రాల్చింది. "రాధా! ఈ విధంగా మారువేషంతో రావడం బాగుండదు. త్వరలో మనం ఏకాంతంగా కలుసుకోవలసి ఉంటుంది. సమయము, స్థలము నిర్దేశించించి నీకు వార్త పంపుతాను. అక్కడ నీకు అన్ని విషయాలు విశదమవుతవి. మన కార్యక్రమ ప్రణాళిక అప్పటికి సిద్ధమవుతుంది" అని వీడ్కోలు వచనములు పల్కి కృష్ణుడు వెళ్ళిపోయినాడు.

## రాధాకృష్ణ కళ్యాణము

రోజులు గడుస్తున్నవి. కృష్ణుని వద్దనుండి ఎటువంటి వార్తాలేదు. చెలికత్తెలయిన లలిత విశాఖలకు కూడ అతను దొరకడం లేదు. విరహబాధతో వేగిపోతున్న రాధాదేవి సఖి అయిన లలితతో "దేవతారాధన వల్ల కార్యసిద్ధి అవుతుందని పెద్దలు చెపుతారు. ఏ దేవతను ఆరాధిస్తే కృష్ణుడు నాకు లభిస్తాడో ఆలోచించి చెప్పు అన్నది. లలితాసఖి "అమ్మా ! మన పరివారంలో 'చంద్రానన' అనే చెలికత్తె ఉన్నది కదా! ఆమె గర్గాచార్యుల వారి దగ్గర శాస్త్ర,

పురాణ శ్రవణం చేసింది. ఆమె నడిగితే సరి - తగిన మార్గం చెపుతుంది" అన్నది. వెంటనే చంద్రాననకు కబురువెళ్ళింది. ఆ సఖి రాగానే లలితాదేవి విషయాన్ని చెప్పి "ఇది పరమ రహస్యము. రాధాకృష్ణుల ప్రేమ విషయం ఎవరికి తెలియకూడదు. ఇది మన మధ్యనే ఉండాలి. మహారాణికి మహారాజుకు ఎట్టి పరిస్థితులలోను విషయం చేరకూడదు. మనము రాజకుమారికి ఆప్తులము. ఈ విషయం గోప్యంగా ఉంచి ఏ సాధన చేయాలో చెప్పు. నీవు చదువుకున్న దానవు. వ్రతములు, పూజలు, అనుష్ఠానము తెలిసినదానవు. జాగ్రత్తగా ఆలోచించి వేగంగా సిద్ధించే విధానము చెప్పవలసినది" అనగా చంద్రానన ఆలోచించి ఈ విధంగా పలికింది "అమ్మా ! ఇది గోప్యమైన అంశం కనుక పురోహితులను, అర్చకులను పిలిపించి పూజలు, హోమములు చేయించడానికి వీలులేదు కదా ! కనుక నీవే స్వయంగా సాధన చేయాలి. రాజమందిరంలో వెనుకవైపు తోటలో పెద్ద తులసి మొక్క ఉంది. దానికి రోజూ ప్రదక్షిణలు చేస్తూ పూజించాలి. పాలు, చెఱుకురసము, ద్రాక్షరసము, మామిడి రసము, కలకండ పానకము, పంచామృతములు. వీనిలో ఏవి వీలైతే వాటిని మొక్క పెరగటానికి ధారగా పోయాలి. తులసీమంత్రాన్ని జపం చేస్తూ వీలైనన్ని ప్రదక్షిణలు చేసి మందిరంలో నీ గదిలో కూర్చొని ఏకాంతంగా మంత్రానుష్ఠానము చేయాలి. ఈ విధానమంతా నీకు తెలియచేస్తాను. తులసీదేవి నిన్ను తప్పక అనుగ్రహిస్తుందని నా విశ్వాసము" అని ఆ పద్ధతి అంతా చంద్రానన రాధకు నేర్పింది. ఈ వ్రతదీక్ష ఎవరికీ అనుమానం కలిగించలేదు. తల్లి కీర్తిదేవి కూడా కూమార్తె తులసీ ప్రదక్షిణలు చేస్తున్నదని తెలిసి సంతోషించింది. ఈ విధంగా కొద్ది రోజులు గడిచేసరికి ఒకరోజు రాత్రివేళ ఏకాంతంగా రాధాదేవి ధ్యానం చేస్తుంటే కన్నులు మూసుకుని ఉన్న రాధకు చతుర్భుజములతో బంగారు కిరీటంతో కాంచన కుండలములతో కంఠమున వైజయంతి మాల ధరియించి, కోమల శ్యామలవర్ణము గల్గిన దేహంతో తులసీదేవి సాక్షాత్కరించింది. ఆ దేవత ఈ విధంగా పలికింది. "రాధా ! భక్తిపూరితమైన నీ సాధనకు నేను ప్రసన్నురాలయినాను. మానవ శరీరంలో ఉండడం వల్ల అన్ని విషయాలు నీకు స్మరణలో లేవు. నీవు గోలోకనాయికవు. శ్రీకృష్ణుడు గోలోకేశ్వరుడు.

మీరిద్దరూ లోకకల్యాణం కోసం ఈ భూమి మీదకు వచ్చారు. నీవీ వ్రతం చేయడం లోకసంగ్రహం కోసమే. నీవు కోరినదల్లా జరుగుతుంది. త్వరలో మీ ఇద్దరికి వివాహం జరుగుతుంది. సృష్టి కర్త అయిన బ్రహ్మదేవుడే పురోహితుడై మీకు కళ్యాణం చేస్తాడు. అంటూ తులసీదేవి అదృశ్యం అయింది. రాధాదేవికి నెమ్మదినెమ్మదిగా కొంతకొంత స్ఫురణ కల్గుతున్నది. ఈ అనుభూతి కల్గిన మరునాడు శ్రీకృష్ణుని నుండి రహస్యంగా వార్త వచ్చింది. “యమునా తీరంలోని భాండీరవనానికి సాయంకాలం వేళ వాహ్యాళికి వచ్చినట్లుగా రావలసినది” అని. ఆ చుట్టు ప్రక్కల వనాలకు అప్పుడప్పుడు విహారానికి వెళ్ళడం వారికి అలవాటే. సాయంకాలం కాగానే పరిమిత పరివారంతో రాధాదేవి భాండీరవానికి బయలుదేరి వెళ్ళింది. సాయంసంధ్యాకాంతులతో కాసేపు ఆ వనంలో విహరించారు. ఇంతలో చిరుచీకట్లు బయలుదేరినవి. క్షణంలోనే వెన్నెల ఆకాశంలో కర్పూరపు పొడి చల్లినట్లుగా ప్రకాశించడం మొదలు పెట్టింది. ఇంతలో అడవిలో దూరంనుండి వేణునాదం వినిపించడం మొదలయింది. తనతో వచ్చిన పరివారాన్ని అక్కడే ఆపివేసి లలితా విశాఖలను మాత్రం తనతో తీసుకుని మిగతా వాళ్ళను రాజమందిరానికి వెళ్ళి పొమ్మని చెప్పింది. మేము కాసేపటుతిరిగి వస్తాము. మీరు వెళ్ళండని రాధాదేవి పలుకుతుంటే ఆమె ఆజ్ఞకాదనలేక ‘త్వరగా రండమ్మా!’ అని చెప్పి వారు వెళ్ళారు. రాజహంసవలె ఆమె నడుస్తుంటే కదిలే సౌందర్యదేవతగా ఆమె మెరుపులు చిమ్ముతున్నది.

శరత్పార్వణచన్ద్రాభా ముష్టవక్త్రా మనోహరా ।
శరన్మధ్యాహ్న పద్మానాం శోభామోచన లోచనా ॥
పరిత స్తారకాపక్ష్మ విచిత్ర కజ్జలోజ్వలా ।
ఖగేన్ద్ర చంచువార శ్రీ శంసా నాశక నాసికా ॥
తన్మధ్యస్థల శోభార్హ స్థూల ముక్తాఫలోజ్వలా ।
కబరీవేష సంయుక్తా మాలతీ మాల్య వేష్టితా ॥
గ్రీష్మ మధ్యాహ్న మార్తాణ్డ సుప్రభా ముష్టకుణ్డలా ।
పక్వ బిమ్బ ఫలానాం చ శ్రీ ముష్టాధరయుగ్మకా ॥

ముక్తా పంక్తి ప్రభావైక దన్తపంక్తి సముజ్జ్వలా ।
ఈషత్ప్రఫుల్ల కున్దానాం సుప్రభానాశక స్మితా ॥
కస్తూరీ బిన్దు సంయుక్త సిన్దూర బిన్దు భూషితా ।
కపాలం మల్లికాయుక్తం బిభ్రతీ శ్రీయుతం సతీ ॥
సుచారు వర్తులా కార కపోల పులకాన్వితా ।
మణీరత్నేన్ద్ర సారాణాం హారోరఃస్థల భూషితా ॥
సుచారుశ్రీ ఫలయుగ కఠినస్తన సంగతా ।
పత్రావళీ శ్రియా యుక్తా దీప్తాస ద్రత్న తేజసా ॥
సుచారు వర్తులాకార ముదరం సుమనోహరమ్ ।
విచిత్ర త్రివళీయుక్తం నిమ్న నాభిం చ భిభ్రతీ ॥
సద్రత్న సార రచిత మేఖలాజాల భూషితా ।
కామాస్త్ర సార భ్రూభఙ్గ యోగేన్ద్ర చిత్తమోహినీ ॥
కఠిన శ్రోణియుగళం ధరణీధర వన్దితమ్ ।
స్థలపద్మ ప్రభా ముష్టచరణం దధతీ ముదా ॥
రత్నభూషణ సంయుక్తం యావకద్రవ సంయుతమ్ ।
మణీన్ద్రశోభా సంముష్ట సాలక్తక పునర్భవమ్ ॥
సద్రత్న సారరచిత క్వణ న్మంజీర రంజితమ్ ।
రత్నకంకణ కేయూర చారు శంఖ విభూషితా ॥
రత్నాంగులీయ నికర వహ్ని శుద్ధాంశు కోమలా ।
చారు చమ్పక పుష్పాణాం ప్రభా ముష్ట కలేబరా ॥

శరచ్చంద్ర బింబము వంటి ముఖముతో కాటుక దిద్దిన కన్నులతో జడలో మాలతీ పుష్పమాలతో అందమైన మణిమాల కంఠమునందు ధరియించి లోకోత్తర సౌందర్య విభాసితయై ప్రకాశిస్తున్న రాధాదేవి ఎదురుగా వస్తున్న కృష్ణుని చూచింది.

పురుషం కమనీయం చ కిశోర శ్యామ సున్దరమ్ ।
కోటికన్దర్ప లీలాభం చన్దనేన విభూషితమ్ ।
శయనం పుష్పశయ్యానాం సస్మితం సుమనోహరమ్ ॥
పీతవస్త్ర పరీధానం ప్రసన్న వదనేక్షణమ్ ।

మణీన్ద్ర సార నిర్మాణం క్వణ న్మంజీర రంజితమ్ ॥
సద్రత్న సార నిర్మాణ కేయూర వలయాన్వితమ్ ।
మణీన్ద్ర కుణ్డలాభ్యాం చ గణ్డస్థల విరాజితమ్ ।
కౌస్తుభేన మణీన్ద్రేణ వక్షఃస్థల సముజ్జ్వలమ్ ।
శరత్పార్వణ్య చన్ద్రాస్య ప్రభాముష్ట ముఖోజ్జ్వలమ్ ॥
శరత్ప్రఫుల్ల కమల ప్రభామోచన లోచనమ్ ।
మాలతీ మాల్య సంశ్లిష్ట శిఖిపింఛ సుశోభితమ్ ॥
త్రివక్రచూడాం బిభ్రన్తం పశ్యన్తం రత్నమన్దిరమ్ ।
రమ్యవంశీధరం దేవం దృష్ట్వాతం నవ యౌవనమ్ ॥

కమనీయ కిశోరరూపంతో కోటిమన్మథ సౌందర్య విలసితుడు చన్దన చర్చిత శరీరుడు పీతాంబరుడు అయిన శ్యామసుందరుడు రాధాదేవి చేయి పట్టుకుని తీసుకుని వెళ్ళి అక్కడ అలంకరించబడి ఉన్న మణి మంటపంలో పుష్పశయ్య మీద ఆసీనురాలను చేసి ఆమె ప్రక్కను కూర్చున్నాడు. రాధాదేవి, ప్రేమప్రసన్న లోచనములతో కృష్ణుని క్రీగంట చూస్తూ ఉన్నది. ప్రేమపరిపూర్ణ అయిన ఆమెను చూసి శ్రీకృష్ణుడు ఇలా పల్కాడు. "రాధా! మన మిద్దరము గోలోక నాయికా నాయకులమన్న సంగతి నీకు గుర్తున్నది కదా ! అక్కడ జరిగిన సంఘటనల వలన మనము భూలోకమునకు రావడానికి ప్రణాళిక వేసుకున్నాము. దాని ప్రకారము నేను వసుదేవ పుత్రుని శరీరంలో అవతరించాను. నీవు ఉశీనర రాజపుత్రిక శరీరంలో అవతరించావు. ఈ లోకంలో మనం చేయవలసిన కార్యక్రమములు చాల ఉన్నవి. ఒక వైపు వాసుదేవకృష్ణుడు రాక్షస సంహారాన్ని మొదలు పెట్టాడు. మన కార్యక్రమం వేరు. దివ్యమైన ప్రేమభక్తి స్వరూపాన్ని ఈ లోకం ఎరుగదు. ఆ అనుభూతి కోసం వివిధ భూమికల లోని వ్యక్తులు ఇక్కడ జన్మించారు. దేవతలు, ఋషులు, దివ్యలోకాలలోని స్త్రీలు కొందరు గోవులుగా, కొందరు గోపకులుగా, కొందరు గోపికలుగా జన్మించారు. మానవశరీరాలలో మాతృగర్భం నుండి ఉదయించడం వల్ల వారెవరికీ తాము ఎక్కడ నుంచి వచ్చారో తెలియదు. నాకు అలంబనగా ఉన్న వాసుదేవ కృష్ణునకు కూడ కొన్ని పరిమితులున్నవి. అదే విధంగా నీకు నెలవైన ఉశీనర రాజకుమారి శరీరం కూడ అట్టిదే. ఈ

విషయాలన్నీ నీకు గుర్తున్నవి కదా" ఆ మాటలు వింటూనే రాధాదేవి కన్నులు విప్పార్చి చూచింది. "లోకేశ్వరా ! నాకు అన్నీ గుర్తున్నాయి. నీవు ఏ విధంగా ఆలోచిస్తున్నావో నేనూ అదే విధంగా భావిస్తున్నాను. శక్తిలో, బుద్ధిలో, జ్ఞానములో సర్వగుణములలో మనిద్దరమూ ఒక్కటే. ఆ వచనములను ఆకర్ణించి పురుషోత్తముడైన శ్రీకృష్ణుడు మళ్ళీ యిలా మాట్లాడాడు. "దేవీ ! ఈ భాండీరవనము మనకు కళ్యాణ ప్రదేశము. ఏకాంతముగా మనము కలుసుకొన్న సమయమిది. అవతల ఉన్న నీ చెలికత్తెలు విశాఖ, లలితలు కూడ మన లోకం నుండి వచ్చిన వారే. మనకు ఈ భూలోకంలో స్వయంగా తాను వివాహం చేయాలని 'విధాత' ఉబలాటపడుతున్నాడు. లౌకిక ప్రపంచంలో జరుగబోయే సంఘటనలు వేరు. ఈ దివ్యభూమికలో జరిగే కార్యక్రమం వేరు. విధాతకే విధాతనయిన నేను నిర్ణయించిన విధానం ప్రకారం జరుగవలసిన సంఘటనలు జరుగవలసిన క్రమంలో జరుగవలసిన తీరులో జరుగుతాయి. అదుగో బ్రహ్మదేవుడు వస్తున్నాడు."

ఆ క్షణంలోనే సత్యలోకాధిపతి, సృష్టికర్త, చతుర్ముఖుడు అయిన బ్రహ్మ దిగి వచ్చాడు. ఒక చేతిలో కమండలువు, ఒక చేతిలో జపమాల ధరించి మిగిలిన రెండు చేతులూ జోడించి రాధాకృష్ణులకు నమస్కరించాడు. శిరసు వంచి, సాష్టాంగ దండ ప్రణామములు అర్పించి తన కమండలువులోని మందాకినీ జలముతో వారి పాదములు కడిగి ఈ విధంగా స్తుతించాడు.

**బ్రహ్మకృత కృష్ణస్తుతి**

**అనాది మాద్యం పురుషోత్తమోత్తమం**
**శ్రీకృష్ణచన్ద్రం నిజభక్తవత్సలమ్**
**స్వయం త్వ సంఖ్యాండపతిం పరాత్పరం**
**రాధాపతిం త్వాంశరణం వ్రజామ్యహమ్ ।**
**గోలోకనాథ స్త్వ మతీవ లీలో**
**లీలావతీయం నిజలోకలీలా ।**
**వైకుంఠనాథోఽపి యదా త్వమేవ ।**
**లక్ష్మీ స్తదేయం వృషభానుజా హి ॥**

త్వం రామచన్ద్రో జనకాత్మజేయం
భూమౌ హరి స్త్వం కమలాలయే యమ్ ।
యజ్ఞావతారోసి యదా తదేయం
శ్రీదక్షిణా శ్రీపతిపత్ని ముఖ్యా ।
త్వం నారసింహోసి రమాహృదీయం
నారాయణ స్త్వం చ నరేణ యుక్తః
తవా త్వియం శాంతి రతీవ సాక్షా
చ్ఛాయేవ యాతా చ తవానురూపా ॥
త్వం బ్రహ్మ చేయం ప్రకృతి స్తటస్థా
కాలో యదేమా చ విదుః ప్రదానమ్ ।
మహాన్ యదా త్వం జగదంకురోసి
రాధా తదేయం సగుణా చ మాయా ॥
యదాన్త రాత్మా విది తశ్చతుర్భి
స్తదా ద్వియం లక్షణ రూపవృత్తిః
యధా విరా ద్దేహధర స్త్వ మేమా
తదాఖిలం వా భువి ధారణేయమ్ ॥

"దేవా ! నీవు గోలోకనాథుడవు. రాధాదేవి నీకు ప్రాణాధిక అయిన సర్వేశ్వరి. నీవే వైకుంఠ వల్లభుడవు. రాధాదేవియే లక్ష్మీదేవి. నీవు శ్రీరామునిగా ఉదయించి రాక్షస సంహారం చేశావు. రాధాదేవియే సీత అయినది. ఈ సమస్త ప్రపంచమూ నీవే. ఎన్నో అవతారాలు ఎత్తి దుష్టశిక్షణ, శిష్టరక్షణ చేస్తున్న ఆదిపురుషుడవు నీవు" కృష్ణుని ఈ విధంగా స్తోత్రం చేసి పిదప రాధాదేవిని ఈ విధంగా స్తుతించాడు.

హేమాత స్త్వత్పాదామ్భోజం దృష్టం కృష్ణ ప్రసాదతః ॥
సుదుర్లభం చ సర్వేషాం భారతే చ విశేషితః ।
షష్టి వర్ష సహస్రాణి తపస్తప్తం పురామయా ॥
భాస్కరే పుష్కరే తీర్థే కృష్ణస్య పరమాత్మనః ।
అ జగామ వరం దాతుం వరదాతా హరిః స్వయమ్ ॥

వరం వృణీష్వే త్యుక్త్వా చ స్వాభీష్టం చ వృతం ముదా ।
రాధికా చరణామ్భోజం సర్వేషా మపి దుర్లభమ్.
హే గుణాతీత మే శీఘ్రు మధునైవ ప్రదర్శయ ।
మయే త్యుక్తో హరి రయ మువాచ మాం తపస్వినమ్ ॥
దర్శయిష్యామి కాలేచ వత్సే దానీం క్షమేతి చ।
నహీశ్వరాజ్ఞా విఫలా తేన దృష్టం పదామ్బుజమ్ ॥

జగన్మాతా ! కృష్ణుని అనుగ్రహం వల్ల నీదు పాదములు దర్శించగల అదృష్టం గల్గింది. నేను పూర్వం అరవై వేల సంవత్సరములు పుష్కర తీర్థంలో తపస్సు చేశాను. సాక్షాత్ గోలోకవల్లభుడే దర్శనమిచ్చి నీ అభీష్టమైన వరం కోరుకోమన్నాడు. నేను నీ పాదపద్మ దర్శనాన్ని వరంగా కోరుకున్నాను. దానిని విని శ్రీకృష్ణుడు వత్సా ! నీ కోరిక ఇప్పుడు తీర్చడానికి వీలు లేదు. త్వరలో సమయం వస్తుంది. అప్పుడు దర్శించకలుగుతావు అన్నాడు. ఈశ్వర ఆజ్ఞ విఫలము కాదు. ఆనాటివరము వల్ల ఈనాడు నీ పదపద్మదర్శనం లభించింది – నీవు, శ్రీకృష్ణుడు సమానులు. బ్రహ్మాండములకు ఆవల ఉన్న గోలోకము నుండి సర్వలోకములను సృష్టించి పరిపాలిస్తున్నారు. మీరిద్దరూ నిత్యులు, సత్యస్వరూపులు. ఆయన అంశ నీవో నీ అంశ ఆయనో తెలుసుకోజాలము. నీ కరుణవల్ల నేను వేదములు సృష్టించాను. ఆ శ్రుతులు కాని ఆ శ్రుతివేత్తలు కాని నీ మహత్వములో వేయోవంతు అయినా వర్ణించలేరు. ఈ విధంగా ఎన్నో రీతుల విధాత రాధాదేవిని స్తుతించాడు. ఆ స్తోత్రములు విన్న రాధాదేవి ప్రసన్నురాలయి వరములు కోరుకోమన్నది. మీ ఇద్దరి పాదాంబుజముల యందు అచంచలమైన భక్తి నిలుచునట్లుగా వరమీయమని ప్రార్థించాడు. రాధాదేవి దయతో తథాస్తు అన్నది. రాధాదేవికి నమస్కారాలు



సమర్పించి బ్రహ్మ ఆ ఇద్దరి నడుమ అగ్నిని స్థాపించి ప్రజ్వలింప చేశాడు. శాస్త్రోక్తంగా ఆహుతులు వేసి అగ్నిని ఆవాహనం చేశాడు. ఆయన కోరిన విధంగా శ్రీకృష్ణుడు వచ్చి హోమకుండము ముందు కూర్చుని స్వయంగా ఆహుతులు వేసాడు. వారిద్దరికీ బ్రహ్మదేవుడు పాణిగ్రహణము చేయించి అగ్నికి ఏడు పర్యాయములు ప్రదక్షిణ చేయించాడు. నందనోద్యానము నుండి తెప్పించిన పుష్పమాలలను వధూవరుల చేత పరస్పరం కంఠసీమలలో అలంకరింప చేశాడు. రాధాదేవిని శ్రీకృష్ణునికి ఎడమప్రక్కన కూర్చొన బెట్టి వివాహ విధిని పరిపూర్ణంగా నిర్వర్తించాడు. సమస్త లోకములకు మంగళదాయకమైన రాధాకృష్ణుల పెళ్ళి వేడుకలకు దేవతలంతా వచ్చి మంగళవ్యాదములు మ్రోగించి పూలవాన కురిపించారు. గంధర్వులు గానం చేయగా అప్సరసలు నాట్యం చేశారు. ఈ విధంగా కళ్యాణోత్సవం కన్నులపండుగగా జరిగింది. జగజ్జననీ జనకులయిన వారిద్దరికి నమస్కరించి అనుజ్ఞ తీసుకుని బ్రహ్మదేవుడు తన లోకానికి ప్రయాణమయి వెళ్ళాడు. దేవతలంతా నమస్కరించి తమ స్వస్థానాలకు వెళ్ళారు.

ప్రేమపూరితమైన ఘడియలు గడుస్తున్నవి. అప్పుడు కృష్ణుడు రాధతో ఇలా అన్నాడు. “దేవీ ! ఇకముందు భౌతిక శరీరాలతో మనం కలుసుకోవడం జరుగదు. మనం సంకల్పించినపుడు రాత్రివేళ నేను బృందావనం నుండి వాసుదేవకృష్ణుని శరీరంలో నుండి సముత్థితుడనై బయలుదేరి వస్తాను. నీవూ అదేవిధంగా వృషభాను కుమారి శరీరం నుండి దివ్యశరీరంతో వద్దువుగాని. రస రాగోల్లసితమైన శృంగార క్రీడలతో మనం గడపవచ్చు. లోకంలో జరుగవలసినవి మన పేరుతో కొన్ని జరుగు తుంటాయి. వాటికి కావలసిన ప్రచోదన మనము చేస్తుందాము. త్వరలోనే ‘రాసమండలి’ నిర్మాణంకాగలదు. నీవూ, నీ పరివారము, గోపికలు, ఆ వ్యవహారం చూడండి. ఇక మనం స్వస్థలాలకు వెడదాము. నీవు ఆలస్యంగా అంతఃపురానికి వెళ్ళిన సంగతి మాయా మోహితులయిన నీ తల్లిదండ్రులకు గాని, ఇతర పరివారానికి కానీ తెలియదు.

## రాధారాణి పట్టాభిషేకము

అంతరిక్షములో రాసమండలి నిర్మాణమై రాసక్రీడలు జరుగుతున్నవి. ఈ అనంత భూగోళంలో బృందావనం ఒక్కటే రాసక్రీడలకు ఎన్నిక చేయబడిన ప్రదేశము. అత్యంత పవిత్రమైనది కావడం వల్ల మహిమాన్వితమైన ఆ స్థలం రాధాకృష్ణుల లీలా విహారాలకు అనువైన ప్రదేశమైంది. బృందావనానికి ఆ పేరు రావడానికి కూడ ఒక కథ ఉంది.

సత్యయుగంలో కేదారుడనే ఒక మహారాజు కృష్ణభక్తుడు. ఆయనకు లక్ష్మీదేవి అంశచే బృంద అనే బాలిక పుట్టింది. ఆమె దుర్వాసముని వద్ద కృష్ణ మంత్రాన్ని ఉపదేశం పొంది కృష్ణుడే భర్త కావాలని అరువది వేల సంవత్సరాలు తపస్సు చేసింది. ఆమె కోరిన వరాన్ని కృష్ణుడు అనుగ్రహించాడు. ఆమె గోలోకానికి చేరి గోపిక అయింది. ఆ బృందాదేవి తపస్సు చేసిన చోటు బృందావనము. ఇంకొక పురాణములో శంఖ చూడుని పత్నియైన తులసీదేవియే బృందయని. ఆమె తపస్సు చేసిన చోటు బృందావనమైనదని చెప్పబడింది. రాధాదేవి షోడశనామాలలో బృందనామము ఉండటం గమనించదగినది.

**రాధాదేవి షోడశ నామములు**

**రాధా రాసేశ్వరీ రాసవాసినీ రసికేశ్వరీ**
**కృష్ణ ప్రాణాధికా కృష్ణప్రియా కృష్ణ స్వరూపిణీ**
**కృష్ణ వామాఙ్గ సమ్భూతా పరమానన్ద రూపిణీ**
**కృష్ణా బృన్దావనీ బృన్దా బృన్దావన వినోదినీ**
**చంద్రావళీ చన్ద్రకాన్తా శరచ్చన్ద్ర ప్రభాననా.**

సకల కామములు ఇచ్చునది కనుక రాధ అను పదము వచ్చినది. మహారాసకు నాయకురాలు కనుక రాసేశ్వరి అయినది. రాసమండలమందు ఆమె నివసించును కనుక ఆమె రాసవాసిని అయినది. రసోవై సః అని వేదము పరమేశ్వరుడు రస స్వరూపుడని చెప్పుచున్నది. ఆ రసమును అనుభవించేవాడు రసికుడు. ఆ రసికులకు ఈశ్వరి కనుక రసికేశ్వరి. కృష్ణునకు ప్రాణము కంటే రాధ ఎక్కువ కనుక కృష్ణ ప్రాణాధిక అయినది.

కృష్ణుని యొక్క ప్రియురాలు లేక కృష్ణుడు ప్రియుడుగా కలది కనుక ఆమె కృష్ణప్రియ. కృష్ణునకు రాధకు అభేదము ఆమెయే కృష్ణుడు కనుక ఆమెయే కృష్ణ స్వరూపిణీ. అనంత చైతన్యము తనకు తాను రెండుగా విభక్తమైనది. ఆ చైతన్యమైన కృష్ణస్వరూపమునకు ఎడమ భాగము నుండి ఆమె ఉదయించినది. కృష్ణ వామాంగ సంభూత, పరమమైన ఆనందము ఆమె రూపము కనుక పరమానంద రూపిణి అయినది. కర్షణశక్తి కలది కనుక కృష్ణుని యొక్క రూపమే కనుక ఆమె కృష్ణ అయినది. బృందావనము ఆమె క్రీడాస్థలము. దానిని కల్గినది కాన ఆమె బృందావని అని అనబడినది. బృందావనము అనగా సఖీ మండలము. ఆకారము సంఖ్యావాచకము లెక్కలేనంతమంది సఖులు కల్గినది కనుక ఆమె బృంద అయినది. బృందావనము నందు విహరించుచూ వినోదించును కనుక బృందావనవినోదిని అని పిలువబడినది. చంద్రుల సముదాయము వలె ప్రకాశించునది కనుక చంద్రావళీ అను పేరు వచ్చినది. చంద్రునివలె ఇంపైనది కనుక చంద్రకాంత అనబడింది. శరత్కాల చంద్రుని కాంతి వంటి ముఖము కల్గినది కనుక శరత్చంద్ర ప్రభానన అయినది.

బృందాదేవి తన పేరుతో ప్రకాశిస్తున్న భూమి మీద రాధాకృష్ణులు సంచరించడం తన అదృష్టంగా భావించింది అక్కడి ఆకాశంలో వెన్నెలలు కురిసి రాసక్రీడలు జరగడం పరమేశ్వరుడైన కృష్ణుడు తనకు ఇచ్చిన అనుగ్రహంగా భావించింది. అంతటి లోకవల్లభుడైన శ్రీకృష్ణుడు కూడ రాసేశ్వరి అయిన రాధ పాదాల చెంగట కూర్చొని సేవ చేయడం ఆశ్చర్యమును దిగ్భ్రాంతిని కలుగ చేసింది. కృష్ణుడు రాధను సేవించిన ఆ ప్రదేశానికి 'సేవాకుంజ్' అని పేరు. ఆ రాధాదేవిని తాను కూడా మనసారా పూజించాలి. ఆమె ప్రేమోల్లసితమైన చూపు ప్రసరిస్తే చాలు. కృష్ణుడు పరవశించి పోతున్నాడు.

**శ్లో॥ వేణుః కరాన్నిపతితః స్ఖలితం శిఖండం**
**భ్రష్టంచ పీతవసనం వ్రజరాజ సూనోః ।**
**యస్యాః కటాక్ష శరతాప విమూర్ఛితస్య**
**తాం రాధికాం పరిచరామి కదా రసేన ॥** –రాధాసుధానిధి

ఏ దేవి యొక్క చూపులనే బాణములు తాకడం వల్ల చేతిలోని వేణువు క్రిందపడి పోయి, నెమలి పింఛము జారిపోయి, కట్టిన పీతాంబరము పడిపోతూ ఉండగా కృష్ణుడు మూర్ఛపోయినాడో ఆ రాధాదేవికి ఎప్పుడు ప్రేమపూర్వకంగా సేవచేస్తానో కదా!

**శ్లో॥ యస్యాః కదాపి వసనాంచల ఖేలనోత్థ**
**ధన్యాతి ధన్య పవనేన కృతార్థమానీ**
**యోగేంద్ర దుర్గమ గతి ర్మధుసూద నోపి**
**తస్యా నమోస్తు వృషభానుభువోదిశోపి** –రాధాసుధానిధి

మదుసూదనుని గమనం తెలుసుకోవటం యోగీశ్వరులకు కూడ సాధ్యం కాదు అంతటి కృష్ణుడు ఎవరి చీర చెరగు నుండి కదిలే గాలి సోకితే ధన్యుడనైనానని భావిస్తాడో, కృతార్థుడ నైనానని అనుకుంటాడో ఆ వృషభాను పుత్రిక రాధాదేవి ఉన్న దిక్కునకు నమస్కరిస్తున్నాను.

**శ్లో॥ బ్రహ్మేశ్వరాది సుదురూహ పదారవింద**
**శ్రీమత్పరాగ పరమాద్భుత వైభవాయాః**
**సర్వార్థసార రసవర్షి కృపార్ద్ర దృష్టే**
**స్తస్యాః నమోస్తు వృషభాను–భువో మహిమ్నే॥** –రాధాసుధానిధి

బ్రహ్మ ఈశ్వరుడు మొదలైన వారి ఊహల కందని పదపద్మపు పుప్పొడి యొక్క ఆశ్చర్యకరమైన వైభవము కల్గినది. అన్ని అర్థములకు సారమైన రసమును వర్షించే దయార్ద్రవీక్షణము కలది అయిన వృషభాను కుమారి మహిమకు నమస్కారములు.

**శ్లో॥ యో బ్రహ్మ రుద్ర శుక నారద భీష్మ ముఖ్యై**
**రాలక్షితో న సహసా పురుషస్య తస్య**
**సద్యో వశీకరణ చూర్ణ మనంత శక్తిమ్**
**తం రాధికా చరణరేణు మను స్మరామి ॥** –రాధాసుధానిధి

బ్రహ్మ, రుద్రుడు, శుక్రుడు, నారదుడు, భీష్ముడు మొదలైన వారు కూడా ఏ మహాపురుషుని దర్శనాన్ని పొందలేరో ఆ కృష్ణుని అప్పటికప్పుడే

వశీకరణం చేయకల్గిన అనంత శక్తి గల్గిన రాధాదేవి పాదముల ధూళి కణమును స్మరిస్తున్నాను.

శ్లో॥ దివ్య ప్రమోద రససార నిజాంగ సంగ
పీయూష వీచి నిచయై రభిషించయంతీ
కందర్పకోటి శర మూర్ఛిత నందసూను
సంజీవనీ జయతి కాపి నికుంజదేవీ ॥ -రాధాసుధానిధి

రాధాదేవి శరీరం దివ్యానంద రససారము.దానినుండి అమృత తరంగాలు ప్రవహింప చేసి మదన బాణముల తాకిడిచే సొమ్మసిల్లిన నందకుమారుని అభిషేకించి సంజీవనివలె లేపిన రసేశ్వరి జయించును గాక !

రసనాయిక అయిన రాధాదేవిని ఈ బృందావన ప్రేమ సామ్రాజ్య అధీశ్వరిగా పట్టాభిషేకం చేయాలి. ఈ ఆలోచన రాగానే బృందాదేవి తన స్నేహితురాలయిన 'పౌర్ణమాసి'ని స్మరించినది. ఆ వెన్నెల దేవత మరుక్షణమే అక్కడకు వచ్చింది. ఈ భావన ఆమెతో తెలుపగానే ఆమె ఎంతో సంతోషంతో పులకించింది. ఇద్దరూ కలసి యమునానదీ దేవతను ఆహ్వానించారు. అందరి ఆలోచనలు ఒకరూపు కట్టినవి. దీనికి రాధాదేవిని అంగీకరింప చేయాలి. మనం వెళ్ళి అడగటం కంటే కృష్ణుని చేత అడిగిస్తే బాగుంటుందని అనుకున్నారు. ఆ మిత్ర బృందము కృష్ణుని దగ్గరకు బయలుదేరింది. వీళ్ళు వెళ్ళిన సమయానికి ఒక వటవృక్షం క్రింద వేణువు ధరించి గోపాలుడు కన్పించాడు.

శ్లో॥ కస్తూరీతిలకం లలాటఫలకే, వక్షఃస్థలే కౌస్తుభం
నాసాగ్రే నవమౌక్తికం కరతలే వేణుం కరే కంకణమ్ ।
సర్వాంగే హరిచందనంచ కలయన్ కంఠేచ ముక్తావళీం
గోపస్త్రీ పరివేష్టితో విజయతే గోపాలచూడామణిః

ముఖమున కస్తూరిబొట్టు, ఉరమున కౌస్తుభమణి, ముక్కున ముత్యం ముంజేతికి కంకణం, చేతిలో వేణువు శరీరం అంతా గంధపుపూత, మెడలో ముత్యాలపేరు, ధరించి గోపికల చేత చుట్టుకొనబడియున్న గోపాలకృష్ణుడు ప్రకాశిస్తున్నాడు. దగ్గరకు వెళ్ళి నమస్కరించి ఈ విధంగా స్తోత్రం చేశారు.

శ్లో॥ సకల లోకాధార సచ్చిదాకార
ప్రకటితాగమజాల పద్మావిలోల
అగణిత గుణగ్రామ ఆత్మాభిరామ
మృగ మదాంకిత ఫాల మిత్రానుకూల
ఖగరాజ వాహా నిర్గత భవమోహా
నగరాజ వరధీర నానావిహార
వికచ వారిజ నేత్ర విస్ఫురద్గాత్ర
శకలితా సురజాల శాంత్యేక మూల
భగవ న్నృయాపహార భక్తమందార
నిగమ శీర్షారామ నిత్యాప్తకామ
సకల సన్నుతగుణ సాధుసంత్రాణ
మకరధ్వజాకార మంజులహార
కలితకౌస్తుభశోభ కాలమేఘాభ
బలభద్ర కృత ఖేల బాలగోపాల
మదనగోపాల సమ్మానితశీల
ముదమేహి దేహి సుత మునిబృంద వంద్య

(శ్రీకృష్ణలీలా తరంగిణి)

దేవాధిదేవా ! నీవు ఆదిదేవుడవు. సర్వోన్నత ధామమైన గోలోకము నుండి అవతరించిన గోవిందుడవు. నీ భార్య అయిన రాధాదేవి వృషభాను కుమారికగా అవతరించింది. సర్వేశ్వరి, రసదేవత అయిన ఆ దేవీమూర్తికి బృందావన రససామ్రాజ్య పట్టాభిషేకము చేస్తే బాగుంటుందని మా కందరికి అనిపిస్తుంది. ఆ మాటలు విన్నాడు కృష్ణుడు. పక్కనే ఉన్న గోపికలూ వింటూనే ఉన్నారు. వాళ్ళకు తెలిసిందల్లా కృష్ణుడు ప్రేమ స్వరూపుడు. అతడు మురళి ఊదితే హృదయాలు పరవశించి పోతాయి. అతనిని ప్రేమించాలని ఆ ప్రేమలో తాము మునిగిపోవాలని ఎప్పుడూ అన్పిస్తుంటుంది. అతని కోసమే తాము జీవిస్తున్నామన్న భావన తమ ప్రాణాలను నిలబెడుతున్నది. ఆ మధ్య అప్పుడప్పుడు బలవంతులయిన రాక్షసులు అతని చేత హతులయినారని

విన్నప్పుడు చూచినపుడు, ఆశ్చర్యము, దిగ్భ్రాంతి కల్గి ఇతడు దేవుడే అనిపిస్తూ ఉంటుంది. కాని మరుక్షణమే అవి అన్నీ మరచిపోయి ప్రేమ ప్రవాహంలో కొట్టుకుపోతూ ఉంటారు. ఇదంతా వారికి నిత్యానుభవమే. కాని తమతో ఆడుకుంటూ తిరుగుతూ ఉండే రాధాదేవి 'సర్వేశ్వరి' అంటూంటే అర్థం కావడం లేదు. ఏదో వింతమాట విన్నట్లుగా అందరూ కృష్ణుని వైపు చూస్తున్నారు. అప్పుడు కృష్ణుడు చిరునవ్వు నవ్వుతూ ఇలా అన్నాడు. "మీరు కోరిన కోరిక చాలా ఉచితంగా ఉంది. రాధాదేవి 'రసదేవత'. రాధయే నేను, నేనే రాధ ప్రేమస్వరూపిణీ అయిన ఆ దేవి నా కోసం ఈ భూమి మీద అవతరించింది. ఈ రహస్యం తెలిసినవారు చాలా కొద్దిమంది మాత్రమే. నే నెప్పుడూ రాధనే స్మరిస్తుంటాను.

**శ్లో॥ రాధాస్తి యత్ర నవసిద్ధి సు ధాస్తి తత్ర**
**నాగాధిలోక విబుధా మదనో రతిశ్చ**
**సర్వావతార - మహిషీ సుఖమస్తి తత్ర**
**యస్యాః పదం క్షణమహో న జహాతి కృష్ణః ॥**

**శ్లో॥ రాధాప్రయాతి విపినం విపినం ప్రయాతి**
**రాధా నికుంజ సదనే స చ తత్రనిత్యమ్**
**రాధా సుఖే సుఖముపేత్య దుఃఖే చ దుఃఖే**
**కృష్ణః కదాపి ఖలు తిష్ఠతి న స్వతంత్ర ః ॥** **-రాధాసుధానిధి**

రాధాదేవి ఎక్కడ ఉంటే అక్కడ అమృత సిద్ధి ఉంటుంది. ఆమె అవతారము అన్నింటిలోకి శ్రేష్ఠమయినది. ఆమె ఎక్కడ ఉంటే అక్కడ సుఖము. ఆమె పాదాన్ని ఒక్క క్షణము కూడా ఈ కృష్ణుడు విడిచిపెట్టడు. రాధాదేవి ఎక్కడ ఉంటే అక్కడి కల్లా కృష్ణుడు వెళ్తూ ఉంటాడు. రాధ నికుంజ సదనంలోకి వెళ్తే నేనూ అక్కడికే వెంటబడి వెళ్తాను. రాధ సుఖంలోనే నా సుఖం. రాధ దుఃఖిస్తే నేనూ దుఃఖిస్తాను. నా గమనా గమనాలు, సుఖదుః ఖాలు అన్నీ రాధాదేవి మీదనే ఆధారపడినవి. నేను అస్వతంత్రుడను.

ఇటీవల శరద్రాత్రిలో మొదటిసారి రాసక్రీడలు మనము జరిపినపుడు ఆ ఒక్కరాత్రి ఆరు మాసాలకు సమానంగా నేను మార్చానని మహర్షులు

భావించారు. వారికి కూడా అందని సత్యం ఆ మహిమ రాధాదేవిదే. ఆమె ఆ రాత్రిని బృందావనంలో బ్రహ్మరాత్రిగా ఏర్పరచింది.

శ్లో॥ స్వరైర్గ్రామై శ్చ్రతిభి ర్మూర్ఛ నాభి
ర్గీతాం దేవీం సఖిభిః ప్రేమ బద్ధా
బ్రాహ్మీం నిశాం యాతనోదేకశక్త్యా
బృందావరణ్యే రాధికాం తాం నమామః

రాధాదేవి అనుగ్రహం లేకపోతే రససముద్రంలో మునకలు వేయడం ఎవరికీ సాధ్యం కాదు. నాకు కూడా అసాధ్యమే.

శ్లో॥ అనారాధ్య రాధా పదాంభోజ రేణుమ్
అనాశ్రిత్య బృందావనం తత్పదాంకమ్
అసంభాష్య తద్భావ గంభీర చింతాన్
కుతః శ్యామసింధోః రస స్యావగాహః ॥

రాధా పదపద్మములను ఆరాధించకుండా ఆమె అడుగుల గుర్తులు గల బృందావన ధామాన్ని ఆశ్రయించకుండా ఆమెను గూర్చిన ఆలోచనలతో కూడిన సంభాషణలు చేయకుండా శ్యామసింధు రసములో అవగాహన కలుగదు. ఆమె ఆనందమనే చంద్రుని నుంచి ఉదయించిన వెన్నెల. భువన మోహన సౌందర్య స్వరూపిణి. బంగారు తీగలాగ మెరిసిపోతూ ఉండే ఆ వృషభాను కన్య దివ్యమూర్తిని ఎవరు వర్ణించగలరు.

శ్లో॥ ఆనంద చంద్రోదిత కౌముదీ యా
శ్రీమోహన స్యాపి సుమోహనశ్రీః
సౌందర్య నామ్నో నికషోపలస్య
సువర్ణరేఖా వృషభాను కన్యా ॥

అటువంటి రాధాదేవికి తప్పకుండా పట్టాభిషేకం చేద్దాము. బృంద, కాళింది, పౌర్ణమాసి, మీరంతా దాని ఏర్పాట్లు చూడండి. నేను స్వయంగా ఆమెకు మణి కిరీటధారణం చేసి బృందావనేశ్వరిగా ఆమెను పూజిస్తాను అన్నాడు కృష్ణుడు.

ఈ సమావేశం తరువాత వచ్చిన పూర్ణిమ రాత్రినాడు బృందావనం మీది దివ్యభూమికలో పరిపూర్ణమైన రసధామం అవతరించింది. యమునాతీరమంతా మణిస్థగితమైన సువర్ణభవనాలతో నిండిపోయింది. వాని అంతస్థులకు రత్నమయమైన సోపానములు అలరారుతున్నవి. అక్కడక్కడా అందమైన సరస్సులు. వాటిలో బంగారు పద్మాలు అక్కడ విహరిస్తున్న హంసలు. గోవర్ధన పర్వతమంతా కనక, వజ్ర, వైడూర్య, గోమేధిక, ముక్తాలంకృతమై ప్రకాశిస్తున్నది. ఆ దివ్యధామం మధ్యలో మణిమయ మంటపం నిర్మించబడి ఉన్నది. మంటపం మధ్య అద్భుతమైన సింహాసనం ధగధగాయ మానమై వెలుగు లీనుతున్నది. గోపీ గోపకులు చక్కని అలంకారములతో పుష్పమాలలతో అందాలు చిందుతున్నారు. ఆ సమయంలో లలితా, విశాఖలు రాధాదేవిని నెమ్మదిగా తీసుకు వచ్చారు. కోటిచంద్రుల కాంతితో ఆమె కదిలి వస్తూ ఉంటే చరణముల మంజీరధ్వనులు, మంజుల శింజితముతో ధ్వనిస్తున్నవి. కంకణ ఝణత్కారములు వాటితో పోటీపడుతున్నవి. నడుమున ధరించిన వడ్డాణపు చిరుగజ్జెలు గలగల మంటున్నవి. రాయంచ నడకలతో ఆమె కదిలి వస్తుంటే సౌందర్య సారసర్వస్వము – దివ్యత్వ విస్ఫూర్జితమై దిగి వస్తున్నట్లున్నది.

శ్రీకృష్ణుడు స్వయంగా ఎదురేగి ఆమెను తీసుకుని వచ్చి సింహాసనం మీద కూర్చొన పెట్టాడు. మణులు పొదిగిన సువర్ణకిరీటాన్ని తెచ్చి ఆమె శిరస్సున ధరింప చేసి ఆమెపై పూలుచల్లి 'బృందావనేశ్వరి' గా ఆమెను ప్రకటించాడు.

"రాధాదేవీ ! నీవు నా ప్రేయసివి. నా ప్రాణముల కంటె ఎక్కువైన దానవు. నీవూ నేనూ ఒకటే. పాలలో తెల్లదనమున్నట్లుగా, అగ్నిలో దహనగుణమున్నట్లుగా భూమిలో గంధమున్నట్లుగా నీలో నేను ఎప్పుడూ ఉన్నాను. మట్టిలేక కుండలు చేయడం ఎలా సాధ్యం కాదో, బంగారం లేకుండా కుండలములు చేయడం ఎలా వీలుకాదో అలానే నీవు లేకుండా నేను సృష్టి చేయలేను. నీవు సృష్టికి ఆధారానివి. నేను బీజ స్వరూపుడను. నాలోని శోభవు నీవే. నేను మామూలుగా కృష్ణుడను. నీతో కలిసినపుడు మాత్రమే

శ్రీకృష్ణుడను. లోకములలోని సిరిసంపదలకు ఆధారము నీవే. నీవు సర్వశక్తి సర్వస్వరూపిణివి. నేను స్వరూపుడను. నేను తేజస్వరూపుడను. నీవును అటులే తేజోరూపిణివి. నిజమునకు నీకూ నాకూ వేరు శరీరములు లేవు. నీవు రాధగా, నేను కృష్ణునిగా భాసిస్తుంటాము. నీవు మూలప్రకృతివి మనిద్దరి మధ్య ఎటువంటి భేదమూ లేదు. మనలో ఎక్కువ తక్కువలు భావించేవారు అజ్ఞానులు." స్వయముగా శ్రీకృష్ణు డిలా పలికాడు.

**త్వం మే ప్రాణాధికా రాధే ప్రేయసీ చ వరాననే ।**
**యధా త్వం చ తధా హం చ భేదోహితా వయో ర్ధ్రువమ్.**
**యధా క్షీరే చ ధావల్యం యధాగ్నే దాహికా సతీ ।**
**యధా పృథివ్యాం గంధశ్చ తధాహం త్వయి సంతతమ్ ।**
**వినా మృత్తీ ఘటం కర్తుం వినా స్వర్ణేన కుండలమ్ ॥**
**కులా లః స్వర్ణకారశ్చ నహి శక్తః కదా చన ।**
**తధా త్వయా వినా సృష్టి మహం కర్తుం న చక్షమః**
**సృష్టే రాధారభూతా త్వం బీజరూపో హ మచ్యుతః**
**త్వం మే శోభా స్వరూపాసి దేహస్య భూషణం యధా ।**
**కృష్ణం వదన్తి మాం లోకా స్త్వయైవ రహితం యదా ।**
**శ్రీకృష్ణం చ తదా తేపి త్వయైవ రహితం పరమ్ ॥**
**త్వం చ శ్రీ స్త్వం చ సంపత్తి స్త్వమాధార స్వరూపిణీ ।**
**సర్వశక్తి స్వరూపాసి సర్వరూపోహ మక్షరః**
**యదా తేజస్స్వరూపోహం, తేజో రూపాసి త్వంతదా ॥**
**నశరీరే యదాహం చ తదా త్వమశరీణీ ।**
**సర్వబీజ స్వరూపోహం సదా యోగేన సున్దరి ॥**
**త్వం చ శక్తి స్వరూపాచ సర్వస్త్రీ రూపధారిణి**
**మమాంగాంశ స్వరూపాత్వం మూలప్రకృతి రీశ్వరీ ॥**
**శక్త్యా బుద్ధ్యాచ జ్ఞానేన మయా తుల్యా వరాననే ।**
**ఆ వయోర్భేద బుద్ధిం చ యః కరోతి నరాధమః ॥**
**తస్య వాసః కాలసూత్రే యావ చ్చన్ద్ర దివాకరౌ ।**
**పూర్వాన్ సప్తపరాన్ సప్త పురుషాన్ పాతయత్యథః ।**

**కోటిజన్మార్జితం పుణ్యం తస్య నశ్యతి నిశ్చితమ్ ।**
**అజ్ఞా నాదావ యోర్నిన్దాం యే కుర్వన్తి నరాధమా ।**
**పచ్యన్తే నరకే ఘోరే యావచ్చన్ద్ర దివాకరౌ ।**

**(బ్రహ్మవైవర్త పురాణము శ్రీకృష్ణజన్మ ఖండము 15, 57-10)**

ఈ విధంగా పలుకుతూ కృష్ణుడు అక్కడివారితో ఇంకా ఇలా అన్నాడు. "మీరంతా నాకు ఆప్తులు. మీ ప్రేమకు వశుడనై నేను ఇక్కడ లీలలు చూపిస్తున్నాను. రాధాదేవి కూడ మహాభావ స్వరూపిణియై తన దివ్యలీలను ప్రకటిస్తున్నది. ఈ బృందావన ధామంలో ఆనందరూపిణియైన రాధాదేవిని రసభావ మార్గంలో ఉపాసించండి. నన్ను గోపికలంతా మధురభక్తి మార్గంలో ఉపాసిస్తున్నారు. భక్తి మార్గాలలో దానిని మించినది లేదు. దివ్యప్రేమానుభవం దానివల్ల లభిస్తుంది. మధురభక్తి భావుకులకు నేను దివ్యప్రేమ రసానందాన్ని ప్రసాదిస్తాను. అయితే మీరెవ్వరూ రాధత్వమును పొందలేరు. రాధాదేవిని ఉపాసించిన వారికి అనన్యమైన రసబ్రహ్మానుభవం కల్గుతుంది. మహాభావ స్వరూపిణియైన ఆమె కరుణ వల్ల భక్తులకు భావదేహం సంప్రాప్తిస్తుంది. ఇతర దేవతల ఉపాసనలలో దివ్య సూక్ష్మ దేహం లభిస్తుంది. ఆ సూక్ష్మదేహం కాంతిమంతమై దైవీ శక్తిపూరితమై కొన్ని అద్భుత సిద్ధులను అనుగ్రహిస్తుంది. కానీ వారికీ 'భావదేహం' లభించదు. ఒక్క రసోపాసనలో మాత్రమే అది ప్రాప్తిస్తుంది.

**శ్లో॥ శరీరేదేహాని యథా స్థూలం సూక్ష్మం చ కారణమ్**
**తథైవాన్యద్ దేహం క్షేమం భావదేహం ప్రకీర్తితమ్**
**కృపాలబ్ధ మిదం దేహం సహజం జన్మజన్మని**
**అథవా "సాధనాలబ్ధం కదాపి వా మహేశ్వరి**
**న సగుణం నిర్గుణం వా దేహ మిదం పరాత్మకమ్**
**కుత్రాపి నహి ద్రష్టవ్యం లోకే బృందావనం వినా**
**సంగతం సహ కృష్ణేన గోపీనాం చరితం చ యత్**
**త న్నకామాద కామాద్వా భావదేహేన తత్కృతమ్.**

యోగ శాస్త్రాలలో స్థూల, సూక్ష్మ, కారణ దేహములు చెప్పబడినవి.

అదే విధముగా భావదేహం అనేది మరొకటి ఉన్నది. అది సగుణము కాదు, నిర్గుణము కాదు. పరాత్మకమైన ఈ దేహం బృందావనంలో తప్ప మరెక్కడా లభించదు. రాధాదేవి 'మహాభావస్వరూపిణి' ఏ ఇతర దేవతకు ఈ విశేషణం లేదు. ఆ మహాభావాన్ని పొందిన వ్యక్తి అప్రయత్నంగా అశ్రువులు రాలుస్తాడు. తనకంటి వెంట కన్నీరు ఎందుకు వస్తుందో అతనికి తెలియదు. కంఠం గద్గద మవుతుంది. శరీరం పులకిస్తుంది. రాధా భక్తులు అటువంటివారు. వారు తీర్థములకే పవిత్రతను తీసుకు వస్తారు. శాస్త్రములను సత్ఫలితములుగా మారుస్తారు. వారి ఉనికి వల్ల ఇతరులకు సంతోషం కల్గుతుంది. దేవతలు నర్తిస్తారు. వారి వల్ల భూమి 'సనాథ' అవుతుంది. జాతి, విద్య, రూపము, కులము, ధనము మొదలైన భేదములకు అతీతులు వారు. రాధాదేవి తన నిత్యభక్తులకు ఆధీనురాలయి ఉంటుంది. కనుక భక్తుడైన నాకు తనతో సమానమైన స్థితిని అనుగ్రహించి లీలగా తానూ ఒక గోపికను మాత్రమే అన్నట్లుగా నటిస్తూ ఉన్నది. ఆమె 'రాసేశ్వరి' ఈ బృందావన రస సామ్రాజ్యానికి ఆమె అధీశ్వరి.

కృష్ణుడు ఈ ప్రసంగం చేస్తూ ఉన్నంతసేపూ రాధాదేవి ఒక అనంత చైతన్యమూర్తిగా భాసిస్తున్నది. గోపికలకు తాము ఏమి వింటున్నామో, ఏమి చూస్తున్నామో అర్థం కాని భావాతీత స్థితికి వెళ్ళారు. అంతరిక్షంలో అందరి అంతరంగాలలో రాధాత్మకమైన మహాభావ చైతన్యము భాసిస్తున్నది.

**శ్లో॥ సదా రాధికా నామ జిహ్వాగ్రతః స్యాత్**
**సదా రాధికా రూప మక్ష్యగ్ర ఆస్తామ్**
**శ్రుతౌ రాధికా కీర్తిరంతః స్వభావే**
**గుణా రాధికా యాః శ్రియా యేతదీ హే.**

రాధానామము ఎల్లప్పుడూ మా నాలుకల మీద ఉండును గాక ! ఆమె రూపమే నిత్యము మా కనులముందు నిలుచును గాక ! ఆమె కీర్తి గానమే మా కర్ణములలో నిత్యము వినిపించును గాక ! స్త్రీరూపిణి అయిన రాధాదేవి గుణములు మా హృదయములలో ఎప్పుడూ అలరుచుండునుగాక

## బృందావన క్షేత్ర పాలకుడు

'ఆసురి' అనే మహర్షి కృష్ణభక్తుడు. భక్తిపరవశుడై అతడు ధ్యానం చేస్తుంటే కృష్ణుని లీలలను దర్శించ గల్గేవాడు. అతడు ఒకనాడు ఎంత తీవ్రంగా ధ్యానం చేసినా ఎంత భక్తితో ప్రార్థించినా కృష్ణుని దర్శనం కాలేదు. కృష్ణుడు ఎక్కడ ఉన్నాడో వెతకాలని 'బదరీ' క్షేత్రానికి వెళ్ళాడు. అక్కడ ఆశ్రమాలన్నీ వెతికినా ఎక్కడా దర్శనం కాలేదు. అక్కడి నుండి 'లోకాలోక పర్వతం' దగ్గరకు వెళ్ళాడు. అక్కడా దొరకలేదు. తరువాత క్షీర సముద్రం దగ్గరకు వెళ్ళాడు. అక్కడా స్వామి కనపడలేదు. చివరి ప్రయత్నంగా వైకుంఠానికి వెళ్ళాడు. అక్కడా లక్ష్మీదేవిగాని, విష్ణుమూర్తి గాని లేరు. వైకుంఠం నుండి కైలాసం వెళ్ళాడు. అక్కడ పరమశివుడు ఎక్కడికో బయలుదేరు తున్నాడు. ఆసురిముని మహాదేవునితో "శంకరా ! నేను అన్ని లోకాలను వెతికాను. ఎక్కడా కృష్ణభగవానుని దర్శనం కాలేదు. మీరు సర్వజ్ఞులు. నాస్వామి ఎక్కడ ఉన్నాడో దయచేసి చెప్పండి" అని ప్రార్థించాడు. శివుడిలా సమాధానం చెప్పాడు. "ఆసురీ ! కృష్ణదర్శనం కోసం ఇంతగా పరితపిస్తున్న నీ జీవితం ధన్యమైనది. కృష్ణుడిప్పుడు నీవు చెప్పిన ఏ లోకాల లోనూ లేడు. భూలోకంలోని యమునాతీర బృందావనంలో ఆయన తన మాయాశక్తితో ఆరునెలలకు సమానమైన మహారాత్రిని సిద్ధం చేసి గోపికలతో రాసక్రీడలు జరుపుతున్నాడు. ఆ రాసోత్సవాన్ని చూడడానికి ఊర్ధ్వ లోకాలలోని ప్రముఖులంతా బయలుదేరి వెళ్ళారు. నేను అక్కడికే వెడుతున్నాను. నీవు కూడా నాతో రా" అన్నాడు.

అయితే మహర్షీ ! బృందావనంలో కృష్ణుడే కాదు ఆయన ప్రాణేశ్వరి జగన్మాత రాధాదేవి కూడా ఉంటుంది. ఆమె అనుగ్రహం లభిస్తే గాని నీకు పరిపూర్ణ కృష్ణకృప కలుగదు. ఒకసారి నారదుడడిగితే ఈ విషయమే చెప్పాను. మళ్ళీ నీ మీద కృపవల్ల చెపుతున్నాను.

**యథా బ్రహ్మస్వరూపశ్చ శ్రీకృష్ణః ప్రకృతేః పరః**
**తథా బ్రహ్మస్వరూపాచ నిర్లిప్తా ప్రకృతేః పరా**
**ఆవిర్భావ స్తిరోభావ స్తస్యాః కాలేన నారద !**

న కృత్రిమా చ సా నిత్యా సత్యరూపా యధా హరిః ॥

**(నారద పంచరాత్రము ద్వి.రాత్రి.తృ.అ.51-54)**

శ్రీ కృష్ణు డే విధంగా పరబ్రహ్మ స్వరూపమో రాధాదేవి కూడా అంతే. ప్రకృతి కంటె పరులు వారిద్దరూ; హరి యెలా సత్యుడో ఆమె కూడా అంతే సత్య - నిత్య -

**రాధా రాసేశ్వరీ రమ్యా రామా చ పరమాత్మనః**
**రాసోద్భవా కృష్ణకాన్తా కృష్ణ వక్షఃస్థలస్థితా -**
**కృష్ణ ప్రాణాధిదేవీ చ మహావిష్ణోః ప్రసూరపి ॥**
**సర్వాద్యా విష్ణుమాయా చ సత్యా నిత్యా సనాతనీ ।**
**బ్రహ్మస్వరూపా పరమా నిర్లిప్తా నిర్గుణా పరా ॥**
**(నారద పంచరాత్రము. ద్వి.రాత్రి 4 అ 48-50)**

ఆమె రాసేశ్వరి. రాసలో ఉదయించింది. కృష్ణునకు ప్రాణాధిదేవత. మహావిష్ణువునకు తల్లి. ఆమెయే సనాతని - విష్ణుమాయ.

**అంతరంగై స్తథా నిత్య విభూతై స్తైశ్చిదాదిభిః ।**
**గోపనాదచ్యుతా గోపీ రాధికాకృష్ణ వల్లభా ॥**
**దేవీ కృష్ణమయీ ప్రోక్తా రాధికాపరదేవతా ।**
**సర్వలక్ష్మీ స్వరూపా సా కృష్ణాహ్లాద స్వరూపిణీ ॥**
**తతః సా ప్రోచ్యతే విప్రహ్లాదినీతి మనీషిభిః**
**తత్కాలకోటి కోట్యంశా దుర్గాద్యా స్త్రిగుణాత్మికాః ॥**
**సా తు సాక్షాన్మహాలక్ష్మీః కృష్ణో నారాయణః ప్రభుః ।**
**నై తయో ర్విద్యతే భేదః స్వల్పోపి మునిసత్తమ ।**
**ఇయం దుర్గా హరీ రుద్రః కృష్ణః శక్ర ఇయం శచీ ।**
**సావిత్రీయం హరిర్బ్రహ్మా ధూమోర్ణాసౌ యమో హరిః ॥**
**బహూనాం కిం మునిశ్రేష్ఠ వినా తాభ్యాం నకించన ।**
**చిదచిల్లక్షణం సర్వం రాధాకృష్ణమయం జగత్ ॥**

**ఇత్థం సర్వం తయోరేవ విభూతిం విద్ధి నారద**

**నశక్యతే మయావక్తుం వర్షకోటి శతైరపి ॥**

**(పద్మశ్రీ, పాతాల, 7అ 52-58)**

రాధ - శ్రీకృష్ణుని ఆనంద స్వరూపము. అందుకే ఆమెను హ్లాదినీశక్తి అంటారు. ఆమె నిర్గుణ. ఆమె తేజస్సులోని కోట్యంశమే గుణసహితలైన దుర్గాది దేవతలు. సర్వదేవతాస్వరూపులు రాధాకృష్ణులు. ఆమె దుర్గ యైతే హరి రుద్రుడు. కృష్ణుడు ఇంద్రుడైతే ఆమె శచీదేవి. ఆమె సావిత్రి యైతే కృష్ణుడు బ్రహ్మ, హరి-యముడైతే ఆమె ధూమోర్ణ. ఈ విధంగా సర్వదేవతలు వారే. మునివర్యా! వారు కానిది వేరు లేదు. చిదచిల్లక్షణాత్మకమైన ఈ ప్రపంచమంతా రాధాకృష్ణమయమే. వారి విభూతిని వర్ణించటానికి కోటి సంవత్సరాల సమయమైనా చాలదు. అటువంటి ఆ మహానుభావుల దర్శనానికి వెళదాము.

ఇద్దరూ కలిసి రాధాకృష్ణ దర్శనం కోసం వ్రజమండలానికి వెళ్ళారు. బృందావన గగనంలో మహోజ్వలమైన దివ్యకాంతులు ప్రసరిస్తున్నవి. తెల్లని వెన్నెల వెలుగులతో ఆకాశమంతా పిండి ఆరబోసినట్లుగా ప్రకాశిస్తున్నది. ఎక్కడ చూసినా పూలపొదలు, తీగలు, మత్తభృంగ ఝంకారములు, హంసలు, కోకిలలు ఎటు చూసినా శృంగారభరితమైన అద్భుత వాతావరణం. కొన్ని వేలమంది గోపికలు దూరంగా కన్పిస్తున్నారు. ఇంకా సుదూరప్రదేశంలో కృష్ణుడు రాధాసమేతుడై ఉన్నాడు. ఆ రాసమండలిలోకి ప్రవేశించాలని వీరు వెళ్ళారు. వేత్రహస్తలైన గోపికలు వీరిని అడ్డగించి లోపలికి పోనీయలేదు. వారు తాము యెవరో ఎందుకు వచ్చారో చెప్పుకున్నారు. ఎందుకంటే ఆ గోపికల ముందు వీరి దివ్యశక్తులేవీ పనిచేయడం లేదు. ఆ ద్వారపాలికలు “మాన్యులారా ! మీరు చాలా గొప్పవారు. మీ గొప్పతనాన్ని మేముకాదనడం లేదు.

కానీ ఈ రాసమండలంలో కృష్ణుడు ఒక్కడే పురుషుడు. ఇతర పురుషులకు ప్రవేశం లేదు. మీకు కృష్ణదర్శనం కావాలన్న కోరిక ఉంటే అదిగో అల్లంత దూరంలో మానస సరోవరం ఉంది. దానిలో స్నానం చేస్తే

మీకు గోపికా రూపాలు వస్తాయి. అప్పుడు మీకు ప్రవేశానికి అనుమతి లభిస్తుంది" అని చెప్పారు. ఆసురీ శివులిద్దరూ ఆ విధంగానే సరస్సులో స్నానం చేసి గోపికా రూపాలు పొంది రాసమండలిలో ప్రవేశించారు. వంశీధరుడు, రాధాసహితుడు అయిన కృష్ణుని దర్శనం వారికి లభించింది. "గోలోకవల్లభా ! దేవాదిదేవా ! నీకు నమస్కారములు రాసేశ్వరి అయిన రాధాదేవితో కలిసి ప్రేమరసవర్షాన్ని కురిపించి సాధక హృదయక్షేత్రాలలో మధురభక్తి ఫలాలు పండించడానికి మీరు అవతరించారు. పూర్ణతములైన దివ్యావతారమూర్తులు మీరు. మీ దర్శనంతో మేము కృతార్థులమయినాము. మమ్మల్ని అనుగ్రహించండి" అన్నారు. రాధాకృష్ణులు ప్రసన్నులయి "మీ అభీష్టమైన వరాన్ని కోరుకోండి" అని పలికారు. వారు "బృందావనధామంలో మీ చరణసన్నిధిలో ఎప్పుడూ ఉండడానికి అనుమతి ప్రసాదించండి" అని అభ్యర్థించారు. ఆ ఆదిదంపతులు వారికి ఆ వరాన్ని ప్రసాదించారు. ఆసురి మునికి గోపీత్వము సిద్ధించినది. కైలాస వల్లభునికి లోకపాలన బాధ్యతలున్నవి కనుక ఆయన యొక్క ఒక అంశ బృందావనధామంలో 'గోపీశ్వరుడు' అన్నపేరుతో స్థిరపడింది. ఈ గోపీశ్వరుడే బృందావన క్షేత్రపాలకుడు. పగలంతా శివుడై పూజలు అభిషేకాలు అందుకుంటాడు. రాత్రివేళ గోపికయై రాసమండలిలో ప్రవేశిస్తాడు. అందుకే బృందావనంలో ఈ దేవునకు సాయంకాలం పూట గోపికగా అలంకారం చేస్తారు. కృష్ణుడు వంశీగానం చేసిన వటవృక్షానికి ఇతడు ఎప్పుడూ అభిముఖంగా ఉంటాడు.

## రాధాకుండము - శ్యామకుండము

ఒకరోజు రాధాకృష్ణులు ఒక ఏకాంతప్రదేశంలో కలుసుకుందామనుకున్నారు. కృష్ణుడు వెళ్ళేసరికి రాధాదేవి కోపంతో ఉన్నది. కృష్ణుడు బ్రతిమాలాడాడు. ఆమె కోపానికి కారణం చెప్పమని అడిగాడు. రాధాదేవి "నీవీ రోజు గోహత్య చేశావు. నన్ను తాకవద్దు" అన్నది. కృష్ణుడు "ప్రేయసీ ! కంసుడు పంపిన రాక్షసుడొకడు నన్ను చంపటానికి వృషభరూపంలో వచ్చాడు. రాక్షసుడు గనుక వానిని చంపాను" అన్నాడు. అయినా గోవు ఆకారంలో వాడు వచ్చాడు కదా ! ఆ ఆకృతిలో ఉన్న వానిని వధించడం

వల్ల దోషం తప్పదు. ధర్మరక్షణ కోసం చేసినా అనుషంగిక ఫలాలు కొన్ని తప్పవు. సీతాదేవిని అపహరించిన రావణుని రాముడు చంపడం న్యాయమే. కాని బ్రాహ్మణుడైన రావణుని చంపినందువల్ల రామునికి బ్రహ్మాహత్యాపాతకము అంటుకున్నది. ఆ పాపాన్ని పోగొట్టుకోవడానికి అతడు శివప్రతిష్ఠ చేశాడు. అదే 'రామేశ్వరము' అన్నపేరుతో దివ్యక్షేత్రమై విలసిల్లుతున్నది అన్నది రాధ.

కృష్ణుడు : మరైతే నన్ను ఇప్పుడు ఏం చేయమంటావు ?

రాధ : భూమిలోని సమస్త పుణ్యతీర్థాలలోను స్నానం చేయి. అప్పుడు పాపక్షాళనం అవుతుంది.

కృష్ణుడు : అలానే. అయితే సమస్త తీర్థాలలోను స్నానం చేసి రావడానికి చాలాకాలం పడుతుంది. అంత కాలం నిన్ను చూడకుండా నేను ఉండలేను. అందుకని ఇదిగో ! ఇక్కడే ! ఒక తీర్థాన్ని నిర్మిస్తున్నాను. ఒక కుండాన్ని తవ్వి అందులోనికి సృష్టిలోని సర్వతీర్థములు ఆవాహన చేస్తున్నా. (ఒక్క క్షణంలో పరమాద్భుతమైన 'శ్యామకుండం' సృష్టించబడినది. అందులో స్నానం చేసి) శ్రీకృష్ణుడు "రాధా చూచావా మరి ! నీవు చెప్పిన పనిచేశా. మహనీయమైన దివ్యతీర్థం నావల్ల నిర్మాణమయింది. ఇది భవిష్యత్తులో భక్తులందరికి దివ్యతీర్థంగా అలరారుతుంది."

రాధాదేవి : కృష్ణా ! నీ శక్తి నీవు చూపించావు. నేనూ చూపిస్తా చూడు. అని తన చేతి కంకణాన్ని తీసి కిందకు జారవిడిచింది. ఆ కంకణం పడిన చోట శ్యామకుండానికి పక్కనే మరొక దివ్యతీర్థం ఉదయించింది. దానికి 'రాధాకుండం' అని పేరు వచ్చింది.

కృష్ణుడు : దేవీ ! ఈ రెండు తీర్థాలు బృందావనానికి అత్యంత ప్రధానమైనవిగా ప్రకాశిస్తాయి. నిజానికి ఈ రెండూ గోలోకంలో మనం పరస్పర విరహంతో కార్చిన కన్నీళ్ళ సరస్సుల ప్రతిరూపాలు. ముందు రాధాకుండంలో స్నానం చేసిన తరువాతనే శ్యామకుండంలో స్నానం చేయాలన్న

నియమం పెడుతున్నాను. మనిద్దరిలో ఎప్పుడూ నీదే ప్రథమస్థానం.

## వంశీవటము

బృందావనంలో గోపేశ్వర మందిరానికి ఎదురుగా ఒక వటవృక్షం ఉంది. ఆ చెట్టు కింద గోవిందుడు వేణువు ఊది బృందావన వాసులను పులకరింపచేశాడు. ఇది ఇలా ఉండగా మరొక రోజు రాధాదేవితో కలిసి వేణుగోపాలుడు బృందావనం నుండి వెళ్ళి యమునదాటి అక్కడి అరణ్యంలో సుదూర ప్రదేశం వెళ్ళాడు. అక్కడ కూడా ఒక పెద్దమఱ్ఱి చెట్టు వుంది. ఆ వాతావరణం ఇద్దరికీ ఎంతో నచ్చింది. ఉత్సాహంతో తన పిల్లనగ్రోవిని ఊదడం మొదలు పెట్టాడు కృష్ణుడు. రాధాదేవి నాట్యం చేయడం మొదలు పెట్టింది. కొంతసేపు అలా నాట్యగానములు సాగిన తరువాత ఇద్దరూ సుఖాసీనులయి ఉన్నారు. అప్పుడు రాధాదేవి కృష్ణునితో ఇలా అన్నది. "ప్రాణనాథా! ఇవాళ ఎంతో సంతోషంగా ఉన్నది. ఈ ఆనందానికి గుర్తుగా ఈ ప్రదేశంలో మీ వేణునాదము నా పాదనూపురనాదములు లయతాళ సమన్వితములై ఈ వాయుమండలంలో శాశ్వతంగా ఉండాలని నా కోరిక." కృష్ణుడు "దేవీ ! నీ సంకల్పము అమోఘము. ఇక్కడకు వచ్చిన ఏ భక్తుడైనా ఈ వటవృక్షానికి చెవి ఆనిస్తే దివ్యనాదతరంగాలను వినగల్గుతాడు. ఇది నిత్యమై అలరారుతుంది."

## నిధివనము

యమునానదికి కొంచెం దూరంలో చక్కని నికుంజములతో చెలువారే ఒక తోట ఉన్నది. ఆ తోట రాధాకృష్ణులకు చాలా ఇష్టమైన ప్రదేశము. అక్కడ ఒకరోజు రాత్రి సమయంలో గోపికలతో కలసి 'రాసలీల' ఆడారు. రాధాదేవి కృష్ణుని అడిగింది. "స్వామీ ! ఈ ప్రదేశానికి చాలాసార్లు మమ్ములను తీసుకు వస్తున్నారు. ఇక్కడి పూలు, పొదలు అన్నీ బాగా ఉన్నవి. అదికాక ఇక్కడ ప్రత్యేకత ఏదైనా ఉన్నదా ?"

కృష్ణుడు : చిరునవ్వుతో దేవీ నిజానికి ఇది నేను చేస్తున్న ఏర్పాటు కాదు.

నీ ప్రియసఖి అయిన 'లలిత' ఈ ప్రదేశం అంటే ఎందుకో ఎక్కువ ఇష్టపడుతున్నది. ఆమె చేసిన అలంకారమే ఇది అంతా.

రాధాదేవి : అలానా ! లలితా ! గోవిందుడు పలికినట్లు నీకీ స్థలంతో సంబంధం ఉన్నది. భవిష్యత్‌లో నీవు ఇక్కడ మానవరూపంలో ఉదయించి ఈ ప్రేమభక్తి సంప్రదాయాన్ని వర్ధిల్ల చేస్తావు. ఆ సమయంలో నీ కోరిక మీద మేము యుగళరూపంలో ఏక విగ్రహమూర్తిగా అవతరిస్తాము.

లలిత : తల్లీ ! నీ ఆజ్ఞ. నీ సంకల్పం. ఎలా ఉంటే అలా జరుగుతుంది. (500 సంవత్సరముల క్రింద నిధివనంలో నివసించిన గొప్ప సంగీత విద్వాంసుడు మహాభక్తుడు, హరిదాస్ మహారాజ్ లలితాదేవి యొక్క అంశగా చెప్పబడుతున్నాడు. ఆ మహనీయుని కోసం యుగళకిశోర విగ్రహం నిధివనంలో భూగర్భంనుండి బయటకు వచ్చింది. ఆమూర్తికే 'బాంకె బిహారి' – వనవిహారి అనిపేరు.) అయితే నాది ఒక విన్నపం. నాకు తోడుగా మరికొందరిని కూడా అవసరమయినప్పుడు భూమి మీదకు పంపించమని నా ప్రార్థన.

రాధాదేవి : నీ కా వరమిస్తున్నాను. మన పరివారంలోని (రూపగోస్వామి, సనాతన గోస్వామి, మొదలైన గోస్వాములంతా మంజరీగణంలోని వారుగా భావించబడుతున్నారు) 'మంజరీగణం'లో కొందరు మనుష్య జన్మఎత్తి నీకు సమకాలికులై భక్తిమయ వాతావరణాన్ని పెంపొందించడానికి దోహదం చేస్తారు.

కృష్ణుడు : రాధా ! నీకు అత్యంతప్రీతికరమైన మధుర మంజులనాదాన్ని వినిపించే ఈ వేణువు యొక్క అంశను కూడా భూమి మీదకు పంపిద్దాము. రసికులను, భావుకులను భక్తిమార్గంలో తయారు చేయగల శక్తి ఈ వేణువు అంశతో పుట్టినవ్యక్తికి ఉంటుంది.

(500 సంవత్సరాల క్రింద బృందావనంలో జీవించిన 'హితహరి

వంశమహరాజ్ వేణువు యొక్క అవతారంగా చెప్పబడినాడు. ఆయన అంత్య గమనము చాలా విచిత్రమైనది. ముసలితనంలో ఆయన భజన చేస్తుంటే రాధాదేవి' హితసఖీ ! అని పిలిచింది ఆ పిలుపు వినగానే 'అమ్మా ! వస్తున్నా' అంటూ గాలిలోకి తేలిపోయి మాయమయినాడు. శరీరపు అవశేషములు ఏవీ మిగులలేదు. దీనిని యోగశాస్త్రంలో 'కాయారోహణము' అంటారు.)

రాధాదేవి : జగన్నాయకా ! మళ్ళీ ఒక కొత్త ప్రణాళిక రాబోయే కలియుగం కోసం సిద్ధం చేస్తున్నారన్నమాట.

కృష్ణుడు : అవును దేవీ. లోకహితం కోసం మనం ఎప్పటికప్పుడు ఆలోచించి చేయవలసినది చేస్తుండాలిగదా!

## సేవాకుంజ్

నిధివనంలో ఆడిపాడి అలిసిపోయిన రాధాకృష్ణులు ఒక్కొక్కసారి సేవాకుంజ ప్రాంతానికి వచ్చేవారు. అది మరొక ఉద్యానవనం. నృత్యం చేసి అలిసిపోయిన రాధాదేవి కాళ్ళ నొప్పులు పోవడం కోసం కృష్ణుడు స్వయంగా 'పాద సంవాహనం' చేసేవాడు. ఆ సేవ చేసిన ప్రదేశం కనుక దానికి సేవాకుంజమని పేరు వచ్చింది.

## ఇమ్లీతల్

యమునానది ఒడ్డున ఒకసారి రాసలీల జరుగుతూ ఉంటే ఉన్నట్లుండి రాధాదేవి అదృశ్యమయింది. కృష్ణుడు ఆమెకోసం తపించిపోయినాడు. ఆ విరహబాధతో ఆమెను వెదుకుతూ వెదుకుతూ కొంతదూరం వచ్చాడు. అక్కడ కొన్ని చింతచెట్లు ఉన్నవి. ఒక చెట్టు కింద కూర్చుని తీవ్రంగా రాధాదేవి కోసం ధ్యానం చేశాడు. ఎంత తీవ్రంగా తాదాత్మ్యభావంతో ధ్యానం చేశాడంటే శ్యామసుందరుడు గౌరాంగుడు అయినాడు. బంగారు రంగుతో మెరిసిపోయే కృష్ణుని చూసి గోపికలకు ఆశ్చర్యం కల్గింది. కృష్ణుని అద్భుత ధ్యానతీవ్రతను చూచి రాధాదేవి అక్కడకు వచ్చి తన చేతితో గౌర కృష్ణుని తాకి మెలకువ తెప్పించింది. కృష్ణుడు ఆనంద పారవశ్యం చెందాడు. రాధాదేవి చేయి పట్టుకుని కృష్ణుడు నెమ్మదిగా నడుస్తున్నాడు. కృష్ణుని చూస్తూ నడుస్తున్న రాధాదేవి

క్రిందపడిన చింతకాయను చూసుకోలేదు. కాలు దాని మీద పడి రాధాదేవి జారిపడింది. ఆమెను పైకి లేవనెత్తి ఆమె జారడానికి కారణమైన చింతకాయ మీద కోపం వచ్చి 'బృందావనంలో చింత చెట్లు లేకుండును గాక' అన్నాడు. రాధాదేవి నవ్వుతూ "ఇంతమాత్రానికే కోపం తెచ్చుకుంటే ఎలా ? నీవు ధ్యానం చేయడం చేత పవిత్రమైన ఇక్కడి ఈ ఒక్క చింత చెట్టునైనా ఉండనీ ఇది నీ ప్రేమ తపస్సుకు గుర్తుగా నిలుచును గాక" అన్నది. కృష్ణుడు వెంటనే "అలా అయితే ఇంకొకమాట కూడా అంటాను. ఈ చింతచెట్టుక్రింద ధ్యానం చేసిన వారికి నాకు కలిగినట్లే రాధాదేవి అనుగ్రహం శీఘ్రంగా లభించునుగాక" అన్నాడు. రాధాదేవి "సరే అటులే జరుగును గాక" అన్నది.

## మదనమోహిని

బృందావనంలో శ్రీకృష్ణుని కొందరు గోపికలు 'మదనమోహనుడు' అని పిలిచే వారు. మన్మధుని లాగా మోహింప చేస్తాడు అని వారి భావన. నిజానికి మన్మధుడు ఎట్లా ఉంటాడో చూచిన వారు లేరు. శివుని చేత భస్మం కాకముందు ఆయన రూపం నల్లగా, అందంగా ఉన్నట్లు పురాణాలలో వర్ణించబడింది. శివపార్వతుల వివాహం జరిగిన తరువాత రతీదేవి ప్రార్ధనవల్ల మన్మధుడు పునరుజ్జీవితుడైనాడు. అయితే ఒక్క రతీదేవికి మాత్రమే కన్పిస్తాడు. మిగతా జీవులలో 'అనంగుడై' కామభావనలను పెంపొందిస్తాడని చెప్పబడింది. ఒకరోజు దేవలోకంలో మదనుని మందిరం ముందుగా నారదమహర్షి వెడుతున్నాడు. ఆ మహర్షిని చూసి నమస్కరించి లోపలికి ఆహ్వానించాడు. స్వాగత సత్కారాలయిన తరువాత మన్మధుడు "స్వామీ ! తమరు ఎక్కడకు వెడుతున్నారు' అని ప్రశ్నించాడు.

నారద : భూలోకంలో ఉన్న యమునాతీర బృందావనానికి వెడుతున్నాను. కృష్ణ దర్శనం కోసం నా ప్రయాణం.

మన్మధుడు: మహర్షీ! కృష్ణుడిప్పుడు ద్వారకలో ఉన్నాడని విన్నాను. ఆయన బృందావనం విడిచి పెట్టి చాలా సంవత్సరాలు అయింది కదా ! రాక్షస సంహారాలు చేస్తూ అష్ట మహిషులతో నరకాసురుని చంపి తెచ్చిన 16,000 మంది రాజకుమారికలతో క్రీడిస్తూ

ఉన్నాడు. మీరు బృందావనం వెళ్ళి ఏమి చేస్తారు ?

నారదుడు : ద్వారకలో ఉన్నది నారాయణ కృష్ణుడు. ఆదిముని లయిన నర నారాయణులు బ్రహ్మ కుమారుడయిన ధర్ముని పుత్రులు. వారిలో నరుడు అర్జునునిగా, నారాయణముని వసుదేవుని పుత్రునిగా ఉదయించారు. ముని అయిన నారాయణుని మానవశరీరంలోనికి శ్రీమన్నారాయణుని తేజస్సు ప్రవేశించింది. దానివలన రాక్షస సంహారము జరిగి భూభారాన్ని తగ్గించడం జరుగుతోంది. ఆ వాసుదేవ కృష్ణుని చూడడానికి కూడ అప్పుడప్పుడు వెడుతూనే ఉంటాను. కానీ ఇప్పుడు వెళ్ళేది బృందావనంలో ఉన్న కృష్ణుని చూడడానికి.

మన్మధుడు: ఈ కృష్ణుడు ఎవరు ? నాకర్థం కావడం లేదు.

నారదుడు : సహజమే. నీకు అర్థం కావడం కష్టం. వేదములలో 'రసోవైసః ' అని చెప్పబడిన రసస్వరూపుడు, ఆనందస్వరూపుడూ ఈ కృష్ణదేవుడు. అధర్వణ వేదంలో

**"త్వం శృ చక్షొ వృషభాను పూర్వీం**
**కృష్ణస్వాగ్రే అరుషో విభాహి."**

వృషభాను పుత్రీవల్లభునిగా చెప్పబడినాడు. మనం ఉన్న బ్రహ్మాండానికి అవతల కొన్ని కోట్ల యోజనాల పైన గోలోకం ఉన్నది. ఆ లోకానికి నాయికా నాయకులు, ఆది దంపతులు రాధాకృష్ణులు. వారు యమునాతీరంలో అవతరించారు. రాధాదేవి వృషభానుపుత్రికగా, కృష్ణుడు యశోదానందుల పుత్రునిగా ఉదయించారు. గోలోక కృష్ణుడు వాసుదేవ కృష్ణుని శరీరంలో కొద్ది సంవత్సరాలు ఉండడం జరిగింది. వాసుదేవ కృష్ణుడు కంస సంహారానికి బయలుదేరి వెళ్ళిన సంగతి దేవ, మానవ లోకాలలో అందరికీ తెలుసు. ఆ కృష్ణుని జీవితంలో జరిగిన జరుగుతున్న ఘట్టాలను నీవు ఇప్పుడు చెప్పావు. రాధాకృష్ణులు ఆ శరీరాల నుండి బయటకు వచ్చి మేము బృందావన ధామంలోనే శాశ్వతంగా ఉంటామని ప్రతిజ్ఞ చేసి అక్కడి దివ్యభూమికలో రాసమండలిని నిర్మించారు. ఆ మహారాసలో శృంగార క్రీడలు నిరంతరం

జరుగుతూ ఉంటాయి. ఆ కృష్ణభగవానుని దర్శనం కోసం నేను వెడుతున్నాను.

మన్మథుడు: మీరు చెబుతున్న దానిని బట్టి నా బుద్ధికి అందని శక్తి ఏదో అక్కడ పని చేస్తున్నది. లోకంలో ఎక్కడ శృంగార స్పర్శ ఉన్నా, కామేచ్ఛ ఉన్నా అది నా ప్రభావమే. కానీ మీరు చెబుతున్న ఆ బృందావన భూమికలో నా శక్తి పనిచేస్తున్న జ్ఞానం నాకు లేదు. అక్కడ గోపికా కృష్ణుల మధ్య శృంగార మధురమైన క్రీడలు జరుగుతున్నట్లు మీరు చెబుతున్న సమాచారాన్ని బట్టి చాలా వింతగా ఉంది. అక్కడకు వెళ్ళి పరీక్షిస్తాను.

నారదుడు : ఒకసారి దెబ్బతిన్నవాడివి. జాగ్రత్త సుమా !

మన్మథుడు: నాశక్తి నాకు తెలుసు. తొందరపడను. పొరపాట్లు చేయను. అయినా అదేమిటో తెలుసుకుంటాను.

అక్కడ నుండి నారదుడు వెళ్ళిపోయాడు. ఆ మహర్షి వెళ్ళిన కొన్నాళ్ళకు వచ్చిన వసంతపూర్ణిమ నాడు మన్మథుడు తన చెఱకువిల్లు, పూలబాణాలు సిద్ధం చేసుకుని బృందావన భూమిలో అడుగుపెట్టాడు.

**శ్లో॥ ధనుః పౌష్పం మౌర్వీ మధుకర మయీ పంచవిశిఖాః**
**వసంతః సామంతో మలయమరు దాయోధన రథః**
**తథాప్యేకః సర్వం హిమగిరిసుతే కామపి కృపాం**
**అపాంగాత్తే లబ్ధ్వా జగదిద మనంగో విజయతే.** సౌందర్యలహరి

చెఱకువిల్లు, పూలబాణాలు, తుమ్మెదలనారి, వసంతుడు సామంతుడు, మలయ మారుతము రథము. అయినా పరమేశ్వరి కరుణా కటాక్షము సోకడం వల్ల, మన్మథుడు ఒక్కడయినా, ప్రపంచం మొత్తాన్ని జయిస్తున్నాడు.

శివుని కంటి మంటలో భస్మము అయి, పరమేశ్వరి దయవలన పునరుజ్జీవితు డయిన తరువాత జగదీశ్వరి ఇచ్చిన వరం వల్ల తాను అజేయుడనన్న నమ్మకంతో ఉన్నాడు కందర్పుడు. యమునాతీరంలో సాయం సంధ్యావేళ, గోవులు అడవి నుండి తిరిగి వస్తున్న సమయంలో, అతనికి గోవిందుని దర్శనం లభించింది.

మన్మధుడు: శ్రీకృష్ణదేవా ! నమస్కారములు.

కృష్ణుడు : రా, మదనా, కుశలమే కదా !

మన్మధుడు: పరమేశ్వరి దయవలన క్షేమంగానే ఉన్నాను. నారదమహర్షి వల్ల మీ గురించి విని నాకు కల్గిన ఒక సందేహం తీర్చుకుందామని వచ్చాను.

కృష్ణుడు : సంకోచించకుండా అడుగు.

మన్మధుడు: మీరు గోలోకనాయకులని, ఇప్పుడు ద్వారకలో ఉన్న కృష్ణుడు, మీరు కారని మొదటిసారి విన్నాను. ఇక్కడ గోపికలతో రాధాదేవితో మీరు శృంగార మధురమయిన రాసక్రీడలు చేస్తుంటారని కూడా విన్నాను. పరమేశ్వరి వరం వల్ల బ్రహ్మ నియామకం వల్ల ఈ బ్రహ్మాండంలోని సర్వలోకములలో, సర్వగ్రహములలో కామమునకు అధికారిని నే నొక్కడనే. నా సంకల్పం లేకండా, నాకు తెలియకుండా ఇక్కడ కామోత్సవాలు ఎలా జరుగుతున్నాయి?

కృష్ణుడు : ఈ బ్రహ్మాండములో నీ అధికారము సత్యమే. దీనికి, ఇటువంటి బ్రహ్మాండములకు అధీశ్వరులయిన వారి ముందు నీశక్తి పనిచేయదు. ఇక్కడి బృందావనం లోని రాసమండలి ఈ బ్రహ్మాండమునకు ఆవలి గోలోకము నుండి వచ్చినది. దీనిలక్షణములు వేరు. దీనిలో శృంగార మున్నది. కామమును ఉన్నది. కానీ భూలోకపు కామము వంటిది కాదు. అది విశుద్ధ కామము.

మన్మధుడు: ఈ మాటలు, సిద్ధాంతములు నా కర్థం కావడం లేదు. ఈ రాసలీలలో పాల్గొనే గోపికల మీద నా పుష్పబాణాలను ప్రయోగించాలని అనిపిస్తున్నది. మీ రనుమతిస్తే ఇందులో పాల్గొనే గోపికలు, సకామలో నిష్కామలో లేక మీరు చెప్తున్న విశుద్ధకామలో పరిక్షిస్తాను.

కృష్ణుడు : నీ యిష్టము. ఈ రాత్రికి జరిగే రాసలీలలో నీ చేతనయిన పరీక్ష చేయవచ్చును.

మన్మధుడు: చాలా సంతోషము. కృష్ణదేవా ! రాత్రికి నాశక్తి ఎట్టిదో చూచెదరు గాక. వెళ్ళివస్తాను. నమస్కారములు.

మన్మధుడు వెళ్ళిపోయిన తరువాత కృష్ణుడు రాధాదేవి మందిరానికి వెళ్ళాడు. జరిగిన సంగతి వివరించి "శివుని కంటిమంటలో భస్మము కాకముందు ఉన్న మన్మధుని కంటె తిరిగి బ్రతికిన మన్మధుడు 'మహామాయ' అయిన 'త్రిపురసుందరి' అనుగ్రహం వల్ల ఎవరూ గెలువలేని అజేయమయిన పరాక్రమాన్ని కల్గి ఉన్నాడు. మన వరకు ఫర్వాలేదు కానీ, అతని బాణ ప్రయోగం వల్ల ఏ ఒక్క గోపిక హృదయంలోనైనా భౌతికమైన కామవాంఛ కల్గితే నామాట వ్యర్థమవుతుంది."

రాధాదేవి : కృష్ణా ! నీ మాట ఎన్నడూ పొల్లుపోదు. రాసమండలిలోని ఏ గోపికనూ రతీ వల్లభుడు ప్రభావితం చేయలేడు. ఇక్కడి ఏ జీవి మీద అతడి శక్తి ప్రసరించదు. నీవు చెప్పినట్లు వెనుకటి కంటె ఇప్పటి అతనిలో అదనపు శక్తి ఉన్నమాట వాస్తవమే. అతనిది కామాత్మకమైన మహామాయాశక్తి. కానీ, నేను మహా భావ స్వరూపిణిని. రసాత్మకమైన ఈ భావ చైతన్యము ముందు ఏ శక్తీ చాలదు, నిలువలేదు. నీవు సందేహించవలసిన పనిలేదు. ఏ గోపికనూ అతడు ఏమీ చేయలేడు. నీవు నిశ్చింతగా ఉండు. అయినా కొన్ని జాగ్రత్తలు తీసుకుంటాను -

ఆ రోజు రాత్రి రాసలీలలో పాల్గొన్న గోపికల మీద తన బాణముల నన్నింటినీ మన్మధుడు ప్రయోగించాడు. ఆ బాణములు అజేయములని వరము లిచ్చినది త్రిపురసుందరియైన 'లలితాదేవి'. భండాసురవధానంతరము కామశక్తిరహితమైన సృష్టిలో మరలా కామమును ప్రదీపింప జేయడానికి దేవతల అభ్యర్థనల మీద, రతీదేవి ప్రార్థనల మీద, మన్మధుని తిరిగి బ్రతికించి ఇకముందు ఇదివరలో అతనిని దహనము చేసిన శివుడు కూడా అతని అస్త్ర ప్రభావానికి లొంగిపోతాడని, అతడు అజేయుడై ప్రకాశిస్తాడని

వరమిచ్చింది. ఆ వరశక్తి మీది విశ్వాసంతోనే మన్మథుడు తన బాణాలను గోపికలమీద ప్రయోగించాడు. అయితే రాధాదేవి ఒక చమత్కారం చేసింది. మన్మథునికి వరములిచ్చిన లలితాదేవినే తన రాసమండలి ముందు నిలబెట్టింది. మణిద్వీప నాయిక అయిన 'రాజరాజేశ్వరి' లలితాదేవి ఒక గోపిక ఆకారాన్ని ధరియించి రాస వ్యూహమునకు ముందు నిలుచుని ఉన్నది.

**శ్లో॥అష్టౌ ప్రకృతయః పుణ్యా ప్రధానాః కృష్ణవల్లభాః**
**సమ్ముఖే లలితాదేవీ శ్యామలా వాయుకోణకే**

(పద్మపురాణం ఉత్తరఖండం)

అత్యంత శక్తియుతములైన అష్టప్రకృతులు గోలోకములో కృష్ణుని ప్రియురాండ్రై ఉన్నారు. వారిలో లలితాదేవి సమ్ముఖమున ఉంటుంది. శ్యామల వాయుకోణంలో ఉంటుంది. ఈశాన్యమున లక్ష్మీదేవి ఉంటుంది. గోలోకంలో వీరికి ప్రత్యేక స్థానాలు ఉన్నాయి. అటువంటి లలితాదేవి రాధాదేవి సంకల్పం మీద మన్మథుడు బాణాలు వేస్తున్న చోటికి ఎదురుగా నిల్చున్నది. మన్మథుడు వేస్తున్న బాణాలన్నీ ఆమెకు వచ్చి తగులుతున్నవి. ఆమె యిచ్చిన శక్తులు అవి. ఆమెను ఏమి చేస్తాయి ? ఆరోజు రాత్రి మిగిలిన దిక్కులలో గూడ మిగిలిన ప్రకృతి శక్తులు – 'చంద్రావతి', 'చిత్రరేఖ', 'మదనసుందరి' మొదలైన వారు కాపలా ఉన్నారు. రాధాదేవి పరివారంలోని నిత్యాశక్తులు 1)అనంగ సేన 2) అనంగమాలిని 3) మదయంతి 4) బాల 5) రసవిహ్వాల 6) లలితాంగి 7) లలిత యౌవన 8) అనంగకుసుమ 9) మదన మంజరి 10) కళావతి 11) రతికళ 12) కామకళ 13) కామదాయిని 14) రతిలోల 15) రతోత్సుక. వీరంతా వేత్రములు ధరించి లలితాదేవి వెనుక చిరునవ్వు నవ్వుతూ నిల్చుని ఉన్నారు. వీరుకాక ఇంకా లలితాదేవి పరివారంలోని శక్తులు కూడా గోపికల ఆకృతులు ధరించి రాసమండలికి కాపలా కాస్తున్నారు. దూరాన్నుండి చూస్తే స్త్రీరూపం ధరించిన కృష్ణుడా! అన్నట్లుగా ఉన్నది లలితాదేవి. పురుషరూపం ధరియించిన లలితాదేవియే కృష్ణుడని లలితాభక్తుల అభిప్రాయం.

శ్లో॥కదాచిదాద్యా లలితా పుం రూపా కృష్ణ విగ్రహా
తతస్సగోపీ సంజ్ఞాభిః అప్నతోభూత్ స్వశక్తిభిః (తంత్రరాజము)

కామేశ్వరి, భగమాలిని అనంగమోహిని అనంగమదనాతుర మొదలయిన లలితా నిత్యలు గోపికలై సేవిస్తున్నారు. రాధాదేవి రచించిన ఈ మహావ్యూహశక్తి మదనునికి తెలియదు. అతడు వేస్తున్న బాణాలన్నీ తన అధీశ్వరి అయిన లలితాదేవికే తగులుతున్నాయి. ఈ రహస్యం తెలియని మన్మథుడు, తన సర్వశక్తి వినియోగించి కూడా విఫలుడై వెళ్ళిపోయినాడు. సమస్త లోకములలో సర్వదేవతలలో 'మహా భావ స్వరూపిణి' రాధాదేవి ఒక్కరే. ఆ మహాభావము కృష్ణాత్మకమైన 'విశుద్ధ కామమునకు' ఆశ్రయము. కామమును భౌతిక వాసనల నుండి ప్రక్షాళనము చేసి దానిని రసస్థాయికి తీసుకుని వెళ్ళి విశుద్ధ కామమును నిర్మించే శక్తి ఒక్క రాధాదేవికి మాత్రమే ఉన్నది. కామ పరీక్ష జరిగిన ఆ ప్రదేశానికి బృందావనంలో 'కామవనము' అని పేరు వచ్చింది. రాధాదేవికి మదనమోహిని అనే పేరు వచ్చింది.

## వరసానుగిరిలో పెళ్ళి ప్రయత్నాలు

రాధాకృష్ణుల వివాహం భాండీర వనంలో బ్రహ్మదేవుడు స్వయముగా పురోహితుడుగా ఉండి చేశాడు. ఆ విషయం దేవతలకు తెలుసుగాని మానవులకు తెలియదు. లౌకికంగా రాధాకృష్ణులు ఇద్దరూ వేరు వేరు కుటుంబాలకు చెందినవారు. ఐశ్వర్యానికి సంబంధించిన స్థాయిలో వృషభానుడు చాలా పెద్దవాడు. నందునకు అంతటి సిరిసంపదలు లేవు. తమ బిడ్డ రాధ-కృష్ణుని ప్రేమిస్తున్నదన్న విషయం కీర్తిదేవి చెవిన పడింది. ఆమె ఏకాంతంగా తన భర్తతో ఈ విషయం ప్రస్తావించింది. ఇద్దరూ దాని సాధకబాధకాలను గూర్చి చర్చించారు. కృష్ణుడు చిన్నతనంలోనే పరాక్రమ వంతునిగా పేరు చెందాడు. ఎందరో రాక్షసులను చంపినట్లుగా వింటున్నాను. మన వారిలో అంతటి బలవంతుడు మరొకడు లేడు. సిరిసంపదలు కొంత తక్కువయినా ఫరవాలేదు. మనకు మాత్రం ఎవరున్నారు అమ్మాయి తప్ప మన ఐశ్వర్యమంతా అమ్మాయికే కదా ! రాధ కృష్ణుని ప్రేమిస్తున్న దన్న

విషయం నిజమైతే అమ్మాయి కోరిక తీర్చడం మంచిది. అంతకంటే మంచి సంబంధం మనకు మాత్రం ఎక్కడ దొరుకుతుంది. ఈ విధంగా వాళ్ళల్లో వాళ్లు ఆలోచించుకుని తమ బంధువులను, పెద్దలను పిలిపించుకుని వాళ్ళను నందుని దగ్గరకు పెళ్ళిమాటలు మాట్లాడడానికి పంపిద్దామని నిశ్చయించుకున్నారు. మరునాడు ఉదయం తమ చుట్టాలలో పెద్దవాళ్ళను ఆహ్వానించి తాము అనుకున్న విషయం చెప్పి నందుని దగ్గరకు వెళ్ళి సంప్రతింపులు కోసం వెళ్ళవలసినదిగా అభ్యర్థించారు. ఆ మాటలు విని బంధువులలో ప్రముఖుడొకడు ఈ విధంగా అన్నాడు. "వృషభానూ! మన వారిలో నీవు చాలా గొప్పవాడవు. అధికమైన గోసంపద కలవాడవు. ఎంతో ఐశ్వర్యాన్ని సంపాదించావు. విశేషించి మన మహారాజైన కంసునకు నీ వంటే ఎంతో ఆదరము. నీ బిడ్డకు మంచి సంబంధము రావాలని మా అందరి కోరిక. నీవు చెప్పిన మాటలు విన్నమీదట నా కంత నచ్చుబాటుగా లేదు. నందుని కుమారుడైన కృష్ణుని గురించి మన ప్రాంతంలో చాలా వార్తలు వింటున్నాము. అతడు చేసిన కొన్ని పనులను అతిశయోక్తులు పులిమి ప్రచారం చేస్తున్నారేమో ! అనిపిస్తుంది. పసితనంలో పూతనను పాలు త్రాగి చంపాడని చెప్పుకున్నారు. పూతన కంసుని ఆ ఆస్థానంలో ఉండేది అని నీకు తెలుసు. అది కంసునకు కోపం తెప్పించే అంశము. తరువాత ఏదో ఒక బండి విరుగగొట్టాడట. దానికి శకటాసురుని చంపాడంటున్నారు. రోలుకు కట్టివేస్తే ఈడ్చుకుంటూ వెళ్ళి మద్దిచెట్లు కూల్చివేశాడట. ఆ మధ్య ఒక పోట్ల ఎద్దును చంపాడని కూడ విన్నాము. ఇవన్నీ కంసుడు పంపిన రాక్షసులను చంపినట్లుగా కథలు కథలుగా చెపుతున్నారు. ఇటీవల నందుడు ఇంద్రయాగం చేయబోతే ఆపించాడు. ఆ తరువాత ఆ ప్రాంతం అంతా పెద్దవానలు కురిసినాయి. కృష్ణుడు గోవర్ధన పర్వతాన్ని ఎత్తాడనీ, దాని క్రింద గో, గోపకులందరిని ఉంచి 7 రోజుల పాటు రక్షించాడని మరొక కథ ప్రచారం లోకి తెచ్చారు. పశులను మేపడానికి కొండలు, కోనలు, అడవులు తిరగటం మనకు అలవాటే. గోవర్ధన పర్వతం దగ్గర తిరుగుతున్నపుడు కొండ అడుగున పెద్ద గుహలు ఉండటం అతడు చూచి ఉంటాడు. పెద్దవానలు కురిసినపుడు అందరిని అక్కడకు తీసుకువెళ్ళి కాపాడాడు. వీటన్నింటికి మహిమలని పేరు పెట్టి

ప్రచారం చేస్తున్నారు. ఇంకొక ప్రధానమైన అంశం మా మనస్సులో ఉన్నది చెపుతున్నాను. మనము, వైశ్యులము. మన వారందరూ బంగారు రంగులో ప్రకాశిస్తూ ఉంటారు. ఈ కృష్ణుడు నల్లటివాడు. వీడు అసలు యశోదానందుల బిడ్డ కాడేమో అని మా అనుమానం. ఈ పిల్లవానికి నామకరణోత్సవం జరిపినపుడు మన కులపెద్ద లెవరినీ అతడు ఆహ్వానించలేదు. ఇది జరిగి చాలా సంవత్సరాలయినా మా మనసుల్లో సందేహం సందేహంగానే ఉంది. అవసరం వచ్చింది కనుక ఇప్పుడు బయటపడి చెపుతున్నాను. గోపాలన, కృషి – వాణిజ్యములు మన వృత్తి. ఇతడు చేశాడని చెప్పబడుతున్న పనులను పట్టి చూస్తే శారీరకంగా మహాబలాఢ్యుడు అనుకోవాలి. అంతటి బలాఢ్యుడు మన కులంలో ఉండడం అసంభవము. ఆ పిల్లవాడు మన వైశ్యకులానికి చెందినవాడు కాడేమో ! అని మా అనుమానం. యశోదానందులు పిల్లలు లేకపోతే ఎవరినన్నా రహస్యంగా తెచ్చి పెంచుకున్నారేమో !" అప్పుడు మరొక వృద్ధ గోపకుడు ఈ విధంగా అన్నాడు" ఎక్కడో తెచ్చి పెంచుకోవడం ఏలా ఉన్నా యశోద గర్భవతి అయిందని 9 మాసాలు గర్భం మోసిందని అందరికీ తెలుసు. కృష్ణుడు ఆమెకు పుట్టిన బిడ్డ కాకపోతే ఆమె కన్నబిడ్డ ఏమయినట్లు ? అయినా పుట్టి 11 సంవత్సరాలు అయిన తరువాత ఇప్పుడా ఈ చర్చ ? దానిని వింటూ మరొక వృద్ధుడు ఇలా పలికాడు "నేనొక రహస్యం విన్నాను. ఇన్నాళ్ళు కడుపులో దాచుకున్నాను. అది నిజమో కాదో కాని వింటానికి చాలా వింతగా ఉంది. ఎప్పుడో దశాబ్దం క్రింద సంగతి. యశోద ప్రసవించడానికి ముందురోజు నందునితో కలిసి మధురకు వెళ్ళింది. అప్పటికి ఇంకా నొప్పులు వచ్చే సూచనలు ఏవీ లేవు. మామూలుగా వారికి మధురకు కలిసి వెళ్ళటం అలవాటే. అప్పుడప్పుడు పన్నులు కట్టటానికి రాజుకు కానుకలు సమర్పించుకోవడానికి మధురకు మీరు వెడుతునే ఉంటారు గదా ! మధురలో మీకు ఇళ్ళు కూడా ఉన్నవి. రాజుగారి దర్శనం ఆలస్యం అయితే ఇబ్బందులు కలుగకుండా ఉండడం కోసం మీ వంటి సంపన్నులు రాజధానిలో సొంత ఇళ్ళు ఏర్పరచుకుంటారు. అలానే యశోదానందులు వెళ్ళినరోజు రాత్రి అనుకోకుండా నొప్పులు వచ్చి యశోద ప్రసవించింది. మరునాడు తెల్లవారకముందే బళ్ళు కట్టుకొని రాత్రికి రాత్రి పసిబిడ్డతో యశోదానందులు

గోకులానికి వచ్చేశారు. వచ్చి యశోద గోకులంలోనే ప్రసవించిందని ప్రకటించారు. ఇందులో ఎక్కడో ఏదో మాయ జరిగింది. ఏదైనా బిడ్డల వినిమయం జరిగిందేమో! అని అనుమానం. దీని నిజానిజాలు నిరూపించే ఆధారాలు ప్రస్తుతం ఏమీ లేవు. నేను విన్న సంగతి మాత్రం మీకు చెపుతున్నాను". ఇవన్నీ విని వృషభానుడు సమాధానం చెప్పాడు. "మీరు చెప్పిన వన్నీ వింటున్నాను. లోకంలో కట్టుకథలు ఎన్నో వ్యాపిస్తవి. వాటికి ఆధారాలు లేవు. దశరథ మహారాజుకు పుట్టిన బిడ్డలలో రాముడు నల్లనివాడు. లక్ష్మణుడు బంగారు రంగు మేనివాడు. అందువల్ల రాముడు దశరథుని కొడుకు కాదని అనగలమా ? సుప్రసిద్ధమైన స్వారోచిష మనుసంభవ కథ మీలో కొందరు విని ఉంటారు. ప్రవరుడు అనే బ్రాహ్మణుడు ఒక సిద్ధౌషధి సహాయంతో ఆకాశమార్గాన హిమాలయాలకు వెళ్ళాడు. మంచుకొండలలోని కొన్ని విశేషాలు చూచిన తరువాత ఒకచోట నేలపై తడి తగిలి అతడు కాలికి రాసుకున్న దివ్య ఔషధం కరిగిపోయింది. నేలలో కలిసి పోయింది. దిక్కుతోచక తిరుగుతూ ఉంటే ఆ ప్రాంతంలో నివసిస్తున్న 'వరూధిని' అనే అప్సరస అతని సౌందర్యాన్ని చూచి ప్రేమించింది. నిష్ఠాగరిష్ఠుడైన ఆ భూసురుడు ఆమెను తిరస్కరించి తాను నిత్యము ఉపాసిస్తున్న అగ్నిదేవుని ప్రార్థించి ఆ హుతవహుని అనుగ్రహము వల్ల స్వస్థానానికి వెళ్ళిపోయాడు. ఆ తరువాత ఒక గంధర్వుడు ఆ ప్రవరుని రూపాన్ని ధరించి ఆమెను మోసపుచ్చి సంగమించాడు. తత్ఫలితంగా ఆమెకు సంతానం కల్గింది. ఆ పుట్టిన 'స్వరోచి' అనే కుమారుడు అచ్చు ప్రవరుని లానే ఉన్నాడు. ఆ వరూధిని మనసులో ప్రవరుడుండటమే దానికి కారణం. ఆలానే యశోదాదేవి మనస్సులో శ్రీమన్నారాయణుడో, రాముడో ఉండి ఉండవచ్చు. సరియైన ఆధారాలు లేకుండా ఆరోపణలు చేయడం ఉచితం కాదు. ఇక కంస మహారాజు సంగతి నాకు వదిలివేయండి. నేనంటే ఆయనకు ఎంతో అభిమానం. ఆయనకు ఆగ్రహం రాకుండా నేను చూచుకుంటాను. ఎప్పుడో పది ఏండ్ల క్రింద జరిగిన పూతన సంఘటన తప్ప ఇటీవల కృష్ణుడు చంపాడని చెప్పబడుతున్న వారు మధురావల్లభుని అనుచరులనడానికి ఆస్కారం లేదు. అందువల్ల అన్ని రకాలుగాను ఆలోచించిన మీదట అందునా ఒక్కగా నొక్క కూతురు

కోరుకుంటున్న సంబంధం కనుక కాదనటం ఉచితం కాదు. కాబట్టి మీరంతా ఈ విషయంలో సహకరించ వలసినదిగా అభ్యర్థిస్తున్నాను" అన్నాడు.

ఇంక ఎవరూ మాట్లాడడానికి సాహసించలేదు. కొద్ది క్షణాలు అంతా నిశ్శబ్దంగా కూర్చున్నారు. అప్పుడు ఒక వృద్ధగోపకుడు లేచి "మహారాజా ! ఇంక మేము మాట్లాడవలసినది ఏమీ లేదు. అయితే మనకు కొన్ని ఆచారాలు పద్ధతులు ఉన్నవి కదా! వరునకు కానుకగా మంచి ముత్యాలను పళ్ళెం నిండా పోసి పంపడం మన ఆచారం. వరుని పక్షం వారు వాటిని స్వీకరించి తిరిగి అంతకంటే విలువైన ముత్యాలు వధువు ఒడిని నింపగల్గినన్ని పంపించాలి. నందునికి అంతశక్తి ఉన్నదని అనుకోవడం లేదు.అయినా మన ఆచారం పాటించాలి కదా ! ముందు మీరు కానుకలు పంపండి తరువాత ఏమి జరుగుతుందో చూద్దాము" అన్నాడు. వృషభానుడు కులాచారాన్ని కాదనలేక సరే అన్నాడు. రాజకుటుంబం తరపున కులపెద్దలు, పెద్ద ముత్తయిదువలు. కానుకలు తీసుకుని బండ్లు కట్టుకుని మేళతాళాలతో బృందావనం వెళ్ళారు.

నందుడు వారికి స్వాగతం చెప్పి వసతి ఏర్పాట్లు చేసి వారు విశ్రాంతి తీసుకున్న తరువాత కుశల ప్రశ్నలు వేసి అంతా ఒక చోట కూర్చుని సమావేశమయినారు. వారు వృషభానుమహారాజు తరఫున పెళ్ళి రాయబారానికి వచ్చామని రాధాకృష్ణులకు వివాహం చేయటం శుభకరంగా ఉంటుందని చెప్పి తాము తెచ్చిన కానుకలు సమర్పించారు. నందుని భవనం లోపల పెట్టారు. యశోదానందులు లోపల వాటిని పరిశీలించి ఇంతటి విలువైన ముత్యాలు మనదగ్గర లేవు కదా ! కులాచారం ప్రకారం రేపు వారికి కానుకలు పంపించాలే, ఎలా ? అని తర్కిస్తున్నారు. ఏం చేయాలో తోచని స్థితిలో సాయంకాలం అంతా వారు పరధ్యానంగా ఉన్నారు. ఈ లోపు కృష్ణుడు అక్కడకు వచ్చి విషయం తెలుసుకొని వృషభానుడు పంపించిన ముత్యాలలో కొన్ని తీసుకుని దొడ్డిలోని తమ తోటలో చల్లివచ్చాడు. రాత్రి యశోదానందులు మళ్ళీ చూచినపుడు ముత్యాలలో తరుగు కనిపించింది. ఏమైనవని ఆందోళన చెందారు. వారిని చూచి కృష్ణుడు మీరు రేపు తిరిగి వారికి కానుకలు పంపాలనుకుంటున్నారు కదా ! కావలసినన్ని ముత్యాలు

మన యింట లేవని బాధపడుతున్నారు. అందుకని ఈ ముత్యాలు కొన్ని తీసుకువెళ్ళి మన దొడ్లో చల్లాను. అవి మొక్కలు మొలచి రేపు ప్రొద్దుటికల్లా ముత్యాల గుత్తులు కాస్తాయి. వాటిని వారికి పంపించవచ్చు" అని అన్నాడు. కృష్ణుడు చేసిన, చేస్తున్న పనులు వాళ్ళకు అర్థమయినట్లు ఉంటాయి, అర్థం కావు. ఏదో రకంగా అతడు కార్యసాధన చేస్తాడని వారికి నమ్మకం ఉంది. మొత్తం మీద ఆరోజు రాత్రి గడిచింది. యశోదానందులు ప్రొద్దునే కృష్ణుడు లేవక ముందే లేచి వెళ్ళి దొడ్లో చూస్తే కొత్తమొక్కలు చాలా మొలిచి ఉన్నవి. వాటికి ముత్యాలు గుత్తులు గుత్తులుగా కాయలై వ్రేలాడుతున్నవి. ఆశ్చర్యానికి, ఆనందానికి అవధిలేదు. అవన్నీ కోసి తెచ్చి ఇంట్లో దాచి పెట్టారు. కాస్త ప్రొద్దు ఎక్కిన తరువాత వృషభానుని తరఫు వారందరూ మళ్లీ వీరితో సమావేశమయినపుడు తన బంధువులందరి ముందు నందుడు వివాహానికి అంగీకారాన్ని తెలుపుతూ వధువు తరఫు వాళ్ళకు రాధాకుమారి ఒడిని నింపటానికి ఇస్తున్నామని అంటూ పెద్ద పెద్ద పళ్ళాలలో ముత్యాలు కుప్పలు కుప్పలుగా పోసి యిచ్చారు. అందరూ ఒక్కసారి నివ్వెరపోయినారు. తాము తెచ్చిన వాటి కంటె పరిమాణంలో పెద్దవి, విలువయినవి. అధికసంఖ్యలో ఇన్ని జాతిముత్యాలను నందుడు ఎలా ఇస్తున్నాడన్నది ఎవరికీ అవగతం కాలేదు. తాము అనుకున్న దానికంటే నందుని దగ్గర చాలా అధికసంపద ఉన్నదని వారికి రూఢి అయినది. ఈ కానుకలను తీసుకుని మళ్ళీ బళ్ళమీద వారు వృషభానుపురికి వెళ్ళి జరిగినదంతా రాజదంపతులకు వివరించారు. ఇక ముహూర్తాలు పెట్టుకోవడమే తరువాయి. మంచిముహూర్తం పెట్టి పెళ్ళి చేయవలసినదిగా గర్గాచార్యులను అభ్యర్థించాలని నిశ్చయం చేసుకున్నారు.

నారదునివల్ల దేవకీ వసుదేవుల అష్టమగర్భజాతుడు బృందావనంలో యశోదానందుల దగ్గర పెరుగుతున్నాడని వాడే తాను పంపిన రాక్షసులనందరినీ చంపుతున్నాడని తెలుసుకొన్న కంసుడు ఆ కృష్ణుని మధురకు పిలిపించి సంహరించాలని నిశ్చయించుకొని కృష్ణుని, వాని అన్న బలరాముని తీసుకు రావటానికి ధనుర్యాగమన్న ఒక మిష కల్పించి నగర ప్రముఖులలో ఒకడైన అక్రూరుని పంపించాడు. రాజాజ్ఞ అనుల్లంఘనీయం గనుక నందునకు తప్పలేదు. రామకృష్ణులు బృందావనం నుండి బయలుదేరుతున్నారు.

## అసలు వీడ్కోలు

అక్రూరుడు వచ్చిన రాత్రి యమునా తీరంలో రాధాకృష్ణుల ఏకాంత సమావేశం జరిగింది. రాధాదేవితో శ్రీకృష్ణుడు ఈ విధంగా పలికాడు. "ప్రేయసీ! ఈ రోజు బృందావనధామంలో అత్యంత విశిష్టమైన రోజు. ఇన్నాళ్ళుగా ఇన్నేళ్ళుగా నేను నారాయణ కృష్ణుని శరీరంలో నీవు ఉశీనర రాజకుమారి శరీరంలో ఉండడం జరిగింది. ఈ క్షణం నుంచి ఆ శరీరాల నుండి బయటకు రావాలి ఈ నారాయణ కృష్ణుడు- రేపు ఉదయం బయలుదేరి అక్రూరునితో మధురకు వెళ్ళి అక్కడ కంస సంహారం చేయాలి. భూమికి భారంగా ఉన్న రాక్షసులందరిని సంహరించి మహాభారత యుద్ధం చేయించి, ధర్మస్థాపన చేసి నూట పదునాలుగు సంవత్సరాల తరువాత ఈ భౌతిక శరీరాన్ని విడిచి పెట్టి తన ధామానికి వెళ్ళిపోతాడు. నేను బృందావనం దాటి ఒక్క అడుగు కూడ అవతలకు వెళ్ళను. **"బృందావనం పరిత్యజ్య పాదమేకం న గచ్ఛతి"** (పద్మపురాణం) కల్పాంతం దాకా ఈ బృందావన ధామంలో కలిసి ఉందాము". ఆ మాటలు విని రాధాదేవి ఇలా అన్నది. "ప్రాణనాథా! మన ప్రణాళికే అది కదా! నేనూ ఈ రాజకుమారి శరీరం నుండి బయటకు వచ్చి దివ్యదేహంతో ఇక్కడే నీతో పాటు ఉంటాను. ఈ రాసమండలిలో మహారాస ఎప్పుడూ జరుగుతూనే ఉంటుంది. రసికులను, భావుకులను మనం అనుగ్రహిస్తూ ఉందాము. నేను ఇన్నాళ్ళుగా ఉన్న ఈ రాజకుమారి శరీరంలో నా అంశ కొంత ఉంచుతున్నాను. అలనాడు గోలోకంలో శ్రీదాముడు ఇచ్చిన శాపాన్ని ఆ శరీరం అనుభవిస్తుంది. నారాయణ కృష్ణుడు మధురలో కంస వధ చేసిన తరువాత అతడు దేవకీ వసుదేవుల కుమారుడన్న విషయం ప్రకటితమవుతుంది. ఆ వార్తను తెలిసిన వెంటనే కీర్తి, వృషభాను దంపతులు కృష్ణుడు రాజవంశీయుడు కనుక తమ కూతురితో సంబంధం కుదరదని తెలుసుకుంటారు. మరో సంబంధం గురించిన ఆలోచనను రాజకుమారి తిరస్కరిస్తుంది. నా సంకల్పం వల్ల కీర్తివృషభాను దంపతులు ఆమెను బలవంత పెట్టలేరు. ఆమెను ఇక్కడనుండి హిమాలయాలలోని సిద్ధాశ్రమానికి పంపిస్తాను. శాపానుభవం కోసం. ఆమె కృష్ణ వియోగాన్ని అనుభవించాలి.

సిద్ధాశ్రమంలో ఆమె నూరు సంవత్సరాలు తపస్సు చేసి మనతో ఉండే అర్హతను సంపాదించుకుంటుంది. భౌతిక శరీరం పతనమై రాసమండలిలో స్థానం పొందుతుంది. ఇదిగో ఇంక రేపటి నుండి నారాయణ కృష్ణుని పరాక్రమ కార్యములు ప్రారంభ మవుతాయి. వానితో పాటు ఈ దివ్యభూమికలో మన నిత్యలీలలు జరుగగలవు.". భౌతికశరీరంలో జగజ్జనని రాధాదేవి అంశతో, కళతో ఉన్న ఉశీనరరాజకుమారి - రాధ - ఆ విధంగా సిద్ధాశ్రమానికి వెళ్ళి వందేండ్లు తపస్సు చేసి శరీర పతనమైన తర్వాత రాసేశ్వరి అనుగ్రహం వల్ల గోలోకానికి వెళ్ళిపోయి ఆమె పరివారంలో సఖిగా స్థానం పొందింది. సఖిగనుక బృందావనంలో కూడా అమ్మ సేవచేస్తూ ప్రకాశిస్తున్నది

# 13. శుకుడు



వ్యాసమహర్షి శివుని గురించి మేరుపర్వతం మీద కర్ణికారవనంలో కఠోర తపస్సు చేశాడు. కొంతకాలానికి పరమేశ్వరుడు ప్రత్యక్షమై వరం కోరుకోమంటే పంచభూత సమాన వీరుడైన పుత్రునిమ్మని అర్థించాడు. పశుపతి అంగీకరించి వరమిచ్చి అదృశ్యుడైనాడు. తరువాత కొన్నాళ్ళకు పారాశర్యుడు అగ్నికోసం అరణి మధిస్తుండగా ఘృతాచి అనే అప్సరస ఆ వనంలో తిరుగుతూ అక్కడికి వచ్చింది. ఆమె సౌందర్యాన్ని చూచి సాత్యవతేయుడు కామవశుడైనాడు. దేవకాంత భయపడి చిలుకరూపాన్ని ధరించింది. అయినా ఆమె దివ్యరూప వైభవం మనస్సును సంచలితం చేయగా మహర్షికి వీర్యస్ఖలనమై అరణిలో పడింది. వ్యాసుడు మథన మాపలేదు. ఆ అరణి నుండి శిశువుదయించాడు. అప్సరస శుకరూపము దైవరూప సౌందర్యము భావంలో నిలవటంతో ఆ శిశువుకు శుకము యొక్క మరకతవర్ణం వచ్చింది. ముఖంలో కూడా చిలుకపోలిక కొంత ఉన్నది. అందువల్ల శుకుడని నామకరణం చేశాడు ఋషి.

భారతంలోను, దేవీభాగవతంలోనూ శుకునకు సద్యోయౌవనం వచ్చినట్లు చెప్పబడింది. ఆ బాలఋషి బృహస్పతి దగ్గర వేద వేదాంగాలు అధ్యయనం చేశాడు. బాల్యంలోనే వైరాగ్య జ్ఞానభావనలు జన్మాంతర సంస్కారవశమున పెంపొందటం వల్ల చిన్న వయస్సులోనే సన్యాసంతీసుకోవాలని ఆసక్తి కలిగింది. తండ్రియైన వ్యాసమహర్షి పెండ్లి చేసుకోమని చెప్పినా వినలేదు.

దిగంబరుడై అవధూతయై తిరుగుతూ ఉండేవాడు. వ్యాసుడు భాగవతాన్ని రచించిన తరువాత నారాయణభక్తివలన ఆ గ్రంథమును పూర్తిగా అధ్యయనం చేసి హృదయగతం చేసుకొన్నాడు. కొంతకాలానికి హస్తినాపుర

ప్రభువైన పరీక్షిన్మహారాజు శాపగ్రస్తుడై ఏడురోజుల్లో మరణించవలసిన గతి పట్టింది. అప్పుడు శుకమహర్షి ఆరాజు దగ్గరకు వెళ్లాడు.

సీ॥ప్రతినిమేషము పరబ్రహ్మంబు వీక్షించి
మది జొక్కి వెలుపల మరచువాడు
కమలంబు మీది భృంగముల కైవడి మోము
పై కెగసిన కేశపటలివాడు
గిరిగీసి మాయ నంగీకరించని భంగి
వసనంబుకట్టక వరలు వాడు
సంగిగాడని వెంటజాటు భూతములు నా
బాలుర హాసశబ్దములవాడు
గీ॥మహిత పదజానుజంఘోరు మధ్య హస్త
బాహువక్షోగళానన ఫాలకర్ణ
నాసికాగండ మస్తక నయన యుగళు
డైన యవధూత గొల్తు బ్రహ్మణ్యుశుకుని (భాగవతము)

శుకుని జూచి రాజు, సభాసదులు అందరూ గౌరవంతో లేచి స్వాగతం చెప్పారు. మరణం తప్పదు గనుక ఏడురోజుల్లో ముక్తి పొందే మార్గం చెప్పుమని మహారాజు శుకుని ప్రార్థించాడు. భాగవతం వింటే ముక్తి లభిస్తుందని అవధూత పరీక్షిత్తుగా చెప్పగా మహారాజు శ్రీమద్భాగవతం వినిపించమని ప్రార్థించాడు. దయతో మహర్షి అంగీకరించి ఏడురోజుల్లో ప్రవచనం చేశాడు. అప్పటి నుండి భాగవతాన్ని సప్తాహంగా చెప్పటం ఆచారమైంది. భాగవతంలో రాధాదేవి పేరు లేదు. శుకుడు రాధాభక్తుడని బృందావన గాథలలో ఉంది. మరి రాధపేరు ఎందుకు చెప్పబడలేదు. అంటే రాధపేరు స్మరిస్తే ఉచ్చరిస్తే చాలు శుకుడు పరవశించి భావసమాధిలోకి వెళతాడు. అప్పుడు ప్రవచనం సాగదు. కనుక ఆమె పేరు శుకుడు వదిలేశాడు అని కొందరు అన్నారు. మరికొందరు శ్రీమద్భాగవతము విష్ణువు యొక్క అవతారములను వర్ణించే గ్రంథము - విష్ణుమూర్తిని సృష్టించిన వారు గోలోకనాయికా నాయకులైనరాధాకృష్ణులు - కనుక తల్లియైన రాధాదేవి. విష్ణుమూర్తి యొక్క

అవతారమైన వసుదేవపుత్రునితో విహరించిన కథ చెప్పకూడదు – కనుక పరమేశ్వరియైన రాధాదేవిని భాగవతంలో చెప్పలేదు అన్నారు. కారణాలేవైనా శుకులవారు శ్రీమద్భాగవత సప్తాహంలో రాధాదేవిని గూర్చి చెప్పలేదు.

తరువాత కొంతకాలం గడిచిన పిదప శరీరం మీద ఆసక్తి నశించి పూర్ణ వైరాగ్యంతో అవధూత స్థితిలో ఎటో వెళ్తున్నాడు. వేదంలో ఉత్క్రాంతి అని ఒక పద్ధతి ఉన్నది. ఆ విధానంలో మానవుడు అన్నీ వదిలి ఉత్తరాభిముఖుడై వెళుతుంటాడు. ఏవి అడ్డంవచ్చినా తప్పుకోడు. కొండ తగిలితే దానిమీదకు ఎక్కి దిగుతాడు. దిగలేకపోతే పడిపోతాడు. శరీరం క్రిందబడి ఛిన్నా భిన్నమైతే అవుతుంది. లేదు ఏదైనా నది వస్తే దానిలోకి నడచి వెళ్ళిపోతాడు. మునిగిపోతే పోతాడు. పాండవుల మహాప్రస్థానం ఇటువంటిదే. (విశ్వనాథ సత్యనారాయణగారు, నోరి నరసింహశాస్త్రి గారు తమ గ్రంథాలలో ఈ ప్రస్తావన చేశారు.)

శుకుడలా బయలుదేరి వెనుదిరిగి చూడకుండా వెళుతుంటే ఈ సంగతి తెలిసి దుఃఖంతో వ్యాసుడు వెంట వెళ్ళాడు. కానీ అప్పటికే దూరం వెళ్ళిన శుకుడు పంచభూతములలో కలసిపోయినాడు. శరీరం మిగలలేదు. దీనిని కాయారోహణమంటారు. (యోగులు – అనంతర కాలంలో కాశీలో పాశుపతయోగి లకులేశుడు, బృందావనంలో రాధాభక్తుడు హితహరివంశమహారాజ్ – ఇలా అదృశ్యమైనారు. వారి శరీర అవశేషాలు మిగలలేదు) వ్యాసుడు "కుమారా ! శుకా !" అని ఆక్రోశిస్తుంటే వృక్షములు 'ఆ! ఆ!' అని మారు పలుకుతూ ప్రతిధ్వనిస్తున్నవట ! భాగవతం మూలంలో ఇలా ఉంది.

**శ్లో॥యం ప్రవ్రజంత మనుపేత మపేతకృత్యం**
**ద్వైపాయనో విరహకాతర ఆజుహావ**
**పుత్రేతి తన్మయ తయాతరవోభినేదుః**
**తం సర్వభూతహృదయం మునిమానతోస్మి**

దీనికి పోతన గారి తెలుగు

మ॥ సముడై యెవ్వడు ముక్తకర్మచయుడై సన్యాసియై యెంటిబో
వ మహాభీతి నాహో ! కుమార ! యనుచున్ వ్యాసుండు చీరంగ వృ
క్షములున్ తన్మయతన్ ప్రతిధ్వనులు చక్కం జేసె మున్నట్టి భూ
తమయున్ గొల్చెద బాదరాయణి తపోధన్యాగ్రణిన్ ధీమణిన్

ఇక్కడ ఒక రమ్యకథ ఉంది. శుకుడు వెళుతుంటే త్రోవలో అప్సరసలు దిగంబరలై ఒక సరస్సులో జలకాలాడుతున్నారు. అతనిని చూచికూడా పట్టించుకోకుండా వాళ్ళు జలక్రీడలలో ఉన్నారు. వెంటనే వస్తున్న వ్యాసుని చూచి ఆ కాంతలు గబగబా గుడ్డలు కట్టుకొన్నారట ! అప్పుడామహర్షి వారితో యువకుడైన నాకుమారుడు వెళుతుంటే మీరు విక్రియ చెందలేదు. వయసు మళ్ళిన నేను వెళ్తుంటే మీరంతా వస్త్రధారణ చేశారు. ఇదేమిటి ? అని అడిగాడు. దానికి వారు శుకుడు జితేంద్రియుడు. అతనికి కామ వికారము లేదు. మీరలా కాదు అన్నారు. వ్యాసుడాశ్చర్యపడినాడు. ఇంద్రియ జయం సామాన్యం కాదు. శుకుడు అనన్య సామాన్యుడైన విరాగి.

ఇది ఇలా ఉండగా దేవీభాగవతంలో కథ మరొక విధంగా ఉంది. శుకుడు పెండ్లి చేసుకోటానికి ఒప్పుకోకపోతే వ్యాసుడు – నిజమైన విరాగికి సంసారం బంధం కాదు. కావాలంటే మిథిలానగరం వెళ్ళి జనకమహారాజును చూచిరా ! నీకే తెలుస్తుంది – అన్నాడు. ఆ మాట ఆజ్ఞగా శిరసావహించి విదేహ రాజ్యానికి వెళ్ళి జనకుని కలిశాడు. ఆ రాజు జీవనవిధానాన్ని పరిశీలించాడు. అతని బోధనలు విన్నాడు. తామరాకుమీది నీటిబిందువువలె సంసారంలో ఉంటూ కూడా మనస్సన్యాసియై జీవితం గడపవచ్చునని గ్రహించాడు. ఇంటికి – ఆశ్రమానికి వచ్చి – తండ్రి చెప్పిన విధంగా పీవరి అనే అమ్మాయిని పెండ్లిచేసుకొని సంతానాన్ని కన్నాడు.

అనంతరం పూర్ణ వైరాగ్యంతో సంసారం వదలి హిమాలయాలలోని కైలాస పర్వతానికి బయలుదేరాడు. ఉత్తరాభిముఖుడై వెనుకకు తిరుగని యుద్ధవీరుని వలె వెళుతుంటే త్రోవలో రెండు కొండలు అడ్డుగా ఉన్నవి. మహాప్రస్థానానికి – ఉత్క్రాంతి పద్ధతిలో వెళ్ళేవాడు సూటిగా వెళ్తాడు – తప్పుకొని చుట్టు తిరిగి వెళ్ళటం ఉండదు. శుకుని సంకల్పం – కైలాసగిరికి

చేరాలని. అడ్డుగా ఉన్న ఆ శైలశిఖరాలు విరిగిపడిపోయినవి. మార్గం సుగమమైంది. తపశ్శక్తి ప్రభావం అలా ఉంటుంది. శుకుడు ముందుకు వెళ్ళి కైలాస పర్వతం చేరి సిద్ధచారణ సేవితమైన ఆ శివగిరిమీద సిద్ధాశ్రమంలో వివిక్త ప్రదేశాన ప్రాఙ్ముఖుడై కూర్చుండి యోగసిద్ధితో జ్వలిస్తున్న అగ్నివలె ఆకాశానికి ఎగిరి దివ్యభూమికలో ప్రవేశించాడు. సిద్ధశరీరంతో అక్కడనే ఉన్నాడని అనేక యోగుల యొక్క దర్శనము.

భోజమహారాజు కాలంలో ఆయన ఆస్థానంలో కాళిదాసాది కవులెందరో ఉండేవారు. వారిలో కొందరు పండితులు పాండిత్య గర్వంతో వేదంలో తప్పులున్నవి. వ్యాకరణ దోషాలను దిద్దాలి – అని కూర్చుండి పరిశీలిస్తున్నారు. అప్పుడొక చిలుకవచ్చి "నవనవ" అంటూ అరవటం మొదలు పెట్టింది. ఎంత తోలినా పోవటం లేదు. ఇంతలో కాళిదాసు అక్కడికి వచ్చి చూచి ఆ చిలుకకు నమస్కరించి "పంచ పంచ" అన్నాడు. వెంటనే చిలుక వెళ్ళిపోయింది. పండితులేమిటిది ? చిత్రంగా ఉంది. మేమెంత తోలినా పోని చిలుక నీవు "పంచపంచ" అనగానే ఎగిరిపోయింది. దీని అర్థం ఏమిటి? అన్నారు. కాళిదాసు వేదంలోని శబ్ద ప్రయోగం తెలయాలంటే నవవ్యాకరణ వేత్త కావాలి. మనమంతా అయిదు వ్యాకరణాలు మాత్రమే చదివిన వాళ్ళము. వచ్చింది వట్టి చిలుక కాదు. శుకమహర్షి, వారికి నేనదే విన్నవించాను. మీకుతెలిసిన కొద్దిపాటి వ్యాకరణ జ్ఞానంతో వేద ప్రయోగాలు తప్పని నిర్ధారణ చేయవద్దు. మీకాఅధికారం లేదు. ఇంతలో ఈ పని విరమించండి" అని చెప్పాడు. వారు సిగ్గుపడి దోషాన్వేషణ కార్యక్రమం ఆపేశారు. ఈ విధంగా శుకమహర్షి దర్శనమివ్వటం మరికొన్ని సందర్భాలలో కూడా కనిపిస్తున్నది. కనుక ఆ మహానుభావుడు సిద్ధశరీరంతో ఉండి కైలాసపర్వత సిద్ధాశ్రమ కేంద్రం నుండి పనిచేస్తున్నాడని భావించవచ్చు.

**శా॥ వంశీవాదన తత్పరాశ్రితుని దివ్యప్రేమ విభ్రాజితున్**
**ప్రాంశు ప్రాతిభతేజు భాగవతభవ్యార్థ ప్రభాధీయుతున్**
**సంశప్తావనినాథ మోక్షకర కృష్ణాలోకు వైయాసికీ**
**వంశోద్ధారకు యోగినాయకు శుకున్ ప్రార్థింతు బద్ధాంజలిన్.**

బృందావనధామంలో శుకునకు ప్రత్యేక స్థానం ఉంది. రాధాదేవి యొక్క రసికభక్తునిగా అతనిని భావిస్తారు. సిద్ధశరీరాని కంటె గొప్పదైన భావదేహంతో అతడు విరాజిల్లుతున్నాడని రసయోగుల విశ్వాసం. సాధకులకు ఆ మహర్షి ఏ విధంగా ప్రేరణ ఇస్తాడో బృందావన భాగవతం నుండి ఒక కథా ఘట్టాన్ని ఉదాహరిస్తున్నాను.

## శుకవాణి

వ్యాసాశ్రమం నుండి కృష్ణద్వైపాయనుడి కుమారుడైన 'శుకమహర్షి' బృందావన ధామానికి వస్తున్నాడు. త్రోవలో ఒకపూట 'గర్గమహర్షి' ఆశ్రమంలో లేరు. ద్వారకలో కృష్ణుని చేత యజ్ఞం చేయించడానికి వెళ్ళారు. అక్కడి ఆశ్రమవాసులు గర్గమహర్షి శిష్యులు శుకునకు సముచిత మర్యాదలు చేశారు. ఒక యువశిష్యుడు శుకునకు కావలసిన వన్నీ సమకూరుస్తూ దగ్గర ఉండి సేవ చేశాడు. శుకుడు విశ్రాంతి తీసుకుంటున్న సమయంలో ఈ యువకుడు వినయముతో మహర్షి దగ్గరకు చేరి మహానుభావా ! మీకు దయగలిగితే అవకాశము ఉంటే, మీరు అనుమతిస్తే కొన్ని సందేహాలు అడగాలని ఉంది" అన్నాడు. శుకుడు అలాగే నాయనా ! తప్పకుండా అడుగు' అన్నాడు.

యువ : స్వామీ ! శ్రీకృష్ణులవారు బృందావనం విడిచి పెట్టి చాలా కాలం అయింది. వారు ద్వారకలో ఉన్నారు. మా గురువుగారు అప్పుడప్పుడు అక్కడకు వెళ్ళి యజ్ఞాలు చేయిస్తూ ఉంటారు. అయినా బృందావనంలో ఇప్పుడు ఎవరు ఉన్నారు ? యశోదానందులు వృద్ధులైనారు. కృష్ణునితో ఆడుకున్న గోపికలు గోపకులు పెద్దవారైనారు. వారి సంసారాలు వారు చేసుకుంటున్నారు. కృష్ణునకు పెళ్ళి చేద్దామనుకున్న రాధాదేవి బ్రహ్మచారిణి అయి సిద్ధాశ్రమానికి వెళ్ళిపోయింది. మీ వంటి మహానుభావులు అక్కడకు దేనికి వెడుతున్నారో తెలుసుకోవచ్చునా!

శుకుడు : మంచి ప్రశ్నే అడిగావు. వాసుదేవకృష్ణుని శరీరంలో గోలోక

నాయకుడైన గోవిందుడు కొన్నాళ్ళు ఉన్నాడు. కృష్ణుడు మధురకు వెడుతూ ఉండగా ఆశరీరంలో నుంచి బయటకు వచ్చి బృందావనధామంలో దివ్యశరీరంతో ఉన్నాడు. అలానే గోలోకేశ్వరి అయిన రాధాదేవి వృషభానుకుమారి అయిన రాధాదేవి శరీరంలో కొన్నాళ్ళు ఉన్నది. వాసుదేవకృష్ణుడు మధురకు బయలుదేరినపుడు ఆమె కూడ ఆ శరీరంలో నుంచి బయటకు వచ్చి దివ్యశరీరంతో ఉన్నది. వారిని చూడడానికే నేను వెడుతున్నాను. ఇంక అక్కడ గోపికలు శారీరకంగా ముసలివారు కావచ్చు, కొన్నాళ్ళకు మరణించవచ్చు. కానీ వారి భావదేహాలు కృష్ణుని అంటిపెట్టుకునే ఉంటాయి. అక్కడి అంతరిక్షంలో నిత్యరాస జరుగుతూ ఉంటుంది. భక్తి హృదయం గల్గిన ధ్యానయోగులకు మాత్రమే అది గోచరం అవుతుంది.

యువ : స్వామీ, ఈ గోలోకమెక్కడిది ? అన్నిటికంటె గొప్పది వైకుంఠము గదా! దాని నాయకుడైన విష్ణుమూర్తి అందరికంటె గొప్పవాడని మీ తాతగారైన పరాశర మహర్షి రచించిన విష్ణుపురాణంలో చదువుకున్నాను. మీరేమో కొత్తవిషయాలు చెబుతున్నారు.

శుకుడు : పురాణ వాఙ్మయం విచిత్రమయినది. మా నాయన గారు చాలా పురాణాలు రచించారు.

మా తాతగారు విష్ణుపురాణం రచించారు. ఏ దేవుని గురించి రచించిన పురాణాలలో ఆ దేవుడే సర్వేశ్వరుడని చెప్పడం జరిగింది. అవి అసత్యములు కావు. ఋషులు వారి వారి దర్శనాలను లోకానికి అందించారు. దేనిని కాదనవలసిన పని లేదు. అయితే నేను, మరికొందరు మహనీయులు దర్శించిన విషయాలు ఇప్పుడు నిజంగా బృందావనంలో ఉన్న విశేషాలు చెబుతున్నాను. ఇప్పుడు ఉన్న బృందావనం గోలోకానికి ప్రతిరూపం. ఆ గోలోకం వైకుంఠానికి పైన 50 కోట్ల యోజనాలపైన ఉన్నది. అందులో పదివేల యోజనాల విస్తీర్ణంగల రాసమండల మున్నది. అది చంద్రబింబం లాగా గుండ్రంగా ఉంటుంది.

**"నిరాధారశ్చ వైకుంఠో బ్రహ్మాండానాం సరోవరః**
**తత్పరశ్చాపి గోలోకః పంచాశత్కోటి యోజనమ్**
**యోజనాయత విస్తీర్ణః తత్రైవ రాసమండలం**
**అమూల్యరత్ననిర్మాణః వర్తులః చంద్రబింబవత్." (బ్రహ్మావైవర్తము)**

వైకుంఠము దాని అంశమాత్రమే. బృందావనము పూర్ణ ప్రేమరసాత్మకమైనది.

**"వైకుంఠాది తదంశాంశం స్వయం బృందావనం భువి**
**యద్బ్రహ్మా పరమైశ్వర్యం నిత్యం బృందావనాశ్రయమ్." (పద్మపురాణం)**

ఈ సంప్రదాయములో సర్వదేవతలలో ఉన్నతుడు ఆరాధ్యుడు భగవంతుడైన నందనందనుడు గోలోకకృష్ణుడు మాత్రమే. ఆయనను ఉపాసించే మార్గాలు ఎన్నో ఉన్నవి.

యువకుడు : మా గురువుగారు నాకు కృష్ణమంత్రోపదేశం చేశారు. సర్వేశ్వరునిగా, సర్వశక్తి సంపన్నునిగా నేను కృష్ణుని ఆరాధిస్తున్నాను.

శుకుడు : అలా ఆరాధించడం మంచిదే. దానివల్ల ఆయన అనుగ్రహాన్ని పొందవచ్చు. దానివలన సాలోక్యాది ముక్తి నీకు లభించవచ్చు. ఇహ లోకంలో కొన్ని శక్తులు రావచ్చు. కానీ ఉపాసనా మార్గములలో వ్రజ వధువులైన గోపికలు అనుసరించిన **'మధురభక్తి'** మార్గము శ్రేష్ఠమైనది. పరమపురుషుడైన కృష్ణుని ప్రియునిగా భావించుకుని తనను గోపికగా భావించుకొన్న భక్తుడు – ఆయన యొక్క దివ్యప్రేమను అనుభవించ గల్గుతాడు. ఒక దాసుడు, ఒక సేవకుడు ఎప్పుడూ ప్రియురాలితో సమానం కారు. అందుకే ఈ మార్గంలో నాల్గవ పురుషార్థమైన మోక్షము కంటె ప్రేమ అన్న 5వ పురుషార్థం గొప్పది.

యువకుడు: మీరు చెప్పేసాధన మార్గం నావంటి వానికి ఎంతవరకు సాధ్యమవుతుందో ! గోపికా భావన పురుషుడైన నాకు అంత

సులభమనిపించడం లేదు. దానికి అందుబాటులో ఉండే మార్గం మరొకటి ఏదైనా ఉందా?

శుకుడు : ఉన్నది. రాధాదేవి పదములను ఆశ్రయిస్తే కృష్ణుని అనుగ్రహం తొందరగా కల్గుతుంది. రసదేవత, రాసమండలికి అధీశ్వరి అయిన రాధాదేవి కృష్ణప్రాణాధిక, కృష్ణుని చేత కూడ ఆరాధించబడేది.

**"దేవీ కృష్ణమయీ ప్రోక్తా రాధికాపరదేవతా**
**సర్వలక్ష్మీస్వరూపా సా కృష్ణాహ్లాద స్వరూపిణీ**
**తత స్సా ప్రోచ్యతే విప్ర 'హ్లాదినీ' తి మనీషిభిః"**

**(పద్మ. పాతాళఖండం)**

రాధాదేవి హ్లాదినీశక్తి, పరదేవత. వేదములలో **'ఆనందో బ్రహ్మేతి వ్యజానాత్'** అని ఉన్నది కదా! ఆ ఆనందము ఆమెయే. సాక్షాత్ శ్రీకృష్ణుడే **"రాధాభక్తి వినాలోకేమత్ ప్రసాదో నవిద్యతే"** అన్నాడు. "రాధాదేవి యందు భక్తి కల్గి ఆమె అనుగ్రహం పొందకపోతే నా ప్రసాదం లభించదు" అన్నాడు శ్యామసుందరుడు.

**"రాధా దాస్యమపాస్య యః ప్రయతతే గోవింద సంగాశయా**
**సోయం పూర్ణసుధా నిధేః పరిచయం రాకాం వినాకాంక్షతి"**

**(రాధా సుధానిధి)**

రాధా దాస్యము లేకుండా కృష్ణ సంగమము నందు ఆశపడటం ఎలాంటిదంటే పున్నమి లేకుండా పూర్ణచంద్రుని చూడాలనుకోవడం వంటిది.

యువకుడు : అయ్యా ! మీ మాటలు వింటూనే నేను అయోమయంలో పడుతున్నాను. ఇన్నాళ్లు కృష్ణుడు సర్వేశ్వరుడని, శంఖచక్రధరుడని, దుష్టశిక్షణ శిష్టరక్షణ చేసే సర్వశక్తి సంపన్నుడని, విష్ణుమూర్తి యొక్క అవతారమని అనుకుంటున్నాను. ఇప్పుడు ఆయన కంటె బృందావనంలో దివ్యరూపంతో ఉన్న గోలోక కృష్ణుడు అధికుడని చెప్పారు.

సరేలే అనుకుంటూంటే ఇంతలో ఆ దేవుని కంటె రాధాదేవి గొప్పదని చెబుతున్నారు. ఇదేమిటి ?

శుకుడు : అది అంతే. సత్యాన్వేషణలో ఎప్పటికప్పుడు క్రొత్త విషయాలు గోచరించవచ్చు.

**శ్లో॥ తయో రప్యుభయో ర్మధ్యే రాధికా సర్వదాధికా**

**మహాభావ స్వరూపేయం గుణైరతి గరీయసీ."**

**(ఉజ్జ్వలనీలమణి - రూపగోస్వామి)**

రాధాకృష్ణులిద్దరిలో రాధాదేవి అన్నివిధాల అధికురాలు. ఆమె మహాభావ స్వరూపిణి. దేవతలెవ్వరిలోనూ మహాభావ స్వరూపులు లేరు – ఒక్క రాధాదేవి తప్ప. ఆ మహాభావము యొక్క ఒక కిరణం ఆమె అనుగ్రహం వల్ల ఏ భక్తునిలో ప్రవేశిస్తుందో వానిలో రసభావోదయం అవుతుంది. అకారణంగా కన్నీరు రావడం మొదలు పెడ్తుంది. అది దుఃఖం కాదు, సుఖము గూడ కాదు. భౌతిక సుఖాతీమైన ఆనందము యొక్క లక్షణము. రసానుభవ వేళ కలిగే సాత్విక భావలక్షణమది. అటువంటి దివ్యానుభవం కోసమే ధ్యానయోగులు భావుకులు కావడానికి ప్రయత్నిస్తారు. ఆ భావుకులలో శ్రేష్ఠుడు కృష్ణుడు. అతడు రాధా పాదపద్మములను ఎప్పుడూ ఆశ్రయించే ఉంటాడు. అతడు అస్వతంత్రుడు. కృష్ణ ప్రాణాధీశ్వరి అయిన రాధాదేవి అనుగ్రహం సాధిస్తే ఆ వంశీధరుడు వశుడు అవుతాడు. రాధాదేవిని ఆరాధించకుండా బృందావనధామంలో తపస్సు చేయకుండా కృష్ణానుగ్రహం ఎవ్వరికీ లభించదు.

యువకుడు : ఆర్యా ! రాధాదేవిని ఆరాధించాలన్నారు. బృందావనంలో ఉంటే తప్ప అది సాధ్యం కాదంటున్నారు. ఆ స్థానానికి కూడా అంతప్రాధాన్యం ఉన్నదా ?

శుకుడు : ఉన్నది. అసలు మంత్రసిద్ధి, దేవతానుగ్రహము కలగాలంటే ఆ దేవతకు సంబంధించిన క్షేత్రంలో తపస్సు చేసినపుడే వేగ సిద్ధి కల్గుతుంది. మీ ఆశ్రమంలో నీవు అంతో ఇంతో పురాణాలు విని వుంటావు. దేవతానుగ్రహం పొందిన ఋషులు, తపస్వులు

అందరూ ఏ గంగాతీరంలోనో, ఏ హిమాలయాలలోనో, కాశీ, ప్రయాగ మొదలైన క్షేత్రాలలోనో తపస్సు చేసి ఇష్టదేవతా సాక్షాత్కారాన్ని పొందిన వారే. ఎక్కడయినా అతడు ఇంట్లో కూర్చుని తపస్సు చేసి సిద్ధుడయ్యెను" అని ఉన్నదా ? ఉండదు, లేదు. కనుక రాధానుగ్రహం కల్గాలన్నా కృష్ణానుగ్రహం కల్గాలన్నా బృందావనధామంలో భక్తి వికసితమైన ధ్యానసాధన చేయాలి. అక్కడి వనములు సామాన్యమైన తోటలు కావు. అక్కడి వృక్షములు సామాన్య తరువులు కావు. అక్కడి అణువణువు పవిత్రమైనది. అక్కడ తపస్సు చేస్తే సాధకుడు కృష్ణుని వేణుగానం వినగల్గుతాడు. ఋషులెందరో ఆ నాదం వినడానికి అక్కడికి పక్షిరూపాలు ధరించి వస్తారు.

**"ప్రాయో బతాంబ! మునయో విహగావనేస్మిన్**
**కృష్ణేక్షితం తదుదితం కలవేణుగీతం**
**ఆరుహ్యా యే ద్రుమభుజాన్ రుచిర ప్రవాళాన్**
**శృణ్వంతి మీలితదృశో విగతాన్య వాచః"** (పద్మపురాణం)

అక్కడి ధూళిలో కోట్ల విష్ణువులుంటారు. **'బృందావన రజో బృందే తత్రస్యుః విష్ణుకోటయః'** అక్కడ ఉండే కోకిలలు, హంసలు, శుక, శారికలు, సిద్ధులు, సాధ్యులు, గంధర్వులు.

**"కల్పవృక్షః కదంబోయం పరానందైక భాజనమ్,**
**సిద్ధాశ్చ సాధ్యా గంధర్వాః కోకిలాద్యాన సంశయః** (స్కాంద)

యువకుడు : మీ మాటలు వింటూంటే ఈ ఆశ్రమాన్ని విడిచిపెట్టి బృందావనానికి వెళ్ళిపోవాలని అనిపిస్తున్నది.

శుకుడు : తప్పకుండా. నేను కూడా బృందావనం వెళ్ళినప్పుడు ముందు రాధాదేవి అడుగు పెట్టిన ప్రదేశాలను చూచి కళ్ళకద్దుకుంటాను.

**పావన రాసభావుకుల వాసములందున సూర్యపుత్రికా**
**జీవనసిక్త కుంజకుటసీమల యందున రమ్య రమ్య బృం**

**దావన వాయుమండల కనత్కనకాంబర సంధ్యలందున్**
**దేవి పదమ్ములంటిన ప్రదేశములన్ వెదుకాడి మ్రొక్కెదన్.** రాధాలహరి

ఆ భూమిలో అడుగు పెడితే చాలు శరీరం పులకిస్తుంది. అప్రయత్నంగా కన్నీళ్ళు వస్తాయి. ఆ కన్నీళ్ళనే ముత్యాల దండతోటే ధ్యానంలో రాధాదేవిని అలంకరిస్తాను.

**"కోష్ణసరాగ బాష్పములు గూర్చిన ముత్తెపుదండ నిచ్చెదన్**
**విష్ణుని తల్లికిన్ వినుత వేదగిరిన్ వికసించు మల్లికిన్**
**జిష్ణుని మౌళికిన్ వెలుగు చిందెడు పాదసరోజ కేళికిన్**
**కృష్ణుని రాణికిన్ సకలసృష్టికి మౌలికమైన ప్రాణికిన్.** రాధాలహరి

యువకుడు : ఈ భావన అద్భుతంగా ఉంది. మీరు మహనీయులు, కారణజన్ములు కనుక మీకా విధమైన భక్తి సాధ్యమవుతుంది. నావంటి సామాన్యుడు రాధాదేవిని ఉపాసించడం ఎలా ? కృష్ణుని ఉపాసించడంలో గోపికల మధురభక్తి మార్గం ఉత్తమమైనదని అన్నారు. మరి రసదేవత, రాసేశ్వరి అయిన రాధాదేవిని ఉపాసించడం ఎలా ? దయచేసి చెప్పండి.

శుకుడు : రాధాదేవి రసదేవత. మామూలు స్త్రీ దేవతను, ప్రపంచాన్ని పరిపాలించే మహేశ్వరిగాను మాతృస్వరూపిణిగాను భావించి ఉపాసించవచ్చు. కానీ ఈ దేవతను రసరూపిణిగా ఉపాసించాలి. అయితే అది ఎలా? అన్న ప్రశ్న వస్తుంది.

దేవతలకు అప్సరసలకు నాట్యాచార్యుడైన భరతుడు రససిద్ధాంతాన్ని గురించి చెప్పాడు. సాహిత్యవేత్తలయిన మహర్షులు దానిని వ్యాఖ్యానించారు. ప్రధానమైన రసములు తొమ్మిది 1) శృంగారము 2) వీరము 3) కరుణము 4) హాస్యము 5) అద్భుతము 6) రౌద్రము 7) బీభత్సము 8) భయానకము 9) శాంతము మరి కొందరు ప్రేయోరసము, వత్సలరసము, మాయారసము గురించి ప్రతిపాదించారు. కొందరు పండితభక్తులు భక్తిరసాన్ని ప్రతిపాదించారు. పూర్వజన్మ సంస్కార వశమున మానవుని హృదయంలో ఉన్న ఇత్యాది స్థాయీభావములు విభావ, అనుభావ వ్యభిచారి భావ,

సాత్వికాదిభావములచే వ్యక్తమై రససిద్ధికి దారితీస్తుంది. ఇప్పుడు వీటిని వివరించి అలంకారశాస్త్రము పై ఉపన్యాసము చెప్పను. ఇది వరకు నీవు కొంత చదివి ఉంటే సరే, లేకపోతే ఎవరయినా పండితుని వద్ద తరువాత చదువుకుందువు గాని. ఇక్కడ ప్రధానంగా చెప్పదల్చుకున్నది ఒకటే. లోకములో సుఖదుఃఖములున్నవి గాని ఆనందము లేదు. భార్యాభర్తలు ప్రేయసీ ప్రియులు అనుభవించేది కామసుఖము. ఒకడు యుద్ధంలో గెలిస్తే కలిగేది ఉత్సాహ సుఖము. ఈ సుఖములన్నీ ఇంద్రియములకు సంబంధించినవి. లౌకికమైన ఇంద్రియ వికారములకు అతీతమైనది ఆనందం. మధురమైన సంగీతం విన్నపుడు, కమ్మని కవిత్వం విన్నపుడు కమనీయ నాటకాన్ని చూచినపుడు రసానుభూతి కల్గి అది ఆనంద ఫలితాన్ని ఇస్తుంది. నాటకాన్ని చూస్తూ ఉన్నపుడు నాటకం వేసేవాడు – ఆ పాత్రలో నటిస్తాడే కాని దాని అనుభవాన్ని పొందదు పొందకూడదు. ప్రహ్లాద చరిత్ర నాటకంలో నరసింహస్వామి పాత్ర వేసేవాడు నిజంగానే తాను నరసింహస్వామిననుకుంటే హిరణ్యకశిపుని వేషం వేసుకున్నవానిని. తన ఉక్కుగోళ్ళతో చీల్చివేస్తాడు. ఆ మధ్య ఒక నాటకంలో ఇలానే జరిగింది. నరసింహస్వామి స్వామి వేషం వేసేవాడు మూడురోజుల ముందు నుండి ఉపవాసం ఉండి మిరియాలు తింటూ నరసింహ జపాన్ని చేశాడు. రంగస్థలం మీద వచ్చేసరికి నరసింహావేశం వచ్చి నిజంగానే హిరణ్యకశిపుని పాత్రధారిని చీల్చి చంపివేశాడు. నాటకం గందరగోళంగా ముగిసింది అర్థంతరంగా ఆగిపోయింది. కనుక పాత్రధారి రసానుభావుకుడు కాకూడదు. ఇక మరి ఆనందాన్ని అనుభవించేది ఎవరు? నాటకం చూస్తున్న సామాన్యుడు. కనుక ఈ సిద్ధాంతాన్నే ఉపాసనారంగంలోను అన్వయించాలి. భక్తుడు భగవల్లీలను తన ఇష్టదేవతాకథలను సంగీత, కావ్య నాటకాలలో దర్శించాలి. ధ్యానంలో భావించాలి. రాధాదేవిని గూర్చి చేసే సాధనలలో భక్తుడు తనను ఆమె సఖిగా భావించుకోవాలి. ఈ సఖీభావసాధన చేసే సాధకుడు తనను కృష్ణుని ప్రియురాలిగా గోపికగా భావించదు, కృష్ణునితో శృంగారక్రీడలను చేయాలని కోరుకోడు. అలా కోరితే అతడు నాటకంలోని ఒక పాత్రతో సమాన మవుతాడు. నాటకాన్ని చూసే సామాజికుడు కాడు. ఆ మార్గంలో సాధన చేస్తూ ఉన్నతస్థితికి వెళ్ళిన భక్తునికి రాధాకృష్ణుల లీలలు

కన్పిస్తుంటాయి. అతడు రాసక్రీడలను చూస్తాడు. వారికి సేవ చేస్తున్నట్లు భావిస్తాడు. వారి క్రీడలకు కావలసిన ఉపకరణాలను సమకూరుస్తాడు. సుగంధ ద్రవ్యాలు, పూలసెజ్జలు ఏర్పాటు చేస్తాడు. వారికోసం పాటలు పాడుతాడు. ఆటలు ఆడుతాడు. తనవంటి ఇతర సఖీగణం సేవలు చేస్తూంటే వారిని చూస్తూ సహకరిస్తుంటాడు. అంటే ఈ సాధకుడు నాటకాన్ని చూసే సామాజికుని స్థితిని పొందుతున్నాడన్నమాట. అపుడు అతడు రసానందాన్ని అనుభవిస్తాడనటంలో సందేహం లేదు. ఆ దృష్టితో చూచినపుడు మధురభక్తి సాధకులకంటే సఖీభావ సాధకుడే శ్రేష్ఠమైన రసోపాసకుడు. మధురభక్తిలో పాత్రత్వం పొందడం ఉంటుంది. సఖీ భావనలో సామాజికత్వం పొందడం ఉంటుంది.

యువకుడు : మహర్షీ ! లోకంలో అందరూ ధ్యానసాధకులు కాలేరు. దివ్య దర్శనాలు పొందలేరు. అటువంటివారు మీరు చెప్పినసాధనలు చేయడంఎలా?

శుకుడు : దీనికి సమాధానం ముందే చెప్పాను. లౌకికంగా భక్తిభరితమైన కావ్య నాటక, పఠన దర్శనాలు చేయడం. రాసలీలల ప్రదర్శనలను చూడడం. మానసికంగా ఎప్పటికి నేను రాధాదేవి యొక్క సఖిని కాగలనన్న విరహాన్ని అనుభవించడం. దీనికి కూడ బృందావన నివాసం సహాయం చేస్తుంది.

యువకుడు: చాలా వినూత్నమైన, విచిత్రమైన సిద్ధాంతము విన్నాను. మీరు చెప్పిన దాని ప్రకారం గోపికా భావన వల్ల ఆనందం లభిస్తుందా! అన్న సందేహం కల్గుతున్నది.

శుకుడు : సాహిత్య శాస్త్రముల నిబంధనలలో ఈ భక్తి భావమార్గాన్ని ఇమడ్చడానికి ప్రయత్నించవద్దు. నీ కర్థంకావడం కోసం రససిద్ధాంత సూత్రాలు చెప్పాను. గోపీభావన లౌకికమైనది కాదు. లౌకికమైన సర్వ అనుబంధాలను త్యజించి వారు కృష్ణుని కోసం విరహాన్ని అనుభవించారు. వారికి కల్గిన కృష్ణ సంయోగ అనుభూతి భౌతికమైనది కాదు. జీవేశ్వర ఐక్యము సంపాదించి

పెట్టిన ఒక భావన మాత్రమే. దానిలో ప్రాపంచిక వాసన లేదు. రాసక్రీడ యమునాతీరంలో జరిగింది. ప్రతి గోపికకు కృష్ణుడు తనతో ఉన్నట్లుగా అనిపించింది. యెందరు గోపికలున్నారో అన్ని రూపాలూ ధరించాడు కృష్ణుడు. అందరితో మండలాకార నృత్యాలు, పాటలు, ఆటలు, జరుగుతూనే ఉన్నవి. అంతరిక్షంలో దేవతలు విమానాలలో వచ్చి ఈ అపురూప దృశ్యాన్ని చూచారని చెప్పబడింది. ఇందరు చూస్తుండగా అసంఖ్యాక గోపికలతో బహిరంగ రతిక్రీడా ప్రదర్శన కృష్ణుడే కాదు ఎవరూ చేయరు. గోపికలకు ఎవరికి వారికి సంయోగానుభూతి కల్గింది. అది ఇతరులకు కనపడేది కాదు. అందరికీ కన్పించినది వినిపించినది నాట్య, సంగీతములు మాత్రమే. కనుక ఈ అనుభూతి భౌతికమైనది కాదు. గోపికలు పొందినది దివ్యమైన అనుభూతి కనుక, దానికి భౌతిక వాసనలు లేవు కనుక, భగవత్పరమైనది కనుక అది ఆనందమే.

యువకుడు: పతి, పుత్రులతో, బాంధవులతో కుటుంబజీవనము గడిపే గోపికలు కృష్ణుని ప్రియునిగా కోరడం లౌకికంగా తప్పుకాదా ?

శుకుడు : గోపికలను రెండు వర్గాలుగా విభజింపవచ్చు. చిన్న పిల్లలుగా ఉన్న గోపికలు. వీరు కృష్ణుని భర్తగా పొందడం కోసం కాత్యాయని వ్రతాలు, ఏకాదశి వ్రతాలు ఇటువంటివి ఎన్నో చేశారు. ఆయాదేవతలు వారిని అనుగ్రహించారు. వీరంతా పెళ్లికాని కన్యలు. వస్త్రాపహరణ ఘట్టంలోని గోపికలు వీరే. వీరంతా వివాహం కానివారు. దేవతలు అనుగ్రహించారు. వారికి రసఫలితాన్ని ప్రసాదించారు. కాని వారెవ్వరికి కృష్ణునితో భౌతికంగా పెళ్ళికాలేదు. రెండవ వర్గం, పెండ్లయి కుటుంబ జీవితాన్ని గడుపుతున్న గోపికలు. వీరికి భర్త, పిల్లలు, అత్తమామలు అందరూ ఉన్నారు. వీరూ కృష్ణుని కోరుకున్నారు.

కానీ ఆమాట బయటకు అనే ధైర్యం లేదు. కృష్ణుడు ఏకాంతంగా ఉన్నపుడు తమ కోరికలను చెప్పుకున్నారు. ఈ రెండు వర్గాల వారి కోరికలను కృష్ణుడు నెరవేర్చాడు. భౌతిక దేహాలకు అతీతమైన భావదేహాలను వారికి ప్రసాదించి వాటికి వారు కోరిన అనుభూతి కలిగేటట్లుగా చేశాడు. కనుక ఇక్కడ భౌతిక నియామలను ఉల్లంఘించటం లేదు. సర్వేశ్వరుని ఎవరయినా తమ ఇష్టమైన భావనతో భావించవచ్చు. ప్రాపంచిక నిబంధనలు భౌతిక భూమికలకే పరిమితం. వారికి కలిగిన అనుభవములన్నీ అభౌతికమైన రాసమండలిలో; మరొక చిత్రం ఉన్నది. రాసక్రీడలు జరిగిన శరత్ పూర్ణిమను ఆరునెలలతో సమానమైన రాత్రిగా రాధాకృష్ణులు నిర్మించారు. అంటే గోపికలు ఒక సుదీర్ఘమైన దివ్యానుభవాన్ని వారు పొందగలిగారు. ఈ ప్రపంచంలో ఆనాడు గడిచింది ఒక్క రాత్రి మాత్రమే. భావము భగవత్పరమైనపుడు కామమే కాదు. శత్రుత్వము కూడా ముక్తిని ప్రసాదిస్తుంది. కంసుడు శిశుపాలుడు మొదలైన వారు కూడ కృష్ణుని చేత వధించబడి ఉత్తమ గతులు పొందారు. కనుక గోపికల ప్రేమోపాసన తప్పుకాదు సరికదా ! అత్యున్నతమైనది.

**శ్లో॥ వందే నంద వ్రజస్త్రీణాం పాదరేణు మభీక్ష్ణశః**
**యాసాం హరికథోద్గీతం పునాతి భువనత్రయమ్**

ఎవరి హరికథా గానము చేత ప్రేమ పారవశ్యము చేత మూడు లోకములు పవిత్రమైనవో అటువంటి వ్రజగోపికల పాదరేణువులకు నమస్కరిస్తున్నాను.

యువకుడు: అంతటి భక్తి నిలవటానికి గోవిందుని అనుగ్రహం పొందటానికి ఆ గోపికలు ఎంత తపస్సు చేశారో, కృష్ణమంత్రాన్ని కొన్ని లక్షలు, కోట్లు చేసి ఉంటారని అనుకుంటున్నాను. ఉపనయనమైన తరువాత నేను గాయత్రీ మంత్రాన్ని లక్షలకు లక్షలు చేశాను. కానీ నాకు ఎటువంటి అనుభూతి కలుగలేదు.

శుకుడు : అనుభూతి, మంత్రసిద్ధి అనేక విషయాల మీద ఆధారపడి ఉంటుంది. జన్మాంతర సంస్కారము మొదటి కారణం.

పూర్వజన్మలో తీవ్రమైన సాధన చేసి సిద్ధి కలిగే దశలో ఆయువు తీరి మరణిస్తే ఆవ్యక్తి యోగుల ఇంటిలో పుట్టి సాధనలోకి త్వరగా ప్రవేశించి అంతకు ముందు తాను ఎక్కడ ఆపాడో అక్కడ నుండి మళ్ళీ ఇప్పుడు ప్రారంభమై చాలా వేగంగా సిద్ధి లభిస్తుంది. గోపికలంతా వివిధ యుగాలలో వివిధ కాలాలలో మహాతపస్సు చేసిన యోగివర్యులు. కృష్ణుని అనుగ్రహం పొందడం కోసమే వీరు ఈ జన్మలో గోపికలు అయినారు. వారు కృష్ణుని స్మరిస్తే చాలు పరవశించిపోతారు. మంత్రజపములకు అతీతమైన ధ్యానస్థితి కృష్ణుని అనుగ్రహం వల్ల వారికి లభించింది. ఒక వ్యక్తి తీవ్రంగా జపతపములు చేస్తే అతనికి కొన్ని సిద్ధశక్తులు లభించవచ్చు. భగవంతుని ప్రేమ లభించడం జరుగదు. ఒక చిన్న ఉదాహరణ చెపుతాను – ఒకనాడు బృందావనానికి దూరప్రదేశం నుండి చుట్టపు చూపుగా కొందరు బంధువులు ఒక గోపకుని ఇంటికి వచ్చారు. ఆ వచ్చిన బంధువు భార్య ఇంటిలోని గోపకుని భార్య ఇద్దరూ యమునలో స్నానానికి వెళ్ళారు. ఒడ్డున పొదలు దట్టంగా ఉన్నాయి. చెట్లున్నాయి. ఒక చెట్టు క్రింద ఒక సాధకుడు కృష్ణమంత్రాన్ని చాలా కాలం నుండి జపం చేస్తున్నాడు. ఏ రోజు కారోజు జపం చేసింది లెక్క చూసుకుంటున్నాడు. అప్పటికి కొన్నికోట్లు దాటింది. అతనికి కృష్ణదర్శనం కాలేదు. అతడు అక్కడ ఉండడాన్ని ఈ మహిళలు చూడలేదు. ఆ స్త్రీలు ఇద్దరూ స్నానం చేస్తూ కబుర్లు చెప్పుకుంటున్నారు.

బాంధవి : గోపికా! నీవు కృష్ణుని రాసక్రీడలో పాల్గొన్నావు కదా ! అదృష్టవంతు రాలివి. ఇక్కడ ఉన్నావు కనుక నీ కా భాగ్యం కల్గింది.

గోపిక : ఇక్కడ ఉండడం అన్నది ప్రధానం కాదు. ఎక్కడ ఉన్నా కృష్ణుడు అనుగ్రహిస్తే రాసమండలిలో ప్రవేశించవచ్చు.

బాంధవి : నీవు పెండ్లయి కాపురం చేసుకుంటున్నదానివి. పిల్లలు ఉన్నారు కృష్ణుడు పరపురుషుడు కదా ! నీవు చేసినది తప్పు కాదా ?

గోపిక : ఎంతమాత్రమూ తప్పుకాదు. కృష్ణుడు భగవంతుడు. అశాశ్వతములైన ఈ పతిపుత్ర బంధముల మీద నాకు ఆసక్తి లేదు. ప్రేమస్వరూపుడయిన కృష్ణుని హృదయేశ్వరునిగా భావించాను. ఆయన నాకు దివ్యశృంగార అనుభవాన్ని ప్రసాదించాడు.

బాంధవి : ఆ రాసలీల జరిగిన రాత్రి ఆరు నెలల రాత్రితో సమానమైనదని విన్నాను. అంత సుదీర్ఘకాలంలో కృష్ణుడు నీతో ఎన్నోసార్లు రమించి ఉంటాడు. ఇక్కడ దగ్గరలో ఎవరూ లేరు. మనమిద్దరమూ దగ్గరి చుట్టాలము, స్నేహితులము. నాకా వివరాలు చెప్పవా ? ఆసక్తిగా ఉన్నది.

గోపిక : స్నేహితురాలా ! ఆ వివరాలు చెప్పటానికి ఇది లెక్కల తరగతి కాదు, వ్యాపారపు కొట్టూ కాదు. రాసేశ్వరుడయిన ఆ వేణు గోపాలుడు స్పర్శించగానే పరవశించిపోతాను. ఆ అనుభవానికి లెక్కలు ఉండవు. దీనిని నీవు మామూలు కామ వ్యాపారంగా భావించవద్దు. ఇది నీకు అర్థమయ్యే విషయం కాదు. పోదాం పద.

ఆ యిద్దరూ స్నానాలు పూర్తి చేసుకుని వెళ్ళిపోయినారు. చెట్టు కింద ఉన్న సాధకునికి తన సాధనలోని లోపం తెలిసింది. జపమాలను యమునలోకి విసరివేసి కృష్ణుని కోసం విరహంతో పరితపించే సాధనకు పూనుకున్నాడు. యువకుడా ! ప్రేమ సాధన భావ ప్రధానమైనది. జప ప్రధానమైనది కాదు. మరొక చిన్న అంశం చెపుతాను. కొత్తగా పెళ్ళయిన ఇద్దరు భార్యాభర్తలున్నారు. పొద్దున లేవగానే భర్తకు కావలసిన వస్తువు లందిస్తూ, ఉపాహారం సిద్ధం చేస్తూ సమయానికి కావలసినవన్నీ సమకూరుస్తుంటే భర్త సంతోషిస్తాడా, లేక ఆ భార్య ప్రొద్దుననే లేచి స్నానం చేసి పూజమందిరంలో ఎదురుగా భర్త చిత్రాన్ని పెట్టుకుని జపమాలతో పతినామాన్నే స్మరిస్తూ గంటలకొద్దీ గడిపితే సంతోషిస్తాడా ? భగవంతుడు కూడా అంతే. ఆయనకు ఏది ఇష్టమో అది చేయాలి. ఆయన లేకపోతే, రాకపోతే నేను బతకలేను అన్న విరహ భావాన్ని

పెంపొందించుకోవాలి. అప్పుడు పరుగెత్తుకుంటూ వస్తాడు ఆ ఇష్టదేవుడు - హృదయేశ్వరుడు.

యువకుడు: స్వామీ, అట్లాగయితే ఈ దేవతార్చనలు, పూజలు, జపములు వ్యర్థమే నంటారా ?

శుకుడు : ఎప్పటికీ వ్యర్థం కాదు. ఎవడూ ఒక్కసారిగా మహాసాధకుడు కాలేడు. మెట్టుమీద మెట్టు నెమ్మదిగా ఎక్కాలి.

ఉపవాసములు, పూజలు, వ్రతములు, జపములు అనేవి దైవసాధన అనే సౌధానికి పునాది వంటివి. ఆ పునాది మీద నెమ్మదిగా భక్తి భవనాన్ని నిర్మించాలి. ఈ సాధన కొందరికి వేగంగా ఫలించవచ్చు, కొందరికి కొంత అధిక సమయం తీసుకోవచ్చు. జపముతో పాటు భజన చేయటం చాలా మంచిది. అందులో ఉదయించే శబ్ద తరంగాలు త్వరగా పారవశ్య స్థితిని తీసుకు వస్తాయి. అందుకే బృందావనం వెళ్ళిచూడు. సామూహికంగా భజన చేస్తుంటారు. భజనవల్ల పరవశత్వంతో పాటు దీర్ఘాయువు కూడా లభిస్తుంది. యమునాతీరంలోని గోపవృద్ధులు చాలా మంది రెండు వందల ఏండ్లు పైబడిన వారే. వీరంతా రాధాకృష్ణ భజన చేస్తుంటారు. అసలా శబ్దాలలోనే దివ్యశక్తి ఉన్నది. ఆ మధ్య కొంత కాలం నేను హిమాలయాలలో తపస్సు చేశాను. అప్పుడు కాశ్మీరంలోని జ్వాలాముఖీ దేవి ఆలయానికి వెళ్ళాను. అక్కడ గర్భగుడిలో ఏ విగ్రహం ఉండదు. భూమిలో నుండి ఒక జ్వాల వస్తుంటుంది. అది అష్టాదశ మహాశక్తి పీఠాలలో ఒకటి. దాక్షాయణి అయిన సతీదేవి శరీరభాగం పడిన ఒక స్థలమది. రాక్షస సంహారిణి అయిన వైష్ణవీ శక్తి వెలసిన ప్రదేశమది. నిరంతరం రాధాశ్యామ నామస్మరణలో ఉన్న నేను అప్రయత్నంగా రాధేశ్యామ్ అన్నాను. గర్భగుడిలోని జ్వాల భగ్గున పెద్దగా ప్రజ్వరిల్లింది. ఇదేదో వింతగా ఉన్నది అని మళ్ళీ ఉచ్చరించాను. మళ్ళీ జ్వాలపైకి ఎగసింది. ఆశ్చర్యపడి పరీక్షిద్దామని ఇతర దేవతా నామస్మరణ చేశాను. ఏ విక్రియాలేదు. జ్వాలలో ఏ మార్పు లేదు. 'రాధేశ్యామ్' అంటే మాత్రం ఆ జ్వాల పెరుగుతున్నది. ఆ నామానికి ఆ పీఠానికి ఉన్న అనుబంధం అటువంటిది. నాతో వచ్చిన ఋషి బాలకులు కొందరు గూడా పరీక్షించారు.

వారికీ ఇదే అనుభవం. 'రాధేశ్యామ్' అన్న శబ్దంలో ఒక అద్భుత శక్తి ఉన్నది. నీవూ రోజు ఈ నామంతో భజన చేయి. నీకు తెలియకుండానే నీలో మార్పు వస్తుంది.

యువకుడు: మీరు చెప్పిన సాధన అద్భుతంగా ఉంది. మీ మాటలు వింటూంటే కృష్ణుని మీద కంటే రాధాదేవి మీదకే మనసుపోతున్నది.

అందుకే చాపల్యం వల్ల ఒక సందేహాన్ని అడుగుతున్నాను. పూర్వజన్మలో తపస్సు చేసినవారు, పరమేశ్వరుని అనుగ్రహం కలవారు, కారణజన్ములు, అటువంటి వారికి సాధన ఒక నిమిత్తమాత్రమైన ఆలంబన మాత్రమే. నా వంటి సామాన్యులు స్త్రీ దేవతలను సాధన చేసేటపుడు, ముఖ్యంగా 'రాధాదేవి' కోసం భక్తితో భావించేటపుడు మనస్సు చలిస్తే ప్రమాదం కదా!

శుకుడు : ఇంతకు ముందే చెప్పాను. ఏ భావంతో ఆరాధించినా, ఏ రూపంతో ఆరాధించినా దేవతలు అనుగ్రహిస్తారు.

అందులోనూ కరుణామయు లైన రాధాకృష్ణుల విషయంలో ప్రశ్నే లేదు. అయితే సౌలభ్యం కోసం బృందావన ధామంలో రాధాకృష్ణులను చిన్న వయసు కలవారిగానే భావిస్తారు. నిజానికి గోపికా వస్త్రాపహారణం నాటికి కృష్ణుడు ఏడు సంవత్సరముల వయసు వాడు. రాధాదేవి కూడా అంతే. చిన్నవయసులో ఉన్న మూర్తులుగా ధ్యానంలో భావిస్తే అప్పుడు నీవు చెప్పిన చాపల్యము వల్ల కలిగే కామేచ్ఛ ఉదయించదు. మరొక్క అంశం కూడా గమనించాలి. బృందావనం లోని గోపిలకంతా కృష్ణుని ప్రియునిగా కోరుకోలేదు. వారిలో కొందరు యశోదవలె మాతృత్వపు భావన భావించినవారూ ఉన్నారు. ప్రేమభావన, కామోత్కంఠ, శృంగారేచ్ఛ మధురభక్తి మార్గంలో సర్వోన్నతమయినవి. దానితో సమానము కాకున్నా వత్సల భావమొక్కటి ముఖ్యమయినది. ఈనాడు బృందావనంలో కొందరు అటువంటి సాధన చేస్తున్నారు. వారు ఇప్పటికీ కృష్ణుని చిన్న పిల్లవానిగానే భావిస్తారు. తమ యింట్లో తిరుగుతున్నట్లు దర్శిస్తారు, ఆడిస్తారు. జోలపాటలు పాడి నిద్రపుచ్చుతారు. లోకం దృష్టిలో అది వారి భ్రాంతి కావచ్చు, ఊహలు

కావచ్చు. కానికి వారికి మాత్రము అది సత్యమే. వారి దృష్టిలో కృష్ణుడు అమాయకుడు, పిల్లవాడు. రాత్రిపూట చీకటిని చూచి దడుచుకుంటాడు. తమని కావలించుకుని రాత్రిపూట పక్కలో పడుకుంటాడు. ఈ సాధన చేసే గోపికలు అమాయకులు. ఆ ప్రేమ ఆ విశ్వాసం ఆ అమాయకత్వం, వారిని కృష్ణునికి సన్నిహితులను చేశాయి. నేను క్రిందటిసారి బృందావనం వెళ్ళినపుడు ఒక ఇంటిలో చిత్రమైన సంఘటన జరిగింది. ఒక గృహిణి గోపిక వత్సలభావ సాధకురాలు. వారియింటిలో కృష్ణుడు పిల్లవానిగా తిరుగుతుంటాడు. ఆమె అన్నం పెడితే తింటాడు. ఆమె జోలపాడితే పడుకుంటాడు. ఆమె కథలు చెపితే వింటాడు. ఇలా జరుగుతూండగా ఒక రోజు పక్కింటి ఆవిడ ఆమెకు ఏవో ఆసక్తికరమైన కబర్లు చెపుతున్నది. పక్కింటి గోడదగ్గర వారు అటు ఇటు నుంచుని మాట్లాడుకుంటున్నారు. ఇంతలో బాలకృష్ణుడు ఇంట్లో నుంచి అరిచాడు. "అమ్మా ! పిల్లి వచ్చి పాలు త్రాగుతున్నది. నాకు భయంగా ఉంది రా !" అన్నాడు. ఆమె మాటలు ఆపి ఇంటిలోకి గబగబా వెళ్ళి పిల్లిని తోలి పాలు జాగ్రత్త చేసి "మళ్ళీ వచ్చి పక్కావిడతో సంభాషణలో పడింది. కాసేపయిన తరువాత గోపాలుడు మళ్ళీ పిల్లి వచ్చింది భయంగా ఉంది రా!" అని పిలిచాడు. ఆమె మళ్ళీ వచ్చి పిల్లిని అవతలకు తోలి తలుపు వేసింది. మళ్ళీ వచ్చి కబుర్లలో పడింది. ముచ్చటగా మూడవసారి గోవిందుడు "అమ్మా ! గండుపిల్లి పెద్దది వచ్చింది. తలుపు తోసుకుని వచ్చింది. నాకు చాలా భయంగా ఉందిరా" అన్నాడు. పక్కింటి ఆవిడ చెబుతున్న ఆసక్తికరమైన మాటలు విడిచిపెట్టి రావడానికి ఆమెకు ఇష్టము లేకపోయింది. విసుగుతో లోపలికి వచ్చి "ఏమిరా ! పిల్లిని చూచి అంత భయపడతావు ! చక్ర, గదా, కౌమోదకీధారివి రాక్షస సంహారము చేసిన వీరాధివీరుడవు, పిల్లిని చూచి భయపడి ఇన్నిసార్లు నన్ను పిలుస్తావా !" అని కేకలు వేసింది. ఆమెను చూచి బాలగోపాలుడు ఒక్కసారి నవ్వాడు. ఆయన బాలుని ఆకృతి మారిపోయి కళ్ళు మిరుమిట్లు గొలిపే అసురాంతకుని మూర్తి వచ్చింది. "భక్తులారా !ఇన్నాళ్ళు అమాయకత్వంతో నన్ను బాలునిగ భావించి ఆరాధించావు గనుక యశోదమ్మ యింట్లో తిరిగినట్లుగా నీ యింట్లోనూ తిరిగాను. ఎప్పుడయితే నీవు నన్ను రాక్షస సంహారి అయిన చక్రధరునిగా భావించావో పిల్లవానిగా నీ యింట్లో నన్ను

పెంచుకునే అర్హతను కోల్పోయినావు" అని అదృశ్యుడయినాడు. ఆమెకు తన తప్పు తెలిసి వచ్చింది. కానీ ప్రయోజనం లేదు.

యువకుడు: స్వామీ, ఆమెకు మళ్ళీ కృష్ణానుగ్రహము కలుగుతుందా ?

శుకుడు : మళ్ళీ రావలసిన యోగ్యత వచ్చిననాడు వస్తాడు. చక్రధరునిగా భావించి తపస్సు చేస్తే ఆ మార్గంలోను సాక్షాత్కరిస్తాడు. అయితే అది ప్రేమ మార్గం కాదు కనుక ఉపవాసములు, జపములు, తపములు చేయాలి. సాధనలలో ఉండే వైవిధ్యం అటువంటిది.

ఎవరి మార్గం వారిది. ఒకటి గొప్పది, సర్వోత్కృష్టమైనది అని చెప్పవచ్చు కాని, అందరూ దానినే అనుసరించలేకపోవచ్చు. ఆ మధ్య ఒక చమత్కారమైన సంఘటన జరిగింది. ద్వారకలోని ఒక కృష్ణభక్తుడు, కృష్ణుని కంసవధాది కార్యక్రమములు చూసి, ఒక వీరమూర్తిగా లోకేశ్వరునిగా ఆయనను ఆరాధిస్తూ జపతపస్సాధన చేస్తున్నాడు. మరొక బృందావన గోపకుడు కృష్ణుని వాత్సల్యభావనతో సాధన చేసినవాడు. ఇద్దరూ యాదృచ్ఛికంగా ఒక ప్రయాణంలో కలిశారు. వారిద్దరూ కలిసిపోతూ ఉండగా ఒక గ్రామం చేరుకోవడానికి కొంతదూరం ఉండగానే చీకటి పడింది. అడవి ప్రదేశం, క్రూరమృగాలుండే చోటు. అక్కడ పులులు తిరుగుతున్నవని ప్రతీతి. బృందావన గోపకుడు, ద్వారకాభక్తునితో "అయ్యా రాత్రి వచ్చింది చీకటిపడింది. ఈ రాత్రి అడవిలో ప్రయాణం చేయలేము. పులులు తిరిగే ప్రదేశమిది. జాగ్రత్త కోసం చెట్టు ఎక్కి కూర్చుందాము. తెల్లవారిన తరువాత ప్రయాణం చేయవచ్చు" అన్నాడు. ద్వారకావాసి నాకేం భయం లేదు. నీవు కావాలంటే చెట్టు ఎక్కు అన్నాడు. గోపకుడు చెట్టి ఎక్కి నిద్రపోకుండా ఒక కొమ్మ మీదకూర్చున్నాడు. క్రింద ఉన్న వ్యక్తి తాను కూర్చున్నదానికి కొంచెం దూరంగా ఉండేటట్లుగా ఒక పుల్లతో పెద్దగిరి గీసి, గిరి మధ్య చెట్టు కింద కూర్చున్నాడు. అర్ధరాత్రి పులి వచ్చింది. చెట్టు కింద ఉన్న మనిషిని చూసింది. కొట్టి చంపి తినాలన్న ఆశతో పైకి దూకపోయింది. ఆ గిరిదాకా వచ్చి ఎవరో అడ్డగిస్తున్నట్లు ఆగిపోయింది. ఎన్నిసార్లు ప్రయత్నించినా ఆగిరిదాటి రాలేక పోతున్నది. చాలాసేపు ప్రయత్నించి విసుగో భయమో ఏదో కల్గి అది వెళ్ళిపోయింది.

ఇదంతా పైనుంచి చూస్తున్నాడు చెట్టుమీద ఉన్న భక్తుడు. చెట్టుకింద ఉన్న భక్తుడు చక్రధరుడు అయిన శ్రీకృష్ణుడు తనను రక్షించాలని ప్రార్థిస్తూ కృష్ణమంత్ర జపం చేస్తున్నాడు. వాసుదేవుడు సుదర్శన చక్రాన్ని ధరించి ఆ గిరి చుట్టూ తిరుగుతూ కాపలా ఉండి పులిని రానీయకుండా ఆపి భక్తుని రక్షించాడు. తెల్లవారిన తరువాత కొమ్మ మీద కూర్చుని ఉన్న గోపకుడు కిందకు వచ్చాడు. "క్రూరుడా ! ఎంత పని చేశావు ? సుకుమారుడు, సుందరుడు అయిన నా కృష్ణుని రాత్రంతా చలిలో నీ చుట్టూ కాపలా పెట్టుకుంటావా ? ఆ మాత్రం కృష్ణుని పిలవడం నాకు చేతకాదనుకుంటున్నావా ? చలిలో రాత్రంతా ఆ కోమలాంగుడు ఎంత బాధపడ్డాడో కదా ? నా వలె చెట్టు ఎక్కి కూర్చుంటే ఆయనకు ఆ శ్రమ తప్పేది కదా ? ఇంతలోనే నీ గౌరవానికి భంగమయ్యేదా ?"

ఇక్కడ నీవు గమనించవలసినది ఇద్దరి ఉపాసనా మార్గంలో ఉన్న భేదాన్ని బృందావన ధామంలో ప్రేమకు తప్ప మరొక భావానికి స్థానం లేదు. వత్సల భావం కావచ్చు, ప్రియభావం కావచ్చు, సఖీ భావం కావచ్చు, ఏదో ఒక ఇటువంటి మార్గాన్నే ఎన్నుకోవాలి. రాజభక్తి, పితృభక్తి, వైరభక్తి మొదలైన ఇతర మార్గాలకు ఇక్కడ స్థానం లేదు కనుక నీ కిష్టమయిన మార్గాన్ని ఎన్నుకుని సాధన చేయవచ్చు.

యువకుడు: మీ మాటలు విన్న తరువాత అవే మంత్రములుగా నాకు భాసిస్తున్నవి.

మీ రదుగు పెట్టిన చోటే పుణ్యక్షేత్రం. మీ పాద ప్రక్షాళిత జలములే పవిత్ర తీర్థములు. మీరే నాకు గురువులు. నాకు రాధాదేవి దివ్యానుగ్రహము కలిగే విధంగా ఆశీర్వదించండి. గురువుల అనుగ్రహం లేక ఏ వ్యక్తి సిద్ధిని సాధించలేడన్నది నా విశ్వాసం. ఆదికాలం నుండి ఈనాటి వరకు మహనీయులైన ఋషుల ఉపదేశం వల్ల, అనుగ్రహం వల్ల మాత్రమే సాధకులు దేవతానుగ్రహాలను పొందారు. మీరు కృపతో నన్ను శిష్యునిగా స్వీకరించి న న్ననుగ్రహించండి.

శుకుడు : తరుణుడా ! నీజీవితంలో పరిణామం కలిగే తరుణం వచ్చింది.

ఇంతసేపూ నీలోని ఆసక్తిని నీ జీవలక్షణాన్ని గమనించి యోగ్యుడవు కనుకనే నీ వడిగిన వాటన్నింటికీ సమాధానములు చెప్పాను. నీకు నా ఆశీస్సులు ఎప్పుడూ ఉంటాయి. నీ జన్మాంతర సంస్కారాన్ని బట్టి నీకు గురువు కావలసిన వారు వేరే ఉన్నారు. ఈ రాత్రికి ఉపవసించి భూశయనం చేయి. స్వప్న భూమికలో నీకొక గోపిక దర్శన మిచ్చి రాధామంత్రాన్ని ఉపదేశిస్తుంది. అది జపించడం మొదలు పెట్టు. ఇన్నాళ్ళుగా నీవీ ఆశ్రమంలో ఉన్నావు. గర్గాచార్యుల వారు వచ్చిన తరువాత జరిగింది వారికి విన్నవించు. వారి అనుమతితో బృందావన ధామం వెళ్ళి అక్కడ సాధన చేయి. రాసేశ్వరి అయిన బృందావన నాయిక నిన్ను అనుగ్రహించును గాక.

యువకుడు: తమ ఆజ్ఞప్రకారం చేస్తాను అని సాష్టాంగ దండ ప్రణామం చేశాడు. ఆశీర్వదించి, శుకమహర్షి బృందావనానికి కదిలి వెళ్ళాడు.

యువకుడు చేతులు జోడించి ఇలా అంటున్నాడు.

**రాధన్ పిల్చెద రాధనే తలచెదన్ రాధన్ సదా కొల్చెదన్**
**రాధా రాధ అటంచు వెంటబడి ఆరాటమ్ముతో నిల్చెదన్**
**రాధన్ గుండెలలోన నిల్పుకొని సర్వస్వమ్ము అర్పించెదన్**
**రాధారాధనలోన జీవితము సార్థక్యమ్ము పొందించెదన్.**

బృందావనంలోను, సిద్ధాశ్రమంలో అనిరుద్ధుడు నెలకొల్పిన కృష్ణభూమికలోను, కైలాసపర్వత ప్రాంత రాధాగుహాప్రదేశంలోనూ శుకుడిప్పుడు కూడా సంచరిస్తూనే ఉన్నాడు.

# 14. వసిష్ఠుడు



విష్ణునాభికమల సంజాతుడైన బ్రహ్మదేవుడు సృష్టి చేయటం కోసం పెంపొందించటం కోసం తనతో సమానులైన ప్రజాపతులను సృష్టించాడు. 1) భృగువు, 2) పులస్త్యుడు 3) పులహుడు 4) క్రతువు 5) అంగిరసుడు 6) మరీచి 7) దక్షుడు 8) అత్రి 9) వసిష్ఠుడు. వీరికి నవబ్రహ్మలని పేరు. వీరిలో వసిష్ఠుడు దక్షప్రజాపతి పుత్రికయైన ఊర్జ అనే కన్యను పెండ్లాడి విరజుడు మొదలైన ఏడుగురు కుమారులకు జన్మనిచ్చాడు. ఈ జన్మలో వసిష్ఠుడు కర్దమ ప్రజాపతికి దేవహూతి యందు పుట్టిన అరుంధతిని వివాహం చేసుకొని ఆమె యందు శక్తి మొదలైన నూరుగురు పుత్రులను సంతానంగా పొందాడు. అరుంధతీ వసిష్ఠుల కళ్యాణాన్ని గురించి ఒక కథ ఉంది. ఒక రోజు వసిష్ఠుడు కర్దముని యింటికి వెళ్ళి పూజితుడై తేజస్సౌందర్యాలతో ప్రకాశించే అరుంధతిని చూచి దివ్యదృష్టివల్ల ఆమె తన భార్య కావలసియున్నదని తెలుసుకొని ఒక పరీక్ష చేశాడు. ఒక యిసుక మూట తెచ్చి దీనినెవరైనా వండి పెడతారా అని అడిగాడు. ఎవరూ ముందుకురా లేదు. అరుంధతి అంగీకరించి ఇసుకను బియ్యంగా తపశ్శక్తితో మార్చి వండి పెట్టింది. అప్పుడామె మాహాత్మ్యాన్ని ప్రకటించి కర్దమ ప్రజాపతి అనుమతితో ఆమెను పెండ్లి చేసుకొన్నాడు.

ఒక పర్యాయం వసిష్ఠుడు తన కమండలు వామె చేతిలో ఉంచి తిరిగి తాను వచ్చిందాకా అలానే రక్షించమని చెప్పివెళ్ళాడు. సంవత్సరాలు గడుస్తున్నా తిరిగిరాలేదు. ఆమె దీక్షకు దేవతలు దిగ్భ్రాంతులైనారు. లోకాలన్నీ కల్లోలితమైనవి. అప్పుడు బ్రహ్మాదులు వసిష్ఠుని దగ్గరకు వెళ్ళి తీసుకువచ్చారు. ఆ మహర్షి ఆమె చేతినుండి కమండలువు గ్రహించాడు. ఆమె మహాశక్తికి మెచ్చి సురలు విరులు వాన కురిపించారు.

సుమతి అనే పతివ్రత భర్తను మాండవ్యమహర్షి సూర్యోదయం జరిగే

సమయానికి మరణిస్తాడని శపిస్తే సూర్యోదయం కాకుండా ఆ పతివ్రత ఆపింది. లోకములు అంధకారములో విలవిలలాడుతుంటే అరుంధతి వచ్చి ఆమెకు నచ్చజెప్పి సూర్యోదయం జరిపించి మరణించిన సుమతి భర్తనుతన తపశ్శక్తితో బ్రతికించింది. ఈ విధంగా మహాపతివ్రతయైన ఆమె ఆకాశంలో నక్షత్రమై ప్రకాశిస్తున్నది. కొత్త దంపతులకు శుభం కోసం ఆ నక్షత్రాన్ని చూపిస్తుంటారు.

ఇతడు సత్వగుణము మూర్తీభవించిన మహామనీషి. ఋగ్వేదంలో ఇతడు దర్శించిన మంత్రము లెన్నో ఉన్నవి. వానిలో ఇంద్ర గాయత్రి పేర్కొనదగినది.

**శ్లో॥ ఋగ్వేద ప్రోక్త మంత్రేషు గాయత్ర్యేక పదోత్తమా**
**ఐంద్రీదృష్టా వసిష్ఠేన మహతా తపసాపురా (గణపతిముని)**

ద్విజులకు ఉపనయనం జరిగినప్పుడు బ్రహ్మోపదేశం చేసిన తరువాత గాయత్రీ మంత్రాన్ని ఉపదేశిస్తారు. ఆది కాలంలో వసిష్ఠుడు దర్శించిన ఇంద్రగాయత్రిని ఉపదేశించేవారట! అనంతరకాలంలో విశ్వామిత్రునకు బ్రహ్మర్షిత్వాన్ని ప్రసాదించిన సౌరగాయత్రి ఆ స్థానాన్ని ఆక్రమించింది.

నిమి గొప్పరాజు. ఆయన పురోహితుడు వసిష్ఠుడు. మహారాజు యజ్ఞప్రియుడు. ఎన్నో యజ్ఞాలు చేసినవాడు. ఒకసారి పెద్ద యజ్ఞమొకటి తలపెట్టాడు. వసిష్ఠుల వారిని ఆహ్వానించి తన సంకల్పం విన్నవించాడు. ఇంద్రుడు ప్రార్థిస్తే యజ్ఞం చేయించటానికి వెళుతున్నానని అది పూర్తయిన తర్వాత వచ్చి చేయిస్తానని చెప్పి వెళ్ళిపోయినాడు. ఇంద్రునిది చాలాకాలం పట్టే యజ్ఞం. అన్నాళ్ళు ఆగటం ఇష్టం లేక నిమి గౌతమమహర్షిని అర్థించి ఆయన ఆధ్వర్యంలో యజ్ఞం చేశాడు. ఇంద్రుని యజ్ఞం పూర్తయిన పిదప వసిష్ఠుడు వచ్చి తాను లేకుండా యజ్ఞం జరిపిన విషయం తెలుసుకొని కోపించి నిమికి మరణశాపం యిచ్చాడు. నిమి కూడా సామాన్యుడు కాడు. తప్పేమీ లేకుండా నన్ను శపించావు గనుక నీవు కూడా నావలెనే మరణింతువు గాక అని శపించాడు. ఇద్దరూ మరణించారు. నిమి యజ్ఞములచేత సంతుష్టులైన దేవతలు అతని జీవుని పిలిచి నిన్ను తిరిగి బ్రతికించమంటావా? అని అడిగారు. అతడు మళ్ళీ మానవశరీరం అక్కరలేదని సర్వజీవుల కన్నుల

రెప్పపాటుగా ఉండే వరమిమ్మని దానివల్ల లోకాన్ని చూస్తుంటానని కోరాడు. దేవతలు సరేనన్నారు. దానితో రెప్పపాటుకు నిమిషమని పేరు వచ్చింది.

ఇక వసిష్ఠుడు సూక్ష్మశరీరంతో బ్రహ్మలోకానికి వెళ్ళి బ్రహ్మకు జరిగింది చెప్పుకొని తనకు తిరిగి శరీరం ప్రసాదించమని ప్రార్థించాడు. ఆయన అనుగ్రహించి వరుణ పుత్రునిగా పుట్టి శరీరం పొందమని వరమిచ్చాడు. భూలోకంలో హిమాలయాలలో త్రివిష్టపమున్నది (ఇప్పుడు టిబెట్). త్రివిష్టపమంటే స్వర్గం. దివ్యలోకాలలో ఉండే స్థలాల, వ్యక్తుల, పేర్లు భూమిమీద కూడా పెట్టబడినవి. దేవతలు భూమి మీద దిగిన ప్రదేశాలలో తమ అనుబంధాల గుర్తుగా ఆ పేర్లు పెట్టుకొన్నారు.

త్రివిష్టపంలో ఒక రోజు వరుణునకు ఊర్వశిమీద కోరిక కలిగి వార్త పంపాడు. ఆమె అలకరించుకొని బయలుదేరింది. త్రోవలో దేవతలలో మిత్రుడనే వ్యక్తి ఆ సౌందర్యవతిని చూచి తన కోరిక తీర్చమని మొహమోటపెట్టాడు. అంతటి గొప్పవానిని కాదనలేక అంగీకరించింది. సంగమానంతరం అతని తేజస్సును ఒక కుంభంలో ఉంచింది. అనంతరం వరుణుని దగ్గరకు వెళ్ళి అతనిని సంతోషపెట్టి అతని తేజస్సును కూడా అదే కుంభంలో ఉంచింది. ఆ కుంభంలో నుండి వరుణపుత్రుడుగా వసిష్ఠుడు, మిత్రపుత్రుడుగా అగస్త్యుడు ప్రభవించారు. మిత్రావరుణులు జంట దేవతలు. కనుక అగస్త్య వసిష్ఠులను మిత్రావరుణాంశ సంభవులన్నారు.

వసిష్ఠుడు సిద్ధాశ్రమంలో తపస్సు చేసి బ్రహ్మర్షిగా పెండ్లి చేసుకొని మహనీయునిగా పేరు చెందాడు. అతడు మానససరస్సు ఎక్కడున్నదో కనుక్కోటానికి సరయూనదిని ఆశ్రయించి, ఆ నదివెంట ప్రయాణం చేసి అది పుట్టిన చోటుకు చేరుకున్నాడు. ఆ ప్రదేశమే మానస సరస్సు. అక్కడ తపస్సు చేసి మహనీయత సాధించాడు. ఒకసారి అతడు సౌదాసుడనే రాజు మందిరానికి ఆరాజు పితృకార్యానికి ఆహ్వానించబడి వెళ్ళాడు. అతనికి పౌష్యుడనే మరోపేరు కూడా ఉంది. మహారాజు ఆయనకు స్వాగతం చెప్పి అర్ఘ్య పాద్యాదులతో పూజించాడు.

భోజన సమయమైంది. పాకశాలలో రాజుగారి చేత చంపబడిన ఒక

రాక్షసుని తమ్ముడు వంటవానిగా మాయారూపంతో చేరి రాజుకు అపకారం చేయటం కోసం వేచి ఉన్నాడు. అతడు శ్మశానానికి వెళ్ళి ఒక నరశవ మాంసం తెచ్చి వండి ఉంచాడు. వసిష్ఠులవారు భోజనానికి కూర్చోగానే రాజు భక్తితో వంటవాడు తెచ్చిన పదార్థాలను స్వయంగా వడ్డించాడు. ఆ యుగాలలో మాంసభక్షణం ఆచారంగానే ఉండడం వల్ల బ్రాహ్మణులు కూడా తినేవారు. కానీ నరమాంసం తినరు గదా! వసిష్ఠుడు మహాత్ముడు గనుక అది నరమాంసంతో చేసిన వంటకమని గ్రహించి కోపించి "నరమాంసం పెట్టావు గనుక నీవు మనుజాశనుడవయ్యెదవు గాక!" అని శపించాడు. సౌష్యునకు బాధకలిగింది. తాను నేరం కావాలని చేయలేదు. తెలియక చేసిన తప్పుకు ఇలా శపిస్తాడా వసిష్ఠుడు - అని తాను కూడా శపించటానికి ఉద్యుక్తుడై చేతిలోనికి జలం తీసుకున్నాడు. అప్పుడా రాజు భార్య దమయంతి భర్తను బ్రతిమలాడింది. ప్రభూ! గురువులు తప్పు చేసినా శిష్యులు కోపించరాదు. మహర్షి రాజగురువు. వారిని శపించకూడదు - అని నివారించింది. అంతట సౌష్య మహారాజు ఆశాపజలాన్ని భూమి మీద వేస్తే భూమికి అపకారం జరుగుతుందని సందేహించి తన కాళ్ళ మీద చల్లుకొన్నాడు. ఆ పాదములు నల్లబడిపోయినవి. అందువల్ల అతనికి కల్మాషపాదుడన్న పేరు వచ్చింది.

ఋషిశాపం వల్ల మనస్సు ప్రభావితమై మనుష్యులను చంపి తినటం మొదలు పెట్టాడు. ప్రజలు ఊళ్ళు వదిలి పెట్టిపోయే పరిస్థితి వచ్చింది. ఒకరోజు అడవికి వెళ్ళి ఆకలితో ఆగలేక ఒక ఆశ్రమంలో ఉన్న బ్రాహ్మణదంపతులలో భర్తను చంపి తిన్నాడు. ఆ భార్య సహగమనం చేస్తూ నీవు రాక్షసునివలె ప్రవర్తించావు. కనుక రాక్షసుడ వగుదువుగాక ! అని శపించింది. వసిష్ఠశాపం వల్ల గుణం మాత్రమే మారిన రాజు బ్రాహ్మణి శాపం వల్ల ఆకారం కూడా మారి వికృతమైన రాక్షసాకారం వచ్చింది.

వసిష్ఠుని శత్రువుగా భావించే విశ్వామిత్రుడు ఈ విషయం తెలుసుకొని సౌష్యుని దగ్గరకు వచ్చి పరామర్శించాడు. అన్యాయంగా శపించిన వసిష్ఠుని మీద పగతీర్చుకోమని ప్రేరేపించాడు. దానికి ప్రోద్బలంగా తన మిత్రుడైన ఒక పిశాచాన్ని ఆవహింప చేశాడు. అసలే రాక్షసుడు ఇప్పుడు పిశాచావిష్టుడు.

"వసిష్ఠుడు మహా సిద్ధుడు. ఆయన జోలికి పోయి చేయగలిగిందేమీలేదు. ఆయనకు బాధ కలిగించాలంటే ఆయన నూరుగురు కొడుకులను చంపు" అని విశ్వామిత్రుడు ప్రబోధించాడు. దానితో పౌష్యుడు వసిష్ఠ పుత్రులను తొంభై తొమ్మిది మందిని చంపేశాడు. అందరిలోకి పెద్దవాడైన శక్తిని కూడా చంపుతుంటే అతని భార్య అదృశ్యంతో చూచి పరుగెత్తుకొని వెళ్ళి మామగారైన వసిష్ఠునితో చెప్పింది. ఆయన వచ్చేసరికే శక్తి చంపబడ్డాడు. వెంటనే మహర్షి కమండలు జలం మంత్రించి రాజుపై చల్లాడు. అతని రాక్షసత్వము, పిశాచత్వముపోయి పూర్వపు మనిషిగా మారాడు. వసిష్ఠునికి నమస్కరించి అతడు వెళ్ళిపోయినాడు. జితక్రోధుడైన బ్రహ్మర్షి అతనిని ఏమీ అనలేదు. కానీ పుత్రశోకంతో నదిలో దూకి మరణించాలని ప్రయత్నించాడు. కానీ ఆ నది బ్రహ్మర్షిని ముంచడం ఇష్టం లేక పాయలుగా చీలిపోయింది. దానికి శతద్రు అని పేరు వచ్చింది. (శక్తిని గూర్చి మరొక చోట వేరే విధంగా ఉంది. పౌష్యమహారాజు రథం మీద వస్తుంటే త్రోవలో ఎదురుగా శక్తిమహర్షి వస్తున్నాడు. రాజరథం వస్తుంటే ప్రక్కకు తొలగలేదు. హెచ్చరించాడు రాజు. వినలేదు ముని. రాజకు కోపం వచ్చి శక్తిని కొరడాతో కొట్టాడు. మహర్షికి కోపం వచ్చి రాక్షసుని వలె ప్రవర్తించావు గనుక రాక్షసుడివి కమ్మని శపించాడు.) శక్తిమరణం నాటికే గర్భవతిగా ఉన్న అదృశ్యంతికి పుట్టిన కుమారుడు పరాశరుడు పెరిగి పెద్దవాడై తపస్సు చేసి దివ్యశక్తులు సంపాదించి తండ్రిని రాక్షసుడు చంపాడన్న పగతో రాక్షసయాగం చేసి కొన్ని లక్షల మందిని హోమకుండానికి ఆహుతి చేశాడు. తరువాత పెద్దలు జోక్యం చేసుకొని ఆపించారు. ఆ పరాశరుని కుమారుడే వ్యాసుడు. వేద విభాగం చేసి పురాణములు రచించిన మహాపురుషుడు.

ఈ విధంగా వసిష్ఠుని వంశం వర్ధిల్లింది. త్రేతాయుగంలో దిలీపునకు, దశరథునకు సంతానం కలిగేలా చేసిన ఈ మహాత్ముని పాత్ర తరువాత అంతగా కనపడదు. కాళికాపురాణంలో మాత్రం ద్వాపరయుగంలో నరకుని కథలో వసిష్ఠుని పాత్ర ప్రధానంగా కనిపిస్తున్నది. ఈ సందర్భంగా నరకాసురుని కథ కొంత విపులంగా తెలుసుకోవటం అవసరమని భావించి – అతడు చేసిన సాధనల వల్ల వచ్చిన శక్తులు వాటిని దుర్వినియోగం చేస్తే వచ్చే

ఫలితాలు – యజ్ఞములవల్ల వచ్చే అద్భుతఫలితాలు – వీటిని తెలియజేయటం కోసం అతని కథ కూడా ఇవ్వబడుతున్నది.

**నరకుని కథ**

కామాఖ్యకాళిని ఉపాసించి వివిధ శక్తులు సాధించి వానిని దుర్వినియోగం చేసి నాశనమయిన వారిలో నరకుడు ప్రధానుడు. ద్వాపరయుగంలోని నరకుని కంటె ముందు ఆ పేరుగల రాక్షసుడు మరొకడు ఉన్నట్లు పురాణములలో కన్పిస్తుంది. రామాయణంలోని కిష్కింధకాండలో సుగ్రీవుడు తన మామ అయిన సుషేణునితో సముద్రంలోని ప్రాగ్జ్యోతిషపురములోని నరకాసురుని గుహలలో సీతాదేవిని రావణుడు ఉంచాడేమో వెదకవలసినదిగా సూచించాడు. అక్కడ 'దుష్టాత్మా నరకోనామ దానవః' అని చెప్పబడింది. యుద్ధకాండలో రావణాసురు డొకచోట ఇలా అన్నాడు.

**శ్లో॥ శంబరో దేవరాజేన నరకో విష్ణునాయథా**
**తథాద్య శాయితారామో మయాయుద్ధినిపాతితః**

దేవరాజు చేత శంబరుడు, విష్ణువు చేత నరకుడు చంపబడినట్లుగా ఈనాడు యుద్ధములో రాముడు నాచేత చంపబడి భూమిపై పడియున్నాడు". ఇక్కడ నరకుడు 'దితి' పుత్రుడు. పదివేల సంవత్సరములు తపస్సు చేసి గొప్పవరములు పొందినవాడు. వాడు తపస్సిద్ధుడైనప్పటికి, వానిని తాను చంపుతానని విష్ణువు ఇంద్రునికి వాగ్దానము చేసి,ఆ విధముగానే సంహరించినాడు. దీనిని బట్టి ఈ నరకాసురుడు పూర్వ యుగములలో దితి పుత్రుడయిన రాక్షసుడు. కృష్ణుడు చంపిన నరకాసురుని కథ ప్రస్తుత పరిశీలనములోనిది.

విష్ణువు వరాహావతారములో ఉన్నపుడు పృథ్వీ దేవి ఆయనను మోహించి తన కామవాంఛ తీర్చమని కోరింది. ఆ సమయానికి ఆమె రజస్వల అయి ఉన్నది. ఆమె కోర్కెను కాదనలేని ఆది వరాహమూర్తి ఆమెతో క్రీడించాడు. రజస్వలా సంగమ ఫలితంగా ఆమె గర్భములోని వాడు రాక్షసుడయినాడు. ఆ రాక్షసుడు ఉదయిస్తే లోకవినాశకుడవుతాడని,

వానిని జయించటం, చంపటం సులభం కాదని భావించిన దేవతలు ఆమె ప్రసవించకుండా తమ దివ్యశక్తితో ఆపివేశారు. ప్రసవం ఆగిపోయింది కాని నెప్పులు తగ్గలేదు. ఆ బాధ భరించలేక ఆమె విష్ణువును ప్రార్థించింది. విష్ణుదేవుడు సాక్షాత్కరించి లోకవినాశన భయంతో దేవతలు ప్రసవాన్ని ఆపివేశారని ఆమెకు 28వ మహాయుగంలోని త్రేతాయుగంలో కుమారుడు పుడతాడని చెప్పి తన శంఖంతో ఆవిడ గర్భాన్ని స్పృశించాడు. ఆమె నొప్పులు తగ్గినవి.

తరువాత కొంతకాలానికి త్రేతాయుగంలో సంతానం లేని దశరథుడు పుత్రకామేష్టి చేసి నలుగురు కుమారులను పొందాడు. వారే రామ, లక్ష్మణ, భరత, శత్రుఘ్నులు. అదే సమయంలో విదేహరాజుగా ఉన్న జనకునికి కూడా సంతానం లేక దశరథుడు చేసిన యజ్ఞాన్ని గురించి విని తన ఆస్థాన పురోహితుడయిన శతానందుని తన చేత కూడా యజ్ఞం చేయించి పిల్లలు పుట్టే లాగా చేయవలసినదని ప్రార్థించాడు. శతానందుడు అంగీకరించి తన తండ్రి అయిన గౌతముని సహాయంతో ఒక ప్రత్యేకమయిన యాగాన్ని చేయించాడు. శతానందుడు జనకునితో "మహారాజా! వసిష్ఠమహర్షి దశరథమహారాజుతో చేయించిన యజ్ఞంలో యజ్ఞపురుషుడు హోమకుండంలో సాక్షాత్కరించి పాయసాన్ని ఇచ్చాడు. దశరథుడు ఆ పాయసాన్ని తన భార్యల కీయగా వారు గర్భవతులై సంతానాన్ని కన్నారు. మేము చేస్తున్న యజ్ఞం ఆ యజ్ఞం కంటె కూడా అధికతర శక్తి కలిగినది. మహా తపస్సంపన్నుడైన మా తండ్రి గౌతమ మహర్షి అనుమతితో ఈ యజ్ఞశాలలో నేను అపూర్వమును సృష్టిస్తాను. యజ్ఞపురుషుడు పాయసాన్ని తెచ్చి ఇవ్వటము దానిని మీరు మీ భార్యకు ఇచ్చి ఆమె గర్భవతియై తొమ్మిది నెలల తరువాత సంతానాన్ని కనటము జరుగనక్కర లేదు. ఈ యజ్ఞభూమి నా మంత్రశక్తి చేత పవిత్రీ కృతమైనది. మీరు బంగారు నాగలి తీసుకొని భూదేవికి నమస్కరించి ఈ నేలను దున్నండి. మీ నాగలి చాలులో నుండి పిల్లలు పుట్టుకు వస్తారు. ఈ అద్భుతమైన అనుభూతిని మీరే స్వయముగా చూచి పొందండి" అన్నాడు. జనకమహారాజుకు ఆశ్చర్యం కల్గింది. అందరూ చూస్తూ ఉండగా ఆయన నాగలితో భూమిని దున్నాడు. నాగలి చాలు చీల్చుకొని భూమి పగిలి దానిలో

నుండి ఇద్దరు మగపిల్లలు ఒక ఆడపిల్ల పైకి వచ్చారు. భూమిలో నుండి ఒక దివ్యవాణి ఈ విధముగా వినిపించింది. "జనకమహారాజా ! నేను భూదేవిని. ఈ యజ్ఞమునకు నేను సంతోషించి నిన్ను అనుగ్రహిస్తున్నాను. దేవర్షి అయిన నారదుడు, యజ్ఞము చేయించిన శతానంద గౌతములు ఇంకా యెందరో ఋషులు ఇక్కడ ఉన్నారు. వీరి సన్నిధిలో నేను చెప్పింది జాగ్రత్తగా విను. నీ వంశం నిలవడం కోసం ఇద్దరు మగబిడ్డలను ప్రసాదించాను. వారితో పాటు ఒక ఆడపిల్ల కూడ నీకు ఇవ్వబడింది. ఈమె కారణజన్మురాలు. ఈమె కారణంగా లోకకంటకుడయిన రావణుడు సంహరించబడతాడు. రావణవధ జరిగిన తరువాత మరల నీవు ఈ యజ్ఞప్రదేశానికి రావాలి. అప్పుడు మరొక మగబిడ్డ నీకు ఇవ్వబడతాడు. వాడు నా కుమారుడు. వానిని నీవు పెంచి పెద్ద చేయవలెను" భూదేవి యొక్క మాటను జనకుడు శిరసావహించి ఆ విధంగానే చేస్తానని వాగ్దానం చేశాడు.

కాలం గడుస్తున్నది సీతారాముల వివాహం రావణవధ జరిగిన కొంత కాలానికి భూదేవి జనకుని యజ్ఞభూమిలో కుమారుని ప్రసవించింది. జనకుని దగ్గరకు వెళ్ళి పూర్వము అతడు చేసిన వాగ్దానాన్ని గుర్తుచేసి అర్థరాత్రి అతనిని యజ్ఞభూమి దగ్గరకు తీసుకు వచ్చి తన కుమారుని అప్పగించి అతనిని స్వంతబిడ్డవలె పెంచమని కోరింది. జనకుడు అంగీకరించి భూమి మీద నుండి ఆ బిడ్డను ఎత్తుకుంటూ ఆ శిశువు తల క్రింద ఒక నరకపాలముఉండటాన్ని గమనించాడు. నరకపాలముపై దొరికిన వాడు గనుక నరకుడు అని పేరు పెట్టాడు. జనులను తండ్రివలె కాపాడు వాడు జనకుడు. ఈ బిడ్డ కూడా ఆ విధంగానే నరులను కాపాడే వాడు కావాలని నరకుడు అని పేరు పెట్టారని కొందరు భావిస్తున్నారు. ఆ బిడ్డను రాజభవనానికి తీసుకొని వెళ్ళి తన మహారాణికి అప్పగించి, ఇంతకు ముందు యజ్ఞశాలలో మనకు బిడ్డలు లభించినట్లుగానే ఈ పిల్లవాడు గూడ లభించాడని వీడూ తన కుమారుడే కనుక, జాగ్రత్తగా పెంచమని కోరాడు. పురోహితుడయిన శతానందుడు శాస్త్రోక్త సంస్కారములన్నీ ఆ పిల్లవానికి చేయించాడు. జనకుని పిల్లలతో పాటు నరకుడు కూడా పెరిగి పెద్దవాడవుతున్నాడు. తన బిడ్డను తాను జాగ్రత్తగా చూచుకోవాలన్న కోరికతో భూదేవి కాత్యాయని అన్న పేరుతో

మానవాకారాన్ని ధరించి రాజపరివారంలో దాదిగా చేరి నరకునికి సేవచేస్తున్నది. 16 సంవత్సరములు ఈ విధముగా గడిచిన తరువాత జనకుడు తన కుమారుల కంటె నరకుడు ఎక్కువ బలపరాక్రమాలతో ప్రకాశించటాన్ని గమనించి వాడినే రాజును చేయవలసి వస్తుందేమో అని విచారించాడు. ఆయన వ్యాకులపాటును చూచి మహారాణి కారణమడిగితే చెప్పకుండా ఒక పరమరహస్య మున్నది మూడు నెలల తరువాత చెపుతాను, తానొక వాగ్దానము చేతకట్టుబడిఉన్నానని జనకుడు చెప్పాడు. వీరి సంభాషణను విన్న కాత్యాయని ఇక ఎక్కువ కాలం ఇది దాగదన్న సంగతి గ్రహించి ఒక రోజు గౌతముని సన్నిధిలో జనక మహారాజుతో "మహారాజా ! నా మాట మన్నించి నా బిడ్డను పెంచి పెద్దచేశారు. కృతజ్ఞురాలిని. ఇక నా బిడ్డనునేను తీసుకుపోతాను" అన్నది. జనకుడు చాలా సంతోషించి అంగీకరించాడు.

ఆ రోజు రాత్రి కాత్యాయని (భూదేవి) నరకునితో తనతో ఏకాంతంగా గంగానది దగ్గరకు రమ్మని కోరింది. తండ్రియైన మహారాజు అనుమతి లేక రానని తిరస్కరించాడు నరకుడు. అప్పుడామె విషయాన్ని వివరించి రహస్య సత్యాన్ని తెలిపి నీ అసలు తండ్రి విష్ణుమూర్తి అని తెలియజేసింది. ఆశ్చర్యపడిన నరకుడు ఆసక్తితో ఆమెతో గంగానదీ తీరానికి ఏకాంతంగా వెళ్ళాడు. ఆమె ప్రార్థించగా విష్ణుమూర్తి ప్రత్యక్షమై నరకుని ఆశీర్వదించాడు. ముగ్గురూ కలసి గంగానదీ మార్గంకుండా ప్రయాణం చేసి ప్రాగ్జ్యోతిషపురాన్ని చేరుకున్నారు. విష్ణుదేవుడు ప్రాగ్జ్యోతిష పురం రాజధానిగా బ్రహ్మపుత్రానదీ ప్రాంతం మొత్తానికి అతనిని రాజుగా ఏర్పాటు చేశాడు. విదర్భరాజు కూతురైన 'మాయ' అనే కన్యను నరకునికిచ్చి పెండ్లి చేసి సుఖంగా పరిపాలించుకొమ్మని ఆజ్ఞఇచ్చి ఇలా సలహా ఇచ్చాడు. "నాయనా ! నీ తల్లి అయిన భూదేవికి ఇచ్చిన వాగ్దానం వల్ల నీకీ ఉపకారం చేశాను. నీ రాజ్యంలో, నీ పరిపాలనలో అందరినీ ధర్మబద్ధంగా పరిపాలించు. బ్రాహ్మణులతో, మహర్షులతో, దేవతలతో ఎప్పుడూ ఘర్షణపడవద్దు. వారితో పోట్లాటలు తెచ్చుకొనవద్దు. ఈ నీలాచలయోనిపీఠంలో మహాశక్తి అయిన కామాఖ్యాదేవి ప్రకాశిస్తున్నది. ఆమె జగన్మాత. ఆమెను తప్ప ఏ ఇతర దేవతనూ నీవు పూజించరాదు. ఈ మాటలకు భిన్నంగా జరిగితే నీకు ప్రమాదం వస్తుంది. అయినా ఆత్మరక్షణ

కోసం ఒక శక్త్యాయుధాన్ని నీకు అనుగ్రహిస్తున్నాను. ప్రాణాపాయం వచ్చినప్పుడు మాత్రమే దీనిని ఉపయోగించు. ఈ విధంగా చెప్పి విష్ణుమూర్తి చిరునవ్వుతో "భూదేవీ ! నీకు ఇచ్చిన మాట ప్రకారం వీనికి తగిన ఏర్పాట్లు చేశాను. నీకు సంతృప్తి కలిగింది కదా?" అన్నాడు. భూదేవి కృతజ్ఞత తెలిపింది. నరకుని ఆశీర్వదించి ఇద్దరూ అదృశ్యులయినారు.

విష్ణుమూర్తి ఇచ్చిన సూచనల ప్రకారం తన రాజ్యంలో బ్రాహ్మణాదులకు ఉన్నత స్థానాన్ని కల్పించాడు. వేదాధ్యయనములు యజ్ఞములు విష్ణుప్రీతికరమైన పురాణ ప్రవచనములు రాజ్యమంతా జరుగుతున్నవి. దేశమంతా శాంతిగా, సుభిక్షంగా, ధర్మబద్ధంగా సాగుతున్నది.

ఈవిధంగా కొంతకాలం గడిచింది. తండ్రి అయిన విష్ణుదేవుడు చెప్పిన మరొక మాట అతని మనసులో మెదలుతున్నది. కామాఖ్యాదేవిని తప్ప 'ఇతర దేవతలను పూజించవద్దు", 'ఆమెను భక్తితో అర్చించు' అని చెప్పిన అంశాన్ని మనసులో పెట్టుకొని ఆ దేవి గుడికి వెళ్ళి పూజలు చేయటం మొదలుపెట్టాడు. ఆ దేవత యొక్క అనుగ్రహాన్ని పొందటానికి సులభమైన పద్ధతులేమైనా ఉన్నవా? అని గుడి పెద్దలను పిలిపించి విచారించాడు. వారిలో ఒక వృద్ధ పూజారి మహారాజుకు ఇలా మనవి చేశాడు. "మహాప్రభూ ! ఈ దేవత సాధన యందు మీకు అభిరుచి ఉంటే ఏకాంతంగా మీకు తెలియచేస్తాను. ఆ సాధన పద్ధతులన్నీ బహిరంగంగా చెప్పేవి కావు. ఆ మాటలకు ఆసక్తి కల్గిన నరకుడు ఆయనను ఒంటరిగా పిలిపించుకొని మాట్లాడాడు. ఏకాంత ప్రదేశంలో ఆ వృద్ధపూజారి మహారాజుతో ఈ విధంగా విన్నవించాడు. "సార్వభౌమా ! కామాఖ్యాదేవి ఆలయం అత్యంత పురాతనమైనది. ఈ దేవతకు సంబంధించిన పూజావిధానాలు జపహోమ సాధనలు ప్రత్యేకమైనవి. భారతదేశంలోని శక్తిమంతమైన దేవాలయాలకు ఒక్కో దానికి ఒక్కో చరిత్ర ఉన్నది. సాత్విక, రాజస, తామస, ఆలయాలలో వేని పద్ధతులు వానివే. కానీ ఈ దేశములో బ్రాహ్మణ్యము అన్ని దేవాలయాలను సాత్విక పద్ధతిలోనికి మార్చివేసినవి. అందువలన వేదోక్త మార్గంలో దక్షిణాచార పద్ధతి ననుసరించి అన్నిచోట్ల అర్చన విధానాలు వచ్చినవి. దానివలన ప్రజలు శాంతి సుభిక్షాలతో ఉండటం జరుగుతున్నది. ఆ బ్రాహ్మణులలో కోటికొక్కడు కఠోర తపస్సు

చేసి దివ్య శక్తులు సాధించిన వాడుంటాడు. వానిని చూపించి మిగతా వారంతా వట్టి అహంకారముతో దర్పయుతంగా జీవిస్తుంటారు. ఇప్పుడు ద్వాపరయుగము జరుగుతున్నది. వెనుకటి కాలంలో వలె ఉగ్రతపస్సులు చేసేవారు తగ్గిపోయినారు. ఆ మార్గంలో దివ్యశక్తులు సాధించటం సులభం కాదు. రాజస, తామస పద్ధతులలో సాధనచేస్తే వేగంగా సిద్ధశక్తులు సాధించవచ్చు. కానీ వాటిని క్షుద్రములని దురాచారములని పాపహేతువులని వైదికులు త్రోసిపుచ్చుతారు. నరక మహారాజా ! దివ్యశక్తులు సాధించటానికి కావలసిన యోగ్యత మీలో ఉన్నది. మీ తండ్రి అయిన విష్ణుమూర్తి ఈ కామాఖ్య కాళిని అనన్యభక్తితో సేవించమని చెప్పినట్లు నేను విన్నాను. కాని మీరు యజ్ఞములు చేయిస్తున్నారు. యజ్ఞశాలలకు వెళ్ళి అక్కడి దేవతలను, బ్రాహ్మణులను పూజిస్తున్నారు. అంటే మీరు మీ తండ్రిగారు చెప్పిన మాట తప్పినట్లే కదా ! నేను తొందరపడి ఈ మాట అన్నందుకు మన్నించండి. మీ రాజ్యములోని బ్రాహ్మణులలో ఇందరు యజ్ఞములు చేసిన వారుండగా వీరిలో ఒక్కరైన తపస్సంపన్నులయిన శాపాయుధులు ఉన్నారా? ఎక్కడో వీరారణ్యంలో కొండమీది ఆశ్రమంలో ఉన్న వసిష్ఠుడు మహిమాన్వితుడని వారంతా చెపుతుంటారు. అవునో కాదో అది వేరే విషయము. నేనూ బ్రాహ్మణుడనే. గాయత్రీ మంత్రాన్ని చిరకాలం అనుష్ఠానం చేశాను. విశ్వామిత్రుని వలె వేల ఏండ్లు ఈ రోజులలో చేయలేము కదా! విసిగి వేసారుతున్న నాకు ఒక కొలికుడు తటస్థించాడు. అతడిది ఏ కులమో తెలియదు. అతని దగ్గర కొన్ని చిత్రమైన శక్తులున్నాయి. వాని యందు నేను మోజుపడి అతనికి సేవచేశాను. కొన్నాళ్ళకు కనికరము కలిగి "ఏమయ్యా ! నీవు కామాఖ్య గుడి పూజారివి. ఆ దేవత సర్వశక్తి సంపన్నురాలు. ఆమె అనుగ్రహాన్ని పొందితే నా దగ్గర ఉన్న వాటి కంటే అధికతరమైన శక్తులను నీవు పొందవచ్చు అన్నాడు. ఆ మార్గాన్ని చెప్పమని ప్రార్థించాను. అతడు కొన్ని రహస్య సాధన పద్ధతులు నాకు నేర్పాడు. ఆ పద్ధతులలో సాధన చేసి నేను కొంత సాధించగలిగాను. అవి పదిమందిలో చెప్పరానివి. మీరు ఏకాంతముగా నన్ను పిలిచారు కనుక మీ రనుమతిస్తే చెబుతాను. అయితే ఈ వృద్ధుడు అసభ్యములు, అశ్లీలములు అయిన విషయములు పలుకుతున్నా డేమని అనుకోవద్దు. అగ్రహించవద్దు. మీరు శ్రద్ధగా వింటానని అంటే చెప్పటానికి సిద్ధంగా ఉన్నాను" అన్నాడు.

నరకుడు నవ్వుతూ నిన్ను అందుకేనయ్యా ! పిలిపించాను. నిన్ను గురించి కొంత విన్నాను. నీ సాధనల గురించి కూడా కొంత తెలుసు. నీకు స్వేచ్ఛగా చెప్పటానికి అనుమతిస్తున్నాను" అన్నాడు. అప్పుడు మళ్ళీ ఆ వృద్ధుడు ఇలా ప్రారంభించాడు. "రాజాధిరాజా ! నేను ఏమి సాధనలు చేశానన్నది పెద్ద ప్రధానం కాదు. తమ రేమి చేస్తే మహాశక్తులు వస్తవన్నది ప్రధానము. నా సాధనల వల్ల కొంత స్ఫురణ కలిగింది. ఆదియుగములలో ఉన్న ఒక అసురేశ్వరులు మీరు. అప్పుడు కూడా మీ పేరు ఇదే. పదివేల సంవత్సరాలు బ్రహ్మను గూర్చి తపస్సు చేసి ఎన్నో వరములు పొందారు. అయినా మాయావి అయిన విష్ణుమూర్తి చేత సంహరించబడ్డారు. దేవదానవ యుద్ధాలలో ఎప్పుడూ జరుగుతున్నదే ఇది. ఈ జన్మలో భూదేవికి వరాహమూర్తికి మీరు ఉదయించారు కదా ! ఆ వరాహమూర్తి విష్ణుమూర్తి యొక్క అవతారము. మీకంటే ముందు భూదేవి, వరాహమూర్తులకు పుత్రులుండేవారు. వారు పరాక్రమసంపన్నులయిన రాక్షసులే. దేవతలను జయిస్తే, సహించలేని ఆ దేవతలు రుద్రుని సహాయం కోరారు. తన బిడ్డల మీద ప్రేమతో వానిని చంపటానికి వచ్చిన మహేశ్వరునితో మీ తండ్రి యుద్ధం చేశాడు. ఆ యుద్ధంలో మహేశ్వరుడు ఓడిపోయే స్థితిలో ఉండగా తన అంశ అని కూడా పరిగణించకుండా విష్ణుమూర్తి మహేశ్వరునికి సహాయం చేశాడు. ఆ సాయం వల్ల వచ్చిన శక్తితో మహేశ్వరుడు మీ తండ్రిని సోదరులను చంపివేశాడు. నీవు మహారాక్షసుడవు. ఆ స్ఫురణ మీకు కలిగి అసురసంబంధమైన మాయాశక్తి సాధించాలంటే ఈ కామాఖ్యదేవత నుపాసించాలి.

ఉజ్జయినిలోని కాళి ఉగ్రదేవత. రక్తతర్పణం చేస్తే, శ్మశానసాధనలు చేస్తే ఆ దేవత అనుగ్రహిస్తుంది. ఆమె తామస శక్తి. ఇక్కడి కాళి రాజసశక్తి. శివుని కంటిమంటచే దహనమయిన కాముడు - కామేశ్వరి అయిన లలితాదేవి అనుగ్రహం వల్ల తిరిగి రూపాన్ని పొంది, ఆ కామేశ్వరిలోని కామశక్తిని ఆవాహన చేసి ఇక్కడ ప్రతిష్ఠించాడు. దాక్షాయణి అయిన సతీదేవి యొక్క శరీర ఖండములలో యోని భాగం పడిన ఈ చోట, ఈ కామదేవత స్థాపితమైనది. కనుక ఈ దేవత 'కామరూప', 'కామప్రియ'. ఈమెను కామంతో పూజించాలి. సౌందర్యవతులైన కన్యలను తెచ్చి ఈమె ఎదురుగా గర్భాలయంలో

కామాఖ్యా మంత్రము జపిస్తూ రతి చేయాలి. రతిరసాన్ని పీఠయోనియందు అనులేపనము చేయాలి. స్రవించిన వీర్యంలో జిల్లేడుపూలు అద్ది పూజించాలి. ఆ స్త్రీ యొక్క యోని ప్రక్షాళిత జలంతో దేవికి తర్పణములు, అభిషేకములు చేయాలి. అంతేకాదు. ఆ కాంతలు రజస్వలలు అయినపుడు ఆ రజో రక్తము అద్దిన వస్త్ర ఖండములతో హోమములు చేయాలి. లక్షలసంఖ్యల హోమములు చేయటానికి, ఇంతకుముందు చెప్పిన పూజలు చేయటానికి ఎందరో కన్యలు కావాలి. ఈ మార్గానికి కౌళిక మార్గమని పేరు. పంచమకారములలోని అయిదు వస్తువులూ ఇక్కడ పూజకు అవసరమే. వానిలో మద్య మైథునములకు ప్రాధాన్యము ఎక్కువ. మామూలు వామాచారసాధనలో ఏ స్త్రీ అయినా పనికి వస్తుంది. కానీ నేను మీకోసం ఎంపిక చేసిన ప్రత్యేక సాధనలో కన్యలే కావాలి. ఇతర పురుషునిచేత అనుభవించబడని కన్యలను తెచ్చి వారి భగములకు తంత్ర శాస్త్రోక్తమైన పద్ధతులలో పూజలు చేసి మంత్ర సహితముగా వారితో రమిస్తే కామాఖ్యాదేవి అత్యంత వేగంగా సిద్ధులను ప్రసాదిస్తుంది. మీరు మహారాజులు. మీరు తలచుకొంటే ఏమయినా చేయగలరు. చేయగలరని, చేస్తారని నాకు స్ఫురించబట్టే నేను ఇన్ని మాటలు మీతో సాహసించి పలికాను. నరకాసుర మహారాజా ! మిమ్ము మొదటిసారి అసురరాజుగా సంబోధించి ఈ విశేషాలను అందిస్తున్నాను. నేను భృగువంశీయుడను. భార్గవులమైన మేము ఎప్పుడూ అసురులకు ఆప్తులమే".

నరకుడు ఈ మాటలన్నీ విన్నాడు. "భార్గవ శ్రేష్ఠుడా ! నీ మాటలు నమ్ముతున్నాను. మీరు చెప్పిన విధంగా కామసాధనలు చేస్తాను. భగోపాసన చేసి దివ్యములైన సిద్ధులు సాధిస్తాను. వేలకన్యలను తెచ్చి దేవికి సమర్పిస్తాను. వారితో నేను చేసే రతిక్రీడలతో, పూజాభిషేకములతో కామదేవి అనుగ్రహాన్ని సాధిస్తాను మీరు నాకు అన్ని విధాల సహకరించండి. ఈనాటి నుండి మా కులగురువులు మీరే."

ఆ తరువాత కొద్ది రోజుల నుండే నరకుడు తీవ్రకామసాధనలు ప్రారంభించాడు. అనేక సంవత్సరాలు సాగిన కామయాగంలో ఎందరో కన్యలు అతని కామార్తికి బలి అయినారు. త్వష్ట యొక్క కూతురు 'కశేరు' నామం కలిగిన కన్యను బలవంతంగా తెచ్చాడు. అదేవిధంగా గంధర్వకన్యలు,

రాజకుమారికలు, మొత్తం 16000 మందికి పైగా నరకుని చేత బలవంతంగా తీసుకొని రాబడ్డారు. వామాచార మార్గంలో తీవ్రకామసాధనలు చేసిన నరకునకు కామాఖ్యాదేవి ఎన్నో వరములను ప్రసాదించింది. అప్రతిహతమైన పరాక్రమము అజరత్వము అఖండ భోగశక్తి ఆమె అతనికి అనుగ్రహించింది. ఆ పరాక్రమప్రాభవంతో తనను ఎదిరించిన చైనాజాతి వారి నందరిని ఓడించి లొంగదీసుకొన్నాడు. ఇవాళ అస్సాం, నాగాలాండ్, మేఘాలయ, సిక్కిం అని చెప్పబడుతున్న దేశాలన్నీ అతని రాజ్యంలో ఉండేవి.

అతని పెంపుడు తండ్రి అయిన మిథిలానగర ప్రభువు, జనకమహారాజు నరకుని వైభవాన్ని శౌర్యగాథలను విని తన మహారాణితో కలిసి ప్రాగ్జ్యోతిషపురానికి వచ్చాడు. వారికి అపూర్వమైన స్వాగతం చెప్పి శ్రద్ధాభక్తులతో మహారాజోచితమైన మర్యాదలు చేశాడు. 'విదేహ' చిన్నరాజ్యం. దాని ప్రభువైన జనకునకు వేదాంతిగా బ్రహ్మజ్ఞానిగా సమస్త రాజలోకములో ఋషిమండలిలో గౌరవ మర్యాదలున్నవి. అంతే కాని సార్వభౌములకుండే వైభవం లేదు. తన పెంపుడు కొడుకు యొక్క అనంతమైన ఐశ్వర్యాన్ని చూచి జనకుడు ముగ్ధుడైనాడు. నరకుని ఆతిధ్యాన్ని ప్రేమతో స్వీకరించి కొన్నాళ్ళ తరువాత ఆ వృద్ధరాజదంపతులు మిథిలకు వెళ్ళిపోయినారు.

మాయాదేవి యందు నరకుడు నలుగురు కుమారులను కన్నాడు. తన మొదటి కుమారునకు తన భగోపాసనకు గుర్తుగా 'భగదత్తుడు' అని పేరు పెట్టాడు. మిగిలిన ముగ్గురు మహాశీర్షుడు, మదవంతుడు, సుమాలి. కామాఖ్యాదేవి ఇచ్చిన సిద్ధశక్తుల వరగర్వంతో అతడు ఇంద్రుని జయించాడు. దేవమాత అయిన అదితిదేవి యొక్క మహిమాన్వితమైన కుండలములను అపహరించాడు. రత్నములతో స్థగితమై అమృతవర్షిణియై దివ్యతేజస్సు కలిగిన వరుణుని ఛత్రమును బలవంతముగా తీసుకొన్నాడు. ఆ కాలంలో అతనిని ఎదిరించగలవాడు గాని, గెలవ గలవాడు గాని ఎవరూ లేరు.

తాంత్రిక సాధనల వల్ల భగోపాసన వల్ల కామాఖ్యాదేవి కరుణను పొంది దివ్యశక్తులను పొందిన తరువాత అతనికి వైదికమైన క్రతుకలాపములు నిస్సారముగా కన్పించినవి. వేదపండితులు, వేదవిద్యలు అతని దృష్టిలో చాలా అల్పమైనవిగా కన్పిస్తున్నవి. తనవలె సిద్ధశక్తులు సాధించిన వారెవరూ ఆ

వేదవేత్తలలో లేరు. వేదమంత్రముల వల్ల, యజ్ఞముల వల్ల తొందరగా దివ్యశక్తులు రావన్న నిశ్చయానికి ఎప్పుడోవచ్చాడు. అతడు తాను వైదిక క్రతువులు చేయటం మానేశాడు. వాటిని ప్రోత్సహించటమూ మానివేశాడు.

ఈ విధంగా నరకాసురుడు సుదీర్ఘకాలం కామరూప రాజ్యాన్ని పరిపాలించాడు. ఎదిరించిన కిరాతరాజు ఘటకుని సంహరించి చైనీయులను గెలిచి తన రాజ్యాన్ని సుస్థిరం చేసుకొన్నాడు. ఇది ఇలా వుండగా కామరూపదేశంలోని చాలా ప్రాంతాలలో నిరంతర యజ్ఞయాగములు జరిగినందువల్ల ప్రజలు దీర్ఘకాలం జీవిస్తున్నారు. మరణించిన వారు కూడా ఎవరూ నరకానికి వెళ్ళటం లేదు. అందరూ స్వర్గాది దివ్యలోకాలకే వెడుతున్నారు. దీనితో నరకంలోని వివిధ విభాగాలు ఖాళీగా ఉన్నవి. యమధర్మరాజుకు దిగులు పుట్టి బ్రహ్మతో వెళ్ళి చెప్పుకున్నాడు. అందరూ కలసి మహేశ్వరుని దగ్గరకు వెళ్ళారు. మహేశ్వరుడు తన పరివారంలోని ఉగ్రతార అన్న తీవ్రదేవతను పిలిచి పరివారంతో వెళ్ళి ఆ పరిస్థితిని చూడమన్నాడు. ఉగ్రతార ఆధ్వర్యంలో రుద్రగణాలు బయలుదేరి యజ్ఞశాలలను ధ్వంసం చేసినవి. యజ్ఞకర్తలయిన బ్రాహ్మణుల ఇండ్లు వాకిళ్ళు ఆక్రమించి అందరినీ వెళ్ళగొట్టినవి. దిక్కులేని బ్రాహ్మణులంతా ఆ ప్రాంతంలో ఉన్న వసిష్ఠ ఆశ్రమానికి పరుగెత్తారు. ఉగ్రతార సపరివారంగా వసిష్ఠాశ్రమం మీదకే దాడి చేసింది. వసిష్ఠుడు బ్రాహ్మణ్యానికి అభయమిచ్చాడు. ఆశ్రమం ఆవరణలో ప్రవేశించబోయిన రుద్రగణం శక్తిహీనమై నిలుచుండి పోయింది. అపారమైన ఆ మహర్షి తపఃప్రభావం ముందు వారి ఆయుధాలు కాని వారి దగ్గర ఉన్న క్షుద్రవిద్యలు కాని వారి వశంలో ఉన్న తాంత్రికశక్తులుకానీ ఏవీ పనిచేయలేదు. దుష్టసేనలకు ఆధ్వర్యం వహించిన ఉగ్రతారను "తారా ! ఇన్నాళ్ళుగా మహాదేవతగా పూజలందుకొన్న నీవు బ్రాహ్మణ హింస తలపెట్టావు. యజ్ఞవిధ్వంసము చేయించావు. నిన్ను దేవగణం నుండి బహిష్కరిస్తున్నాను. వైదికమైన పూజలలో నీకు స్థానము లేకుండుగాక ! నిన్ను ఈ దుష్కార్యానికి పంపిన రుద్రుడు కూడా అట్లే అగునుగాక. యజ్ఞములలో ఇకపై మీకు ఆహుతులు పడవు. హోమగుండములోని హవ్యవాహనుడు మీకు పవిత్రములైన హవ్యములను అందించడు.

దురాచారపరులైన మ్లేచ్ఛులచేత క్షుద్రమార్గములలో పూజింపబడుతూ, జంతుబలులను స్వీకరిస్తూ బ్రతకండి. ఈ కామరూప దేశంలో రుద్రునకు గాని, తారాదేవికి గాని వేదవిహితములైన అర్చనలో స్థానము లేకుండును గాక !" అని శపించాడు. ఆ మహాపురుషుని బ్రహ్మతేజస్సు ముందు నిలువలేక తార, ఆమెతో వచ్చిన రుద్రగణము నిశ్శబ్దముగా వెళ్ళిపోయినారు.

అప్పుడు వసిష్ఠుడు "విప్రులారా ! ఈ జరిగిన సంఘటనలు చాలా ఆశ్చర్యాన్ని కల్గిస్తున్నవి. ఈ ప్రాంతానికి పరిపాలకుడు నరకుడు, భూదేవి, విష్ణువుల కుమారుడు. విష్ణుదేవుని అనుగ్రహం వల్ల తన రాజ్యాన్ని పొంది బ్రాహ్మణులను పోషిస్తూ యజ్ఞయాగాలు చేయిస్తూ దేవతా ప్రీతికరంగా ప్రవర్తిస్తున్నాడని విన్నాను. చక్రవర్తి అయిన అతనికి తెలియకుండా అతని అనుమతి లేకుండా అతని రాజ్యంలోని ఒక రాష్ట్రంలో ఇలా ఎందుకు జరిగింది ? అన్నాడు. అప్పుడు ఆ బ్రాహ్మణ్యములోని పెద్దలు కొందరు ముందుకు వచ్చి పరిస్థితిని తెలియచేశారు. "బ్రహ్మర్షీ ! మీరు మహానుభావులు. ఈ ప్రపంచ వ్యవహారములు మీకు ఎక్కువ పట్టవు. నిరంతర తపోధ్యానములలో ఉన్న మీరు ఎప్పుడో కాని ఈ విషయాలను పట్టించుకోరు. బ్రాహ్మణులకు ఇప్పుడు పెద్ద ఆపద వచ్చింది. మీ దగ్గరకు వచ్చి ప్రార్థించి మీ రక్షణ పొందగలిగాము. ఇప్పుడు కామరూపదేశంలో ఉన్న పరిస్థితి బ్రాహ్మణులకు అనుకూలంగా లేదు. ఇటీవల దేశాధిపతి అయిన నరకుడు యోనిపీఠము నందలి కామాఖ్యాదేవిని వామాచారమార్గంలో పూజించి సిద్ధశక్తులు సాధించాడని కథలు ప్రచారంలో ఉన్నవి. కామాఖ్యా దేవాలయంలో ఇప్పుడు వైదికమార్గంలో పూజ జరగటం లేదు. దేవీయజ్ఞము లేవీ ఆగమశాస్త్ర పద్ధతిలో నిర్వహించబడటం లేదు. ఇది వరకు వలె బ్రాహ్మణులను గౌరవించటం లేదు. పోషించటం గాని యజ్ఞములు చేయించటం గాని నరకుడు చేయటం లేదు. అంతేకాక పూర్వయుగములలోని నరకాసురుడు తానేనని, తాను దేవ విరోధినని బాహాటంగా ప్రకటించి త్రివిష్టపముపై దాడి చేసి ఇంద్రుని జయించి అక్కడి సిరిసంపదలను కొల్ల గొట్టి తెచ్చాడు. అతడిప్పుడు బ్రాహ్మణద్వేషి. విశేషించి కొన్ని సిద్ధశక్తులు సాధించిన వాడు. వామాచారసాధనల కోసం మైథునం ద్వారా కామాఖ్యా దేవిని సంతృప్తి

పరచటం కోసం కొన్ని వేల మంది గంధర్వ, రాజ, కన్యకలను తెచ్చి వాళ్ళ ఇష్టంతో సంబంధం లేకుండా మంత్ర సహిత మైథున క్రీడలను చేసి కాళీ అనుగ్రహాన్ని పొందాడని అంటున్నారు. ఈ వార్తలన్నీ చిలవలు పలవలుగా పల్లెలలో పట్టణాలలో వ్యాపించినవి. పరమేశ్వరి అయిన జగన్మాత యోనిపీఠనివాసిని, కామాఖ్యకాళి ఏమి చేస్తున్నదో తెలియదు. ఎందుకు ఉపేక్షిస్తున్నదో అర్థం గావటం లేదు".

బ్రహ్మర్షి అయిన వసిష్ఠుడు "మీరు చెపుతున్న ఈ సంగతులు దిగ్భ్రాంతికరంగాను బాధాకరంగాను ఉన్నది. నేను స్వయంగా వెళ్ళి నరకునితో మాట్లాడుతాను. జగజ్జనని అయిన కామాఖ్యను స్వయంగా పూజించి ప్రార్థిస్తాను. మీలో ముఖ్యులు నాతో రావచ్చు" అన్నాడు. ఆ భూసురులలో ప్రముఖులు కొంతమంది వసిష్ఠునితో బయలుదేరి అందరూ ప్రాగ్జ్యోతిష పురం చేరుకున్నారు.

సరాసరి వీరు కామాఖ్యా మందిరానికి చేరేసరికి సామాన్య దర్శన సమయం అయిపోయింది. రాత్రివేళ మొదటిజాము అయిపోవస్తున్నది. అక్కడి అర్చకులను బ్రాహ్మణులు వెళ్ళి "మహానుభావుడయిన వసిష్ఠమహర్షి అమ్మవారిని స్వయంగా పూజించటానికి వచ్చారు అనుమతించండి" అని అడిగారు. ఆ పూజారులు వీరిని లెక్కచేయలేదు. దర్శన సమయం అయిపోయింది. అంతేకాదు గర్భగుడిలోకి వెళ్ళి పూజచేయటానికి వసిష్ఠమహర్షినే కాదు మరెవ్వరినీ అనుమతించేది లేదు" అన్నారు. ఇంతలో ఆ రోజు నిశాపూజ చేయటానికి నరకుడు స్వయంగా అక్కడకు వచ్చాడు. గర్భాలయంలో పంచమకారములు సిద్ధం చేయబడి ఉన్నవి. అతని మైథునక్రీడకు రాజకన్యలు కొందరు అలంకృతలై ఉన్నారు. అప్పటికే నరకుడు మద్యపానం చేత కైపెక్కి ఉన్నాడు. అక్కడ జరుగుతున్న గందరగోళాన్ని పూజారులు, రాజోద్యోగులు వసిష్ఠుని రాకను ఆయన కోరికను మహారాజుకు తెలియజేశారు. నరకుడు క్రోధ వివశుడై వసిష్ఠునితో కామాఖ్యా దర్శనంగాని, గర్భాలయ ప్రవేశంగాని, వీలుకాదని ఖండితంగా తిరస్కార పూర్వకంగా అహంకారముతో గద్దించాడు. బ్రాహ్మణ నాయకులందరూ భయభ్రాంతులై నిశ్చేష్టులై చూస్తున్నారు. వసిష్ఠుని ముఖంలో జ్వలిస్తున్న అగ్నిదేవుడు

కన్పిస్తున్నాడు. ఆ బ్రహ్మణ్యుని ముఖం ఎఱ్ఱబడింది. ఆగ్రహంతో ఆ మహర్షి నోటి వెంట ఇలా వచ్చింది. "మూర్ఖ నరకాసురా ! దైవద్రోహం చేశావు. ధర్మద్రోహము చేస్తున్నావు. దీని ఫలితంగా నీ తండ్రి అయిన విష్ణువే మానవునిగా అవతరించి నిన్ను సంహరించునుగాక ! నీవు చంపబడిన తరువాతనే నేను ఈ కామాఖ్య దర్శనానికి వస్తాను" అంటూ కామాఖ్యదేవి గర్భాలయం వైపు తిరిగి "కాళీ! ఎందుకు సహిస్తున్నావు ? ఈ దుష్టుని ఎందుకుపేక్షించావు ? ఎందుకైనా ఏమయినాసరే పూజార్హతను నీవు కోల్పోయినావు. ఈ దేశము నుండి నిన్ను బహిష్కరిస్తున్నాను. ఇక్కడ నుండి వెళ్ళిపో. అపూజ్యవైన నీకు ఇక్కడ స్థానం లేదు. అనుల్లంఘనీయమైన నా తపశ్శక్తితో నిన్ను శపిస్తున్నాను" అన్నాడు. నరకుడు, రాజాధికారులు దిగ్భ్రాంతులయినారు. మహారాజును, దేవతను శపించిన ఈ వ్యక్తి ఎవరు ? ఇతనిని ఖండ ఖండములుగా నరకాలి. ఇతనితో వచ్చిన ఈ బ్రాహ్మణులను సంహరించాలి. అని రాజ సైనికులు కత్తులు దూశారు. వసిష్ఠుడొక్కసారి, అందరివైపు తీక్ష్ణంగా చూశాడు. కత్తులు పట్టిన చేతులు స్తంభించిపోయినవి. తనతో వచ్చిన బ్రాహ్మణులతో వసిష్ఠమహర్షి నిశ్శబ్దంగా నిష్క్రమించాడు.

నరకాసురుడు నెమ్మదిగా తేరుకొని కామాఖ్యా మందిరంలోకి నడిచాడు. గర్భాలయంలోకి ప్రవేశించగానే వికృతమైన నిశ్శబ్దం తప్ప అక్కడ ఏమీ లేదు. యోని పీఠంగాని, కామాఖ్యాదేవిగాని అక్కడ కన్పించటం లేదు. ఇంతకాలంగా తన చేత పూజలందుకొని తనకు వరము లిచ్చిన మహాదేవత ఉన్నట్లుండి అదృశ్యమయి పోయింది. ఈ బ్రాహ్మణుని తపశ్శక్తికి జగజ్జననియే నిలువ లేకపోయినదా! భయంతో వణికి పోయినాడు నరకుడు.

నరకుడు తన మందిరానికి వెళ్ళి తల్లి అయిన భూదేవిని తండ్రి అయిన విష్ణువుని ఈ ప్రమాదం తప్పించమని ప్రార్థించాడు. ఆ ఇద్దరిలో ఎవరూ సాక్షాత్కరించలేదు. ఏమి చేయాలో తోచక నరకుడు అసుర గురువైన శుక్రాచార్యుల కోసం కబురు చేశాడు. ఆయన వచ్చి నరకుని ప్రార్థన విని కామాఖ్య దేవిని తిరిగి రప్పించటం తన వల్లకాదని, కొన్నియజ్ఞాలు బ్రహ్మరుద్ర దేవతాత్మకమైనవి చేయించి ఆ దేవతలు నరకునికి కొన్ని వరములిచ్చేలా చేసి వెళ్ళిపోయినాడు.

వసిష్ఠుని తపశ్శక్తివల్ల అదృశ్యమైన కామాఖ్యకాళి పరమేశ్వరుని దగ్గరకు వెళ్ళి "మహాదేవా ! వసిష్ఠుడు నన్ను శపించాడు. తపస్సుచేసినవాడు, సాధనలు చేసినవాడు ఎటువంటి వాడైనా దేవతలు వరాలివ్వక తప్పదు గదా ! నరకుడు చేసిన సాధనల వల్ల తృప్తి చెంది వానికి వరాలిచ్చాను. వాడు వాటిని దుర్వినియోగం చేశాడు. కనుక వానిని శపించవచ్చు - శిక్షించవచ్చు. కాని నన్ను కూడాశపించాడు. అతని శాపాన్ని అనుభవించకుండా త్రోసిపుచ్చవచ్చు. కాని విష్ణుదేవునంతటి వాడే భృగుమహర్షి శాపాన్ని స్వీకరించి అనుభవించాడు. పత్నీ వియోగంతో బాధపడ్డాడు. కనుక ఋషుల వాక్కులను గౌరవించాలన్న ఆలోచనతో వెంటనే అదృశ్యమై మీ దగ్గరకు వచ్చాను. మీరు కర్తవ్యాన్ని ఉపదేశించండి" అన్నది. మహేశ్వరుడు "కాళీ ! ఈ సంఘటన యాదృచ్ఛికంకాదు. నీవక్కడ ఉన్నంతకాలం నరకుడు నిన్ను పూజిస్తుంటాడు. నీవు శక్తిని ఇస్తుంటావు. దుష్టుడైనా సరే ! వాణ్ణి ఎవరూ శిక్షించలేరు. కనుక వసిష్ఠశాపం లోకకళ్యాణాత్మకమైనదే. త్వరలో విష్ణుమూర్తి శ్రీకృష్ణునిగా పుట్టి నరకాసురుని సంహరిస్తాడు. అంతదాకా నీవిక్కడే ఉండు. దీనికి మూడు వందల సంవత్సరాలు పడుతుంది. అప్పుడు మళ్ళీ వెళ్ళి కల్పాంతం దాకా స్థిరంగా భక్తులను అనుగ్రహిస్తూ ఉండవచ్చు" అన్నాడు. శ్రీకృష్ణుడు నరకుని వధించిన తరువాత కాళి మళ్ళీ స్థాపించబడి యోనిపీఠంలో (గౌహతి) పూజ లందుకొంటున్నది.

తంత్ర గ్రంథాలలో వసిష్ఠుని పేరు తారాపటలంలో కనిపిస్తున్నది. చాలాకాలం తారామంత్రం చేసి సిద్ధించక చైనాలో ఉన్న ఒక గొప్ప తారాదేవి ఆలయానికి వెళ్ళి అక్కడ సాధన చేసి సిద్ధిని పొందాడని ఒక కథ. ఈ వసిష్ఠుడు - బ్రహర్షియైన పూర్వయుగాలనాటి వసిష్ఠుడు కావటానికి వీలు లేదు. ఆ పేరు గల మరొకరై ఉండాలి.

వసిష్ఠుడు నిర్మాణకాయుడని యోగులమాట. అంటే ఎప్పుడు కావాలంటే అప్పుడు ఆ యుగానికి, సమయానికి తగినట్లుగా శరీరాలను నిర్మించుకోగల శక్తిగలవాడని అర్థము. ఇక విశ్వామిత్రుని జీవితగాథలలో ఆ మహాపురుషుని పాత్ర చాలా ఉంది. అది విశ్వామిత్రుని కథలో చూడవచ్చు.



## 15. విశ్వామిత్రుడు

విశ్వామిత్రుడు సిద్ధాశ్రమంలో తపస్సు చేసి బ్రహ్మర్షి యైనవాడు. ఆ పేరులోని అర్థం చిత్రమైనది. సంస్కృతంలో విశ్వశబ్దం అకారాంతం. విశ్వ + అమిత్ర = విశ్వామిత్ర. అంటే ప్రపంచానికి శత్రువు అని అర్థం. వ్యాకరణ రచన చేసేటప్పుడు పాణిని – ఈ మహర్షి మహానుభావుడు. ఆయన నామార్థం విపరీతంగా ఉండకూడదు అని భావించి విశ్వచ మిత్ర చర్షే: అని అష్టాధ్యాయిలో ఒక సూత్రం వ్రాశాడు. అంటే మహర్షి పేరు అన్న అర్థంలో విశ్వ శబ్దానికి దీర్ఘం వస్తుందని ప్రత్యేకంగా చెప్పాడు. నా పేరుకు అర్థం ఏమి చెప్పావు. నీ అభిప్రాయం ఏమిటి? అని వ్యాకరణ రచన చేస్తున్న పాణినిని విశ్వామిత్రుడు ప్రశ్నించాడని ఇలా ఒక ప్రత్యేక సూత్రం రచించానని చెపితే సంతోషించి నీ వ్యాకరణం ఆ చంద్రతారార్కంగా నిలచి కీర్తి ప్రసాదిస్తుందని మహర్షి వరమిచ్చాడని ఒక కథ.

గాధి అనే మహారాజు కుమారుడు విశ్వామిత్రుడు. వయస్సు వచ్చిన తర్వాత తండ్రి అనంతరం రాజై సమర్థతతో రాజ్యపాలన చేస్తూ ఒకసారి వేటకు వెళ్ళాడు. ఎండ వేళ అలసిపోయి సైన్యంతో సహా దగ్గర ఉన్న వసిష్ఠమహర్షి ఆశ్రమానికి వెళ్ళాడు. మహర్షి అందరినీ ఆదరించి తన హోమధేనువును వీళ్ళందరికీ ఆహారం సమకూర్చమని ఆదేశించాడు. ఆ ధేనువు దేవతల కామధేనువు సంతానం. దివ్యశక్తులు గలది. అది సకలవిధములైన ఆహార పదార్థాలు సృష్టించి – రాజుకు –మొత్తం సైన్యానికి బ్రహ్మాండమైన విందు చేసింది. తృప్తి చెందిన విశ్వామిత్రుడు – ఈ ధేనువు తన దగ్గర ఉంటే బాగుంటుందని అనిపించి మహర్షితో "ఈ ధేనువును నాకు ఇవ్వండి. దీని సహాయంతో ప్రజలందరికి ఆహారపు కొరత లేకుండా చేస్తాను. దీని బదులుగా మీకెన్ని ఆవులు కావాలంటే అన్ని ఇస్తాను" అన్నాడు.

వసిష్ఠుడు అంగీకరించలేదు. విశ్వామిత్రుడు ఈఆవును బలవంతంగా తోలుకెళ్ళమని సైనికులనాజ్ఞాపించాడు. ఆ గోవు కొమ్ములతో భటులను పొడిచి మహర్షి దగ్గరకి వచ్చి "నన్నీ రాజుకిచ్చారా" అని అడిగింది. వసిష్ఠుడు "నేనివ్వలేదు బలవంతుడైన రాజు చెప్పిన మాట వినకుండా నిన్ను తీసుకువెళ్ళటానికి ప్రయత్నిస్తున్నాడు. నేనేం చేసేది ?" అన్నాడు. "ఋషీశ్వరా ! ఇంత చిన్న పనికి మీరేం చేయనక్కరలేదు. నేను చేస్తాను" అని తన శరీరంలో నుండి అసంఖ్యాక సాయుధ సైనికులను సృష్టించిందా గోవు. ఆ సైనికులు విశ్వామిత్ర సైన్యాన్ని నాశనం చేశారు. సిగ్గుతో మహారాజు తలవంచుకొని వెళ్ళిపోయినాడు.

ఎలానైనా వసిష్ఠుని జయించాలన్న క్రోధంతో గాధేయుడు రుద్రునిగూర్చి తపస్సు చేశాడు. ప్రసన్నుడైన రుద్రుడు అతడు కోరిన విధంగా దివ్యాస్త్రములను ప్రసాదించాడు. అస్త్రబలగర్వంతో వచ్చి విశ్వామిత్రుడు దివ్యబాణాలు ప్రయోగించి వసిష్ఠాశ్రమాన్ని దగ్ధం చేయటం మొదలు పెట్టాడు. ఆశ్రమ వాసులాక్రోశిస్తూ మహర్షి దగ్గరకు పరుగెత్తి చెప్పారు. వసిష్ఠుడు విశ్వామిత్రుని ఆగడాలు చూచి "ఆశ్రమము, అమాయక జనులు నిన్నేం చేశారు ? నీ కోపం నామీద గదా! ఆ అస్త్రాలేవో నామీద ప్రయోగించు" అని బ్రహ్మదండం ముందు నిలబెట్టి కూర్చున్నాడు. రాజు రుద్రుని దగ్గర సంపాదించిన అస్త్రాలన్నీ ప్రయోగించాడు. బ్రహ్మదండం అన్నిటినీ మింగివేసింది. చివరకు అన్నింటికంటే గొప్పదైన బ్రహ్మాస్త్రం ప్రయోగించాడు. ఆ అస్త్రం బ్రహ్మదండాన్ని త్రోసివేసి వసిష్ఠుని మీదకు వచ్చింది. వసిష్ఠుడు దానిని మింగివేశాడు. దానితో ఇంక ఏమీ మిగలక విశ్వామిత్రుడు నిస్సహాయుడై నిల్చున్నాడు. "విశ్వామిత్రా! అయిపోయినవా ? ఇంకేమైనా అస్త్రాలు మిగిలి ఉన్నవా?" అన్నాడు బ్రహ్మర్షి. మళ్ళీ లజ్జతో శిరసు వంచుకొని వెళ్ళిపోయినాడు గాధేయుడు.

"ధిక్ బలం క్షత్రియబలం బ్రహ్మతేజోబలం బలం" – "క్షత్రియ బలం చాలదు – బలం అంటే బ్రహ్మ తేజోబలమే" – అని నిశ్చయానికి వచ్చి తపస్సు చేత శక్తి సంపాదించి వసిష్ఠునంత బ్రహ్మర్షి కావాలని ప్రతిజ్ఞ పూనాడు. కఠోరమైన తపస్సు చేస్తున్నాడు. శక్తి వస్తున్నది. కానీ దేనికో ఒక దానికి ఖర్చు పెట్టవలసి వస్తున్నది. ఒకరోజు త్రిశంకు మహారాజు – సూర్యవంశ

చక్రవర్తి వచ్చి కాళ్ళ మీద పడ్డాడు. చూస్తే చండాలుని వలె ఉన్నాడు. ఏమయింది మహారాజా! అని అడిగితే "మహర్షీ! మీరే నన్ను కాపాడాలి. నాకు సశరీరంగా స్వర్గానికి వెళ్ళాలని కోరిక. పురోహితుడైన వసిష్ఠుని ప్రార్థించాను. ససేమిరా వీలుకాదన్నాడు. ఆయన కుమారుల దగ్గరకు వెళ్ళి అభ్యర్థించాను. తండ్రిగారు కాదంటే మళ్ళీ మా దగ్గరకు వచ్చి అడుగుతావా ? చండాలుడా ! నీకేమైనా బుద్ధి ఉందా ? అత్యాశపడుతున్న నీవు చండాలుడవగుదువుగాక ! అని శపించారు. దానితో చండాలత్వం వచ్చింది. మీరు తప్పనాకు దిక్కు లేరు. నా చేత సశరీర స్వర్గదాయకమైన యజ్ఞం చేయించవలసిందిగా వేడుకుంటున్నాను" అని కాళ్ళపై పడ్డాడు. విశ్వామిత్రునకు దయకలిగింది. వాసిష్ఠులు ఆయన విషయంలో దుర్మార్గంగా ప్రవర్తించారని భావించి త్రిశంకుని చేత యజ్ఞం చేయించాడు. ఆహుతులు వేస్తుంటే హోమాగ్ని పైకి మంత్రాకృష్టులైన దేవతలు వచ్చి చండాలుని కోసం వేసే ఆహుతులు స్వీకరించము. ఫలితం ఇవ్వము"అని చెప్పి వెళ్ళిపోయినారు పట్టుదల రూపుదాల్చిన విశ్వామిత్రుడు "త్రిశంకు మహారాజా ! నా తపశ్శక్తితో నీకు సశరీరస్వర్గాన్ని ఇస్తున్నాను పైకి వెళ్ళు" అన్నాడు. రాజు స్వర్గంలోకి ప్రవేశించాడు. అయితే దేవతలు అతనిని క్రిందికి త్రోసివేశారు. తల్లక్రిందులుగా ఆకాశం నుండి పడుతూ "విశ్వామిత్రా ! రక్ష రక్ష ! నన్ను కాపాడు" అని ఆక్రోశించాడు. మహర్షి దానిని చూచి తపశ్శక్తితో రాజును క్రింద పడకుండ ఆపి - తన మాట నిలబెట్టుకోవాలని రాజు చుట్టూ మరొక స్వర్గాన్ని - దేవతలను అప్సరసలను సృష్టించాలని సంకల్పించాడు. దాంతో దేవతలు దిగివచ్చి - మహర్షీ ! బ్రహ్మసృష్టికి ప్రతిసృష్టి చేయటం న్యాయం కాదు. ఆపు. మీ కోరిక కాదనకుండా త్రిశంకునికి ప్రత్యేక వరమిస్తున్నాము. అతడు తల్లక్రిందుగా వేలాడుతున్నా స్వర్గంలో ఉన్నట్లు, అన్ని రకాల సుఖాలు అనుభవిస్తున్నట్లు అనుభూతి పొందుతుంటాడు అన్నారు. త్రిశంకుని కథ యింతటితో పరిసమాప్తమైంది. ఇతని కోసం చాలా తపస్సు ఖర్చుపెట్టవలసి వచ్చింది.

త్రిశంకుని కుమారుడు హరిశ్చంద్రుడు. ఇతనికి సంతానం లేదు. వరుణుని ప్రార్థిస్తే నీకు సంతాన మిస్తాను. కాని నాకు సమర్పించాలి అన్నాడు.

సంతానం కలిగిందన్న సంతృప్తి పొందవచ్చునని సరే నన్నాడు. పిల్లవాడు పుట్టినతర్వాత సహజంగా మమకారం పెరిగింది. పసివాడని కొన్నాళ్ళు, మాటలు రాలేదని కొన్నాళ్లు, ఉపనయనం చేస్తేగాని బలియివ్వకూడదు గదా ! అని కొంతకాలము వరుణుని బ్రతిమలాడి సమయం తీసుకొంటూ వచ్చాడు. చివరకు తప్పనిపరిస్థితి వచ్చేసరికి పిల్లవాడు ప్రాణభీతితో తప్పించుకొని పోయి అడవులలో దాక్కొన్నాడు. బలియివ్వలేదని వరుణునకు ఆగ్రహం కలిగి జలోధర వ్యాధిపీడితుడవు కమ్మని హరిశ్చంద్రుని శపించాడు. బాధ తట్టుకోలేక పురోహితుల సలహాతో ఎవరినైనా దత్తు తీసుకొని బలియిద్దామని నిర్ణయించుకొన్నాడు. చూస్తూ చూస్తూ చంపటానికి పిల్లవానిని ఎవరిస్తారు ? చివరకు దారిద్ర్య పీడితుడైన అజీగర్తుడనే విప్రుడు తన ముగ్గురు కొడుకులలో మధ్యవానిని అమ్మటానికి అంగీకరించాడు. ఆ బాలుని పేరు శునశ్శేపుడు. రాజభటులు బాలుని రాజధానికి తీసుకెళ్తుంటే త్రోవలో ఉన్న విశ్వామిత్రుని ఆశ్రమం చూచి ఆ బాలుడు మహర్షి కాళ్ళమీద పడి ప్రాణభిక్ష పెట్టమని ప్రార్థించాడు. తన కుమారులను మీలో ఎవరో ఒకరు ఆ బాలుని బదులుగా వెళ్ళమని విశ్వామిత్రుడు చెప్పాడు. కానీ ఎవరూ ఒప్పుకోలేదు. మాట వినలేదని కోపించి వారిని మీరు కిరాత హూణాంధ్ర పుళింద పుల్కసులలో కలిసి భ్రష్టులై పోండని శపించాడు. శునశ్శేపునకు ఒక మంత్రం ఉపదేశించి జపించమన్నాడు. నరమేధ యజ్ఞానికి విశ్వామిత్రుడు కూడా వెళ్ళాడు. యూపస్తంభానికి కట్టబడిన శునశ్శేపునకు మంత్రజపం వల్ల శక్తి వచ్చింది. అతని నోటి వెంట వరుణునికి సంబంధించిన ఋఙ్మంత్రములు స్తోత్రరూపంగా ఉదయించినవి. వరుణుడు సాక్షాత్కరించి ఈ శునశ్శేపుడు మంత్రద్రష్టయైన ఋషియైనాడు. ఇతనిని బలియివ్వవలసిన పనిలేదు. హరిశ్చంద్రుని జలోదర వ్యాధిని తొలగిస్తున్నానని చెప్పి అంతర్ధానమైనాడు. దైవము చేత రక్షించబడినాడు గనుక అప్పటి నుండి శునశ్శేపునకు దైవరాతుడనే పేరు వచ్చింది. దైవరాతుడు సభలో నిలబడి "ఆర్యులారా ! నేను బాలుడను. చిన్నవాడిని. తండ్రి దగ్గర విద్యలు అధ్యయనం చెయ్యాలి. ఇప్పుడు నా తండ్రి యెవరో నిర్ణయించండి!" అని అభ్యర్థించాడు. కన్నతండ్రి అజీగర్తుడు ముందుకు వచ్చి – ఈ ప్రశ్న యేమిటి? కన్నవాణ్ణి నేనుండగా ఇంకొకరిని గురించి ఆలోచించవలసిన అవసరమేమిటి అన్నారు. కాని సదస్సులోని

విద్వాంసులు శునశ్శేపుని ప్రశ్న సమంజసమైనదని భావించి చర్చించి – ఒక నిర్ణయం ప్రకటించారు. "బిడ్డను అమ్ముకొన్నాడు గనుక అజీగర్తునకు హక్కులేదు. బలిపశువుగా వరుణునకు సమర్పించాడు గనుక మహారాజుకు హక్కులేదు. రక్షించిన వాడు మహర్షి విశ్వామిత్రుడు. కాబట్టి దైవరాతుని విశ్వామిత్రుడు స్వీకరించాలని" సదస్యులు పలికారు. విశ్వామిత్రుడు సంతోషంగా శునశ్శేపుని దగ్గరకు తీసుకొన్నాడు. (ఇటీవలి కాలంలో కావ్యకంఠ గణపతిముని తన శిష్యులలో ఒకరిని పూర్వజన్మలో దైవరాతునిగా గుర్తించాడు. ఆ శిష్యుడు కర్ణాటక దేశీయుడు. పెరిగి తపస్వియై వేద మంత్రములు కొన్ని శ్రుతము కాగా వానినొక గ్రంథంగా ప్రకటించాడు.)

తన స్వార్థం కోసం బాలుని బలియివ్వటానికి సిద్ధపడిన హరిశ్చంద్రుడంటే సదభిప్రాయం లేదు మహర్షికి. వేదంలో ఉన్న కథ పైనచెప్పబడింది. పురాణాలలో హరిశ్చంద్రుడు సత్యసంధుడని యిచ్చిన మాట తప్పడని విశ్వామిత్రుడెన్ని విధాల పరీక్షించినా ప్రలోభపడక సత్యపరీక్షకు నిలబడినాడని ఉన్నది. మాటకోసం భార్యాపుత్రులను అమ్ముకొన్న త్యాగమూర్తిగా, ఋణం తీర్చటం కోసం కాటికాపరిగా నిష్ఠతో నిలబడిన వ్యక్తిగా సత్యహరిశ్చంద్రుడు ఆదర్శమూర్తిగా కీర్తిచెందాడు. కాశీలో అతని పేరుతో హరిశ్చంద్రఘాట్ ఉన్నది. అతడు కాటికాపరిగా ఉండిన చోటది. ఇప్పటికీ అక్కడ నిత్యము శవదహనాలు జరుగుతూ ఉంటవి. అతడు ఏర్పరచిన తీర్థం హరిశ్చంద్ర తీర్థమన్న పేరుతో ఇప్పటికీ ఉన్నది. ఇటీవల కీనారాం అఘోరీ అనే కాళీ మంత్రసిద్ధుడు దానిని బాగు చేయించి క్రీం తీర్థ అని పేరు మార్చాడు.

ఆ హరిశ్చంద్రుడు తాను పెట్టిన అన్ని పరీక్షలలోనూ నెగ్గి సత్యానికి నిలబడి నందువల్ల విశ్వామిత్రుడు సంతోషించి అనంతర మన్వంతరములో ఇంద్రుని చేస్తానని వరమిచ్చాడు. వరములివ్వటం, శాపాలు పెట్టటం ఇలా మహర్షి తపస్సు వ్యయమై పోతూనే ఉన్నది.

వేదంలో రెండు మంత్రములకు సంబంధించిన ఒక కథ కనిపిస్తున్నది. వాసిష్ఠులు విశ్వామిత్రుని మీద తీవ్రమైన ప్రయోగం చేశారు. దానివల్ల విశ్వామిత్రుని నోరు మూసుకుపోయింది. ఎవరైన మాట్లాడకుండా కూచుంటే

వాడేమిటి ముంగిసలాగా ఉన్నాడంటారు. అలానే అయింది విశ్వామిత్రుని పరిస్థితి. దానిని అతడు తిప్పుకోలేకపోయాడట ! అప్పుడు భృగువంశీయులైన మహర్షులు సాయం చేసి ఆప్రయోగాన్ని తొలగిస్తే విశ్వామిత్రుడు మామూలు స్థితికి వచ్చాడని కథ. ఆ మంత్రములివి.

**1) ఓష్ఠా పిధానా నకులీ దంతైః పరివృతాపవిః**
**సర్వస్యైవాచ ఈశాన చారుమా మిహవాదయేత్.**

**2) ససర్పరీ రమతింబాధమానా**
**బృహన్మిమాయ జమదగ్ని దత్తా**
**ఆసూర్యస్య దురితాతనాన**
**శ్రవో దేవేష్వమృతమజుర్యం**

వసిష్ఠపుత్రులు నూర్గురిని పౌష్యకల్మాషపాదుని చేత చంపించాడు విశ్వామిత్రుడు. అంతటితో కొంత కోపం తగ్గింది. కానీ ఇంకా బ్రహ్మర్షి కాలేదు. దానిని సాధించాలన్న దీక్షతో మాలినీ నదీతీరంలో కఠోరతపస్సు ప్రారంభించాడు. వెయ్యి సంవత్సరాలు గడిచింది. ఇంత తపస్సు చేశాడు. ఇతని వల్ల ఏ యిబ్బందులు వస్తవో అని భయపడి ఇంద్రుడు తపోభంగం చేయటం కోసం మేనక అనే అప్సరసను పంపించాడు. ఆ అచ్చర విశ్వామిత్రుని ఆశ్రమానికి వచ్చి ఆడి పాడి ఆయనను రంజింప చేసింది. ఆమె సౌందర్యానికి మనస్సు చలించింది.

**చం॥ అలయక నాట్యమాడగను అమ్మునివల్ల వల్లభుమ్రోలనున్న అ**
**మ్మిళిత సుగంధ బంధుర సమీరవశంబున తూలిబాలపై**
**వలువెడలన్ బయల్పడియె వల్లకుచంబులు కక్షయుగ్మమున్**
**లలితకృశోదరంబు తరళత్రివళీయుతరోమరాజియున్**

ఆమె అందచందాలకు లొంగిపోయిన విశ్వామిత్రుడు శృంగార క్రీడలలో మునిగిపోయి ఆమె ఏది కోరితే అదల్లా సృష్టించి యిచ్చేవాడు. ఆకాశంలో, పర్వతాల మీద, నదులలో, అరణ్యాలలో ఆమెతో విహరించేవాడు. ఒక సంవత్సరం గడిచేసరికి వెయ్యేండ్ల తపస్సు పూర్తిగా ఖర్చయిపోయింది. ఒకరోజు మేనక "మహర్షీ! ఈవేళ మలయపర్వతం మీద విహరిద్దాము

రండి !" అన్నది. సరేనని విశ్వామిత్రుడు ఆమె నడుము పట్టుకొని పైకి ఎగరబోయినాడు. ఆమె పైకి లేచింది. అతడు క్రిందనే ఉన్నాడు. మహర్షీ ! పైకి రావటం లేదేమిటి? అన్నది మేనక. "నేను పైకి రాలేకున్నాను. తపశ్శక్తి అయిపోయిందన్న సంగతి గుర్తిస్తున్నాను" అన్నాడు విశ్వామిత్రుడు. "అయితే నేను వెళ్తాను" అన్నది మేనక. "అదేమిటి మేనకా ! మనం ప్రేమించుకొన్నాము. నా వల్ల గర్భవతివి కూడా అయినావు. నన్ను విడిచి పెడతావా?" అన్నాడు ఋషి "మహాత్మా ! మీరు మంచివారు. అమాయకులు. మీ తపస్సు చెడగొట్టమని ఇంద్రుడు పంపిస్తే వచ్చాను. మీ వెయ్యేండ్ల తపశ్శక్తిని సంవత్సరంలో వ్యయం చేయించాను అప్సరసను నేను. ఇంద్రుని దగ్గర చిన్న ఉద్యోగినిని. నా కర్తవ్యము నేను చేశాను. నా ప్రభువు ఆజ్ఞ పరిపాలించాను. మాకు ప్రేమలుండవు. మీవల్ల గర్భవతి నైనాను నిజమే. ఎక్కడో ప్రసవిస్తాను. ఎవరో పెంచుతారు. మా జీవితా లిటువంటివి" అని వీడ్కోలు చెప్పి మేనక వెళ్ళిపోయింది. (వారిద్దరి కూతురే శకుంతల. కణ్వాశ్రమంలో పెరిగి దుష్యంతుని గాంధర్వ వివాహమాడి భరతుని కన్నది. ఆ భరతుడే మహావీరుడై ఈ దేశానికి భరతఖండమన్న పేరు రావటానికి కారకుడైనాడు).

ఇక జీవితంలో ఎన్నడూ కామానికి లొంగకూడదని శపథం చేసి మళ్ళీ తపస్సుకు కూర్చొని వెయ్యేండ్లు చేశాడు విశ్వామిత్రుడు. ఇంద్రుడీసారి రంభను పిలిచి మహర్షి తపోభంగం చేయమని ఆజ్ఞాపించాడు. మహేంద్రా ! కామం వల్ల వచ్చిన దుష్ఫలితాలు పొందిన విశ్వామిత్రుడీసారి లొంగడు. నన్ను పంపించవద్దు.

**చం॥ వనజభవ ప్రభావుడగు వాని వసిష్ఠు అపత్యశోకమన్**
**వననిధిలోనముంచిన అవారితసత్త్వుడు నిన్ను దొట్టి యీ**
**అనిమిషులెల్ల వానికి భయంపడుచుండుదురట్టి ఉగ్ర కో**
**పనుకడకేగి నిల్వుమనపాడియె ధర్మువెపాకశాసనా !**

**ఉ॥ అమ్ముని అల్గిచూచుడును అక్షణమాత్రన గోత్రధారుణీ**
**ధ్రమ్ములు వ్రయ్యునయ్యు సుము దక్కగ నంబుధులింకుమూడులో**
**కమ్ములు దిర్దిన్‌దిరుగు గాడ్పు చలింపగనోడు నుగ్రతన్**
**బమ్మిన యట్టి కొపపరుపాలికి భామలు వోవనోడరే !**

అని బ్రతిమలాడింది. కానీ యింద్రుడు వినలేదు. వెళ్ళి తీరాలని కఠినంగా ఆజ్ఞాపించాడు. తప్పక ముని దగ్గరకు వచ్చి సంగీత నాట్యాలతో అతనిని కరిగించాలని ప్రయత్నం చేసింది. ప్రయత్నం వ్యర్థమయింది. విశ్వామిత్రునకు కోపం వచ్చింది. మీ అప్సరసలకు ఋషులకు తపోభంగం చేయటం తప్ప వేరే పనేమీ లేదా ! ఇంకెవరూ ఇలాంటి పని చేయకుండా గుణపాఠం నేర్వాలి. నీవు వెయ్యేండ్లు పాషాణముగా ఉందువుగాక ! అని శపించాడు. రంభ రాయిగా మారిపోయింది. మహర్షి మళ్ళీ ఒకసారి వెనక్కి చూచుకొన్నాడు. తన వెయ్యేండ్ల తపశ్శక్తి ఖర్చై పోయింది. క్రిందటిసారి మేనకతో కొంత సుఖపడనన్నా సుఖపడ్డాడు. ఈ పర్యాయం క్రోధం వల్ల తపోధనం పోగొట్టుకొన్నాడు. ఇంక జీవితంలో అరిషడ్వర్గాలలో దేనికీ లొంగకూడదు అని దీక్ష వహించి - మాలినీ నదీతీరం నుండి హిమాలయాలలోని సిద్ధాశ్రమానికి వెళ్ళి అక్కడ తపస్సు మొదలుపెట్టాడు. ధ్యానంలో గాయత్రీ మంత్రం శ్రుతమయింది. సూర్యశక్తియైన సావిత్రి అనుగ్రహం కలిగింది. ఆ మంత్రంతో వెయ్యేండ్లు తపస్సు చేశాడు. జగన్మాత గాయత్రీదేవి సాక్షాత్కరించి ఆశీర్వదించింది. తపస్సు సిద్ధించిందన్న సంతృప్తితో ముగించి ఆహారం స్వీకరించటానికి కూర్చున్నాడు. "భవాన్! భిక్షాందేహి" అని ఆశ్రమం ద్వారం దగ్గర ఒక భిక్షుకుడు కనిపించాడు. ఒక్క క్షణం ఆగి విశ్వామిత్రుడు - ఇంతకు ముందు కామానికి, క్రోధానికి లొంగిపోయినాను. ఈ అన్నం నేనే తినాలన్న లోభానికి లొంగకూడదు - అని ఆ భిక్షుకునకు సమర్పించాడు. భిక్షుకుడు వెంటనే ఇంద్రునిగా మారి "విశ్వామిత్రా ! నీవు జితేంద్రియుడవైనావు. నీవిప్పుడు బ్రహ్మర్షివి"అన్నాడు. విశ్వామిత్రుడు "మహేంద్రా ! త్రిలోక పాలకుడవైన నీవు నాకెన్నో పరీక్షలు పెట్టావు. ఇప్పుడు బ్రహ్మర్షినంటున్నావు. నీయంతటివాడు అనటం సంతోషమే. కాని నన్ను వసిష్ఠుడు గుర్తించాలి" అన్నాడు. "తప్పకుండా ! నేనే వారిని ఆహ్వానిస్తాను అని ఇంద్రుడు వసిష్ఠుని స్మరించాడు. ఆ బ్రహ్మర్షి వచ్చి బ్రహ్మర్షీ ! విశ్వామిత్రా ! నీవిప్పుడులోక పూజ్యుడవు. జితేంద్రియుడవు అని ప్రశంసించాడు. విశ్వామిత్రుడు కూడా వసిష్ఠుని తన ఆశ్రమంలోకి తీసుకు వెళ్ళి ఆతిథ్యమిచ్చి గౌరవించాడు.

సీ॥ అఖిల ప్రపంచంబు నన్యథా కల్పించె
పటురోష రేఖ సాఫల్య మొంద
త్రైశంకవంబైన తారకామండలం
బాకాశమార్గంబు నందు నిలిపె
మాలినీ తీర నిర్మలసైకతములలో
మేనకాప్సరసతో మేలమాడె
ఆమ్నాయమాత గాయత్రీ మహాదేవి
ప్రణుతించి బ్రహ్మర్షి పదముగాంచె

ఎవ్వడాతండు సామాన్య ఋషియె తలప
తాటకా కాళరాత్రికి దాశరథికి
కాలకంధర కోదండ ఖండనునకు
కార్ముకాచార్యవర్యుండు గాధిసుతుడు.

విశ్వామిత్రుని మహిమలకు కారణమైన మహాశక్తి గాయత్రీ మంత్రం వల్ల రావటం వల్ల ఉపనయనాలలో దానిని ఉపదేశించటం మొదలైంది. ఈ గాయత్రి – సావిత్రి అంటే సవిత – సూర్యుని శ్రేష్ఠమైన తేజస్సు యొక్క రూపం. విశ్వామిత్రుడు తన ఆశ్రమంలో యజ్ఞం చేస్తుంటే తాటక అనే రాక్షసి ఆమె కుమారులు మారీచసుబాహులు రక్తమాంసాదులు కురిపించి ఇతర విఘ్నాలు కల్పించి యజ్ఞాన్ని పాడు చేస్తున్నారు. తపశ్శక్తి వల్ల వారిని శిక్షించవచ్చు కాని కాలజ్ఞుడు కనుక భవిష్యత్తును దృష్టిలో పెట్టుకొని దశరథమహారాజు దగ్గరకు వెళ్ళి యజ్ఞరక్షణకు ఆయన కుమారుడైన రాముని పంపించమని కోరాడు. మొదట్లో ఇష్టం లేకపోయినా కులగురువు వసిష్ఠుడు చెప్పటంవల్ల అంగీకరించి రామలక్ష్మణులను పంపించాడు. విశ్వామిత్రుడు వారిని తీసుకువెళ్తూ త్రోవలో తాను తపస్సు చేసిన సిద్ధాశ్రమం చూపించి రామునకు దివ్యాస్త్రముల నెన్నో ఉపదేశించాడు. ఆ విధంగా తరువాత కాలంలో జరుగవలసిన రావణ వధకు కావలసిన బలశక్తులను రామునకు ప్రసాదించాడు. ఋషివర్యుడైన విశ్వామిత్రుడు. భారతదేశచరిత్రలో విశ్వామిత్రునకొక ప్రత్యేక మైన స్థానం శాశ్వతంగా ఉంటుందనటంలో సందేహం లేదు. ఇప్పుడు సప్తర్షులలో కూడా ఒకడై ప్రకాశిస్తున్నాడా మహనీయుడు.

# 16. అగస్త్యుడు



తమిళనాడులోని తిరునల్‌వేలిజిల్లాలో కుర్తాళం జలపాతాలు సుప్రసిద్ధమైనవి. ద్రవిడభూమి దక్షిణభాగంలో పొదిగై కొండల మీదనుండి క్రిందకు దూకే ఈ నదీజలాలలో ఓషధీగుణాలున్నవని, సర్వవ్యాధులను నిర్మూలిస్తాయని ప్రజల విశ్వాసం. అగస్త్యమహర్షి ఇక్కడ ధరణీపీఠమును స్థాపించి కుర్తాళనాధేశ్వర లింగాన్ని ప్రతిష్ఠించాడు. ఇదే ఆయన ఆశ్రమస్థానం.

పురాణ వాఙ్మయంలో అగస్త్యమహర్షిని గురించి ఎన్నో కథలు ఉన్నాయి. మహా తపస్సంపన్నునిగా దుష్టుల నెందరినో నాశనం చేసిన శాపాయుధునిగా, ఆ మహానీయుడు భాసిస్తాడు. ఊర్వశి అనే అప్సరస దేవలోకంలో వెడుతూ ఉంటే మిత్రుడనే, దేవగణానికి చెందిన ప్రముఖుడు ఆమెను కోరాడు. అతడి వీర్యాన్ని ఆమె స్వీకరించి ఒక కలశంలో ఉంచింది. దాని నుండి పుట్టినవాడే అగస్త్యుడు. వరుణుడు కూడా అదే సమయంలో ఆమెను కామించాడు. అతని ఓజస్సు నుండి ఉద్భవించినవాడు వసిష్ఠుడు. కుంభములోనుంచి ఉదయించాడు కనుక ఆయనకు కుంభసంభవుడని, ఊర్వశి కుమారుడు కనుక ఔర్వశేయుడని, మిత్రుని కుమారుడయినా ఒకే చోట ఉంచిన మిత్రావరణుల తేజస్సు నుండి ప్రభవించాడు కనుక మైత్రావరుణి అని అగస్త్యునకు పేర్లు వచ్చాయి. అతి కఠోరమయిన తపస్సు చేసి ఇతడు అతిలోక శక్తులు సంపాదించాడు. విదర్భరాజు కూతురయిన లోపాముద్ర ఆయన భార్య. చిరకాలం ఆమె భర్తను ఎంతోభక్తి శ్రద్ధలతో సేవించింది. ఒకనాడు ఆమె యందు దయకలిగి

"నీకేమి కావాలో కోరుకో" అన్నాడు ఆ మహర్షి. ఆమె తాను రాజకుమారి కనుక తానుపుట్టి పెరిగిన చోట అపారమైన ఐశ్వర్యాన్ని చూసింది కనుక మణిమయ స్వర్ణాభరణాలతో అలంకృతమయిన ప్రదేశంలో ఆయనతో క్రీడించాలని అభ్యర్థించింది. తన తపశ్శక్తితో ఆమె కోరిక తీర్చటం ఆయనకు క్షణకాలం పట్టదు. కానీ తపస్సు ఖర్చు కాకుండా ధనం సంపాదించాలని భావించి తనయందు భక్తి కలిగిన ఒక మహారాజు దగ్గరకు వెళ్ళాడు. రాజ్యపరిపాలనకు రాజభవన నిర్వహణకు పోను మిగిలినధనం తనకు ఇమ్మని కోరాడు. ఆ మహారాజు, మహర్షికి ఎంతధనమైనా ఇస్తానని, అయితే ఋషి పెట్టిన నిబంధనల ప్రకారం అయితే తన దగ్గర ధనం మిగలదని అన్నాడు. అతని దగ్గర ధనం తీసుకోవడానికి ఋషి అంగీకరించలేదు. అలానే మరో ఇద్దరు రాజులను అడిగినా ప్రయోజనం లేకపోయింది. వారు బ్రతిమిలాడినా ప్రజలకోసం ఉంచిన ధనాన్ని తీసుకోవడం మహర్షికి ఇష్టం లేకపోయింది. అప్పుడు ముగ్గురు రాజులు ఆలోచించి మణిపురాన్ని పరిపాలించే ఇల్వలుడనే రాక్షసరాజు చాలా ధనవంతుడని, అతనిని అర్థించి ధనం సంపాదించాలని అగస్త్యుని తీసుకుని వెళ్ళారు. ఇల్వలుడు వారు కోరిన ధనాన్ని అగస్త్యునికి ఇవ్వడానికి అంగీకరించాడు. అతని అభ్యర్థనమీద ఆ పూట అక్కడే ఆతిథ్యము స్వీకరించి భోజనం చేసి వెళ్ళవలసి వచ్చింది.

ఇల్వలుడు దుర్మార్గుడు, బ్రాహ్మణ ద్వేషి. ఇంద్రుని జయించగల కొడుకు పుట్టడానికి యజ్ఞం చేయించమని బ్రాహ్మణులను కోరితే వారు తిరస్కరించారు. దానితో అతడు బ్రాహ్మణవధకు పూనుకున్నాడు. భూరి దక్షిణలిస్తానని ఆశపెట్టి మహాభక్తి నటించి తన ఇంటికి భోజనానికి ఆహ్వానించేవాడు. తన మాయాశక్తితో తన తమ్ముడయిన 'వాతాపిని' మేకగా మార్చి దాని మాంసం వండించి భోజనంలో వడ్డింపచేసేవాడు. పూర్వయుగాలలో ఆనాడు బ్రాహ్మణులు కూడా మాంసభోజనం చేసేవారు. తపశ్శక్తి వల్ల ఆ తామసాహార గుణం వారిని అంటేది కాదు. విందు పూర్తికాగానే ఇల్వలుడు తన తమ్ముడయిన 'వాతాపిని' రమ్మని పిలిచేవాడు. బ్రాహ్మణుల ఉదరకోశంలోకి వెళ్ళిన 'వాతాపి' వారి పొట్ట చీల్చుకుని తన స్వరూపంతో బయటకు వచ్చేవాడు. ఈ విధంగా

అతను ఎంతోమంది బ్రాహ్మణులను హతమార్చాడు. ఇప్పుడు కూడా ఆ రాక్షసరాజు ఈ మాయనే ప్రయోగించాడు. భోజనాలకు కూర్చున్న తరువాత అగస్త్యుడు తనకు ఆకలిగా ఉన్నది కనుక మాంసం మొత్తం తనకే పెట్టమన్నాడు. మిత్రులయిన రాజులకు ఇతర ఆహారం వడ్డించబడింది. విందు పూర్తికాగానే తన మామూలు పద్ధతిలో ఇల్వలుడు వాతాపిని రమ్మని పిలిచాడు. అగస్త్యుడు పొట్టనిమురుకుంటూ 'జీర్ణం జీర్ణం వాతాపి జీర్ణం' అన్నాడు. ఆయన కడుపులో వాతాపి జీర్ణం అయిపోయినాడు. వాడు బయటకు రాలేదు. ఇల్వలుడు భయభ్రాంతుడయి అగస్త్యుడు కోరినంత ధనాన్ని ఇచ్చి పంపించాడు. ఆ వాతాపి పేరుతో దక్షిణాపథం పడమటి భాగంలో ప్రాచీన చాళుక్యుల రాజధాని ఇప్పటికీ 'బాదామి' అన్న పేరుతో ఉన్నది. అక్కడికి మూడు మైళ్ల దూరంలో 'మాలాకూటం' అనే ప్రదేశంలో అగస్త్య ఆశ్రమం ఇప్పటికీ ఉన్నది. ఇప్పుడది మహారాష్ట్రలోని కాలడి జిల్లాలో ఉన్నది.

రామాయణంలో విశ్వామిత్రుడు రామునకు అగస్త్య మహర్షి కథను వివరించాడు. సుందుడనే యక్షుని అగస్త్యుడు శాపంతో నాశనం చేస్తే వాడి భార్య తాటక, కుమారులయిన మారీచ సుబాహువులు అగస్త్యుని మీదకు దాడి చేశారు. వాళ్ళను రాక్షసులు కమ్మని మహర్షి శపించాడు. వాళ్ళు ముగ్గురూ తరువాతి కాలంలో రాముని చేత హతులయినారు. మహారాష్ట్రలోని నాసిక్‌లో ఆయన ప్రధానమైన ఆశ్రమం ఉన్నది. ఒకసారి రాక్షసులు సముద్రంలో దాక్కున్నారు. వాళ్ళను కనుక్కో లేక దేవతలు అగస్త్యుని సహాయాన్ని అర్థిస్తే ఆయన సముద్రజలం మొత్తాన్ని పుడిసిటిలో పట్టి తాగివేశాడు. అప్పుడు రాక్షసుల రహస్య స్థావరం బయటపడింది. దేవతలు వారిని నాశనం చేశారు.

సప్తర్షులలో అగస్త్యుడు ఒకడు. ప్రతిమన్వంతరానికి ఇంద్రుడు, మనువు, సప్తర్షులు మారుతూ ఉంటారు. అగస్త్యుడు సప్తర్షులలో ఒకడుగా ఉన్నకాలంలో దేవలోకాధిపతి అయిన ఇంద్రుడు త్వష్టకుమారుడయిన త్రిశిరుని చంపాడు. బ్రహ్మహత్య వెంటపడింది. భయపడి దేవరాజు ఈశాన్యదిక్కుకు వెళ్ళి రహస్యంగా దాక్కున్నాడు. శివస్థానమయిన ఆ చోటికి పోలేక బ్రహ్మహత్య

ఇవతలే ఉండిపోయింది. అక్కడ దేవలోకం అరాచకం అయింది. ఇంద్రుడు ఎటు వెళ్ళాడో ఎక్కడ ఉన్నాడో ఎవ్వరికీ తెలియదు. త్రిలోకాధిపతి స్థానం ఎక్కువ కాలం ఖాళీగా ఉండడానికి వీలులేదు కనుక తాత్కాలికంగా నహుషుడనే రాజును ఇంద్రునిగా తెచ్చి సింహాసనాన్ని అధిరోహింపచేశారు. నూరు అశ్వమేధయాగాలు చేయడం వల్ల అతనికి ఆ అర్హత కలిగి పదవి లభించింది. అయితే దురాశ వల్ల కామవ్యామోహం వల్ల శచీదేవిని తనతో భోగించమని కబురు పెట్టాడు నిస్సహాయురాలయిన ఆ పతివ్రత రక్షించమని దేవగురువయిన బృహస్పతిని ప్రార్థించింది. ఆయన చెప్పిన ఉపాయం ప్రకారం నహుషునకు – నీ వైభవానికి తగినట్లుగా సప్తర్షుల చేత మోయబడే పల్లకి ఎక్కి తన వద్దకు రావలెనని వార్తపెట్టినది. కామాంధుడయిన నహుషుడు ఔచిత్యానౌచిత్యములు పరిగణించక తానెక్కిన పల్లకిని మోయమని సప్తర్షులను ఆజ్ఞాపించాడు. పదవిలో ఉన్నవాని అధికారశక్తిని కాదనలేక ఋషులు అంగీకరించి పల్లకిని మోస్తున్నారు. వారిలో అగస్త్యుడు పొట్టివాడు. మిగతావారితో సమానంగా మోయలేక, నడవలేక ఇబ్బంది పడుతున్నాడు. దానివల్ల పల్లకికి కుదుపులు వచ్చినవి. నహుషునకు కోపంవచ్చి చేతిలో, ఉన్న కొరడాతో అగస్త్యుని కొట్టి 'సర్ప సర్ప' అన్నాడు. అంటే సంస్కృతంలో కదులు కదులు అని అర్థం. అంటే సరిగ్గా మోస్తూ కదలమని భావం. సర్పశబ్దానికి పాము అని కూడా అర్థం ఉంది. ఆగ్రహోదగ్రుడయిన అగస్త్యుడు నహుషుని 'సర్పోభవ' అని శపించాడు. నహుషుడు ఇంద్ర పదవి నుంచి భ్రష్టుడై భూమి మీద ఒక అడవిలో సర్పమై ఉంటూ కొన్ని వేల సంవత్సరములు బాధపడి చివరకు ద్వాపరయుగంలో పాండవాగ్రజుడయిన ధర్మరాజు వల్ల శాపవిమోచనం పొందాడు.

అగస్త్యుడు దక్షిణాపథానికి రావడం ఒక పౌరాణిక పరిణామం. పర్వతరాజులలో శ్రేష్ఠుడనన్న అంశాన్ని నిరూపించుకోవడం కోసం వింధ్యాచలేశ్వరుడు ఆకాశానికి తన శిఖరాలను పెంచి, సూర్యగమనాన్ని అడ్డగించాడు. తూర్పు కొండలలో బయలుదేరిన సూర్యుడు ఏడు గుఱ్ఱాల రథమెక్కి వస్తూ ఉంటే వింధ్యశైల శిఖరాలు అడ్డం వచ్చి రథం ఆగిపోయింది. దానితో కాలగమనంలో వ్యత్యాసం వచ్చింది. లోకములన్నీ కల్లోలితమైనాయి.

పగలున్న చోట పగలే, రాత్రి ఉన్న చోట రాత్రే. పన్నెండు సంవత్సరములు ఈ రకంగా గడిచినవి. మహామహిమాన్వితుడైన వింధ్యరాజును దేవతలు కూడా ఏమీ చేయలేక బ్రహ్మనిర్దేశం మీద కాశీలో ఉన్న శివభక్తుడైన అగస్త్యుని అర్థించారు. విశ్వశ్రేయస్సు కోసం అగస్త్యుడు వింధ్యపర్వత శిఖరాలను దించడం కోసం కాశీ నుండి కదలక తప్పలేదు. కాశీనగరంతో అక్కడి దేవతలతో ఏర్పడిన అనుబంధం వల్ల దానిని విడిచి పోవడం ఎంత మాత్రం ఇష్టం లేదు. అయినా దేవకార్యం కోసం తప్పటం లేదు.ఆయన అంతరంగం పడిన బాధ కాశీఖండంలో ఈ విధంగా వర్ణించబడింది.

**పరమకల్యాణి ! యోభాగీరథీ గంగ!**
**వార్థిభామిని ! పోయివత్తునమ్మ !**
**అమరేంద్రులార ! లోలార్క కేశవులార !**
**వనజసంభవ ! పోయివత్తునయ్య !**
**శ్రీవిశాలాక్షి ! దాక్షిణ్య పుణ్య కటాక్ష !**
**వాసవార్చిత ! పోయివత్తునమ్మ !**
**శ్రీపూర్ణభద్రపారిషద నాయకులార !**
**వటుకభైరవ ! పోయివత్తునయ్య !**
**తీర్థ సంవాసులార ! కృతార్థులార !**
**పాశుపతులార ! భాగ్యసంపన్నులార !**
**మందిరోద్యానవాటికా మఠములార !**
**పోయి వచ్చెద మీ కాశిపురము వెదలి**

అంటూ కాశీ విడచి కొంతదూరము వెళ్ళి మళ్లీ వెనుకకు తిరిగి ఆ పట్టణ వియోగం భరించలేక ఇలా అనుకొంటున్నాడు.

**ఎన్నడు చూతునో యింకొక్క మాటేను**
**ప్రకట కైవల్యాంబురాశి కాశి**
**ఎన్నడు చూతునో యింకొక్క మాటేను**
**జగదేక పావని జహ్నుకన్య**

**ఎన్నడు చూతునో ఇంకొక్క మాటేను**

**మహిమాస్పదము ముక్తి మంటపంబు**

**ఎన్నడు చూతునో ఇంకొక్క మాటేను**

**విశ్వలోకారాధ్య విశ్వనాథు**

**ఇంక ఎన్నడు చూతునో ఏను దుంఠి**

**ఇంక ఎన్నడు చూతునో ఏను దుర్గ**

**నింక నెన్నడు చూతునో యేను వటుకు**

**ఇంక నెన్నడు చూతునో యేను గుహుని**

అని బాధపడుతూ నెమ్మదిగా ముందుకు భార్యా సహితుడై అగస్త్యుడు కదలిపోయినాడు.

ప్రయాణం కొద్దిరోజులు సాగింది. మహర్షి భార్యాసహితుడై వింధ్యపర్వత ప్రాంతానికి వచ్చాడు. తపస్సే ఆకృతి ధరించినట్లు జ్వలిస్తున్న అగ్నిగోళం లాగా వస్తున్న ఆ ఋషీశ్వరుని చూడగా వింధ్యాచలేంద్రునికి భయం కల్గింది. మానవాకారం ధరించి వినయ వినమితగాత్రుడై వచ్చి పాదనమస్కారం చేసి తన రాజమందిరానికి రావలసినదిగా ప్రార్థించాడు. మహర్షి అంగీకరించి అతని ప్రాసాదానికి వెళ్ళి ఆతిథ్యమర్యాదలు పూర్తయిన తరువాత ఇలా అన్నాడు. "పర్వత రాజా ! నేను పనిమీద దక్షిణాపథం వెడుతున్నాను. ఈ పర్వతాన్ని అధిరోహించి వెళ్ళే ఓపిక నాకు లేదు. మా దంపతులము పెద్ద వాళ్ళమయినాము. గగనాంచల వీధులలో విహరిస్తున్న నీ శిఖరాల ఎత్తు తగ్గించి మేము అటువైపు వెళ్ళడానికి ఏర్పాటు చేయి" అనగా వింధ్యాచలేశ్వరునకు ఏమి చేయాలో ఏమి మాట్లాడాలో తోచలేదు. సృష్టినే ధిక్కరించిన తాను, దేవతలనే లెక్కించని తాను తలవంచక తప్పేటట్లు లేదు. ఆయన మాటను కాదని తిరస్కరిద్దామా? అలా తిరస్కరించిన వారిగతి ఏమయినదో తనకు తెలుసు. సమస్త సముద్రజలము పుడిసిలి లోనికి ఆకర్షించి తాగివేసిన మహాశక్తి సంపన్నుడు, భయంకర రాక్షసుడైన వాతాపిని జీర్ణించుకొన్న యోగిరాజు. భీషణ శాపాయుధుడైన ఈ తపస్వి మాటను కాదని ప్రయోజనం లేదు. ఈయన వాక్కులో నిశితమైన ఆజ్ఞ కనిపిస్తున్నది. మృదువుగా

మాట్లాడుతున్నా కాఠిన్యం భాసిస్తున్నది. ఇలా జాగ్రత్తగా ఆలోచించి వింధ్యాచలేశ్వరుడు "మీ ఆజ్ఞ నెరవేరుస్తానని" మహర్షికి అంజలి బద్ధుడయి విన్నవించాడు. వ్యోమవీధుల వరకు విజృంభించిన కొండశిఖరాలన్నీ క్రిందకు వచ్చి వేసినవి. సూర్యరథం అవతలివైపుకు సాగిపోయింది. మహర్షి నెమ్మదిగా భార్యాసహితుడయి, కొండ దాటి అవతలకు చేరాడు. సాగనంపడానికి వచ్చిన వింధ్య వల్లభుడు అగస్త్యులవారు వెళ్లిపోయిన తరువాత మళ్లీ ఆకాశానికి ఎదుగుదామని మనసులో అనుకుంటున్నాడు. మహర్షి సర్వజ్ఞుడు పరేంగితావగాహి. ఆయన పర్వతరాజుతో "నాయనా ! నీ గురుభక్తికి నా ఆజ్ఞాపాలనకు ఎంతో సంతోషించాను. ప్రస్తుతము దక్షిణ దేశానికి వెడుతున్నాను. మళ్ళీ మేము తిరిగి వచ్చిన దాకా ఇలానే ఉండు. మాట దాటకు సుమా!" అని ఆజ్ఞావాక్కుతో పలికాడు. శైలరాజుకు దిగ్భ్రాంతి కల్గింది. అయినా మహర్షి ఆజ్ఞ పాటించక తప్పదు. ఆయన కోపిస్తే క్షణంలో తాను బూడిదగా మారిపోతాడు. అందుకని తలవంచి నమస్కరించి "చిత్తము, తమ ఆజ్ఞపాటిస్తాను" అన్నాడు.

సతీసమేతుడై మహర్షి కదలి వెడుతూ త్రోవలో వాతాపి నగరానికి వచ్చి అక్కడ కొన్నాళ్ళుండి ఆ తరువాత కదిలి ఆంధ్రదేశంలోని దక్షారామం చేరుకొన్నాడు. అక్కడి మాణిక్యాంబా భీమేశ్వరులను సేవిస్తూ కొంతకాలం ఉండి, అక్కడి నుండి బయలుదేరి ద్రవిడ దేశంలోని కంచికి చేరుకొన్నాడు. ఆ దివ్యక్షేత్రంలో కొన్నాళ్ళు తపస్సు చేసి మరలా ప్రయాణించి పడమటి కనుమల దక్షిణపు అంచున ఉన్న పొదిగై కొండలదగ్గర తన నివాసాన్ని ఏర్పరచుకొన్నాడు. తన ఇష్టదైవతమయిన శివుని అనుగ్రహం వల్ల తనకు సిద్ధశక్తి ప్రదాయకుడైన నందీశ్వరుని అనుగ్రహం వల్ల ఆ ప్రదేశం అపారశక్తి కేంద్రమని గ్రహించి అక్కడ కుర్తాళగ్రామంలో నివాస మేర్పరచుకొన్నాడు. ప్రధాన ఆశ్రమాన్ని అక్కడ స్థాపించి అవసరమయినప్పుడల్లా వివిధ ప్రాంతాలలో సంచరిస్తూ తమిళ భాషా సంస్కృతులను నిర్మించిన ఆద్యపురుషునిగా పేరు చెందాడు. ఆ ప్రాంతపు ప్రభువయిన పాండ్య రాజాస్థానములో 'సంగం' అన్న పేరుతో ఒక వైజ్ఞానిక వ్యవస్థను ఏర్పరచి

దానికి తానే అధ్యక్షునిగా ఉండేవాడు. ఆ రాజు కొలువుకూటంలో శంఖాకారం కల్గిన ఒక ఫలకం నిర్మించబడి దానిపై పండితులు ఆసీనులయ్యేవారు. దానికి "సంగప్పలకై" అన్నపేరు వచ్చింది. తమిళ గ్రంథాలలో ఆయన సంచారాలను గురించి ఎన్నో విశేషాలున్నాయి. 'కుశద్వీపము', వరాహద్వీపము, బర్హిణద్వీపము (బోర్నియో), మలయద్వీపము (మలేసియా), సయాం, కాంబోడియా దేశాలు ఇలా ఎన్నో దేశ విదేశాలలో ఆయన పర్యటించి ఆధ్యాత్మిక, సాంస్కృతిక తేజస్సును ప్రసారం చేసినట్లుగా కనిపిస్తుంది. రామాయణ కాలంలో దండకారణ్యంలో రాక్షసులను నాశనం చేయటం నుండి కలియుగంలో మధురాపాలకుడయిన కులశేఖర పాండ్యుని వరకు ఎన్నో కథలు ఆయన గురించి వినిపిస్తున్నవి. అయితే ఇక్కడ సహజంగా ఒక సందేహం వస్తుంది. లక్షల కోట్ల సంవత్సరాల పురాణకాలం నుండి ఇప్పటిదాకా ఒక వ్యక్తి భౌతిక శరీరంతో ఉండటం సాధ్యమేనా ? అని. చిరంజీవులుగా పురాణాలు పేర్కొంటున్న ఈ వ్యక్తులను చూడండి.

**శ్లో॥ అశ్వత్థామా బలి ర్వ్యాసో హనుమాంశ్చ విభీషణః**
**కృపః పరశురామశ్చ సప్తైతే చిరజీవినః**

వీరిలో బలి కృతయుగం నాటి వాడు. హనుమంతుడు, పరశురాముడు, విభీషణుడు, త్రేతాయుగం నాటివారు. వ్యాసుడు, కృపుడు, అశ్వత్థామ, ద్వాపరయుగం నాటి వారు. ఆనాటి నుండి ఇప్పటివరకు వారు జీవించే ఉన్నారని, ఇక ముందు కూడా జీవించే ఉంటారని పురాణము లుద్ఘాటిస్తున్నవి. వారిలో కొందరిని యోగులు దర్శించినట్లు వారి అనుభవాల ద్వారా తెలుస్తున్నది. 'నిర్మాణకాయులు' అనే మాట యోగశాస్త్రంలో కన్పిస్తుంది. దివ్యశక్తి సంపన్నులైన వ్యక్తులు యుగాలు మారినప్పుడల్లా అప్పటి దేశకాలములను పట్టి, నూతన శరీరాలు నిర్మించుకుంటూ పూర్వస్మృతిని శక్తిని కోల్పోకుండా పాంచభౌతిక శరీరంతో జీవించేవారని ఆ పదానికి అర్థం. కృతయుగం నుండి ఇప్పటి వరకు సకల జీవుల శరీర ప్రమాణాలలో ఎన్నో మార్పులు వచ్చినాయి. భాగవతంలో ముచికుందుని కథ చదివినపుడు ఈ విషయంస్పష్టంగా అర్థం అవుతుంది. అగస్త్యు డా విధంగా కలియుగంలో

ఒక నిర్మాణకాయుడై ప్రకాశిస్తున్నాడని భావించవచ్చు. తమిళంలో ఆయన పేరుతో ఇరవై అయిదు గ్రంధాలు దాకా ఉన్నవి. అందులో యోగ వైద్య శాస్త్రములకు సంబంధించిన రచనలు కూడా ఉన్నవి. మృత్యువును జయించగల ఓషధులను గురించి ఆయన ఆ గ్రంథాలలో ప్రస్తావించారు. ఆ మహానీయుడు, కుర్తాళంలో ధరణీపీఠాన్ని స్థాపించి ఒక సిద్ధకేంద్రంగా ఈ ప్రదేశాన్ని రూపొందించి ఎందరికో స్ఫూర్తిదాతగా విరాజిల్లుతున్న మహాయోగి.

వసిష్ఠుని వలెనే ఇతడు కూడా భూమి మీద త్రివిష్టపంతో పుట్టన విషయం గమనించాలి. త్రివిష్టపమంటే టిబెట్. దగ్గరిలోని కైలాసపర్వతం దగ్గరకు వెళ్ళి ఆ రజతాచల వల్లభుడైన శివుని గూర్చి తపస్సు చేసి మహర్షియై శక్తి సంపన్నుడై విరాజిల్లాడు. అనంతరం కాశీమహాక్షేత్రానికి వచ్చి అక్కడ చాలాకాలం ఉన్నాడు. తర్వాత దేవతల అభ్యర్థనమీద దక్షిణాపథానికి వచ్చిన కథ ముందు ఇవ్వబడింది.

## 17. భోగనాధుడు



అగస్త్యుని శిష్యులలో పేర్కొనదగిన సిద్ధపురుషుడు భోగనాధుడు. ఇతడు కుర్తాళంలో జరిగిన ఒక సిద్ధుల సమావేశంలో తన గురువయిన అగస్త్యునకు తాను రచించిన ఏడు వేల శ్లోకాల గ్రంథాన్ని సమర్పించాడు. హిమాలయాలలోని కైలాస శిఖరం మీద సప్తకాండలు కల్గిన ఈ గ్రంథాన్ని అతడు రచించడం జరిగింది. పన్నెండు వేల సంవత్సరముల నుండి ఇతడు

జీవించి ఉన్నట్లు ఆయన రచనలను పట్టి తెలుస్తున్నది. ఒక దివ్యమైన ఓషధిని మాత్రలుగా తయారుచేసి దానిని సేవించినందు వల్ల తనకు సువర్ణ శరీరం లభించి ఇంత సుదీర్ఘకాలం నుంచి జీవించి యున్నానని తాను రచించిన గ్రంథంలోని ఎనిమిదవ జ్ఞానసూత్రంలోని నాల్గవ పద్యంలో ఉద్ఘాటించాడు. దానికి కాయకల్ప మాత్ర అని పేరు పెట్టాడు. ఇతడు కాశీ నివాసి అయిన కాళంగి నాధునకు కూడ శిష్యుడు. ఈతడు నవనాధసిద్ధుల సంప్రదాయానికి చెందినవాడు. ఈ కాళంగి నాధుని వద్ద భోగనాథుడు జ్ఞానయోగమును అభ్యసించాడు. తన మూడువందల పదిహేనవ సంవత్సరములో సజీవ సమాధిలోకి, కాళంగినాధుడు ప్రవేశించాలని నిశ్చయించుకొన్నాడు. మూడువేల సంవత్సరములు ఆ సమాధిలో ఏకాంతముగా ఉండాలని ఆయన అభిలాష. భగవదాదేశం వల్ల పూర్వానుబంధాల వల్ల హిమాలయోత్తర భాగములలో అనగా ఇప్పటి చైనాలో ఆధ్యాత్మిక ప్రచారం చేయాలన్న సంకల్పం ఆయనకు కల్గింది. తాను సమాధిలోకి ప్రవేశిస్తుండడంవల్ల ఈ బాధ్యతను కాళంగినాధుడు తన శిష్యుడైన భోగనాథునికి మానసిక సందేశము ద్వారా అప్పగించాడు. ద్రవిడ భూమిలో ఉన్న భోగనాధుడు సిద్ధగురుని సంకల్పాన్ని అందుకొని వ్యాపారస్థులు వెళ్ళే భూ, జల మార్గంలో చైనా చేరుకున్నాడు. ప్రచార సౌకర్యం కోసం అక్కడ మృతుడయిన ఒక చైనీయుని శరీరంలోకి ప్రవేశించి 'బోయాంగ్' అన్న పేరుతో ప్రసిద్ధుడయినాడు. మానవశరీరంలోని సహస్రార చక్రంలో శిఖరము నందలి బిందువునకు 'యాంగ్' అని పేరు. చైనాభాషలో యాంగ్ అంటే పురుషచిహ్నం. యిన్ అంటే స్త్రీ చిహ్నం. ఈ రెంటి కలయికయే శివ, శక్తుల సమ్మేళనము. యోగం అంటే యిదే. బో అన్న శబ్దానికి భోగము అనగా దివ్యానందమని అర్థం. భోగనాధుడు బోయాంగ్‌గామారి కొంతకాలం జీవించిన తరువాత ఆ శరీరానికి ఉన్న అశాశ్వతత్వాన్ని తొలగించి దీర్ఘాయువును సాధించడం కోసం ముప్పై అయిదు మూలికలతో కాయకల్ప గుటికలు తయారు చేశాడు. తన శిష్యులలో ముఖ్యులైన వారిని ముగ్గురిని ఎంపిక చేసి తన పెంపుడు కుక్కను గూడా వెంట పెట్టుకొని ఒక పర్వత శిఖరానికి తీసుకొని వెళ్ళాడు. అక్కడ ఒక మాత్రను కుక్క చేత మింగించాడు. అది వెంటనే చనిపోయింది. తన ముఖ్యశిష్యుడైన 'యూ' అన్న శిష్యునకు

రెండవ మాత్ర యిచ్చాడు. అతడూ వెంటనే కిందపడి చనిపోయినాడు. మిగిలిన ఇద్దరు శిష్యులకు చెరొకటి ఇచ్చిమిగిలిన మాత్రలన్నింటిని తాను మింగివేశాడు. బోయాంగ్ (భోగనాథుడు) కూడా స్పృహ తప్పి నేలమీద పడ్డాడు. దానిని చూసిన మిగతా ఇద్దరు శిష్యులు ఆ మాత్రలను విసిరి పారేసి భయంతో ఏడుస్తూ కిందికి వెళ్ళిపోయారు. క్రిందకు వెళ్ళిన తరువాత, మరణించిన వారిని పూడ్చి పెట్టాలన్న సంప్రదాయం వారికి గుర్తువచ్చింది. కావలసిన సామగ్రి తీసుకొని వీరు పైకి వెళ్ళేసరికి అక్కడి ఒక పెద్దరాయి మీద రంగు మట్టితో తమ గురువు బోయాంగ్ స్వయంగా వ్రాసిన ఉల్లేఖనం కన్పించింది. "మేము తీసుకొన్న కాయకల్పమాత్రలు ఫలించినవి. దివ్యసువర్ణ శరీరాలు మాకు లభించినవి అజరత్వము, అమరత్వము మాకు ప్రాప్తించినవి. మీ కిచ్చిన అవకాశాన్ని చేతులారా మీరు పోగొట్టు కొన్నారు." బోయాంగ్ ఆ తరువాత చైనాలో లావట్జు (Lotzu) అన్న పేరుతో ప్రసిద్ధుడై దాదాపు రెండు వందల సంవత్సరముల పాటు కొన్ని వందల మంది చైనా వారికి తాంత్రిక యోగాన్ని నేర్పాడు. వామాచారంలోని మైధున సాధనకు అతడు ఎక్కువ ప్రాధాన్యాన్ని ఇచ్చాడు. కామక్రీడనుండి యోగశక్తిని పుట్టించే ప్రక్రియను అతడెందరికో ప్రసాదించాడు. 'కుండలినీ సముత్థాపనము' ఈ సాధనద్వారా లభిస్తుందని ఆతడు నిరూపించాడు. అలా కొన్నివేల సంవత్సరాలు జీవించిన తరువాత తన ముఖ్య శిష్యుడు 'యూ'ను (తరువాత ఈతనికి పులిపాణి అన్న నామాన్ని ఇచ్చాడు) మరి కొందరు శిష్యులను కలుపుకొని క్రీస్తు పూర్వం నాలుగు వందల సంవత్సరాల ప్రాంతంలో భారతదేశానికి తిరిగి వచ్చాడు. దక్షిణదేశంలోని 'పళని'ని తన కేంద్రంగా చేసుకొని అక్కడ కుమారస్వామిని తొమ్మిది రహస్య మూలికలను, రసాయనములను, కలిపి నవపాషాణమూర్తిగా ప్రతిష్ఠించాడు. అది కృష్ణశిలకన్నా గట్టిది. ఆ స్వామికి అభిషేకం చేసిన జలంలో ఓషధీగుణము లుండడం వల్ల ఎటువంటి వ్యాధులనయినా పోగొడ్తాయని భక్తుల విశ్వాసం. భారతదేశానికి తిరిగి రాకముందు అతడు దక్షిణ అమెరికాకు కూడ వెళ్ళివచ్చాడు. కలియుగ ప్రారంభంలో వివిధ దేశాలలోని సిద్ధపురుషులను ఆహ్వానించి అధర్మ ప్రభావం నుండి మానవజాతిని రక్షించడం ఎట్లా అన్న చర్చజరిపి, అల్పాయుష్కులు

అల్పసాధకులు అయిన కలియుగ మానవులకు ప్రేమతో కూడిన భక్తియోగమే ఉద్ధరణ మార్గమని నిర్ధారించి, సిద్ధులు, యోగులు ఈ మార్గానికి ప్రాధాన్యత యివ్వాలని నిశ్చయించారు. భారత భూమికి తిరిగి వచ్చి పళనిలో నివాసం ఏర్పరచుకున్న తరువాత కుర్తాళం వచ్చి తన గురువయిన అగస్త్యుని సన్నిధిలో క్రియాకుండలినీ యోగానికి సంబంధించిన మరికొన్ని రహస్యాలను తెలిసికొని సాధన చేసి ఇప్పటికీ మహాసిద్ధునిగా ప్రకాశిస్తున్నాడు.

కుర్తాళం కొండలపైన కొన్ని గుహల దగ్గర చైనా లిపిలో గుర్తులు కన్పిస్తున్నవని భక్తులు గమనించారు. అవి బహుశా భోగనాధుని శిష్యులేర్పరచిన చిహ్నాలు కావచ్చు. ఇటీవలి కాలంలో చైనా వారెవరూ కుర్తాళం వచ్చి ఇక్కడి కొండ లెక్కిన దాఖలాలు లేవు.

## 18. సుందరనాధుడు (తిరుమూలర్)



శివుని వాహనంగా ప్రమధగణాలకు నాయకునిగా నంది శైవ వాఙ్మయంలో అత్యంత ప్రధాన స్థానం వహిస్తున్నాడు. ఆ మహామహుని భక్తునిగా సుందరనాధుడు హిమాలయాలలోని కైలాస శిఖరం మీద నివసించేవాడు. నిరంతర శివమంత్ర పరాయణుడైన ఆభక్తవరునకు ఒకప్పుడు తన సహాధ్యాయుడు, సతీర్థ్యుడు అయిన అగస్త్యుని చూద్దామని అనిపించింది. అతడు బయలుదేరి నేపాలులోని పశుపతి నాధుని దర్శించి, అమరనాథ్‌లోని హిమలింగానికి మ్రొక్కి, కేదారేశ్వరుని పూజించి, కాశీకి చేరుకున్నాడు. అక్కడ తెలిసిన సమాచారం ప్రకారం అగస్త్యుడు చిరకాలం క్రింద వింధ్యపర్వత

గర్వాన్ని అణచడం కోసం దక్షిణాపథానికి వెళ్ళాడని, తిరిగి వచ్చే అవకాశాలు లేవని తెలిసికొన్నాడు. తన బాల్యమిత్రుని చూడాలన్న కాంక్షతో దక్షిణ దేశానికి బయలుదేరి కంచి వచ్చాడు. అక్కడ కామాక్షిని ఏకామ్రేశ్వరుని దర్శించుకొని శైవక్షేత్రాలను దర్శిస్తూ పొదిగై పర్వతాలలోని కుర్తాళం చేరుకుని తన స్నేహితుడైన అగస్త్యుని అతిథిగా కొంతకాలం ఉన్నాడు. 'మంత్రమాల' అన్నపేరుతో శైవ సంప్రదాయానికి సంబంధించిన తాంత్రిక విశేషాలనెన్నింటినో దానిలో నిక్షేపించాడు. 'నమశ్శివాయ' మంత్రంలోని ఐదు అక్షరాలలో ఉండే మహత్తరశక్తిని ఎన్నో పద్యాలలో అతడు అభివర్ణించాడు. ఒకప్పుడు శైవులలో కొందరు. ఒక్క పంచాక్షరీమంత్రాన్ని తప్ప మరి ఏ ఇతర మంత్రసాధన చేయడానికి ఇష్టపడేవారు కాదు. ఆ ఐదు అక్షరాలను అటూఇటూ మార్చడం ద్వారా వివిధ ప్రయోగాలకు వినియోగించడం జరిగేది. పంచాక్షరిని వ్యత్యస్తంగా అంటే వెనుకనుంచి ముందుకు పఠిస్తూ జపం చేస్తే అస్త్రంవలె పనిచేస్తుంది. శత్రుసంహారం చేస్తుంది. 'వశయమన' అని చేస్తే లోకవశీకరణాన్ని ఇస్తుంది. ఈ విధంగా ఎన్నో విధాలుగా మార్చి దీనిని ఉపయోగించుకోవచ్చు. గాయత్రి మంత్రాన్ని కూడా ఈ విధంగా ఉపయోగించడం మంత్రశాస్త్రంలో ఉన్నది. మంత్రం లోని అక్షరాలను చివరి నుండి మొదటికి అంటే 'యాత్ దచోప్ర ...' అన్న పద్ధతిలో చదువుతూ జపిస్తే అది బ్రహ్మాస్త్రం అవుతుంది. పదములను వెనుక నుండి ముందుకు చదువుతూ అనగా "ప్రచోదయాత్ నః యోధియో' ... పద్ధతిలో చదువుతూ జపిస్తే బ్రహ్మదండమై ప్రకాశిస్తుంది. పాదములను వెనుకకు చదువుతూ అంటే ధియోయోనః ప్రచోదయాత్, భర్గోదేవస్య ధీమహి, తత్సవితుర్వరేణ్యం అని పఠిస్తూ జపిస్తే బ్రహ్మ శిరోనామకాస్త్రమై అనుగ్రహిస్తుంది. ఈ పద్ధతి కొన్ని మంత్రాలకు చెప్పబడింది. పంచాక్షరిలో తాను కనుగొన్న ఈ కొత్త విశేషాలను సుందరనాథుడు అగస్త్యునితో చర్చించేవాడు. ఆయన రచించిన ఆ గ్రంథం 'తిరుమందిరం' అన్న పేరుతో ప్రసిద్ధి కెక్కింది. కుర్తాళంలో కొంతకాలం గడిపిన తరువాత మరికొన్ని శివక్షేత్రాలను దర్శించాలన్న ఆకాంక్షతో తీర్థయాత్రలు చేస్తూ కావేరీ తీర ప్రాంతంలో నడుస్తుండగా ఒక చోట దయనీయమైన ఆర్తస్వరాలు

వినిపించినాయి. దగ్గరకు వెడితే అక్కడ ఒక గోపాలకుడు చనిపోయి ఉన్నాడు. ఆవులుకాచే వాని శరీరం చుట్టూ ఆ ఆవులు, దూడలు అంబారవంతో ఏడుస్తున్నవి. వాటి కన్నుల నుండి బాష్ప ధారలు కారుతున్నవి. వాటి వేదనను చూచి అతడు చలించిపోయినాడు. జంతువుల నుండి కూడా ఇంతప్రేమను చూరగొన్న ఆలకాపరి శరీరాన్ని చూచి అతడు జాలిపడ్డాడు. సహజంగా సుందరనాథునకు సుఖదుఃఖాలు లేవు. అతడు జీవన్ముక్తుడు. తన దివ్యదృష్టితో చూస్తే ఆ శరీరంలోని జీవుడు ఆయువు తీరి తన కర్మానుభవానికి వెళ్ళి పోయినాడు. ఇప్పుడు ఈ ఆర్తజీవులయిన పశువుల దుఃఖాన్ని పోగొట్టటమే తనకు కావలసినది. ఆదృష్టితో ఆలోచించి, అవతల చెట్లు, పొదలు దట్టంగా ఉన్న ఒక స్థలాన్ని ఎన్నుకొని, అక్కడ రహస్యంగా తన శరీరాన్ని ఉంచి ఆ యువకుని శరీరంలోకి 'పరకాయ ప్రవేశ విద్య'ద్వారా ప్రవేశించాడు. ఆ గోపాలుని పేరు ! మూలర్ ! తమ కాపరి లేచి కూర్చోగానే ఆ ఆవుల మంద సంతోషంతో ఆనందాన్ని వ్యక్తపరిచినవి. సాయంకాలం కాగానే ఆ ఆవుల మందతో కలసి అతడు ఆ ఆలకాపరి ఇంటికి వెళ్ళాడు. వాటినన్నింటిని అతని భార్యకు అప్పగించి తనకు వైరాగ్యం కలిగిందని ఇకముందు ఇంట్లో ఉండనని ఆమెతో సంబంధాన్ని వదిలి వేస్తున్నాని నచ్చజెప్పి గృహ పరిత్యాగం చేసి ఆ రోజు రాత్రి ఒక మఠంలో తలదాచుకొన్నాడు. మరునాడు ఉదయమే లేచి అడవిలోకి వెళ్ళి తన శరీరాన్ని దాచి పెట్టిన చోట చూస్తే అక్కడ ఆ దేహం లేదు. ఏ జంతువులు తీసుకు పోయిన జాడ కనపడటం లేదు. ఈ శరీరంలో తాను ఉండడం శివేచ్ఛ అని గ్రహించి అప్పటి నుండి ఆశరీరధారికి ఉన్న పేరునే స్వీకరించి 'తిరుమూలర్' అన్న పేరుతో వ్యవహరించడం మొదలు పెట్టాడు. అక్కడి నుండి యాత్ర చేస్తూ చిదంబరం లోని నటరాజస్వామిని దర్శించి అక్కడికి దగ్గరలో ఒక వటవృక్షం క్రింద కూర్చున్నాడు. తన జీవితగమ్యం, ఈ కొత్తశరీరంలో ఎలా ఉండాలో నిర్దేశించమని పరమశివుని ప్రార్థించాడు. పరమేశ్వరుడు లింగరూపంలో స్వయంభువుగా అక్కడ వెలిశాడు. తన మార్గం అతడికి గోచరమయింది. ఒక సంవత్సరం పాటు ఆ శివలింగం ముందు సమాధిలో ఉన్నాడు. సమాధి నుండి జాగ్రదవస్థలోకి వచ్చి ఒక పద్యం చెప్పాడు. మళ్ళీ వెంటనే సమాధిలోకి వెళ్ళాడు. ఈ విధంగా

సంవత్సరానికి ఒకసారి సమాధి నుండి లేస్తూ ఒక్కొక్క పద్యం చెపుతూ అలా మూడువేల సంవత్సరాలు తపస్సు చేస్తూ మూడు వేల పద్యాలు చెప్పాడని తమిళ దేశంలో కథ వ్యాపించి ఉన్నది. ఆ తరువాత కూడ అతడు జీవించే ఉన్నాడు. అతని పద్యాలు కొన్నింటిలోని భావాలను చూడండి.

**2968 పద్యం**

"యముడు నా దగ్గరకు వస్తే దివ్యజ్ఞానం అనే ఆయుధంతో అతనిని అవతలకు విసిరివేస్తాను. పరమశివుడే దిగివస్తే ఆయనతో సంతోషంగా వెళ్ళుతాను. ఈ ప్రపంచంలోని జన్మకర్మవలయాన్ని నేను ఛేదించాను. తీవ్రమయిన సంకల్పశక్తితో చేస్తే తపః ప్రభావం ముందు ఎవరు నిలువగలరు ?

**2974 పద్యం :**

"నంది, తన కరుణను నామీద ప్రసరింపచేశాడు. నా జీవితానికి ఎదురు లేదు. వ్యాధి, ముసలితనం మానసిక బలహీనత ఇటువంటివే నా సమీపానికే రావు. కష్టాలు, బాధలు, నాముందు మోకరిల్లి నాకు పురోగమన సాధనాలుగా మారినవి. సాక్షాత్ పరమశివుడే నా దగ్గరకు వచ్చాడు.

**74 పద్యం :**

"నందీశ్వరుని పాదములను ఆశ్రయించడం వల్ల సువర్ణలోకాల దివ్యజ్ఞానం నాకు లభించింది. ఏడుకోట్ల యుగముల నా జీవిత యాత్ర అంతా స్ఫురణ లోనికి వచ్చినది.

**80 పద్యం**

"ఈ శరీరంలో నేను కోట్ల సంవత్సరాల నుండి జీవిస్తున్నాను. పగలుకాని రాత్రిగాని లేని ప్రపంచంలో నందీశ్వరుని సన్నిధిలో నేను కోట్ల సంవత్సరాలు జీవించాను.

**న తత్ భాసయతే సూర్యో నశశాంకో న పావకః**
**యద్గత్వా న నివర్తంతే తద్ధామ పరమం మమ ॥**

భవగద్గీతలో కృష్ణుడు ఇలా అన్నాడు - సూర్యుడు గాని, చంద్రుడు

గాని, అగ్ని గాని అక్కడ ప్రకాశించరు. వాటికి అతీతమైన ఒక వెలుగు అక్కడ విరాజిల్లుతూ ఉంటుంది. ఆ ప్రదేశానికి చేరుకున్నవారు తిరిగి వెనుకకు రారు. అది నా నివాసము.

**1529 పద్యం**

"ఈ దివ్యజ్ఞానాన్ని నాకు ఇచ్చిన ఆ పరమ ప్రభువు నాలోకి ప్రవేశించి నన్ను అజరామరమూర్తిగా తీర్చిదిద్దాడు. మాంసమయమైన నాశరీరం ఆ ప్రవేశం వల్ల దివ్యంగా మారి పోయింది. చివరకు నా జుట్టు కూడ మెరుస్తూ కాంతులు విరజిమ్ము తున్నది."

**460 పద్యం**

"ఏ సాధకుడయినా పరమసుందరి అయిన నీలశక్తి కాళితో ఐక్యాన్ని సాధించ గలిగితే అతని చర్మం ముడతలు పడదు. అతని జుట్టు తెల్లపడదు. నవయౌవనంతో ప్రకాశించి తీరుతాడు. ఈ విషయాన్ని నా ఇష్టదైవం అయిన 'పరనంది' మీద ప్రమాణం చేసి చెపుతున్నాను"

**724, 725 పద్యం**

"భౌతిక శరీరం పతనం గావడం జీవునికి శాపంవంటిది ఈ శరీరం లేకపోతే సాధించగల్గినది ఏదీ లేదు. దేహమే దేవాలయమని నేను గుర్తించాను. అందుకే దానిని చాలా జాగ్రత్తతో రక్షించుకొంటున్నాను.

**1948 పద్యం :**

"తపస్సు వల్ల, మౌనం వల్ల సిద్ధ శక్తులను సాధించవచ్చు దీనికి బిందురక్షణ అత్యవసరం".

ఈ విధంగా అతడి రచనలలో శివభక్తి ప్రేరకమైన భావన పదపదాన కన్పిస్తుంది. అటువంటి శక్తి లభించాలంటే ప్రేమ, మూలసూత్రమని అతడు ఉద్ఘాటించాడు. ప్రేమయే శివుడని ఈ సమస్త సాంసారిక బంధాలను త్యజించి ప్రేమలో కరిగిపోవాలని, ఆ విధంగా తాను కరిగిపోయి ఆయన అనుగ్రహాన్ని పొందానని ఆయన సువర్ణ పాదపద్మాలను ఆశ్రయించి తాను కూడా సువర్ణ శరీరాన్ని పొందానని భక్తిభరితుడై ఉద్ఘోషించాడు. తన రచనలలో అతడు

అష్టాంగయోగాన్ని, అష్టసిద్ధి సాధనలను ప్రస్తావించాడు. 'ఋతంభర' ప్రజ్ఞను గురించి అతడు చేసిన ప్రస్తావనలు, పతంజలి యోగసూత్రాలను స్ఫురింప చేస్తున్నవి. అతిమానస ప్రకృతిని గూర్చి అతడు చెప్పిన వివరాలు చాలా అద్భుతంగా బహు విశేషాలతో ఉన్నవి. వీటిలో కొన్ని అంశాలు అరవింద యోగి రచనలలో ప్రతిభాసిస్తాయి. సిద్ధ యోగులతో కుర్తాళ మహర్షులతో అనుబంధం అతని జీవితం మీద ఎంతో ఉన్నది. పొదిగై కొండలలో కుర్తాళ జలపాత ధ్వనులలో అతడి కవితలు ఇప్పటికీ ప్రతిధ్వనిస్తున్నవి.

## 19. మహావతార్ బాబా



పరమహంస యోగానంద రచించిన "ఒక యోగి ఆత్మకథ"లో ఈ మహనీయుని ప్రస్తావన ప్రధానంగా కనిపిస్తుంది. దీనివలన ఆయన హిమాలయాలలో సంచరించే ఒక మహాసిద్ధుడని మృత్యువును జయించిన యోగీశ్వరుడని తెలుస్తున్నది. దక్షిణదేశంలోని యోగిరామయ్య, నీలకంఠన్, గోవిందన్ ప్రభృతులు తమదర్శనాల ద్వారా పరిశోధనల ద్వారా మరి కొన్ని విశేషాలను అందించారు. వీనిని బట్టి ఆయన జన్మస్థలం కావేరీనది సముద్రంలో కలిసే చోట 'ఫరంగిపేట' అన్న ఒక కుగ్రామం అని, తమిళనాడు లోని ఆ చిన్నగ్రామంలో క్రీస్తుశకం 203 నవంబరు 30వ తేదీ (30-11-203) 'రోహిణి' నక్షత్రంలో ఈ అవతార పురుషుడు ఉదయించినట్లు చెప్పబడుతున్నది. కార్తీక మాసపు దీపోత్సవం చేసే పూర్ణిమ

రోజు అది. తమిళదేశంలో కుమారస్వామి రాక్షసులను జయించినందుకు గుర్తుగా దీపాలు వెలిగించే రోజు. కృష్ణుడు కూడ ఇదే నక్షత్రంలో ఉదయించిన సంగతి అందరికీ తెలిసినదే. వాసుదేవుడు శ్రావణ బహుళ అష్టమినాడు క్రీ.పూ. 3228 జులై 20వ తేదీ (20.7.3228) రాత్రి ఉదయించిన అంశం పౌరాణికులు తెలిపియున్నారు. అనంతర కాలంలో మహావతార్ బాబాగా ప్రసిద్ధి చెందిన ఈ శిశువు నంబూద్రి బ్రాహ్మణుల కుటుంబంలో జన్మించాడు. కేరళలోని మలబారు తీరం నుండి కొన్ని వందల సంవత్సరాల క్రింద వీరి పూర్వులు కావేరీ తీరానికి వచ్చారు. ఈ ఫరంగిపేట గ్రామంలోని ప్రధానాలయంలో పూజారిగా ఉన్న బ్రాహ్మణ పండితునకు ఇతడు కుమారుడయినాడు. ఈ గ్రామం సుప్రసిద్ధమైన చిదంబర క్షేత్రానికి పదిహేడు కిలోమీటర్ల దూరంలో ఉంది. పోర్చుగీసు వారు దీనిని పోర్టానోవో అని పిలిచేవారు. ఈ శిశువునకు తల్లిదండ్రులు నాగరాజు అని పేరు పెట్టారు. ఈ బాలునకు ఒక సోదరి కూడా ఉన్నది. ఆమె పేరు నాగలక్ష్మి. ఆమె కూడ 'మాతాజీ' అన్న పేరుతో ఇప్పుడు కూడ దీర్ఘకాలజీవినియై జీవిస్తున్నది. బహుశ ఈ పేర్లు పెట్టడానికి కారణం వారి తండ్రి కుమారస్వామి దేవాలయ అర్చకుడు కావడం కావచ్చు. ఇప్పటికి ఆ ఆలయం వీరి వారసులచే నిత్యపూజలు అందుకుంటూ అలరారుతున్నది. ఈ బాలుడు అయిదు సంవత్సరాల వయస్సులో ఉండగా ఆ ఆలయంలో పెద్ద ఉత్సవం జరుగుతున్నది. జనం గుంపులు గుంపులుగా ఉన్నారు. చీకటిపడింది. జనసమ్మర్దంలో ఎవరు ఎక్కడ ఉన్నది తెలియడం లేదు. ఇంతలో బలవంతుడయిన ఒక వ్యక్తి ఈ బాలుని చెయ్యిపట్టుకుని లాక్కుని వెళ్ళాడు. అరవకుండా కేకలు పెట్టకుండా నోరునొక్కి తన పరివారం దగ్గరకు తీసుకొని వెళ్ళాడు. వాడు బానిస వ్యాపారం చేసే ఒక దుష్ట వర్తకుడు. ప్రస్తుతం పాకిస్తాన్‌లోని బెలూచిస్తాన్ అతని స్వస్థలం. ఆ వ్యాపారి ఈ బాలుని తీసుకొని పడవలో ఎక్కించుకొని తన పరివారంతో జాగ్రత్తగా ఇతనిని కట్టు దిట్టం చేసి కొన్నాళ్ళకు కలకత్తా చేరుకున్నాడు. అక్కడ ఒక ధనవంతునికి బానిసగా నాగరాజును అమ్మి వేశాడు. ఈ బాలుడు ఆ సంపన్నుని ఇంట్లో చాలాకాలం నమ్మకంగా సేవచేశాడు. ఆ యజమాని సంపన్నుడయిన బ్రాహ్మణుడు నిత్యము దైవ పూజ, దానధర్మములు మొదలగు

సద్గుణములు కలవాడు. నాగరాజు నీడవలె ఆయన వెన్నంటి ఉంటూ చెప్పిన పని శ్రద్ధగా చేస్తుండేవాడు. ఆయన చేసే పూజలు చూచి నాగరాజుకు కూడా భక్తిశ్రద్ధలు ప్రబలినవి. ఈ బాలుని భక్తిశ్రద్ధలను వినయ విధేయతలను చూచి సంతోషించి బానిసతనం నుండి ఆ యజమాని ఇతనిని విముక్తుని చేశాడు. అదే సమయానికి అక్కడికి ఒక సాధువుల యాత్రా బృందం వచ్చింది. వాళ్ళను చూచి ఆకర్షించబడి ఈ బాలుడు వారి వెంట వెళ్ళి వారికి సేవ చేశాడు. వారిలో మంచి పండితులు, మేధావులు ఉన్నారు. ఇతడి సేవానిరతికి మెచ్చి వారు ఇతని చేత వేదశాస్త్ర - అధ్యయనం చేయించారు. విద్యాభ్యాసం వల్ల ఇంచుమించుగా పదకొండు సంవత్సరాల కల్లా ఆరితేరిన పండితుడయినాడు. వేదములు ఉపనిషత్తులు రామాయణ, భారతములు, భగవద్గీత మొదలైన గ్రంథాలలో ఏ దడిగినా తడుముకోకుండా అనర్గళంగా చెప్పగలిగేవాడు. ఏవయినా పండిత చర్చలు వచ్చినపుడు వాటిలో పాల్గొని వివాదాలకు తీర్పు చెప్పగలిగిన స్థాయికి చేరుకున్నాడు

ఈ విద్యా గోష్ఠులతో కాలం ఇలా గడుస్తూ ఉంటే అతనిలోని ఆధ్యాత్మిక తృష్ణ తీరలేదు. భగవంతుని తెలుసుకోడానికి, పరమమైన దివ్యజ్ఞానాన్ని పొందడానికి ఈ పాండిత్యం ఎంతవరకు ఉపకరిస్తుందన్న సందేహం మనసును తొలుస్తున్నది. పండితునిగా తనకు వస్తున్న కీర్తి, కాలమంతా వాటితో గడవటం ఆధ్యాత్మిక సాధనలకు ఆటంకాలుగా అనిపించినవి. వాక్కులు సత్యాన్ని అందుకోలేవన్న సంగతి అతడు గమనించాడు. శాస్త్రములు మార్గమును సూచిస్తాయి. వాటి ఉపయోగం అంతవరకే. అంతరంగంలో ఈ అన్వేషణ మొదలైనది. ఈ వైజ్ఞానిక యాత్రలో, అన్వేషణలో సాధువులతో కలసి ఒకసారి కాశీ వెళ్ళడం జరిగింది. కాశీలోని విశ్వనాథుడు దివ్యతేజః పుంజముగా సమస్త లోకాలకు ప్రభువుగా ఆయన మనో నేత్రంలో గోచరించాడు. తన స్వగ్రామంలోని శివాలయం గుర్తుకు వచ్చింది. శివపుత్రుడయిన కుమారస్వామి తన ఇష్టదైవం బాల్యంలో ఆస్వామి గుడిలో ఆడుకున్నాడు, పాడుకున్నాడు. కాశీలో కొన్నాళ్ళుండగా కొందరు యాత్రికులు, శ్రీలంకలోని 'కతిర్గమ' అన్న ఊరిలో మహిమాన్వితుడయిన కుమారస్వామిని దర్శించడానికి వెడుతున్నారు. వారితో కలసి సుదీర్ఘ ప్రయాణం, నడకతో, కొంతదూరం పడవమీద

ప్రయాణించి అక్కడకు చేరుకున్నారు. గౌతమబుద్ధుడు కూడ ఆస్వామిని దర్శించాడని అక్కడి బౌద్ధులు చెపుతారు. బుద్ధుని ఆలయం కూడా అక్కడ నిర్మించబడి ఉన్నది. ఆ ఊరిలో సుబ్రహ్మణ్యుని మందిరంలో ఏ విగ్రహమూ ఉండదు. సిద్ధపురుషుడయిన భోగనాథుడు ఈ దేవాలయాన్ని స్థాపించాడు. ఒక బంగారు పళ్ళెంపై సుబ్రహ్మణ్య యంత్రము చెక్కబడి ఉంటుంది. ఆ యంత్రమే నిత్య పూజలు అందుకుంటూ ఉంటుంది. సంవత్సరానికి ఒకసారి ఆ యంత్రాన్ని బయటకు తెచ్చి ఏనుగు మీద ఊరేగించి మళ్ళీ దేవాలయంలో ఉంచుతారు. మహాశక్తివంతమైన ఈ యంత్రాన్ని అధిష్ఠించి కుమారస్వామి భక్తులను అనుగ్రహిస్తుంటాడు. అనేక శతాబ్దాలుగా ఈ కతిర్గామం అద్భుతాలకు నిలయంగా పేరు పొందింది. ఈ ఆలయం మాణిక్యగంగ అనే చిన్న నది ఒడ్డున అరణ్యంలో లోతట్టు ప్రాంతంలో ఉన్నది. 'కతిర్గామ' అన్న శబ్దం 'కార్తికేయ గ్రామ' అన్న సంస్కృత పదము యొక్క వికృతి. ఇక్కడే కార్తికేయుడు అనగా సుబ్రహ్మణ్యుడు వల్లీదేవిని కలిసి పెళ్ళి చేసుకొన్నాడు. ఇప్పటికీ ఆ దేవతల జంట ఇక్కడే ఉన్నారని ఆ ప్రజల విశ్వాసం. ఈ దేవాలయంలో ఒక వటవృక్షం క్రింద చిరకాల సిద్ధుడయిన భోగనాథుడు నాగరాజుకు దర్శనమిచ్చాడు. ఆయనను ప్రార్థించి శిష్యుడయి నాగరాజు ఆరుమాసములు అక్కడ యోగసాధనను చేశాడు. సద్గురువు యొక్క అనుగ్రహం వల్ల క్రమక్రమముగా రోజుల తరబడి ధ్యానంలో కదలకుండా ఉండగల స్థితి లభించింది. దీర్ఘకాలం 'సవికల్పసమాధి'లో ఉండగా కుమారస్వామి సాక్షాత్కారం కల్గింది. ఆయన తేజస్సు తనలోకి ప్రవేశించగా తానూ స్వామి ఒకటేనన్న అనుభవం బలంగా కలిగింది. భోగనాథుని శిక్షణలో తపస్సిద్ధి పరిపూర్ణత్వాన్ని పొందుతున్నదని ఆశిస్తున్న దశలో సిద్ధేశ్వరుడయిన ఆ గురువు ఒక కొత్త ఆదేశాన్ని ఇచ్చాడు.

"ద్రవిడదేశంలోని" కుర్తాళంలో అగస్త్య మహర్షి ఉన్నాడని ఆయన అనుగ్రహం పొందితే గాని సాధనలో ఉన్నతదశ రాదని తాను కూడా ఆ మహనీయుని అనుగ్రహం వలననే సిద్ధత్వాన్ని పొందానని, కనుక అక్కడ జలపాతాల దగ్గరికి వెళ్ళి అగస్త్యుని దర్శనం కోసం తపస్సు చేయమని" ఆశీర్వదించి పంపించాడు.

కతిర్గామ నుండి బయలుదేరి నాగరాజు ద్రవిడదేశం చేరుకొని కాలినడకన కుర్తాళంలో ప్రవేశించాడు. ఎండలో వానలో ఆహార విహారాలను పట్టించుకోకుండా ప్రాచీనఋషి అయిన అగస్త్యుని గూర్చి అతడు చేస్తున్న తపస్సు చూసే వారికి ఆశ్చర్యం కలిగించింది. కొంతమంది ఆహారాన్ని, త్రాగడానికి నీటిని ఇచ్చేవారు. రోజులు గడుస్తున్న కొద్దీ శరీరం మీద ఆసక్తి తగ్గటం మొదలు పెట్టింది. ఆహార నిద్రాదులు లేక దేహం శుష్కించిపోయింది.

**శ్లో॥ఇహాసనే శుష్యతు మే శరీరం**
**త్వగస్థి మాంసాణి లయంచయాంతు**
**అప్రాప్య బోధం బహుజన్మదుర్లభం**
**నైవాసనాత్ కాయమతశ్చలిష్యతి.**

ఈ కూర్చున్న చోటుననే నా శరీరం శుష్కించి పోయిన పోవునుగాక! శరీరం మీది మాంసము, చర్మము, ఎముకలు లయించిన లయించును గాక ! బహుజన్మ దుర్లభమయిన దివ్యజ్ఞానము పొందకుండా ఈ కాయము కూర్చున్న చోటు నుండి కదలదు.

ఇంతటి పట్టుదలతో తీవ్రంగా జపిస్తూ ధ్యానిస్తూ అగస్త్యుని కోసం ఎదురు చూస్తున్నాడు నాగరాజు. క్షీణిస్తున్న శరీరాన్ని చూచి, ఇది నాది కాదు పోతే పోవును గాక! అన్న దృష్టితో ఆ కలశసంభవుని రాకకోసం ఎదురు చూస్తుండగా 47 రోజులు గడిచినాయి. నలభైఎనిమిదవ రోజు ఇంక పూర్తిగా కుప్పకూలిపోతాడన్న దశలో కూడ అగస్త్యుని నామోచ్చారణ జరుగుతునే ఉన్నది. ఆ క్షణంలో నాగరాజు కన్నుల ముందు అగస్త్యుడు సాక్షాత్కరించాడు. పేరుపెట్టి పిలిచి ధ్యానసమాధి నుండి లేపి కౌగలించుకొన్నాడు. దివ్యమైన ప్రసాదాన్ని తన చేతిమీదుగా తినిపించాడు. యోగసాధనలోని రహస్యాల నుపదేశించి సిద్ధత్వాన్ని అనుగ్రహించాడు. ఆ క్షణం నుంచి కుర్తాళం అతని 'గురుపీఠం' అయింది. గురువులకు గురువు, సిద్ధేశ్వరుడు అయిన అగస్త్య ఋషి దివ్యానుగ్రహ ప్రభావం వల్ల నాగరాజు 'మహావతార్ బాబా'గా పరిణామం చెందాడు.

కొంతకాలం కుర్తాళంలో గురూపదిష్ట మార్గంలో సాధన చేస్తుండగా

అగస్త్యుడు నాగరాజును బదరికాశ్రమం వెళ్ళమని ఆదేశించాడు.

ఇకపైన నాగరాజును 'బాబాజీ' అని వ్యవహరిద్దాము. బదరికా క్షేత్రం చేరుకున్నాడు ఈ మహాయోగి. ఈక్షేత్రం హిమాలయ పర్వతాలలో టిబెట్ సరిహద్దుకు దక్షిణంగా షుమారు పదివేల అడుగుల ఎత్తున ఉన్నది. గంగ, అలకనంద నదుల సంగమ ప్రదేశంలో గంగరేగి చెట్లతో నిండి ఉన్న ఈ అరణ్యం బదరీవనమని పిలుస్తారు. సంస్కృతంలో బదరీ అంటే గంగరేగి. దీనికి రెండు వైపుల నరనారాయణ పర్వత ప్రవేశం ఉన్నది. ఆ ఆదిఋషులు తపస్సు చేసిన వనమిదే. కొద్దిదూరంలోనే 22000 అడుగులు ఎత్తున నీలకంఠ శిఖరము ప్రకాశిస్తున్నది. అక్కడికి సమీపాన అలకనందకు దగ్గరలో తప్తకుండమన్న పేరుతో వేడి నీళ్ళకుండ మున్నది. ఆదిశంకరాచార్యుల వారు ఇక్కడే జ్యోతిర్మఠాన్ని స్థాపించారు. దాన్నిపుడు జోషీమఠం అంటారు. కొన్ని నెలలు విపరీతమైన చలి ఉండడం వల్ల ఇక్కడ అందరూ ఉండలేరు. కలి ప్రభావం ప్రవేశించలేని దివ్యభూమిగా దీనిని పురాణాలు కీర్తిస్తున్నవి. యోగులకు, ఋషులకు, సాధువులకు, సిద్ధులకు ఇది నివాస స్థానం. ఇక్కడ నారాయణుడు వెలసి ఉన్నాడు. బదరీనారాయణ ఆలయం వేదకాలం నుండి ప్రసిద్ధి చెందింది. బదరీనారాయణుని విగ్రహాన్ని, బాబాజీని చూచినవారు ఇద్దరూ ఒకే రకంగా ఉండడాన్ని చూచి ఆశ్చర్య పోతూ ఉంటారు. అక్కడ వ్యాప్తిలో ఒక కథ ఉన్నది. ఆచార్య శంకరులు అష్టఖండం వైపు అధిరోహిస్తుంటే ఆకాశవాణి ఆయనకు చెప్పింది. "శంకరా ! ఇక్కడ నారద కుండంలో విష్ణువిగ్రహం ఉన్నది. దీనిని ఉద్ధరించి ఆలయం కట్టించు" అని (ప్రస్తుతం ఉన్నదేవాలయం శంకరాచార్యుల వారు ప్రతిష్ఠించినదని చెపుతారు) అయితే బదరీ నారాయణులు వేదకాలం నాటి వారు. ప్రకృతి వైపరీత్యాల వల్ల ఆలయం శిధిలమై పోతే ఏకారణం వల్లనో విగ్రహం కుండంలోకి చేరితే శంకరాచార్యుల వారు దానిని పునరుద్ధరించి ప్రస్తుత నిర్మాణం చేయించి ఉంటారు. భగవంతుడయిన కృష్ణుడు తన చివరి దశలో ఉద్ధవుని బదరికాశ్రమం వెళ్ళమని ఆదేశించాడు. అప్పటినుండి అక్కడికి మరింతగా యాత్రలు పెరిగినవి. జీవితంలో ఒకసారయినా బదరికాశ్రమానికి వెళ్ళాలని హిందువుల ఆకాంక్ష. బాబాజీ ఇక్కడకు చేరుకొని తన గురువు లుపదేశించిన మార్గంలో

పదునెనిమిదినెలలు ఏకాంతంగా కఠోరతపస్సు చేశాడు. తత్ఫలితంగా సంపూర్ణమైన సిద్ధత్వం లభించింది. ఆయన భౌతికశరీరం బంగారు రంగుతో ప్రకాశిస్తూండగా అతడు నిత్యయౌవనునిగా అజరునిగా, అమరునిగా మారిపోయినాడు.

శ్రీకృష్ణుడు అర్జునునికి ఉపదేశించిన క్రియాయోగ మార్గాన్ని తన గురువుల నుండి బాబాజీ గ్రహించి సాధన చేసి సిద్ధస్థితిని పొంది ఆ మార్గాన్ని అనంతర కాలంలో ఎందరికో ఉపదేశించాడు. క్రీ.శ. 788 నుండి 820 వరకు జీవించాడని భావించబడుతున్న ఆదిశంకరాచార్యులకు గోవింద భగవత్పాదులు సన్యాసదీక్ష ఇచ్చిన శిక్షా గురువయితే, బాబాజీ యోగదీక్ష ఇచ్చిన దీక్షాగురువు. కేదార్‌నాథ్ పర్వత శిఖర ప్రాంతంలో ఉన్న సిద్ధాశ్రమానికి వెళ్ళడానికి ఆయన ప్రయత్నిస్తే సాధ్యం కాలేదని, బాబాజీ అనుగ్రహం వల్ల సిద్ధసాధనలు చేసిన తరువాత అక్కడికి వెళ్ళగలిగాడని దార్శనికులు కొందరు తెలియజేస్తున్నారు. క్రియా యోగ సంప్రదాయంలోని వారే కాక ఇతర పంథాలలోని యోగులు కూడ ఈ విషయాన్ని ధ్రువీకరించారు.

సిద్ధాశ్రమం హిమాలయాలలో రహస్యంగా ఉన్న ప్రదేశం. అక్కడ ఎందరో దీర్ఘకాల జీవులయిన మహనీయులు ఉన్నారు. రామాయణంలో విశ్వామిత్రుడు తపస్సు చేసి గాయత్రి మంత్రసిద్ధిని పొంది బ్రహ్మర్షి అయినది ఈ ఆశ్రమంలోనే. భారతంలో నలచరిత్రలో దమయంతిని అరణ్యంలో విడిచిపెట్టి నలుడు వెళ్ళిపోయినపుడు ఆమె పరితపించి ఆత్మహత్యచేసుకోవాలని ప్రయత్నిస్తుండగా సిద్ధాశ్రమ ఋషులు ప్రత్యక్షమై ఆమెను ఓదార్చి త్వరలో పతిసమాగమం జరుగుతుందని మళ్లీ రాజ్యప్రాప్తి కలుగుతుందని భవిష్యత్తును సూచించి అదృశ్యమయినారు. ఈ సిద్ధాశ్రమంలో మహర్షులెందరో జపిస్తూ లోకంలో అవసరము అయిన పద్ధతులలో తమశక్తిని ప్రసరింప జేస్తూ ఉంటారు. వారిలో కొందరు యోగ్యులైన సాధకులకు మార్గ నిర్దేశనం చేస్తూ ధ్యానాలలో స్వప్నాలలో దర్శనము లిస్తూ సాధనలో ముందుకు నడిపిస్తూంటారు. మరికొందరు ఉత్తమ సంస్కారము కలిగిన కొందరు వ్యక్తులలో ప్రవేశించి కొన్ని సంవత్సరములు ఆ శరీరంలో ఉండి వారిచే కొన్ని మహాకార్యములు చేయించి మళ్ళీ వెళ్ళిపోతుంటారు. అబ్రహాం లింకన్,

మహాత్మాగాంధీ, ఈ కోవకు చెందినవారని కొందరు ధ్యానయోగుల అభిప్రాయం. భారతదేశ స్వాతంత్ర్యం కోసం దైవచైతన్యం కల్గించడం కోసం ఉదయించిన సిద్ధాశ్రమ యోగులే మహాత్మాగాంధీ, రమణమహర్షి, అరవిందయోగి, మొదలైనవారని, తానూ వారిలో ఒకడినని సుప్రసిద్ధ తపస్వి కావ్యకంఠ గణపతిముని తెలియచేశారు. ఇటీవలి కాలంలో సిద్ధాశ్రమంతో అనుబంధం కల్గిన వ్యక్తులు స్వామి విశుద్ధానంద, నారాయణ దత్తశ్రీమాలీ, దివ్యజ్ఞాన సమాజ స్థాపకురాలు మేడమ్ బ్లావెట్ స్కీ మొదలైన వారు - హిమాలయాలలోని ఆ రహస్య ప్రదేశానికి తాము వెళ్ళి వచ్చామని ఉద్ఘాటించారు.

బాబాజీ అనుగ్రహం వల్ల ఆనాడు శంకాచార్యుల వారు కూడా అక్కడి యోగుల సాన్నిహిత్యాన్ని పొందగలిగాడు. క్రీ.శ. 1407-1518 మధ్యలో జీవించిన కబీరు గొప్ప సాధువుగా కవిగా ప్రసిద్ధి చెందాడు. హిందువులు, మహమ్మదీయులు గౌరవించిన మహనీయుడు అతడు. ఇతడు కూడా బాబాజీ దగ్గర ఉపదేశం పొంది మహత్వాన్ని సాధించిన యోగి. బాబాజీయే ఈ విషయాన్ని చెప్పినట్లు పరమహంస యోగానంద తెలియచేశారు. కబీరు మరణం కూడా చాలా విశిష్టమైనది. హిందువులు, మహమ్మదీయులు ఎవరికి వారు తమ ఆచారాల ప్రకారం తమ గురువు యొక్క శవానికి సంస్కారాలు జరపాలని వాదులాడుకుంటూ ఉంటే చివరకు శవం మీద వస్త్రాన్ని తొలగించినపుడు, అక్కడ కబీరు శరీరం లేదు. కొన్ని పూలు మాత్రమే ఉన్నవి. వాటినే భక్తులు పంచుకున్నారు. బాబాజీ అనుగ్రహం వల్ల మహనీయుడై ప్రకాశించాడు కబీరు.

1828-1895 మధ్యకాలంలో జీవించిన శ్యామాచరణ్‌లాహిరీ మహాశయులు 1861 లో డెహ్రాడూన్ కొండలమీద బాబాజీ దర్శనాన్ని పొందారు. ఉద్యోగరీత్యా దూరప్రాంతం నుండి బదిలీ అయివచ్చిన లాహిరి సాయంకాలం విహారానికై కొండలమీద తిరుగుతూ వుంటే బాబాజీ దర్శన మిచ్చి ఒక గుహదగ్గరకు తీసుకు వెళ్ళాడు. ఆ పురాతన గుహలో దర్భాసనము జపమాల కమండలువు యోగదండము, మొదలైనవి ఉన్నవి. వీటిని గుర్తుపట్టగలవా అని బాబాజీ అడిగినపుడు 'లాహిరి' గుర్తుపట్టలేకపోయినాడు.

'అవన్నీ పూర్వజన్మలో నీవే'నని 'ఈ గుహలో నీవు తపస్సు చేశావ'ని బాబాజీ అతనికి చెప్పి హస్తమస్తక సంయోగము చేత పూర్వజన్మస్మృతిని కలిగించాడు. తరువాత ఆయన అనుగ్రహం వల్ల క్రియాయోగ దీక్ష పొంది నిమిత్త మాత్రమైన సాధనతో దివ్యశక్తుల నెన్నింటినో పొంది 'లాహిరి మహాశయుడు' అన్న పేరుతో గొప్పరాజయోగిగా క్రియాయోగ మార్గానికి జనకునిగా ప్రసిద్ధి చెందాడు.

క్రీ.శ. 1855 నుండి 1936 వరకు జీవించిన యుక్తేశ్వర్‌గిరి మహారాజ్ లాహిరి మహాశయుని శిష్యుడు. బాబాజీని భౌతికంగా మూడుసార్లు దర్శించినవాడు. బాబాజీ ఆదేశాన్ని అనుసరించి తన శిష్యులలో ముఖ్యుడైన యోగానందుని క్రియా యోగ ప్రచారానికి అమెరికా పంపించాడు.

క్రీ.శ.1893 నుండి 1952 వరకు జీవించిన యోగానంద పరమహంస యోగానంద పేరుతో జగత్ప్రసిద్ధుడై అమెరికా సంచారం చేసి లాసేంజలీస్‌లో తన ప్రధాన కేంద్రాన్ని స్థాపించి ప్రపంచం మొత్తం మీద వందకు పైగా క్రియాయోగసాధనశాఖలను స్థాపించాడు. ఆయన వలన కొన్ని వేల మంది ప్రభావితు లయినారు. శాన్‌ఫ్రాన్సిస్కోలో అమెరికన్ వృక్ష శాస్త్రవేత్త లూథర్ బర్‌బాంక్ యోగానంద వల్ల ప్రభావితులయిన వారిలో ఒకరు. గురుకృపకు ధ్యానశక్తికి నిదర్శనంగా అతడు నిర్మించిన ఉద్యానవనంలో ముళ్ళు లేని బ్రహ్మజెముడు పొద ప్రేక్షకులను ఆశ్చర్య పరుస్తుంది. యోగానంద మహాసమాధి లోకి వెళ్ళినపుడు 21 రోజులు దాటినా శరీరం చెడిపోలేదు. దానిని అలానే మందసంలో ఉంచి లాస్ ఏంజలిస్‌లో నిక్షిప్తం చేశారు. ఇటీవల నేను అమెరికాలో సంచారం చేస్తున్నప్పుడు ధ్యానంలో దర్శనమిచ్చి ఆ మహనీయుడు ఎంతో అభిమానాన్ని చూపించాడు.

క్రీ.శ. 1835 నుండి 1918 వరకు జీవించిన షిరిడిసాయిబాబా కూడా తన శిష్యుడేనని బాబాజీ చెప్పినట్లుగా స్వామి యోగానంద ఉల్లేఖించారు. భగవంతుని దివ్యానుగ్రహాన్ని పొందిన మహామహునిగా, కొన్ని లక్షల మంది ఇవాళ షిరిడి సాయిబాబాను ఆరాధిస్తున్నారు. ఆయన ఆలయాలు అసంఖ్యాకంగా నిర్మించబడ్డాయి.

ఇటీవలి కాలంలో మహావతార్ బాబాజీ దర్శనాన్ని తాము పొందామని ఆయన ఎన్నో విశేషాలు తమకుతెలియచేశారని తమిళ దేశీయులైన యోగి రామయ్య (మదరాసు) నీలకంఠన్ (కలకత్తా) తెలియచేశారు. భయంకర వ్యాధిపీడితులైన వీరిద్దరూ బాబాజీ అనుగ్రహం వల్ల ఆరోగ్యం పొంది ఆయన క్రియాయోగ మార్గాన్ని ప్రచారం చేయటానికి తమ జీవితమంతా సమర్పణ భావంతో శ్రమించారు.

బాబాజీ ఆశ్రమం బదరీనాథ్ దగ్గర హిమాలయాలలో ఏర్పాటు అయింది. దానికి గౌరీశంకర పీఠమని పేరు. పర్వత శిఖరాల మధ్య రెండు జలపాతాలు అలరారు తుండగా అక్కడ ఉన్న గుహలలో ఆశ్రమవాసులు నివసిస్తూంటారు. బాబాజీ సోదరి 'మాతాజీ నాగలక్ష్మీదేవి.' ఆమె కూడా గొప్పయోగిని. ఆశ్రమ నిర్వహణ అంతా ఆమె చూస్తూంటుంది. ఆమె రోజూ తులసీ పూజ చేస్తుంది. ఆమె ఇష్టపడి చేసేది బాబాజీ పాదపూజ. ఆశ్రమంలో ఉండేవారి సంఖ్య చాలా పరిమితం. అక్కడ ఉన్నవారిలో మహమ్మదీయులు క్రైస్తవులూ కూడా ఉన్నారు. ఇవాళ వారు మహమ్మదీయులో క్రైస్తవులో ఇక్కడకు వచ్చినపుడు అయి ఉండవచ్చు. ఈ శరీరంలో వారు చేసిన తపస్సు, త్యాగము, పూర్వజన్మలలో చేసిన సాధన బాబాజీతో ఉన్న అనుబంధాలు వారిని ఇక్కడకు తీసుకు వచ్చినవి. తపస్సు, దివ్యత్వము కులమతాలకు అతీతమయినవి. వారిలో స్వామి ప్రణవానంద కూడా ఒకరు. ఈయనను గూర్చి పరమహంస యోగానంద తన గ్రంథంలో వివరించి ఉన్నారు. ఈయన భౌతిక శరీరాన్ని విడచి పెట్టి కొంతకాలానికి పునర్జన్మ పొంది యౌవనంలోకి వచ్చిన తరువాత పూర్వజన్మ స్మృతిని పొంది, మృత్యువు లేని తన గురువు కోసం హిమాలయాలలో అన్వేషించాడు. తన శిష్యుని అనుగ్రహించ దలచిన బాబాజీ దర్శనమిచ్చి తన ఆశ్రమంలోకి చేర్చుకున్నారు.

యోగానంద - బాబాజీని గూర్చి చాలా విశేషాలు తెలియచేశాడు. అందులో ఒకటి కాశీలోని దశాశ్వమేధ ఘట్టంలో భూగుహలో నివసిస్తున్న మాతాజీ నాగలక్ష్మి దేవి దగ్గరకు ఒక నిండు పున్నమివేళ బాబాజీ వచ్చాడు. అక్కడకు వచ్చి దర్శనం చేసుకోవడానికి లాహిరి మహాశయునకు

రామగోపాల్‌వర్మ అనే యోగికి మాత్రమే అనుమతి ఇవ్వబడింది. ఆ సమావేశంలోని విశేషాలను తెలియచేస్తూ ఈ భౌతిక శరీరాన్ని విడిచిపెట్టి ఈ భూమితో అనుబంధాన్ని వదిలి దివ్యభూమికలలోకి పూర్తిగా వెళ్ళిపోదామని మనస్సులో వస్తున్న ఆలోచన బాబాజీ వెల్లడించగా అర్హులైన సాధకులకు సహాయం చేయడానికి ఇక్కడే ఈ శరీరం తోనే ఉండమని అందరూ ప్రార్థించారు. అందులోనూ మాతాజీ ప్రత్యేకంగా "బాబాజీ! మీది సిద్ధ శరీరం, దివ్యశరీరం. భూమి మీద కాని ఇతర దివ్యలోకాలలో గాని సంచరించడానికి మీకు ఎటువంటి ఆటంకమూ లేదు. ఈ కలియుగానికి మీ వంటి మహాత్ముల అవసరం ఎంతయినా ఉంది. మీ ఇచ్ఛకు, సంచారానికి, సంకల్పానికి, ఈ శరీరం ఏ విధంగానూ ఆటంకం కల్గించనపుడు దీనిని విడిచి పెట్టవలసిన అవసరమేమున్నది. దయచేసి ఈ శరీరాన్ని నిలిపి ఉంచండి" అని భక్తితో వేడుకొన్నది. బాబాజీ ఆలోచనా పూర్వకంగా ఒక్క క్షణమాగి వారి కోరికను అంగీకరిస్తున్నట్లు తెలిపారు.

హిమాలయాలో జరిగిన మరొక దృశ్యాన్ని కూడా యోగానంద వర్ణించారు. ఒక సాధకుడు ఆ అరణ్య పర్వత ప్రదేశాలలో బాబాజీని వెతుక్కుంటూ అతికష్టం మీద ఆయన సన్నిధికి చేరుకున్నారు. ఎంతో కాలం నుంచి కష్టపడి ఎంతో దూరం నుంచి శ్రమపడి బాబాజీని అన్వేషిస్తూ, చివరకు చేరుకోగలిగానని కొండ శిఖరపు అంచున శిష్యులతో కలిసి ఉన్న వారిని దర్శించ కలిగానని తనని శిష్యునిగా స్వీకరించవలసినదని ప్రార్థించాడు. బాబాజీ అంగీకరించలేదు. కఠినంగా మందలించి తిరిగి వెళ్ళిపొమ్మని ఆదేశించాడు. మీరు శిష్యునిగా నన్ను స్వీకరించకపోతే ఈ కొండ శిఖరం మీద నుంచి దూకి చచ్చిపోతానన్నాడు ఆ సాధకుడు. "నేను అంగీకరించను. దూకితే దూకు. నీ ఇష్టం" అన్నాడు బాబాజీ. అతడు వెంటనే ఏమీ ఆలోచించకుండ ఆ శిఖరం నుండి క్రిందకు దూకేశాడు. శరీరం ఛిన్నాభిన్నమై అతడు మరణించాడు. బాబాజీ నిశ్చలంగ ఒకసారి చూసి తన శిష్యులతో 'కిందపడి మరణించిన అతని శరీరాన్ని తీసుకురండి" అన్నాడు. వాళ్ళు గబగబా వెళ్ళి ఆ మృతదేహాన్ని తెచ్చి బాబాజీ ముందుంచారు. బాబాజీ

దానివైపు చూచి ఒకసారి స్పర్శించి 'సాధకుడా! లే ! ఇప్పుడు నీకు యోగ్యత వచ్చింది. నిన్ను శిష్యునిగా స్వీకరిస్తున్నాను" అన్నాడు. ఆ క్షణం నుంచి ఆ శిష్యమండలిలో అతడూ ఒకడయినాడు.

మహావతార్ బాబా గురించి ఇటువంటి కథలెన్నో దేశంలో వ్యాపించి యున్నవి. నాకు తెలిసిన ఒకరిద్దరు సాధకులు భౌతికంగా బాబాజీ తమకు దర్శన మిచ్చారని తమతో మాట్లాడారని చెప్పిన సందర్భాలు ఉన్నాయి. కిందటి సంవత్సరం నేను చాతుర్మాస్యంలో ఉన్నపుడు కుర్తాళ సిద్ధేశ్వరీ పీఠానికి వచ్చి దర్శనాన్ని అనుగ్రహించా డా మహాపురుషుడు. ఆయన చిన్నప్పటి సాధన క్షేత్రం కదా! యిది. మౌనస్వామితో ఉన్న అనుబంధం, నామీది కృప హేతువులై వారిక్కడకు రావటం జరిగింది.

## ౨౦. మిలారేపా



మిలా అంటే ఓ మనిషీ అని, రేపా అంటే నూలు వస్త్రాలు ధరించేవాడు అని అర్థం. అతని వంశంలో అయిదు తరాల ముందున్న వ్యక్తి గొప్ప మంత్రవేత్త. ఎవరికీ లొంగని ఒక దయ్యాన్ని భూతగ్రస్తుని నుండి వెళ్ళగొడితే ఆ దయ్యం మిలా ! మిలా! అంటూ వదలిపోయింది. అప్పటి నుండి ఆ మాంత్రికుని మిలా! అని పిలిచేవారు. అంతేకాదు. ఆ వంశంలోని వారందరికి పేరు చివర మిలా కలిపి ఉచ్చరించేవారు.

మిలాషరాబ్ గ్యాల్టిస్ (తండ్రి) – కాల్మోయస్ (తల్లి) దంపతులకు 25.8.1052 సంవత్సరంలో మిలా రేపా పుట్టాడు. తర్వాత నాలుగేండ్లకు

డోంగ్‌యిట్ అనే చెల్లెలు పుట్టింది. ఆ అమ్మాయిని మీటా అని పిలిచేవారు. వాళ్ళు సంపన్నులు జమీందార్లు. అయితే తండ్రి ఇతనిచిన్నతనంలోనే మరణించగా పినతండ్రి ఆస్తి ఆక్రమించుకొన్నాడు. ఇతడు – ఇతని తల్లి, చెల్లెలు దయనీయమైన దుర్దశపాలైనారు. దారుణమైన పేదరికం. ఎవరిచేత చెప్పించినా, ఎంత బ్రతిమిలాడినా వినలేదు సరికదా – పినతండ్రి, పినతల్లి వీరిని ఘోరంగా హింసించారు. నిస్సహాయులై కష్టాల పాలైన వీరిని చూచి అందరూ సానుభూతి చూపేవారే గాని ధనము, అధికారము, బలగముగల పినతండ్రిని చూచి భయపడి సహాయపడగలిగేవారు కాదు.

మిలారేపాకు 15 సం॥ వయస్సు వచ్చిన తర్వాత తల్లి యింటి పరిస్థితిని వివరించి పగదీర్చుకోమని ఒత్తిడి చేసింది. బలవంతుడైన అతని పినతండ్రిని ఎదుర్కొని ఆస్తిని వశం చేసుకోవటం సాధ్యం కాదు కనుక క్షుద్రవిద్యలు నేర్చుకొని శత్రువుల నాశనం చేయమని ప్రబోధించింది. అలా చేయకపోతే ఆత్మహత్య చేసుకొంటానని బెదిరించింది. ఆ స్థితిలో ఆమె చెప్పింది అంగీకరించక తప్పలేదు.

ఆ ప్రాంతంలో అటువంటి విద్యలు నేర్పే గురువు దగ్గరకు వెళ్ళి ఆయనకు సేవ చేసి తన పరిస్థితిని వివరించి ప్రయోగాలు చేయటం నేర్పమన్నాడు. ఆ గురువు ఇతని ఊరికి మనుషులను పంపి విచారించి మిలారేపా చెప్పింది సత్యమని తెలుసుకొని పగతీర్చుకోవటంలో తప్పులేదని భావించి తన దగ్గర ఉన్న క్షుద్రవిద్యలు నేర్పాడు. అయితే తాను కోరింది సాధించటానికి అవి చాలవని భావించి మిలారేపా ప్రార్థిస్తే తీవ్రవిద్యలు ఇంకా ఎక్కువ సాధించిన తన పూర్వవిద్యార్థి దగ్గరకు ఇతనిని పంపి కావలసిన విద్యలు నేర్చుకొనేలా చేశాడు. ఇప్పుడు మిలారేపా వడగండ్ల వానలను సృష్టించి పంటలు నాశనం చేయగలడు. ఇండ్లు కూల్చగలడు. మనుషులను చంపగలడు. దూరం నుండే ఎవరినైనా నాశనం చేయగలడు.

ప్రత్యేకంగా ఈ విద్యనేర్చుకోవటం కోసం ఒక గుహలో 15 రోజులు కఠోరంగా ధ్యానం చేశాడు. భయంకరమైన దేవత సాక్షాత్కరించి 35 ఖండిత శిరస్సులను అతని ముందు పడేసింది. మర్నాడు ఉదయం విద్యాగురువు

ఇంకా నీ శత్రువులిద్దరున్నారు. వారిని కూడా చంపుతావా ! అని అడిగాడు. లేదు వారు నా పినతండ్రి, పినతల్లి. వారిని చంపటం కాదు. బిడ్డలు, కుటుంబసభ్యులు, బంధుమిత్రులు మరణించి ఆస్తిపోయి దిక్కులేక వారు బాధపడాలి. అందువల్ల వాళ్ళు బ్రతికి ఉండాలని మిలారేపా అన్నాడు.

పినతండ్రి పెద్దకొడుకుకు పెండ్లి. ఆరోజు చుట్టాలంతా చేరుకొన్నారు. ఆ సమయాన్ని మిలారేపా ఎన్నిక చేసుకొని పెండ్లి పందిళ్ళు కనిపించేటంత దూరంలో ఉండి క్షుద్రప్రయోగం చేశాడు. అప్పుడు విచిత్రం జరిగింది. బావిలో నీళ్ళు తోడుకొని పోవటానికి వచ్చిన పనిమనిషికి గుర్రపుశాలలో గుర్రాలబద్దులు, సాలెపురుగులు, తేళ్ళు, పాములు కనపడ్డవి. ఆమె భయంతో పెద్దగా కేకలు పెట్టింది. గుర్రాలు బెదిరిపోయి అటూ ఇటూ త్రోసుకొంటున్నవి. ఒక గుర్రపు తాకిడికి పందిరి స్తంభం పడిపోయింది. పైకప్పు కూలిపోయింది. 35 మంది మరణించారు. ఇల్లంతా ధ్వంసమైంది. తల్లి పగతీరి సంతోషంతో పొంగిపోయింది.

కొద్ది రోజుల తర్వాత తమకు అపకారం చేసిన గ్రామస్థుల పొలాలలో పంటలు బాగా పండినపుడు వడగండ్ల వాన కురిపించి వాటిని నాశనం చేశాడు. దానితో పగ పూర్తిగా తీరిపోయింది.

ఈ విద్యలు నేర్పిన గురువు దగ్గరికి వెళ్ళి కృతజ్ఞత చెప్పాడు మిలారేపా. అయితే అప్పటికాయన మనస్థితి మారిపోయింది. ఆప్తుడైన మిత్రుడొకడాయన చేతులలో మరణించాడు. ప్రపంచము యొక్క అస్థిరత్వము అశాశ్వతత్వము మనసులో మెదలినవి. క్షుద్రశక్తుల సహాయంతో ఎంతోమంది వినాశనానికి తాను కారకుడైన అంశం వేదన కలిగించింది. తానేకాక తన శిష్యులు కూడా ఎందరికో అపకారం చేశారు. ఆ పాపంలో కూడా తనకు భాగం వస్తుంది. ఇలా బాధపడుతున్న సమయంలో మిలారేపా వచ్చాడు. ఆ గురువు శిష్యునితో ఇలా అన్నాడు. తోపగా ! అంటే శ్రావ్యమైన కంఠస్వరం కలవాడు అని అర్థం. అతని తల్లిదండ్రులు పెట్టిన పేరది "తోపగా ! ఇటీవల నా స్నేహితుని మరణంతో జీవితాల అశాశ్వతత్వం నన్ను కదిలించి వేసింది. ఈ లోకమంతా దుఃఖభరితం. నేను ఎన్నో పాపాలు చేశాను. నీ వంటి వారు చేయటానికి

కారకుడినైనాను. ఈ దోషం పోవాలంటే సద్గురువుల సన్నిధిలో దైవసాధన చేయాలి. వైరాగ్యంతో, జ్ఞానశక్తితో తపస్సు చేయాలి.

అందుకని ఇక్కడి విద్యార్థుల బాధ్యత, కుటుంబ పోషణ బాధ్యత నీకు అప్పగించి నేను సత్యాన్వేషణలో సద్గురువుల సన్నిధికి వెళ్ళిపోతాను. అయితే నేను వృద్ధుడనైనాను. ఎంతవరకు అనుకొన్నది సాధించగలనో తెలియదు. లేదా నీవు నా శిష్యునిగా ఒక పని చెయ్యి. నేను దేనిని కోరుతున్నానో దానిని నీవు సాధించు. దైవానుగ్రహం పొంది పాపపంకిలమైన మన జీవితాలను ప్రక్షాళన చేయి. నిన్ను నీవు రక్షించుకో. నన్ను కూడా రక్షించు".

మిలారేపా తానే వెళ్ళి సద్గురువులను అన్వేషించి అనుకొన్నది సాధిస్తానని మాట యిచ్చి బయలుదేరాడు. ఎందరినో కలిసి ఎంతోదూరం ప్రయాణాలు చేసి చివరకు మార్పా అనే లామా దగ్గరకు చేరుకొన్నాడు. ఆయన నరోపా అనే భారతదేశ యోగి శిష్యుడు. నిజంగానే మహాత్ముడైన యోగి. ఆయన పాదాలపై బడి ఏమీ దాచుకోకుండా తాను చేసిన పాపాలన్నింటిని చెప్పి తనను ఉద్ధరించవలసిందిగా ప్రార్థించాడు.

మార్పా ఇతనిని శిష్యునిగా స్వీకరించాడు. అయితే ధ్యేయాన్ని పొందానికి కావలసిన ఉపదేశం మాత్రం ఇవ్వలేదు. ఎన్నో కఠోరమైన పరీక్షలకు గురిచేశాడు. కష్టమైన పనులెన్నో చేయమనేవాడు. తన కోసం ఒక్కడినే ఇల్లు కట్టమన్నాడు. సగం కట్టిన తరువాత నచ్చలేదు. కూల్చి వేయమనేవాడు. ఇలా ఎన్నోసార్లు కట్టించటం కూల్చి వేయించటం జరిగింది. ఇలాగే ఏదో మిషతో తిట్టడం, కొట్టడం, తన్నటం ఎన్నోసార్లు జరిగినవి. బరువులు మోయటంలో శరీరం దెబ్బలపాలైంది. గురుపత్ని ఇతని యందు దయతో చాలాసార్లు సహాయం చేసింది. కాని మార్పా ఏ మాత్రం మారలేదు సరికదా మరింత కఠినంగా వ్యవహరించాడు. తన క్షుద్రప్రయోగాల వల్ల ఎందరికో అపకారం జరిగి ఆ పాపం చుట్టుకోవటం వల్లనే తనకీ స్థితి వచ్చిందని మిలారేపా విశ్వాసం. ఈ శిక్షల చేత ఆ పాపం పోతుందని, ఎప్పటికైనా గురువుగారు కరుణిస్తారని ఇతని నమ్మకం. కానీ రోజురోజుకు ఆ నమ్మకం సడలిపోవటం మొదలైంది. ఒకటి రెండుసార్లు దూరంగా వెళ్ళి గూడా

ఇటువంటి కఠినపరీక్షలకు నిలవాలనిపించి మళ్ళీ తిరిగివచ్చాడు. కానీ గురుకృప కలగలేదు. చివరకు గురుపత్ని సహాయంతో మధ్య టిబెట్‌లో ఉన్న గోగ్‌డన్ అనే మార్పా శిష్యుని దగ్గరకు వెళ్ళిపోయినాడు. గోగ్‌డన్ మిలారేపా భవిష్యత్తులో గొప్ప సిద్ధుడవుతాడని గ్రహించి ఆదరించి ఆశ్రయమిచ్చాడు. దివ్యోపదేశం ఇవ్వటానికి అంగీకరించినా తన శిష్యులకు బాధలు గలిగించే దారి దొంగలను, గొర్రెల కాపర్లను శిక్షించమన్నాడు. మిలారేపా ఒక పేద వృద్ధురాలి పొలాన్నిమాత్రం కాపాడి మిగిలినవారి పొలాలను వడగండ్ల వాన కురిపించి నాశనం చేశాడు. దొంగలను మంత్రశక్తితో చంపేశాడు. అయితే ఆ ప్రయోగం వల్ల ఆ ప్రాంతంలోని పక్షులు కూడా మరణించినవి. ఇంకా పాపం మరింత మూటగట్టుకొన్నానని బాధపడ్డాడు. గోగ్‌డన్ దగ్గరకు వెళ్ళి జరిగిన సంగతి చెప్పగా చనిపోయిన పక్షుల నాయన బ్రతికించాడు. ఈ గురువు బుద్ధత్వాన్ని సాధించిన మహనీయుడన్న విశ్వాసం కుదిరింది మిలారేపాకు.

చివరకు గోగ్‌డన్ మిలారేపాకు ఉపదేశం ఇచ్చాడు. మిలారేపా ఒక గుహలో ప్రవేశించి ఆహారానికి చిన్న సందుంచి మిగతా భాగం మూసేసి ధ్యానం మొదలు పెట్టాడు. ఎన్నాళ్ళున్నా దివ్యానుభూతి రాలేదు. ఇంతలో గురుమార్పానుండి తన నూతన గృహప్రవేశానికి, కుమారుని ఉపనయనానికి రమ్మని గోగ్‌డన్‌కు ఉత్తరం వచ్చింది. అందులో ఆ వెధవ "తోపగ" అక్కడ ఉంటే తీసుకురా ! అని కూడా ఉంది. అప్పుడు గురువుగారి అనుమతి లేక ఇతడు వచ్చాడని, అందువల్లనే సాధన ఫలించలేదని గోగ్‌డన్ గ్రహించాడు. గురువుగారి ఆజ్ఞ ప్రకారం తోపగాను తీసుకొని అతడు దూరప్రయాణాలు చేసి చివరకు గురుగృహం చేరాడు. అప్పుడు కూడా మిలారేపాకు చీవాట్లు తప్పలేదు. ఈ విధంగా ఎన్నో కఠినాతి కఠిన పరీక్షలు జరిగిన తర్వాత మార్పా ఇన్నాళ్ళ పరీక్షకు కారణం వివరించాడు. మిలారేపా చేసిన పాపాలను నాశనం చేయటానికే ఇలా చేయవలసి వచ్చిందని ఇంకా చాలా కొద్ది పాపం మాత్రమే మిగిలి ఉన్నదని అది సాధనవల్ల పోతుందని చెప్పి చివరకు దివ్యోపదేశాన్ని ప్రసాదించాడు. ఒక గుహ ఏర్పాటు చేసుకొని దానిలో 11 నెలలు తీవ్ర నిష్ఠతో ధ్యానం చేశాడు. మధ్యమధ్యలో కొద్దిపాటి ఆహారం

అతనికి ఇవ్వబడేది. గురుకృపవల్ల అతనికి దివ్యానుభూతులు కలగటం మొదలైంది. భారతదేశంలో తిలోపా గురువరులనుండి నరోపా, అతని నుండి మార్పా గ్రహించిన దివ్య విద్యలను మిలారేపా గురుకృపవల్ల పొందగలిగాడు. సాధన సమయంలో అతనికి ఎన్నో స్వప్నానుభవాలు కలిగి దివ్యజ్ఞానాన్ని అందుకోగలిగాడు. తర్వాత కొంతకాలానికి మార్పా శరీరాన్ని విడిచిపెట్టాడు. ఇంక లౌకికమైన బంధాల నన్నింటిని వదలి కఠోర తపస్సులో మునిగిపోయినాడు మిలారేపా. ఆహారం లేక తన ధ్యాన గుహ దగ్గర ఉన్న ఆకుపచ్చని ఆకుల నుడికించుకొని తినేవాడు. కొన్నాళ్ళ కతని శరీరం కూడా ఆకుపచ్చ రంగుకు మారిపోయింది. ఎప్పుడో కొన్నిసార్లు అతని చెల్లెలు ఆహారపదార్థాలు తెచ్చి యిచ్చేది. మొత్తం మీద ఆకులే ఆహారంగా ఎక్కువ కాలం గడిపాడు.

చివరికతడు మనిషికాడేమో ఏదో జంతువో, పిశాచమో అన్నట్లుగా శరీరం వికృతంగా మారిపోయింది. ఒకసారి దొంగలటువైపు వచ్చి దోచుకోవటానికి ఇతని దగ్గర ఏమీ లేకపోవటం చూచి దుష్ప్రవృత్తివల్ల హింసించారు. అయితే ఆ పాపం వారికి భయంకర ఫలితాన్ని యిచ్చింది. వేరే కారణం వల్ల ఆ ప్రాంతపు రాజు వీరిని పట్టుకొని దారుణంగా శిక్షించాడు.

నెలలు, సంవత్సరాలు నిరంతరం ధ్యానం చేస్తూ ఉండటం వల్ల ఆకాశ గమనాది దివ్యశక్తులెన్నో మిలారేపాను వరించినవి. ఒకరోజు ఆకాశంలో ఎగురుతూ పోతూ ఉంటే అతని చిన్నప్పటి గ్రామస్థులు గుర్తుపట్టారు కూడా. విశేషించి ఏ రూపాన్ని కావాలంటే ఆకృతిని ధరించగల కామరూపశక్తి లభించింది. మరొక ప్రధానమైన అంశం మిలారేపా గొప్ప గాయకుడు, కవి. ఆధ్యాత్మికమైన పాటలు ఒక లక్ష దాకా రచించాడు.

ఒకనాడొక శిష్యుడు గురువుగారూ ! మీరింత మహాత్వ పరిపూర్ణులైనారంటే ఈ జన్మలోని సాధన మాత్రమే అనుకోలేక పోతున్నాను. క్రిందటి జన్మలోనే బుద్ధత్వము పొందిన మహనీయులై ఉండాలి. మీ పూర్వజన్మఏమిటో తెలుసుకోవాలని కుతూహలంగా ఉంది. దయచేసి చెప్పండి అని ప్రార్థించాడు. దానికి సమాధానంగా మిలారేపా "నా పూర్వజన్మ నాకు

తెలియదు. చాలామంది మహితాత్ములను చూచి పూర్వజన్మలో బోధిసత్వులై ఉంటారని భావిస్తుంటారు. గురుకృపవల్ల ఈ జన్మలోని సాధనవల్లనే ఆ స్థితిని సాధించవచ్చు. తినటానికి తిండి, కట్టుకోటానికి గుడ్డ, ఉండటానికి ఇల్లు, కీర్తి, కాంక్ష - ఇవేమీ నాకుపట్టలేదు. ఏకాంతవాసం, కఠోరధ్యానం ఇవే నాకు ఉన్నతస్థితిని తెచ్చిపెట్టినవి. నాకున్న ఒకే ఒక గొప్ప అదృష్టం సద్గురువును పొందగలగటం. తీవ్రమైన పట్టుదల ఉంటే మహనీయుడైన గురువు తప్పక లభిస్తాడు. సంవత్సరాల తరబడి ఒంటరిగా గుహలలో ధ్యానం చేశాను. తత్ఫలితంగా ఎందరో దేవతల సిద్ధుల దర్శనం కలిగింది. ఎన్నో అద్భుత శక్తులభించినవి. ఉత్తమలోకాలలో ఉన్న మానవాతీత జీవులు కొందరు శిష్యులయినారు. ఆ తర్వాతనే మీవంటి మానవుల దగ్గరికిచేరాను" అన్నాడు. మిలారేపా ఖ్యాతి దశదిశలా ప్రాకింది. ఎక్కడెక్కడోనుండో యోగులు వారి దర్శనానికి వచ్చేవారు. భారతదేశం నుండి మహాయోగి ధర్మబోధి వంటివారు వచ్చి పాద నమస్కారాలు చేసేవారు. రేచుంగ్ అనే కుష్టువ్యాధిగ్రస్తుడు మిలారేపా కృపవల్ల రోగం పోయి ఆయనకు ప్రధాన శిష్యుడయినాడు.

తర్వాత అతడు గురువుగారి జీవితచరిత్ర రచించాడు. మిలారేపా నేపాల్, టిబెట్ ప్రాంతాలలో ఎన్నోసార్లు సంచారం చేశాడు. గడ్డకట్టుకుపోయే చలిలో కూడా మామూలుగా తిరిగేవాడు. ప్రకృతిని జయించిన మహాయోగి అతడు.

(1) మౌనస్వామి నైమిశారణ్యంలోని బారాబంకీ గుహలలో నివసించే వెంకటాచలయోగి - వ్యాసశిష్యుడైన సుమంతుని సంప్రదాయంలో అథర్వణ మంత్రాలను నేర్చినవాడు దిగంబరుడై శీతోష్ణములను జయించి సంచరించేవాడని చెప్పియున్నారు.

2) మహాత్మాగాంధీ ఇంగ్లాండు వెళ్ళినప్పుడు తెల్లవారుజామున లేచి థేమ్సునదిలో స్నానం చేస్తే అది పెద్దవార్తగా పేపర్ల కెక్కింది. దుర్భరమైన చలిని తట్టుకొన్నాడు గాంధీ.

3) హిమాలయాలలో కౌపీన మాత్రధారులై తిరిగే ఇటువంటి యోగులను గురించి ఎన్నో గ్రంథాలలో వ్రాయబడి ఉంది)

ఆయన వ్రాసిన ఒక పాటలో ఒక మంత్రవేత్తతో జరిగిన యుద్ధం గూర్చి వ్రాయబడింది. అద్భుతమైన సంఘటన అది. ఆ ప్రాంతంలో బాగా ప్రచారంలో ఉన్న బోన్పా మత ప్రచారకుడు నారోబోన్‌ఛున్ కైలాసపర్వత, మానస సరోవర ప్రాంతంలో ప్రసిద్ధుడైన మతగురువు. విశేషించి గొప్ప మంత్రసిద్ధులుకలవాడు. మిలారేపా శిష్యులతో వెళ్ళినప్పుడు వారిద్దరి మధ్య వాద ప్రతివాదాలు జరిగినవి. అనాదికాలం నుండి అక్కడ నివసిస్తూ ఉన్నాము. గనుక ఆ ప్రదేశమంతా తమదేనని తమ అనుమతిలేకుండా ఇతరులు ఉండటంగాని మరో మతప్రచారం చెయ్యటం గాని వీలులేదని బోన్‌ఛున్ దృఢంగా అన్నాడు. ఉన్నత హిమశైలము తమ మత ప్రధాన కేంద్రం కాగలవని బుద్ధదేవుడు చెప్పినట్లు గ్రంథాలలో ఉన్నది గనుక తమకు అధికారం ఉన్నదని మిలారేపా గట్టిగా వాదించాడు. ఇది వాదాలతో మాటలతో తేలేది కాదు గనుక మంత్రశక్తుల పోటీలో నిర్ణయించవలసిందే అని ఇరుపక్షాల వారూ నిర్ణయించారు.

ఇక మంత్రయుద్ధం మొదలైంది. బోన్‌ఛున్ తన శరీరాన్ని పెంచి మానస సరస్సుకు రెండు వైపులా రెండు కాళ్ళు పెట్టి ఆకాశమంత ఎత్తు పెరిగి మొత్తం ఆక్రమించాడు. మిలారేపా వెంటనే బోన్‌ఛున్ పైన ఎగురుతూ గగనమంతా అతనిని మించి ఆవరించాడు. అంతటితో ఆగక సరస్సు మొత్తాన్ని తన అంగుష్ఠపు (బొటన వ్రేలి) అంచుమీద నిలిపి చూపించాడు. ఆ తర్వాత కైలాసగిరి మీద సంఘర్షణ జరిగింది. శిలా సంగ్రామము, పాశయుద్ధం (టగ్ ఆఫ్ వార్) వంటివి జరిగినవి. అన్నింటిలో బోన్‌ఛున్ ఓడిపోయినాడు. ఇప్పటికీ అక్కడి ధోల్మాలా కొండమీద, కైలాసపరిక్రమ మార్గంలో వారి పోరాటపు చిహ్నాలు కనిపిస్తున్నవి.

చివరకు పూర్ణిమ నాడు సూర్యోదయ సమయంలో ఎవరు కైలాస పర్వతాన్ని ముందు ఎక్కగలరో వారు గెలిచినట్లు పందెం. బోన్‌ఛున్ తన డోలుమీద ఎక్కి శైలాగ్రం చేరుకుంటున్నాడు. అతని శిష్యులు విజయోత్సాహంతో కేరింతలు కొడుతున్నారు. మిలారేపా శిష్యులు దిగాలు పడి చూస్తూ గురువుగారిని ప్రార్థన చేశారు. ఆయన ఏమీ కంగారుపడలేదు. ఆదుర్దా

చెందలేదు. ప్రశాంతంగా ధ్యానం చేస్తున్నాడు. ఇంతలో ఒక అద్భుతం జరిగింది. బోన్‌ఛున్ శిఖరం చేరకుండానే ఆగిపోయినాడు. పైకి ఎగరలేకపోతున్నాడు. మిలారేపా ఉన్నట్లుండి ఆకాశమార్గంలో కైలాసపర్వతాగ్రం మీద ఉన్నాడు. బోన్‌ఛున్ తన మంత్ర ఢక్కమీద నుండి క్రిందపడిపోయినాడు. ఓటమి నంగీకరించి బోన్‌ఛున్ తానూ, తన శిష్యులు ఉండటానికి ఏదైనా కొంతస్థలం కేటాయించవలసిందిగా ప్రార్థించాడు. మిలారేపా పిడికెడు మంచు తీసి మానవసరస్సు వైపు విసిరితే అది ఒక శిఖరం మీద పడింది. ఆ ప్రదేశంలో బోన్‌ఛున్ మఠం నిర్మించుకొని తన శిష్యులతో నివసించాడు. ఆ బోన్సామతం కాలక్రమాన బౌద్ధమతంగా మారిపోయింది.

ఈ విధంగా మహా మహిమాన్వితునిగా మిలారేపా ప్రకాశిస్తూ ఉన్న కాలంలో బ్రిస్ అనే ప్రదేశంలో ఆయన ఉన్నప్పుడు స్థానికంగా ప్రసిద్ధుడైన సాకు వాగేష్ అనే విద్వాంసుడు ఈర్ష్యతో అపకారం తలపెట్టాడు. తన ఉంపుడు కత్తెకు ధనాశ చూపించి విషం కలిపిన పెరుగును ఇమ్మని పంపాడు. ఆమె ఆ పెరుగును కానుకగా సమర్పించింది. మిలారేపా "ఇప్పుడు కాదు. కొద్దిరోజుల తర్వాత రా! అని పంపివేశాడు. ఈ లోపుగా తాను జీవితంలో చేయవలసిన పనులు పూర్తి అయినవని శరీరాన్ని విడిచిపెట్టవలసిన సమయం వచ్చిందని మిలారేపా గ్రహించాడు. కొన్నాళ్ళకు గేష్‌మళ్ళీ ఇంకా ఎక్కువ ఆశపెట్టి వేశ్యను పంపాడు. ఈ సారి విషయం కలిపిన పెరుగును తీసుకొని తనకు తెలిసే తీసుకుంటున్నానని గేష్ ఇచ్చిన మణిధనంతో సుఖంగా ఉండమని ఆశీర్వదించి పంపించాడు. ఆమె పశ్చాత్తాపంతో వెళ్ళిపోయింది.

తాను శరీరత్యాగం చేస్తున్నానని శిష్యులందరికీ మిలారేపా తెలియచేశాడు. మధురాతిమధురంగా తాత్త్వికమైన పాట పాడుతూ ఆయన ప్రాణత్యాగం చేయబోతున్నాడు. అప్పుడు విషప్రయోగం చేయించిన గేష్ వచ్చి "మీరు మహిమాన్వితులు గదా ! మీరు మృత్యువును ఆపుకోవచ్చు. లేదా దానిని ఎవరికైనా మార్పిడి చేయవచ్చుగదా!" అని ఆక్షేపణగా అన్నాడు. దానికి నవ్వి మిలారేపా "మృత్యువు నా యిచ్ఛవల్ల వచ్చింది. విషప్రయోగం

నిమిత్తమాత్రం" అన్నాడు. "మీకు చేతనైతే ఆ బాధను నా మీదకు పంపండి" అన్నాడుగేష్. "కొంత భాగం పంపుతాను చూడు" అన్నాడు మిలారేపా వెంటనే గేష్ క్రిందపడి గిలగిలకొట్టు కుంటూ బాధతో ఆక్రోశించటం మొదలుపెట్టి కాపాడమని ప్రార్థించాడు. అప్పుడు మిలారేపా ఆబాధను ఆపివేశాడు. గేష్ తాను చేసిన మహాపాపాన్ని స్వయంగా అంగీకరించి ఏడవటం మొదలు పెట్టాడు. కరుణామయుడైన మిలారేపా అతనిని క్షమించాడు. చివరకు మానవజాతిమీద అనంతమైన దయను చూపిస్తూ గుండెలు కదిలించే ఒక పాట పాడుతూ 84 సంవత్సరాల వయస్సులో క్రీ.శ. 1135 జనవరిలో మిలారేపా నిర్యాణం చెందాడు.

శిష్యులందరూ వచ్చారు. కానీ ముఖ్య శిష్యుడైన రేచుంగ్ సమయానికి రాలేకపోయినాడు. ఆలస్యమైంది. అతడు వచ్చేసరికి శవదహనం ప్రారంభమైంది. అతనెవరో తెలియక మిగతావారతనిని దగ్గరకు రానివ్వలేదు. కానీ ఇంతలో మహాద్భుతం జరిగింది. మంటలలో కాలుతున్న మిలారేపా శరీరం లేచి కూర్చుని రేచుంగ్‌ను పిలిచి ఆశీర్వదించటం కనీవినీ ఎరుగని దృశ్యం. చివరిగా ఆయన ఇలా అన్నారు "నేనిప్పుడు ధర్మకాయం ధరిస్తున్నాను. ఇది శాశ్వతమైనది. దేవతలు కూడా అర్చించే యీ దివ్యశరీరంతో నేను సాధకులను అనుగ్రహిస్తుంటాను."

అనంతరం ఎందరికో అపూర్వమైన దర్శనానుభూతులు కలిగినవి. ఆయన స్పర్శించి ఉంచిన ఒక వస్త్రము, చక్కెర గడ్డ అక్షయంగా ఎందరు జనులను పంచినా ఇంకా తరగకుండా చాలాకాలం ఉంది. ఆయనను స్మరించిన వారికి వ్యాధులు నయమయ్యేవి. ప్రతి యేడూ ఆయన శరీరం విడిచి పెట్టిన రోజు శిష్యులు భక్తులు ఆరాధన నిర్వహించేవారు. ఆకాశం నుండి పూలు కుప్పలు కుప్పలుగా రాలేవి. మళ్ళీ వాటంతట అవే అదృశ్యమయ్యేవి. గగనతలంలో ఇంద్రధనుస్సులు కనిపించేవి. దివ్యమైన గానం వినిపించేది.

మహామహిమాన్వితుడు తపస్సంపన్నుడు అయిన మిలారేపా హిమాలయ యోగిగా, తాత్వికుడైన కవివర్యునిగా సహృదయుల హృదయాలలో ఎప్పుడూ నిలచి ఉంటాడు.

## 21. త్రైలింగస్వామి



ఆంధ్రకళింగ దేశముల మధ్య 'హోలియా' అన్న గ్రామం వేద శాస్త్ర పండితులకు నెలవైన ప్రదేశం. ఒకప్పుడు బ్రిటీష్ వారి పరిపాలనలో మద్రాసు రాష్ట్రంలోని విశాఖపట్నం జిల్లా -ఒరిస్సాలోని బెరహాంపూర్ వరకు విస్తరించి ఉండేది. సుప్రసిద్ధమైన విజయనగరం కుంభిలీపురం అధిపతులైన పూసపాటివారు తమ విజయాలకు చిహ్నంగా ఒక కోట నిర్మించి క్రీ.శ 1713 లో దానికి విజయనగరం అని పేరు పెట్టారు. ఈ హోలియా గ్రామం విజయనగరానికి దగ్గరలో ఉన్నదని చెప్పబడుతున్నది. ఆ ఊరిలో 'నరసింహ ధర్' అనే సత్కుల జాతుడైన బ్రాహ్మణునకు ఆయన భార్య 'విద్యావతికి' క్రీ.శ 1607వ సంవత్సరంలో పుష్యశుద్ధ ఏకాదశినాడు ఒక మగ పిల్లవాడు పుట్టాడు అతనికి 'శివరామ' అని పేరు పెట్టారు. 'త్రైలింగధర' అన్న పేరు కూడ ఈ బాలునకున్నట్లు ఆధారాలు కన్పిస్తూ ఉన్నవి. నరసింహధరుని రెండవ భార్య వలన శ్రీధరుడు అనే కుమారుడు పుట్టాడు. తమ్ముడితో అన్యోన్యంగా ఉంటున్నా చిన్నతనం నుంచి త్రైలింగధరుడు ఏకాంతంగా ఉండటానికి ఇష్టపడేవాడు. 1616 వ సంవత్సరములో తండ్రి ఇతనికి ఉపనయనం చేశాడు.

ఆ రోజుల్లో బాల్య వివాహాలు సర్వ సామాన్యంగా ఉండేవి. తల్లితండ్రులు, వివాహం చేసుకోమని ఇతనిని బలవంతం చేశారు. వినయవంతునిగా సౌశీల్య సంపన్నునిగా, పెద్దల మాటను జవదాటని సుగణాన్వితునిగా ప్రకాశిస్తున్న ఈ యువకుడు ఈ ఒక్క విషయంలో మాత్రం

వారి మాటను వినయ పూర్వకంగా తిరస్కరించాడు. సంసార బంధాలలో చిక్కుకోవటం తన కెంతమాత్రం ఇష్టం లేదని కనుక పెళ్ళి చేసుకోమని బలవంతం చేయవద్దని ప్రార్థించాడు. వారు కుమారుని ఏమీ అనలేక ఊరుకొన్నారు. కొన్నాళ్ళకు త్రైలింగధరుని సవతి తమ్ముడైన శ్రీధరునకు పెండ్లి చేశారు. ఇక త్రైలింగధరునకు వివాహం గురించి ఆలోచించవలసిన అవసరం తప్పిపోయింది. 1647 వ సంవత్సరంలో నరసింహధరుడు మరణించాడు. అప్పటికి త్రైలింగధరునికి 40 సం. ల వయస్సు అవివాహితుడై వైరాగ్యంతో ఉన్న ఇతనికి ఇంటి వ్యవహారాలను ఆస్తిపాస్తులను నిర్వహించటం ఇష్టం లేకపోయింది అందువల్ల తనకు ఆస్తి ఏమీ అక్కర లేదని స్పష్టంగా చెప్పి మొత్తం బాధ్యతలను సవతి తమ్ముడైన శ్రీధరునకు అప్పగించి వేశాడు. తల్లి విద్యావతి కూడా దుఃఖాన్ని నెమ్మదిగా దిగమ్రింగుకొని భక్తి వైరాగ్యాలతో భగవద్ధ్యానం చేస్తూ కాలం గడుపుతున్నది. ఒకరోజు తల్లి కుమారుల మధ్య ఈవిధంగా సంభాషణ జరిగింది తల్లి అతనిని 'శివ' అని పిలిచేది శివరాం అన్నది అతని పేరుగా ఇంతకుముందే చెప్పబడింది.

**తల్లి :** నాయనా! శివా! నేనూ పెద్దదాన్ని అయినాను. నీ తండ్రివలెనే ఎప్పుడో ఒకప్పుడు రాలిపోక తప్పదు. ఎంత చెప్పినా నీవు వివాహం చేసుకోవటానికి అంగీకరించలేదు. నా తరువాత నీ సంగతి ఎవరు పట్టించుకొంటారు? నాకు దిగులుగా ఉన్నది. ఒకసారి మళ్ళీ ఆలోచించు

**శివ :** అమ్మా! ఆలోచించవలసిన దెప్పుడో పూర్తయిపోయింది. నాకు ఈ గృహస్థ జీవితం మీద ఆసక్తి లేదని ఇది వరకే చెప్పాను. దానిలో ఏమార్పూ లేదు ఇప్పుడున్న ఆలోచనల్లా జ్ఞాన వైరాగ్యములు నిలుపుకొనడం మీదే. జ్ఞాన మార్గం ద్వారా బ్రహ్మానుభవాన్ని పొందాలి.

**తల్లి :** నీకు చెప్పగల్గినంత చదువుకొన్న దానిని కాదు కాని నాకు తెలిసినంతలో జ్ఞానప్రాప్తి అంత సులభం కాదు నీవు విరాగివే, సందేహం లేదు. సంసార బంధమునందు ఆసక్తి కూడా లేకపోవటం గుర్తించే ఉన్నాను. కనుకనే బాధ్యత కొద్దీ ఒకటికి నాలుగు సార్లు చెప్పినా నీలోని వైరాగ్యభావనను గమనించి మీ నాయనగారూ నేనూ ఒత్తిడి చేయటం మానుకొన్నాము. కానీ,

జ్ఞానప్రాప్తికి ధ్యానసాధన చాలా అవసరం నీవు ధ్యానసిద్ధుడవైతే తప్ప ఆత్మానుభూతి కలగడం సులభం కాదు.

**శివ:** నీవు చెప్పింది నిజమే పండితుల దగ్గర వేదాంతతత్వాన్ని కొంత కొంత తెలుసు కొంటున్నాను. మన గ్రామంలో జరుగుతున్న అన్ని పురాణప్రవచనాలకు వెడుతున్నాను. ఆ మధ్య ఒక పండితుని దగ్గర ఉపనిషత్తులు కూడా కొంత చదువుకొన్నాను.

**తల్లి :** చదువు మంచిదే. దాని వల్ల వివేకం వర్థిల్లుతుంది సత్యాసత్య విశ్లేషణ కలుగుతుంది. నీవు భారత పురాణ ప్రవచనం విన్నావు కదా! 18 పురాణాలు రచించిన తరువాత భారత రచన చేసి ధర్మాధర్మ తత్వాన్ని ప్రజలకు అందించి, భగవంతుడయిన కృష్ణుడు చేసిన గీతా ప్రబోధాన్ని మానవాళికి అందించి, మహోపకారం చేసిన వ్యాసునంతటి మహా పురుషునకు కూడా మనః క్లేశం తప్పలేదు. ఆయన వేదనను గుర్తించి నారదమహర్షి వచ్చి వాసుదేవుని భక్తిని విష్ణుభక్తుల కథలను గ్రంథంగా వ్రాయమన్నప్పుడు సాత్యవతేయుడు భాగవతరచన చేసి భక్తి మార్గ విశేషాలను లోకానికి తెలియచేసి తరణోపాయాన్ని ప్రసాదించాడు.వ్యాసునంతటి మహాజ్ఞాని కూడా భక్తి మార్గాన్ని అనుసరించినప్పుడే శాంతిని పొందాడు. కనుక నీవు కూడా ఆ మార్గంలో తీవ్రసాధన చేసి ఒకదేవత యొక్క అనుగ్రహాన్ని సాధించటం అవసరమని నా కనిపిస్తున్నది. ఆ దేవత ఒకరికి నారాయణుడు కావచ్చు మరొకరికి శివుడు కావచ్చు వేరొకరికి పరమేశ్వరి కావచ్చు. నీవు నీ ఇష్టదేవతను ఎన్నుకొని తీవ్రతపస్సు చేసి సిద్ధుడవు కావాలని నా ఆకాంక్ష.

**శివ:** తల్లీ! ఈరోజు నీ మాటలలో కొత్త వెలుగుబాట కన్పిస్తున్నది. ఇంతకుముందు ఎప్పుడూ చెప్పని తీరులో ప్రగాఢమైన వాంఛతో అనుశాసనాన్ని ఇస్తున్నావు. ఇది నాకు నూతన ప్రేరణను ఇస్తున్నది. కానీ, ఎప్పుడూ లేని విధంగా నీవిలా పలుకుతున్నావంటే దీని వెనుక ఏదో బలమైన ఆలోచన ఉండాలని అనిపిస్తున్నది.

**తల్లి :** శివా! నీవు చెప్పినది సత్యమే. బలమైన కారణం వల్లనే ఇలా

చెప్పాలని అనిపించింది. సహజంగా అందరి వలెనే లోకంలో ఎందరి మరణాలనో నేను చూచాను. ఈ ప్రపంచం అశాశ్వతమని ఈ తనువులు అనిత్యములని తెలుసు. అయినా మాయలో పడి భ్రాంతులమై జీవిస్తుంటాము భారతంలో యక్ష ప్రశ్నల ఘట్టంలో యక్షుడు ధర్మరాజును ప్రపంచమంతటిలోకి ఆశ్చర్యకరమయినది ఏది? అని ప్రశ్నించినపుడు ధర్మరాజు 'ప్రతిరోజూ ఎందరో మరణించడాన్ని చూస్తూ కూడా ఎవనికివాడు తాను స్థిరంగా ఉంటానని అనుకొంటూ ఉంటాడు ఇంతకంటె ఆశ్చర్యమేమున్నద'ని జవాబు చెప్పాడు.

**శ్లో॥ అహన్యహని భూతాని**
**గచ్ఛంత్యేవ యమాలయం**
**శేషాః స్థిరత్వమిచ్ఛంతి**
**కిమాశ్చర్య మతః పరం.**

నీ తండ్రి గారి మరణం నా మీద ఎక్కువ ప్రభావాన్ని చూపించింది. అది సహజం-లోకంలో ఎందరెందరి మరణాలను చూస్తున్నా వానిని పెద్దగా పట్టించుకోము. కానీ ఆత్మీయులు మరణించినపుడు దాని ముద్ర మనపైన పడుతుంటుంది. అప్పుడు నాకు మాతండ్రి గారు గుర్తువచ్చారు. ఆయన గొప్ప కాళీ మంత్రోపాసకుడు. అనేక సంవత్సరాలు తీవ్రసాధన చేసి కాళీదేవి అనుగ్రహాన్ని సాధించారు. దానివల్ల వందలవేల మందికి ఆయన ఉపకారాలు చేశాడు, బాధలు పోగొట్టాడు కష్టాలు తీర్చాడు, కాలమును జయించే శక్తిని ఆదేవత ఇస్తుందని ఆమె అనుగ్రహం వల్ల మృత్యువును జయించవచ్చునని ఆయన తరచుగా చెప్పేవాడు. ఆ సమయంలో ఎక్కువ భాగం కాళీ మంత్ర జపధ్యానములతో గడిపేవాడు. అప్పుడు ప్రాపంచిక స్పృహ ఆయనకు ఉండేదికాదు. ఆయన మరణ సమయానికి మగ పిల్లలు దగ్గర లేరు. నేనొక్క దానినే ఉన్నాను. ఆయన నాతో ఈవిధంగా అన్నారు. "అమ్మా! విద్యా! నాకు అంతిమ ఘడియలు వచ్చినవి. కొద్ది క్షణాలలో నేను శరీరాన్ని విడిచి పెట్టివెడుతున్నాను. కాళీ దేవత యొక్క అనుగ్రహాన్ని నేను కొంత మాత్రమే సాధించగలిగాను. అనేకులకు ఉపకారాలు చేశాను. దానివల్ల చాలా పుణ్యం వచ్చింది. అయితే నే ననుకున్నది పూర్తిగా సాధించటం సాధ్యం కాలేదు.

చిన్న తనంలోనే వివాహం, సంతానం, వృద్ధులయిన తల్లి దండ్రులకు సేవచేయటం దీనితో కాలంగడిచింది. బాధ్యతలన్నీ నెరవేర్చాను కానీ కోరినంత తపస్సు చేయటం కుదరలేదు. అప్పటికీ పట్టుదల వల్ల కులదేవతయైన కాళీదేవిని కొలిచాను. ఆమె కనికరించింది. కానీ, నా ఆశయం కాలానికి అధిదేవత అయిన ఆ దేవి అనుగ్రహం వల్ల మృత్యువును జయించాలని. అది సాధ్యం కాలేదు ఈ సంసార బంధాలలో ఇరుక్కోకుండా దీర్ఘకాలం పవిత్ర గంగా తీరంలో, హిమాలయ పర్వతాలలో, కాశీలో, కామాఖ్యలో, ఉజ్జయినిలో తీవ్ర తపస్సు చేయాలి. మహాకాళి శ్మశాన వాసిని. శ్మశానంలో అర్ధరాత్రులు సాధన చేయాలి. పద్ధతులన్నీ తెలిసినా పరిస్థితుల వల్ల అది సాధ్యం కాలేదు నేను కాళీ దేవిని ప్రార్థిస్తున్నాను. ఎక్కువ కాలం పై లోకాలలో ఉండాలన్న కోరిక నాకు లేదు. పుణ్యాన్ని భోగరూపంలో అనుభవించాలన్న ఇచ్ఛ నాకు లేదు. నేను చేసిన పుణ్యాన్ని నీకు ధారపోస్తున్నాను. ఆ పుణ్యఫలితంగా నీలో దైవభక్తి వికసించాలని ఆధ్యాత్మిక చైతన్యం వికసించాలని నాకోరిక. నేను కాళీ మాతను ప్రార్థిస్తున్నాను. నీ కడుపున బిడ్డగా పుట్టి సంసార బంధములో ఇరుక్కోకుండా కాళీ సాధన చేసి మృత్యువును జయించాలి! ఈ మాటలు పలుకుతూ నా చేయిపట్టుకుని నీ మాతామహులు ప్రాణములు అలవోకగా త్యజించారు. ఇన్నాళ్ళు నీకు ఈ విషయం చెప్పలేదు. ఇప్పుడు సమయం వచ్చింది ఇక నీ ఇష్టం.

**శివ :** ఈ మాటలు చాలా ఆశ్చర్యాన్ని, ఆనందాన్ని కలిగిస్తున్నవి. బహుశా నీవు చెప్పినట్లు మీ తండ్రిగారి యొక్క పునర్జన్మను నేను కావచ్చును. తాతగారి ఆశయాన్ని సాధించటానికి తగిన కృషిని నేను చేస్తాను. నీవు ఏమార్గాన్ని సూచిస్తే ఆ మార్గంలో నేను ముందుకు వెడతాను. నాకు కాళీ మంత్రాన్ని ఉపదేశించు.

**తల్లి :** మీ తాతగారు నా కుపదేశించిన కాళీమంత్రాన్ని నీ కుపదేశిస్తాను దానిని స్వీకరించి నీవు దీర్ఘాయు స్సంపన్నుడవు కావాలని కాళీదేవి యొక్క పరిపూర్ణమైన అనుగ్రహాన్ని సాధించాలని మహాసిద్ధుడవై ప్రకాశించాలని నా ఆకాంక్ష

**శివ :** తల్లీ! నీ కోరికను ఆజ్ఞగా శిరసావహించి సాధన ప్రారంభిస్తాను. త్రిశూల ధారిణి, ముండ మాలా ధారిణి, శ్మశాన వాసిని అయిన మహాకాళి న న్ననుగ్రహించును గాక.

**శ్లో॥ కపాలమాలాం కరవాల హస్తాం**
**శ్మశాన వాసాం జ్వలదగ్ని రూపాం**
**మద్యప్రియాం భీషణ రక్తజిహ్వాం**
**కాళీం కరాళీం సతతం భజామి.**

వాళ్ళ గ్రామంలో అమ్మవారి గుడి ఉన్నది. ఆ గుడిలోకి వెళ్ళి కూర్చొని రోజూ జపం చేయటం మొదలు పెట్టాడు. లక్షలు, కోట్లు మంత్ర జపం పూర్తవుతున్నది. మధ్య మధ్యలో అవకాశం ఉన్నప్పుడు దగ్గరలో ఉన్న క్షేత్రాలకు వెళ్ళి అక్కడ కొంత సాధన చేసి వస్తున్నాడు. అయితే మాతృబంధం బలమయినది. ఇప్పటికి ప్రపంచంలో తల్లికి తాను తనకు తల్లీ తప్ప వేరెవరూ లేరు. అందువల్ల ఆమెను విడిచిపెట్టి ఎక్కువ కాలం ఎక్కడికి వెళ్ళటం ఇష్టం లేదు. విద్యావతీదేవి వృద్ధురాలయింది. ఒక పూట కుమారుడు కనపడక పోతే ఆమె తల్లడిల్లి పోయేది. ఆమెకు సేవచేస్తూ ఆసేవనే కాళీ సేవగా భావిస్తూ ఆమెనే కాళీ మాతగా పూజిస్తూ 12 సంవత్సరములు గడిపాడు. 1659 వ సంవత్సరంలో తల్లి మరణించింది. శ్మశానానికి తల్లి శవాన్ని తీసుకువెళ్ళి దహన సంస్కారాలు జరిపిన తరువాత శివరాం ( త్రైలింగధరుడు) ఇక ఇంటికి రానన్నాడు. తమ్ముడు శ్రీధర్ మొదలయిన వారంతా బ్రతిమలాడారు. పెద్దలు చుట్టాలు చెప్పి చూచారు. అశాశ్వతమైన ప్రపంచం మీద తనకు ఆసక్తి లేదని ఇల్లు, ఇల్లాలు, సంసారము ఈ ప్రపంచము అంతా భ్రాంతి అని, తాను వీటన్నింటికి దూరంగా ఏకాంతంగా ఉండదల్చుకొన్నానని త్రైలింగధరుడు వారికి స్పష్టం చేశాడు. ఎవరు చెప్పినా మార్చుకోని దృఢనిశ్చయంతో ఉన్న అన్నకు ఒక కుటీరాన్ని నిర్మించి ప్రతిరోజూ ఆహారానికి కావలసిన ఏర్పాట్లను శ్రీధరుడు చేశాడు. భక్తురాలు, విజ్ఞానవతి అయిన తల్లి ఉపదేశించిన మార్గంలో అక్కడే ఉంటూ 20 సంవత్సరములు ప్రగాఢమైన కాళీ సాధన చేశాడు త్రైలింగధరుడు. శ్మశానకుటీరంలో ఉంటూ

ప్రతిరోజు తాను పదిలంగా దాచుకొన్న మాతృశరీర భస్మాన్ని ధరించి రాత్రింబవళ్ళు కాళీమంత్రజపం చేశాడు. ధ్యాన వేళ ఎన్నో అనుభవాలు కలిగినవి. దివ్యచక్షువు వికసించి మానవేతర శరీరులను చూడగలిగే శక్తి లభించింది. అంతరిక్ష చరులయిన భూతప్రేతజీవులనే కాక సిద్ధులను దేవతలను చూడగల శక్తి లభించింది. కాళీదేవి అతనిని ఎన్ని రకాలు గానో పరీక్షించింది. పరమ సుందరమూర్తియై, దిగంబరయై, కామ ప్రేరకమైన దృక్కులతో ప్రేరేపించింది. తన తల్లి శరీరాన్ని దహించిన చితాభస్మాన్ని ధరించిన శివరామునకు కామవికారం కలుగలేదు. ఒక్కోసారి అతిభీషణ రూపంతో నక్కల అరుపుల మధ్య అట్టహాసం చేస్తూ పైనబడి విరుచుకు తినేటట్లుగా మీదకు దూకింది. అప్పుడూ భయపడలేదు. 'ప్రళయవేళ లోకములను నాశనము చేయటానికి అవసరమైన భీషణ రూపం ఇప్పుడు ఎందుకు ధరించావు తల్లీ?' అని ప్రార్థించాడు. 'తల్లీ! నీవు దక్క నాకు దిక్కెవరూ లేరు. అన్నీ త్యజించిన నేను దేనిని చూచి భయపడాలి? నా తల్లి నిన్ను గురించి నాకు చెప్పింది. నాపూర్వ జన్మను గూర్చి తెలియచేసింది. అది సత్యమో కాదో! ఆ జన్మలో నిన్ను సరిగా ఆరాధించానో లేదో తెలియదు. ఎప్పటి సంగతో ఎందుకు? ఇప్పుడు మాత్రం నీవు తప్ప నాకు వేరు గతి లేదు. పూర్వ జన్మలలో కానీ, ఈ జన్మలో కానీ, తెలిసికానీ, తెలియక కానీ చేసిన దోషము లేవయినా ఉంటే నన్ను క్షమించి అనుగ్రహించు.'

**శ్లో॥ప్రాగ్దేహస్థో యదావా తవ చరణయుగం నాశ్రితో నార్చితోఽహం,**
**తేనాద్యా కీర్తివర్గైర్జఠర జదహనైర్బాధ్య మానో బలిష్ఠైః,**
**క్షిప్త్వాజన్మాంతరాన్నః పునరిహాభవితా క్వాశ్రమః క్వాపి సేవా**
**క్షంతవ్యో మేఽపరాధః ప్రకటితవదనే కామరూపే కరాలే.**

"త్రిమూర్తులైన బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు దిక్పాలకులయిన ఇంద్రాగ్ని యమవరుణాదులు, గ్రహాధిపతులయిన సూర్యచంద్రకుజ బుధాదులు, అందరూ నీ సృష్టిలోనివారే, నీ సేవకులే. భూమి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము మనస్సు, ప్రకృతి, సమస్తమూ నీ స్వరూపములే."

శ్లో॥ త్వం కాళీ త్వంచ తారా త్వమసి గిరిసుతా సుందరీ భైరవీత్వం
త్వం దుర్గా ఛిన్నమస్తా త్వమసిచ భువనాత్వం హి లక్ష్మీశ్శివా త్వమ్
ధూమా మాతంగినీ త్వం త్వమసి చ బగళా మంగళాది స్తవాఖ్యా
క్షంతవ్యోమేఽ పరాధః ప్రకటితవదనే కామరూపే కరాళే.

"అమ్మా! నీవు కాళివి, తారవు. హిమగిరి పుత్రికవు, త్రిపురసుందరివి, భైరవివి, దుర్గవు నీవే. ఛిన్నమస్త అయిన వైరోచనివి నీవే, భువనేశ్వరివి, లక్ష్మివి, శివవు, ధూమావతివి, మాతంగివి, బగళవునీవే, దేవీ స్వరూపములన్నీ నీవే, లలిత సుందర మూర్తి అయిన బాలా రూపిణి అయిన మంగళవు నీవే, న న్ననుగ్రహించు తల్లీ కరుణించు" అని భక్తివివశుడై అతడు చేసిన ప్రార్థనలకు, సుదీర్ఘకాల తపస్సునకు, సంతృప్తి చెందిన కాళీదేవి సాక్షాత్కరించింది. ఇంతకుముందు ధ్యానసమయములలో కనిపించిన రూపము వేరు. ఇప్పుడు కనిపించినరూపం 12 ఏండ్ల బాలిక రూపము. పట్టుపరికిణీ ధరించి సుకుమారంగా నెమ్మదిగా అడుగులు వేస్తూ తన ముందుకు వచ్చింది. వాయుమండలంలో మంగళా! మంగళా అన్న శబ్దములు వినిపిస్తున్నవి. మంగళ కాళి సుందర మందహాస వదనార విందంతో అతని ముందు సాక్షాత్కరించింది "శివా" నీ తపస్సుకు సంతోషించాను. ఎన్నో జన్మల నుండి నీవు నా భక్తుడవు. ఈ జన్మలో నీ సాధన ఫలించింది. నీకు సిద్ధశక్తులు ప్రసాదిస్తున్నాను. వీనితో ఆర్తులను రక్షించు, ఆపదలో ఉన్న వారిని ఆదుకో. కలియుగ ప్రభావం వల్ల అలసులు, మందబుద్ధియుతులు, అల్ప తరాయువులయిన సామాన్యజనులలో ఆధ్యాత్మిక చైతన్యాన్ని పెంపొందించు. దేశ సంచారము చేసి చివరకు పవిత్రమైన కాశీక్షేత్రానికి చేరుకో. నీకు దీర్ఘాయువును ప్రసాదిస్తున్నాను. ఎప్పటికప్పుడు ఏమేమి చేయవలసి ఉన్నదో ఆవిధంగా నీ బుద్ధి ప్రచోదించబడుతుంది. అవసరమైనప్పుడు నేను దర్శనమిస్తుంటాను" అని పలికి దేవి అదృశ్యమయింది. ఇప్పుడతడు కాళీసిద్ధుడు. ఇక అతడు భవిష్యత్ కార్యక్రమం కోసం ఎదురుచూస్తున్నాడు. పంజాబ్ లోని 'పాటియాలా' ప్రాంతం నుండి భగీరథస్వామి అన్న యతి దక్షిణదేశ యాత్రలు చేస్తూ, 'హోలియా' గ్రామానికి వచ్చి, ఇతని గురించి

విని శ్మశానంలో త్రైలింగధరుని కుటీరానికి వచ్చాడు. చూచిన క్షణంలోనే భగీరథ స్వామి త్రైలింగధరుడు అసామాన్య జీవుడని గ్రహించాడు. త్రైలింగధరుడు కూడా ఈ సన్యాసి యందు అపూర్వమైన భక్తి గౌరవాలు కల్గినవి. రామేశ్వరం దాకా వెళ్ళాలని యాత్ర కోసం బయలుదేరిన ఆ సన్యాసి ఇక్కడే ఉండిపోయినాడు. ఆ కుటీరంలోనే ఇద్దరూ నాలుగు సంవత్సరాల పాటు కలిసి ఉన్నారు. అనంతరం ఆ యతివరుని కోరిక మీద ఆయన వెంట త్రైలింగధరుడు పుష్కరక్షేత్రానికి వెళ్ళాడు. ఈ క్షేత్రం హర్యానా రాష్ట్రంలో జింధ్‌కు దక్షిణంగా 11కి.మీ దూరంలో 'పొంకర్‌కేరి' అన్న గ్రామంలో ఉన్నది. రాజస్థాన్‌లో మరో పుష్కరక్షేత్రం అజ్మీర్ కు 11కి.మీ దూరంలో ఉన్నది. ఇక్కడకు దేశం నలుమూలల నుండి భక్తులు వచ్చి ఈ క్షేత్రంలోని తీర్థంలో స్నానం చేస్తారు. మామూలుగా పుష్కరాలంటే 12ఏళ్ళ కొకసారి కొన్ని నదులకు వచ్చే పవిత్రమైన దినములు. ఇవి 12 రోజులు ఉంటవి. ఆ నదులు గంగ, యమున, నర్మద, గోదావరి,కృష్ణ, కావేరి, భీమ, తుంగభద్ర, బ్రహ్మపుత్ర, సింధు, ప్రణీత, మహానది. ఒకప్పుడు సరస్వతి కూడ ఈ పట్టికలో ఉన్నదని పండితుల అభిప్రాయం. పుష్కర క్షేత్రంలో విశేషం ఏమిటంటే సంవత్సరంలోని అన్ని రోజులలోను పుష్కర స్నాన ఫలితాన్ని ఇస్తుంది. అంటే పుష్కరకాలంలో ఇతర నదులు ఎంత పవిత్ర మయినవో ఈక్షేత్రంలో అన్నిరోజులు అంత పవిత్ర మయినవి. అటువంటి దివ్యక్షేత్రంలో 1685వ సంవత్సరములో 78 ఏండ్ల వయస్సు గల త్రైలింగధరునకు భగీరథస్వామి సన్యాస దీక్ష ఇచ్చాడు. ఆ క్షణం నుంచి త్రైలింగధర్ అన్నపేరు 'గణపతి స్వామి' గా మారిపోయింది. గురు శిష్యులిద్దరూ 10 సంవత్సరాలు పుష్కరక్షేత్రంలోనే ఉన్నారు. 1695వ సంవత్సరంలో భగీరథస్వామి సిద్ధి పొందిన తరువాత గణపతి స్వామి దక్షిణ దేశయాత్రకు బయలుదేరి క్షేత్రం తరువాత క్షేత్రం దర్శిస్తూ రామేశ్వరం చేరాడు. అప్పటికే ఆయనకు అనేక దివ్య శక్తులు మహాసిద్ధులు లభించినవి.

ఆయన రామేశ్వరంలో ఉండగా ఆంధ్రప్రాంతం నుంచి అక్కడకు చేరిన యాత్రికులు కొందరు ఈయనను గుర్తుపట్టి స్వస్థానానికి రావలసినదిగా

అభ్యర్థించారు. తనకు ఎవరితోను, ఏ స్థానముతోనూ అనుబంధం లేదని, అన్ని అనుబంధాలు త్యజించినవాడు మాత్రమే సన్యాసి అని చెప్పి వారి మాటలను మృదువుగా తిరస్కరించాడు. రామేశ్వరంలో ఉండగా ఒక విచిత్రమయిన సంఘటన జరిగింది యాత్రకు వచ్చిన ఒక బ్రాహ్మణుడు, ప్రయాణశ్రమ తట్టుకోలేక తీవ్రజ్వరం వచ్చి మరణించాడు. అతని కుటుంబ సభ్యులు బంధువులు విపరీతంగా శోకిస్తున్నారు. అక్కడి స్థానికులు శవాన్ని శ్మశానానికి తీసుకు వెళ్ళడానికి సహకరించి ఏర్పాట్లు చేస్తున్నారు. మృతుని సన్నిహితుల ఆర్తిని ఆవేదనను చూడలేక గణపతిస్వామి క్రిందపడుకో పెట్టిన శవం మీద తన కమండలువు లోని నీరు తీసి చల్లాడు. మరు నిముషంలో శవంలో కదలిక వచ్చింది. అతనికి కాసిని పాలు త్రాగించమని స్వామి సూచించాడు. మృతుడు బ్రతికాడు. ఈ మహిమ చూచిన ప్రజలంతా స్వామిని కీర్తించారు. స్వామి దర్శనానికి వచ్చే జన సంఖ్య రోజురోజుకు పెరగటం మొదలుపెట్టింది. చచ్చిన వానిని బ్రతికించిన మహనీయుడంటే ఎవరికయినా ఆసక్తే కదా! ఇక అక్కడ ఉండటం ఇష్టం లేక 1699 వ సంవత్సరంలో దక్షిణదేశాన్ని విడిచిపెట్టి తూర్పున పూరీకి వెళ్లి జగన్నాథ దర్శనం చేసుకొని, అక్కడి నుండి ఉత్తర దిక్కున ఉన్న ప్రయాగకు చేరి, అనంతరం పశ్చిమ దిశన ఉన్న ద్వారకలో కొంతకాలం ఉన్నారు. ఆయనను రామేశ్వరంలో చూచిన వారు కొందరు అక్కడ ఉండడం వల్ల ఆయన చనిపోయిన వానిని బ్రతికించిన మహిమాన్వితు డన్న ప్రచారం ఇక్కడా పెరిగింది. ఎందరో ఆయనను భక్తితో సేవించటం మొదలుపెట్టారు. ఇక్కడా ఏకాంతానికి భంగం కలిగింది దానితో ఆ స్థలం కూడా వదలాలని నిశ్చయించుకొని తనకు సేవ చేసిన వారందరికి కోరిన వరములు ప్రసాదించి 1701 వ సంవత్సరములో నేపాల్ బయలుదేరి వెళ్ళారు. అక్కడ ఒక అరణ్య ప్రాంతంలో నివాసం ఏర్పరుచుకొని ఒంటరిగా తపస్సు చేస్తున్నాడు.

ఆ ప్రదేశం క్రూర మృగాలకు నెలవయినది. వేట అంటే ప్రీతి గల్గిన నేపాల్ రాజు ఒకరోజు ఆ ప్రాంతానికి తన పరివారంతో వచ్చాడు. అక్కడ సంచరిస్తున్న ఒక భయంకరమైన పులిని రాజుగారి అనుచరుడు తుపాకీతో

కాల్చాడు. గురి తప్పింది పులి భీషణంగా గాండ్రిస్తూ అక్కడి నుంచి వేగంగా తప్పించుకొని వెళ్ళిపోయి స్వామి కుటీరంలోకి ప్రవేశించింది. స్వామి దానిని చూచి నెమ్మదిగా తన హస్తంతో నిమిరాడు. అది పిల్లి వలే ఆయన పాదాల వద్ద కూర్చుండి పోయింది. పరుగెత్తుకుంటూ వచ్చిన రాజభటులు కుటీరంలోని ఈ దృశ్యాన్ని చూచి దిగ్భ్రాంతి చెందారు. వారితో ఆయన "అనవసరంగా హింస చేయకండి. అడవిలో తమ మానాన తాముంటున్న జంతువులను వేట పేరుతో చంపటం న్యాయం కాదు. ఇతర జీవులను చంపే హక్కు ఎవరికీ లేదు. భగవంతుడు దీనిని అంగీకరించడు" అని చెప్పి వారిని పంపించి వేశాడు. వారు వెనక్కి వెళ్ళి జరిగిన విషయం రాజా వారితో చెప్పారు. రాజు ఆశ్చర్యపడి ఆయన దర్శనానికి వచ్చి విలువైన రత్నములను కానుకగా సమర్పించాడు. స్వామి వాటిని మృదువుగా తిరస్కరించి 'అన్నీ వదలివేసిన సన్యాసికి ఈ సిరి సంపదలతో పని ఏమున్నది? వాటిని ప్రజా శ్రేయస్సుకు వినియోగించండి' అని సలహా ఇచ్చాడు.

ఈ వార్త నేపాల్ రాజ్యంలో సుడి గాలిలా వ్యాపించింది. లెక్క లేనంత మంది ప్రజలు దర్శనానికి రావటం మొదలుపెట్టారు. మరలా ప్రజా సంగం తప్పలేదు. ఆరు సంవత్సరాలు నేపాల్‌లో ఉన్న తరువాత 1720వ సంవత్సరంలో మానససరోవరానికి వెళ్ళి ఆ ప్రాంతంలో తపస్సు చేసుకొంటున్నాడు. ఆ స్థలంలో కూడా ఒకరోజు ఒక స్త్రీ, మరణించిన తన ఏడు సంవత్సరాల కుమారుని మృతశరీరాన్ని శ్మశానానికి తీసుకువెడుతూ బంధువులతో సహా రోదిస్తూ త్రోవలో ఈ స్వామిని చూచి ఆయన కాళ్ళ దగ్గర శవాన్ని పెట్టి దయనీయంగా ఏడవటం మొదలుపెట్టింది. దానితో కరిగిపోయిన స్వామి ఆ పిల్లవాని నుదురును తన చేతి వ్రేలితో క్షణం స్పృశించాడు. పిల్లవానిలో కదలిక వచ్చింది. లేచి కూర్చున్నాడు. ఇంతకు ముందు దుఃఖాశ్రువులు ఇప్పుడు ఆనంద బాష్పాలుగా మారినవి. ఈ వృత్తాంతం వ్యాపించగానే మళ్ళీ జన సమ్మర్దం పెరిగింది. అప్పటికే సిద్ధశక్తులు వచ్చి ఉండటం వల్ల అందరూ చూస్తుండగా స్వామి అదృశ్యుడై వెళ్ళిపోయినాడు. ఇక్కడ ఉన్న సమయంలో శంకర సంప్రదాయానికి చెందిన

విద్యానంద సరస్వతీ స్వామి, అద్వైత సంప్రదాయంలో సన్యాస దీక్ష ఇచ్చాడని 'రామానందసరస్వతి' అన్న కొత్త నామాన్ని ఇచ్చాడని కొందరు వ్రాశారు. నేపాల్‌లో రాజుగారు చూపించిన దైవభక్తి, దెబ్బతిన్న పెద్దపులి పిల్లివలె స్వామివారి ప్రక్కన కూర్చున్నదన్న ప్రచారం ప్రజలు విపరీతంగా వచ్చేట్లు చేసింది. దానితో స్వామివారు బయలుదేరి హిమాలయ శ్రేణులలో చిరకాల వాంఛితమైన మానస సరోవర యాత్రకు బయలుదేరాడు. మంచు కప్పిన పర్వత పంక్తులు వాటి మధ్య వేగంగా ప్రవహించే సెలయేళ్ళు వాటి పక్కన మహావృక్షాలు ఈ వాతావరణంలో ఒంటరియోధుడై వెళుతుంటే ఒక అజ్ఞాతవ్యక్తి పేరు పెట్టి రమ్మని పిలిచాడు. దగ్గరికి వెళ్ళి చూస్తే జటాధారి యైన సన్యాసి. అతడొక గుహయొక్క ముఖద్వారంలో నిలబడి "నా సంకల్పంవల్ల మీరు ఆకర్షించబడి వచ్చారు. మానస సరస్సులకు చేరే ముందు ఇక్కడ కొంతకాలం ఉండాలి. నాతో రండి !" తన పేరు తానెక్కడికి వెళుతున్నది – తెలిసిన ఆ యతిని చూచి ఆశ్చర్యపడి ఆయన వెంట గుహలోకి వెళ్ళాడు. ముందు చిమ్మచీకటి. కొంతదూరం ముందుకు వెళ్తే వెన్నెల వంటి కాంతి. ఆకాంతిలో చాలా శిలావిగ్రహాలు కనబడినవి. వాటికి జడలు కనిపిస్తున్నవి. ముఖంలో కండ్లు మిలమిల మెరుస్తున్నవి. వాళ్లు వేల సంవత్సరాల నుండి తపస్సు చేస్తున్న మహాపురుషులని వారికి సేవచేస్తూ తాను రెండు వందల సంవత్సరాల నుండి అక్కడ ఉన్నానని తనకు సిద్ధాశ్రమ గురువుల నుండి పిలుపు రావటం వల్ల వాళ్ళున్న మానస సరోవరం దగ్గరికి వెళ్ళాలని తాను తిరిగి వచ్చేదాకా ఈ యోగీశ్వరులకు సేవచేయమని ఆయతి అన్నాడు. సేవ అంటే ప్రతిరోజు కొండమీది చెట్ల నుండి లతల నుండి పండ్లు పూలు సేకరించి ఆకులలో పెట్టి ప్రతి విగ్రహం దగ్గర ఉంచాలి. కాసేపటికి అవి అదృశ్యమవుతవి. అంటేవారు వాటిని స్వీకరించావన్నమాట. ఈ విధంగా తన పునరాగమనం వరకు చేయాలని అయితే తానెప్పుడు వస్తానో చెప్పలేనని ఆ దివ్యమూర్తుల ఆశీస్సులు మీకు ఎప్పుడు లభిస్తవో బహుశా అప్పటికి తాను తిరిగి రావచ్చునని ఆ సన్యాసి చెప్పాడు. త్రైలింగస్వామి అంగీకరించటంతో అతడు వెళ్ళిపోయినాడు. క్రీ.శ.1691 లో అక్కడకు వచ్చిన స్వామి 1700వ సంవత్సరం ప్రారంభం వరకు తొమ్మిదేండ్ల పాటు

వారికి సేవచేస్తూ మిగతా సమయాలలో వారి సన్నిధిలో ధ్యానం చేస్తూ కాలం గడిపాడు. చివరికొక రోజు వారందరూ చేయెత్తి ఆశీర్వదించారు. శిలా విగ్రహాలు అద్భుతమైన కదలిక. దీవనలిచ్చిన తర్వాత మళ్ళీ యధాపూర్వకంగా పాషాణ ప్రతిమలే. ఈ సంఘటన జరిగిన మర్నాడు తొమ్మిదేండ్ల క్రింద వెళ్ళిన సన్యాసి వచ్చాడు. త్రైలింగస్వామితో ఆయన నీవింక వెళ్ళవచ్చు. త్రోవలో ఇటువంటి సిద్ధపురుషుల ఆశీస్సులు మరికొన్ని లభిస్తవని చెప్పాడు. స్వామివారు "మీరిక్కడ ఇలా ఎంతకాలం ఉంటారని" అడిగినప్పుడు ఆయన "ఏమో ! నేనిక్కడే ఉండిపోవలసి వస్తుందేమో. నీ వంటి ఎంపిక చేయబడిన వారిని అనుగ్రహించటం కోసం ఈ దివ్యపురుషుల సంకల్పం వల్ల వారిని సేవిస్తూ ఉంటాను. వారి సన్నిధిలో అపారమైన దైవానుగ్రహాన్ని నేను పొందగలుగుతున్నాను. నీవల్ల బయటి ప్రపంచంలో కావలసిన కొన్ని మహాకార్యాలున్నవి. ప్రస్తుతం మానస సరస్సుకు వెళ్ళు. హిమాలయాలలో ఇటువంటి సిద్ధ భూములక్కడ ఉన్నవి. నీవు వెళ్ళే పథంలో కొన్ని ప్రదేశాలున్నవి. అక్కడ నీకు ఆశీస్సులు లభిస్తవి. అందరమూ దేవకార్యనియుక్తులమే. ఎవరి కర్తవ్యం వారిదే. నా కర్తవ్యం ప్రస్తుతం ఇక్కడ ఉండి సేవచేయటము, నీ వంటి వారికి మార్గదర్శనం చేయటము. ఇక నీవు ఈ మహాత్ముల ఆశీస్సులు పొందావు. బయలుదేరి వెళ్ళు" 'మళ్ళీ రావచ్చునా' అని అడిగిన దానికి ఆ యతి "నీవు ఇక్కడికి పునరాగమనం ఉండదు. ఈ ఒక్కసారి కూడా పూర్వజన్మ సుకృతం వల్ల, సిద్ధయోగుల సంకల్పం వల్ల మాత్రమే".

త్రైలింగస్వామి హిమావృతమైన ఆ కొండల మధ్య నుండి ప్రయాణాలు చేసి కొన్ని వారాల తర్వాత మానస సరస్సు చేరుకొన్నాడు. అక్కడ ఎందరో మహాత్ముల దర్శనం ఆశీస్సులు లభించినవి. ఆ సరస్సు దగ్గర దాదాపు 25 సంవత్సరాలుండి తపస్సు చేశాడా మహాపురుషుడు. అక్కడ నుండి జనపదాలలోకి మళ్ళీ ప్రయాణం. తరువాత 1726 వ సంవత్సరములో స్వామి నర్మదానదీ తీరానికి వెళ్ళి అక్కడి మార్కండేయ ఆశ్రమంలో కొంతకాలం ఉన్నారు. అక్కడ 'ఖాకీ బాబా' అనే ఒక ప్రసిద్ధయోగి చాలా కాలంగా నివసిస్తూ ఉండేవాడు. నది ఒడ్డున కూర్చొని గంటల తరబడి గాఢ ధ్యానంలో

ఉండటం ఆయనకు అలవాటు. ఒకరోజు ధ్యానంలో నుంచి లేచి మంచి నీళ్ళు తాగటం కోసం నదిలో దిగి రెండు చేతులతో నీళ్ళు తీసుకొంటే అవి పాలలాగా అయినవి. ఆశ్చర్యపడి చుట్టూ చూస్తే ఎవరో క్రొత్త స్వామి తన చేతితో నీళ్ళు తీసుకొంటుండగా అవి పాలుగా మారటం గమనించాడు. ఆశ్చర్యపడిన బాబా ఈ విషయాన్ని అందరికీ చెప్పాడు. ఆశ్రమవాసులంతా గణపతి స్వామిని మహాయోగిగా గౌరవించారు. అక్కడ ఆరుసంవత్సరాలు ఉండి 1733 లో ప్రయాగకు వెళ్ళి అక్కడ నదీ సంగమ స్థానంలో ఎక్కువ కాలం ధ్యానంలో గడుపుతూ ఉండేవాడు. ఒకరోజు పెద్ద జడివాన పట్టుకొన్నది. అందరూ ఇండ్ల దగ్గరికి, పటకుటీరాలలోకి పరుగెత్తుతూ ఉంటే స్వామి మాత్రం తడుస్తూనే నిశ్చలంగా నది వైపు చూస్తున్నాడు. రామతారక భట్టాచార్య అన్న బ్రాహ్మణుడు దగ్గరకు వచ్చి 'స్వామీ'! వాన విపరీతంగా కురుస్తున్నది. దగ్గరలో ఉన్న గుడారం లోకి వెడదాం రండి' అన్నాడు. స్వామి చిరునవ్వు నవ్వుతూ 'తన గురించి విచారించవద్దని ఎదురుగా నదిలో ప్రయాణీకులతో నిండి ఉన్న పడవ మునిగి పోబోతున్నదని, వారిని రక్షించాలని' అన్నాడు. ఆయన ఈ మాట అంటూండగానే పడవ మునిగి పోయింది. స్వామి మరుక్షణం అదృశ్యుడైనాడు. కొద్ది నిముషాలలో పడవ మళ్ళీ పైకి తేలింది. అందరు ప్రయాణికులు భద్రంగా ఒడ్డుకు చేరి ఎవరి దోవన వారు వెళ్ళిపోయినారు. స్వామి కూడా ఆ పడవలో నుంచి ప్రయాణీకుని వలే నడచి వచ్చాడు నదిలో ఆయన కౌపీనం కొట్టుకుపోయింది. నగ్నంగా నడచివచ్చిన ఆ స్వామి తమ రక్షకుడని ఆ ప్రయాణీకులకు తెలియదు. ఒక్క రామతారక పండితుడు మాత్రం గుర్తించి ఆయన కాళ్ళ మీద పడి ఇంతటి మహిమ ఎలా వచ్చిందని ప్రశ్నించాడు. భౌతికమైన సుఖ భోగాలను త్యజించి ఇంద్రియాలను జయించి భగవత్ సాధన చేస్తే ఏదైనా సాధ్యమే అని అతనికి బోధించి స్వామి అదృశ్యమైనాడు.

1737 లో స్వామి ప్రయాగనుండి కాశీ వెళ్ళాడు చేరిన మొదట్లో 'అసి' ఘాట్ దగ్గరి తులసీదాస వనంలో ఉంటూ అప్పుడప్పుడు లోలార్క కుండానికి వెళ్ళి స్నానం చేసేవాడు. అక్కడ ఎక్కువ భాగం తపస్సులో గడిపేవాడు. ఒకరోజు అక్కడ కుష్ఠు వ్యాధితో బాధపడుతున్న ఒక బధిరుని

చూశాడు. బాధ భరించలేక తపిస్తున్న ఆ ఆర్తుని చూచి స్వామికి దయకలిగి ఒక ఆకు అతనికి ఇచ్చి దానిని నెత్తిన పెట్టుకొని లోలార్క కుండంలో స్నానం చేసి రమ్మన్నాడు. స్నానం చేసి ఇవతలకు వచ్చే సరికి అతని కుష్ఠు, చెముడు మాయమయినవి. బ్రహ్మాసినావా అన్నపేరు గల ఆవ్యక్తి ఆనాటినుండి స్వామి వెంట ఉంటూ ఆయనకు పరిచర్యలు చేసేవాడు. ఈ విధంగా కష్టాలలో ఉన్న వారిని ఆదుకొని నిరంతరము సహాయం చేస్తుండేవాడు స్వామి. ఈ రోజుల్లో స్వామి గంగానది ఎప్పుడయినా దాటవలసివస్తే పడవ ఎక్కేవాడు కాదు, నీళ్ళ మీదుగా నడచుకొంటూ వెళ్ళేవాడు. ప్రజలు ఈ దృశ్యాన్ని దిగ్భ్రాంతితో చూసేవారు. కొన్నాళ్ళ తరువాత తులసీదాసవనం నుండి వేదవ్యాస ఆశ్రమానికి మారాడు. అక్కడి నుండి ఒకరోజు గంగా స్నానానికి వెడుతూఉంటే సీతానాథ్ బందోపాధ్యాయ అన్న రాజయక్ష్మ వ్యాధిపీడితుడు గంగా స్నానానికి వచ్చి ఆపుకోలేని దగ్గురావటంతో ఉన్నట్లుండి కూలిపోయినాడు. దయార్ద్ర హృదయుడైన స్వామి అతని రొమ్ముని తాకి కూర్చోబెట్టాడు. ఆ రోగి స్వామి కాళ్ళమీద పడి రక్షించమని ప్రార్థిస్తే స్వామి అతనితో 'పవిత్రమయిన గంగా స్నానానికి వచ్చావు, గంగ నిన్ను రక్షిస్తుంది, గంగలోని బురద తిను. నీరోగం పోతుంది' అన్నాడు. అతడు మరేమీ ఆలోచించకుండా సందేహించకుండా గబగబా వెళ్ళికొంచెం బురద మ్రింగాడు. అతని వ్యాధి అదృశ్యమయింది. అతనికి ఆక్షణం నుంచి స్వామియే దేవుడయినాడు.

అలానే జయగోపాల్ కర్మాకర్ ఇంకొక భక్తుడు. స్వామికి శ్రద్ధతో సేవచేసేవాడు. ఒకరోజు అతడికి కారణం లేకుండా విపరీతంగా దుఃఖం రావటం మొదలుపెట్టింది. నిర్హేతుకమైన ఈ వేదనకు కారణమేమిటో తెలియటం లేదని దానిని పోగొట్టమని స్వామిని ప్రార్థించాడు. స్వామి అతనిని ఓదార్చి కలిగిన వ్యధ హేతువులేనిది కాదని, అతని స్వగ్రామంలో ఉన్న కుమారుడు ఆయువు తీరి మరణించాడనీ, కనుక బాధ పడవద్దని, జనన మరణములు జీవికి సహజమైన పరిణామములని అతనికి బోధించాడు. కొద్ది గంటలలోనే గ్రామం నుండి అతడికి వార్తవచ్చింది అతడిప్పుడు కొంత ధైర్యంతో దానిని స్వీకరించాడు.

ప్రయాగలో త్రివేణిసంగమంలో మునిగిపోయిన పడవలోని మనుషులను రక్షించడానికి వెళ్ళినప్పుడు ధరించిన వస్త్రం కొట్టుకొని పోయిన తరువాత, స్వామి వస్త్రధారణ చేయలేదు. అవధూత స్థితిలో ఉన్నవారు లౌకికమైన ఆచారములకు, వ్యవహారములకు అతీతులు. కాశీ వాసులకు ఇటువంటివి తరచుగానే సంభవించటం వల్ల, స్వామి నగ్నతను ఎవరూ పెద్దగా పట్టించుకొనే వారు కాదు. కానీ కొందరికి నచ్చదు. ఒక మహారాష్ట్ర మహిళ తన భర్తకడుపులో పుండు నయం చేయించుకోవటం కోసం కాశీకి వచ్చి విశ్వనాధుని దర్శనానికి వెడుతూ ఈ దిగంబరస్వామిని చూచి గుడ్డలు తీసివేసినంత మాత్రాన ప్రతివాడు శివుడు కాలేడని అవహేళనగా అని వెళ్ళి పోయింది. ప్రతిరోజూ ఆవిడ ఇలానే అంటుండేది. ఒకరోజు విశ్వనాధుడు ఆమెకు కలలో కనపడి “ఆ దిగంబరస్వామి మహనీయుడనీ, ఆయన విషయంలో నీవు అపచారం చేశావనీ, నీ భర్త వ్యాధిని కుదిరించగలవాడు ఆయన ఒక్కడేననీ” అన్నాడు. ఆమె మరునాడు స్వామి పాదాలపైబడి క్షమాపణవేడి తనభర్త వ్యాధిని పోగొట్టమని ప్రార్థించింది. సహనస్వరూపుడయిన స్వామి కొంచెం భస్మం ఆమె చేతికి ఇచ్చి దానిని ఆమె భర్త ఉదరం మీద రాయమని చెప్పాడు. ఆమె అలానే చెసింది అతని వ్యాధి మాయమయింది.

ఒకరోజు రాంపూర్ నుండి శివప్రసాద్‌మిశ్రా తన కుమారుని పక్షవాతం బాగు చేయించుకోవడం కోసం సకుటుంబంగా కాశీకి వచ్చాడు. మందులెన్ని ఇప్పించినా ప్రయోజనం కలుగలేదు స్వామిని గురించి విని ఆయన భార్య పిల్లవానిని తీసుకువచ్చి స్వామి పాదాలపైన పడవేశారు. వారి ప్రార్థనలకు మనసు కరిగిన స్వామి ఆపిల్లవానిని ఒక్కసారి తాకి ఇంటికి తీసుకు వెళ్ళమన్నాడు. ఆ బాలునకు మామూలు స్థితి వచ్చింది. నెమ్మది నెమ్మదిగా స్వామి మహానుభావుడని, దివ్యశక్తులు కలవాడని ప్రచారం ఎక్కువ కావటంతో స్వామి తన సాధనకు ఆటంకాలు ఎక్కువ అయిపోతున్నవని భావించి, వాటిని తొలగించటంలో ఒక భాగంగా మాట్లాడటం తగ్గించి వేశాడు. ఎప్పుడో అత్యవసరమని అనిపించినపుడు తప్ప మౌనంగా ఉండటంవల్ల ‘మౌనిబాబా’ అన్న పేరు ప్రచారంలోకి వచ్చింది. కొత్తవారు ఈయన ఎక్కడివారని అచ్చటి ప్రజలని అడిగినపుడు, తెలుగుదేశం నుండి వచ్చాడని చెప్పటంవల్ల

త్రైలింగస్వామి అన్న పేరు వ్యవహారంలోకి వచ్చి నిల్చిపోయింది, చుట్టూ ఉన్న ప్రజలను వాతావరణాన్ని పట్టించుకోకుండా పరిపూర్ణమైన అవధూత స్థితిలో ఉండటం ఎక్కువ అయింది. ఎండాకాలపు మండుటెండలో గంగ ఒడ్డున ఇసుకలో పడుకొని ఉండేవాడు. ఈయనకు పేరు ఎక్కువ అయిన కొద్ది కొందరికి అసూయ కూడ ఎక్కువ అయింది. ఈయన అంటే గిట్టని ఒకదుర్మార్గుడు, సున్నపునీరు త్రాగటానికి ఇచ్చాడు. స్వామి ఏమీ పట్టించుకోకుండా గటగటా త్రాగేశాడు. ఆయనకు ఏమీ కాలేదు. ఒకరోజు ఒకధనవంతుడు స్వామి యందు భక్తితో 20 తులాలు ఉన్న రెండు బంగారపు కంకణాలు సమర్పించాడు. వాటిమీద కన్నేసిన కొందరు దుష్టులు ఆయనకు మత్తు మందు కలిపిన ఆహారం ఇచ్చారు. ఆ ఆహారం ఆయన తీసుకున్నా ఆయన మీద పనిచేయలేదు. ఏమాత్రం కోపం తెచ్చుకోకుండా ఆ ఆభరణాలను వారికి ఇచ్చేశాడు. ఈ విధంగా స్వామి ఎవరెవరో తనకిచ్చిన కానుకలన్నింటిని వచ్చిన వారికి ఇచ్చివేసేవాడు, ఏదీ తన దగ్గర ఉంచుకొనేవాడు కాదు.

కాశీలోని ప్రజలకు ఆయన దిగంబరత్వం అలవాటు అయినా ఆనాడు దేశాన్ని పరిపాలించే తెల్ల దొరలకు అది నచ్చలేదు. కొందరు అధికారుల భార్యలు బజారుకు వచ్చినపుడు ఈయనను చూచి మేజిస్ట్రేటుకు రిపోర్టు చేశారు. ఆ అధికారి పోలీసులను పంపి వీరిని అరెస్టు చేయమన్నాడు. పోలీసులు ఈయనను మేజిస్ట్రేటు దగ్గరకు తీసుకు వెళ్ళారు. ఆ అధికారి ఈయనను ధోవతి కట్టుకోమని ఆజ్ఞాపించాడు. స్వామి ఆమాట పట్టించుకోలేదు. అతనికి సంకెళ్ళు వేసి జైల్లో పెట్టమని అధికారి ఆజ్ఞాపించాడు. పోలీసులు దగ్గరకు రాగానే స్వామి అదృశ్యుడయినాడు. అందరూ దిగ్భ్రాంతులయినారు. కాసేపు గడచిన తరువాత మళ్ళీ స్వామి అక్కడ ప్రత్యక్షమయినాడు. దానిని చూచిన మేజిస్ట్రేటు ఆయన మహిమాన్వితుడని గ్రహించి స్వామి జోలికి పోవద్దని ఆదేశించాడు. అప్పుడప్పుడు ఇటువంటి ఇబ్బందులు పునరావృతమవుతూనే ఉండేవి. మరొక మేజిస్ట్రేటు స్వామిని జైలులో పెట్టించాడు. వేసిన తాళాలు వేసినట్లు ఉండగానే స్వామి కటకటాలకు ఇవతల కనపడటంతో జైలు అధికారులు ఖంగుతిన్నారు. మేజిస్ట్రేటు ముందు

హాజరు పరచగా స్వామిని ఇబ్బంది పెట్టాలన్న ఉద్దేశ్యంతో ఆ న్యాయాధికారి స్వామితో "జైలుగదిలో నుండి బయటకు రాగలిగిన మహిమలున్న వాడవటకదా! నిన్ను విడిచిపెడతాను. అయితే! నీవు శాకాహారివని విన్నాను. నాతో పాటు మాంసం తింటే నిన్ను విడుదల చేస్తాను" అన్నాడు. స్వామి న్యాయాధికారితో "నేను తినేది మీరు తింటానంటే మీరు తినేది నేను తింటాను. నాకు అభ్యంతరం లేదు" అన్నాడు. న్యాయాధికారి 'దానికేముంది అలానే" అన్నాడు. స్వామి ఎలానూ శాకాహారమే తీసుకొంటాడు కనుక తాను మాంసాహారి కనుక మాంసం తినమంటే స్వామి ఎలా తింటాడో చూడాలని కుతూహలం. మేజిస్ట్రేటు మాట వినగానే త్రైలింగ స్వామి కోర్టుహాలులో మలవిసర్జన చేశాడు. దానిని చేత్తో తీసిపట్టుకొని "మేజిస్ట్రేటుగారూ! ఇదే నేను తినేది నేను తింటాను, మీకు ఇస్తాను, మీరు తింటారు కదా?" అన్నాడు. న్యాయాధికారి అసహ్యించుకొని "తిను నువ్వు ఎలా తింటావో చూస్తాను" అన్నాడు. స్వామి ఏ సంకోచమూ లేకుండా నోట్లో పెట్టుకొని తినేసాడు. అది తియ్యటి రసగుల్లాగా మారిందని కొందరు లేఖకులు వ్రాశారు. మారినా మారకపోయినా యోగులకది విశేషం కాదు. దీనిని చూచిన ఆ తెల్లదొర స్వామిని విడుదల చేసి మీ ఇష్టము వచ్చినట్లు వెళ్ళవచ్చును అన్నాడు. ఇటువంటి సంఘటనలతో స్వామి మహిమ దశదిశలా వ్యాపించింది.

1788 వ సంవత్సరంలో ఆ ప్రాంతపు రాజొకడు సకుటుంబంగా సపరివారంగా గంగా స్నానానికి కాశీ వచ్చాడు. రాణీగారు స్నానం చేయటం కోసం ఆయన భటులు ఆ ఘాట్‌ను ఖాళీ చేయించారు. ఆమె స్నానం చేస్తూ ఉండగా నదిలో నుంచి స్వామి బయటకు వస్తున్నాడు ఆ దీర్ఘస్థూల దిగంబరుని చూచి రాణీగారు మిగతా స్త్రీలు, పెద్దగా అరచి ఇవతలకు వచ్చేశారు. ఆగ్రహించిన రాజు భటులను ఆజ్ఞాపించగా వారు వెళ్ళి ఆయనను బంధించటానికి ప్రయత్నించారు. స్వామి చిక్కినట్లే చిక్కి వెళ్ళిపోయాడు. ఆ రోజు రాత్రి రాజుగారికి కలలో పులి ముఖం కలిగిన ఒకభయంకర ఆకారం పైనబడి మహనీయుడైన స్వామిని ఇబ్బంది పెట్టినందుకు గాను కాశీ విడిచిపెట్టి వెళ్ళిపొమ్మని బెదిరించింది. భయంతో వణికిపోతూ కలచెదిరి లేచి పెద్దగా అరచి రాజు స్పృహతప్పిపోయాడు. పరివారమంతా

అదుర్దాపడ్డారు. కాసేపటికి స్పృహవచ్చింది. తెల్లవారింతరువాత స్వామి ఎక్కడ ఉన్నాడో కనుక్కొని రాజుగారు వెళ్ళి ఆయన కాళ్ళమీద పడ్డాడు.

1800 సంవత్సరంలో స్వామి ఒక స్థిర నివాసంలో కుదురుకొన్నారు వేదవ్యాసాశ్రమం నుండి హనుమాన్ ఘాట్, అక్కడ నుండి దశాశ్వమేధ ఘట్టము, అక్కడ నుండి పంచగంగా ఘట్టము, ఇలా ఒకచోట నుండి ఒక చోటుకు మారుతున్న స్వామి దక్షిణదేశం నుంచి వచ్చిన మంగళదాస్ అనే భక్తుని ప్రార్థన మన్నించి బిందుమాధవ దేవాలయ ప్రాంతంలో భక్తులు నిర్మించిన ఆశ్రమంలో ఉండటం మొదలుపెట్టాడు. మంగళదాస్ ఠాకూరు, ఆయన సోదరుడు కృష్ణ ప్రసాద్ ఆయనను సేవించేవారు. వాళ్ళ తల్లి అంబాదేవి స్వామికి వంటచేసి పెట్టేది. ఆశ్రమంలోని ఒక గది ప్రత్యేకంగా ఆయన ఏకాంత మందిరంగా ఉండేది. దాంట్లో ఒకరమణీయమైన కాళీ విగ్రహాన్ని స్థాపించి రోజు దానికి పూజ, హారతి చేసేవాడు. అప్పుడాయన కాళీ భక్తుడని శిష్యులకు ప్రజలకు తెలిసింది. ఇప్పటికీ ఆయన పూజించిన కాళీదేవి ఆయన ఆశ్రమంలో (కాశీలో) ఉన్నది. తల్లి మరణించిన తరువాత ఆ మిషతో శ్మశానవాసం చేసి కాళీ సాధన చేసి ఆమె యొక్క దివ్యానుగ్రహాన్ని పొందిన మహాసిద్ధుడన్న సంగతి తెలిసినవారు కొద్దిమందే.

తన ఆశ్రమంలో 'మంగళకాళిని' స్థాపించిన తరువాత ఒకరోజు రాత్రి ధ్యాన సమయంలో కాళీదేవి సాక్షాత్కరించి ఇలా పలికింది. "నాయనా! దివ్యమైన ఈ అవిముక్త క్షేత్రంలో స్థిరనివాసం ఏర్పరుచుకొన్నావు. నన్నిక్కడ స్థాపించి రోజూ పూజిస్తున్నావు. సంతోషకరమైన విషయమే. ఇది విశ్వనాధుని క్షేత్రం. ఇక్కడి క్షేత్రపాలకుడు 'కాలభైరవుడు'. ఏ క్షేత్రానికి వచ్చినపుడు అక్కడి దేవతలను పూజించాలి. అది మర్యాద. నీవు గంగా స్నానము, విశ్వనాధుని దర్శనము చేస్తూనే ఉన్నావు. మంచిదే-క్షేత్ర పాలకుడయిన కాలభైరవుని అనుమతి ఉంటేనే ఇక్కడ నివసించటం సాధ్యం. కనుక మహావీరుడయిన కాలభైరవుని దర్శనానికి వెడుతూ ఉండు. ఆయన అనుగ్రహం ఎంతయినా అవసరం. మరొక ప్రధానమైన అంశం-త్వరలో ఇక్కడికి హిమాలయ పర్వతాలనుండి ఒక సిద్ధ పురుషుడు వస్తాడు. అతడు నా అనుగ్రహానికి

పాత్రుడైనవాడు. కఠోరదీక్షతో అతడు చేసిన తపస్సుకు మెచ్చి అతనికి దివ్యశక్తులు ఎన్నో ఇచ్చాను. నా ప్రతి రూపంగా సజీవమైన శిలా విగ్రహమొకటి అతనికి అనుగ్రహించాను. అది వయసును బట్టి పెరిగే విగ్రహం అతను ఇప్పటికే దాదాపు 300 ఏండ్ల వయసువాడు అతనిని దర్శించు, నీకు మేలు కలుగుతుంది".

ఈ దర్శనం కలిగిన రోజునుండి త్రైలింగస్వామి కాలభైరవాలయానికి హారతి సమయానికి తప్పక వెళ్లేవాడు. 'కాశికా పురాధినాథ కాలభైరవం భజే' అంటూ కాలభైరవ అష్టకాన్ని భక్తితో పఠించేవాడు.

తదనంతరం కొద్దిరోజులకే హిమాలయ పర్వతప్రాంతం నుండి సంచారం చేస్తూ జగన్మాత చెప్పిన కాళీయోగి వారణాసి క్షేత్రానికి వచ్చాడు. త్రైలింగ స్వామి ఆయనను దర్శించి ఆయన దగ్గర ఉన్న కాళీదేవి విగ్రహాన్ని చూచి ముచ్చటపడి దానిని పూజించటానికి అనుమతి కోరాడు. త్రైలింగస్వామి కూడా కాళీదేవి అనుగ్రహానికి పాత్రుడయినవాడని తెలుసు కనుక ఆయన అనుమతి ఇచ్చాడు. ఆయన కాశీలో ఉన్నంత కాలం త్రైలింగస్వామి ఆయన వసతికి వెళ్ళడం, అప్పుడప్పుడు ఆయన త్రైలింగ స్వామి ఆశ్రమానికి రావటం జరిగేది. కొంతకాలం గడచిన తరువాత కాళీ యోగి అక్కడనుండి బయలుదేరి వెళ్ళేసమయంలో త్రైలింగ స్వామి "మీ రిక్కడే ఈ కాశీ క్షేత్రంలో ఉండవచ్చు గదా " అని అన్నాడు. ఆమాటలకు కాళీయోగి ఇలా జవాబు చెప్పాడు. "త్రైలింగస్వామీ! మన మా జగన్మాత కాళీదేవి యొక్క ఉపకరణాలము. ఆమె ఏమి నిర్దేశిస్తే అది చేయటమే మన కర్తవ్యం. పరమేశ్వరి నీకు కాశీక్షేత్ర నివాసాన్ని నిర్ణయించింది. నా జీవిత గమనం వేరు. నేనింకా జన్మలు ఎత్తవలసి ఉన్నది. ఇప్పటికి కలియుగ ప్రారంభం నుండి అవసరమయిన జన్మలు ఎత్తి భగవత్ తత్వప్రచారం చేస్తున్నాను. ద్వాపరాంతంలో నాగజాతి వాడనై కామాఖ్యలో కాళిని గూర్చి తపస్సు చేశాను. ఇప్పుడు మళ్ళీ హిమాలయాలలో తపస్సు చేయటం జరిగింది. సిద్ధమండల యోగుల ఆజ్ఞవల్ల భూమిపై అప్పుడప్పుడు పుట్టి దైవతత్వ ప్రచారం చేసే బాధ్యత వహించవలసి వస్తున్నది. కాళీదేవి ఆజ్ఞవల్ల నేనిప్పుడు బృందావనం వెడుతున్నాను. రసదేవతలయిన

రాధాకృష్ణులు నన్ను కరుణించి నాల్గువేల ఏండ్ల క్రింద సర్పయాగంలో ఆహుతికాకుండా రక్షించారు. ఇప్పుడు మళ్ళీ అక్కడకు వెళ్ళి కొంత కాలం ఉంటాను. జన్మాంతర సఖులైన కొందరు గోస్వాములను రాధాకృష్ణ భక్తులను కలసికొని వారితో కొంతకాలం భక్తిరసామృత సింధువులో మజ్జన మాడుతాను. ఆ పిమ్మట కళింగ దేశంలోని భువనేశ్వర ప్రాంతానికి వెళ్ళి ఒక ఆశ్రమాన్ని నిర్మిస్తాను. అప్పటికి నా దగ్గరి కాళీ విగ్రహం పెరిగి పెద్దదవుతుంది. దానిని అక్కడ స్థాపించి నా శిష్యుల కప్పగించి ఈ శరీరాన్ని విడిచి పెడతాను. కొన్నాళ్లకు దక్షిణ దేశంలో జన్మించి కాళీ భక్తుడనై దేశ సంచారం చేస్తూ కాశీ వచ్చి రెండో సారి నిన్ను చూస్తాను. అప్పటికి నీవు ఇంకా జీవించే ఉంటావు. ఆతరువాత నీవీ క్షేత్రంలో ఇచ్ఛాపూర్వకంగా కాళీదేవి ఆజ్ఞవల్ల శరీరాన్ని వదలివేస్తావు. నేను కూడా ఎక్కడో శరీరాన్ని వదలి మళ్ళీ ఆంధ్రదేశంలో పుట్టి తపస్సు చేసి సన్యాసినై 'సిద్ధేశ్వరానంద భారతీస్వామి' అన్న పేరుతో సంచారం చేస్తూ మళ్లీ కాశీకి వచ్చి నీ ఆశ్రమాన్ని చూస్తాను. నీ శిష్యులు కొందరు జన్మలు మారి సాధన పరిపూర్ణతకోసం నా దగ్గరకు చేరుతారు. ఇలా కాళీదేవి ఇచ్ఛ ఒక్కొక్కరి యందు ఒక్కొక్క విధంగా ప్రసరిస్తుంది. ఏమైనా నీవు అదృష్టవంతుడవు." త్రైలింగ స్వామి ఆశ్చర్యంతో ఆ కాళీయోగిని విస్ఫారిత నేత్రాలతో చూస్తున్నాడు. ఆ సమావేశం అలా ముగిసింది. ఈ సిద్ధపురుషుని జీవితంలో జరిగిన మహిమాన్వితపు సంఘటనలను వర్ణిస్తే అసంఖ్యాకంగా ఉన్నవి. అందరూ చూచిన ఒక అద్భుత సంఘటనను ఉదాహరిస్తున్నాను. 1810 వ సంవత్సరంలో ఉజ్జయిని రాజు వారణాసి వచ్చి కాశీరాజుకు అతిథిగా ఉన్నాడు. అతడు మణికర్ణికా ఘాట్ ప్రాంతంలో పడవలో ప్రయాణం చేస్తుండగా కొంత దూరంలో స్వామి నీటిపై తేలియాడుతూ కన్పించాడు. ప్రక్కన ఉన్నవారు ఆ స్వామి మహిమలను గురించి రాజావారికి చెప్పారు. పడవను స్వామి దగ్గరకు తీసుకువెళ్ళమని చెప్పి ఆ రాజు స్వామిని తనపడవలోకి రావలసినదిగా ఆహ్వానించాడు. స్వామి పడవలోనికి వచ్చి రాజుగారి దగ్గర మణులు పొదిగిన పిడితో ఉన్న కత్తిని చూచి అదేమిటని ప్రశ్నించాడు? అది బ్రిటీష్ ప్రభుత్వం వారు తన కిచ్చిన బహుమతి అని సగర్వంగా చెప్పి చూడమని స్వామి చేతికి ఇచ్చాడు. స్వామి దానిని చేతిలో పట్టుకొని అటూ

ఇటూ త్రిప్పుతూ ఉండగా అది గంగలో పడిపోయింది. ఆగ్రహోదగ్రుడైనరాజు స్వామిని శిక్షించాలని అనుకొన్నాడు. ప్రక్క ఉన్నవారు ఈతగాళ్ళను పిలిపించి కత్తిని వెతికిద్దామని అంటున్నారు. రాజు ముఖకవళికలను చూచిన స్వామి గంగ నీటిలో చేయిపెట్టి రెండు కత్తులను తీసాడు. రెండూ ఒకవిధంగా రాజుగారి కత్తివలెనే ఉన్నవి. ఇందులో నీ కత్తి ఏదో తీసుకో అన్నాడు స్వామి. రెండు తన చేతిలోకి తీసుకొని రాజు ఎంత పరీక్షించినా తనదేదో కనుక్కోలేకపోయినాడు. "నీ వస్తు వేదో నీవే తెలుసుకోలేవు, అస్థిరమైన వీటి మీద మమకారం పోగొట్టకోలేని వాడివి నీవు" అన్నాడు స్వామి. తన ఆగ్రహానికి క్షమించమని రాజు స్వామి కాళ్ళ మీద పడ్డాడు. అతని కత్తి అతనికి ఇచ్చి రెండవ దానిని నీటిలో విసిరేసి స్వామి తాను కూడ నీళ్ళలోకి దూకి వెళ్ళిపోయినాడు.

1863 వ సంవత్సరంలో కలకత్తా నుండి రామకృష్ణ పరమహంస కాశీ యాత్రకు వచ్చి విశ్వనాధుని దర్శించిన తరువాత త్రైలింగ స్వామిని గూర్చి విని దర్శనానికి వెళ్ళాడు. సమున్నత స్థూల శరీరుడు, దిగంబరుడు అయిన ఈ యోగి అప్పటికే 250 సంవత్సరాల వయస్సు పైబడిన వాడని విన్నప్పుడు ఆశ్చర్యం కలిగింది. ఏవో సాధనలు చేసి దీర్ఘకాలం జీవించిన వ్యక్తిగా భావించి వెళ్ళిపోయినాడు. మొదటి దర్శనంలో ఆయనకు గొప్ప అభిప్రాయమేమీ కలుగలేదు. తిరిగి తన స్వస్థానికి చేరుకొన్న తరువాత కాళీదేవి ముందు ధ్యానం చేస్తుంటే దేవి ఆయనకు సందేశం ఇచ్చింది. "నాయనా! త్రైలింగ స్వామిని నీవు తెలుసుకోలేకపోయినావు. అతడు నా చిరకాల భక్తుడు. కఠోర దీక్షలతో ఎన్నో సంవత్సరాలు ఏకాంత తపస్సు చేసి నా అనుగ్రహాన్ని పొందాడు. దయతో అతనికి ఎన్నో సిద్ధశక్తులు ప్రసాదించాను. నీవు మళ్ళీ కాశీకి వెళ్ళి అతనిని పూజించు".

రామకృష్ణుడు పరమేశ్వరి ఆజ్ఞకు ఆశ్చర్య చకితుడై, కొద్ది కాలానికే ఆప్తులతో శిష్యులతో ఒక వంద మందిని తీసుకొని వారణాసికి వెళ్ళి ఆ మహనీయుని దర్శించాడు. తాను స్వయంగా ఆవుపాలతో పాయసం వండి అది త్రైలింగ స్వామికి సమర్పించి దగ్గర ఉండి స్వయంగా తినిపించాడు పరమహంస అడిగిన ప్రశ్నలన్నింటికి త్రైలింగస్వామి హస్త సంజ్ఞలతో

సమాధానమిచ్చి, ఒక చిన్న నస్యపు పెట్టెను తన గుర్తుగా బహూకరించాడు. రామకృష్ణ పరమహంస తరువాత కాలంలో త్రైలింగ స్వామి గొప్ప అవధూత అని పరమహంస అని ప్రాస్తావికంగా తన శిష్యులకు తెలియచేశాడు. అనంతర కాలంలో వివేకానంద స్వామి కూడా వారిని దర్శించి పూజించాడు.

1869 లో స్వామీ దయానంద సరస్వతి కాశీకి వచ్చి విగ్రహారాధనను నిరసిస్తూ ప్రసంగాలు చేస్తున్నాడు. ఈ విషయాన్ని త్రైలింగస్వామి దృష్టికి తీసుకు వచ్చినపుడు ఆయన మంగళదాస్ అనే తన శిష్యుని పిలిచి చిన్న కాగితపు ముక్క మీద రెండు వాక్యాలు వ్రాసి పంపించాడు. ఏమి వ్రాశాడో ఎవరికీ తెలియదు. ఆ కాగితం చూచిన వెంటనే దయానంద సరస్వతి మూటా ముల్లె సర్దుకొని కాశీ విడిచి వెళ్ళిపోయినాడు.

1874 వ సంవత్సరంలో స్వామీ పృధ్వీగిరి అనే గొప్ప యోగి శిష్యుడు, స్వామి విద్యానంద కాశీకి వచ్చినపుడు పరిచితులు క్షేత్రంలోని విశిష్ట స్థానాలు చూచే ఏర్పాటు చేయమంటారా అని అడిగారు. ఆయన ఒక్క త్రైలింగ స్వామిని చూడటం తప్ప ఇంక ఏమీ చూడాలన్న కోరిక తనకు లేదని చెప్పి, వారి దర్శనానికి శిష్యులందరితో కలిసి వెళ్ళాడు. త్రైలింగస్వామి అతనిని ఆప్యాయంగా కౌగిలించుకొని ఇద్దరూ అదృశ్యులయి పోయినారు. కాసేపటికి త్రైలింగస్వామి ఒక్కరూ కనిపించారు. తామిద్దరము మాట్లాడుకొంటూ వెళ్ళామని విద్యానందస్వామిని రాజాఘాట్‌లో విడిచిపెట్టి వచ్చానని అన్నారు. అది నిజమో కాదో తెలుసుకోవటానికి ఆ శిష్యులు ఆ ఘట్టానికి వెంటనే వెళ్ళి తమ గురువుగారిని చూచి ఆనందించారు. రామకమల్ ఛటోపాధ్యాయ అనే సోనాపూర్ వాసి కుమారుడు అయిదేండ్లవాడు మెట్ల మీద నుంచి పడి ఊపిరితిత్తులకు పక్కనున్న ఎముక విరిగింది. దానిని బాగు చేయటం వైద్యుల వల్ల కాలేదు. స్వామిని ప్రార్థించగా గంగలోని బురద తెచ్చి దెబ్బ తగిలిన ప్రదేశంలో రాయమని, రాసిన వెంటనే జ్వరం వస్తుందని, ఇంకాసేపటికి ఆకలి అవుతుందనీ, అప్పుడేదో కొద్ది ఆహారం ఇవ్వవచ్చునని, దానితో విరిగిన ఎముక అతుక్కొంటుందని చెప్పి పంపాడు. స్వామి చెప్పిన ప్రకారం వారు చేశారు- పిల్లవాడు కోలుకొన్నాడు.

భవానీచరణ్ అనే మరొక పౌరుడు జ్వరము, విరేచనాలు, మరి అనేక బాధలతో ఏళ్ళ తరబడి బాధ పడుతున్నాడు. అతడు ఆర్తితో వచ్చి స్వామిని ఆశ్రయించాడు. దుష్కర్మ పీడితుడయిన అతనిని స్వామి ఎన్నో విధాల పరీక్షించారు. ఒకరోజు వాంతి చేసుకొని మరొక రోజు మల విసర్జన చేసి ఆ ప్రదేశాలను శుభ్రం చేయమన్నాడు. వాడు ఏమీ సందేహించకుండా అసహ్యించుకోకుండా శుభ్రం చేశాడు. స్వామి, అతని యందు దయకలిగి కొంత భంగు అతనికిచ్చి తినమన్నాడు. వాడు దానిని తిన్న తరువాత "నీవింక నా దగ్గరకు రానక్కరలేదు – రోగం కుదురుతుంది ఫో" అన్నాడు. మరునాటికి వాడి రోగాలన్నీ మాయమయినవి. అయినా వాడు రావటం మానలేదు. రోజూ స్వామిని దర్శించి వీలైన సేవచేసేవాడు.

కలకత్తా హైకోర్టు న్యాయమూర్తిగా పదవీ విరమణ చేసిన ఒక నాస్తికుడు కాశీవచ్చి విశ్వనాథుని చూచాడు. నమస్కరించటం కానీ ప్రార్థించటం కానీ చేయలేదు. ఏదో వింత చూడటానికి వచ్చినట్లు చూచి వెళ్ళాడు. తెలిసిన వారెవరో త్రైలింగస్వామిని గూర్చి చెపితే ఆయన్ను చూడటానికి వెళ్ళాడు. మౌని అయిన స్వామి మాట్లాడలేదు. అతని వైపు ఒకసారి చూచారు. అంతే! ఆ న్యాయమూర్తిలో ఏదో మార్పు వచ్చింది. అతని చెవిలో ఎవరో 'స్వామి మహనీయుడు, వెళ్ళి కాళ్ళ మీదపడు' అని ఆజ్ఞాపించినట్లు వినిపించింది. అటూ ఇటూ చూచాడు, ఎవరూ లేరు. ఇంతలో ఎవరో ఒక తోపు తోసినట్లనిపించింది స్వామి కాళ్ళ మీద అతడు బొక్క బోర్లా పడ్డాడు. స్వామి చిరునవ్వు నవ్వుతూ ఉన్నారు. ఆక్షణం నుండి ఆ న్యాయమూర్తి సనాతనధర్మ విశ్వాసిగా మారిపోయినాడు. స్వామి దృష్టి యొక్క ప్రభావం అటువంటిది.

ఆశ్రమంలో ఒక పెద్ద గొయ్యి త్రవ్వించి స్వామి అందులో కూర్చుండేవాడు. విశ్వనాథునికి అభిషేకం చేసినట్లుగా భక్తులు చిల్లుల పాత్రలో నీళ్ళు పోసి ఆయనకు అభిషేకం చేసేవారు. సాయంకాల హారతి సమయాలలో తన గదిలోని కాళీదేవికి స్వామి స్వయంగా కర్పూర నీరాజనం సమర్పించేవాడు. ప్రధానమైన పూజా దినాలు వచ్చినపుడు ఆశ్రమంలో హారతి పూర్తి చేసి, సరాసరి కాలభైరవాలయానికి హారతి సమయానికి వెళ్ళి భైరవుని

పూజించేవాడు. ఆ దేవుని యందు ఏర్పడిన భక్తికి చిహ్నంగా కాలభైరవ విగ్రహం కూడా స్వామి వారి ఆశ్రమంలో స్థాపించబడింది. కాలభైరవాలయంలో కూడా స్వామి వారి విగ్రహాన్ని భక్తులు స్థాపించారు. ఇప్పటికీ భక్తులు దానిని చూడవచ్చు. కాళీ, కాలభైరవుడు కాలజయాన్ని ప్రసాదించి దీర్ఘాయువును ఇచ్చే దేవతలు కదా!

కాలభైరవాలయం పక్కనే ఒక పేద ముసలమ్మ పాలు అమ్ముకొనేది. ఆమె వ్యాపారం సరిగ్గా సాగడం లేదు. స్వామివారియందు ఆమెకు భక్తి ఏర్పడి ఆయన కాలభైరవాలయానికి వచ్చినప్పుడల్లా గోరువెచ్చని పాలు ఒక పాత్రలో స్వామికి సమర్పించేది. స్వామి ఆదరంగా ఆ పాలను త్రాగేవాడు. కొద్దికాలానికి ఆమె వ్యాపారం మూడుపూవు లారుకాయలుగా వర్ధిల్లింది.

ఆ కాలంలో కాశీలో కీనారామ్ అఘోరి గొప్ప పేరుగల సిద్ధుడు. అతడు 179 సంవత్సరాలు జీవించాడు. త్రైలింగస్వామి, అతడు మంచిమిత్రులు. ఒకరోజు స్వామి అసిఘాట్ ప్రాంతంలో ఉన్న అతని ఆశ్రమానికి వెళ్ళి అక్కడ అనాలోచితంగా అతని సింహాసనం మీద కూర్చున్నాడు అతని శిష్యులకు కోపం వచ్చింది. వారు వెళ్ళి తమ గురువుగారితో ఈ విషయం చెప్పారు. ఆయన వెంటనే తన శిష్యులతో స్వామి మహానుభావుడు ఎక్కడ కూర్చున్నా పరవాలేదని చెప్పి స్వామి దగ్గర మరొక కుర్చీలో కూర్చుని చాలా సేపు మాట్లాడుకొన్నారు. సంభాషణ జరుగుతూ ఉండగా శిష్యులు ఆతిథ్య మర్యాద కోసం వారి పద్ధతి ననుసరించి ఒకముంతెడు భంగు కలిపిన పాలు తెచ్చి ఇచ్చారు. స్వామి ఆ ముంతెడు త్రాగి పాత్ర ప్రక్కన పెట్టాడు. శిష్యులు ఆయన పూర్తిగా పాత్ర ఖాళీ చేయటం చూచి మరొక ముంతెడు తెచ్చి ఇచ్చారు. స్వామి త్రాగుతూ ఉన్నాడు. అయిదు ముంతలు పూర్తయినవి. స్వామి మామూలుగా ఆ పదార్థానికి అలవాటు పడ్డవాడు కాడు. సాత్విక ఆహారం తీసుకోనే మనిషి. కీనారామ్ శిష్యులు దిగ్భ్రాంతితో చూస్తున్నారు ఎందుకంటే ఒక ముంతెడు త్రాగితేనే కళ్ళు తిరుగుతవి. ఒళ్ళు తూలుతుంది. స్వామి అయిదుముంతలు ఎలా త్రాగాడో వారికి ఆశ్చర్యం వేసింది. ఈయన ఈపూట ఇక్కడ కళ్ళు తిరిగి పడిపోక

తప్పదు అనుకొన్నారు. కాసేపటికి మాట్లాడడం పూర్తయిన తరువాత త్రైలింగస్వామి కీనారాంతో చెప్పి తన ఆశ్రమానికి బయలుదేరాడు. ఆయన ముందుకు నడచి వెడుతూఉంటే కొంచెం తూలినట్లుగా కనిపించి, కీనారామ్ ఆశ్రమందాకా తోడు వెళ్ళమని తన శిష్యులను పంపించాడు కొద్ది దూరం వెళ్ళిన తరువాత తనతో వస్తున్న వారిని చూచి "మీరు నాతో ఎందుకు వస్తున్నారని అడిగాడు స్వామి". "మీ ఆశ్రమం దాకా పంపించి రమ్మని చెప్పారు మాగురువుగారు" అన్నారువారు. వారి వైపు చూచి నవ్వి స్వామి అదృశ్యుడయినాడు.

గంగా స్నానం ఆయనకు చాలా ఇష్టమైన అంశం. ఎండలుగాని, వానలుగాని, చలిగాని ఏమైనా సరే ప్రతిరోజూ గంగా స్నానం చేయవలసిందే. ఒక్కొక్క సారి గంటల తరబడి నీళ్ళలో మునిగి ఉండేవాడు. ఒక్కొక్క సారి నీళ్ళమీద తేలుతూ ఉండేవాడు. మరొకసారి నది మీద నడిచి వెళ్ళేవాడు.

బీహారులోని ముంగేర్‌లో ఉమాచరణ్ ముఖోపాధ్యాయ అనే ప్రభుత్వోద్యోగి ఉండేవాడు. హరిద్వార్ మొదలైన తీర్థయాత్రలకు వెళ్ళటం కోసం మూడు నెలలు సెలవు తీసికొని మొదట కాశీకి వెళ్ళాడు. అతని స్నేహితునికి కాశీలో ఒక ఇల్లు ఉన్నది. దానిని నిర్వహించటానికి అతడు ఏర్పాటు చేసిన రామచందర్ ముఖోపాధ్యాయ అనే వ్యక్తికి ఆ మిత్రుడు ఒక ఉత్తరం వ్రాసి ఇచ్చాడు. దానివల్ల వారణాసిలో ఏ ఇబ్బందులు లేకుండా గతించిన తల్లితండ్రులకు చేయవలసిన క్షేత్రవిధులు నిర్వర్తించాడు. కాశీలో చూడవలసిన ప్రదేశాలను చూచిన తరువాత రామచంద్ర త్రైలింగస్వామి గూర్చి మహిమాన్వితుడైన యోగిగా వర్ణించి పంచగంగా ఘాట్‌లోని ఆశ్రమానికి వెళ్ళి ఆయనను దర్శించమని సలహాఇచ్చాడు. ఉమాచరణ్ సంస్కృతం బాగా చదువుకొన్నవాడు. వేదాంత గ్రంథాలు ఎన్నో చదివాడు. పఠించిన కొద్దీ సంశయాలు పెరుగుతున్నవి. ఎవరైనా మహాపురుషులు ఋషితుల్యులు దొరికితే సందేహాలు తీర్చుకోవాలని ఆశతో ఉన్నాడు. ఈ స్వామిని గురించి విని మరునాడు ఉదయం పెందలకడ లేచి గంగా స్నానం చేసి స్వామి దర్శనానికి వెళ్ళి, నమస్కారం చేసి, దూరంగా కూర్చుని స్వామి వైపు చూస్తున్నాడు.

అతనిని చూస్తూనే మౌనిగా ఉన్న స్వామి చేతితో అక్కడి నుండి వెళ్ళి పొమ్మని సౌంజ్ఞచేశాడు. స్వామి అనుచరుడు మంగళదాస్ ఆలస్యం చేయవద్దని హెచ్చరించి పంపివేశాడు. మళ్ళీ మరునాడు వెళ్ళాడు. కలకత్తా నుంచి ఒక వకీలు స్వామి దర్శనానికి వచ్చాడు. అతడిని దూరంగా ఉండమని తన అనుచరులకు స్వామి సూచించాడు. అందరూ వెళ్ళిపోయిన తరువాత ఆ వకీలు స్వామి దగ్గరకు వెళ్ళి వినయంగా తనను దూరంగా ఉంచటానికి కారణం తెలియచేయమని ప్రార్థించాడు. అనూహ్యంగా స్పందించి స్వామి "నీవు నీ భార్య తల్లితో అక్రమ సంబంధం పెట్టుకున్నావు. ఇక్కడకు రాదగవు వెళ్ళు" అన్నాడు. ఆ న్యాయవాది తలవంచుకొని వెళ్ళిపోయాడు. మరొకరోజు ఇంకోవ్యక్తిని ఇలానే నీ మనస్సు ఇక్కడ లేదు. బయట పెట్టిన ఖరీదైన చెప్పులమీద ఉన్నది. అవి భద్రంగానే ఉన్నవి, వెంటనే వెళ్ళి వాటిని తొడుక్కొని వెళ్ళిపో" అన్నాడు స్వామి. ఇవన్నీ చూస్తూ వింటున్న ఉమాచరణ్ ప్రతిరోజూ రావటం దూరంగా నించోటం నమస్కారం చేయటం, స్వామి వెళ్ళిపోమంటే వెళ్ళిపోవడం ఇలా 12 రోజులు గడచినవి 13 వరోజు స్వామిని చూచి ఆర్తుడై ఏడవటం మొదలుపెట్టాడు. స్వామి ఆజ్ఞ మీద అనుచరుడు మంగళదాస్ ఉమాచరణ్‌కు ఎర్రని సుద్దరాయి ఇచ్చి దానిని పెద్ద బండమీద పెట్టి గంధం లాగా తీయమన్నాడు. ఇతడు గంధం తీయటం, స్వామి దానిని ఎవరికో ఇవ్వటం ఇలా కొన్నాళ్ళు సాగింది. 28 రోజులు ఈ విధంగా గడచినవి. అలవాటు లేని ఈ పనికి చేతులు నొప్పులు పుట్టి ఇంక ఈ సుద్దరాయి పని చేయలేను అన్న స్థితికి వచ్చాడు, చేయకపోతే బయటకు పంపిస్తాడేమో అని భయం. ఈ భయంతో బాధతో వెళ్ళిన అతనిని ఆ రోజు ఆ పని చేయమని స్వామి చెప్పలేదు. 'నీకు సంస్కృతం వచ్చునా ?' అని అడిగారు స్వామి. వచ్చునని వినయంగా చెప్పాడు ఉమాచరణ్. అప్పుడు స్వామి తన గదిలో నుండి ఒక పుస్తకం తెప్పించి దాని నుండి కొన్ని శ్లోకాలను బెంగాలీలోకి అనువదించమని చెప్పాడు. ఉమాచరణ్ చక్కటి అనువాదం చేసి చూపించాడు. ఇలా కొన్ని రోజులు ఈ అనువాద కార్యక్రమం సాగింది. స్వామికి నెమ్మదిగా ఇతని యందు దయగలిగింది. ప్రతిరోజూ ఆశ్రమానికి రావటం, స్వామి పాదధూళి శిరస్సున ధరించటం, చెప్పిన పని చేయటం జరుగుతుండగా

ఒకరోజు స్వామికి అనుగ్రహం కలిగి లోపల ఉన్న తన గదిలోనికి తీసుకు వెళ్ళాడు. అక్కడ పరమేశ్వరి అయిన కాళీమాత విగ్రహాన్ని శివలింగాన్ని దర్శించే అదృష్టం కల్గింది. స్వామి అతనిని చూచి ఇలా అన్నారు- నేను పెట్టిన పరీక్షలో నీవు నెగ్గావు. పూర్వజన్మ సంస్కారం వల్ల నీకీ యోగ్యత లభించింది. నీకు పరమ ఆప్తుడయిన ఒక మిత్రుడు ఫలానా పేరు కలవాడు పూర్వజన్మలో నీకు తండ్రి. అలానే నీ స్వస్థలంలోని నీ మేనమామ పూర్వజన్మలో నీ స్నేహితుడు. ఇంతకు ముందు జన్మలో నీ ఊరు, పేరు ఇది.................... అని చెప్పి అతని ప్రార్థన మీద మంత్రోపదేశం చేయటానికి అంగీకరించాడు. తరువాత కొద్దిరోజులలో వచ్చేగ్రహణం నాడు ఒక ప్రత్యేక వస్తువును బ్రాహ్మణునికి దానం చేయవలసినదిగా సూచించి, ఆ తరువాత తన తగ్గరికి రమ్మన్నాడు. గ్రహణ సమయంలో దాన స్వీకారానికి ఉత్తమ బ్రాహ్మణులు దొరకరని అతడు విన్నవించగా, దొరుకుతాడు వెళ్ళు అన్నారు స్వామి. స్వామి అనుగ్రహం వల్ల గ్రహణం వచ్చినప్పుడు ఉమాచరణ్ దానం ఇవ్వగలిగాడు. బహుశ స్వామియే వచ్చి తీసుకొన్నాడేమో ! అని అత దనుకొన్నాడు. స్వామి దగ్గరకు వెళ్ళగానే నీ విప్పుడు దోషరహితుడవయినావు, అని మంత్ర దీక్ష ఇచ్చాడు.

ఉమాచరణ్ ప్రార్థన మీద అతని భిక్ష స్వీకరించటానికి స్వామి అంగీకారించారు. వండిన పదార్థాలు మొత్తం స్వామి తింటూ ఉంటే విస్తట్లో ఒక్క మెతుకు అయినా తనకు విడిచిపెట్టమని అతడు ప్రార్థించాడు. ఎందుకని, స్వామి అడిగితే అతడు 'మీ ఎంగిలి నాకు మహాప్రసాదము' అన్నాడు. ఈ విధంగా ఉమాచరణ్ స్వామి వారి ఆప్త శిష్యులలో ఒకరిగా మారగలిగాడు.

ఒకనాడు సాయంకాలం స్వామిని చూడటానికి కొందరు పరమహంసలు వచ్చారు. వారి దగ్గర 30 కి పైగా లిఖిత గ్రంథాలున్నవి వారు స్వామితో రకరకాల విషయాలు సంభాషిస్తూ తమ సందేహాలు అడిగారు. స్వామి తమ అనుచరుడు మంగళదాస్‌ను పిలిచి యోగుల దగ్గర ఉన్న గ్రంథాల్లో ఒకదానిని తీయించి అలవోకగా ఒక పేజీ త్రిప్పి అందులో చదవమన్నాడు. దానిలో వారడగిన ప్రశ్నలకు సమాధాన మున్నది. ఉమాచరణ్ స్వామి వారి దివ్య

జ్ఞానానికి దివ్య దృష్టికి ఆశ్చర్యపోయినాడు. ఇంతలో ఉరుములు మెరుపులతో పెద్ద జడివాన మొదలయింది. స్వామి ఇతని వైపు చూచి వెంటనే ఇంటికి వెళ్ళమని ఆజ్ఞాపించాడు. ఎందుకో అర్థం కాలేదు అయినా ఆజ్ఞ పాటించక తప్పదు. ఆశ్రమం దాటి ఉమాచరణ్ తన ఇంటికి వెడుతూంటే ఒక చుక్క నీరు కూడ పైనపడటం లేదు. చుట్టూ బ్రహ్మాండమైన వాన – అతడి ముందు దోవ చూపుతూ దీపం పట్టుకొని ఒక మనిషి నడుస్తున్నాడు. ఇంటికి చేరి వెనక్కి తిరిగి చూస్తే దీపమూ లేదు, మనిషీలేదు. స్వామి యొక్క కరుణ తనమీద ప్రసరిస్తున్నదని అతడు గ్రహించగలిగాడు. ఈ విధంగా కొద్దిరోజులు గడచిన తరువాత ఒకరోజు స్వామి "నీ విక్కడి నుండి వెళ్ళిపోవలిసిన సమయం వస్తున్నది నీ కేదైనా కోరిక ఉంటే చెప్పు" అన్నారు. ఉమాచరణ్ "స్వామి! మీరు మహానుభావులు, దయతో నాకు కాళీ మంత్రాన్ని ఉపదేశించారు. నా సాధనవల్ల ఆ దేవతను చూడగలనన్న నమ్మకం నాకు లేదు మంత్రసిద్ధి కలుగుతుందని అనుకోలేకపోతున్నాను. మహాసిద్ధులయిన మీరు కాళీదేవి యొక్క నిత్య సాక్షాత్కారం కలిగినవారు. నా కొక్కసారి అమ్మ దర్శనం చేయించండి" అని దీనంగా ప్రార్థించాడు. స్వామికి అతని యందు అనుగ్రహం కలిగింది. ఆ రోజు చీకటిపడిన తరువాత అతడిని తనకాళీ మందిరంలోకి తీసుకు వెళ్ళాడు. అందమైన తరుణకాళీ విగ్రహం నాలుగు అడుగుల ఎత్తుతో ప్రకాశిస్తున్నది. ఆమెను స్వామి ఎప్పుడూ 'మంగళా' అని పిలిచేవాడు. తలుపులన్నీ మూయబడినవి. వారిద్దరూ మాత్రమే లోపలఉన్నారు స్వామి ధ్యాన నిమగ్నుడై కాళిని ఆవాహనం చేశాడు. ఆ శిలా విగ్రహం ఒక సుందర బాలికగా మారి నడచి వచ్చింది. 'ఉమాచరణ్ ! అమ్మను చూడు' అన్నారు స్వామి. ఆశ్చర్యానందాలతో పరవశించిన ఉమాచరణ్ దేవిపాదాలు స్పర్శించటానికి అనుమతి కోరాడు. స్వామి అనుమతించగా అతడు ఆమె పాదములు తాకి నమస్కరించాడు. అది శిలా స్పర్శకాదు. మానవ శరీర స్పర్శ. అతని జన్మ తరించింది. అనంతరము స్వామి మంగళకాళిని పూర్వస్థానానికి వెళ్ళమని కోరాడు. ఆ సుందరబాలిక నెమ్మదిగా నడచివెళ్ళి మళ్ళీ శిలాకృతిని ధరించింది. ఉమాచరణ్ స్వామితో "ఇదేలా సాధ్యం, కదలనిరాయి కదిలే మానవిగా ఎలా మారింది" అని అడిగితే స్వామి

చిరునవ్వుతో 'దైవకృపకు అసాధ్యం లేదు' అన్నారు. ఆ విధంగా కాళీ దర్శనంతో పునీతుడయినాడు ఉమాచరణ్.

ఒకరోజు ఆశ్రమంలో ఉండగా స్వామి ఉమాచరణ్‌తో "కళ్ళుమూసుకో నేను తెరవమన్నపుడు తెరువు" అన్నారు. సుమారు ఒక గంట సేపు గడచి ఉండవచ్చని పించింది ఉమాచరణ్‌కు. స్వామి కళ్ళు తెరవమన్నారు. చూస్తే వాళ్ళిద్దరు గంగానది మీద ఉన్నారు. నదిమీద ఒక మంచం, దాని మీద తెల్లటి దిండ్లు ఉన్నవి. స్వామి కూడా దగ్గర కూర్చుని ఉన్నాడు. అప్పుడు స్వామి నదిలో నీరు ఉన్నదో లేదో చూడమన్నాడు. ఉమాచరణ్ ముందుకు వంగి వేళ్ళతో నీళ్ళు తాకి చూశాడు. ముందుకు వంగటంతో నీళ్ళలో పడబోయి స్వామి కాళ్ళు గట్టిగా పట్టుకున్నాడు. మంచము తాము పరుపు నీళ్ళలో ఎలా తేలుతున్నాయో అర్థం కాలేదతనికి. కొంత సేపయిన తరువాత స్వామి మళ్ళీ అతనిని కళ్ళు మూసుకోమన్నాడు. కళ్ళు తెరిచే సరికి మళ్ళీ ఇద్దరూ ఆశ్రమంలో ఉన్నారు. ఇతనికి కనిపించిన విషయం దేనినీ విశ్వాసము లేని వారికి చెప్పవద్దని స్వామి ఆదేశించాడు. ఆ తరువాత కొద్ది రోజులకే అతడు నేర్చుకోవలసినది సంతృప్తికరంగా తెలిసికోబడినది కనుక, ఆశ్రమం నుంచి వెళ్ళవచ్చునని సూచిస్తూ "ఈ ప్రపంచంలోనికి మళ్ళీ రావాలనే కోరిక త్యజించ"మని ఆదేశించాడు. ఉమాచరణ్ తన పాపములన్నీ నశించి పోయినవా? అని ప్రశ్నించగా "నీకే నిదర్శనం కన్పిస్తుంది. నీరెండు చేతులు కాలినట్లుగా నల్లగా అయినవి నెమ్మదిగా చర్మము మీద పైపొర ఊడిపోతుంది. పాపములు పోయినవనటానికి అదే గుర్తు" అన్నారు స్వామి.

స్వామి ఆదేశము మీద అతడు అయోధ్య వెళ్ళి సమర్థరామదాస స్వామిని దర్శించుకొని, అక్కడి నుండి ప్రయాగ వెళ్ళి, సూరదాస్ బాబాను దర్శించాడు. ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామం జరిగినపుడు అతడున్న ప్రాంతంలో యుద్ధం ముమ్మరంగా జరుగుతూ ఉంటే భద్రతకోసం ఆస్థలాన్ని విడిచిపెట్టి వెళ్ళమని భక్తులు ఆయనను ప్రార్థించారు. కానీ ఆయన కదలలేదు ఒకరోజు విదేశీ సిపాయి ఒకడు కాగడాతో ఈయనను కాల్చాడు. కానీ సూరదాస్‌బాబాకు ఏమీకాలేదు. ఆయనను కాల్చిన చోటు ఇప్పటికీ చూపించబడుతూ ఉంటుంది.

తీర్థయాత్రలు పూర్తి చేసికొని ఉమాచరణ్ త్రైలింగ స్వామిని దర్శించుకొని స్వస్థానానికి వెళ్ళిపోయినాడు. ఆ తరువాత కొద్ది కాలానికి మళ్ళీ ఆశ్రమానికి రమ్మని పిలుపు వచ్చింది.

త్రైలింగస్వామి భౌతికశరీరాన్ని విడిచిపెట్టాలని నిశ్చయించుకొన్నాడు. శిష్యులంతా ఆశ్రమానికి చేరుకొన్నారు. సదానంద స్వామి, కాళీచరణ్ స్వామి,బ్రహ్మానంద స్వామి, భోలానాథ స్వామి, ఇంకా ఇద్దరు పరమహంసలు వారిలో ఉన్నారు. నిత్యము పరిచర్యలు చేసే మంగళదాస్ ఠాకూరు కూడా ఉన్నాడు. తన ముఖ్య శిష్యులందరికీ తాను ఈ పార్థివ శరీరాన్ని విడిచిపెట్టి వెడుతున్న సంగతిని విశదపరచి తరువాత చేయవలసిన విధులను గురించి స్పష్టంగా వివరించాడు. ఈ వార్తను విన్న పౌరులు చాలా మంది అక్కడకు గుంపులు గుంపులుగా తరలివచ్చారు.

క్రీస్తుశకము 1887 వ సంవత్సరము పుష్యశుద్ధ ఏకాదశినాడు ఉదయం 8 గంటలకు స్వామి తన గదిలోకి వెళ్ళి ధ్యాన నిమగ్నులయినారు. మధ్యాహ్నం మూడుగంటలకు తలుపు తెరుచుకొన్నది. అప్పుడు అంతకు ముందే తయారు చేసి ఉంచిన పెట్టెలో యోగ ముద్రలో కూర్చున్నారు. కొద్ది క్షణాలలోనే ప్రాణాలను పరిత్యజించారు. ప్రాచీన శ్లోకమొకటి పరివ్రాజకుల మరణాన్ని గురించి ఇలా చెప్పింది.

**శ్లో॥ ద్వావిమౌ పురుషౌ లోకే సూర్య మండల భేదినౌ**
**పరివ్రాట్ యోగ యుక్తశ్చ రణే చాభిముఖే హతః**

యోగయుక్తుడయిన పరివ్రాజకుడు, రణరంగంలో వీర మరణం చెందిన యోధుడు సూర్య మండలాన్ని భేదించుకొని వెడతారు.

స్వామి ఆ విధంగా తృణప్రాయంగా (గడ్డిపోచవలె) ప్రాణములను పరిత్యజించాడు. స్వామి ఆజ్ఞ ఇచ్చిన ప్రకారం శిష్యులు పెట్టెను మూసి వేశారు. అది మామూలు శవపేటిక కాదు. మామూలు శవాలను శవపేటికలో పడుకో పెడతారు. సన్యాసులను పద్మాసనంలో ధ్యానముద్రలో కూర్చోపెడతారు. త్రైలింగస్వామి తనకు తానుగా ఆ ముద్రలో కూర్చొని ప్రాణాలు త్యజించాడు.

భీష్ముని వలే స్వచ్ఛంద మరణం పొందాడా యోగివర్యుడు. తా నెప్పుడు మరణించాలో నిశ్చయించుకొని ఆ నిర్ణయం ప్రకారం ప్రాణోత్క్రమణం చేసిన సిద్ధపురుషుడు ఆయన. ఆ దేహం పేటికను పడవలో ఉంచి 'అసి' ఘాట్ నుండి 'వరుణ' ఘాట్ వరకు తీసుకు వెళ్ళి పంచగంగా ఘాట్‌కు కొంచెం దూరంలో సూర్యాస్తమయం లోపల, శరీర పేటిక, గంగలో నిమజ్జనం చేయబడింది. చివరి క్షణంలో శవపేటిక తేలికగా ఉంటే శిష్యులు తెరిచి చూచారు. పూలున్నవట ! వాటిని ఉంచి సమాధి నిర్మించారని ఆశ్రమ నిర్వాహకులు చెపుతున్నారు.

స్వామిజీ దీక్ష ఇచ్చి సాధన చేయించిన వారిలో స్వామి కాళికానంద సరస్వతి, కాళీచరణ స్వామి శ్రీచైతన్యమహాప్రభువు యొక్క దగ్గరి బంధువు (1485-1533) బ్రహ్మానంద సరస్వతి, భోలానందస్వామి, దయాళ్‌బాబా, త్రిపురలింగ సరస్వతి, కన్నయ్యలాల్‌జీ, మంగళదాస్, భట్టబాల బ్రహ్మచారి, భైరవీ బ్రాహ్మణి (రామకృష్ణ పరమహంసకు తాంత్రిక విద్యలు నేర్పిన యోగిని) మాతారాజ్యలక్ష్మీదేవి, బ్రహ్మచారిణి శాంకరీమా, వేణునాధగంగూళీ, విజయకృష్ణ గోస్వామి, ఫకీర్ అబ్దుల్‌గఫూర్ మొదలగువారు. ఉత్తరప్రదేశ్‌లోని మైధిలీపురంలో 1833లో పుట్టిన 'స్వామీ భాస్కరానంద' స్వామి యొక్క సన్నిహితులలో ఒకరుగా తెలుస్తున్నది. స్వామి చేత ప్రభావితులు ప్రబోధితులు అయిన వారిలో గౌడస్వామి,కాష్ఠ జిహ్వాస్వామి రామనిరంజన స్వామి, విశుద్ధానందస్వామి, శ్యామాచరణ్ లాహిరి (మహావతార్ బాబా శిష్యుడు) మొదలైనవారు.

స్వామి యొక్క బోధలను ఆయన ప్రియ శిష్యుడు ఉమాచరణ్ 12 భాగాలుగా రచించాడు. రామకృష్ణపరమహంస జీవితాన్ని రచించిన క్రిస్టోఫర్ ఐషర్‌ఉడ్, 'రహస్యభారతంలోనా అన్వేషణ' గ్రంథాన్ని రచించిన పాల్ బ్రంటన్, వామదేవ శాస్త్రి అని తనపేరును చెప్పుకున్న డేవిడ్ ఫ్రాలే; తమ గ్రంథాలలో త్రైలింగ స్వామిని గూర్చి భక్తి పూర్వకంగా ప్రస్తావించారు. తెలుగులో ఆంధ్రప్రభుత్వ ఆస్థానకవి శ్రీపాద కృష్ణ మూర్తిశాస్త్రి (1866-1961), వద్దాది సీతారామాంజనేయ కవి (1900-1993) త్రైలింగస్వామి చరిత్రను

రచించారు. శ్రీపాదవారు స్వామి నివసించిన గదిలో తనకు వేద ఘోష వినిపించిందని తన అనుభూతిని తెలియచేశారు.

ఇటీవల చాతుర్మాస్యదీక్ష కాశీలో చేస్తున్నప్పుడు కాల భైరవాలయంలో దర్శనమిచ్చాడు యోగిరాజు. అతడు కూడా నావలెనే రాధాపరివారం నుండి భూమికి దిగివచ్చినటులు తెలిసింది. స్వామి శిష్యులు - ఉమాచరణ్ ముఖోపాధ్యాయ బెంగాలీలో చేసిన రచనకు డాక్టర్ వాసుదేవఛటర్జీ హిందీలో అనువాదం చేశారు. సనాతన ధర్మ ఛారిటబుల్ ట్రస్ట్‌వారు 2003లో దీని తెలుగు అనువాదాన్ని ప్రచురించారు. ఆచార్య బిరుదురాజు రామరాజు -'ఆంధ్రయోగులు' అన్న తనగ్రంథంలో స్వామి జీవిత చరిత్ర క్లుప్తంగా రచించారు. కలకత్తా ఆంధ్రసంఘం 1973-74 సంచికలో శ్రీ మెట్ట ఆంజనేయులు స్వామి వారిని గురించిన కొన్ని విశేషాలు తమ వ్యాసంలో ప్రస్తావించారు. ఇలా మరికొందరు కూడా వారిని గురించి తెలిసిన విశేషాలు అందించారు. డాక్టర్ వి.వి.బి రామారావు 2004లో వారణాసిలో నడిచే దేవుడు అన్న పేరుతో ఆంగ్లంలో స్వామి జీవిత చరిత్ర ఆయన ప్రబోధాలు రచించారు.

ఈ విధంగా 1607 లో ఉదయించిన ఆ మహాపురుషుని భౌతిక జీవితం 1887 తో ముగిసింది. కానీ సిద్ధులకు మరణం లేదు. భౌతిక శరీరం వారికి నిమిత్త మాత్రం. పాంచ భౌతిక శరీరాన్ని విడచిపెట్టిన తరువాత కూడ వారు జీవించే ఉంటారు భక్తులను అనుగ్రహిస్తూనే ఉంటారు. త్రైలింగస్వామి కూడా ఆ విధంగానే సిద్ధభూమికలో ఉండి సాధకులను అనుగ్రహిస్తున్నాడు. ఆయన శిష్యులిద్దరు జన్మ మారి ప్రస్తుతం నా భక్తులుగా ఉండి మంచి సాధన చేస్తున్నారు.

కొందరు పరిశోధకులు ఆయన మృతిని గురించి మరొకవిధంగా భావిస్తున్నారు. లోకానికి తాను వెళ్ళిపోతున్నట్లు చెప్పటంలో అర్థం ఇంతకు ముందువలె అందరికి కనపడుతూ కాశీలో ఉండను అని తెలియజేయటం మాత్రమే. ప్రస్తుతం ఆయన సిద్ధాశ్రమంలో ఉన్నారు.



# ౨౨. మౌనస్వామి

## జీవిత సంఘటనలు

| | | | |
|---|---|---|---|
| 1. | జననం | - | క్రీ.శ. 1868 |
| 2. | తల్లిదండ్రులు | - | అచ్యుతుని బాపనయ్య, సీతమ్మ |
| 3. | పేరు | - | పిచ్చయ్య |
| 4. | స్వగ్రామము | - | ప్రకాశం జిల్లా, నూనెవారి పాలెం |
| 5. | దత్త తల్లిదండ్రులు | - | ప్రకాశం జిల్లా, పందిళ్ళపల్లి గ్రామస్థులు, అచ్యుతుని లక్ష్మీనరసయ్య, సుందరమ్మ దంపతులు |
| 6. | దత్తతసమయమున మార్చిన పేరు | - | శివయ్య |
| 7. | భార్యపేరు | - | కామేశ్వరమ్మ |
| 8. | 1894 | - | రాజమహేంద్రవాసము |
| 9. | సంతానము | - | నాగభూషణము, లక్ష్మీనరసమ్మ, సుందరమ్మ |
| 10. | 1903 | - | కుమారుని ఉపనయనము, పెద్దకూతురి వివాహము |
| 11. | 1906 | - | గృహత్యాగము, ఉత్తరదేశగమనము |
| 12. | సన్యాసదీక్షా గురువు | - | శ్రీ అచ్యుతానంద సరస్వతీ స్వామి |
| 13. | సన్యాసనామము | - | శివచిదానంద సరస్వతీ |
| 14. | 1908 | - | కుర్తాళము చేరుట |
| 15. | 1910 | - | ఆశ్రమ నిర్మాణము, దండాయుధపాణి, శంకరాచార్య ప్రతిష్ఠ |
| 16. | 1916 | - | ఇప్పుడున్న ఆశ్రమ స్థలము నందు శంకుస్థాపన |

| | | | |
|---|---|---|---|
| 17. | తరువాత కొద్దికాలమునకే– | | దత్తాత్రేయ, వినాయక ప్రతిష్ఠలు |
| 18. | అక్కడనే మరికొంత కాలమునకు | – | రాజరాజేశ్వరి, కామేశ్వర ప్రతిష్ఠలు |
| 19. | 1919 | – | సీతారామాదుల ప్రతిష్ఠలు |
| 20. | 1932 | – | షణ్ముఖ, శాస్త్ర (అయ్యప్ప) ప్రతిష్ఠలు |
| 21. | 1936 | – | సిద్ధేశ్వరీ పీఠస్థాపన |
| 22. | 1938 | – | నాడీగణపతి ప్రతిష్ఠ |
| 23. | 1943 | – | డిశంబర్ 28 – 3 A.M. – స్వామి సిద్ధి పొందిన సమయము |
| 24. | 13.7.1951 | – | స్వామి సమాధిపై నీలకంఠేశ్వరలింగ ప్రతిష్ఠ |

## త్రివిష్టప యోగి

హిమాలయ పర్వతాలలో ప్రశాంతసుందరమైన ప్రదేశం. ఎత్తయిన కొండలపై ఘనీభవించిన మంచు సూర్యాతపానికి కరిగి సెలయేళ్ళుగా జాలువారుతూ జలజల మంజుల ధ్వనులు చేస్తున్నది. ఒక చోట పైనుండి మూడు సెలయేళ్ళు మూడు భిన్న ప్రదేశాల నుండి బయలు దేరి క్రిందకు వస్తూ ఒక చోట కలిసిన దృశ్యం నారాయణుని ముఖమండలంపై భాసించే ఊర్ధ్వ త్రిపుండ్రాలవలె అలరారుతున్నవి. అచటి విశాలమైన మైదానంలో అక్కడక్కడ కుటీరాలు లతావృతములై పూలతో ప్రకాశిస్తుంటే మణి స్థగితమైన గోపురాల వలె చెలువారుతున్నవి. ఫలవృక్షాలు, పుష్పవృక్షాలు ఆ ప్రకృతిలో రమణీయమైన, ఆహ్లాదకరమైన వాతావరణాన్ని కల్గిస్తున్నవి. లేళ్లు, నెమళ్ళు అందమైన పక్షులు, విహరిస్తుంటే ఆ ప్రదేశం అంతా అనంత చైతన్య భరితమై పరమేశ్వరి క్రీడాంగణంగా భాసిస్తున్నది.

సాయం సంధ్యావేళ ఆ కుటీరాలలో నివసిస్తున్న కుటుంబసభ్యులు సెలయేళ్ళలో స్నానంచేసి, పరిశుభ్రవస్త్రాలు ధరించి అక్కడి వటవృక్షం క్రింద వున్న వేదికదగ్గరకు వచ్చారు. వారిలో యువతులు, యువకులు, బాలబాలికలు,

ఎంతో క్రమ శిక్షణతో వరుసలుగా కూర్చున్నారు. అక్కడ ఒక్క వృద్ధుడుకాని, వృద్ధురాలుకాని లేరు. ఇంతలో అల్లంతదూరాన ఉన్న ప్రధాన కుటీరం నుండి సుమారు 30, 40 సంవత్సరాల వయస్సుతో కన్పిస్తున్న ఒక వ్యక్తి వేదిక మీదకు విచ్చేశాడు. టిబెట్ జాతీయునివలె కన్పిస్తున్న ఆ వ్యక్తి చిన్న గడ్డము పొడవైనజుట్టు తీక్షణమైనకన్నులు కల్గి పొడవైన అంగరఖా ధరించి వేదిక మీద ఉన్న వ్యాఘ్రాసనంపై ఆసీనుడయినాడు. క్రింద ఉన్న జనులందరూ వచ్చి ఆయనకు పాద నమస్కారం చేసి వెనక్కి వెళ్ళి కూర్చున్నారు. ఆయన నెమ్మదిగా ప్రసంగిచటం మొదలు పెట్టాడు.

"బిడ్డలారా ! అరుణారుణ సాంధ్యకాంతులు సమస్త దిక్కులను కషాయవర్ణ రంజితం చేస్తున్న ఈ భవ్య సమయంలో మీరందరూ రావటం చాలా సంతోషంగా వుంది. మీ అందరికీ తెలుసు – ఈ ప్రదేశం మంచుకొండలలోని త్రివిష్టప భూములలో పరమరహస్యమైన ప్రాంతము. ఇక్కడ మనుష్యులకు ముసలితనము లేదు, రోగములు లేవు. సుదీర్ఘకాలం జీవించటం ఇక్కడ పరిపాటి. మీలో చిన్నవారున్నారు, పెద్దవారున్నారు. వంద రెండు వందల యేండ్ల వయసున్న వారున్నారు. వయసు ఇంత అని ఆ వ్యక్తి చెపితే తప్ప ఇతరులకు తెలియదు. తపస్సువల్ల, ధ్యానంవల్ల సాధించిన అద్భుతమిది. వేల లక్షల సంవత్సరాలుగా వస్తున్న మహాయోగుల పరంపరకు, చెందిన సిద్ధాశ్రమ భూమిక ఇది. ఇక్కడ తపస్సు చేసి సిద్ధస్థితిని పొందినవారికి వేల సంవత్సరాలుగా జీవిస్తున్న మహాసిద్ధులతో అనుబంధం కల్గుతుంది. మీరంతా మన సంప్రదాయ మార్గంలో సాధనలు చేసి మహాపురుషులయిన ఆ సిద్ధుల దివ్య అనుగ్రహాన్ని పొందాలని నా ఆకాంక్ష. ఇక మీరు వెళ్ళి మీ నిత్యకృత్యములు సాధనలు చేసికొనవచ్చు. అందరూ కలిసి సామూహిక ధ్యానం చేసి తరువాత మీ విధులలో ప్రవేశించండి"

వెంటనే లలిత లలిత ఘంటానాదములు ప్రార్థన శ్లోక పఠనము కొంతసేపు జరిగిన తరువాత నిశ్శబ్ద ధ్యానం జరిగింది. అందరూ నిలిచి గురువర్యులకు నమస్కరించి ఎవరి పనిలోకి వారు వెళ్ళారు.

ఆనాటి రాత్రి మొదటి ఝాము గడిచిన తరువాత ఆ సిద్ధయోగి, కుటీరంనుండి బయలుదేరి కొండమీదికి నడపసాగాడు. ఇద్దరు శిష్యులు

ఆయనను అనుసరించి వెనుకనే వెళ్ళారు. కొండమీదికి వెళ్ళి ఏకాంతంగా వున్న ఒక గుహలోకి వారు ప్రవేశించారు. ఆ గుహలో భీషణ సుందరమైన "వజ్రవారాహి" దేవత నిలువెత్తు విగ్రహం ప్రకాశిస్తున్నది. మూడు కన్నులతో, రుండమాలతో, వజ్రహస్తంతో, ప్రకాశిస్తున్న ఆ దేవతామూర్తి ముందు ఒక హోమకుండం అలంకృతమై విరాజిల్లు తున్నది. ఆ సిద్ధపురుషుడు దేవతకు పూజ చేసి, నైవేద్యం సమర్పించి హోమకుండం ముందు కూర్చుని అగ్నిని జ్వలింపచేసి హోమ ప్రారంభం చేశాడు. శిష్యుల వైపు చూసి "ఈ రోజుకు మీరిక వెళ్ళవచ్చు. ఇక్కడ ఎవరూ ఉండరాదు" అన్నాడు. శిష్యులు వెంటనే తలవంచి నమస్కరించి తమ కుటీరాలకు వెళ్ళిపోయినారు. ఆ యోగి అగ్నిలో ఆహుతులు వేస్తున్నాడు. పెదవులు కదులుతూ ఉన్నవి, ఏదో మంత్రం పఠిస్తున్నాడు. ఇంచుమించు 2, 3 గంటలు, ఒక జాము సేపు. క్రతువు సాగింది. అప్పుడొక ఆశ్చర్యకరమైన సన్నివేశం సంభవించింది. అంతరిక్షం నుండి ఒక జ్యోతిఃపుంజం నెమ్మదిగా క్రిందికిదిగి దేవీ విగ్రహానికి హోమకుండానికి మధ్య అవతరించింది. ఆ వెలుగుముద్ద ఒక మానవాకారం ధరించింది. దండకమండల ధారి కాషాయవసనుడు, ముండితశిరస్కుడు అయిన ఒక సన్యాసి అక్కడ సాక్షాత్కరించాడు. ఆ అవతారమూర్తిని చూడగానే ఈ యోగి లేచి సాష్టాంగ నమస్కారం చేసి, "గురుదేవా మీరాకవల్ల నేను ధన్యుడనయినాను. చాలా కాలం తరువాత నన్ననుగ్రహించారు. ఈ ఆశ్రమంలో కొంతకాలం ఉండి భక్తులను అనుగ్రహించండి" ఆ యతిసార్వభౌముడు కన్నులలో కరుణ జాలువారుతుండగా, ప్రసన్నదరహాసంతో ఇలా అన్నాడు. "పరమేశ్వరుని అనుగ్రహంవల్ల సిద్ధాశ్రమ యోగులమయిన మేము వేలకొలది సంవత్సరములు జీవిస్తూ లోకశ్రేయస్సు కోసం పాటుపడుతుంటాము. అయితే లోకారాధన కోసం మనం కూడా అపుడపుడు కొన్ని త్యాగాలు చేయవలసి ఉంటుంది. శ్రీరాముడు విశ్వశ్రేయస్సు కోసం స్నేహాన్ని, దయను, సౌఖ్యాన్ని చివరకు జానకీదేవినైనా ఏ మాత్రం వ్యధ చెందకుండ విడిచి పెడతానన్నాడు. ఆ సంప్రదాయమే మనది. యుగధర్మాన్ని బట్టి మన భూమికల నుండి సామాన్య ప్రపంచంలోకి కొందరిని పంపించవలసిన అవసరం ఏర్పడింది. అసురశక్తుల విజృంభణాన్ని అరికట్టి

దైవశక్తీసముల్లాసాన్ని ప్రపంచంలో పరివ్యాప్తం చేయడంకోసం, కొందరిని ఎంపికచేసి వివిధప్రాంతాలలో జన్మించడానికి పంపిస్తున్నాము. అందులో నీవుకూడ ఒకడవు. జరా రహితమై దివ్యశక్తి సంపన్నమైన ఈ శరీరాన్ని విడచి పెట్టడానికి సహజంగానే నీకు ఇష్టం ఉండదు. ఈ మాట వింటుండగానే నీ కన్నులలో ముఖంలో కలుగుతున్న బాధను, విక్రియను గమనిస్తునే ఉన్నాను. కానీ ఇది తప్పదు. నీవు ఎక్కడ పుట్టినా నీ వెంట నేను ఉంటాను. అవసరమైన శక్తులను ప్రసాదిస్తాను. నీవు ఏ మాత్రం దిగులుచెందకుండా కర్తవ్యాన్ని నెరవేర్చు." ఇరవైఅయిదవేల సంవత్సరాల వయస్సు కల్గిన ఆ యతిరాజు స్వామీఅచ్యుతానంద మరల కాంతిపుంజంగా మారి ఆకాశంలోకి వెళ్ళిపోయినాడు. ఆ మహాత్ముని శిష్యుడు అయిన ఈ యోగి తెరచిన కన్నులతో "వజ్రవారాహి" దేవత వైపు చూస్తూ ఆలోచనా నిమగ్నుడయినాడు. ఆ సిద్ధేశ్వరి దయార్ద్రమయిన చూపులు అతనిమీద ప్రసరిస్తూ ఉండగా కన్నులు మూతపడినవి.

## గృహత్యాగము

తెలుగుదేశంలో గుంటూరు జిల్లా నూనెవారిపాలెంలో క్రీ.శ. 1868లో జన్మించిన హిమాలయయోగి పెరగటం, పెద్దవాడుకావటం, విద్య, వివాహం, సంతానం అన్నీ సామాన్య సంసారపద్ధతిలో జరిగినవి. బాధ్యతలను నిర్వర్తిస్తూ కుటుంబ జీవితం గడుపుతున్న శివయ్య అనే పేరుగల ఆ జీవునకు నెమ్మదిగా జ్ఞానోదయం కావటం మొదలైంది. మహనీయులు, భక్తులు ఎక్కడ ఉంటే అక్కడికి వెళ్ళి దర్శిస్తూ ఉండేవాడు. అలా గడుస్తూ ఉండగా ఒకసారి ఒక బైరాగి తటస్థపడినాడు. అతని నిరాడంబర, వ్యామోహరహిత జీవితం శివయ్యను ఆకర్షించింది. లౌకికమైన ఆచారాలు లేవు. శాస్త్ర బోధిత సంప్రదాయాలు లేవు. వేదవిహితమైన విధులు లేవు. కరతలభిక్ష, తరులతశయ్య – ఈ లౌకిక సుఖాలకు అంతేమున్నది.

**కమనీయ భూమిభాగములు లేకున్నవే పడియుండుటకు దూదిపరుపు లేల ?**
**సహజంబులగు కరాంజలులు లేకున్నవే, భోజన భాజన పుంజమేల?**
**వల్కలాజిన కుశావళులు లేకున్నవే ? కట్ట దుకూల సంఘంబులేల ?**

గొనకొని వసియింప గుహలు లేకున్నవే ప్రాసాదసౌధాది పటలమేల?

**స్వాదుఫలముల నొసగవే ? పాదపములు**
**సరస జలముల నొసగవే ? సకల నదులు**
**పొసగ భిక్షలు పెట్టరే ? పుణ్యసతులు**
**ధనమదాంధుల కొలువేల ? తాపసులకు.**

ఈ భావం హృదయంలో అగ్నివలె రాజుకుంటున్నది శివయ్యకు. ఆ బైరాగి ఎవరైనా తనకు దత్తాత్రేయుడే. తనను ప్రబోధించటానికి ఎంపిక చేయబడిన వాడు. తనూ అలానే కావాలి. ఈ ఆలోచనలతో ఒక గ్రంథం చదువుతుంటే కథ ఒకటి కనిపించింది.

ఒక గురువుగారికి చాలామంది శిష్యులున్నారు. అందులో ఇద్దరు నిత్య ధ్యానాభ్యాసము చేస్తూ దివ్యానుభవదశకు చేరుకున్నారు. ఎప్పుడూ సమాధిదశలో ఉండటం వల్ల సంధ్యావందనాదులు కూడా చేయడం లేదు. దాన్ని చూచిన తోటివారు వారి దగ్గరకు వెళ్ళి "సంధ్యావందనం చేయడం లేదేమి ?" అని ప్రశ్నించారు. ఒక శిష్యుడు ఈ విధంగా సమాధానం చెప్పాడు–

**"శ్లో॥ మృతా మోహమయీ మాతా, జాతో బోధమయ స్సుతః**
**సూతకద్వయ సంప్రాప్తే కథం సంధ్యా ముపాస్మహే ॥**

మోహమనే తల్లి మరణించింది. జ్ఞానమనే కుమారుడు పుట్టాడు. మృతాశౌచము, జాతాశౌచము రెండు సూతకాలు ఒకేసారి వచ్చినవి. సంధ్యను ఎలా ఉపాశించేది ?"

రెండవ వాడు ఇలా అన్నాడు.

**"శ్లో॥ హృదాకాశే చిదాదిత్యః సదారాజతి రాజతే**
**నాస్తమేతి నచోదేతి కథం సంధ్యా ముపాస్మహే॥**

హృదయమనే ఆకాశంలో జ్ఞానమనే సూర్యుడు ప్రకాశిస్తూ ఉన్నాడు. ఆ సూర్యునకు ఉదయించటమూ లేదు, అస్తమించటమూ లేదు. ఎప్పుడూ ప్రకాశించటమే. ఇక సంధ్యా వందనము ఎలా చేయడం ? సంధ్యా సమయమే లేదుకదా!"

శివయ్య ఇంచుమించు ఈ స్థితిలో ఉన్నాడు. జనన - మరణములు, భార్యాపుత్రులు, ఆస్తిపాస్తులు ఇవన్నీ అశాశ్వతాలే. అనిత్యమైన ఈ ప్రాపంచిక వ్యవహారముల మీద వ్యామోహము పోయింది. ఇవేవీ నన్నంటకూడదు. ఈ బంధముల నుండి విముక్తుడనై ఎక్కడికో సుదూర ప్రాంతాలకు వెళ్ళిపోవాలి.

**శ్లో॥ నాహందేహో నేంద్రియాణ్యంతరంగః నాహంప్రాణో నాస్తికర్మా నబుద్ధిః**
**దారాపత్య క్షేత్ర విత్తాది దూరః సాక్షీ నిత్యః ప్రత్యగాత్మా శివోహం ॥**

నేను దేహమును కాదు. ఇంద్రియమును కాదు, అంతరంగమును కాదు, ప్రాణము, బుద్ధి కర్మ ఇవేవీ నేను కాదు. భార్య, సంతానము, ఆస్తులు, ధనము వీటన్నింటికీ దూరమై, అన్నింటికీ సాక్షియైన శివుడను నేను.

**అంతమే లేని నా విశ్వయాత్రలోన, అడుగువేయుదు - అడ్డమన్నదియె లేక**
**తత్త్వమసి లోన దివ్యతత్వమ్మెరింగి, ఆత్మగతి గాంచుచుండు శివోహమనుచు**
**లక్ష హాలాహలాల కోలాహలాలు స్వల్పముగనైన నన్ను కదల్పలేవు**
**కలశ పాథోది గర్భంబు కలచి - చిలికి వెలికి దెచ్చెద చిక్కని లలిత సుధలు.**
**చేయలే దెట్టికర్మ నే చేయలేదు - అంటలే దెట్టి మాయ నన్నంటబోదు,**
**రూక్షయోగాగ్ని దగ్ధ కర్ముడను నేను నైష్ఠిక బ్రహ్మచర్యంబు నడుపుచుండు.**
**దుర్భర దురూహ పీడనాంధూ నిబంధ, శిథిల హిందూసమాజ సంస్కృతి సమగ్ర,**
**శక్తిసంధాన నవవికాసప్రదాన, ధర్మదీక్షైక కంకణధారి నేను.**
**వీరభారత వేదాంతభేరి రవము, మారుమ్రోగించి - సకలసీమల జయించి,**
**దశదిగంతాలలో దృగంతాలు పరపి ఎవ్వరెదురంటి కాని నోరెత్తరెవరు.**
**లలితభారత జాతీయలాంఛనమ్ము అంబరాంతరరవి కషాయధ్వజమ్ము,**
**తన్మహామూర్తి సుమన ఉల్లాస సుమహ ఉష ఉదీరిత రేఖా మయూఖ మేను.**
**మృదుల మృదులాలు - భావనా మేదురాలు వ్యంగ్య విభవాలు - సౌందర్య భాసితాలు,**
**ఐన మధురాతి మధుర కావ్యాలు వ్రాయు కవివరేణ్యుడ - నే విశ్వగాయకుడను.**

అని అనుకునే ఏదో ఒక వైరాగ్యస్థితి. మళ్ళీ ఆ వైరాగ్యంలోనూ ఈ దేశం కోసం ఏదో చేయాలనే తపన. నన్ను నేను ఉద్ధరించుకుంటూ, ఈ సమాజానికి ఏదో సేవ చేయాలన్న ఆకాంక్ష. ఏది చేయాలన్నా నాశక్తి చాలదు. తపస్సు

చేయాలి. దేవతానుగ్రహము సాధించాలి. మానవప్రయత్నము వల్ల ఏది సాధ్యము కాదో అది తపస్సువల్ల సాధ్యమని పెద్దలు చెప్పారు.

**శ్లో॥ యద్దుష్కరం యద్దురాపం యద్దుర్గం యచ్చదుస్తరమ్**
**తత్సర్వం తపసా సాధ్యం తపో హి దురతిక్రమమ్.**

విశ్వామిత్రాది మహర్షులు తపస్సు చేసి ఏదైనా సాధించవచ్చునని నిరూపించారు. నేను కూడా పూర్వఋషుల మార్గంలో తపస్సాధన చేస్తాను. అసాధ్యమును సాధిస్తాను. జన్మనిచ్చిన తల్లిదండ్రులు నాకు "పిచ్చయ్య" అని పేరు పెట్టారు. ఆ పిచ్చి దైవసంబంధమైన పిచ్చిగా దివ్యోన్మాదముగా పరిణమించుగాక ! దత్తతతీసుకున్న తల్లిదండ్రులు వారి ఇష్టదైవమైన శివుని పేరు నాకు పునర్నామకరణము చేసి నన్ను 'శివయ్య'గా మార్చారు. నేను నిజమైన శివయ్యగా మారాలి. శివత్వమును సాధించాలి. పరమశివా! నీవు నన్ను స్వీకరించాలి. నీ కోసం బయలుదేరుతున్నాను. హిమాలయాలలో, కాశీలో, గంగాతీరంలో, కైలాస శిఖరంలో నీ కోసం అన్వేషిస్తాను. సర్వమూ త్యజించి నీకు సర్వార్పణమును చేస్తున్నాను. ఈ క్షణము నుండి నాకు ఇల్లు లేదు, ఇల్లాలు లేదు, బిడ్డలు లేరు. అన్నీ నీవే –

1. **జయ నాగేంద్ర విభూషణ ! శంకర జయ హాలాహల నీలగళా !**
   **జయ గంగాధర ! శశాంక శేఖర ! జయ గౌరీ ప్రియ ! దేవ ! శివా !**
2. **కింకుర్వాణులు గీర్వాణులు నీ అడుగుదోయి కడ అభవ శివా!**
   **సకల భూతములు చరాచరంబులు నిగమాగమములు నీవె శివా !**
3. **ఓంకారమ్ములు హ్రీంకారమ్ములు నిఖిల శబ్దములు నీవె శివా!**
   **పరమోత్కృష్టము పంచాక్షరిలో నివాసమున్నది నీవె శివా !**
4. **మానస జిహ్వాలు మరచునొ యేమో మానక నిలుపుము మదిని శివా !**
   **నమశ్శివాయోమ్ నమశ్శివాయని నతి యొనరించెద సతము శివా !**
5. **ఏమి చేసితినొ యిచ్చా దుష్టం బీ మనుష్యజని యేల శివా !**
   **నీ పదాబ్జముల నిశ్చల సుమమై నిలచిన మేలని తలతు శివా !**
6. **అభిచారంబులు వ్యభిచారంబులు అగ్రవ్యగ్రము లాయె శివా !**
   **మనస్సు కలుషము మహస్సు మధువిష మహస్సు నికషం బాయె శివా**

7. మంత్ర తంత్రములు మణులౌషధములు మమతకు మూలమ్మాయె శివా!
నైశ్చల్యముగల నవ్య విరాగానందము నీయవె నాకు శివా !
8. నిన్నే తలచెద నిన్నే కొలిచెద నిన్నే అభిమానింతు శివా !
నీవే గానము నీవే జ్ఞానము నీవే ధ్యానము నిజము శివా !
9. నిన్నెంచుటకై నిను కాంచుటకై నిను సేవింపగ నిలుతు శివా !
నిర్మల నిశ్చల నిభృత మూర్తివై నిండు టెదదలో నిలువు శివా !
10. దహర గగనమున విహరణ జేసెడి జ్యోతిర్మూర్తివి సుమ్ము శివా !
రహస్తపస్సులు రజస్తమస్సులు నిత్య సత్వముల నింపు శివా !
11. శివుడే దైవము శివుడే భావము జీవికి జీవము శివుడె శివా !
శివాఖ్యతత్వము శివాఖ్య మంత్రము శివత్వ మందుటె చివర శివా !
12. ఎన్నాళ్ళీ గతి ఎన్నేండ్లీ గతి ఎన్నడు చేరుటొ నిన్ను శివా !
భరింపలేనిక తరింప లేనిక వరించితిని నీ పదము శివా !
13. ఎక్కడ నుందువొ? ఎప్పుడు కందువొ ? ఏమని యందువొ ?ఎటులొ ? శివా!
ఏది మార్గమో ? ఎచటకు చేరుటొ ? ఎరిగింపగదే ! యీశ! శివా !
14. గమ్యస్థానము కలదొక చోటని కలలు గాంచుటే కలిగె శివా
భ్రమించినాడను శ్రమించినాడను గమించుటకు, నీ కరుణ శివా !
15. అర్థభాగమున అంబ వెలుంగగ అంక పీఠిపై ఆత్మజులలరగ
అడుగు దోయిపై పడిన జడాత్ముని ఆదరింపగదె ! అభవ ! శివా !
16. జయ తుషార గిరికన్యకా కుచద్వయ విహారకర తామరసా !
భుజంగ భూషణ ! భ్రుకుటీ సంస్ఫూత పునర్జన్మ భయ సంతమసా !
17. శంభో శంకర ! భక్తవశంకర ! భవనాశంకర ! భర్గశివా !
ఖండేందుధరా ! ఖట్వాంగధరా ! సారంగధరా ! సాంబశివా !
18. త్రిశూలధారీ ! కపాలమాలీ ! త్రియంబకా ! హర! నమశ్శివా !
జయ మదనాంతక ! జయ మృత్యుంజయ శంభో ! శంకర ! సాంబశివా !

## అంతర్వాణి

శివా ! నీవు విచిత్రమైన వ్యక్తివి. నీలోని జీవుడు నిత్యము అంతర్ముఖుడు. సనాతన ఋషి ధామమైన మంచుకొండలు నీ నివాసము. హిమశైలరాజు దేవతాత్మ. అతడు సిద్ధులకు, ఋషులకు దేవతలకు ఆశ్రయమిచ్చినవాడు. ఆ మహనీయుని పరిపాలనప్రాంతములోని దివ్యక్షేత్రములను నీవు దర్శించాలి. ప్రపంచములోని అత్యున్నత శిఖరాలమీద అనంతచైతన్యము ఎలా ఉంటుందో నీవు తెలుసుకోవాలి. కొండల మధ్యలో మబ్బులు గుంపులుగుంపులుగా కమ్ముకుంటుంటే ఆ అనుభూతిని పొందాలి. గంగానదిలో స్నానం చేయనివాని జీవితము వృధా. ఎక్కడో తెలుగుదేశంలో చిన్నపల్లెలో జన్మించిన నీవు సాంసారిక బంధాలను తెంపుకొని నీ సహజ స్థానానికి చేరవలసిన సమయం ఆసన్నమయినది. గంగాతీరంలో మహనీయులైన ఋషులెందరో తపస్సుచేసిరి. పద, ముందుకు పద !

"అదిగో" హరిద్వారము'. ఇక్కడి దేవనదిలో స్నానంచేస్తే మాయావరణం ప్రక్షాళితమవుతుంది. ఇక్కడ ఎన్నో ఆశ్రమాలు ఉన్నాయి. సాధకులు, ధ్యానపరాయణులయిన ఉత్తముల నెందరినో ఇక్కడ చూడవచ్చు. అక్కడ నుండి హృషీకేశ్ చేరుకోవాలి. ఇక్కడ ఇంకా తీవ్రతర సాధకులు దర్శనమిస్తారు. ఇంకా ఇంకా ముందుకు వెళ్ళాలి. జగద్గురువైన శంకరులు సంచరించిన ప్రదేశములను ప్రధానంగా నీవు చూడవలసిన అవసరం ఉంది. అతిశీతలప్రదేశములయిన కాశ్మీర భూములకు వెళ్ళి అక్కడి నదులలో సరస్సులలో తేలియాడే పెద్ద పడవలను చూడు. పుష్పద్వీపాలుగా ప్రకాశిస్తుంటాయి. రత్నాలకంబళ్ళు పరచినట్లుగా పచ్చిక బయళ్ళు రమ్యంగా ఉంటాయి. ఇక్కడ కొండమీద అష్టాదశమహాశక్తిపీఠములలో ఒకటయిన శారదాంబ ఆలయం ఉంది. శంకరాచార్యుల వారి అద్భుతమైన విగ్రహం ఇక్కడ దర్శించాలి. జగద్గురువులు ఇక్కడ పండితులను జయించి అద్వైతమతస్థాపన చేశారు. అక్కడనుండి దేవదారువృక్షాల మధ్య ప్రయాణం చేస్తూ కమనీయ ప్రకృతి దృశ్యాలను చూస్తు శేషనాగసరస్సు వద్దకు వెళ్ళు.

గరుడపచ్చ రంగులో శేషపర్వతాల నుండి ప్రవహించిన నీటితో నిండిన

ఈ సరస్సు పాతాళం దాకా ఉన్నది అంటారు. ఈ ప్రాంతంలో భూర్జవృక్షాలు ఎక్కువ. వీటి బెరడు పొరలు పొరలుగా ఉంటుంది. ఆకుపసరులతో రంగులు తయారుచేసి కుంచెలతో దీనిపై వ్రాసేవారు. ఇక్కడి కొండశిఖరాలు పాము పడగల్లాగా ఉండటం వల్ల ఇది శేషనాగుల నివాసమనీ, ఇక్కడ నాగమంత్రసిద్ధి త్వరగా వస్తుందని పెద్దలు చెపుతారు. ఇంకా ముందుకు వెళ్ళి అమరనాథ్ చేరుకోవాలి. ఈ కొండ ఎక్కేటప్పుడు దీనిని సాక్షాత్ శివస్వరూపంగా భావించటం చేత మాములు పాదరక్షలు ధరించరు. దర్భలతో చేసిన పాదరక్షలను ఇక్కడ అమ్ముతారు. సాధువులు వాటిని ధరించి కొండ ఎక్కుతారు. ఈ అమరనాథ గుహలలోని సహజసిద్ధమైన హిమలింగాన్ని శ్రావణ పూర్ణిమనాడు దర్శించు. సహజంగా ఏర్పడిన ఈ గుహలో మొదట మంచుగణపతి కన్పిస్తాడు. ఆ తరువాత ఆరుఅడుగుల ఎత్తున్న 'అమరనాధుడు', ఆ వెనుక మంచుతో 'పార్వతీమూర్తి' 'ఆ తరువాత భైరవ స్వరూపం. అమరనాధునికి పార్వతికి మధ్య ఈ రెండు మూర్తుల నుండి జాలువారే జలాన్ని అమరజలం అంటారు. పవిత్రమైన నీటిని పాత్రలలో నింపుకుని కొందరు ఇళ్ళకు తీసుకు వెడతారు. ఆ తరువాత చూడవలసినది 'వైష్ణవి' దేవి ఆలయం. ఇది కూడ గుహాలయమే. .... పరమేశ్వరి తన శూలంతో ఈ గుహను ఏర్పరిచిందంటారు. ఆ తరువాత జ్వాలాముఖి క్షేత్రానికి వెళ్ళు. దశమహావిద్యలకు మూలమయిన సిద్ధేశ్వరి యొక్క తీవ్రమైన ఆకృతియే జ్వాలాముఖి. అష్టాదశమహాశక్తిపీఠములలో ఇది కూడ ఒకటి. సతీదేవి యొక్క జిహ్వపడిన చోటు. ఆలయంలో అగ్నిజ్వాల వేల లక్ష సంవత్సరాలను నుండి వెలుగుతూనే ఉన్నది. ఈ క్షేత్రం నుండి వజ్రేశ్వరీక్షేత్రమునకు వెళ్ళు.

సతీదేవి శిరస్సు పడిన చోటిది. ఇక్కడ 'ఛిన్నమస్తా' సాధన చేస్తే చాలా వేగంగా సిద్ధిస్తుంది. అక్కడనుండి వివిధ ప్రదేశాలు చూస్తూ 'భృగుతీర్థము' వశిష్ఠ కుండము చూచి హిడింబా మందిరానికి వెళ్ళు. "కులు" లోయలో ఈమె ప్రధాన దేవత. పాండవులు లాక్షాగృహం నుండి తప్పించుకొని అరణ్యాలలో తిరుగుతున్నపుడు భీముని వరించి అతని ద్వారా ఘటోత్కచుని కన్న రాక్షసజాతి స్త్రీ ఈమె. 'కమలపాలిక' అనే గంధర్వ కాంత, కారణాంతరంవల్ల రాక్షసి అయినా. భూత భవిష్యత్ వర్తమానాలు తెలిసిన

దివ్యశక్తి సమన్విత కావడంవల్ల జరగబోయే అనేక విశేషాలను పాండవులకు తెలియచేసింది. గర్భవతి యైన ఆమెను విడిచివెళ్ళిన భీముడు మళ్ళీ ఆమెను జీవితకాలంలో ఎప్పుడూ కలుసుకున్నట్లుగా లేదు. ఆ తరువాత డెబ్భై సంవత్సరములకు జరిగిన భారతయుద్ధానికి పాండువుల తరపున పోరాడడానికి తన ఏకైక పుత్రుడైన ఘటోత్కచుని పంపించింది. వాడు ఆ మహా సంగ్రామంలో కర్ణుని చేతిలో మరణించాడు. త్యాగానికి నెలవయిన ఆ పరమపతివ్రత, తపస్విని, దేవతయై అక్కడ పూజల నందుకుంటున్నది.

హిమాలయంలో గంగోత్రి, యమునోత్రి, బదరీ, కేదారములను చతుర్ధామములు అంటారు. తపస్సు చేసుకోవటానికి ఇవి ఎంతో శక్తివంతమైన ప్రదేశాలు. 'కేదారనాథ్' ద్వాదశ జ్యోతిర్లింగాలలో ఒకటి. మందాకినీ తీరాన పంచనదీ సంగమ స్థానాన ఉన్న ఈ కేదారేశ్వరుడు ఆశ్రితకల్పవృక్షం. వెలిగే దివిటీలలాగా సుందరంగా ఉండే బ్రహ్మకమలాలతో ఇక్కడ శివపూజ చేస్తారు.

బదరికావనం అత్యంత ప్రాచీనమైన ఋషిభూమి. నారాయణుడు నివసించే దివ్యక్షేత్రమిది. కలిపురుషుడిక్కడ ప్రవేశించడానికి భయపడ్డాడు.

రుద్రుని బ్రహ్మహత్యాదోషం పోగొట్టిన పుణ్యస్థలమిది. రుద్రప్రయాగ, దేవప్రయాగ, గరుడ గంగ మొదలైన ప్రదేశాలు దాటి ఇంకా ఎత్తున ఉన్న విష్ణు ప్రయాగ చేరుకోవాలి. విష్ణుగంగ, అలకనంద కలిసే అద్భుత ప్రదేశమిది. నర, నారాయణ మహర్షులు తపమాచరించిన పరమపవిత్ర ప్రదేశమిది. పూర్వము బ్రహ్మదేవుడు తన పుత్రిక అయిన సరస్వతిని కామించడంతో రుద్రడు కోపించి బ్రహ్మ శిరస్సును ఖండించాడు. ఆ శిరస్సు రుద్రుని చేతికి అంటుకుపోయింది. బ్రహ్మహత్యవల్ల అతడు భైరవుడై ఎన్ని లోకాలు తిరిగినా ఎన్ని తీర్థములలో స్నానం చేసినా ఆ కపాలం చేతినుండి ఊడిపోలేదు. చివరకు విష్ణుమూర్తి ఆదేశానుసారం బదరీక్షేత్రానికి వస్తే అక్కడ ఈ తల ఊడి క్రింద పడిపోయింది. అప్పటి నుండి ఈ ప్రదేశానికి బ్రహ్మకపాలము అను పేరు వచ్చింది. ఇక్కడి అలకనంద నదిలో స్నానము చేసి పవిత్రుడవు కావాలి. ఇక్కడ వ్యాసుడు తపస్సు చేసిన ఒక గుహలో శంకారాచార్యుల వారు గూడ ధ్యానము చేశారు. అలకానదికి ఆవలి వైపున శంకరాచార్యుల వారి పరమ గరువు గౌడ పాదుని ఆశ్రమం ఉంది. శుకుని శిష్యుదయిన

గౌడపాదుడు అయిదు వేలేండ్లు జీవించిన మహాయోగి. ఆయన ఆశ్రమాన్ని నీవు చూసి తీరాలి. ఇక్కడకు దగ్గరలోనే ద్రోణగిరి ఉంది. రామరావణ యుద్ధంలో లక్ష్మణుని మూర్ఛను తొలగించడానికి హనుమంతుడు తెచ్చిన 'సంజీవని' పర్వతం ఇదే. ఇక్కడి సిద్ధుల వల్ల కొన్ని మూలికల రహస్యాలు నీవు తెలుసుకోగల్గుతావు. భవిష్యత్‌లో నీవు చేయవలసిన ప్రజాసేవకు ఇది ఉపకరించగలదు. ఇక్కడనుండి హిమాలయములలో నీవు చూడవలసిన రహస్య ప్రదేశములున్నవి. అవి తరువాత నీకే స్ఫురించగలవు. "శివాస్తే పంథానః సంతు".

## నైమిశారణ్యము

కృష్ణద్వైపాయన వ్యాసుడు ద్వాపరాంతము నందు సత్యవతీదేవికి జనియించి జన్మ సిద్ధుడై ప్రకాశించాడు. కలగా పులగమై పోయిన వేదములను విభజించి తన నలుగురు శిష్యులైన 1. వైశంపాయనుడు 2. పైలుడు 3. జైమిని 4. సుమంతులకు బోధించాడు. అనంతర కాలములో ఈ నల్గురు వేదములను ప్రచారము చేసి శిష్యోపశిష్యులను రూపొందించి శ్రుతిసేవ చేశారు. ఆ తరువాత పురాణవాఙ్మయాన్ని పరిశీలించి పూర్వుల రచనలను సంకలనం చేసి తాను స్వయంగా కొన్ని వ్రాసి పదునెనిమిది పురాణములను రచించాడు.

**శ్లో॥ మద్వయం భద్వయం చైవ, బ్రత్రయం వచతుష్టయం**
**అనాపలింగ కూస్కాని, పురాణాని పృథక్ పృథక్.**

'మ' కారంతో మొదలయ్యే పురాణాలు రెండు మత్స్య, మార్కండేయములు. 'భ' ద్వయం – 'భ' కారంతో మొదలయ్యేవి. రెండు భాగవత, భవిష్యములు. బ్ర కారంతో మొదలయ్యేవి మూడు బ్రహ్మ, బ్రహ్మాండ, బ్రహ్మవైవర్తనములు. 'వ' కారంతో మొదలయ్యేవి నాలుగు – విష్ణు, వామన, వాయు, వరాహములు. అనాపలింగ కూస్కాని – అ – అగ్ని, నా – నారద, ప – పద్మ, లిం – లింగ, గ – గరుడ, కూ – కూర్మ, స్కా – స్కాంద. ఇవి కాక పద్దెనిమిది ఉపపురాణములున్నవి. 1. సనత్కుమార 2. నారసింహ 3. నారదీయ 4. శివ 5. దూర్వాస 6. కపిల 7. మానవ 8. ఔశినస 9. వారణ

10. కల్కి 11. సాంబ 12. నంది 13. సౌర 14. పరాశర 15. ఆదిత్య 16. మహేశ్వర 17. భాగవత 18. వాశిష్ఠ పురాణములు. ఉపపురాణములన్నియు వ్యాసప్రోక్తములే. వేదములలో ఋగ్వేదమును పైలుడు, యజుర్వేదమును వైశంపాయనుడు, సామవేదమును జైమిని, అధర్వణ వేదమును సుమంతుడు వ్యాసుని కడ నేర్చి. శిష్య పరంపర ద్వారా వ్యాప్తి కావించినారు.

పురాణములను సూతుడు అభ్యసించాడు. సూతకులమునకు చెందిన ఇతని పేరు 'రోమహర్షణుడు'. శౌనకాది మహర్షులు నైమిశారణ్యములో నివసిస్తూ నిరంతర యజ్ఞములు చేస్తుండేవారు. సుదీర్ఘకాలం సాగే సత్రయాగములు కూడ అపుడపుడు జరుపబడుతుండేవి. యజ్ఞసమయాలలోని విరామవేళలో సూతమహర్షి శౌనకాదులకు వ్యాస ప్రోక్తములైన పురాణములను ప్రవచిస్తుండేవాడు. సూతుడు. అబ్రాహ్మణుడు అయినా పురాణ ప్రవచన వేళ వేదిక పైన అతడు బ్రహ్మస్థానమున ఉండేవాడు. అందరూ అతనిని భక్తి గౌరవాలతో చూచేవారు. ద్వాపరాంతమునందు ఒకసారి అవతారపురుషుడయిన బలరాముడు నైమిశారణ్యము వచ్చి ఈ ఆశ్రమానికి వచ్చినపుడు మహర్షులంతా అతనికి గౌరవసత్కారములు చేశారు. సూతుడు బ్రహ్మస్థానములో ఉండి ప్రవచనము చేస్తుండడంవల్ల లేచి నమస్కారము చేయలేదు. దానితో కోపించిన బలరాముడు తన ఆయుధమయిన ముసలంతో సూతుని తల పగులగొట్టాడు. అప్పుడు మహర్షులు బ్రహ్మ స్థాన మర్యాద గురించి చెప్పిన పిదప సంకర్షణుడు తన మహిమ వలన మరల బ్రతికించాడట. ఏది ఏమైనా పురాణముల తరువాత రచన అయిన భారతాన్ని మహర్షులకు సూతుడు వినిపించలేదు. అతని కుమారుడయిన 'సౌతి' దానిని ప్రవచనం చేసినట్లుగా భారతంలో ఉన్నది.

అధర్వణవేదంలో వివిధ మంత్ర ప్రయోగ విధానములు చెప్పబడినవి. ఈ వేదవేత్త అయిన సుమంతుడు వేదధర్ముడు. శునకుడు, శౌల్కాయిని, జాబాలి, బలి, పిప్పలాయనుడు, సైంధవాయనుడు, మొదలైన శిష్యులనే కాక తన కుమారుడయిన కబంధుని కూడ తీర్చిదిద్దాడు.

అయిదు వేల సంవత్సరాలుగా సాగిన ఈ పరంపరలో మంత్రవేత్త అయిన ఒక బ్రాహ్మణుని దగ్గర శిష్యుడయి ఒక తెలుగు యువకుడు – కొన్ని విద్యలు 'నేర్చు' కున్నాడు. ప్రపంచమునందు, జనసంగమునందు, సంసారమునందు ఆసక్తిలేని ఆ వ్యక్తి నైమిశారణ్య ప్రాంతములోని ఒక పర్వత గుహలో నివాసం ఏర్పరచుకొని కొన్ని వందల యేండ్లుగా జీవిస్తున్నాడు. 20 వ శతాబ్దపు ప్రారంభంలో తన జీవితాన్వేషణలో భాగంగా మరొక తెలుగు యువకుడు హిమాలయ సంచారము చేస్తూ ఆ ప్రాంతానికి వచ్చాడు. ఆ కొండల మీద తిరుగుతూ నరసంచారములేని ఆ ప్రదేశంలో ప్రకృతి సౌందర్యానికి పరవశిస్తూ ఉబుసుపోక పోతన భాగవతంలోని పద్యాలు గొంతెత్తి చదవడం మొదలుపెట్టాడు.

**ఎవ్వనిచే జనించు జగ మెవ్వని లోపలనుండు లీనమై**
**ఎవ్వని యందుడిందు పరమేశ్వరుడెవ్వడు మూలకారణం**
**బెవ్వ డనాది మధ్య లయుడెవ్వడు సర్వము దానయైన వా**
**డెవ్వడు వాని నాత్మ భవు నీశ్వరునే శరణంబువేడెదన్.**

ఈ సమస్త ప్రపంచము ఎవరివల్ల పుడుతున్నదో, ఎవని వలన పెరుగుతున్నదో, ఎవనిలో లీనమై పోతున్నదో, పుట్టుక, మధ్య, మరణములేని వాడు ఎవడో, సమస్తమునకు మూలకారణమయిన వాడెవరో, తనకు తానుగా, ఉదయించు నీశ్వరుని నేను శరణు వేడుతున్నాను.

**నర్తకుని భంగి పెక్కగు, మూర్తులతో నెవ్వడాడు మునులు దివిజులున్**
**కీర్తింప నేర రెవ్వని, వర్తన మొరు లెరుగ రట్టివాని నుతింతున్**

నటుడు ఏ విధంగా అయితే అనేక వేషాలను ధరిస్తుంటాడో, అలానే ఎన్నో ఆకృతులతో క్రీడిస్తూంటాడో, ఋషులు దేవతలు గూడ ఎవని నడవడిని కీర్తింపలేరో, ఎవరి వర్తనమును ఇతరులు తెలుసుకోలేరో, అటువంటి ప్రభువును స్తోత్రం చేస్తున్నాను.

పు॥ **లోకంబులు లోకేశులు, లోకస్థులు తెగినతుది నలోకంబగు పెం**
**జీకటి కవ్వల నెవ్వం డేకాకృతి వెలుగు వాని నే ధ్యానింతున్.**

లోకములు, వాటిని పరిపాలించే ప్రభువులు, ఆలోకములందున్నవారు నశించిపోయి పెనుచీకటి ఆవరించినపుడు దానికి అవతల ఆకారముతో ఎవడు వెలుగుతూ ఉంటాడో అతనిని నేను ధ్యానిస్తున్నాను.

**లావొక్కింతయు లేదు, ధైర్యమువిలోలంబయ్యె, ప్రాణంబులున్**
**ఠావుల్ దప్పెను, మూర్ఛవచ్చె తనువున్ డస్సెన్ శ్రమంబయ్యెడిన్**
**నీవే తప్ప ఇతః పరంబెరుగ మన్నింపం దగున్ దీనునిన్**
**రావే ఈశ్వర ! కావవే వరద ! సంరంక్షింపు భద్రాత్మకా.**

ఎక్కడో కొన్ని వందల మైళ్ళ దూరం నుండి పెద్ద ఆశతో ఈ కొండలు కోనలు వెతుక్కుంటూ ఎవరైనా మహాత్ములు కనిపిస్తారా. ఎవరైనా సిద్ధుడు దర్శనమిస్తాడా అని వెతుకుతూ వెతుకుతూ అలసిపోయి చాలా శ్రమగా ఉన్నది. ఇక నీవు తప్ప రక్షించే వారెవరూ లేరు. ఓ పరమేశ్వరా నాకు ముందు త్రోవ చూపించు.

**ఓ కమలాప్త ! ఓ వరద! ఓ ప్రతిపక్ష విపక్ష దూర ! కు**
**య్యో కవియోగి వంద్య ! సుగుణోత్తమ ! ఓ శరణాగతామరా**
**నోకహ ! ఓ మునీశ్వర మనోహర ! ఓ విమల ప్రభావ ! రా**
**వే ! కరుణింపవే ! తలపవే ! శరణార్థిని నన్ను కావవే !**

ఓ సర్వేశ్వరా ! శరణాగతులకు కల్పవృక్షము వంటివాడా ! మునీంద్రుల మనస్సును హరించినవాడా ! అద్భుతమైన మహాప్రభావము కల్గినవాడా ! కోరిన వరములను ప్రసాదించెడి మహాశక్తి సంపన్నుడా ! తొందరగా రా, నిన్ను శరణు వేడుతున్నా ఈ దాసుని కాపాడు. ఆనాడు గజేంద్రుని రక్షించటానికి, ఉన్నవాడివిఉన్నట్లుగా వైకుంఠమునుండి దిగివచ్చావు. భక్తులను అవసరానికి ఆదుకోవడంలో నీవు ఏ మాత్రము ఆలస్యము చేయవు. నేను నిరాశతో వెనుదిరుగక ముందే నీ అనుగ్రహాన్ని చూపించు. ఈ మహారణ్యములో శౌనకాదిమహర్షులు పూర్వము సంచరించారు. ఇది తపోనిధులకు నెలవనే నమ్మకంతో అన్వేషణ కొనసాగిస్తున్నా. నా ప్రయత్నము సఫలమయ్యేలా నీ కరుణార్ద్ర వీక్షణాన్ని నా మీద ప్రసరింపచేయి.

ఇంతలో అక్కడ ఒక గుహలో నుండి ఎవరో వస్తున్నట్లు అలికిడి అయింది. ఈ యువకుడు తలయెత్తి చూచాడు. ఒక ఎలుగుబంటు నడచి వస్తున్నట్లున్నది. దగ్గరకు వచ్చిన తరువాత చూస్తే శరీరము అంతా విపరీతంగా వెంట్రుకలు పెరిగిన బలిష్ఠుడయిన మానవుడు. ఆశ్చర్యము కలిగి గుహావాసి కనుక ఎవరో మహనీయుడయి ఉంటాడనుకొని సాష్టాంగ నమస్కారము చేసాడు. ఆ వృద్ధుడు ఇలా అన్నాడు. "ఎవరయ్యా నీవు ? తెలుగులో ఏదో చదువుతున్నావు ? తెలుగువాడివా ?" ఈ యువకునికి ఒక్క క్షణం దిగ్భ్రాంతి కల్గింది. ఈ ఉత్తరదేశపు పర్వతాలలో తనను తెలుగులో పలకరిస్తున్న ఈ తాపసి ఎవరు ? ఇలా అనుకుంటునే సమాధానం చెప్పాడు. "స్వామీ ! నా పేరు శివయ్య. ఆంధ్రదేశంలో గుంటూరు జిల్లాలో ఒంగోలు దగ్గర ఒక కుగ్రామం మాది. సంసారము యెడల విరక్తి కలిగి సత్యాన్వేషణలో ఈ పర్వతాలలో సంచరిస్తున్నాను. మీ వంటి మహనీయుల కోసమే వెదుకుతున్నాను.

**వృద్ధుడు :** ఇంతకు ముందు నీ వేదో పద్యము చదువుతున్నట్లున్నావు. అది ఎవరి రచన ?

**శివయ్య :** పోతన అనే మహాకవి నాలుగు వందల ఏళ్ళ క్రింద వ్యాసభాగవతాన్ని అనువాదం చేశాడు. ఆ మహాభక్తుని పద్యాలు రాని వాళ్ళు తెలుగుదేశంలో ఉండరు. గజేంద్రమోక్షము ప్రహ్లాదచరిత్ర, రుక్మిణీకల్యాణము మొదలయిన ఘట్టాలలో మంచి మంచి పద్యములెన్నియో ఉన్నాయి. ఆంధ్రదేశంలో ప్రతి ఇంట ఆ పద్యాలు విన్పిస్తునే ఉంటాయి.

**తాపసి :** అలానా ! అయిదువందల ఏళ్ళ ముందు నుండే నేను ఇక్కడ ఉంటున్నాను. అందువల్ల ఆంధ్రదేశంలో ఏ పరిణామాలు వచ్చినవో నాకు తెలియదు.

**శివయ్య :** స్వామీ అంత సుదీర్ఘకాలం నుండి ఉన్నారా మీరు ! మీరు నన్ను శిష్యునిగా స్వీకరించి అనుగ్రహించాలి.

**తాపసి :** తథాస్తు. నీవు ఇక్కడకు వస్తావని నాకు తెలుసు. నీ కోసమే నేను ఎదురు చూస్తున్నాను. కొన్నాళ్ళు ఇక్కడ నాతో ఉందువు గాని.

ఆ క్షణం నుండి ఆ తాపసిని సేవించడం మొదలు పెట్టాడు ఈ శివయ్య. ఆవృద్ధ యోగి పేరు 'వెంకటాచలం వంతులు'. శిలాకంటకమయములయిన ఆ కొండ కోనలలో మంచుకు వానలకు ఏ మాత్రము బాధపడక అడవి జంతువు వలె నిర్భయముగా తిరిగేవాడు. ఆయన వెంట తిరుగలేక శివయ్య ఎంతో అలసి పోయేవాడు. అయినా గురువును ఏ మాత్రమూ వదలి పెట్టకుండా వెంటనే ఉండి సేవచేస్తుండే వాడు. ఏ కాయకసరులో ఏ పండో ఫలమో కందమూలములో ఏది లభిస్తే అది తినడం, కొండవాగులలో నీరు త్రాగడం, గుహలలోనూ బండరాళ్ళమీద శయనించటం, వెంకటాచలయోగి ఒక్కొక్కసారి రోజుల తరబడి ధ్యానం చేసేవాడు. మళ్ళీ లేచి ఉపవాసబాధ ఏమీ లేకుండానే రాళ్ళమధ్య ముళ్ళమధ్య నిర్బాధంగా సంచరించేవాడు. కష్టపడుతున్నా శివయ్య కూడా ఆయన వెంటనే రాముని వెంట హనుమంతుని లాగా భక్తి తత్పరుడయి సేవించేవాడు. ఈ విధంగా కొన్ని నెలలు గడిచినవి. వృద్ధయోగికి తన శిష్యునియందు కరుణ కల్గింది. ఒకనాడు పిలిచి వాత్సల్యంతో ఇలా అన్నాడు. "శివయ్యా – నీ భక్తి తత్పరతకూ సేవాశుశ్రూషలకు సంతోషించాను. ఈ రాళ్ళ గుట్టలలో ముళ్ళపొదలలో మంచువానలలో ఎంతో బాధపడుతూ, కష్టపడుతూ సేవచేశావు. నేను పెట్టిన పరీక్షలో విజయం సాధించావు. ఈ కొండలు, గుట్టలు, రాళ్ళు, రప్పలు, ముళ్ళు, అడవి జంతువులు, సర్ప, వృశ్చికాదులు, ఆకలి దప్పులు నన్నేమీ చేయలేవు. ఎన్నాళ్ళయినా నేను ఇలా ఉండగలను, తిరుగగలను. నీవు చూస్తునే ఉన్నావు. వ్యాస శిష్యుడయిన సుమంతుని శిష్యపరంపరలో ఒక యోగి వలన నాకు ఈ విద్యలభించింది. ఇది ఒక ఆధర్వణ మంత్ర ప్రభావం. ఇది నీకు ఉపదేశిస్తున్నాను. స్వీకరించి తపః సాధన చేసి జీవితాన్ని చరితార్థం చేసుకో. నాకు మృత్యుసమయం ఆసన్నమయినది. ఎంతటి వానికయినా భౌతిక శరీర పతనం తప్పదు. నా మరణానంతరం అంత్యక్రియలు చేసి నీవు ముందుకు సాగిపో. త్వరలో నీకొక సిద్ధాశ్రమ యతి దర్శనం ఇస్తాడు. ఆయన దగ్గర సన్యాసము స్వీకరించు. నీ తరువాత జీవన గమనాన్ని ఆ మహాపురుషుడు నిర్దేశిస్తాడు"

వెంకటాచలయోగి శరీరమునుండి ప్రాణములను అలవోకగా,

విసర్జించాడు. స్వచ్ఛంద మరణుడయిన భీష్ముని వలె ఆ హిమాచలయోగి ప్రాణోత్క్రమణం శివయ్యకు మరుపురాని దృశ్యంగా మిగిలింది.

**మహమ్మదీయ యోగి**

మళ్లీ అన్వేషణ మొదలయింది. బారాబంకి గుహలలోని మహాయోగి ఇచ్చిన అనుగ్రహశక్తితో, పెరిగిన ఆత్మ విశ్వాసంతో శివయ్య తన గమనాన్ని కొనసాగిస్తున్నాడు. జనపదాలు దాటి, పల్లెలు దాటి కొండ మార్గంలో సుదూర ప్రదేశం నడిచాడు. ఆ నిర్మానుష్య ప్రదేశంలో ఒక చోట దాదాపు వందమంది ఫకీర్లు కూర్చున్నారు. వయోవృద్ధుడైన ఒక మౌల్వీ వారికి ఆహార పదార్థాలు, వస్త్రాలు పంచుతున్నాడు. అందరికి వస్తువు లందించిన తరువాత ఆయన ఒక పెద్దరాయి మీద కూర్చున్నాడు. అందరూ ఆయన మాటల కోసం ఎదురు చూస్తున్నారు. ఆ ప్రశాంత వాతావరణంలో ఆయన వాక్కు ప్రసన్న గంభీరంగా ఇలా సాగింది. "అనంతశక్తి సంపన్నుడు, అపారదయామయుడు అయిన అల్లా పేరుతో మొదలు పెడుతున్నాను. ఆయన సర్వ లోకాలకు ప్రభువు. సృష్టించేవాడు, పెంచేవాడు పోషించి కాపాడేవాడు, భక్తులను కనిపెట్టి ఉండేవాడు ఆయన మాత్రమే. మనకు ఋజుమార్గం చూపించాలని ఆయన నెపుడూ ప్రార్థిస్తూంటాము. మీ కొరకు ఈ నేలను పాన్పుగా, ఆకాశాన్ని కప్పుగా సృష్టించినవాడు, ఆ ఆకాశం నుండి వానను కురిపించి పంటలు పండడానికి దోహదం చేసినవాడు ఆయనే. ఆయనతో సమానులు ఎవరూ లేరు. అల్లా పట్ల ఎట్టి పరిస్థితులలోనూ తిరస్కార వైఖరిని చూపించకండి. నిజంగా ప్రాణం లేని మీకు ప్రాణ మిచ్చింది ఆయనే, మీ ప్రాణాలను తీసేది ఆయనే. మళ్ళీ బ్రతికించేది ఆయనే. చివరకు మీరంతా ఆయన దగ్గరకే వెళ్తారు. భూమిపైనున్న సమస్తాన్ని ఆయనే మీ కొరకు సృష్టించాడు. ఆ తరువాత తన ధ్యానాన్ని పైకి మరల్చి సప్తాకాశాలను సృష్టించాడు. విశ్వంలో ఏమండలంలో భూమి ఉన్నదో దానిలో ఏడు అంతస్తులు ఉన్నవి. సహనం ద్వారా, నమాజు ద్వారా ఆయన అనుగ్రహాన్ని పొందండి.

మీలో మంచివైపు నిలిచే వారు, మేలు చేయమని తెలిపేవారు, చెడును వారించేవారూ తప్పకుండా ఉండాలి. ఈ పనిచేసే వారే సాఫల్యం

పొందుతారు. మీరంతా అల్లా(త్రాడును గట్టిగా పట్టుకోండి. ఈ బంధమే. ఆయనతో సంబంధాన్ని నిలుపుతుంది. విశ్వాసులందరిని ఏకం చేసి ఒక పక్షంగా రూపొందిస్తుంది. భూమ్యాకాశాలతో ఉన్న అంతటికి అల్లా యజమాని. అన్ని వ్యవహారాలు ఆయన సమక్షంలోనే పెట్టబడతాయి. నేను మీకు ఇపుడు ఏదైనా ఇవ్వగలిగాను అంటే ఆయన కరుణవల్లనే".

**"లాహి లాహి ఇల్లల్లాహి మహమ్మద్ రసూలిల్లల్లాహి"**

మౌల్వి తన ప్రసంగాన్ని ముగించాడు. ఎదురుగా ఉన్న పకీరులంతా వినయ విధేయతలతో మోకాళ్ళపై ఒంగి నమాజు చేశారు. ఇంతలో మహాశ్చర్యకరమైన సంఘటన జరిగింది. ఒక్క మౌల్వి తప్ప అందరూ మాయమయినారు. ఈ వింత ఏమిటో శివయ్యకు అర్థం కాలేదు. ఈ దేవభూమిలో తాను సిద్ధులను, యోగులను, మహర్షులను వెదుకుతూ ఉంటే ఈ మహామ్మదీయ మౌల్వి కన్పించాడు ఏమిటి ? ఇంతకు ముందున్న యాచకులంతా ఎవరు ? ఒక్కసారిగా యింతమంది ఇక్కడకు ఎలా చేరారు ? చేరిన వారంతా ఏమయినారు. కట్టకట్టుకొని అంతా ఒక్కసారి ఎలా మాయమయినారు ? మనసులో ఆలోచనలెన్నో గి(రున తిరుగుతున్నవి. ఆ కనిపించే వ్యక్తినే అడిగి తెలుసుకుందాము అనుకుంటూ నెమ్మదిగా ముందుకు వెళ్ళి ఆ మౌల్విని సమీపించాడు. అనంతమయిన అంతరిక్షములోనికి నిర్వికార దృక్కులతో చూస్తున్న ఆ మౌల్వి ఇతని అడుగుల చప్పుడు విని ఇటువైపు చూచాడు. దయామయమైన చూపులతో పలికాడు – "చాలాదూరం నుండి అలసిపోయి వచ్చావు. ఆకలితో దప్పికతో శ్రమపడి ఉన్నావు. ముందు ఈ పళ్ళు మంచి నీళ్ళు తీసుకో. ఆ తరువాత నీ మనసులోని సందేహాలకు జవాబులు తెలుసుకోవచ్చు". శివయ్యకు ఇంకా ఆశ్చర్యం కల్గింది. "ఈయన తానెవరో తెలిసినవాడిలా మాట్లాడుతున్నాడు. ఆహారం తీసుకో. మంచినీళ్ళు తాగు అన్నాడు. బాగానే ఉంది కాని అక్కడ ఏమీ లేవు" అని మనసులో అనుకుంటుండగనే తన ముందు పెద్ద అరిటాకు దానిలో వివిధ ఫలాలు ప్రక్కనే ఆకు దొప్పలో మంచినీళ్ళు కనిపించినవి. ఏదో మాయవలె ఉన్నది. ఇది నిజమైన వస్తువు లేనా? మౌల్వి చిరునవ్వు నవ్వాడు. "శివయ్యా ! ఇవన్నీ నిజమైన వస్తువులే. నీ ఆచారానికి అనుగుణంగా ఆకులలో పళ్ళు

తెప్పించాను. నదిలోని మంచినీళ్ళు తెప్పించాను. సందేహించకుండా తీసుకో". శివయ్యకు దిగ్భ్రాంతి కల్గింది. "అయ్యా! మీరెవరు? ఈ విచిత్ర సృష్టి ఏమిటి? ఇంతకు ముందున్న వారందరూ ఏమయినారు? అంతా అయోమయంగా ఉంది. ఏదో చిత్ర ప్రపంచంలో గంధర్వ నగరంలో అడుగు పెట్టినట్లుంది."

**మౌల్వీ :** అన్నీ తరువాత చెప్తాను. ముందు ఆహార పానీయాలు తీసుకో శివయ్యా !

**శివయ్య :** ఆ పదార్థాలు తీసుకోగానే అలసట తీరటమే కాదు. క్రొత్త జవసత్వాలు వచ్చినట్లనిపించింది. ఆ తరువాత ఇద్దరూ దగ్గరలోనే ఉన్న గుహ దగ్గరకు వెళ్ళారు. ఆ మౌల్వీ నివాసం అదే. కొంత విశ్రాంతి తీసుకున్న తరువాత మౌల్వీ పడమటి దిక్కునకు తిరిగి మోకాళ్ళ పై కూర్చుని ప్రార్థన చేశాడు. అది పూర్తికాగానే శివయ్య వైపు తిరిగి ఇలా అన్నాడు. "అల్లా నిన్ను నీ మాతృ గర్భం నుండి నీవు ఏమీ ఎరుగని స్థితిలో ఉండగా బయటకు తీశాడు. ఆయన నీకు వినటానికి చెవులు, చూడటానికి కన్నులు ఇచ్చాడు. ఆలోచించే మనస్సు ఇచ్చాడు. ఆకాశంలో స్వేచ్ఛగా భద్రంగా విహరించే పక్షులను చూస్తున్నావుగా! అల్లా తప్ప వాటిని క్రిందపడకుండా నిలిపి ఉంచిందెవరు ? ఇచ్ఛా, జ్ఞాన, క్రియాశక్తులు ఆయన ఒక్కనికే ఉన్నవి. నేలమీద ఆకాశంలో గుప్తమైన సత్యముల జ్ఞానము అల్లాకు మాత్రమే ఉన్నది". శివయ్యా ! నీవు ఎవరో నాకు తెలుసు. ఎందుకు తిరుగుతున్నావో నాకు తెలుసు. నీ మనసులో తిరుగుతున్న ఆలోచనలు నేను ఎరుగుదును. ఇందాక నీవీ స్థలంలో ప్రవేశించినపుడు ఆహారములు, వస్త్రములు పుచ్చుకున్న ఫకీరులంతా ఎలా మాయమైనారన్నది నీ సందేహం. అది అల్లా నాకు ప్రసాదించిన శక్తి. ఇది రంజాన్ నెల. మహమ్మదీయులంతా ఉపవాసము లుండే రోజులివి. ఈ సమయంలో పేదసాదలకు దానం చేస్తే ఎంతో పుణ్యం వస్తుంది. నేనిక్కడ దానం చేయాలంటే ఎవరూ లేరు. ఇది నిర్మానుష్య మైన అడవి. అల్లా నాకు ఇచ్చిన శక్తితో నే నీ మనుష్యులను సృష్టించాను. మధుర పదార్థాలు సృష్టించాను. నూతన వస్త్రాలు సృష్టించాను. వాటిని వారికి దానం చేశాను. మత నిబంధనలలో చెప్పబడిన సూత్రాలను

పాటించానన్న సంతృప్తి కోసమే ఇదంతా.

**శివయ్య :** మౌల్వీజీ ! ఇదంతా చాలా ఆశ్చర్యకరంగా ఉన్నది. దేవతల భూమి, ఋషుల నివాసం అయిన ఈ హిమాలయ పర్వతాలలో ఒక ఇస్లామ్ మతస్థుడు ఇంత మహిమాన్వితుడుగా ఉండడం ఎవరూ కనీ, వినీ ఎరుగని ఆశ్చర్యకర సంఘటన.

**మౌల్వి :** మహిమలకు మతం లేదు. అల్లా ఒక్కడే ఈశ్వరుడు. ఆయన సర్వశక్తి సంపన్నుడు అన్న విశ్వాసంతో నేను నిరంతరం ధ్యానం చేశాను. సృష్టిలోని ప్రతి వస్తువులో నేను రహమాన్ దివ్యశక్తిని దర్శించాను. ఆకాశంలో మబ్బులు గర్జిస్తుంటే దానిలో 'అల్లా ఒక్కడే' అన్న ప్రకటన నేను విన్నాను. సామాన్యులు వట్టి ఉరుములు చప్పుడులు మాత్రమే వింటారు. మేఘాలు కురిసే వర్షంతో భూమి మీది జీవ సముదాయానికి నీరు లభింపచేసే దేవుడు చేసిన ఏర్పాటు నాకు కన్పించింది. నీలనీరదాలలోని మెరుపులతో మిరుమిట్లు గొలిపే భగవంతుని తేజస్సును నేను భావించాను. ఆకాశంలో మెరిసే ఇంద్రధనుస్సులో అల్లా లీలావిలాసాలను నేను కనుగొన్నాను. కరుణామయుడైన దేవదేవుడు నాకు అపార శక్తులను ప్రసాదించాడు ఆయన నిర్దేశించిన మార్గంలో వాటిని వినియోగిస్తున్నాను.

భగవంతుని అనంతమైన మహత్వాన్ని హృదయపూర్వకంగా విశ్వసించి ప్రార్థించు. ఆయన ఏదైనా ప్రసాదించగల సమర్థుడు. భక్తుడు కోరినవన్నీ ఇస్తాడు. ఆయన చేత నీవు ఎన్నిక చేయబడిన వ్యక్తివైతే నీకు కావలసిన శక్తులను అనుగ్రహించి తన ఇచ్ఛను నీ చేత క్రియారూపంగా పరిణమింప చేస్తాడు.

**శివయ్య :** అయ్యా ! మీరు చెప్పినది చాలా బాగున్నది మా పురాతన గ్రంథములయిన వేదములలోనూ ఈ సిద్ధాంతమే చెప్పబడినది. "ఏకం సత్ విప్రా బహుధావదంతి" ఉన్న సత్ పదార్థము ఒక్కటే జ్ఞానులు తమ అనుభవాలను అనుసరించి దానిని విశదీకరించారు. విశ్వాసంతో తీవ్రంగా ప్రార్థిస్తే ఈశ్వరుడు అనుగ్రహిస్తాడని అన్ని మతాలవారూ చెప్పినదే. కాని సాధన చేసే వ్యక్తికి దైవానుగ్రహ సూచన వస్తే తప్ప విశ్వాసం నిలవదు. ఈరెండూ పరస్పర ఆశ్రితాలు. విశ్వాసం సడలితే ఆ జీవికి ఉద్ధరణ ఎలా ?

**మౌల్వి :** నమ్మకంలేని వాడు ముందుకు సాగలేడు. అవిశ్వాస ప్రార్థనలు గురి తప్పిన బాణాల వంటివి. విశ్వాసం వదలి చేసే ప్రార్థనలకు సమాధానం రాదు. అలా చేయడం ఒక మనిషి నీళ్ళవైపు చేతులు చాచి దానిని నీవు నా నోటిదాక వచ్చేయి అని అభ్యర్థించినట్లుగా ఉంటుంది. అందువలన అనన్యమైన భక్తితో వేడుకోవడం ధర్మం. ప్రతివాడు ఆయనకు భక్తితో తలవంచి తీరాలి. సృష్టిలోని అన్ని వస్తువుల నీడలు ఉదయం, సాయంత్రం ఆయన ముందు వంగుతాయి. ఆయన ఎన్నిక చేసిన వ్యక్తికి, ఆయన దయతలచిన వ్యక్తికి అవిశ్వాసమన్న ప్రశ్న ఉదయించదు. నీవు ఈ వర్గమునకు చెందినవాడవు కనుక నీవు తప్పక అనుగ్రహింప బడతావు.

**శివయ్య :** ఆ అనుగ్రహం కోసమే నేను ఎదురు చూస్తున్నాను. మీవంటి మహాపురుషులను కలుసుకో గలగటమే దానికి సూచన అని విశ్వసిస్తున్నాను.

**మౌల్వి :** పరమేశ్వరాధీనమైన ప్రకృతి నుండి తీవ్రమైన సంకల్పం వల్ల శక్తిని ఆకర్షించుకోవచ్చు. సూర్యుని నుండి వేడిని, చంద్రుని నుండి చల్లదనాన్ని, మేఘాల నుండి వర్షాన్ని, చెట్లనుండి పూలను, పళ్ళను గ్రహిస్తున్నట్లే ఆ సృష్టికి మూలమైన అప్రాకృత శక్తిని దైవప్రార్థన ద్వారా సాధించవచ్చు. అపుడు నీవు ఇచ్ఛా మాత్రం చేత వర్షాన్ని కురిపించ కలవు. ఆపగలవు. పూలను పండ్లను వస్తువులను ప్రకృతిలోని అణువుల నుండి నిర్మించగలవు. ఎక్కడో ఉన్నవస్తువులను తానున్న చోటికి తెప్పించడం అల్పవిద్య. నూత్నసృష్టి చేయడం ప్రాతిభవిద్య. అవి పొందిన వ్యక్తి జీవ, నిర్జీవ ప్రకృతిని సృష్టించగలడు, శాసించగలడు. అఖండయోగములు, ఖండయోగములు, ఎన్నో చిత్రమైన విద్యలున్నవి. ఖండయోగములో మనిషి శరీర భాగాలు ఖండితమైనా కోరితే మళ్లీ కలుసుకుంటవి. ఈ విద్యలు వచ్చినవారు ఈ దేశంలోనే అక్కడక్కడ ఉన్నారు. ఈ ఆంధ్రభూమిలో గుంటూరు అనే చోట 'నల్లమస్తాన్' అని ఉన్నాడు. ఆయనకు ఇటువంటి యోగశక్తి ఉన్నది. ప్రసిద్ధులైన 'సలీం చిష్టి' మస్తాన్, సమీర్ బాబా, షాబుద్దీన్ వంటి యోగులు నా మిత్రగణంలోని వారే. ఎవరి పద్ధతిలో వారు మానవసేవ చేస్తున్నారు. దివ్య చైతన్యాన్ని ప్రసారం చేస్తున్నారు. అల్లా నిన్ను ఇక్కడకు తెప్పించాడు. నీకు కొన్నివిద్యలను అందించవలసిన ఆదేశం నాకు వచ్చింది. ఇక్కడ కొద్ది రోజులుందువు గాని జరగవలసిన

కార్యక్రమం చాలా ఉంది. ఈశ్వరుని కరుణ వల్ల నీవు మహాయోగివి కాగలవు.

**శివయ్య :** మీ అనుగ్రహం ఎలా ఉంటే అలా కానీయండి.

**సన్యాస స్వీకారము**

సంచారము సాగుతున్నది. అన్వేషణ జరుగుతున్నది. ఎన్నో ఆశ్రమాలు దర్శించాడు శివయ్య. ఎన్నో తీర్థాలు, ఎన్నో క్షేత్రాలు, ఎందరో పెద్దల దర్శనాలు పర్యటనలో కాలం, గడుస్తూన్నది.

**"కస్త్వం కోహం కుత ఆయాతః, తత్వం చింతయ తదిహ భ్రాతః"** నీవెవరు? నేనెవరు ? ఎక్కడ నుండి వచ్చాను ? ఎక్కడకు వెడుతున్నాను.

**"కింకరోమి క్వగచ్ఛామి, సాధయామి కథంపునః"** ఏమి చేసేది ? ఎక్కడకు వెళ్ళేది ? ధ్యేయాన్ని ఎలా సాధించేది ?

**ఏది గమ్యం ? ఏది ధ్యేయం ? ఏది లక్ష్యం ? ఏది మార్గం ? ఎవరు దేశికు ? డెవరు సద్గురు? వెవరు ఎక్కడ ఎప్పుడెప్పుడు ?**

ఇక్కడే ఇప్పుడే నీవు రావలసినచోటుకి వచ్చావు. అనే ధీర గంభీరమైన కంఠం వినిపించింది. శివయ్య కళ్ళు మూసుకుని వున్నవాడు ఈ మాటలు విని కళ్ళు తెరిచాడు. తాను మనసులో అనుకుంటున్న మాటలకు సమాధానం చెపుతున్నది ఎవరు? ఎదురుగా కాషాయవస్త్రధారి దండకమండల సమన్వితుడు అయిన ఒక యతీశ్వరుడు కనిపించాడు. సన్యాసిని చూడగానే సంప్రదాయం తెలిసిన వాడు గనుక సాష్టాంగ నమస్కారం చేసి చిన్నప్పుడు చదువుకున్న "వ్యాసస్తుతి" అప్రయత్నంగా పఠించాడు.

**ప్రాంశు పయోదనీల తనుభాసితు నుజ్జ్వల దండధారు పింగాంశు జటాచ్ఛటాభరణు ఆగమపుంజపదార్థతత్వని**

**స్సంశయ కారు కృష్ణమృగ చర్మ కృతాంబరకృత్యు భారతీ వంశ వివర్ధునన్ త్రిదశ వందితు సాత్యవతేయు కొల్చెదన్.**

సాక్షాత్కరించిన వ్యాసభగవానుడే మీరు. ఈ ఉత్తర భూములలో తెలుగు గొంతు వినిపించడం ఆశ్చర్యంగాను, ఆనందగాను ఉన్నది.

**యతి :** నేనూ ఆంధ్రుడనే, నీవిప్పుడు ఇక్కడకు వచ్చినట్లుగానే నేను ఒకప్పుడు ఇక్కడకు వచ్చాను. సన్యాసాశ్రమము స్వీకరించి ఇక్కడే

ఉండిపోయాను. మిగతా విషయములు తరువాత తెలుసుకోవచ్చు, నా వెంటరా.

గోవు వెంట దూడ వెళ్ళినట్లుగా శివయ్య ఆస్వామి వెంట దగ్గరనే ఉన్న వారి ఆశ్రమానికి వెళ్ళాడు. చాలా ప్రశాంతంగా, ఆహ్లాదకరంగా పరమ పవిత్రంగా వాతావరణం అలరారుతున్నది. కొద్దిమంది శిష్యులు మాత్రమే ఉన్న ఋషివాటిక అది. అక్కడకు చేరే సమయానికి సాయం సమయం అయింది. స్నానానుష్ఠానాలు పూర్తి చేసుకొని అందరూ గురుసన్నిధిలో కూర్చున్న తరువాత స్వామివారు శంకరుల జీవితాన్ని గురించి ప్రసంగించారు.

ఇది ఋషి భూమి. ఇది దేవతానిలయం. బ్రహ్మ సంకల్పం వల్ల యుగపరివర్తనం జరుగుతూ ఉంటుంది. కృత, త్రేతా, ద్వాపర, కలియుగాలు కాల చక్రపరిభ్రమణంలో కదిలిపోతూ వుంటాయి. ఇది కలియుగం, అసుర శక్తుల విజృంభణ, అధర్మ ప్రభావము తప్పదు. అయినా ఎప్పటికప్పుడు ధర్మరక్షణ కోసం మానవులను జాగృతం చేయడం కోసం ఈశ్వరాదేశం చేత అంతరిక్ష చరులయిన సిద్ధులు, మహర్షులు ఉద్యమిస్తూనే ఉంటారు. శ్రీకృష్ణుడు 'భగవద్గీత'లో ఈ విధంగా అన్నాడు.

**శ్లో॥ యదాయదాహి ధర్మస్య గ్లానిర్భవతి భారత,**
**అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానం సృజామ్యహం.**
**శ్లో॥ పరిత్రాణాయ సాధూనాం వినాశాయచ దుష్కృతాం,**
**ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే.**

ధర్మము తనను తాను రక్షించుకోలేక పోరాడి అలసిపోయినపుడు, అధర్మము విజృంభించినపుడు నన్ను నేను సృష్టించుకుంటాను. సాధువులను రక్షించడానికి, దుర్జనులను శిక్షించటానికి ధర్మాన్ని సంస్థాపించడానికి ప్రతి యుగంలోను నేను అవతరిస్తుంటాను.

వాసుదేవుడు చెప్పిన సిద్ధాంతము ఎప్పుడూ జరుగుతూ ఉంటుంది. అవసరాన్ని బట్టి దివ్యభూమికల నుండి పంపించబడ్డ వారు వచ్చి తమవంతు కర్తవ్యాన్ని నెరవేర్చి వెడుతుంటారు. అపారము, అనంతము అయిన పరమేశ్వర చైతన్యము పరిపూర్ణంగా ఎప్పుడో గాని రాదు. ఆయన అంశలు కళలు

పరిమిత శక్తులతో వచ్చి ధర్మజాగృతిని భక్తిచైతన్యాన్ని ఆధ్యాత్మికప్రబోధాన్ని అందించి లోక కళ్యాణానికి దోహదపడుతుంటాయి. పరిపూర్ణమైన అవతారము కలియుగాంతము నందు రెండు లక్షల సంవత్సరాల తరువాత గాని రాదు. ఈ లోపు ఎవరయినా నేను దేవుడను' అని ప్రకటించుకుంటే అది ఆత్మ వంచన, పరవంచన మాత్రమే. కలియుగము గనుక ఇటువంటి వారెందరో ప్రపంచంలో అజ్ఞుల చెంత ప్రకాశిస్తుంటారు. ఇటువంటి వారిని గురించి జగద్గురు శంకరాచార్యుల వారు "మోహముద్గర" స్తోత్రంలో ఇలా అన్నారు.

**శ్లో॥ జటిలో ముండీ లుంఛితకేశః కాషాయాంబర బహుకృతవేషః**
**పశ్యన్నపి చ న పశ్యతి మూఢో హ్యుదర నిమిత్తం బహుకృత వేషః**

ఏ వేషం ధరిస్తే లోకం గౌరవిస్తుందో అలాంటి వేషధారణ చేసి అంటే జడలు ధరించి కొందరు, శిరోముండనం చేయించుకొని కొందరు, కాషాయ వస్త్రములను ధరించి కొందరు అనేక విధములుగా, ఉదర పోషణకై, ధన సంపాదనకై కీర్తికై పాకులాడుతుంటారు. ఇటువంటి మోసగాళ్ళ నుండి నిజమైన ఋషులను, యతులను, యోగులను గుర్తించడం కష్టం. అయినా నిరంతర పరిశీలనవల్ల కాని అది అసాధ్యం కాదు. అందుకే శంకరుల వారు నాలుగు దిక్కులలో నాల్గు అమ్నాయ పీఠములు స్థాపించి, అక్కడి పీఠాధిపతుల కరకమలముల నుండి సంజాతులయిన యతుల ద్వారా ధర్మపరిరక్షణకు బాటలు ఏర్పరిచారు. తూర్పున – పూరి, దక్షిణాన – శృంగేరి, ఉత్తరాన – బదరీ, పడమర – ద్వారక పీఠములు ప్రధానములు. ఆయా పీఠములలో సన్యాసదీక్ష తీసుకున్న యతుల నుండి ఆ ఎన్నో ఆశ్రమములు, పీఠములు వెలసినవి. ఆ పరంపరలోని వారమే మనము. వైరాగ్య భావన, జ్ఞానము నందు అపేక్ష కల్గిన వారు ఏ వయసులో నైనా సన్యాసి కావచ్చు. శంకరుల వారు కారణజన్ములు గనుక, ఆయన బాల్యంలోనే బ్రహ్మచర్యాశ్రమము నుండే సన్యాసి అయినారు. అందరూ అలానే చేయవలసిన పనిలేదు. బ్రహ్మచర్యము, గార్హస్థ్యము పూర్తి చేసికొని వానప్రస్థ దశలో సన్యసించినవారు సామాన్యంగా పతితులుకారు. క్రమవైరాగ్యమే ఎప్పుడూ శ్రేయస్కరము. అందరూ సనకసనందనాదులు కారు. పద్మపాద, తోటక, హస్తామలకులూ

కారు. కొందరు మండన మిశ్రుల వంటి వారుంటారు. శంకరులచే శృంగేరి పీఠప్రథమాచార్యులుగా 'సురేశ్వర' నామంతో నియుక్తులైన మండనమిశ్రుడు మొదట గృహస్థే -కదా ! అందువల్ల బాలురయి విద్యాభ్యాసం చేస్తున్న మీలోని కొందరు సన్యాసం తీసుకోవాలని ఉబలాట పడుతున్నారు. మీలో తగిన వారికి తగిన సమయం, వచ్చినపుడు 'యతి' దీక్ష ఇవ్వబడుతుంది. అందాకా మీరు వేదాధ్యయనం చేయండి. జపతపములు చేయండి. యజ్ఞములు చేయండి. దైవశక్తి మీలోకి ఆవాహన చేసుకోండి. దీనితో పాటు ఉపనిషత్ పఠనము, శంకర భాష్య అధ్యయనము, మీకు వెలుగు బాటలు చూపుతవి.

**మరొక్కమాట :** సన్యాసాన్ని గురించి అవగాహన కూడా పూర్తిగా కావాలి. బ్రహ్మ జ్ఞానం సాధించడం ప్రధానమైన ధ్యేయం. అయితే ఆ జ్ఞాన సముపార్జనతో పాటుగా లోకంకోసం కూడ మనం కొంతసమయాన్ని వినియోగించాలి. తానొక్కడూ ముక్కు మూసుకుని కూర్చొని మౌనియై, జ్ఞానియై తరించడం మాత్రమే చాలదు. ఇతరులను కూడ తరింప చేయాలి. శంకారాచార్యుల వారు ప్రపంచంతో సంబంధం లేకుండా ఎక్కడో ఏకాంతంగా ఉండి బ్రహ్మానుభవస్థితిలో ఉండిపోయినట్లయితే ఈ కాషాయకాంతుల మహాప్రభావము ఇన్ని పీఠాల, ఇన్ని ఆశ్రమాల ఇందులో కషాయ వస్త్రధారుల దివ్య తేజస్సు దశ దిశలా ప్రసరించేదా ? ఈ జాతిలో పుట్టిన ప్రతి వ్యక్తి తన మాతృభూమికి ఋణపడి ఉన్నాడు, ఋషులకు ఋణపడి ఉన్నాడు. ఆ ఋణం తీర్చుకోవాలంటే ప్రతి వ్యక్తి తన జీవితంలో కొంత సమయాన్ని ధర్మం కోసం వినియోగించి తీరాలి. ఈ దేశం నిన్ను సన్యాసిగా ఉండనిస్తున్నది. ఆశ్రమాలను నిర్మించుకో నిస్తున్నది. దేవాలయాలను కట్టుకోనిస్తున్నది, పూజలు చేసుకోనిస్తున్నది. విదేశీయులు, విమతస్తులు, విధ్వంసము సృష్టించిననాడు పరిస్థితులు ఎట్లా ఉండేవో మీకు తెలుసు. మీ ఇష్టమైన మార్గంలో సాధన చేసుకోవడానికి మీకు అవకాశం కల్పించిన ఈ సమాజానికి మీరు సేవ చేయాలి. దానికి మార్గాలు రకరకాలుగా ఉంటాయి. తపస్సు ద్వారా, గ్రంథరచన ద్వారా సంచార ప్రబోధములు ద్వారా బాధితులకు ఆది వ్యాధులను తొలగించడం ద్వారా ఏలాగైనా సరే ధర్మ చైతన్యాన్ని ప్రజలలో పెంపొందించాలి. దానికి కావలసిన వ్యక్తులు మన ఆశ్రమంలో

నిర్మింపబడతారు. వారి సాధన ఫలించడానికి కావలసినదంతా ఇక్కడ చేయబడుతుంది. అదుగో ఆ పక్కన కూర్చున్న వ్యక్తి ఆంధ్రదేశం నుండి వచ్చిన శివయ్య అనే సాధకుడు. గృహస్థ జీవితాన్ని గడుపుతూ వైరాగ్యం కల్గి ఈ ఉత్తర భూములకు వచ్చి కొండలూ, కోనలు పట్టుకొని సద్గురువుల అన్వేషణలో ఉన్నాడు. ఇప్పటికే ఒకరిద్దరు మహాత్ముల దర్శనాన్ని పొంది యోగ్యత సంపాదించుకున్నాడు. అతనికి రేపు సన్యాస దీక్ష ఇవ్వబడుతుంది. ఇది దివ్యాదేశము.

శిష్యులంతా ఒక విచిత్రమయిన పరిస్థితిలో గురువుగారి ప్రబోధాన్ని విన్నారు. అందరూ ఈ క్రొత్త వ్యక్తి వైపు చూచారు. శివయ్య ఒక దిగ్భ్రాంతిలో ఉన్నాడు. తన ఊరు, తన పేరు, తన సమస్త జీవితము, భూత, భవిష్యత్, వర్తమానములు తెలిసిన ఈ మహానుభావుడెవరు ? లేచి ఆయనకు నమస్కరించి తమ ఇచ్ఛ ఎలా ఉంటే అలా జరుగుతుంది. నేను తమ ఆజ్ఞాను వర్తిని– అన్నాడు. స్వామి – నాయనా ! నీవు తెలుసుకోవలసింది ఇంకా చాల ఉన్నది. అన్నీ నెమ్మదిగా అవగతము కాగలవు. ఈ పూటకు ఆశ్రమంలో విశ్రాంతి తీసుకో. రేపు ఉదయం కార్యక్రమం మొదలవుతుంది. ఇట్లా సమస్తము త్యజించి దేనికోసమై నీవు బయలుదేరావో దానిని పొందగల సమయం ఆసన్నమయింది. మిగిలినది తరువాత.

శాస్త్రోక్త విధానమున శివయ్యకు సన్యాసదీక్ష ఇవ్వబడింది. తురీయాశ్రమ నామధేయము – "శివచిదానంద సరస్వతి".

**అచ్యుతానంద :** నాయనా నీవు ఇప్పుడు యతివి. పూర్వాశ్రమము నందలి వేనితోను నీకు ఇప్పుడు సంబంధం లేదు. దారా పత్య విత్త క్షేత్రదూరుడవైన ప్రత్యగాత్మవు నీవు. సృష్టిలోని గమనాగమనములకు నీవు సాక్షివి మాత్రమే. అన్నింటికీ అతీతుడవు నీవు.

**శివచిదానంద :** గురుదేవా ! ఈనాటి నుండి మీ సన్నిధిలో నిరంతర ప్రణవ జపం చేస్తూ మహావాక్యమును అను సంధానము చేస్తూ ఈ దివ్యభూమిలో జీవిత చరమ భాగాన్ని గడుపుతాను.

**అచ్యుతానంద :** శివా ! నీకు యతిదీక్ష ఇచ్చినది జీవితమంతా యిక్కడ గడపటానికి కాదు. కొంతకాలం ఇక్కడ ఉండి తపస్సు చేసి ఆ తరువాత

నీవు దక్షిణాపథమునకు పోవలసి ఉంటుంది. నీవు మాత్రమే చేయవలసిన దైవ కార్యములు కొన్ని విశిష్టమైనవి కలవు. వాటిని నెరవేర్చటానికి నీవు కొన్ని మంత్ర విద్యలను సాధన చేయవలసి ఉంటుంది.

**శివచిదానంద :** గురువర్యా సన్యాసులు ప్రణవము కాక మరొక మంత్రమును సాధన చేయవచ్చునా ?

**అచ్యుతానంద :** ప్రణవము ప్రధానమైనదే. ప్రణవ జపం వలన, శ్వాసానుసంధానితమైన ప్రణవ ధ్యానం వల్ల వైరాగ్యం నిలవడమే కాక దివ్యజ్ఞానం కూడ లభిస్తుంది. అయితే ధర్మాచరణ చేయవలసిన వ్యక్తులు నిర్దిష్ట ప్రణాళికల విజయం కోసం కొందరు దేవతలను ప్రత్యేకంగా ఆరాధించి సిద్ధశక్తులను సాధించి దేవ కార్య సముద్యతులు కావలసి ఉంటుంది. శంకారాచార్యుల శిష్యులు పద్మ పాదులు నృసింహోపాసకుల నుండి, అభినవ గుప్తుని మాంత్రికుల ప్రయోగముల నుండి రక్షించిన కథలను వినలేదా ? అమ్నాయ పీఠములు నాల్గింటిలోను శంకరుల వారు శారదాదేవి, కాళి మొదలైన దేవతలను స్థాపించి పీఠాధిపతులే స్వయంగా పూజ చేయాలని నిర్దేశించారు కదా ! అర్చన చేసే వ్యక్తి ఆ దేవతామంత్రాన్ని అనుష్టించకుండా పూజ చేసే అర్హత ఎలా ఉంటుంది ? కనుక సన్యాసికి ప్రణవేతర సాధనలు నిషిద్ధములు కావు.

ఇప్పుడు నేను నీచేత సాధన చేయించబోయే విద్య "సిద్ధేశ్వరి". కాళి, తార, ఛిన్నమస్త, భైరవి, బగళాముఖి, ధూమావతి, మాతంగి, సుందరి, భువనేశ్వరి, కమలాలయ అనబడే దశమహావిద్యలకు మూల శక్తియైన ఈ సిద్ధేశ్వరిని దత్తాత్రేయుని శిష్యుడైన పరశురాముని అనుగ్రహము వలన ఇరవై అయిదువేల సంవత్సరముల క్రింద హిమాలయములలో అవతరింప చేశాను. నేను దత్తాత్రేయ భక్తుణ్ణి. మనది దత్త సంప్రదాయం. ఆ విద్యను నీవు గ్రహించి ఆ దేవతానుగ్రహాన్ని సాధించాలి.

**శివచిదానంద :** గురుదేవా ! ఎక్కడి పరశురాముడు ? ఆయన అనుగ్రహాన్ని పొందిన మీరు మహా పురుషులు. కాని ఇరవై అయిదువేల సంవత్సరాల క్రింద భార్గవుని కృపవలన మీరు సిద్ధేశ్వరిని అవతరింప చేయటంలోని రహస్యం నాకు అవగతం కాలేదు. అడగవచ్చునో లేదో కాని

ఇప్పుడు మీవయస్సెంత ?

**అచ్యుతానంద :** అడగవలసిన ప్రశ్ననే వేశావు. సందేహములను మనసులోన అట్టి పెట్టుకుంటే అదిలోపల తొలుస్తునే ఉంటుంది. ఇక విను - శంకరాచార్యుల వారు స్థాపించిన సన్యాస సంప్రదాయంలో ఈ ప్రాంతంలో అవధూతానంద సరస్వతీ స్వామి సుప్రసిద్ధులు. వారి శిష్యులు యోగానంద సరస్వతీ స్వామి వారి శిష్యుడను నేను. ఈ శరీరము వయస్సు ఒక శతాబ్దము లోపే. కాని ఒక వ్యక్తి యొక్క వయస్సు నిర్ణయించడానికి కొన్ని పద్ధతులున్నవి. భగవద్గీతలో కృష్ణుడు అర్జుననకు దివ్య జ్ఞానాన్ని బోధించి దీనిని పూర్వము నేను వివస్వంతునికి చెప్పాను. వివస్వంతుడు మనువుకు చెప్పాడు. మనవు ఇక్ష్వాకునకు చెప్పాడు. అది కాలక్రమాన లుప్తమయింది అన్నాడు. అపుడు అర్జునుడు - "కృష్ణా! ఎక్కడి వివస్వంతుడు? ఎక్కడి మనువు ? కొన్నిలక్షల సంవత్సరముల కాలం గడిచింది. నీవు ఇప్పటివాడవు. నాకు సమవయస్కుడవు. నీవు వాళ్ళకు చెప్పటమేమిటి ? ఇది ఎలా సాధ్యమన్నా"డు. దానికి వాసుదేవుడు - "ఫల్గుణా నీకును నాకును ఎన్నో జన్మలు గడచినవి. నాకన్నీ తెలుసు. నీకు ఏమీ తెలియదు" అన్నాడు. వివస్వంతునికి చెప్పిననాడే కాదు. సృష్ట్యాది నుండి ఇప్పటికి వరకు నాకు తెలియనిది లేదు" అన్నాడు. అంటే కృష్ణుని వయస్సు ఎవరూ చెప్పలేరు, కొలువలేరు. అర్జుననకు భారత యుద్ధకాలం నాటికి వయస్సు సుమారు తొంభై సంవత్సరములు. శరీర దృష్టితో చూస్తే కృష్ణునకు గూడ ఇంచుమించు అంతే. కాని పూర్వ స్మృతిని బట్టి వయో నిర్ణయం చేయాలి. నీకు రేపు నీ ధ్యానంలో ఒక పూర్వ జన్మ గుర్తు వచ్చిందనుకో ! అనుకోవడ మేమిటి ? వస్తుంది. అపుడు నీవు వయస్సెంత ? అని లెక్క చెప్పవలసి వస్తే ఆ జన్మ సమయాన్ని కలుపు కోవాలి. నాకు పూర్వస్మృతి ఉన్నది. ఆనాటి అచ్యుతానందుడను నేనే. దివ్య ప్రేరణ వల్ల మా గురువు గారు నాకు ఆ పేరే పెట్టారు. కాబట్టి నా వయస్సు ఇరవై అయిదువేల సంవత్సరాలు. ఈ విధంగా పూర్వస్మృతి కల్గిన యోగులెందరో ఈ భారత భూమిలో ఉన్నారు. చాలా మంది ఋషులు ఉన్న శరీరం పతనమై కొత్త శరీరాన్ని ధరించవలసి వచ్చినా పూర్వ జన్మను గుర్తు పెట్టుకోగల్గన దైవాంశ సంపన్నులు. ఈసనాతన భూమిలో ప్రకాశిస్తునే ఉన్నారు. తెలుగులో

మహాభారత రచన ప్రారంభించిన నన్నయ్య భట్టు వ్యాస భగవానుని గురించి చెపుతూ

**"వివిధ వేదతత్వవేది వేదవ్యాసుడాది మునిపరాశరాత్మజుండు"** అన్నాడు. పరాశరుని కుమారుడైన వ్యాసుడు ఆది ముని ఎలా అవుతాడు ? ఆయన కంటె ముందు ఎందరో మహర్షులున్నారు కదా ! అంటే – కృష్ణ ద్వైపాయనునకు ఊర్ధ్వ స్మృతి ఉంది ? సృష్టి మొదటి కాలంలో ఉన్న అపాంతరతముడు అనే ముని పరాశరుని కుమారునిగా పుట్టి వ్యాసుడయినాడు. ఇప్పుడు వ్యాసుని వయస్సెంత? అలానే వశిష్ఠాది మహర్షులు జన్మలెత్తవలసి వచ్చినా పూర్వ స్మృతి ఉండటంచే వారు వారుగానే విరాజిల్లుతున్నారు. అటువంటి వారిని 'నిర్మాణకాయులు' అంటారు. ఇక్కడి హిమాలయాలలో 'సిద్ధాశ్రమము' అని ఒక్క గొప్పశక్తి కేంద్రమున్నది. అక్కడ సశరీరులు, అశరీరులు అయిన తపస్వులెందరో ఉన్నారు. వారిలో కొంతమంది వేల సంవత్సరాల వయసున్నవారు కూడా భాసిస్తున్నారు. పూర్వం రామాయణ కాలంలో విశ్వామిత్రుడు ఇక్కడే తపస్సు చేసి 'గాయత్రి' మంత్రసిద్ధిని పొంది సృష్టికి ప్రతిసృష్టి చేయగల దివ్య శక్తులను సాధించి అంతటితో ఆగక బ్రహ్మజ్ఞానాన్ని కూడా పొంది బ్రహ్మర్షి అయినాడు. అటువంటి తపోభూమి ఇది. పూర్వకాలంలో నలదమయంతుల కథ జరుగుతున్నప్పుడు నలుడు దమయంతిని విడిచిపెట్టి వెళ్ళిపోయిన సందర్భంలో ఆమె ఆత్మహత్యా ప్రయత్నం చేస్తున్నపుడు ఈ సిద్ధాశ్రమ ఋషులే సాక్షాత్కరించారు. చీమలు దూరని చిట్టడవి, కాకులు దూరని కారడవిలో ఉన్నట్లుండి కుటీరములతో హోమ కుండములతో ఒక ఆశ్రమమే అక్కడ సృష్టించబడింది. వారు దమయంతిని ఓదార్చి నీ పతితో నీకు మళ్ళీ కలయిక కలుగుతుంది' అని ధైర్యం చెప్పి ఆత్మహత్యా ప్రయత్నాన్ని మాన్పించి అదృశ్యులయినారు. అంతటి అద్భుత శక్తి సంపన్నులు ఆ సిద్ధాశ్రమ ఋషులు. అక్కడ నుండి ఒక యోగి రేపిక్కడకు వస్తాడు. అతని పేరు నిఖిలేశ్వరానంద స్వామి. నాకు పరమ మిత్రుడు. అతనిని నీకు పరిచయం చేస్తాను. మనం ముగ్గురము కలిసి 'కాంచనగంగ' శిఖర ప్రాంతానికి వెళ్ళాలి. అక్కడ కొంతకాలం ఉండి కొన్ని మంత్ర సాధనలు చేయాలి. తరువాత నీ వాచరించబోయే ఆధ్యాత్మిక ఉద్యమానికి

అవసరమైన శక్తులు నీకు లభిస్తున్నవి. దానికి సిద్ధంగా ఉండు.

**శివచిదానంద :** దేశిక ప్రభూ ! మీ ప్రబోధం వలన నా మనస్సులో సంశయాలన్నీ మటుమాయం అయినవి. మీ వచనం నాకు సర్వదా శిరోధార్యం.

## కాంచనగంగ

హిమాలయాల లోని కాంచనగంగ శిఖరం సౌందర్య సారసర్వస్వమైనది. సూర్యుని కిరణాలు ఉదయం సాయంత్రం ఆ గిరి శిఖరం మీద పడుతూ ఉంటే అది పరమేశ్వరుడు ధరించిన సువర్ణ కిరీటం లాగా భాసిస్తూ ఉంటుంది. ఆ కొండ మీద ఉన్న గుహలలో ఎందరో తపస్వులు నిరంతరం జపధ్యానమగ్నులై ఉంటారు. అచ్యుతానంద, నిఖిలేశ్వరానంద, శివచిదానంద, స్వాములు ముగ్గురూ అక్కడి ఒక గుహలో ఆసీనులయినారు.

**అచ్యుత :** శివా ! "ఇది ప్రత్యేకమైన సాధనామందిరం. ఇక్కడ కొన్నాళ్ళుండి తపస్సు చేసి దేవతానుగ్రహాన్ని పొందవలసి ఉన్నది. వేంకటాచలయోగి ఇచ్చిన విద్యవల్ల ఆహారము లేకపోయినా శ్రమకోర్చి రోజుల తరబడి ఉండగల్గిన శక్తి నీకు ఉంది. దాని సహాయంతో కొన్ని రోజుల తరబడి ఉండగల్గిన శక్తి నీకు ఉంది. దాని సహాయంతో కొన్ని రోజుల పాటు నిరాహారుడవై మంత్ర జప సాధన చేయాలి. ఈ గుహలో అటువైపు ఒక వ్యాఘ్ర చర్మాసనము ఉన్నది. దాని క్రింద అత్యంతశక్తి సంపన్నమైన వస్తువులు కొన్ని ఉన్నవి. ఆ ఆసనముపై కూర్చుని రేపు కృష్ణాష్టమి నుండి కృష్ణ చతుర్దశి వరకు జపదీక్ష చేయాలి. ఏడవరోజు రాత్రి నీకు దేవతా సాక్షాత్కారము కల్గుతుంది. ఈ రోజు మనము ముగ్గురము కలసి ఒక ప్రత్యేక పూజ ఆచరించాలి. ఈ వారం రోజులు నీతో పాటు నిఖిలేశ్వరానంద ఉంటాడు. అతను పక్కన ఉండడం కూడా ఎంతైనా అవసరం".

ఆ ప్రకారంగానే ఆ రోజు విశేషార్చన కార్యక్రమం జరిగింది. స్వామి అచ్యుతానంద మళ్ళీవారం తరువాత వస్తానని చెప్పి వెళ్ళారు.

**నిఖిలేశ్వర :** శివయోగీ ! "నీవు మా ఆప్తకోటిలోనివాడవు. సిద్ధుల ఇచ్ఛవలన కర్మ ప్రభావం వల్ల నీవు ఈ జన్మలోకి రావలసి వచ్చినది. నిన్ను

మేమెరుగుదుము కాని మమ్ము నీ వెరుగవు. ఆ యెరుక కలిగితే కాని నీవు సిద్ధమార్గంలో ప్రవేశించలేవు.

**శివ:** జన్మ మారినపుడు ఈ విస్మృతి తప్పదా ?

**నిఖిల :** తప్పదు. ఎవరో ఒకరిద్దరు కారణజన్ములకు తప్ప ప్రాకృత శరీరములో నుండి వచ్చినపుడు మరుపు సహజము. సాక్షాత్ పరమేశ్వరియైన శివపత్ని సతీదేవి శరీరము విడిచిపెట్టి హిమవంతుని కూతురుగా పుట్టినది. ఆ విషయము ఆమెకు జ్ఞప్తిలో లేదు. అందుకే సామాన్యురాలి వలె తపస్సు చేయవలసి వచ్చినది. ఇక సామాన్యుల మాట చెప్పవలసిన పని యేమున్నది. సామాన్యులే కాదు ధీమాన్యులు కూడా అంతే. కొందరికి కొన్ని నిర్దిష్ట హేతువుల చేత పూర్వ స్ఫురణ ఉండదు. ఉదాహరణకు రామునకు తాను విష్ణువునన్న పూర్వ స్ఫురణ లేదు. ఉంటే దేవతలచే చావగూడదని బ్రహ్మచే వరము పొందిన రావణుని చంపుటకు వీలయ్యేడిది గాదు. అటువంటి వానిని మినహాయిస్తే మిగిలిన వారంతా సహజమైన జన్మకర్మ సిద్ధాంతమునకు లోబడిన వారే. మరణానంతరము పుణ్యాపాపాను భవము పూర్తయిన తరువాత స్త్రీ గర్భకోశములో ప్రవేశపెట్టబడిన జీవుడు అక్కడ నరకము ననుభవిస్తూ ఆ బాధలలో తానెవరో మరచిపోతాడు. పుట్టిన తరువాత కొత్త జీవితము మొదలవుతుంది. పూర్వ పుణ్యవశాన పునరుద్ధితమైన తపస్సు వల్ల సిద్ధులైన గురువుల అనుగ్రహంవల్ల కొందరికి స్మృతి లభిస్తుంది. ఈ రెండూ ప్రాతిపాదికగా నీవిక్కడ తపస్సు చేయాలి. ఈ సాధన తరువాత మరికొన్ని లోకోపకారకరమైన సిద్ధశక్తులను సాధించవలసి ఉన్నది. దానికి నేనూ, స్వామి అచ్యుతానంద దోహదం చేస్తాము. ఈ ప్రాంత అరణ్యంలో సంచారము చేసి అనేక వనమూలికల ఉపయోగవిధానాన్ని తెలుసుకోవలసి ఉన్నది. మంత్రప్రేరితమైన ఓషధులు అద్భుతంగా పనిచేస్తాయి. ఉదాహరణకు తెల్ల జిల్లేడు వేరును తీసుకోవలెననుకో పుష్యార్క యోగం వచ్చినపుడు ఆ ముందు రోజు వెళ్ళి మూలికను అభిమంత్రించి దానితో చెప్పిరావాలి. ఆ మూలికను ఆశ్రయించి ఉన్న భేతాళ, పిశాచ, రాక్షసాది గణం దీనిని విడిచి పెట్టిపోవును గాక ! అని అభ్యర్థించాలి. మరునాడు ఉదయం ఆ మూలికకు పూజచేసి తవ్వకోలను అభిమంత్రించి ఆ వేరును జాగ్రత్తగా తీయాలి. అది వశీకరణ,

భూతగ్రహ రోగ నివారణకు ఆ వేరుతో చేసిన గణపతి మొదలైన దేవతా విగ్రహాలు శక్తి వాహికలుగా పనిచేస్తాయి. ఈ విధంగా తగిన తిథివార నక్షత్రములను తెలిసికొని తీసినట్లయితే మూలిక సహజ గుణం కంటే ఎన్నో రెట్లు అధిక గుణంతో పని చేస్తుంది. ఒక జాతి వృక్షంపై మొలచిన మరొక జాతిని 'బదనిక' అంటారు. అది సహజముగా పుట్టిన దాని కంటె అధికతర శక్తినిలయం. ఇటువంటి విశేషాలెన్నో ఈ వనభూములలో నీవు గ్రహించాలి. మంత్రము, యంత్రము, తంత్రము, ఈ మూడింటి ప్రయోగ విధానాలను క్షుణ్ణంగా తెలిసి కొన్నవాడు కాని ప్రజాసేవలో పరిపూర్ణత సాధించలేడు. లోకంలో ఒక్కొక్కరికి నిర్దిష్టమైన పని ఉంటుంది. ఆ వ్యక్తి ఆ పనిని సాధించడం కోసం ఏర్పాటు చేయబడతాడు. ఈ పర్వత శిఖరంగా మీద ఈ ప్రాంత అరణ్య సీమలలో నేర్చుకోవలసిన అంశాలు ఎన్నో ఉన్నవి. కొంతకాలం ఇక్కడ ఉండి ఆ తరువాత నీ గమ్యస్థానానికి వెళ్ళవలసి ఉంటుంది. వాటన్నింటిని అచ్యుతానంద స్వామి నిర్దేశిస్తారు. ఇక్కడ నీవు ఉండవలసినంత కాలం నేను నీప్రక్కన ఉండి సాధన చేయిస్తాను. ఆ తరువాత మళ్ళీ మనం కలుసుకోవడం ఇప్పట్లో జరుగదు. ఈ హిమాలయ భూముల నుండి వెళ్ళి నీవు దక్షిణ దేశంలో జన్మించినట్లుగానే నేనూ త్వరలో మరొక వైపు జన్మించవలసి ఉన్నది. అప్పుడు మనం కలుసుకోవడం జరుగదు. మళ్ళీ గురు నిర్దేశం జరిగినపుడు కలుసుకోగలము.

శివచిదానందులకు నూతన ప్రపంచములో ప్రవేశించినట్లయితే రకరకాల సాధనలు, దీక్షలు, పరిశోధనలతో కొంత కాలం గడిచింది. మధ్యలో అచ్యుతానంద స్వామి వారు వస్తూ పోతూ తగిన సూచన యిస్తూ తన శిష్యుని తీర్చిదిద్దారు. అక్కడ నుండి కదిలేరోజు ఈ విధంగా ప్రబోధించారు.

"శివచిదానందా ! ఇప్పుడు నీ యాత్ర ప్రారంభమయినది. ఈ పవిత్ర కాంచనగంగ ప్రదేశము మన సంప్రదాయానికి చెందిన తపః కేంద్రము. ఇక్కడ సిద్ధులు అవసరమయినపుడల్లా నీకు మార్గదర్శనం చేస్తుంటారు. నీ జీవిత యానంలో యెందరో మహితాత్ములైన వ్యక్తులు తటస్థపడతారు. వారిలోని మంచిని ఆదర్శంగా తీసుకో. సమతీ శతకంలో చెప్పినట్లుగా

**ప॥వినదగునెవ్వరు చెప్పిన, వినినంతనె వేగపడక వివరింపదగున్**
**కని కల్లనిజము తెలిసిన, మనుజుడె పో నీతిపరుడు మహిలో**
**సుమతీ!**

లోకంలో యోగులుగా, సిద్ధులుగా కొందరికి కీర్తి వస్తుంది. ఒట్టి పటాటోపమే తప్ప కీర్తికి తగినంత శక్తి చాలా చోట్ల ఉండదు. వీరు కాక బ్రహ్మజ్ఞానులు కొందరు ఉంటారు. బ్రహ్మానుభవాన్ని పొంది జ్ఞాన స్వరూపాన్ని అవగతం చేసుకొని లోకంలో అసంగులై ఏదో కర్మ చేయాలి కనుక చేస్తుంటారు. శంకరాచార్యుల వారు చెప్పిన

**శ్లో॥ సత్సంగత్వే నిస్సంగత్వం, నిస్సంగత్వే నిర్మోహత్వం,**
**నిర్మోహత్వే నిశ్చల తత్వం, నిశ్చల తత్వే జీవన్ముక్తిః**

నిస్సంగులైన జీవన్ముక్తులు వారు. శాస్త్రజ్ఞాన సంతృప్తులైన వ్యక్తులకు నిజమైన బ్రహ్మజ్ఞాని ఎలా ఉంటాడో తెలిపే ఆదర్శమూర్తులు వారు. వారికి లోక స్పృహ తక్కువగా ఉంటుంది. దక్షిణదేశంలో సదాశివ బ్రహ్మేంద్రయతి అని ఒక మహాత్ముడుండేవాడు. పిచ్చివానివలె కావేరి పులినములలో తిరుగుతూ ఉంటే కొందరు ఆయన గురువు గారి దగ్గరకు వెళ్ళి మీ శిష్యుడు పిచ్చివాడయినాడని చెప్పారు.

**శ్లో॥ ఉన్మత్తవత్ సంచర తీహ శిష్యః తవేతి లోకస్య వచాంసి శృణ్వన్**
**ఖిద్యన్నువాచాస్య గురుః పురాహో ఉన్మత్తతా మే న హి తాదృశీతి.**

వారి మాటలు విన్న గురువు బ్రహ్మేందేంద్ర యతి ఖేద పడుతూ అయ్యో! అటువంటి పిచ్చినాకు పట్టకపోయెనే ! అని బాధపడ్డాడు. అది దివ్యోన్మాదము. అది ఎవరయినా కోరుకోదగిన మహోన్నత స్థితి. బాలోన్మత్త పిశాచములవలె తిరిగే అటువంటి వారిని "అవధూత" లంటారు. మన సంప్రదాయానికి ఆద్యుడైన దత్తాత్రేయస్వామి అటువంటివాడే. ఇంతకూ ఆ సదాశివ బ్రహ్మేంద్రుడు ఒక రోజు లోక విస్మృతదశలో వెడుతూ ఒక నవాబు విడిది చేసిన డేరాల మీదుగా వెళ్ళుతున్నాడు. అక్కడ అతని అంతఃపుర కాంతలున్నారు. పిచ్చివాని వలె వస్తున్న ఇతణ్ణి చూసి, వారు కెవ్వుమని అరిచారు. ఆ కేకలు విని బయటకు వచ్చిన నవాబు కత్తితో స్వామిపైకి వెళ్ళిదెబ్బతీశాడు. యతీంద్రుని చేయి తెగిపోయి చిన్న నరముల పట్టుతో

వేలాడుతున్నది. మాంసము బయట పడింది,నెత్తురు కారుతున్నది. స్వామి వీటిని పట్టించుకొనలేదు. మాట్లాడకుండా నడిచిపోతూనే ఉన్నాడు. నవాబుకు దిగ్భ్రాంతి కలిగింది. ఎవరో మహానుభావుడని అనిపించి వెళ్ళి కాళ్ళమీద పడ్డాడు. ఇతని స్పర్శతో ఆయనకు స్పృహవచ్చింది. ఏమిటిదంతా? అన్నాడు. జరిగింది చెప్పి నవాబు క్షమించమని ప్రార్థించాడు. స్వామి ఒక్కసారి చూసి సరేలే అని తెగిన తన చేతిని రెండవ చేతితో స్పర్శించాడు. ఏమీ జరగనట్లు యథాపూర్వక స్థితి వచ్చింది. ఈ విధంగా బ్రహ్మజ్ఞానులలో కొందరు దివ్యశక్తి సంపన్నులుంటారు. మరికొందరు బ్రహ్మానుభవాన్ని పొందినా సిద్ధి స్థితిలేక దివ్యశక్తులు లేక ఉంటారు. అనుభవములలో ఇవన్నీ వివిధ కక్ష్యలు. ఈ రెండు రకాల వారు నీకు జీవితములో తారసపడతారు. జాగ్రత్తగా గమనించి ఎక్కడ ఎలా మసలుకోవాలో సమయానుగుణంగా ప్రవర్తించు. తరువాత సన్యాస జీవితంలో ఒక ప్రధానమైన అంశాన్ని క్షణక్షణము మనము చూచుకొంటూ ఉండాలి.

**శ్లో॥పుంఖాను పుంఖ విషయేక్షణతత్పరోపి, బ్రహ్మావలోకనధియం న జహాతి యోగీ**
**సంగీత తాళ లయవృత్త వశంగతాపి మౌళిస్థ కుంభ పరిరక్షణ ధీ ర్నటీవ.**

రంగస్థలం మీద ఒక నర్తకి జలపాత్రను తల మీద పెట్టుకొని నీరు ఒక్క బొట్టు కూడ చిందకుండా, పాత్ర కిందపడ కుండా నాట్యం చేస్తూ ఉంటుంది. ఎదురుగా చూచే ప్రేక్షకులకు ప్రక్కన గాయకుడు పాడుతున్న పాట మీద తాళం మీద అందలి లయ మీద నర్తకి దృష్టి పెట్టినట్లుగా అనిపిస్తుంది. కాని నిజానికి ఆమె దృష్టంతా తలపైన ఉన్న కుండ మీదనే ఉంటుంది. అదే విధంగా యోగి ప్రపంచంలో ఉన్నప్పుడు తన చుట్టూ ఉన్న విషయాల మీద ఆసక్తి చూపినట్లు కనపడుతూ ఉంటాడు. తన ఆశ్రమాన్ని అభివృద్ధి చేయడానికో సంస్థలను పెంపొందించడానికో లౌకిక వ్యవహారములలో మునిగిపోయినట్లుగా కన్పిస్తాడు. కొన్నిసార్లు ప్రజలకు ఇతడేమి సన్యాసి ? లౌకిక విషయాలలో ఇంత ఆసక్తి చూపుతున్నాడను కుంటారు. ధర్మాచరణ కోసం ఏమి చేసినా తప్పులేదు. అవసరమయినదల్లా చేయవలసినదే. పైకి ఏమి చేసినా ఏదిచేసిన అంతర్దృష్టి మాత్రం బ్రహ్మావలోకనం మీదనే ఉండాలి. ఈ జాగ్రత్త తీసుకున్నంత కాలం యతియొక్క

సన్యాసం నిలబడుతుంది. ఇక నీవు వెళ్ళే ముందు ఇక్కడకు వచ్చిన మరొక సిద్ధిసాధకుడు 'స్వామి విశుద్ధానంద' నిన్ను కాశికి తీసుకు వెళ్ళతాడు. అక్కడనుండి మహారాష్ట్ర మీదుగా దక్షిణాపథం వెళ్ళు. మహారాష్ట్రలో నా శిష్యుని ప్రశిష్యుడు వాసుదేవానంద సరస్వతి ఉన్నాడు. అతని దగ్గర కొద్ది కాలము ఉండి ఆతరువాత నీ ప్రయాణము కొనసాగించు. యోగీశ్వరి అయిన 'సిద్ధేశ్వరి' నీ వెంటనే ఉంటుంది. ఆమె పేరుతో భవిష్యత్‌లో నీవు ఒక పీఠాన్ని స్థాపిస్తావు. ఎక్కడ ఎప్పుడు అనేది తరువాత సూచించబడుతుంది.

## విశుద్ధానంద మైత్రి

స్వామి 'విశుద్ధానంద' ఆత్మీయుడైన స్నేహితుడు అయినాడు. స్వామి 'అచ్చుతానంద' స్వామి 'నిఖిలేశ్వరానంద' కోరిక ప్రకారము విశుద్ధానంద, శివ చిదానందస్వామిని హిమాలయాల నుండి కాశీ తీసుకువెళ్ళడానికి అంగీకరించాడు. వారు బయలుదేరేముందు సిద్ధాదేశమువల్ల ఒక గుహలో ఉన్న పురాతనమైన శివలింగము గోచరమైంది. అక్కడనుండి దానిని కాశీకి తీసుకువెళ్ళాలన్న సూచన రావడంవల్ల ఇద్దరూ ఆ శివలింగాన్ని తీసుకుని ప్రయాణం ప్రారంభించారు. శివ చిదానందస్వామి, విశుద్ధానందులవార్ని తమ సాధనలను గురించి అను భవములనుగురించి చెప్పమని కోరగా కాశీ నివాసియైన ఆ యతి ఈ విధంగా పలికాడు.

"మిత్రుడా! కాశీ ఒక దివ్య క్షేత్రము. పరమేశ్వరుడైన విశ్వనాధుడు అన్నపూర్ణా సహితుడై అక్కడ వేంచేసి ఉన్నాడు. అష్టాదశ మహాశక్తి పీఠాలలో ఒకటి అయిన 'విశాలాక్షి' దేవి అవతరించిన ప్రదేశము. దక్షయజ్ఞంలో శరీర త్యాగం చేసిన సతీదేవి శరీర ఖండాలలో కన్నులు ఇక్కడ పడినవి. అందుచే ఇది అక్షిపీఠము. ప్రతి శక్తి పీఠములోను అక్కడి పీఠదేవత వేరు అచటి శివుని భార్య వేరు. ఉదాహరణకు ఉజ్జయినిలో మహాకాళుని భార్య 'మంగళ చండి'. శివుని ఆలయం ప్రక్కనే ఆమె గుడి. పీఠదేవత 'మహాకాళి' ఊరిబయట శిప్రానదికి ఆవలివైపు అరణ్యంలో దూరంగా ఉంటుంది. మహాకవి కాళిదాసు, విక్రమార్క చక్రవర్తి ఆరాధించినది ఆ మహాకాళినే. ఇలానే మిగతా చోట్లగూడ. వారణాసి మహా శ్మశానం. ఆ మహా శ్మశానంలోని శ్మశానంలో నేను తీవ్ర

సాధనలు చేశాను. 'ఛిన్నమస్తా' సాధన చేసి అద్భుత శక్తులు సాధించాను. తాంత్రిక పద్ధతులలో దక్షిణాచారమునకు దేవాలయము. వామాచారమునకు శ్మశానము ప్రయోగా శాలలు. సాధకులు ఈ రెండు మార్గాలలో దేనినైనా అనుసరించవచ్చు. లేదా పగలు దక్షిణాచారము, రాత్రి వామాచారము చేయవచ్చు. నా ఆశ్రమంలో ప్రత్యేకంగా 'నవముండి' ఆసనమును ఏర్పరచి దానిపై కూర్చుని నేను సాధన చేస్తుంటాను. 'పంచ కపాల' ఆసనము పేరు నీవు వినివింటావు. నాల్గు జంతు కపాలములు మధ్యలో నరకపాలము. లేదా అయిదూ నరకపాలములు. నవముండాసనము గూడ అట్టిదే. అటువంటి ఆసనములపై కూర్చుని సాధన చేసినందువలన తీవ్రదేవతలు వేగంగా సిద్ధిస్తారు. వామాచారంలో పంచ మకారముల గూర్చిన ప్రస్తావన రాక తప్పదు. మద్యము, మత్స్యము, మాంసము, మైథునం, ముద్ర. వీనిని మనము ఉపయోగించరాదు. అవి లేకుండానే శ్మశాన సాధనలు చేయవచ్చు. కాశీ నివాసి లలితాసహస్రనామ వ్యాఖ్యాత అయిన భాస్కరానందనాథుడు వామాచారాన్ని గురించి వ్యాఖ్యానిస్తూ దానిని ఏకేశ్వరోపాననగా అభివర్ణించాడు. ప్రొద్దున లేచిన దగ్గరనుండి రాత్రి నిద్రపోయేలోపు అనేకదేవతలున పూజించడం, స్మరించడం వేద సంప్రదాయంలో జరుగతుంటుంది. బ్రాహ్మీముహూర్తంలో దేవతాస్మరణతో లేచిన వ్యక్తి తన చేతిని తాను చూసుకుని

**శ్లో ॥ కరాగ్రే వసతే లక్ష్మీ, కర మధ్యే సరస్వతీ,**
**కరమూలేతు గోవిందః, ప్రభాతే కరదర్శనం.**

చేతి అంచున లక్ష్మీదేవిని, మధ్యలో సరస్వతిని, మూలమున గోవిందుడు, దర్శించినట్లు భావిస్తారు. లక్ష్మీ సరస్వతులిద్దరూ గోవిందు భార్యలు. ఇది పూర్వకల్పమునకు సంబంధించిన శ్లోకము. అప్పుడు గోవిందుని భార్యలైన వారిద్దరూ ఈ శ్వేత వరాహకల్పంలో మార్పు జరిగింది. లక్ష్మి విష్ణుమూర్తి భార్య, సరస్వతి బ్రహ్మ భార్య అయినారు. పూర్వకల్పంలో గాయత్రి, సావిత్రి బ్రహ్మ భార్యలు. అలా నిద్రలేచిన వ్యక్తి తరువాత సంధ్యావందనము, సూర్యునకు అర్ఘ్యప్రదానము చేస్తాడు. ఆ తరువాత నిత్యాగ్నిహోత్రంలో ఆహుతులు వ్రేలుస్తాడు. పితృదేవతలకు తర్పణాలు సమర్పిస్తాడు. ఇదంతా వివిధ

దేవతలను పూజించడమూ ఆరాధించడము. ఇలాకాక ఒక్క దేవతనే నమ్ముకుని అందరు దేవతలు ఆ దేవత యొక్క రూపభేదములని భావించి ప్రతిదేవతాస్మరణలో అర్ఘ్యప్రదానంలో హోమంలో తర్పణంలో ఆప్రధాన దేవతానామాన్ని, మంత్రాన్ని స్మరిస్తూ అవసరమైన విధిని నిర్వర్తించడమే వామాచారం అని ఆయన నిర్వచనము. ఆయన ఒక ఉదాహరణ ఇస్తూ మార్తాండ భైరవుడు ఇష్టదేవతగా కల్గిన వ్యక్తి సూర్యునకు నమస్కారం చేయవలసివచ్చినపుడు.

మార్తాండ భైరవాయ సూర్యాయనమః అనవలెను. అగ్ని ఆహుతి వేయవలసి వచ్చినపుడు 'మార్తాండ భైరవాయ అగ్నయే స్వాహా' అనవలెను. ఈ విధంగా సర్వ 'దేవతార్చనలలోను తన ఇష్ట, దేవతానామమును అనుసంధానము చేయవలెను. ఇదియే వామాచారమని ఆయన అభిప్రాయము. అయితే లోకంలో వ్యాప్తిలో ఉన్న అర్థం మాత్రం పంచమకారాలు ప్రయోగించే సాధననే వామాచారం అంటారు. కొందరు వామమార్గాన్ని, శ్మశాన సాధనలను సమ్మిళితం చేస్తుంటారు. కాళిదాస మహాకవి కర్పూరాదిస్తోత్రంలో కాళీ సాధన గురించి చెప్పింది విను :

**శ్లో ॥ గతాసూనాం బాహుప్రకరకృతకాంచీ పరిలస,**
**న్నితంబాం దిగ్వస్త్రాం త్రిభువన విధాత్రీం త్రిణయనాం**
**శ్మశానస్తే తల్పే శవహృది మహాకాళ సురత,**
**ప్రసక్తాం త్వాం ధ్యాయన్ జపతి జడచేతాపికవిః**

శ్మశానమునందలి శవముపై కూర్చుండి మహాకాళునితో మారయుద్ధచేసే మహాకాళిని ధ్యానిస్తే, జపిస్తే కోరిన కోరికలు తీరుతవని తంత్రోక్తి. ఈ మార్గానికి సంబంధించిన సాధకులు ఇక్కడ వాడే పరికరాలలో మకార పంచకంతోపాటు కపాలములు, అస్థికలు, సర్పాస్థిమాలలు, జిల్లేడుపూలు, గురువింద గింజల దండలు, చితాభస్మం మొదలైనవి ఉంటాయి. శ్మశానంలోకి వెళ్ళి సాధన చేయడానికి అవకాశం లేనివారు ఆయా వస్తువులను రహస్యంగా తెచ్చికొని తమ సాధన మందిరంలో పెట్టుకొని ఉపయోగిస్తుంటారు. అయితే ఈ పథమునందు అభిరుచి కలిగినటువంటివారు. ముందు మంత్ర పురశ్చరణలు కొన్ని చేసికొని

ప్రేతభూమిలోకి ప్రవేశించరాదు. ఎందుకంటే సామాన్య వ్యక్తి అక్కడ అడుగుపెడితే అతనిలోనికి ప్రేతజీవులు ప్రవేశించి ఆక్రమించుకునే ప్రమాదమున్నది. అవి బలికాములు, రతికాములు, అంతకాములు అని మూడు విధాలు. మొదటి రకములవారు ఇతను తీసుకునే ఆహారాన్ని వాళ్ళు తింటుంటాడు. రెండవరకం పురుషులను స్త్రీ ప్రేతములు, స్త్రీలను పురుష ప్రేతములు ఆవేశిస్తుంటాయి. సూక్ష్మ శరీర భూమికలో అవి ఈ వ్యక్తితో భోగిస్తుంటవి. అపుడూ ఈ వ్యక్తి కృశించి పోవడం జరుగుతుంటుంది. నా అనుభవంలోని ఒక సంఘటన చెప్తాను విను. శివ చిదానందా! సన్యాసాశ్రమము చాలా కఠోరమైనది. కొందరు ఏదో ఆవేశంలో సన్యాసం తీసుకుని ఇంద్రియాలను నిగ్రహించుకోలేక బాధపడుతుంటారు. వాళ్ళకు మళ్ళీ జన్మతప్పదు. నాకు తెలిసిన ఒక సన్యాసి చాలా సజ్జనుడు. మృదుభాషి. వేలెత్తి చూపడానికి వీలులేని సౌశీల్యము కలవాడు. శరీరం పతనమైంది, మంచి స్థితికి వెళ్ళి ఉంటాడులే అనుకున్నాను. ఒక రోజు ఆయన భక్తురాలు ఒకామె వ్యాధిగ్రస్తురాలై బాధపడుతూ నా దగ్గరకు వచ్చింది. ధ్యానంలో చూస్తే మరణించి ఈ యతి ప్రేతమై ఆమెను ప్రతిరోజూ అనుభవిస్తున్నాడు. ఇది ఆమెకు కొంత తెలుసు. అక్కడ జరిగిందేమిటంటే ఆవ్యక్తి కామాన్ని అణచుకున్నాడే కాని జయించలేదు. దాని ఫలితం కామపిశాచి కావడం. ప్రపంచంలో అనేకులు తీవ్రమైన కామక్రోధాలు కల్గినవారు ఇలా ప్రేతములయ్యే పరిస్థితి ఉన్నది. కామం ఎలాగో క్రోధం కూడా అంటే. ఒక పాము మనిషిని పగపట్టిందనుకో ఆ క్షణం నుంచి అది ఆహారం తీసుకోదు. ఆహారం తీసుకుంటే కోపం పోతుందని దానికి అనుమానం. మామూలుగా గూడ మనిషికి ఎంత కోపం వచ్చినా కడుపునిండా తిని కమ్మగా నిద్రపోతే దానంతట అది (కోపం) తగ్గిపోతుంది. అందుకే కోపాన్ని, ద్వేషాన్ని, పగను నిలబెట్టుకోవలచినవారు చాలా కొద్ది ఆహారమును మాత్రమే స్వీకరిస్తారు. పగపట్టిన పాము తన లక్ష్యమయిన మనిషిని కాటువేస్తే దానికి సంతృప్తి కలుగుతుంది. కాటు వేసేలోపు ఆ వ్యక్తి మరణించినా, తాను మరణించినను దాని పగ తీరదు. ఆ నాగము మరణించి సర్పగ్రహమై తనద్వేషికి అపకారం చేయడానికి ప్రయత్నిస్తుంది. ఆ వ్యక్తి జీవించి ఉన్నా, పునర్జన్మ ఎత్తినా సర్పగ్రహం

గుర్తించగలదు. గుర్తించి పాము విషం మనిషిలోకి ప్రవేశిస్తే ఏ వ్యాధులు కలుగుతవో అవి వచ్చేలా చేస్తుంది. ఆ వ్యక్తికి విష జ్వరములు, చర్మవ్యాధులు, వస్తాయి. వారికి సంతానము కలుగదు. కల్గినా నిలువదు. ఆ బాధితులు నాగపూజలు చేసి సర్పమంత్రమును జపించి కష్టాలు పోగొట్టుకోవాలి.

మళ్ళీ శ్మశానం దగ్గరికి వస్తున్నాను. రాత్రివేళ శ్మశానంలో ఏకాంతంగా ఏమాత్రము భయపడకుండా ధీరుడై సాధన చేయాలి. ఏమాత్రం భయభ్రాంతుడైనా సాధకుడు గుండె ఆగి మరణిస్తాడు లేక పిచ్చివాడు అవుతాడు. శవం మీద కూర్చుని సాధన చేసే వ్యక్తికి మంత్రప్రేరణచేత ఆ శవమునకు సంబంధించిన జీవుడు ఆకర్షింపబడి దాసుడు అవుతాడు. ప్రతి మనిషికి ఉండే కాంతివలయం జీవుడు వెళ్ళిపోయినా శంలో మూడురోజులుంటుంది. ఆతేజోవలయం మంత్రశక్తి చేత సాధకుని తేజోవలయంతో కలసిపోతుంది. దానివల్ల మాంత్రికుడు బలవంతుడవుతాడు. ఇది ఇలా ఉండగా తీవ్ర దేవతలు శ్మశానంలో తిరిగే ప్రేతములను మాధ్యములుగా (Mediums) స్వీకరిస్తాయి. అక్కడ మంత్రోచ్చారణ ప్రభావం వలన దేవత ప్రేత శరీరాన్ని ఆవహించి వేగంగా సాక్షాత్కరిస్తుంది. ఒకసారి మంత్రవేత్త ఒకడు శ్మశానంలో కూర్చుని తన శత్రువు మీద 'వారాహి' ప్రయోగం చేశాడు. అది పోయి దెబ్బకొట్టింది. తెలియని, కుదరని వ్యాధిగ్రస్తుడై మరణశయ్యపై ఉన్న ఆ వ్యక్తిని అతని బంధువులు నా దగ్గరకు తెచ్చారు. చూస్తే అక్కడ వరాహీ దేవత కన్పిస్తున్నది. నేను వెంటనే ప్రశ్నించాను. నీవెవరు? "నేను వారాహిని" - అసలు నీవెవరు? "నేను వారాహినే" - కాదు నిజం చెప్పు. నీవు ఎలా వారాహివి అయినావు? "ఒక మాంత్రికుడు ప్రేతభూమిలో వారాహి మంత్రం జపిస్తూ ప్రయోగం చేశాడు. ఇటీవల మరణించి తిరుగుతున్న నేను దగ్గరలో ఉన్న గ్రామానికి చెందిన ఒక యువతిని. కర్మవశాన ప్రేతమై తిరుగుతున్నాను. ఆ మాంత్రికుని మంత్రశక్తివల్ల ఆకర్షింపబడ్డాను. నేను వారాహిని అయినాననిపించింది. అతడు ఫలానా వ్యక్తిని, పోయి బాధించి చంపమని ఆజ్ఞాపించాడు. ఆజ్ఞాబద్ధురాలనయి వెళ్ళి బాధిస్తున్నాను. త్వరలో చంపబోతున్నాను. ఇంతలో మీరు జోక్యం చేసుకున్నారు. మీ శక్తి ముందు నిలబడలేకపోతున్నారు. ఇకపై మీ ఆనతి

ప్రకారం చేస్తాను". నేను ఆ భూతాన్ని అనుశాసనం చేసి దానిలోని వారాహిని తొలగించి దైవసాధన చేసుకుని తరించే మార్గం చెప్పి పంపించాను. భవిష్యత్‌లో నీకు ఇటువంటి పరిస్థితులు ఎన్నో వస్తవి. మానవులనెందరినో ఆవరించిన భూత ప్రేతములను తొలగించవలసిన అవసరం ఏర్పడుతుంది. పూర్వ జన్మలో నీవు చేసిన సాధనలు, స్వామి అచ్యుతానందుల వారి దివ్యానుగ్రహము, ఈ రెండూ హేతువులుగా నీవు శ్మశాన సాధనల వంటివి చేయవలసిన పనిలేకుండానే నీకు దేవతానుగ్రహము కొంత సిద్ధించినది, ఇంకా సిద్ధించబోతున్నది. మహనీయులైన సిద్ధాశ్రమ యోగుల వల్ల సిద్ధశక్తులు నీలో వికసిస్తున్నవి.

మరొక గోపనీయమైన విషయం చెపుతాను. హిమాలయాలలో జ్ఞానగంజ్ అనే రహస్య ప్రదేశం ఉన్నది. అక్కడ సిద్ధులెందరో ఉన్నారు. దీర్ఘాయువు గల మహాతపయోగి. అచట సిద్ధాశ్రమానికి అధ్యక్షుడు. ఆయన శిష్యులు నన్ను ఆకాశమార్గంలో అక్కడకు తీసుకు వెళ్ళారు. వారి సన్నిధిలో వారి అనుగ్రహం వల్ల నేను ఎన్నో సిద్ధ శక్తులు సాధించాను. ఏ వస్తువును ఏవస్తువుగానైనా మార్చే సూర్య విజ్ఞానవిద్యను అచ్చటి గురువులు నాకు నేర్పారు. ఇంకా ఎన్నో అక్కడి శతసహస్ర వర్షాధిక జీవులైన యోగుల దగ్గర తెలుసుకొన్నాను. తర్వాతనే కాశీలో నా సాధన. ఆ విశేషాలు కొన్ని ఇంతకు ముందే చెప్పాను. వీటికి సంబంధించిన విద్యలు కొన్ని నీకు ఇతర పద్ధతులలోను లభిస్తవి. ఇక ముందు నీవు కాశీలో మరికొన్ని సాధనలు చేసి విశిష్టమైన అనుభవాలను పొందవలసి ఉన్నది. గంగాస్నానం, విశ్వేశ్వర దర్శనం, సర్వపాపహరం, పుణ్యప్రదం ముందుకు పోదాం పద.

## కాశీవాసము

శుద్ధానందస్వామివారి ఆశ్రమంలో శివచిదానందులు, కొంతకాలం ఉన్నారు. సాధన, వేదాంతగోష్ఠి, ఇలా కొన్ని రోజులు గడచినాయి. కాశీవిశేషాలను గురించి ప్రత్యేక ప్రాధాన్యం కలవేవయినా చెప్పమని కోరినపుడు విశుద్ధానందులవారు ఈ విధంగా అన్నారు. స్నేహితుడా! కాశీలో ఉండే దేవతలను గురించి చాలా మంది గ్రంధాలు వ్రాశారు. స్కాంద పురాణంలోని కాశీ ఖండంలో ఎన్నో విశేషాలున్నవి. భక్తులు, ఋషులు

స్థాపించిన లింగములు, అసంఖ్యాకములైన తీర్థములు, ఎన్నో ఘట్టములు, హరిశ్చంద్ర, మణికర్ణిక ఘట్టము మొదలైనవి. అక్కడ తపస్సు చేసి, గంధర్వత్వము, విద్యాధరత్వము, దేవత్వము, దిక్పాలకత్వము పొందిన మహనీయుల కథలెన్నో పురాణవాఙ్మయంలో మనకు గోచరిస్తవి. పురాణ వాఙ్మయం అంతటినీ సంకలనం చేసినవాడు రచించిన వాడయిన వ్యాసమహర్షి గూడ కాశీని విడచి వెళ్ళవలసి వచ్చినది. ఆయన భక్తిని పరీక్ష చేద్దామని విశ్వేశ్వరుడు మూడు రోజులపాటు భిక్ష పుట్టకుండా చేస్తే ఆకలికి తట్టుకోలేక కాశీనే శపించబోయినాడు కృష్ణ ద్వైపాయనుడు. కోపించిన విశ్వనాథుడు ఆ మహర్షిని కాశీ నుండి వెళ్ళిపొమ్మని ఆజ్ఞాపించాడు. స్వామి కాళ్ళ మీదపడి ప్రాధేయపడితే కనికరించి పర్వదినాలలో మాత్రం రావడానికి అనుమతించాడు. అందుకే గంగకు ఆవలి ఒడ్డున వ్యాసుని ఆశ్రమం ఉంటుంది. ద్రాక్షారామ భీమేశ్వరుని సన్నిధిలో కొంతకాలం గడిపాడు వ్యాసుడు. వ్యాసుని వెళ్ళగొట్టాడు విశ్వనాథుడు. కాశీ మరో చిత్రం విన్నావా ! విశ్వనాథుడే కాశీ నుండి వెళ్ళిపోవలసి వచ్చింది. రెండు సార్లు శివచిదానందా ! ఇది చాలా ఆశ్చర్యకరమైన అంశం. చాలా పూర్వకాలం క్రింద భూమి మీద క్షామము దుర్భిక్షము ఏర్పడి వానలు లేక, పంటలు లేక ప్రజలు మలమల మాడుతూ ఉంటే యజ్ఞయాగాదులు లేక, దేవతలకు హవిర్భాగం లేక దిక్కుతోచని స్థితిలో దేవతలు బ్రహ్మ దగ్గరకు వెళ్ళారు. అపుడు బ్రహ్మ 'దేవతలారా ! ఈ పరిస్థితిలో మీరు చేయగల్గినది ఏమీలేదు. కాలం మీకు అనుకూలంగా లేదు.

భూలోకంలో దివోదాసుడు అని తపస్వి ఉన్నాడు. అతని దగ్గరకు వెళ్ళి భూమిని పరిపాలించమని అడగండి. అతడు తన తపః ప్రభావం వల్ల లోకంలోని కరవు కాటకాలను పోగొట్టి సుభిక్షమును శాంతిని సాధించగలడు." విధాత సూచన ప్రకారం దేవతలు వెళ్ళి దివోదాసుని అర్థించారు. అప్పుడు దివోదాసుడు కొన్ని నియమాలు విధించాడు. "దేవతలారా ! మీరు కోరిన విధంగా నా తపః శక్తిని వినియోగించి ఈ భూమికి శాంతిని కలిగించాలంటే నేను చెప్పిన దానికి మీరు అంగీకరించాలి. 1. నాయిష్టమయినంత కాలం నేను పరిపాలించాలి. మధ్యలో వచ్చి వెళ్ళిపొమ్మని మీరడగగూడదు. 2. నా

శక్తి తప్ప వేరు ఏ శక్తి ఈ భూమి మీద పనిచేయరాదు. దివ్య శక్తి సంపన్నులయిన మీరు భూమి మీది వ్యవహారములలో జోక్యము చేసికొనరాదు. అంతే కాదు – ఊర్ధ్వ లోకవాసులయిన దేవతలు, విద్యాధరులు, యక్షులు, గంధర్వులు, కిన్నరులు, సిద్ధులు, సాధ్యులు మొదలయిన వారు గాని, అధోలోక వాసులయిన రాక్షసులు, నాగులు, మొదలయినవారు గాని భూలోకమునకు రారాదు. ఈ నియమములు మీ కిష్టమయితే నేను పరిపాలిస్తాను." గత్యంతరం లేని పరిస్థితిలో దేవతలంగీకరించవలసి వచ్చినది. ఆ నియమపాలన కోసం కాశీ నుండి విశ్వనాథుడు కూడ వెళ్ళి పోయినాడు. తరువాత చాలా కాలానికి కాశీ విడచి పెట్టి ఉండలేక విశ్వనాథుడు గణపతిని పంపిస్తే అతడు వృద్ధ బ్రాహ్మణ వేషంలో వచ్చి రాజు దగ్గర చేరి నెమ్మదిగా వైరాగ్య బోధ చేసి దివోదాసుడు తనంతట తానుగా రాజ్యాన్ని వదులుకునేటట్లు చేశాడు. అపుడు విశ్వనాథుడు మళ్ళీ కాశీ ప్రవేశించాడు. మరొకసారి ద్వాపరాంతంలోను ఇటువంటి పరిస్థితే వచ్చింది. సాళ్వునకు పౌండ్రక వాసుదేవునకు మిత్రుడైన కాశిరాజు వాళ్ళకు సాయం చేయడానికి వెళ్ళి కృష్ణుని చేతిలో మరణించాడు. తరువాత రాజైన కాశీరాజు కొడుకు శ్రీకృష్ణుని యుద్ధంలో గెలవడం సాధ్యం కాదు గనుక. తన తండ్రిని చంపిన పగ తీర్చుకోడానికి మంత్రవేత్తలను పిలిపించి ఆభిచారిక హోమం చేయించాడు. ఆ హోమకుండంలో మహాకృత్య ఉదయించింది. మాంత్రిక ప్రేరణతో అది కృష్ణుని చంపడానికి ద్వారక మీదికి వెళ్ళింది.

అప్పుడు ద్వారకలో కృష్ణుడు లేడు. నగరానికి రక్షగా ఉంచిన సుదర్శన చక్రం ఆ భయంకర కృత్యను దహించి అంతతో ఆగక కాశీకి వెళ్ళి ఆ పట్టణాన్నే తగులబెట్టింది. ఇప్పుడు ఇక్కడ ఉండడం మంచిది కాదని కాశీ నుండి విశ్వనాథుడు వెళ్ళిపోయినాడు. 12 సం॥ పాటు కాశీ నగరం తగులపడుతునే ఉన్నది. ఆ తరువాత విశ్వనాథుడు మళ్ళీ వచ్చాడు. ఈ విధంగా వారణాసి విచిత్రమయిన సంఘటనలకు నిలయం.

ఆ మధ్య బృందావన ధామం నుండి ఒక కృష్ణ భక్తుడు వచ్చాడు. అతడు చాలా సంవత్సరాలు కృష్ణ మంత్రజపం చేశాడు. ఎంతకాలం గడచినా ఎన్ని లక్షలు, కోట్లు జపం చేసినా గోవిందుని సాక్షాత్కారం కలుగలేదు.

విసిగిపోయిన ఆ భక్తుడు కాశీ వచ్చి ఇక్కడి శ్మశానంలో కాలభైరవ మంత్ర సాధన చేశాడు. 6 నెలలు చేసిన తరువాత కాలభైరవుడు సాక్షాత్కరించి ఇలా అన్నాడు. "సాధకుడా! నీవు నన్నెందుకు పిలిచావయ్యా ! నీ చుట్టూ కృష్ణ తేజస్సు కన్పిస్తున్నది. త్వరలో నిన్ను కృష్ణుడు అనుగ్రహించబోతూ ఉన్నాడు. నా అవసరం నీకు లేదు. నీవు మళ్ళీ బృందావనమే వెళ్ళి సాధన చేయి."

సాధకుడు ! స్వామీ కాలభైరవా ! ఈ సంగతి తెలిపినందుకు కృతజ్ఞుణ్ణి. నీ దర్శనం వల్ల నేను కృతార్థుడయినాను. మళ్ళీ బృందావన ధామం వెళ్ళి నీవు చెప్పిన ప్రకారం చేసి కృష్ణానుగ్రహాన్ని పొందుతాను. కాశీలో ఈ శ్మశాన సాధనలో నిన్ను చూడగల్గిన దివ్యదృష్టి లభించింది. ఈ సాధన ఈ విధంగా సార్ధకమయింది.

ఆ సాధకుడే మహాభక్తుడయిన మధుసూదన సరస్వతి. నిర్గుణ పరబ్రహ్మ సాధన కంటె సగుణ బ్రహ్మాత్మకమైన కృష్ణప్రేమ అతనిని ఆకర్షించడం వల్ల ఇదే తనకు కావాలి అని కోరుకుంటూ యమునాతీరపు ఇసుకలో సంచరించే శ్యామల కోమలకాంతి నాకు ఇష్టము. నిశ్చలము, నిర్గుణము అయిన జ్యోతిని ధ్యానాభ్యాసము చేత యోగులు చూడవచ్చు. కానీ కదిలే నీలకాంతి నాకు కావాలి అని భావిస్తూ చేసిన అతని రచన గమనించు.

**శ్లో॥ ధ్యానాభ్యాస వశీకృతేన మనసా యన్నిశ్చలం నిర్గుణం**
**జ్యోతిఃకించన యోగినో యది పరంపశ్యంతి పశ్యంతుతే**
**అస్మాకం తు తదేవలోచన చమత్కారాయ భూయశ్చిరమ్**
**కాళిందీపులినేషు యత్కి మపి తం నీలం మహో ధావతి.**

సాహిత్య శాస్త్రంలో శృంగార వీర కరుణాదులు రసములు కాని, భక్తిని రసముగా పండితులంగీకరించరు. అది శృంగార పరమయితే అనగా గోపికాభక్తి వంటిదయితే శృంగార రసముగా పరిణమిస్తుంది. భగవంతుని దుష్టశిక్షణ, శిష్ట రక్షణ కథలను భావిస్తే అది వీర రసమవుతుంది. ఆ దేవదేవుని మహా మహిమలను చూచి ఆశ్చర్య చకితుడైతే అది అద్భుత రసంగా రూపొందుతుంది. ఈ విధంగానే వివిధ భక్తి భావములు వివిధ రసములుగా

ఆకృతి ధరిస్తవి. కానీ మధుసూదన సరస్వతి భక్తిని–రసముగా ఇతర భావములు దాని అంగములుగా ప్రతిపాదించాడు.

శంకరాచార్యులువారు కూడ స్వ స్వరూపాను సంధానమే భక్తియని ఆత్మ తత్వానుసంధానమే భక్తియని మరికొందరంటారని నిర్వచించారు. సరి, దానికేమి!

కాశీలో మరొక మహనీయవ్యక్తి ఉన్నాడు. ఆయన త్రైలింగస్వామి. తెలుగుదేశం నుండి రావడం వల్ల అంటే త్రిలింగ భూమి నుండి రావడం వల్ల ఆయనను త్రైలింగస్వామి అన్నారు. దాదాపు మూడు వందల సంవత్సరములు పాటు జీవించిన యతి సార్వభౌముడతడు. సుమారు 300 పౌన్ల బరువుతో బృహత్ కాయంతో దిగంబరుడయి కాశీనగర వీధులలో ఆయన తిరుగుతుంటే ఆంగ్ల ప్రభుత్వపు పోలీసులు బంధించి కారాగారంలో ఉంచారు. లోపల పెట్టి తాళం వేస్తే ఆయన జైలు మేడ మీద కాసేపటి కల్లా కనిపించేవాడు. ఆంగ్లేయ మహిళలు మేజిస్ట్రేటుకు ఆయనపై దిగంబరుడుగా తిరుగుతున్నాడని రిపోర్టు చేయగా మేజిస్ట్రేటు ఆయనను శిక్షించడానికి ప్రయత్నించి విఫలుడైనాడు. ఆయన అవధూత, మహాసిద్ధుడు. ఆయనను గురించి తెలుసుకోవడం అవసరం.

సన్యాసులు ఆరు తరగతులు. 1. కుటీచక 2. బహూదక 3. హంస 4. పరమహంస 5. తురీయాతీత 6. అవధూత. చివరి ముగ్గురూ అద్వైత పరమైన సన్యాసులు. మహా వాక్యోపదేశం చేయడానికి అర్హత గలవారు. ఇంకా సన్యాసవిధిని కొందరు రెండు విధాలుగా నిర్వచించారు. విద్వత్ సన్యాసి, వివిదిషా సన్యాసి. వివిదిషా సన్యాసికి మొలత్రాడు, కౌపీనం, వస్త్రము, దండము కమండలము ఉంటవి. యోగపట్టా, అంటే పాత పేరు వదలి యత్యాశ్రమ నామధేయం ధరించడముంటుంది. విద్వత్ సన్యాసికి ఇవేమి అవసరంలేదని నారద పరివ్రాజకోపనిషత్ చెప్పుతుంది. యోగీశ్వరుడైన అచ్యుతానంద స్వామి అనుగ్రహం వల్ల పొందవలసినది నీవు పొందగలిగావు. ఇక పరమ పవిత్రమైన వారణాసి క్షేత్రంలో కొద్దికాలం ఉండి తరువాత దక్షిణాపథం వెళ్ళవచ్చు.

శివచిదానంద స్వామి కాశీలోని అనేక ప్రదేశాలు దర్శించాడు. గంగానదిలో నిలబడి కొన్నాళ్ళు జపం చేశాడు. ఒక విశ్వనాథ శివలింగమునే కాక మహర్షులు స్థాపించిన ఎన్నో దివ్య లింగములను దర్శించి పునీతుడయినాడు. వానిలో స్వప్నేశ్వరలింగము ఆయనను ఆకర్షించింది. త్రిరాత్రోపవాసము చేసి స్వప్నేశ్వర సన్నిధిలో జపసాధన చేశాడు.

**శ్లో॥ నమోஉజాయ త్రిణేత్రాయ పింగళాయ మహాత్మనే**
**వామాయ విశ్వరూపాయ స్వప్నాధిపతయేనమః**
**భగవన్ దేవదేవేశ శూలభృత్ వృషవాహన**
**ఇష్టానిష్టం సమాచక్ష్వ మమసుప్తస్య శశ్వతః**

దీనికి అనుసంధానంగా శూలపాణి మంత్రం ఉన్నది. ఈ మంత్రసాధన ఫలితంగా శివచిదానందుల వారికి స్వప్నం ద్వారా అపూర్వమైన విశేషాలు తెలిసినవి.

స్వప్న భూమిక చిత్రమైనది. జాగ్రదవస్థకు నిద్రావస్థకు మధ్య అలానే నిద్రావస్థకు జాగ్రదవస్థకు మధ్య ఉండే మజిలీ అది. ఆ ప్రదేశాన్ని దాటకుండా పోవడానికి వీలులేదు. ప్రతి వ్యక్తి కలలు కని తీరాలి. నాకు కలలు రావనే వ్యక్తి ఎవరయినా ఉంటే అది సత్యం కాదు. శారీరక శ్రమ వల్ల కాని మాదకద్రవ్యాలు సేవించడం వల్ల కాని అక్కడ ఎపుడయినా ఆగకుండా వెడితే వెళ్ళవచ్చు. లేదా వచ్చిన కలలు మర్చిపోవచ్చు. కొందరికి వారు చూచినవి, ఊహించినవి కలలుగా వస్తుంటాయి. మరికొందరికి ఎప్పుడో మనసులో లోపలి పొరలలో ఎన్నేళ్ళ క్రిందనో జరిగిన సంఘటనలు కలలుగా రావచ్చు. కొన్ని పర్యాయాలు ఎప్పుడూ, ఎన్నడూ ఎక్కడా చూడని విశేషాలు గూడ వస్తుంటాయి. మనస్తత్వ శాస్త్ర దృష్టితో విశ్లేషణ చేస్తే చాలా వాటికి కారణాలు దొరుకుతాయి. లేదా కొన్ని వ్యక్తుల సాధన వల్ల, సంస్కారాల వల్ల, జన్మాంతర విశేషాలు గోచరించవచ్చు. ఆచార్య శంకరులవారు భాష్యంలో – **దేవాతాత్మకాః కేచిత్ స్వప్నాః సత్యార్థ గంధినో భవంతీతి మన్యంతే"** అన్నారు. మంత్రశాస్త్ర వేత్తలయిన విజ్ఞుల అభిప్రాయం ప్రకారం కలలో ఏమయినా రావచ్చు గాని దేవతలు వారి ఇచ్ఛఉన్నపుడు మాత్రమే కనిపించడం

జరుగుతుంది. అందువల్ల స్వప్నంలో దేవతా దర్శనానికి కూడ నిబద్ధత ఉన్నది. తంత్ర గ్రంథాలలో స్వప్నేశ్వరి, స్వప్నావతి, స్వప్నకాళి, ఘంటాకర్ణి, మొదలైన స్వప్న విద్యలు చెప్పబడినవి. ఆయా మంత్రముల పురశ్చరణ చేసి స్వప్న భూమికలో భూత, భవిష్యత్, వర్తమానాలు తెలిసికొనవచ్చు.

స్వప్నేశ్వరుని సన్నిధిలో శివచిదానందులకు దర్శన పరంపర కల్గింది. హిమాలయాలలో కైలాస పర్వతం తామర రేకుల వంటి కొండలు మధ్యన శివ లింగము యొక్క ఆకారం కల్గిన శిఖరము, దానిపై ఎప్పుడూ అర్ధచంద్రాకృతిలో మంచు, ఆ శైలం మొత్తం సూర్యకిరణాలు పైన పడినపుడు వెండికొండ లాగా ప్రకాశిస్తూ ఉన్నది. ఆ శిఖరానికి నాలుగు వైపుల పాదముద్రలు కన్పిస్తున్నవి. దానిని హిందువులు శివునివని బౌద్ధులు, బుద్ధునివని పూజిస్తున్నారు. ఆ కొండ మీదికి తాను వెడుతున్నాడు. ఆ పరిసరంలోకి అడుగుపెట్టగానే పులి చర్మాన్ని ధరించి మెడలో కపాల మాల వ్రేలాడుతూ ఉన్న మహాభీషణా కారుడు కన్పించాడు. కాశీ పట్టణానికి కాల భైరవుని వలె ఈ కైలాస శిఖరానికి అతడు రక్షకుడు. అతని పేరు ధెంచుక్ అని వినిపిస్తున్నది. ధర్మపాలుడనే పేరు స్ఫురిస్తున్నది. అతడు తన వైపు అనుగ్రహంతో చూస్తు శిఖర ప్రవేశానికి అనుమతించాడు. వివిధ సంప్రదాయములకు చెందిన యోగులెందరో అక్కడ కన్పిస్తున్నారు. నెమ్మదిగా తాను ఆగిరి ప్రదక్షిణ చేస్తూ దాన్ని రుద్రమాల పరిక్రమ అంటారు. పడమటి వైపుకు వెళ్ళాడు. అక్కడ త్రిజుంగ్ అనే మంచు శిఖరం కన్పిస్తున్నది. దాని వైపు చూస్తూ ఉంటే వజ్రధారిణి అయిన ఒక మహాశక్తి దర్శనమిచ్చింది. వేల లక్షల కాంతి కిరణాలు ఆమె శరీరములోని వివిధ భాగాల నుండి కన్పిస్తున్నాయి. ఒక క్షణం కబంధము పై శిరస్సులేని 'ఛిన్నమస్త' గా మరొక్క క్షణం వరాహ ముఖం కల్గిన భయంకర దేవతగా గోచరిస్తున్నది. ముందుకు అడుగులు వేస్తూ ఆ మంచుని చీల్చుకుని ఆ కొండ లోపల ఒక గుహలోకి ప్రవేశించాడు. విచిత్రం ! అక్కడ అఖండ దీపం వెలుగుతున్నది. నిత్యమూ పూజ జరుగుతున్న చిహ్నాలు కన్పిస్తున్నవి. అక్కడి వాయుమండలంలో వజ్ర వైరోచని మంత్రం అలలు అలలుగా వినిపిస్తున్నది. టిబెట్ భాషలో కాసేపు, సంస్కృత భాషలో కాసేపు స్తోత్రాలు వినిపిస్తున్నవి.

'దోర్జె పాంగ్మో' అని, 'వజ్రవారాహి' అని 'వజ్రేశ్వరి' అని దేవతా నామం విన్పిస్తున్నది. అక్కడ తాను ధ్యానం చేస్తున్నాడు. నిరాహారుడై, నిశ్చలుడై, తాను చేసిన సాధన ఫలితంగా వజ్రిణి అయిన ఆ మహాశక్తి సాక్షాత్కరించింది. కాసేపటికి మళ్ళీ గుహ బయట ఉన్నాడు. ఇప్పుడు అక్కడ మంచుకొండ తప్ప గుహ మళ్ళీ కనపడడం లేదు. ఇందాక తాను కొండకు పరిక్రమ చేసి వచ్చాడు. ఇపుడు మళ్ళీ సూక్ష్మ శరీరంతో అంతర పరిక్రమ చేసినట్లు భువన మోహనమైన దృశ్యం ఆకాశ వేదికపై కనిపిస్తున్నది. వృద్ధులు, ప్రత్యేక బుద్ధులు ఆ ప్రాంతంలో కొన్ని వందల మంది కనిపిస్తున్నారు. జైనుల ఆదినాథ దేవుడు ఆయన అనుచరులైన జినమండలి అర్హతులు. దృగోచరమవుతున్నారు. ఎందరు బుద్ధులు ? ఎందరు జినులు ? ఎందరు ఇంద్రాది దేవతలు ? ఎందరు వ్యాసులు ? అనంతకాల ప్రవాహంలో కొట్టుకు పోతున్నారు.

**ప॥ వ్యాసులు బుద్ధులున్ జినులు వందలువేలు గతించినారు కా**
**లాసవపాన బిందు కళికాకృతులై ఒక రోజు కూడ నీ**
**మోసలలోన నిప్పటికి పూర్ణము కాదు మహాశ్మశానసం**
**వాసి ఒకందునున్ తిరిగి వచ్చిన పాపము తోడ పోవడున్.**

ఇంతలో కైలాస శిఖరం పై నుండి సూర్యరశ్మిచే పగుళ్ళు బారి పెద్ద పెద్ద మంచుగడ్డలు చప్పుడు చేస్తూ కింద పడుతున్నవి. ఆ చప్పుడుకు మెళకువ వచ్చింది.

**మళ్ళీ మరో కల :** కాశీ, పట్టణ వీధులలో ఆయన తిరుగుతున్నాడు. అన్నీ సుపరిచితమైనవిగా కన్పిస్తున్నాయి. దీర్ఘ స్థూల దేహుడైన త్రైలింగస్వామి తనతో అనుగ్రహపూర్వకంగా మాట్లాడుతున్నాడు. ఆయనతో ఏదో బలమైన అనుబంధం ఉన్నట్లనిపించింది. తాను వారణాసిలో అడుగుపెట్టకముందు సుమారు 20 సం॥ క్రిందనే, భౌతిక శరీరాన్ని విడిచిపెట్టిన ఆ స్వామి సిద్ధ దేహం.

అక్కడి వాయు మండలంలో సంచరిస్తూ సాధకులను అనుగ్రహిస్తున్నది. అలా సంచరిస్తూ సంచరిస్తూ విశ్వనాథుని ఆలయానికి వెళ్ళాడు. మహమ్మదీయుల చేత ధ్వంసం చేయబడి పునః ప్రతిష్ఠితమైన ఆ శివలింగాన్ని

చూచాడు. విశ్వనాథుని తాను ఇలా ప్రశ్నిస్తున్నాడు. స్వామీ ! త్రిశూలధారీ ! సర్వశక్తి స్వరూపా ! నీ ఆలయాన్ని ఇతర మతస్థులు వచ్చి నాశనం చేస్తుంటే నీవు ఏమి చేస్తున్నావు ? తనను తాను రక్షించుకోలేని దేవుడు భక్తులను ఏలా రక్షిస్తాడన్న సందేహం ప్రజలతో కల్గుతున్నది. ఈ దేశంలో ఎన్నో వందల దేవాలయాలు నాశనమైనవి. విగ్రహాలు ముక్కలు చేయబడినవి. నీవు ఏం చేస్తున్నావు ? ఒకసారి త్రిశూలాన్ని విసిరితే, ఒక క్షణం మూడవ కన్ను తెరిస్తే ఒక్కసారి క్రోధంతో 'హుం' కారం చేస్తే ప్రళయమే జరుగుతుందే. ఈ దుష్టులను ఎందుకు ఉపేక్షించావు ? నీ తత్వ మేమిటో మాకు అర్థం కావడం లేదు. విశ్వనాథ లింగము నందుండి దరహాస చంద్రికలు వెలువడినవి. భక్తుడా ! ఈ ప్రశ్నలు అనాదికాలం నుండి వస్తున్నవే. దైవ శక్తులను, అసుర శక్తులను సృష్టించేది నేనే, లయింపచేసేదీ నేనే. ఆది యుగముల నుండి యెందరు రాక్షసులు రాలేదు ? హరిణ్యాక్ష హిరణ్యకశిపులు, మహిష, శుంభ నిశుంభులు, వారు తపస్సు చేసి వరములు పొంది గర్వితులై లోకాలను బాధించినపుడు వారిని సంహరించడమూ జరగుతుంది. ఇక్కడ కొందరు ప్రశ్నిస్తుంటారు. వారిని సృష్టించడం దేనికి తపస్సు చేయనివ్వడం దేనికి ? వరములను ఇవ్వడం దేనికి ? ఏదో ఒక దశలో ఆపవచ్చు కదా ! అని. ఈ సమస్తమూ మా లీల. జీవులు కర్మానుగుణంగా నడుస్తుంటారు. తపస్సు చేసిన వారికి వరములను ఇవ్వక తప్పదు. వారు ఆ శక్తులను దుర్వినియోగం చేస్తే శిక్షించకుండా ఉండము. ఉదాహరణకు ఇక్కడి నా దేవాలయాన్ని ఇటీవల ధ్వంసం చేసిన ఔరంగజేబు. పూర్వజన్మలో నా భక్తుడే. ఇక్కడి నుండి రామేశ్వరము, అక్కడి నుండి ఇక్కడకు తిరిగి అభిషేకములు, పూజలు చేసినవాడే. కానీ ఆ జీవునిలో కామక్రోధములు పోలేదు. తపస్సు పెరిగినదే కాని అరిషడ్వర్గములు జయింపలేదు. వానికొక పరీక్ష పెట్టాను. ఒకరోజు నాకు అభిషేకం చేస్తుండగా అభిషేక పాత్ర వాని చేయి నుండి జారి నా లింగముపై బడినిది. నేను కోపించి అర్చన దోషం చేశావు. తత్ఫలితంగా మ్లేచ్ఛునిగా పుట్టు" అన్నాను. వానికీ కోపం వచ్చింది. 'అయ్యా! పరమశివా ! విశ్వనాథా ! చిన్నప్పటి నుండి ముసలితనం వచ్చినదాకా ఎన్నో ఏండ్ల నుండి నిన్ను సేవించాను. చిన్న తప్పుకు నన్ను శపించావు. నేనూ నిన్ను

శపిస్తున్నాను. "నేను మ్లేచ్ఛునిగా పుట్టి నీ దేవాలయాలను, లింగములను, విగ్రహములను నాశనం చేస్తాను." ఇదేనా ప్రతీకారం" అన్నాడు. వాడే మొగలువంశీయుడైన షాజహాను కుమారుడుఔరంగజేబుగా హిందూ దేవాలయాలను రాజ్యాలను, ప్రజలను నాశనం చేయడానికి ప్రయత్నించాడు. పూర్వజన్మలో భక్తుడు గదా అని వాని మీద సానుభూతి చూపించవలసిన పనిలేదు. కామక్రోధాలను జయించని తపస్వులు ఎలా పతనం చెందుతారో ఇటువంటి వారి జీవితాలే ఉదాహరణలు. వీడేమీ సర్వలోకములను నపుంసకము చేసిన భండాసురుని కంటే గొప్పవాడా ? వేల మంది స్త్రీలను చెరచిన రావణుని కంటే అధికుడా ? అయితే లోకంలో ఇటువంటి దేవాలయ ధ్వంసములు జరుగుతున్నపుడు మేమేమి చేస్తున్నామన్న సందేహము అజ్ఞానులకు కలుగుతూనే ఉంటుంది. దేవాలయాలను నిర్మించుకునేది మీరు. అంటే ప్రజలు. వారే వాటిని రక్షించుకోవాలి. మేమూ రక్షిస్తాము. మమ్మ పిలవగల్గినవాడు పిలిస్తే, ఆవాహన చేయగల్గినవాడు ఆవాహన చేస్తే, ఒక యోగి, ఒక తపస్వి అభ్యర్థిస్తే వారి కోసం ఏమైనా చేస్తాము. భక్తితో ప్రార్థిస్తే, తీవ్ర తపస్సు చేస్తే దేవతలు దిగి వస్తారు. పురాణాలలోని కథలను నేను ఏ కరువు పెట్టను. మొన్నటికి మొన్న మీ తెలుగుదేశంలో సింహాచల క్షేత్రం మీదికి మహమ్మదీయులు దండయాత్ర చేసినపుడు సింహాచల క్షేత్రాన్ని రక్షించమని గోగులపాటి కూర్మనాథయ్య అనే ఒక కవి సరస సారస్వత ఆవేశంతో ప్రార్థించాడు. వరాహ నరసింహుడు అనుగ్రహించాడు. లక్షల కోట్ల తుమ్మెదల దండు అడవిలో నుండి బయలుదేరి మహమ్మదీయ సైనికులను చీల్చి చెండాడితే కకావికలై పరిగెత్తి పోయారు. తపోనిధులయిన భక్తుల కోసం మేము అవతరిస్తుంటాము. కనుక ఈ విగ్రహం పోయిందనో ఆదేవాలయం ధ్వంసం అయిందనో నీవంటివాడు ఆలోచించవలసిన పనిలేదు. ఆలోచించవలసిన వారు ఆలోచిస్తారు. ప్రతిక్రియ చేయవలసిన వారు చేస్తారు. లౌకికమైన దుష్కార్యములకు భౌతికమైన విక్రియలు తప్పవు. హిందూ జాతి తన అస్తిత్వాన్ని నిలబెట్టుకోడానికి, ఆత్మగౌరవాన్ని కాపాడుకోడానికి చేయవలసిన పనులు చేయవలసినదే.

విశ్వనాథుని దివ్య సందేశ వాక్కులలో భారతజాతి యొక్క భవిష్యత్తు శుభసూచనలు గోచరిస్తున్నవి. శివచిదానందునకు జాగృతి కల్గినది.

మరునాడు ఉదయం విశుద్ధానందుల వారు కలిసినపుడు ఆయన చిరునవ్వుతో "ఆప్తుడా ! రాత్రి స్వప్నేశ్వరుడు దగ్గర చాలా విశేషాలు తెలుసుకున్నావు గదా ? ఇంకా ఎన్నో ఎన్నో అంశాలు ఎప్పటికప్పుడుల నీకు తెలుస్తూ ఉంటాయి. ఇంకా మనం విడిపోవలసిన సమయం వచ్చినది. దక్షిణాపథానికి వెళ్ళి నీ కర్తవ్యాన్ని నీవు నిర్వహిస్తున్న సమయంలో నిఖిలేశ్వరానంద ఈ భౌతిక శరీరాలు వదిలి పెట్టి వేరు జన్మ తీసుకోవడం జరుగుతుంది. అప్పుడు కూడ భౌమ భూమికలో మనం కలుసుకోవడం జరుగదు. 'ద్యు' భూమికలో మన మైత్రి కొనసాగుతుంది. సిద్ధాశ్రమ యోగులు ఆదేశాన్ని అనుసరించి, మన జీవన గమనాలు నిర్దేశింపబడుతవి. ఈ పాటికే నీకు చాలా వరకు అవగతమైనది. నీవు వెళ్ళే మార్గంలో ఎందరో బ్రహ్మజ్ఞానులు మంత్రవేత్తలు, యోగీశ్వరులు తటస్థిస్తారు. అచ్యుతానందుల వారు నిర్దేశించిన పథంలో ముందుకు సాగిపో. 'శివా స్తే పంథాన స్సంతు".

## టెంబే స్వామితో

కాశీ నుండి మహారాష్ట్రకు బయలుదేరాడు శివచిదానంద. త్రోవలో ఎన్నో దేవాలయాలు, పూజావిధానాలు, ఆయా ప్రాంత భేదాలను బట్టి అర్చన పద్ధతులు, ఎన్నెన్నో మార్పులు, చేర్పులు గమనించాడు. ఈ సందర్భంగా ధర్మసింధువు లోని ఒక శ్లోకం ఆయన అనుశీలనం చేశాడు.

**శ్లో॥ నాక్షతై రర్చయే ద్విష్ణుం, న తులస్యా గణాధిపం,**
**దూర్వాభి ర్నార్చయేత్ దుర్గాం, న కేతక్యా మహేశ్వరం.**

అర్చనలో ఎవరికి ఏదిష్టమో ఏదేవతకు ఏది ఇష్టము కాదు అనేది తెలుసుకుని పూజ చేయాలి అనే అంశము స్వామికి ఎంతో నచ్చింది. పై శ్లోకానికి ప్రసిద్ధ పండితుడు. 'కమలాకర భట్టు వ్రాసిన వ్యాఖ్యానాన్ని ఆయన గమనించాడు. అక్షతలతో విష్ణువుని పూజింపరాదు. సామాన్యంగా ఎక్కడైనా ఏ దేవతను పూజించేటప్పుడయినా కాసిని బియ్యం తీసుకుని పసుపో కుంకుమో కొంచెం కలిపి అక్షతలు తయారు చేసి పూజ ప్రారంభిస్తారు. విష్ణువును

అక్షతలతో ఎందుకు పూజ చేయరాదు? భట్టారకుడు దీనిని విశదీకరిస్తూ పూర్వం ఉత్తరభారతంలో యవధాన్యంతో చేసిన అక్షతలు ప్రయోగించేవారు. ఆ ధ్యానంలో రజోగుణం ఉంది గనుక సత్వ గుణప్రధానుడైన విష్ణుమూర్తిని యవాక్షతలతో పూజించరాదు. "యవాక్షత విషయే నిషేధః న తండు విషయే". విష్ణుపూజకు బియ్యంతో చేసిన అక్షతలతో నిషేధం లేదని దీని వలన తెలిసింది. అలానే వినాయకుని తులసిదళాలతో పూజించరాదు. ఒక్క వినాయకచవితి రోజు అన్ని రకాల పత్రములతో పూజించడం జరుగుతుంది గనుక ఆ ఒక్కరోజు ఫర్వాలేదు గాని మిగిలిన రోజులలో గణపతి సాధన చేసేవారు తులసిమాలతో జపము చేయరాదు. తులసిదళములతో పూజించరాదు. ఎందుకంటే తులసిలో సత్వగుణం ప్రధానమైనది. విఘ్నములు తొలగించి కార్యసిద్ధిని కల్గించవలసిన గణపతికి తులసిని ఉపయోగిస్తే సత్వగుణం ఆపాదించబడి శాంతంగా ఉండిపోతాడు. ఆయుధ ధారణ చేసి విఘ్నములను ఛేదించవలెనన్న రాజస ప్రవృత్తి కలుగదు. అలానే మిగతా దేవతల విషయంలో కూడ ఆ యా లక్షణాలను గమనించవలసి ఉంటుంది. భైరవుని మల్లెపూలతో పూజించరాదని చెప్పబడింది. శ్మశాన వాసి రక్తమాంసప్రియుడైన భైరవుడు మల్లెలతో, జాజిపూలతో సంతృప్తి పడతాడు. రక్తాన్నములు, మాంసాది బలులు నివేదిస్తే తృప్తి పడి కార్యసిద్ధిని కల్గిస్తాడు. ఈ విధంగా దేవతల ఇష్టాలను గూడా సాధకుడు తెలుసుకోవాలి.

**శ్లో॥ అలంకార ప్రియోవిష్ణః అభిషేక ప్రియశ్శివః**
**నమస్కార ప్రియస్సూర్యః దుర్గాదేవ్యర్చన ప్రియా.**
**దీప ప్రియః కార్యవీర్యః దత్త సుస్మరణ ప్రియః**

తులసి మాలలతో రత్నాభరణాలతో అలంకరిస్తే విష్ణుమూర్తి ఆనందిస్తాడు. హరహర మహాదేవ అంటూ నమక చమకాలతో అభిషేకం చేస్తే శంకరుడు పొంగిపోతాడు. మంత్రపూర్వకంగా నమస్కారాలు చేస్తే సూర్యుడు అనుగ్రహిస్తాడు. వివిధ వస్తువులతో నైవేద్యములతో అర్చన చేస్తే పరమేశ్వరి సంతోషపడుతుంది. దీపం వెలిగించి 'కార్తవీర్యార్జున' అని మూడుసార్లు స్మరిస్తే ఆ యింటికి చోరాదిబాధలుండవు. ఆశ్రితవత్సలుడైన దత్తస్వామి స్మరిస్తే చాలు. భక్తానుగ్రహ కాతరుడై వస్తాడు. ఆ యా

విషయాలను గమనిస్తూ సంప్రదాయదైవతమైన దత్తాత్రేయ స్వామిని భావిస్తూ శివచిదానందులు మహారాష్ట్రలో వాసుదేవానంద సరస్వతి స్వామి ఆశ్రమానికి చేరాడు. అచ్యుతానందస్వామి శిష్యుడు అనిరుద్ధానంద, అనిరుద్ధానంద శిష్యుడు నారాయణానంద, నారాయణా నంద శిష్యుడే వాసుదేవానంద. ఈయనను జనమంతా 'టెంబెస్వామి' అంటారు. గొప్ప మంత్రవేత్తగా దత్తభక్తునిగా ఆయన ప్రఖ్యాతి పొందారు. దత్తస్వామి ఆయనతో రోజూ మాట్లాడేవాడు, ఆయనతో ఉండేవాడు. ఆయన పెట్టే నైవేద్యం స్వయంగా స్వీకరించేవాడు. చేసిన పదార్థాలలో ఏదైనా పొరపాటు జరిగితే నెయ్యి మర్చిపోతే, పాలో పంచదారో తక్కువయితే పదార్థం సరిగ్గా ఉడక్కపోతే వెంటనేచెప్పి మందలించేవాడు. అలా దత్తస్వామి నిత్యానుగ్రహపాత్రుడై టెంబేస్వామి వేలాదిజనులకు ఆది వ్యాధులను కుదిర్చేవాడు. వివిధ మంత్రసాధనలు భక్తుల చేత చేయించేవాడు. దేవతా యంత్రములు రక్షరేకులుగా తయారుచేసి ఇచ్చేవాడు. ఆర్తులకు ఎటువంటి ఆపదవచ్చినా ఆదుకునేవాడు. తన పరమేష్ఠి గురువు శిష్యుడైన శివచిదానంద సరస్వతి స్వామిని ఆయన ఎంతో అభిమాన ఆదరాలతో స్వాగతించాడు. శివచిదానంద స్వామి వాసుదేవానందుల వారి సన్నిధిలో కొంతకాలంగడిపి ఆయన విద్యావిధానాలను అవగతం చేసుకున్నాడు.

లోకంలో సాధకులు ఉపాసకులు ఎందరో ఉన్నారు. తమ యోగశక్తితో మంత్రశక్తితో ఉపకారములు అపకారములు చేయగల్గిన వారున్నారు. కానీ దేవతతో నిత్యసాన్నిహిత్యము కల్గి పిలిస్తే పలికిన స్థితిని సాధించిన వారు అరుదు. కాశీలో శ్యామాచరణలాహిరి అనే ఒక యోగి చిరకాల జీవి. మహాయోగీశ్వరుడైన మహావతార్ బాబాతో ఆయన సాన్నిహిత్యం గూర్చి ఎన్నో కథలు విన్నాడు. అలానే బెంగాల్‌లో రామప్రసాద్ అనే తీవ్రసాధకుని ఇంట కాళీదేవి బాలికవలె సంచరించేదని చేదోడు వాదోడుగా పనులలో సాయపడేదని విన్నాడు. అలానే కలకత్తా వాసి అయిన రామకృష్ణ పరమహంస కాళీదేవితో రోజూ మాట్లాడగల్గిన స్వయంగా నైవేద్యం పెట్టగల్గిన దివ్యానుగ్రహమును సాధించిన అంశాలు వింటూనే ఉన్నాడు. టెంబెస్వామి గూడ ఆ విధంగా దత్తాత్రేయుని అనుగ్రహమును సంపాదించి ఆ సిద్ధేశ్వరుని

కృపకు పాత్రుడైనవాడు. తమ సంప్రదాయమూ అదే ఆ దత్తస్వామి అనుగ్రహము వల్ల తానెన్నో పనులు భవిష్యత్‌లో చేయవలసి ఉన్నట్లు గోచరిస్తున్నది. భవిష్యత్‌లో తాను నివసించే చోటు దత్తాత్రేయమఠమై ప్రకాశిస్తుంది.

## కాశ్మీరు సభ

శాస్త్ర ప్రాభవ మండితులైన ఉద్దండ పండితులు చేరిన సభ అది. అక్కడి వారిలో సంస్కృత, ప్రాకృత, శౌరసేనీ ముఖ్య భాషా పరిజ్ఞాన పాటవము కల్గిన వారున్నారు. పన్నగపతి సార్వభౌమభాషిత మహా భాష్య విద్యా సమభ్యాస బలము గలవారున్నారు, అక్షపాద కణాద పక్షిలోదీరిత, న్యాయకళా కౌశలాతిశయము గలవారున్నారు, శృతి పురాణాగమస్మృతి సాంఖ్య సిద్ధాంత కబళన వ్యుత్పత్తి గౌరవము గలవారున్నారు, అపర శ్రీనాధులున్నారు. వ్యాస, పరాశర, గౌతమ ప్రజ్ఞా ప్రభావ భావుకులున్నారు. తన దేశ సంచారంలో భాగంగా శివచిదానంద సరస్వతీ స్వామి అక్కడికి వెళ్ళి ఆ సభలో కూర్చున్నారు. విద్యద్గోష్ఠి జరుగుతున్నది, శాస్త్ర చర్చ మొదలైంది. అది చివరకు తర్క కర్కశ వేదాంత చర్చలోకి మారింది. అద్వైత, ద్వైత, విశిష్టాద్వైత మత విషయాలు ఉల్లోల కల్లోలంగా విద్వాంసుల మధ్య తారస్థాయిలో సంఘర్షణ మొదలైంది. శైవ వైష్ణవ శాక్తేయ గాణాపత్య సౌర మతవాదముల ఝంఝా మారుతము సదస్సును ఊపివేసింది. చివరికది శైవ, వైష్ణవ వివాదముగా పరిణమించింది. ఎవరికి వారు వేద ప్రమాణాలను, ఉపనిషద్వాక్యాలను చూపిస్తూ వాదిస్తున్నారు. అది ఎప్పటికీ ఆగేటట్లు లేదు. అది చివరకు దూషణ విద్వేషణ స్థాయిలోకి వచ్చింది.

అప్పుడు లేచి నుంచున్నాడు శివచిదానందసరస్వతి. ఈ కాషాయ వస్త్ర ధారియైన సన్యాసి ఎవరు ? ఎక్కడ నుండి వచ్చాడు ? వయోజ్ఞాన వృద్ధులైన పండితుల ముందు ఈ యువ సన్యాసి ఏమి పల్కబోతున్నాడు ? అందరూ ఉత్సుకతతో చూశారు. స్నిగ్ధ గంభీర కంఠంతో స్వామి ప్రసంగించడం మొదలు పెట్టారు.

"ఆర్యులారా ! మీరందరూ గొప్పవిద్వాంసులు. ఎటువంటి సందేహము

లేదు. కానీ ఈ వాద సంఘర్షణలు పరస్పర కలహాలు చూస్తుంటే చాలా బాధ, ఆవేదన కల్గుతున్నవి. అందరూ వేద ప్రామాణ్యంతోనే మాట్లాడారు. అందరూ ఉపనిషద్వాక్యాలనే ఉదాహరించారు. బ్రహ్మ సూత్రములను వివిధ మతాచార్యుల భాష్య వాక్యములను పరంపరగా సృష్టించారు. వాదములలో గెలుపు ఓటములు సంభవించవచ్చు గానీ సత్యము నిర్ధారితమవుతుందా? ఇందులో ఎవరు ఎక్కువ ప్రజ్ఞావంతుడైతే, ఎవరు ఎక్కువ వాదనిపుణుడైతే ఆ వ్యక్తి గెలుస్తాడు. భారత దేశ గమనంలో ఎన్ని పండిత పరిషత్‌లు జరిగినవి. ఎన్నివాద సభలు జరిగినవి. కొన్నిసార్లు వారు, కొన్ని సార్లు వీరు గెలిచారు. కొన్నిసార్లు బౌద్ధులు గెలిచిన సందర్భాలూ మీకు తెలుసు. కొన్ని పర్యాయములు జైన పండితులలు గెలిచిన సందర్భాలూ ఉన్నవి. శ్రీహర్ష చక్రవర్తి పరిపాలిస్తున్నపుడు "హ్యూయాన్ సాంగ్" అనే బౌద్ధ పండితుడు వస్తే మహారాజులు పెద్ద సభ ఏర్పాటు చేసి అన్నిమతముల వారిని ఆహ్వానించాడు. సర్వమత మహా సభ ఏర్పాటు చేశాడు. ఆ చైనా బౌద్ధుడు ఒట్టి పండితుడు మాత్రమే కాక, గొప్ప యోగి అని, మంత్రవేత్త యని ప్రచారము జరిగినది. రాజు శ్రీ హర్షుడు తీవ్ర బౌద్ధమత అనుయాయి. ఆ ప్రపంచమత మహాసభలో "హ్యూయాన్‌సాంగ్" ఈ సమస్త లోకంలో బౌద్ధ మతమే అన్నింటి కంటే గొప్పదని తన వాదము వినిపిస్తూ ఉద్ఘోషిస్తే ఎదిరించి పలికిన పండితుడే లేడు. అప్పటి అక్కడి వాతావరణము అటువంటిది. ఇవ్వాళ ఇక్కడ మహాపండితులు మామూలు స్థాయికి దిగజారి కొట్లాడు కుంటున్నారు. మీకు తెలుసునా ? ఒకప్పుడు ఈ దేశంలో ఇంద్రమతము, చాలా ప్రబలంగా ఉండేది. చారిత్రకంగా శైవ, వైష్ణవ మతముల కంటే అది ముందుదని వేదవిదులంటారు. ఋగ్వేదంలో ఇంద్రునే సర్వేశ్వరునిగా వర్ణించిన ఋక్కుల సంఖ్య, ఇతర దేవతా ఋక్కుల కంటే ఎక్కువ. "దేవతమ" అన్న శబ్దం ఒక్క ఇంద్రునకే ఉపయోగించబడింది. కశ్యపుని భార్య అయిన కద్రువ సూర్యతపతప్తులై మరణించిన తన నాగకుమారులను బ్రతికించుకోటానికి బ్రహ్మనో, శివునో, విష్ణువునో కాక ఇంద్రునే ప్రార్థించడం గమనార్హం. అంత దాకా ఎందుకు ఉపనయనములో గాయత్రీ మంత్రాన్ని ఉపదేశిస్తారు. ఈ గాయత్రీ మంత్రానికి విశ్వామిత్రుడు ఋషి. "ఒక ఋషి అంటే ఆ మంత్రాన్ని

మొదటి సారి మానవలోకంలో విన్నవాడు" అని అర్థము. మంత్రములు శాశ్వతములు, సనాతనములు. అవి దివ్యభూమికలలో ఉంటవి. భౌమ భూమికలో మొదటిసారి దానిని విన్నవాడు ఆ మంత్రమునకు ఋషి, అనగా ఆ మంత్రము భూలోకములో అంతకుముందు లేదని అర్థము. విశ్వామిత్రుడు గాయత్రీ మంత్రమునకు ఋషి. కనుక ఆయనకు ముందు మానవలోకములో ఆ మంత్రము లేదు. మరి ఆయన తండ్రికి ఉపనయనము అయినదా లేదా ? ఇంకా ఎందరో ద్విజులు ఉన్నారు కదా ? వారి సంగతి ఏమిటి? అంటే అంతకు ముందు ఇంద్ర గాయత్రిని ఉపనయనములలో ఉపదేశించేవారు. అది ఋగ్వేద ప్రోక్తమంత్రము. ఈ విధముగా ఇంద్రుని సర్వాధిక్యము ఒకప్పుడు అత్యధికంగా ఉండేది. వేద వాఙ్మయంలో, భారతంలో ఆదిపర్వములో ఇంద్రుని మహత్వము మనకు కన్పిస్తుంది. వ్యాసుని తల్లి సత్యవతి. సత్యవతి తండ్రి వసుమహారాజు. ఆ మహారాజుకు ఇంద్రుడు ఒక విమానాన్ని ఇచ్చాడు. ఆ రోజుల్లో ఇంకెవరికీ అటువంటి విమానం లేదు. అందుకే ఆయనను "ఉపరిచర వసువు" అన్నారు. ఆ వసుమహారాజు ఇంద్రోత్సవాలు చేయించేవాడు. ఈ విధంగా ఇంద్ర పరాక్రమ గాథలు ఎన్నో ఉన్నవి. ద్వాపరాంతములో కృష్ణావతారము వచ్చిన తరువాత కృష్ణుడు ఇంద్రయాగాన్ని ఆపించడం మొదలైన తరువాత కృష్ణవాసుదేవమతము విజృంభించి ఇంద్రమత ప్రాభవాన్ని అరికట్టింది.

ఆ విధంగానే ఒకప్పుడు బ్రహ్మమతము కూడా విస్తరిల్లి ఉండేది. బ్రహ్మనే ఏకైక దేవునిగా భావించేవారు. ఆయనకే ఉత్సవాలు చేసేవారు. ఆయన గుళ్ళల్లో జరిపే ఉత్సవాలకు "బ్రహ్మోత్సవాలని" పేరు. ఇవ్వాళ ఎన్ని దేవతల ఆలయాలు వచ్చిన స్థాపన దినోత్సవాలకు ఆ బ్రహ్మోత్సవాలన్న పేరే మిగిలి ఉన్నది. అలానే ఈ సృష్టి సమస్తము వివిధ గోళములతో, నక్షత్రములతో కూడి బ్రహ్మాండమని పిలువబడుతున్నది. శివాండమనో, విష్ణ్వండమనో అనడం లేదు. అలానే ఋషులలో బ్రహ్మర్షి, అస్త్రములలో బ్రహ్మాస్త్రము సర్వాధికములు. ఈ విధంగా చెబుతూ పోతే ఎంతైనా చెప్పవచ్చు. దేవతల యొక్క ప్రభావం కూడా కాలానుభవంలో ఎన్ని మార్పులు చెందుతున్నదో గమనిస్తే ఈ వాద ప్రతివాదముల అవసరం లేదన్న అంశాన్ని మీరే గుర్తించగల్గుతారు. మీరు

చూస్తూ ఉండండి. క్రొత్త క్రొత్త దేవుళ్ళు ఎందరో వస్తారు. ప్రజలలో చాలా మంది ఈ పాతదేవుళ్ళను మానివేసి ఆ క్రొత్త వాళ్ళను కొలవడం మొదలు పెడతారు. అప్పుడు ఈ శైవమూలేదు, వైష్ణవమూ లేదు. కాలగమనంలో ఎన్నో వింతలు రాబోతున్నవి. మీ అందరికీ తెలిసినది వేదప్రోక్తమైన అంశము ఒకటి గుర్తు చేస్తున్నాను –"ఏకం సత్ విప్రా బహుధా వదంతి". ఉన్న సత్పదార్థము ఒక్కటే. విప్రులు బహువిధముల దర్శించి పల్కారు. పుష్పదంతుడనే గంధర్వుడు శివ మహిమ్న స్తోత్రంలో చెప్పిన ఒక శ్లోకాన్ని గమనించండి.

**శ్లో॥ త్రయీ సాంఖ్యం యోగం పశుపతి మతం వైష్ణవమితి**
**ప్రభిన్నే ప్రస్థానే పథమిదమదః పథ్య మితిచ**
**రుచీనాం వైచిత్ర్యాత్ ఋజుకుటిల నానా పథజుషాం**
**నృణాం ఏకో గమ్యస్త్వమసి పయసాం అర్ణవ ఇవ.**

వేదం, సాంఖ్యం, యోగం, శైవం, వైష్ణవం మొదలైనవి ఎన్నో మతాలున్నవి. అభిరుచులను బట్టి జనులు వాటిని అనుసరిస్తున్నారు. కానీ సర్వనదులు సముద్రంలోనికే వెళ్ళినట్లుగా పరమేశ్వరా ! అన్ని మతములకు నీవే గమ్యస్థానము. ఈ సత్యాన్ని గ్రహించండి. మేమెక్కువ, మేమెక్కువ, మాదే సత్యము, మాదే సత్యమని పందెపు కోళ్ళవలె, పొట్టేళ్ళవలె పోట్లాడుకోకండి". ఈ విధంగా సాగింది ఆయన వాక్ ధోరణి. ఆయన ఉపన్యాసములు కాగానే సదస్సులోని సభ్యులు కరతాళ ధ్వనులు చేశారు. ఆ పూటకు సభ ముగిసినట్లు సభాపతి ప్రకటించాడు.

తరువాత పండిత వర్గాలు తమలో తాము కూడ బలుక్కొని ఈ యువ సన్యాసి మనమంటే లెక్క లేకుండా మాట్లాడాడు. మనలను నీచ జంతువులతో పోల్చాడు. ఈ అహంకార పూరితునకు మనం గుణపాఠం చెప్పాలి. అయితే ఇతని వాగ్ధాటి ముందు ప్రజలు మనలను మెచ్చరు. మనం నిలువలేము. అంతేకాక ఇతడు పెద్ద మంత్రవేత్తవలె ఉన్నాడు. అటువంటి వారితో సూటిగా పోటీపడుట మంచిది కాదు. కనుక ఇతని ఉద్ధతిని ఆపటానికి మనం వేరే మార్గము అనుసరిద్దాం. అప్పుడు కొందరు ఈ విధంగా సలహా ఇచ్చారు.

"ఇతనిని గూర్చి మేము విచారణ చేశాము. ఇతడు తెలుగుదేశం నుండి వచ్చిన తీవ్రసాధకుడు, తపః సంపన్నుడు. కొన్ని సిద్ధశక్తులు సాధించిన వాడని తెలుస్తున్నది. ఇతని గురువు అచ్యుతానంద స్వామి. మనకు ఆయన బాగా పరిచితుడు. ఆయన దగ్గరకు మన మందరమూ కట్టుగా వెళ్ళి దోషారోపణ చేసి ఇతనిని శిక్షింప చేద్దాము.

ఆ విధంగానే ఆ పండిత మండలిలోని పెద్దలు కొందరు కలిసి అచ్యుతానంద స్వామి దగ్గరకు వెళ్ళి శివ చిదానందస్వామిని గూర్చి ఉన్నవీ, లేనివీ కల్పించి చెప్పి పండిత పరిషత్‌లో మీ శిష్యుడు వయస్సులో పెద్ద అన్న గౌరవము కూడా లేకుండా మమ్మ తూలనాడాడు. నీచోపమానాలతో మమ్మ అవమానించాడు. దీనికి మీరు తగిన చర్య తీసుకోవాలి" అని విన్నవించు కున్నారు.

స్వామి అచ్యుతానంద సరస్వతి శిష్యునకు కబురు పంపించారు. వెంటనే బయలుదేరి వచ్చిన శివ చిదానందునితో గురువు గారు ఇలా అన్నారు - "శివా! ఇటీవలి విద్వత్ - సదస్సులో జరిగిన సంఘటనలు నా దృష్టికి వచ్చినవి. నీ వాద ధాటికి తట్టుకోలేని పండితులు నీ మీద ఏవేవో నాకు చెప్పారు. వాటికేమి? వాటిని నేను అంతగా పరిగణనలోనికి తీసుకొనడం లేదు. అయితే నేను నీ భవిష్యత్తును చూస్తున్నాను. ఈ శాస్త్ర వాదములతో ఈ పండిత చర్చలతో కాలక్షేపం చేయవలసిన పని నీది కాదు. నిన్ను చూస్తుంటే కరాళవదనుడైన నరసింహుడు కన్పిస్తున్నాడు. నీవు ఇటీవల నృసింహోపాసన తీవ్రంగా చేశావు. నీ చూపులో, వాక్కులో భీషణ తీక్షణ శక్తి ప్రసరిస్తున్నది. నిన్ను ఎవరైనా దూషిస్తే, ద్వేషిస్తే ఆ నరసింహుడు ఉపేక్షింపడు. వారికి ఏదో ప్రమాదము జరుగుతుంది. నీవు కోరనక్కరలేదు. నీవు సంకల్పించనక్కర లేదు. నీవు ఎవరికీ అపకారం చేయగోరవు. నాకు తెలుసు. కానీ తమ భక్తులకు కష్టం కల్గితే దేవతలు సహించరు. కాబట్టి శివా ! నీవు ఈ వాదముల జోలికి పోవడం మానుకుంటే మంచిది. మౌనంలో ఉన్న శక్తి అనంతమైనది. నీకు తెలుసుకదా" శివచిదానందస్వామి వెంటనే ఒక్కక్షణం కన్నులు మూసుకొని గురువు గారి పాదములకు నమస్కరించి కళ్ళు తెరిచి ఇలా అన్నాడు. "గురుదేవా ! మీ సంకల్పము నాకు అవగతమైనది. మీ

హృదయం నేను అర్థము చేసుకున్నాను. ఈనాటి నుండి నేను వాదములలో, చర్చలలో పాల్గొనటము మాత్రమే కాదు, అసలు మాట్లాడటమే మాని వేస్తాను. మౌనినై మానవ సేవ చేస్తాను. మీ దివ్యానుగ్రహ ప్రాప్తమైన శక్తితో ఆధ్యాత్మిక చైతన్యాన్ని ప్రజల హృదయాలలో నిక్షిప్తం చేస్తాను నన్ను ఆశీర్వదించి పంపండి" అచ్యుతానంద స్వామి కరుణార్ద్రమైన దృక్కులతో శిష్యుని శిరస్సుపై చేయి ఉంచి ఆశీర్వదించాడు. శివచిదానందస్వామి అభ్యర్థనకు, నిర్ణయానికి ఆయన ఔననులేదు, కాదనులేదు. విస్ఫారిత నేత్రములతో– అవలోకతేశ్వరుని వలె శిష్యుని చూస్తూ ఉండిపోయినాడు.

## అరుణాచల యోగులు

ప్రయాణం దక్షిణ ముఖంగా సాగుతున్నది. 'అరుణాచలం' సిద్ధ క్షేత్రమని అక్కడకొంతకాలం తపస్సు చేస్తే బాగుంటుందని మౌనస్వామి వెడుతున్నాడు. రైలులో తోటి ప్రయాణీకులలో కొందరు అక్కడి విశేషాలను ముచ్చటించుకోవడం గమనిస్తున్నాడు స్వామి. అప్పటికే ఆ ప్రాంతంలో రమణమహర్షిని గురించి ప్రసిద్ధి వచ్చింది.

**ఒకటవ ప్రయాణికుడు :** తిరువణ్ణామలైలో రమణమహర్షి అని ఒక గొప్పయోగి ఉన్నాడట గదా!

**రెండవ ప్రయాణికుడు :** అవును. తిరుచ్చుళి అనే క్షేత్రంలో పుట్టిన వెంకట్రామన్ అనే బాలుడు మధురలో చదువుకుంటూ వైరాగ్యం కల్గి దివ్య ప్రేరణవల్ల అరుణాచలం వచ్చి తపస్సు చేశాడు. ఆహార నిద్రాదులను లెక్కచేయకుండా మౌనంగా కఠోర తపస్సు చేసి బ్రహ్మానుభవాన్ని పొంది అవతార పురుషుడని కీర్తించబడినాడు.

**ఒకటవ ప్రయాణికుడు :** అవతారమా? ఎవరి అవతారము.

రెండవ ప్రయాణికుడు : ఆంధ్రదేశం నుండి కావ్య కంఠగణపతి ముని అనే గొప్ప తపస్వి అక్కడకు వచ్చాడు. ఆయన గొప్ప విద్వాంసుడు, అనేక దివ్య క్షేత్రాలలో సాధన చేసినవాడు. కఠోర తపస్సు చేస్తున్న ఈ బాలుని చూచి తన దివ్యజ్ఞానంతో ఇతడు సామాన్యుడు కాదని సాక్షాత్ కుమారస్వామియే ఇలా అవతరించాడని చెప్పాడు.

**ఒకటవ ప్రయాణికుడు :** కుమారస్వామి అవతరించడమా? విష్ణుమూర్తి దశావతారము లెత్తినాడని విన్నానుగాని ఇతర దేవతలుగూడ అవతారములెత్తు తారని వినలేదే.

**రెండవ ప్రయాణికుడు :** పెద్దదేవత లెవరైనా అవతరించవచ్చు. వాటిలో కొన్ని పూర్ణావతారాలు కొన్ని అంశావతారాలు, కొన్ని కళావతారాలు. దివ్యలోకంలో ఆ దేవత పూర్తిగా దిగివస్తే అది పూర్ణావతారము. ఆ మహాదేవత అక్కడ ఉంటూనే తమ తేజస్సును కొంతపంపిస్తే అది అంశగాని, కళ గాని అవుతుంది. ఇక్కడ కుమారస్వామి తన దివ్యలోకంలో ఉంటూనే ఆయన తేజస్సు కొంత ఇక్కడ అవతరించిందన్నమాట.

**ఒకటవ ప్రయాణికుడు :** ఇంతకుముందెప్పుడైనా సుబ్రహ్మణ్యుడు అవతరించాడా?

**రెండవ ప్రయాణికుడు :** గణపతిముని చెప్పారు. జగద్గురువు శంకరాచార్యులకు కొంచెం ముందు బౌద్ధులను జయించి వేదధర్మాన్ని స్థాపించడంకోసం 'కుమారిలభట్టు' అన్న పేరుతో ఉదయించాడని, మరొకసారి జైనులచే వేద ధర్మం వ్యాకులితమైన వేళ ద్రవిడ దేశంలో జ్ఞానసంబంధర్ అన్న పేరుతో పుట్టి శివభక్తిని ప్రబోధించాడని, ఇది శరవణభవుని మూడవ జన్మ అని బ్రహ్మ జ్ఞానముయొక్క స్వరూపము ఏ రకంగా ఉంటుందో చూపించడానికే ఈ అవతారం వచ్చిందని వారు తెలియచేశారు.

**ఒకటవ ప్రయాణికుడు :** ఆయన అసలుపేరు వెంకట్రామన్ అన్నావుకదా! రమణమహర్షి అన్న పేరు ఎలా వచ్చింది?

**రెండవ ప్రయాణికుడు :** గణపతిమునియే ఈ పేరు పెట్టాడని ఈ బాలస్వామి సాక్షాత్ భగవంతుడని ఈయనను ఈనాటి నుండి 'భగవాన్ రమణమహర్షి' అని పిలవాలని ఆయన అన్నారు. ఆనాటి నుండి అదే ప్రచారంలోకి వచ్చింది. ఇప్పుడిప్పుడే ఆయన పేరు దేశమంతా వ్యాపిస్తున్నది. ఎందరో వస్తున్నారు. ఆయన చేత ప్రభావితులై సంశయ నివృత్తి చేసుకుంటున్నారు.

ఈ సంభాషణలను వింటున్న మౌనస్వామికి తిరువణ్ణామలైలో తానెక్కడకుపోవాలో అర్థం అయింది. రైలుదిగిన తరువాత కొండమీద రమణ

ఆశ్రమానికి చేరాడు మరణమహర్షితో సాన్నిహిత్యమూ పెరిగింది. అక్కడే దగ్గరలో ఉన్న పాతాళ గుహలో కొన్నాళ్ళుండి తపస్సు చేశాడు ఊళ్ళోనూ పరిచయాలు ఏర్పడినవి. తన దగ్గర ఉన్న కొబ్బరి చిప్పతో చేసిన కమండలం రమణమహర్షికి ఇస్తే ఆయన ఎంతో సంతోషంతో స్వీకరించి ఉపయోగించడం మొదలు పెట్టాడు.

తిరువణ్ణామలైలో మరొక మహాపురుషునితో పరిచయమైంది. ఆయనపేరు శేషాద్రిస్వామి. ఆయన ఎక్కడ ఉంటాడో, ఎక్కడి విశ్రాంతి తీసుకుంటాడో, ఎక్కడ శయనిస్తాడో? ఇల్లు లేదు, ఆశ్రమం లేదు, చెట్టు క్రిందనో శ్మశానంలోనో కొండపై బండరాయి మీదనో – ఎక్కడో ఆయన వసతి! ఆయనకు పేరులేదు. కీర్తిలేదు, ధనములేదు. కాని మహాసిద్ధశక్తులు ఆయన పాద దాసీజనులని మౌనస్వామి గ్రహించాడు. మౌనస్వామిలోని దివ్య ప్రభావాన్ని శేషాద్రిస్వామి గ్రహించాడు. ఈ లోకం విచిత్రమైనది. విరాగులు, అవధూతలు, కాంతాకనకాది వ్యామోహములకు అతీతులు. ఆ వ్యామోహమును జయించినవారు కూడ కొందరు కీర్తి అనే వ్యామోహానికి లొంగిపోతారు. శేషాద్రిస్వామి దానికి కూడా అతీతుడు. వారిద్దరూ కలసి కూర్చుని అపుడపుడు కొంతకాలం గడిపేవారు. ఏమి మాట్లాడుకునేవారో లేక మాటలకు అతీతమైన మౌనంతోనే పరస్పరం అవగాహన చేసికొనేవారో ఎవరికీ తెలియదు. ఒక రోజు శేషాద్రిస్వామి ఆదరాతిశయంతో చేతులు చాచి మౌనస్వామిని కౌగలించుకొనపోయినాడు. ఇంతలోనే ఆగి మనము సన్యాసులము, విరాగులము, మనకు అభిమానాలు, బంధాలు పెరగకూడదు. అంటూ చేతులు వెనుకకు తీసుకున్నాడు. భౌతికంగా నిగ్రహం చూపించాడె కాని మానసికమైన అనుబంధం ఎక్కడికిపోతుంది! కాశీలోని విశుద్ధానందస్వామి తరువాత అంతటి సిద్ధ పురుషుడు శేషాద్రిస్వామి అని గుర్తించాడు మౌనస్వామి. అరుణగిరి వాసం కొన్నాళ్ళు గడచిన తరువాత ఇంకా దక్షిణదిశకు వెళ్ళాలన్నా పిలుపు అంతరంగంలో వినిపించడం మొదలు పెట్టింది. మళ్ళీ జీవిత రథయాత్ర కొనసాగుతున్నది.

## త్రికూటాచల క్షేత్రము

చిన్నతనంలో స్వగ్రామంలో ఉన్నపుడు కోటప్పకొండ తిరునాళ్ళకు వెళ్ళేవాడు. శివరాత్రికి ఆ కొండమీద పెద్ద ఉత్సవాలు జరిగేవి. ఎన్నో ఊళ్ళ నుండి ప్రభలు కట్టుకొని వేలాది జనం అక్కడకు చేరేవారు. అక్కడి శివునకు 'కోటేశ్వరస్వామి' అని పేరు. మూడు కొండలు ఒక కూటమిగా ఉండటం వల్ల దానికి త్రికూటపర్వతం అని పేరు వచ్చింది. ఈ త్రికూటేశ్వరుడు 'దక్షిణామూర్తి'. సతీవియోగం చేత బాధపడుతూ తపస్సు చేస్తున్న యోగీశ్వరుడు ఇక్కడి కొండపై కూర్చుండి దివ్యజ్ఞానాన్ని అందిస్తున్నాడు.

శ్లో॥ "వటవృక్షతరో ర్మూలే వృద్ధశిష్యా గురుర్యువా
గురోస్తు మౌనం వ్యాఖ్యానం శిష్యాస్తు ఛిన్నసంశయాః"

మఱ్ఱిచెట్టు మొదట శివుడు జ్ఞానముద్రతో ఆసీనుడయి ఉన్నాడు. ఆయన యెదురుగా వృద్ధులయిన మహర్షులు శిష్యులయి కూర్చున్నారు. వారి మనసులలో ఎన్నో సందేహాలు. శివుని చూస్తూ ఉండగానే ఆ మహాగురుని నుండి వస్తున్న తేజఃప్రసారము వల్ల ఆయన మాట్లాడకుండానే నోటితో సమాధానం చెప్పకుండానే తమ సందేహాలు తీరిపోతున్నవి. జగద్గురువైన పరమశివుని మౌనం అంతటి శక్తిమంతమయినది.

తానూ తన జీవితంలో మౌన మార్గాన్నే ఎంచుకొన్నాడు. ఇప్పటికే తనను అందరూ 'మౌనస్వామి' అంటున్నారు. శుద్ధస్ఫటిక సంకాశమైన 'దక్షిణామూర్తి' దివ్యజ్ఞాన ప్రసారశక్తి తన నావహించాలి. హిమాలయాలలో ఆ పరమశివుడు తపస్సు చేసిన ప్రదేశంలో కొంతకాలం తాను తపస్సు చేశాడు. అక్కడే ఉండాలని శివత్వం తాను సాధించాలని భావించాడు. కానీ గురువు ఆజ్ఞ అనుల్లంఘనీయము. ఆజ్ఞను అతిక్రమిస్తే ఫలితములు చాలా దారుణంగా ఉంటవని మిత్రుడు 'విశుద్ధానంద' ఒక ప్రత్యక్ష ఉదాహరణ యిచ్చాడు. హిమాలయాలలోని 'జ్ఞానగంజ్'లో సాధన చేస్తున్న రోజులలో సన్యాసి అయి, యతి అయి, కాషాయ వస్త్రధారియై దండకమండలుధారియై 'తీర్థ' స్థితికి చేరుకున్న దశలో సన్యాసాశ్రమాన్ని వదిలి గృహస్థాశ్రమం స్వీకరించవలసినదిగా గురువుగారు ఆదేశించారు. తన చేత ఎన్నో సాధనలు

చేయించి సిద్ధశక్తులు వచ్చేటట్లు చేసిన ఆచార్యుని మాట కాదనలేక అంగీకరించాడు 'విశుద్ధానంద'. కానీ అదే స్థితిలో ఉన్న అతని మిత్రుడు ఒకసారి సన్యాసం తీసుకొన్న తరువాత మళ్ళీ వెనక్కు వెళ్ళకూడదు. కనుక నేను గృహస్థాశ్రమంలోకి వెళ్ళను" అని గురువుగారి ఆజ్ఞను తిరస్కరించాడు. ఆ గురువుగారు ఆగ్రహించి నీ శక్తులు మొత్తం ఈ క్షణం నుండి పనిచేయవు. ఈ జన్మలో నీ కింక సిద్ధస్థితి రాదు"అని శపించాడు. ఆ యువకుడు ఆ విధంగా శప్తుడయి గురువుగారి కాళ్ళమీద పడి ప్రార్థిస్తే "ఈ జన్మకు ఇక ఇంతే – వచ్చే జన్మలో అనుగ్రహిస్తానులే" అన్నాడు. కనుక సిద్ధగురువుల వాక్కులు ఆదేశములు ఎట్టిపరిస్థితులలోనూ దాటరాదు. అందుకే తాను హిమాలయములను విడిచిపెట్టి దక్షిణదేశం చివరకు వెడుతున్నాడు.

తెలుగుదేశంలోని త్రికూటాచలక్షేత్రంలో నివాసమేర్పరచుకుందామని అక్కడ తపస్సు చేసుకుందామని అనిపించింది. కాని సద్గురువుల ఆదేశాన్ని అనుసరించి తాను ఇంకా దక్షిణ దిశగా వెళ్ళాలి. ఇటీవల విన్నాను – అక్కడ మరొక 'త్రికూటాచల క్షేత్రం' ఉన్నది. అత్యంత ప్రాచీనమైన 'ధరణీపీఠం' అచ్చట స్థాపితమై ఉన్నది. చిత్రానదీ తీరంలో కుర్తాళ గ్రామంలో వేణు వాగ్వాదినీ సమేతుడై దివ్య లింగరూపియై పరమేశ్వరుడు నన్ను ఆకర్షిస్తున్నాడు ఆ కొండ మీద గుహలో 'అగస్త్యమహర్షి' తపస్సు చేసిన చోట నేనూ తపస్సు చేయాలి. కుర్తాళ నాథేశ్వరుని ఆలయం ప్రస్తుతం నాకు నిలయమవుతుంది

మౌనస్వామి కుర్తాళం చేరుకున్నాడు. అక్కడి జలపాతాలు, కుర్తాళనాథుని సన్నిధి ఆయనకెంతో నచ్చినవి. అక్కడి దేవతలూ, సిద్ధులూ, ఆయనను అనుగ్రహించారు. ఇచ్ఛా, జ్ఞాన, క్రియా, శక్తుల అపూర్వ వికాసం కల్గింది. హిమాలయాలే కాదు. దక్షిణాపథ భూములు కూడా సిద్ధావాసములే.

మౌనస్వామికి కుర్తాళం స్థిరనివాసమయినది. దివ్యదృష్టి, దివ్యజ్ఞానం, దివ్యశక్తులు ఎన్నో వశమైనవి. పరమగురువులు ఏ సంకల్పంతో ఇక్కడికి పంపించారో ఆ సంకల్పం నెరవేరడం మొదలయినది. మహనీయులైన సిద్ధ గురువుల ఇచ్ఛ జయించునుగాక!

## చతురగిరి సిద్ధుడు

తమిళనాడులో 'పంచలింగాలు' ప్రసిద్ధమైనవి - శంకరనయనార్ కోయిల్, సేత్తూరు వద్ద దేవదానం, కరివలం వందనల్లూర్, తారాపురం, చతురగిరి, ఐదింటిని దర్శనం చేసుకొని శివార్చన చేసిన వారికి అధివ్యాధులునయమై ఇష్టసిద్ధి కల్గుతుందని అక్కడిస్థల పురాణాల కథనం. స్వామి భక్తులలో వెంకటసుబ్రహ్మణ్య అయ్యరు, ఆయన తండ్రి సుందరమయ్యరు ప్రముఖులు. సుందరమయ్యరు తీవ్ర జ్వరంతో మంచం పట్టాడు. ఆయన కుమారుడు వచ్చి స్వామివారిని ప్రార్థించాడు. స్వామి వారు ధ్యానంలో చూసి సుందరమయ్యరుకు ఒక గండం ఉన్నదని, పంచలింగాలను దర్శించి పూజ చేస్తే తప్ప ఆ గండం గట్టెక్కదని అన్నారు. జ్వరంతో మంచం దిగలేని స్థితిలో ఉన్న వ్యక్తి ఈ ప్రదేశాలన్నీ దర్శించటం ఎలా? తిరగటం ఎట్లా? సుబ్రహ్మణ్య అయ్యరు దయనీయమైన ప్రార్థనకు కరిగిపోయిన స్వామి ఇప్పటి జ్వరాన్ని నేను తగ్గిస్తాను. ఈ విభూది తీసుకువెళ్ళి మీ నాయనకు బొట్టు పెట్టు, ఆరోగ్యం కుదుటపడిన తర్వాత పంచలింగ దర్శనం చేయవచ్చు - అని అన్నారు. అలానే జరిగింది. ఆ క్షేత్రాలన్నీ అరణ్యంలో ఉన్నవి. శ్రమతో కూడిన ప్రయాణాలు. అయినా మొదటి నాలుగు ఎలాగో చేరుకొని పూజలు చేశారు. ఐదవది చతురగిరి మరీ కష్టం. స్వామి వారు ధైర్యం చెప్పి వాళ్ళను తీసుకొని వెళ్ళారు. అరణ్య ప్రాంతంలో పెద్ద గుట్టమీద శివమందిరం ఉన్నది. అర్చనచేసి పూజపూర్తి చేశారు. చేరుకోవడమే సాయంత్రకాలం, రాత్రి అర్చన అయితే చేశారుగాని ఉండటానికి వసతిలేదు. దానికి తోడు ఆ ప్రాంతవాసులు రాత్రిపూట గుడి దగ్గర ఎవరూ ఉండకూడదని కొండమీద ప్రాణాపాయం ఉన్నదని భయపెట్టారు. అయినా స్వామివారు ఫర్వాలేదనడం వల్ల అక్కడే ఒక చిన్న వసారాలో తలదాచుకున్నారు. విపరీతమైన చలి. స్వామివారికి ఇవేమీపట్టలేదు. శివలింగానికి ఎదురుగా ధ్యానంలో కూర్చున్నారు. మందిరంలో ఆయన ఒక్కరూ, మిగిలిన వారంతా అవతల కూర్చున్నారు. తెల్లవారేసరకి చూస్తే స్వామివారు లేదు. ఎక్కడికి పోయినారో ఎవరికీ తెలియదు. గుడి అర్చకుడు మాత్రం అర్థరాత్రి ఎవరితోనో స్వామివారు కలిసి కొండమీదకి వెళ్ళడం చూశానని అన్నాడు.

**మౌనస్వామి** "సిద్ధేశ్వరా ! మీరెవరు? నేనిక్కడికి రావడం మీ సంకల్పం వల్లనే అని నాకు తెలుసు. ఈ సుందరమయ్యరు అనారోగ్యం ఒక నిమిత్తమని, దాని పేరుతో నేనిక్కడికి వచ్చానని అందరూ అనుకోవచ్చు. కానీ అసలు సత్యం మీకు తెలుసు"

**సిద్ధుడు :** "శివచిదానందా! నిన్ను చూడాలనిపించింది. అందుకే సంకల్పించి నీవిక్కడికి వచ్చేటట్లు చేశాను. నాతోరా. మనం కొండమీది గుహలో నాస్థానంలో కూర్చొని మాట్లాడుకుందాము. ఈ అర్ధనిశా సమయంలో ఇతరులెవరూ చొరలేని, ప్రయాణం చేయలేని ప్రదేశంలో దట్టమైన అడవిలో పర్వతాగ్రాన నా నివాసం. అప్పుడా! నా చేయి పట్టుకో. ఇద్దరం కలసి వెళ్దాం.

కొద్దిక్షణాలు అత్యంత వేగవంతమైన ప్రయాణం జరిగింది. వారు నడిచే వెళ్తున్నారా? ఆకాశంలో ఎగురుతూ వెళ్తున్నారా? పాదములు నేలకు తగులుతూ వెళ్తున్నారా? లేదా? వారికే తెలియాలి. ఇద్దరూ గుహలో కూర్చున్న తర్వాత లాంఛనప్రాయమైన ఆతిథ్యమర్యాదలు జరిగినవి.

**సిద్ధుడు :** హిమాలయ అరణ్యాలలో ఋషుల ఆశ్రమాలు ఉన్నట్లే దక్షిణ దేశంలో కూడా సిద్ధకేంద్రాలున్నవి. అందులో ఇది ఒకటి. అగస్త్యమహర్షి ఇక్కడికి తరచుగా వస్తుంటారు. వేల సంవత్సరాలు జీవించిన మహాయోగులు కూడా కొందరు ఇక్కడికు వచ్చి వెళుతూ ఉంటారు. ఈ ప్రదేశం సామాన్య మానవులకు అగమ్యము. ఇక్కడ ఒక గుహ ఉన్నదని, మానవనివాసము ఉన్నదని ఎవరికీ తెలియదు. తెలుసుకోలేరు కూడా. ఈ ఏకాంత ప్రదేశంలో ఈ గిరి గుహాకేంద్రంలో నేనుండి ఈ ప్రాంతంలో జరిగే పరిణామాలను గమనిస్తూ ఉంటాను. తీవ్ర సాధకులైన వ్యక్తులకు వారి సాధన ఫలించేటట్లు చేస్తుంటాను. అగస్త్యమహర్షి తపస్సు చేసిన ధరణీపీఠానికి వచ్చిన యోగివరుడవు నీవు. ఆగస్త్య మహర్షి సంకల్ప ప్రభావం వల్ల అక్కడి త్రికూటాచల గుహలో ఆయన తపస్సు చేసిన కాలం నుండి దివ్య శక్తి తరంగాలు అక్కడ ప్రసరిస్తున్నవి. ఆ విషయం నీకూ తెలుసు. నీవు నా పురాతన మిత్రుడవు. జననాంతర సౌహృద బంధం మనది – పూర్వజన్మలో మనమిద్దరమూ ఒక గురువు శిష్యులము. నేను అప్పటి నుండి ఆ శరీరంతోనే

ఉన్నాను. నీకు మాత్రం జన్మ మారింది. పరమ గురువుల కరుణవల్ల సిద్ధాశ్రమ మిత్రుల సాహచర్యం వల్ల నీవు చాలావరకు సాధించావు. ఈ ప్రాంతంలో దైవశక్తి ప్రభావ నిరూపణకు ఎన్నుకోబడిన వ్యక్తివి నీవు. నీవల్ల ఇంకా ఎన్నో మహత్కార్యాలు జరుగవలసి ఉంది. ఇవ్వాళ దక్షిణ దేశంలోని సిద్ధులు అద్భుతాలు సాధిస్తున్నారు. ప్రసిద్ధిమైన చాల ఆలయాలలో ఆయా దేవతల పేరుతో మహనీయులైన సిద్ధులు భక్తులను అనుగ్రహిస్తున్నారు. ఉదాహరణకు 'పళని'లో కుమారస్వామి పేరుతో అనుగ్రహిస్తున్న సిద్ధుడు "భోగర్" అలానే మూకాంబికాక్షేత్రంలో 'కోలామయోగి' తన దివ్య శక్తిని ప్రసరింప చేస్తున్నాడు. ఈ రెండు క్షేత్రాలు కూడా ప్రత్యేకంగా ఎందుకు ఉదహరిస్తున్నానంటే వాటితో నీకు అనుబంధం ఉన్నది కనుక. మూకాంబికా క్షేత్రంలో చీకటి వేళ దారి తప్పి ఎటుపోవాలో తెలియని స్థితిలో ఒక నల్లని స్త్రీ వచ్చి నీకు మార్గదర్శనం చేసింది. నీ నిశాప్రార్థన అందుకున్న మూకాంబిక ఆ అనుగ్రహాన్ని కల్గించింది. ఆ కోలామ ఋషి కూడా మనవాడే. అలానే పళనిలో కూడా నీకు దివ్యమైన అనుభవాలు కల్గుతవి. ఆ మహాసిద్ధుల అనుగ్రహం కూడా నీకు లభిస్తుంది. మరొక ముఖ్యమైన అంశం. నీవు కంచి ప్రాంతానికి వెళ్ళినపుడు ఆ ప్రాంతంలోని కొండమీది దేవాలయం దగ్గర ఒక సిద్ధునితో పరిచయం కల్గుతుంది. భవిష్యత్‌లో నీవిప్పుడున్న త్రికూటాచల క్షేత్రంలో ఒక పీఠాన్ని స్థాపిస్తావు. దానికి సంబంధించిన కొన్ని విశేషాలు అతనితో నీవు సంప్రదించవలసి ఉంటుంది.

ఈ విధంగా వారి సంభాషణ కొంతసేపు సాగింది. కలిసినందుకు గుర్తుగా, ఆత్మీయతకు చిహ్నంగా మౌనస్వామి తన మెడలోని రుద్రాక్షమాలను, విభూతి సంచిని ఆ సిద్ధ మిత్రులకు ఇచ్చాడు. ఆయన తన దగ్గిరి ఒక రహస్య వస్తువును ఒక మణిని మౌనస్వామికి ఇచ్చి – "ఇది జరా రోగములనుండి రక్షిస్తుందని" మైత్రీ చిహ్నంగా ఇచ్చారు. అక్కడ నుండి మౌనస్వామి తెల్లవారిన తరువాత క్రిందికి దిగి వచ్చారు. అందరికీ ఆశ్చర్యమైంది. సుందరమయ్యరు – "స్వామి! మేము చాలా భయపడ్డాము. ఇంతకంటే పైకి ఎవ్వరూ వెళ్ళకూడదని, వెళ్ళినవారు ఆపదలపాలు అవుతారని దగ్గర గ్రామ పౌరులు మనకు చెప్పి ఉన్నారు కదా! మీరు మహానుభావులు

కనుక క్షేమంగా తిరిగి వచ్చారు. మాకు వినతగ్గ అర్హత ఉంటే కొండమీది విశేషాలు చెప్పండి" అని ప్రార్థించాడు. దానికి మౌనస్వామి సమాధానం చెబుతూ "కొండమీద మహాముని ఉన్నారు. ఆయనను కలుసుకోటానికి, మాట్లాడటానికి వెళ్ళాను. ఆయన స్వయంగా వచ్చి తీసుకెళ్ళి ఆయన నివాసంలో కొంతసేపు గడపటం జరిగింది. యోగులు కలుసుకున్నప్పుడు పాటించవలసిన మర్యాదల ప్రకారం నా రుద్రాక్షమాల, విభూది సంచీ వారికిచ్చాను. వారు కూడా వారి ఆప్తతకు గుర్తుగా మరొక వస్తువు ఇచ్చారు. తరువాత ఒంటరిగా ఉన్నప్పుడు సుందరమయ్యరు ఆ వస్తువు చూపించమని బతిమిలాడాడు. అతని మీద వాత్సల్యం వల్ల ఆ దివ్య మణిని చూపించి దాని లక్షణాన్ని, మహిమనూ స్వామి చెప్పారు. అప్పుడు అయ్యరు – "స్వామీ! మీరు సిద్ధపురుషులు, యోగీశ్వరులు. మీ శరీరం, మనస్సు మీ స్వాధీనంలో ఉంటవి. ఆ మణి మీ దగ్గర ఉన్నా లేక పోయినా మీకు ఇబ్బంది లేదు. నావంటి అల్పునకు మీరు దానిని అనుగ్రహిస్తే, ఆధివ్యాధులు లేక మనః శాంతితో ఉంటాము. యావజ్జీవితమూ మీకు కృతజ్ఞుడనై ఉండగలను." అన్నాడు. అతని మీద దయతో స్వామి ఆ మణిని అతనికిచ్చి "ఇది నీకొక్కనికే ఉపయోగపడుతుంది. దీనిని గురించి ఇతరులకెవరికీ చెప్పవద్దు. నీ తరువాత అది తనంతనే అదృశ్యమౌతుంది." అని దానిని బహూకరించారు. అందుకే ఆ తరువాత ఆతని కుమారుడు ఎంత అడిగినా దానిని గురించి ఒక్కమాట కూడా చెప్పలేదు.

మొత్తం మీద ఆ కొండమీది సుందర మహాలింగమూర్తిని ఎవరైనా దర్శించవచ్చు కానీ అంతకు మించి పైకి పోవడానికి ప్రయత్నించడం మంచిది కాదు. అక్కడ ఉండే యోగులు సామాన్య మానవుల రాకను ఇష్టపడరు.

### కొండమీది దేవళము

శివ చిదానంద సరస్వతీస్వామి తన దేశ సంచారంలో ఒకసారి ద్రవిడాంధ్ర మధ్య ప్రాంతంలో ఒక కొండమీది గుడి దగ్గరికి వెళ్ళారు. అది ఒక అమ్మవారి దేవాలయం. జనమెవ్వరూ లేరు. గర్భగుడిలో నుండి మధ్య వయస్కుడైన ఒక యోగి బయటకు వచ్చాడు. మౌనస్వామికి స్వాగతం చెప్పాడు.

స్వాగతం చెప్పి ఆతిథ్య మర్యాదలు జరిపిన తరువాత ఇద్దరూ సుఖాసీనులైనారు.

**యోగి :** శివ చిదానందా! చతురగిరి సిద్ధుని ప్రేరణవల్ల మీరిక్కడికి రావడం జరిగింది. సిద్ధ పురుషులైన మీరాక నాకెంతో సంతోషం కల్గిస్తున్నది.

**శివచిదానంద :** యోగీశ్వరా! ఏదో ప్రబలమైన శక్తి నన్నిక్కడికి ఆకర్షించింది. ఈ కొండగాని, ఈ అడవికాని, ఈ గుడికాని పరిచితమైనవికావు. ఈ కీకారణ్యంలో ఇక్కడ ఒక గుడి ఉన్నట్లు కూడా ఎవరికీ తెలియదు ఏదో ఆంతరమైన ఆదేశం వల్ల నేనిక్కడికి వచ్చాను. మీరెవరో తెలుసుకోవాలని ఉంది.

**యోగి :** స్వామీ! మీరు సన్యాసులు. నేను యతిని కాదు. సంప్రదాయాన్ని అనుసరించి మీరు నాకు పూజ్యులు. మనది సిద్ధాశ్రమబంధం. నేను మిమ్ము చాలా పూర్వనుండీ ఎరుగుదును. హిమాలయాలలో కైలాస శిఖర ప్రాంతంలోని ఒక ఆశ్రమ గుహలో మీరు వజ్రేశ్వరీ సాధన చేయడం నేనెరుగుదును. సిద్ధ గురువుల ఆదేశం వల్ల మీరు ఆ శరీరాన్ని విడిచి మళ్ళీ జన్మ ఎత్తారు. పూర్వమిత్రుల సహకారం వల్ల పరమ గురువుల అనుగ్రహం వల్ల మీకు పూర్వస్ఫురణ దివ్య శక్తులు లభించినవి. తెలుగుదేశంలో పుట్టి హిమాలయాలకు వెళ్ళి అక్కడి అనుబంధాలను పునఃనిర్మించుకొని తపస్సుచేసి సద్గురువుల కరుణను పొంది వారి ఆదేశంపై మీరు ఈ ధరణీపీఠంలో త్రికూటాచల క్షేత్రంలో నివసిస్తున్నారని నాకు తెలుసు. చతురగిరి సిద్ధుని సందేశం, మీతో ఉన్న అనుబంధం మిమ్ము చూడాలనిపించి ఇక్కడకు వచ్చేలా సంకల్పించాను. దాని ఫలితమే ఈ సమాగమము.

**శివచిదానంద :** సిద్ధపురుషా! మీరు కాళీ మంత్ర సిద్ధులని, కాళీమాత సాక్షాత్‌గా విగ్రహరూపంలో మీకోసం అవతరించిందని విన్నాను. ఆ విగ్రహాన్ని గురించి విశేషాలు వినాలని ఉన్నది. అంతేకాక మీ వయసు కొన్ని వందల సంవత్సరాలని చతురగిరి సిద్ధుని ద్వారా విన్నాను. వాటిని గురించి మీరు చెబితే వినాలని కోరుతున్నాను.

**యోగి :** స్వామి అచ్చుతానంద దగ్గరకు మీరు వెళ్ళినపుడు ఒక వ్యక్తి వయస్సు ఎంత అనేది ఎలా నిర్ణయించడమో మీరు విన్నారు. శారీరకంగా

మీకంటే కొంత పెద్దవాణ్ణి. కానీ పూర్వస్ఫురణ ఉండటం వల్ల వందల ఏండ్లని అనుకోవలసి వస్తుంది. షుమారు 400 సం॥ల క్రింద నేను హిమాలయాలలో తపస్సు చేస్తున్నప్పుడు నాయందు కరుణ కలిగి కాళీదేవి విగ్రహరూపంలో అవతరించింది. అది ప్రాణం గల్గిన విగ్రహం. కృష్ణశిలామూర్తియై జీవలక్షణాలు మూర్తీభవించిన ఆకృతి. ఆమెను మూడు వందల సం॥లపాటు ఆనాడు సేవించాను. ఆ తర్వాత శరీరపతనం జరిగి మళ్ళీ ఈదేహం ధరించాను. అంతకు ముందు కొన్నాళ్ళు బృందావనంలో ఉన్నాను. కృష్ణచైతన్య మహాప్రభువు భక్తుడైన రూపగోస్వామి నాకు చ్వాలా ఆప్తుడు. ఆయన ఆశ్రమంలో కొన్నాళ్ళు కాళీని పూజిస్తూ ఉన్నాను. ఆరోజులలో అక్కడికి వచ్చే సిద్ధులలో ఒకరు ఆకాశగమనాది శక్తలు కల్గిన ఒక కాళీభక్తుడు తరువాతి కాలంలో రామకృష్ణ పరమహంసగా జన్మించాడు. రూపగోస్వామి మాత్రము బృందావన ధామములోనే రాధాదేవి సఖీమండలంలో చేరి ఉన్నాడు. ఆ తర్వాత నా విగ్రహాన్ని కొన్నాళ్ళు కాశీవాసియైన దీర్ఘజీవి త్రైలింగస్వామి సేవించాడు. ఆ పిమ్మట పరమహంసకు తాంత్రిక సాధనలు నేర్పిన భైరవీబ్రాహ్మణి కొన్నాళ్ళు పూజలు జరిపింది. ఆ తర్వాత పరంపరగా శిష్యులు సాధకులు పూజిస్తూ వచ్చారు. అది ప్రస్తుతం ఒరిస్సాలోని భువనేశ్వర ప్రాంతపు అడవులలో రహస్యంగా తీవ్రసాధకులచే పూజలందుకుంటున్నది. అక్కడికి అప్పుడప్పుడు నేను వెళ్తున్నాను.

**శివచిదానంద :** ఈసారి మీరు వెళ్ళేటప్పుడు నేను కూడా వస్తాను. ఆ దేవిని చూడాలని నాకు కూడా కోరికగా ఉన్నది. అంతేకాదు కుర్తాళంలోని మా ఆశ్రమానికి కూడా మీరొకసారి రావాలి.

**యోగి :** ఈరెండూ భవిష్యత్‌లో జరుగవలసినవే. ఎందుకంటే ఈ శరీరంలో కూడా నేనెక్కువకాలం ఉండబోవడం లేదు. కపాలేశ్వర కాళిదాస్ అనే శిష్యునకు ఆ విగ్రహాన్ని అప్పగించి నేను త్వరలో ఈ దేహాన్ని త్యాగం చేస్తాను. మళ్ళీ జన్మలో నేను పెరిగి పెద్దవాణ్ణి అయ్యేదాకా ఇంచుమించు వంద సంవత్సరాల పాటు అతడా విగ్రహాన్ని పూజిస్తుంటాడు. ఆ తరువాత ఆంధ్రదేశంలోని గుంటూరు అనే పట్టణంలో ప్రసాదరాయకులపతి అనే పేరుతో ఉండే నా దగ్గరకు ఆకాశమార్గంలో పంపిస్తాడు. ఆకాళీదేవి

పునరాగమనం తర్వాతనే మళ్ళీ మనం కలుసుకుంటాము.

**శివచిదానంద :** అప్పటిదాకా నేనూ ఈ భౌతిక శరీరంతో ఉండకపోవచ్చు కదా !

**యోగి :** నిజమే ! ఉండరు. కానీ అభౌతికమైన సిద్ధశరీరంతో మీరు ప్రకాశిస్తూనే ఉంటారు. హిమాలయాలో మీరు సాధించిన సిద్ధేశ్వరీదేవి పేరుతో మీరు ఒక పీఠాన్ని స్థాపిస్తారు. మీ తరువాత ముగ్గురు పీఠాధిపతులు పరిపాలించిన పిదప నేను కుర్తాళం వచ్చి మీ పీఠాన్ని స్వీకరిస్తాను. మీరు స్థాపించిన సిద్ధశక్తి కేంద్రాన్ని అభివృద్ధి చేసి సిద్ధమండల గురువులకు సంతృప్తి కలిగిస్తాను. మీరు అప్పుడు నాతో ఉండి మార్గదర్శనం చేస్తూ గువువుల ఆదేశాన్ని విజయవంతం చేయాలి.

శివచిదానంద : శివేచ్ఛ ఆలా ఉంటే అలాగే జరుగుతుంది. మీారన్నట్లు భౌతిక శరీరాలు వాటి ఆయువులు మన అనుబంధానికి అడ్డంకావు.

**యోగి :** సిద్ధేశ్వరియైన కాళి మనలను అనుగ్రహించును గాక !

## సిద్ధశరీరము

**శ్లో ॥ సా రమ్యా నగరీ మహాన్స నృపతిః సామంత చక్రంచ తత్ ।**
**పార్శ్వే తస్యచ సా విదగ్ధ పరిషత్ తాశ్చంద్ర బింబాననాః ॥**
**ఉద్వృత్తస్సచ రాజపుత్రనివహః తే వందినః తాఃకథాః ।**
**సర్వం యస్య వశాదగాత్ స్మృతి పథం కాలాయ తస్మై నమః ॥**

అది అందమైన పట్టణము. ఆ రాజు చాలా గొప్పవాడు, కొలువు కూటములో సామంతులు ఒక్క ప్రక్క నున్నారు. పండితులు, శాస్త్రవేత్తలు ఆసీనులై ఉన్నారు. వీరులైన రాజపుత్రులు పరివేష్టించి ఉన్నారు. వందిమాగధులు కైవారములు పల్కుతూ చక్రవర్తి విజయగాథలను గానం చేస్తున్నారు. ఈ అనంతమైన అఖండమైన వైభవమంతా కాలవశాన కరిగిపోయింది. చివరకు స్మృతులు మిగిలినవి.

**వాయువశంబులై ఎగసి వారిధరంబులు మింట కూడుచున్**
**పాయుచునుండు కైవడి ప్రపంచము సర్వము కాలతంత్రమై**
**పాయుచు కూడుచుండు ఒక భంగి చరింపదు కాలమన్నిటిన్**
**చేయుచునుండు కాలము విచిత్రము దుస్తరమెంత వారికిన్**

ఆకాశంలో గాలికి ఎగురుతూ కలుస్తూ విడిపోతూ ఉండే మబ్బులలాగా ప్రపంచంలోని జీవులు కొంతకాలము కలిసి భర్తలమని, భార్యలమని, పుత్రులమని, మిత్రులమని కలుస్తూ విడిపోతూ ఉంటారు. కాలము ఎప్పుడూ ఒక రీతిగా ఉండదు. ఇది విచిత్రమైనది. ఎంత వారికినీ తరింపరానిది.

సృష్టిలో నామరూపాత్మకమేదైనా నశింపక తప్పదు. ఈ సృష్టిలో పరమేశ్వరుడొక్కడే మృత్యుంజయుడు. మానవులు, దేవతలు అందరూ తమ తమ కర్మానుగుణంగా అనంతకాలంలో కలసి పోవలసిన వారే. కాకుంటే మానవులు కొద్దికాలం జీవిస్తే దేవతలు ఎక్కువ కాలం జీవిస్తారు. అదే తేడా.

మౌనస్వామి అంతరంగంలో ఆలోచనా పరంపర ఈ విధంగా కొనసాగుతున్నది. "గురువుగారు నిర్దేశించిన కర్తవ్యం యథాశక్తి నెరవేర్చాను. మంత్ర దేవతలు ప్రసాదించిన దివ్యశక్తులతో అధివ్యాధులను పోగొట్టాను. కొందరికి ఆధ్యాత్మిక పురోగతి కల్గించాను. ఈ శరీరానికి ఇక జీర్ణదశ వచ్చినట్లు కన్పిస్తున్నది. దూరతీరాల నుండి ఏదో పిలుపు వినిపిస్తున్నది. భగవద్గీతలో కృష్ణభగవానుడు అన్నాడు –

**శ్లో॥ వాసాంసి జీర్ణాని యథా విహాయ నవాని గృహ్ణాతి నరోపరాణి**
**తథా శరీరాణి విహాయ జీర్ణా న్యన్యాని సంయాతి నవాని దేహీ॥**

ధరించిన వస్త్రాలు మాసిపోయి, చినిగిపోయినప్పుడు వాటిని తీసివేసి క్రొత్త వస్త్రాలు తొడుగు కొనినట్లుగా దేహధారి అయిన నరుడు అది జీర్ణమైనప్పుడు వదలివేసి క్రొత్తశరీరాన్ని ధరిస్తాడు.

పాంచభౌతికమైన శరీరము ఏదో ఒకనాడు పతనము కాక తప్పదు. అంతరిక్షంలోని సిద్ధమండలం నుండి దివ్యాదేశము వస్తున్నది. ఒకసారి గురువుగారు ఉత్తమగతులను గురించి ప్రస్తావిస్తూ–

**శ్లో॥ ద్వావిమౌ పురుషౌ లోకే సూర్యమండల భేదినౌ ।**
**పరివ్రాట్ యోగయుక్తశ్చ రణే చాభిముఖే హతః ॥**

సూర్యమండలాన్ని ఛేదించుకొని పోయే పురుషులిద్దరే. యోగయుక్తుడైన పరివ్రాజకుడు, రణరంగంలో ఎదుటివీరుని చేతిలో హతుడైనవాడు. పరివ్రాజకునిగా, యోగిగా నా జీవిత గమనము నాకు తెలుస్తూనే ఉన్నది. నేనెందరో యోగులను చూచాను. శరీరము విడిచిపెట్టిన తరువాత సిద్ధులై దివ్యదేహముతో సంచరిస్తున్న మహనీయులతోనూ అనుబంధము కల్గింది. పాపకర్మలు చేసి ప్రేతములై, పిశాచములై తిరుగుతున్న జీవులనూ చూశాను. వారిలో కొందరికి విముక్తిని కల్గించే అవకాశం నాకు కల్గింది. దివ్యక్షేత్రాలలో దేవతలు నన్నెంతో కరుణించారు. వారి అనుగ్రహ దర్శనాలను పొందగలిగాను. పాంచభౌతిక శరీరాన్ని విసర్జించి సిద్ధాశ్రమ యోగులతో, దీర్ఘకాల జీవులైన హిమాలయ సిద్ధులతో క్రొత్త అనుబంధాలు ఏర్పడటం, పాత అనుబంధాల పునరుద్ధరణ జరగబోతున్నవి. ఈ దేహాన్ని వదిలినా వెంటనే మరల జన్మించబోను. సుదీర్ఘకాలం సిద్ధశరీరంతో ఉంటూ దేవకార్యం నెరవేర్చమని పరమగురువులు ఆదేశిస్తున్నారు. ఇప్పటి భక్తులలో కొందరికి అనంతర కాలంలో కూడా అప్పుడప్పుడు దర్శనమిచ్చి వారి విశ్వాసాన్ని పెంపొందిస్తాను. భవిష్యత్తులో ఎందరికో మార్గనిర్దేశనం చేయవలసి ఉంది. ఆ తరువాత ఆ సిద్ధేశ్వరీపీఠము ఒక దివ్యశక్తి కేంద్రముగా ప్రకాశించాలి. హిమాలయములో కాళీదేవిని అవతరింప జేసి, ఆమె కళింగారణ్యములలో ఉండగా అక్కడకు వెళ్ళుతూ కొద్దికాలం క్రింద నాకు కన్పించిన కాళీయోగి ఈ పీఠానికి వస్తానని మాట ఇచ్చాడు. ఆ యోగి మళ్ళీ జన్మ మారి పెరిగి పెద్దవాడై ఇక్కడికి వస్తాడు. అప్పటికి ఈ సిద్ధేశ్వరీపీఠములో కూడా కొన్ని తరాలు గడుస్తవి. అతడు వచ్చి పీఠాన్ని అధిరోహించి దీనిని మహాశక్తి కేంద్రముగా తీర్చిదిద్దుతాడు. ఆ భవ్య సమయము కోసము సిద్ధశరీరము అతని కోసము ఎదురు చూస్తూ ఉంటాను.

## రామయ్య చెట్టి కథ

హిమాలయాలలో వందల వేల సంవత్సరాల నుండి భౌతిక శరీరంతో

జీవించి యున్న యోగులెందరో ఉన్నారు. పురాణాలలో చిరంజీవులను గురించి చెబుతూ –

**అశ్వత్థామా బలి ర్వ్యాసో హనూమాన్శ్చ విభీషణః ।**
**కృపః పరశురామశ్చ సప్తైతే చిరజీవినః ॥**

బలిచక్రవర్తి, పరశురాముడు, విభీషణుడు, హనుమంతుడు, వ్యాసుడు, కృపుడు, అశ్వత్థామ వీరు చిరంజీవులు. వీరు కాక అగస్త్య, వసిష్ఠాది నిర్మాణకాయులైన మహర్షులెందరో ఉన్నారు. మంచుకొండలలోని సిద్ధాశ్రమము రామాయణకాలం నుండి ప్రసిద్ధి చెందినది. అక్కడి యోగులను గురించి డాక్టర్ నారాయణదత్తశ్రీమాలి ఎన్నో విశేషాలు చెప్పారు. దివ్యజ్ఞాన సమాజస్థాపకురాలైన మేడమ్ 'బ్లావట్స్కీ' కూడా ఎన్నో అద్భుతాలను తెలియచేశారు. ఆ సిద్ధాశ్రమంలో ఎందరో సుదీర్ఘకాల జీవులున్నారు. హిమాలయవాసులైన సిద్ధగురువులలో 'మహావతార్‌బాబా' ఒకరు. సుమారు 3 వేల సంవత్సరాల నుండి ఆయన భక్తులను అనుగ్రహిస్తున్నాడని చెప్పబడుతున్నది. పరమహంస యోగానంద రచించిన "ఒక యోగి ఆత్మకథ"లోనూ, ఆయన పరమగురువైన శ్యామాచరణలాహిరి జీవితచరిత్రలోనూ బాబా ప్రస్తావన కన్పిస్తుంది. వారిద్దరి సంబంధాన్ని తెలియచేసే ఒక్క సంఘటన మాత్రం ఉదాహరిస్తాను. రైల్వే డిపార్టుమెంటులో చిన్న ఉద్యోగం చేస్తున్న లాహిరీ మహాశయునకు హిమాలయాలలోని ఒక స్టేషన్‌కు బదలీ అయింది. తీరా అక్కడికి వెళ్ళిన తరువాత అక్కడి అధికారులు నిన్ను ఇక్కడికి ఎందుకు బదిలీచేశారో తెలియదు. నీ విక్కడ చేయవలసిన పని కూడా ఏమీ లేదు. అయినా పై అధికారుల ఉత్తర్వులు కాబట్టి డ్యూటీలో చేర్చుకుంటున్నాము అన్నారు. ఆ రోజు సాయంకాలం కొండలమీదికి వాహ్యాళికి లాహిరి వెళ్ళినపుడు అక్కడ ఒక సన్యాసి కనిపించాడు. ఇక్కడేమైనా చూడదగ్గ విశేషాలున్నవా ? యని శ్యామాచరణ్ ప్రశ్నించినపుడు ఆ సన్యాసి "నాతో రా చూపిస్తాను" అని చెప్పి ఒక గుహలోకి తీసుకొని వెళ్ళి అక్కడ పురాతన దండకమండలములను జపమాల ఆసనములను చూపించి – "నాయనా! ఇవి ఏమైనా నీకు చూసిన గుర్తున్నదా ?" అని అడిగారు. లాహిరి – "నాకేమీ గుర్తులేదు. ఇవి ఎవరివి ? నాకెందుకు చూపిస్తున్నారు" అని అడిగాడు.

సన్యాసి - "బిడ్డా ! ఇవి నీవే. నీవు పూర్వజన్మలో ఇక్కడ తపస్సు చేశావు. ఆయువు తీరి శరీరం పతనమై మళ్ళీ జన్మఎత్తావు. నాకు ప్రేమపాత్రుడవైన శిష్యుడవు కనుక నీవు ఎక్కడ పుట్టినది; ఎలా పెరుగుతున్నది గమనిస్తూనే ఉన్నాను. నా సంకల్పం వల్లనే నీకు ఈ బదిలీ ఉత్తర్వు వచ్చినది. నిన్నిక్కడకు రప్పించి నీ పూర్వజన్మ స్మృతిని తెప్పించి మళ్ళీ నిన్ను యోగసిద్ధునిగా తీర్చిదిద్దటమే నా సంకల్పము. రేపు నీకు మళ్ళీ నీ పూర్వస్థానానికే బదిలీ ఉత్తర్వు వస్తుంది. నేనిప్పుడిస్తున్న శక్తితో నీకు దివ్యజ్ఞానము దివ్యశక్తి లభిస్తాయి. వానివల్ల ధ్యానసాధకులను యోగులుగా మార్చి ఆధ్యాత్మిక చైతన్యపూరితమైన వాతావరణాన్ని ఈ అర్షభూమిలో నిర్మించు" అని ఆ మహాపురుషుడు హస్తమస్తక సంయోగముతో లాహిరిలోని దివ్యచైతన్యాన్ని జాగృతం చేశాడు. ఆనాటి నుండి లాహిరి మహాయోగియై "క్రియాయోగ మార్గాన్ని" ప్రబోధించి ఎందరో, సాధకులకు ఉపకారం చేశాడు. వారి శిష్యపరంపర, ఆ మార్గము ఇప్పుడూ కొనసాగుతూనే ఉన్నవి.

ఆ పంథాలో క్రియాయోగసాధన చేస్తున్న ఒక తమిళ యువకునకు కర్మవశాన ఎముకలకు సంబంధించిన క్షయవ్యాధి పట్టుకున్నది. అతడు సుప్రఖ్యాత కోటీశ్వరుడు అన్నామలై చెట్టి కుమారుడు. 'రామయ్యచెట్టి' అతని పేరు. ఎన్ని మందులు తీసుకున్నా, ఎందరు డాక్టర్లు చికిత్స చేసినా వ్యాధి తగ్గలేదు. అతడు ఆర్తితో, ఆవేదనతో మహావతార్ బాబాను ప్రార్థించాడు. బాబా తాను స్వయంగా రాకుండా మౌనస్వామిని పంపించారు. బాబా సంకల్ప భావతరంగాలు అందుకున్న మౌనస్వామి రామయ్యచెట్టికి దర్శనమిచ్చారు. ధ్యానానుభవమో, స్వప్నానుభవమో, అతనికి తెలియని దశలో మౌనస్వామి తన అభయహస్తంతో ఆశీర్వదించి దివ్యశక్తి తరంగాలను ప్రసారం చేశారు. అది ప్రత్యక్ష దర్శనమని రామయ్య యొక్క పరిపూర్ణ విశ్వాసము. కొద్ది రోజులలోనే అతని దీర్ఘవ్యాధినయమై ఆరోగ్యవంతుడైనాడు. ఇప్పుడు కూడా వయస్సు పైబడినా ప్రపంచంలోని వివిధ దేశాలలో ధ్యానకేంద్రాలు స్థాపించి "క్రియాయోగమార్గాన్ని" ఆ సాధకులకు నేర్పుతున్నాడు. ఇటీవల కొద్దినెలల క్రింద రామయ్యచెట్టి కుర్తాళం వచ్చి నా దర్శనం చేసుకొని మౌనస్వామి సమాధి దగ్గర ధ్యానం చేసి ఇప్పటికీ మౌనస్వామి తనకు కన్పిస్తున్నాడని,

అనుగ్రహిస్తున్నాడని తెలియచేశారు. అతని రోగ నివారణానుభూతి కెనడా నుండి ప్రచురితమయ్యే "మాంట్రియల్" అనే పత్రికలలో మార్షల్ గోవిందన్ సవివరంగా రచించారు.

ఇక్కడ చాలామందికి కలిగే సందేహం రామయ్యచెట్టి మహావతార్‌బాబాను ప్రార్థిస్తే మౌనస్వామి వచ్చి నయం చేయడమేమిటి? ఈ సంఘటన జరిగింది 1952లో. మౌనస్వామి 1943లో సిద్ధిపొందారు. అంటే భౌతికశరీరాన్ని విడిచి పెట్టిన 9 సంవత్సరములకు రామయచెట్టికి ప్రత్యక్షమై అతని వ్యాధిని నివారణ చేయడం జరిగింది. ఈ సందర్భముగా హరివంశంలోని ఒక సంఘటన పరిశీలించవచ్చు. వ్రజభూమిలో గోవులకు, గోపకులకు ఏదో తెలియని వ్యాధి వచ్చింది. అడవిలో పగలంతా మేతకోసం వెళ్ళిన గోవులు వాటిని తోడుకొని వెళ్ళిన గోపకులు రోగగ్రస్తులైనారు. ఎన్ని మందులిచ్చినా తగ్గడం లేదు. కారణం తెలియదు. అప్పుడు నందుడు గర్గాచార్యులను పరిష్కారం చూపమని అర్థించాడు. ఆయన రుద్రయాగం చేయమని సూచించారు. యజ్ఞంలో పూర్ణాహుతి జరుగగానే ఒక బ్రాహ్మణునికి దేవతావేశం వచ్చింది. ఆవేశించిన దేవత ఈ విధంగా పల్కింది. "నేను రుద్రానుచరుడైన ప్రమథుడను. స్వామి ఆదేశం వల్ల వచ్చాను. గో, గోపకుల వ్యాధులకు కారణం అడవిలో రాక్షసుడు ఆవేశించిన ఒక చెట్టు. అది విషవాయువులను వ్యాపింప చేస్తుంటే ఈ రోగాలు వచ్చినవి. ఆ వృక్షాన్ని తగులపెట్టండి. వ్యాధులు పోతవి." నందుడు ఆ రకంగానే చేయించాడు. అందరికీ ఆరోగ్యం లభించింది. రుద్రుడి గురించి యజ్ఞం చేస్తే రుద్రుడు రాకుండా ప్రమథుడిని పంపాడు. మంత్రదేవత కొన్నిసార్లు వారు స్వయంగా రాకుండా వారి పరివారంలోని వారిని పంపుతుంటారు. సాధన మార్గంలో ఇది చాలామందికి కలిగే అనుభవము. సాధకులు ఏదో దేవతామంత్రం చేస్తుంటారు. ఆ సమయంలో ఎవరో సిద్ధుడు ధ్యానంలోనో, స్వప్నంలోనో కన్పించి తెలియజేయవలసిన విషయాలు తెల్పుతూ ఉంటారు. ఆ దేవతతో అనుబంధం కల్గిన యోగుల చేసే పనులు అలా ఉంటవి. దేవతల పేరుతో సిద్ధయోగులు ఇటువంటి విశేషాలెన్నో చేస్తూ ఉంటారు. రామయ్యచెట్టి విషయంలో జరిగింది కూడాఅంతే. అతడు హిమాచల యోగి యైన మహావతార్

బాబాను ప్రార్థిస్తే ఆ సిద్ధేశ్వరునకు అప్పుడై దక్షిణదేశంలో ఉన్న మౌనస్వామి రామయ్యచెట్టికి దర్శనమిచ్చి వ్యాధి నివారణ చేశాడు. ఏ పని ఎవరి వల్ల కావలసి ఉన్నదో దేవతలు సిద్ధులు నిర్ణయిస్తారు. సిద్ధపురుషుడైన మౌనస్వామి దివ్యశరీరంతో ఇప్పటికీ పిలిస్తే పలుకుతున్నారు. సాధకులకు దర్శనమిచ్చారు. కుర్తాళం ఆయన ప్రధానకేంద్రము. ఆయన సమాధి – దివ్యప్రభావానికి మూలస్థానము. అక్కడ పీఠాధిపతులందరూ ఆయన సంకల్పానువర్తులే. శివచిదానంభారతీస్వామి ఏమైనా ఇబ్బందులు వస్తే మౌనస్వామి సమాధి దగ్గరకు వెళ్ళి బతిమాలాడేవారు, ప్రార్థించేవారు. ఆయన ప్రార్థనను మన్నించి మౌనస్వామి ఆ కష్టం తీర్చేవాడు, అభీష్టం నెరవేర్చేవాడు.

## నా మొదటి చాతుర్మాస్య దీక్ష

సిద్ధేశ్వరి పీఠమ్మును చేపట్టిన పిదప మొదట
చాతుర్మాస్యపు దీక్షను సలిపితి కుర్తాళమందు
శిష్యులైన యతివర్యులు చేరిరి మరికొంతమంది
భక్తులైన సాధకులును వచ్చినార లిక కొందరు
శ్రీ మత్తుహినాచలాగ్ర సిద్ధాశ్రమయోగివరుడు
అచ్యుతానందయోగి – ఆ మహాత్ము శిష్యుడైన
మౌనస్వామి యతీంద్రుడు – మాన్యుడు స్థాపించినట్టి
పీఠమునకు అధిపతిగా వెలసినాడ దేవి ఆజ్ఞ
వర్ణనీయ శక్తియుతుడు స్వర్ణయోగ సిద్ధుండును
మంత్రేశ్వరు దత్యద్భుత మహిమాన్వితుడైన యోగి
అశరీరుండయ్యు నేడు – ఆశ్రమమున సంచరించు
ఆయన సంకల్పమ్మిట ఆధారమ్మన్నింటికి
ఈ దీక్షాకాలములో ఇచటి సాధకులయందున
ప్రతి ఒక్కడు కూడ పొందె భవ్యమ్మగు అనుభవములు
ఇన్నింటికి మూలమైన దిట మౌనస్వామికరుణ
ఆ పూజ్యుడు స్థాపించిన అఖిలేశ్వరి వాత్సల్యము

ఆశ్రమమున అలరునట్టి అశ్వత్థపు మూలమందు
స్థాపించిన నాటి నుండి చాలా రోజులిట గణపతి
శిలావిగ్రహమ్మునందు చెలగి నాడి ఆడుచుండె
గుండె కొట్టుకొనుచుండెను, కూడి వైద్యవరులు కనిరి.
ఆంగ్లేయుల రాజపత్రమందిది ముద్రింపబడియె
అప్పటికాలమ్మునుండి ఇప్పటిదాక జనావళి
వచ్చి మొక్కుకొనుచుందురు వారలు కోరికలు తీరు
ప్రబలమ్మగు నమ్మకమిది ప్రజలలోన ఈనాటికి
ఆనాడే గణపతికడ పూనికతో రాత్రులందు
జపధ్యానములు సలిపితి సంప్రదాయమార్గమ్మున
అద్భుతమగు అనుభవములు ధ్యానమ్మున ప్రాప్తించెను
వృషాకపి ప్రోజ్ఝితమగు విమలశక్తి లభియించెను.
అ సాధన కాలమ్మున ధ్యానమ్మును సలుపు నొక్క
యోగినిలో పూర్వ పాపయోగమ్మున దాగియున్న
పిశాచమ్ము భీషణముగ విజృంభించి బాధించెను
అచటి దైవచైతన్యము నాపలేక ఓపలేక
బాధాపరిపీడితయై పాపమ్మా సన్యాసిని
భయభ్రాంతయగుచు వచ్చి పాదమ్ములపై వ్రాలెను
కోరలు సాచుచు దూకెడి క్రూరశునక పిశాచమ్ము
కాలభైరవోద్ధతమై కంటిముందు కన్పించెను
ఎంతో కాలమ్ము క్రింద ఎవరో చేసిన ప్రయోగ
మీమెను పీడించుచున్న దిప్పటికిని వదలకుండ
వ్యాధిగ్రస్తగ నయ్యెను – అస్థిపంజర మ్మయ్యెను
ఎటనో మిగిలిన పుణ్యమిచ్చటికిని తెచ్చివదలె
నాపై కోపమున దూకు ఆ పిశాచమును గాంచుచు
నాడీగణపతి ఎర్రగ నవ్వినాడు కన్నులతో

నవ్వులోన ప్రసరించిన నైకాద్భుత శక్తిరేఖ
ప్రబలమ్ముగ పోయితాక పారిపోయె పిశాచమ్ము
ఆమె చేత ఆ పిమ్మట హోమమ్ములు చేయించితి
రక్షోఘ్నములైన మంత్రరాజమ్ముల దీవించితి
తంత్రోదితమార్గమ్మున యంత్రమొకటి నిర్మించియు
శాశ్వత రక్షగ నిచ్చితి సన్యాసిని మీది కరుణ
శ్రీ నాడీగణపతియును సిద్ధేశ్వరి దేవతయును
మౌనస్వామి సమాధియు మహితశక్తి కేంద్రమ్ములు
వీని దగ్గరను జపములు ధ్యానమ్ములు సలిపిరేని
నిశ్చయముగ సిద్ధించును ఆశ్చర్యముగా మంత్రము
అట్టి సాధకులు కొందరు అడిగిరి ఒకనాడు భక్తి
సాధ్యమ్మైనంతవరకు జపియింతుము దీక్షలోన
కానీ అందరము కూడా కలిసి ఒక్క యజ్ఞమ్మును
చేయవలయునంచు మాకు చిత్తమ్మున కోర్కె కలిగె
ఏమార్గమ్మనుసరించి ఏ యజ్ఞము చేయమందు
రద్దానిని మాకందర కాదేశము కావింపుడు
అభ్యర్థన వినగానే ఆలోచన కావించితి
ఆలోచన లోన తోచినట్టి దాని వచియించితి
ఇది మౌనస్వామి గురుని ఇచ్ఛా సంసృష్టమైన –
తపోభూమి – మీరందరు తరలివచ్చి రిచ్చోటికి
వివిధ మంత్రజాపకులను వివిధ మార్గసాధకులను
కూడి అందరిచ్చోటను గురు యజ్ఞము కావింపుడు
అనేక విధకుండమ్ములు ఆశ్రమమ్మునందు కలవు
వానిలో నొక్కదాని భవ్యమ్మగు దాని నెంచి
శాస్త్రోక్త విధానమందు చక్కగ సిద్ధమ్ము చేసి

ఆవాహన కావించితి అగ్నిలోన మౌనగురుని
శివచిదానందయోగి శీఘ్రమ్ముగ విచ్చేసెను
అనుకంపాభరితుండై అగ్నిలోన నిలుచుండెను
ఆ రాకను చూచినారు ఆంతరదృగ్వికాసమ్ము
రాజిల్లిన యట్టివారు రామకృష్ణయతిముఖ్యులు
పూర్వజన్మ కాలమ్మున పుణ్యభూమి హిమగిరిలో
తపమును కావించినాడు ధన్యుండౌ మౌనగురుడు
సాధన కావించినట్టి స్థలము గుహను చూపినాడు
ధ్యానించిన వజ్రేశ్వరి దర్శన మిప్పించినాడు
ఓంకారేశ్వరమునందు యోగదీక్ష పూనినాడు
కాంచన గంగా శిఖరము కడ సిద్ధులు పొందినాడు
నిఖిలేశ్వరయతి తోడను నిండు మైత్రి నెరపినాడు
ఘనుడు విశుద్ధానందుని కలిసి తపము చేసినాడు
ఈ జన్మమునందు మరల హిమగిరికే వెళ్ళినాడు
యోగీంద్రుల కరుణ పొంది ఉన్నతి సాధించినాడు
మంచుమలను చలి కదరని మానితదీర్ఘాయు వలరు
వేంకటాచలంపంతుల ప్రేమను సాధించినాడు
మహారాష్ట్రలో చెలగిన మాన్యుడు టెంబేస్వామిని
షిర్డీసాయిని కలియుట చిత్రమైన రహస్యమ్ము
అరుణాచల రమణునితో యతిమణి శేషాద్రితోడ
ఆత్మీయత నెరపి చేరె అంచితముగ కుర్తాళము
ఆ మహితాత్ముడు చూపెను ధ్యానమ్మున అద్భుతములు
ఎందరివో పూర్వజన్మ లెన్నెన్నొ విశేషములు
కొందరి కర్తవ్యమ్ములు కొందరి భవితవ్యమ్ములు
సిద్ధుండా మహనీయుడు చెప్పె నవసరములైనవి

దివ్యమ్మగుచిత్రానది - త్రికూటాచల క్షేత్రము
అగస్త్యుండు చరియించిన అద్భుతమగు తపోభూమి
స్థాపించెను స్వామి యిచట దత్తాత్రేయ మఠమ్మును
దండాయుధ పాణి గుడిని తత్పరతను కట్టించెను
అద్వైతపథమ్మునందు అందరు దేవతలొకటే
ఐనను అభిరుచుల బట్టి అందర సంతృప్తి పరుప
శైవమ్ములు వైష్ణవములు శాక్తేయములైన గుడులు
వచ్చిన వీ ఆశ్రమమున స్వామి మనస్సంకలము !
దండాయుధపాణి యొకట - దత్తాత్రేయుండొక్కట
ఒకట దక్షిణామూర్తియు ఒక్కచోట అయ్యప్పయు
నరసింహుడు శ్రీరాముం డాంజనేయు డలకృష్ణుడు
సిద్ధేశ్వరి పీఠమందు చేర్చె వీరి మౌనగురుడు
కాలమటులు గడచుచుండగా వచ్చెను భాద్రపదము
ప్రతియేడును శుద్ధాష్టమి రాసేశ్వరి జన్మదినము
బృందావన మందుండుట ఇష్టమ్మును అలవాటును
కాని యిపుడు కుర్తాళ గ్రామమ్మున నుండవలసె
నియమము నుల్లంఘించుట నీతిపథము కాదంచును
ఆశ్రమమందే ఉంటిని అట్టిట్టగు మనసుతోడ
తనువిక్కడ తలపక్కడ ధ్యాసయెల్లబృందావని
యమునాతటినీ తటాన అలరు కుంజపుంజమ్ముల
సిద్ధేశ్వరి మందిరమున శ్రీరాధాచిత్రముంచి
తెల్లవారుజామునునే దీపమ్మును వెలిగించితి
అఖిలేశ్వరి ముందు చేరి ఆసీనుడ నగుచు భక్తి
మంత్రజపము గావించుచు మరలితి ధ్యానమ్ము వైపు
చూచుచుండ నింతలోనె సుమగంధము విరజిమ్మెను
చీకటి తెరలును చీల్చుచు చిన్నారి కిశోరి దిగియె

ఆమెతోడనే వచ్చిరి అద్భుతముగ గోపికలను
పూర్వకాల వేషమ్ముల పొదలుచున్న గోపకులును
మరికొందరు మహాత్ములును మాత కొరకు విచ్చేసిరి
సూక్ష్మదేహ విస్ఫూర్తిని సురుచిర తేజస్సుతోడ
నాపై గల కూర్మితోడ నళినేక్షణ రాసేశ్వరి
అవతరించి కుర్తాళము నందు కృపా పూర్ణయగుచు
సిద్ధేశ్వరి కన్నులలో చిందించిన చిరునవ్వులు
పూర్వజన్మలో చేసిన పుణ్యము పూచిన పువ్వులు
ఆ వెలుగుల వెన్నెలలో ఆశ్చర్య మ్మాశ్చర్యము
నాలోపలనున్న కాళినలుపు తెలుపుగా మారెను.

## యోగమహిమలు

1. సుందరమైన రూపము, మధురమైన కంఠము పూర్వజన్మ పుణ్యఫలాలు. స్వామివారు చిన్నతనంలో చాలా కమ్మగా పాడేవారు. ఆయన కంఠంలో పుంస్కోకిలల కాకలీధ్వనులు లలిత లలితంగా కదిలేవి. ఆయన భక్తితో పరవశించి పాడితే ప్రకృతిపులకించేది. అంతటి తియ్యని గొంతును కూడా ఆపివేసి శాశ్వత మౌనాన్ని ధరించడం సామాన్యమైన విషయం కాదు. ఆ అపారమైన నిగ్రహం మహిమలను మించిన మహిమ. అయితే అప్పుడప్పుడు సిద్ధులతో మహాత్ములతో రహస్యంగా మాట్లాడినట్లు కొద్ది నిదర్శనాలు కన్పిస్తున్నవి. ఆంధ్రదేశంలో సుప్రసిద్ధురా లయిన జిల్లెళ్ళమూడి అమ్మ 'మాతృశ్రీ అనసూయాదేవి' అయిదేండ్ల వయస్సులో స్వామివారిని దర్శించినపుడు ఆయన తనతో మాట్లాడినట్లుగా ఆమె చెప్పింది. ఇటువంటి ప్రకటిత అప్రకటిత సంఘటనలు స్వల్పంగా ఉన్నాయి.

2. స్వామివారు 'హరిద్వార్'కి తీర్థయాత్ర వెళ్తున్నారు. అక్కడ ఒక భక్తుడు వారికి స్వాగతము ఏర్పాటు చేశారు. అతడు స్వామిని చూడలేదు. ముందురోజు రాత్రి స్వామి అతనికి స్వప్నదర్శనం ఇచ్చారు. అందువల్ల అతను రైలుస్టేషన్‌లో స్వామివారిని సులభంగా గుర్తుపట్టగలిగారు.

3. మౌనస్వామి పంచవటిలో తపస్సు చేసే రోజుల్లో ఒక మందిరంలో శంకరభగవత్పాదుల ప్రాచీన విగ్రహం విరిగిపడిపోయింది. ఉపకరణాలు ఉపయోగించినా దానిని సరియైన స్థానంలో ఉంచటం ఎవరికీ సాధ్యం కాలేదు. వారణాసిలోని బ్రహ్మానందస్వామి అనే ఆంధ్రస్వామి అభ్యర్థనపై తన చేతులతో ఆ విగ్రహాన్ని ఎత్తి సరిగా మౌనస్వామి నిలబెట్టారు. శారీరకంగా ఉపవాసాదులతో కృశించిన శరీరం కల్గిన స్వామి ఇంత మహాబలాన్ని చూపడం జనులకు ఆశ్చర్యం కల్గించింది.

4. మంగుళూరు వెళ్తున్నపుడు చిత్రకూట పర్వత ప్రాంతంలో మఱ్ఱిచెట్టు క్రింద స్వామి ధ్యానసమాధిలోకి వెళ్ళారు. గాలి వాన వచ్చి పెద్ద కొమ్మ విరిగి వారి మీద పడింది. అది చూచినవారు అది తియ్యటానికి ప్రయత్నిస్తే సాధ్యం కాలేదు. కాసేపటికి స్వామి వారికి మెలకువ వచ్చి చేత్తో పట్టుకొని దాన్ని అవతలికి విసరివేశారు. వారి మహాబలానికి తోటి ప్రయాణీకులు దిగ్భ్రాంతి చెందారు.

5. కుర్తాళంలోని ధరణీపీఠ శివాలయంలో ఆయన తరచుగా సమాధిలోకి వెళ్తుండేవారు. ఆయనను కదిలించడము, లేపడము ఇష్టం లేక అర్చకులు ఆయనను లోపలే ఉంచి బయట తాళాలు వేసి వెళ్ళేవారు. కానీ దర్శనానికి వచ్చిన భక్తులు ప్రార్థిస్తే ఆయన బయటకు వచ్చి వారికి కన్పించి మాయమయ్యేవారు. అర్చకులు తాళాలు తీస్తే లోపల యథాపూర్వంగానే కదలక సమాధిలో ఉన్న దృశ్యం కన్పించేది.

6. దత్తాత్రేయ మఠంలో దండపాణి, ఆదిశంకరుల విగ్రహాలు ప్రతిష్ఠ చేశారు. నవరత్నాలు సృష్టించి విగ్రహపీఠం క్రింద నిక్షిప్తం చేశారు. ఆ విగ్రహాలకు హారతి ఇచ్చేటప్పుడు దండపాణి విగ్రహం నుండి పెద్ద వెలుగురావడం అందరికీ కన్పించింది.

7. సేత్తూరు జమీందారు 'చౌక పాండ్యతీవర్' కుదరని వ్యాధితో బాధపడుతున్నాడు. స్వామి అనుగ్రహించి వారికి ఆరోగ్యం ప్రసాదించారు.

8. మఠంలో సీతారామచంద్రులు, సంతానగోపాల స్వామి, యోగనరసింహ విగ్రహాలు ప్రతిష్ఠించడానికి శ్రీరంగం నుండి వైష్ణవ

పీఠాధిపతులను స్వామివారు ఆహ్వానించారు. రైలు స్టేషన్‌కు మఠం మేనేజరు వెళ్ళి స్వాగతం చెప్పి ఆశ్రమానికి రమ్మని ప్రార్థించగా మౌనస్వామి స్వయంగా వచ్చి స్వాగతించలేదని కోపం వచ్చి వైష్ణవస్వామి తిరిగి వెళ్ళిపోవటానికి ఉద్యుక్తుడైనాడు. కానీ ఇంతలో వారు, వారి పరివారము యొక్క 'ఊర్ధ్వ త్రిపుండ్రములు తిర్యక్ పుండ్రములుగా మారినవి. అంటే నిలువుగా ఉన్న వంగనామములు, అడ్డముగా విభూతి రేఖలుగా మారినవి. వారు ఆశ్చర్యచకితులై ఆశ్రమానికి వచ్చి ప్రతిష్ఠలన్నీ యథావిధిగా చేశారు.

9. ఆశ్రమంలోని ఈశాన్య భాగంలో స్వామివారు సిద్ధివినాయక విగ్రహం ప్రతిష్ఠించారు. ప్రతిష్ఠ కాగానే కర్పూర హారతి ఇచ్చినప్పుడు ఆ విగ్రహానికి గుండె కొట్టుకోవడం, నాడి ఆడటం విన్పించింది. అనుమానం తీరని వారు డాక్టర్లను పిలిపించారు. వారు స్టెతస్కోపులతో పరీక్షించి ఆ వింతను వాస్తవమని నిర్ధారించారు. భూగర్భశాస్త్ర నిపుణులు కొందరు వచ్చి విగ్రహం లోపల ఎటువంటి యంత్రములు లేవని ప్రకటించారు. నాలుగు రోజుల పాటు నాడి ఆడుతూనే ఉన్నది. మద్రాసు గవర్నరు 'సర్ ఆర్చ్‌బాల్డ్ నై ఆయన సతీమణి వచ్చి నాడీ గణపతి దర్శనం చేసుకొని తమ భక్తిని చూపించారు. ఈ విషయం ఆనాటి ప్రభుత్వ గెజెట్‌లో ప్రకటించబడింది.

10. మద్రాసులో ఒకసారి భిక్షకు పిల్చిన ఇద్దరు వ్యక్తులను సంతృప్తి పరచడం కోసం ఒకరింటికి వెళ్ళి భిక్ష చేసి వచ్చి మళ్ళీ రెండవ వారి ఇంటికి వెళ్ళి ఇరువది ఐదుమందికి చేసిన ఆహారపదార్థాలు ఒక్కరే ఆరగించి గృహస్థును దిగ్భ్రాంతులుగా చేశారు.

11. స్వామివారు పూజించే విగ్రహాలు సంచారపీఠంలో రకరకాలు ఉండేవి. ఒక్కొక్కసారి ఆ విగ్రహాలకు అలంకరించిన ఆభరణాలు పూజానంతరం తీసివేయబోతే ఆ తీసివేయటం దేవతామూర్తులకు ఇష్టం లేనప్పుడు వాటంతట అవి అటూ ఇటూ కదులుతూ ఉండేవి. విగ్రహాల కదలికలను చూచిన ప్రేక్షకులకు ఆనందాశ్చర్యాలు కలిగేవి.

12. స్వామి ఖండయోగసిద్ధుడు. ఒక్కోసారి ఆయన గదిలో ఉన్నప్పుడు రాత్రివేళ శరీర అవయవభాగాలు విడివిడిగా అస్తవ్యస్తంగా పడి ఉండేవి. ఒకటి రెండుసార్లు తొంగి చూచిన వారు భయభ్రాంతులైనారు. ఈ అద్భుతసిద్ధి

స్వామివారి కున్న అనితర శక్తులలో ఒకటి.

13. ఒకే సమయంలో ఎన్నో చోట్ల కనబడటం గొప్పసిద్ధి. ఒకసారి స్వామివారు మద్రాసులో అంబా సముద్రమనే గ్రామంలో, కుర్తాళంలో ఒకేసారి కన్పించడమే కాక వివిధ కార్యకలాపాలు చేశారు. ఈ కాయవ్యూహశక్తి మహనీయులకు మాత్రమే ఉంటుంది.

14. కుర్తాళంలో ఒకసారి కొండమీద ఉండగా కన్యాకుమారిలో జరిగే పుష్పాభిషేకం స్వామివారు దివ్యదృష్టితో చూసి చెప్పారు. భక్తులు తమకు కూడా ఆ దర్శన భాగ్యాన్ని కల్గించమని అంటే వారి యందలి అనుగ్రహముతో అందరినీ కళ్ళు మూసుకోమని చెప్పారు. వాళ్ళందరికీ కన్యాకుమారిలో ఉన్న అనుభూతి, అక్కడి పూజా దర్శనము కల్గినది. కాసేపటికి కళ్ళు తెరిచి చూస్తే కుర్తాళం కొండమీద ఉన్నారు. కానీ చేతుల్లో కన్యాకుమారి గుడిలో ఇచ్చిన ప్రసాదం ఉన్నది.

15. ఒక కుర్రవాడు పొరబాటున హోమకుండంలో పడ్డాడు. స్వామివారు మంత్రించి విభూది పెడితే అతని గాయాలు చాలా త్వరగా మాడిపోయినాయి.

16. ఒకసారి కుర్తాళం దత్తాత్రేయ మఠంలో సమారాధన జరగబోతున్నది. తీపివంటకానికి కావలసిన నెయ్యి మాత్రము రాలేదు. సమయానికి అక్కడ రెండు టిన్నుల కిరసనాయిలు ఉన్నది. దాన్ని ఒక పాత్రలో పోసి పొయ్యి మీద పెట్టి స్వామివారు కొన్ని మూలికల రసము దానిలో పిండారు. అది నెయ్యిగా మారింది. దాంతో మధుర పదార్థం సిద్ధం చేయబడింది.

17. సంతానం లేని ఒక వ్యక్తి ఇంట్లో స్వామి వారు పూజ చేస్తుంటే, స్వామివారు ప్రసాదం ఇస్తున్నప్పుడు ఆ గృహస్థు చేతిలో స్వామి వారి చేతి నుండి ఒక కృష్ణ విగ్రహం పడింది. సంవత్సరం లోపు మీకు కుమారుడు పుడతాడని ఆశీర్వదించారు. అలాగే జరిగింది.

18. ఒకసారి కుంభకోణంలో రైలు ఎక్కడానికి స్టేషన్‌కి వెళ్ళేసరికి రైలు కదిలి వెళ్ళిపోతున్నది. విచిత్రముగా రైలు ఆగిపోయినది. స్వామివారు ఎక్కిన తరువాతనే మళ్ళీ కదిలింది.

19. 'రామస్వామి అయ్యరు' అనే వ్యక్తి తీవ్రంగా జబ్బుపడి మరణించాడు. వైద్యులు చావును నిర్ధారించిన పిదప స్వామివారు బొటనవ్రేలితో అతని నొసటిపై అదిమి పెట్టి మంత్రజపం చేశారు. నెమ్మదిగా అతని శరీరంలో కదలికవచ్చి జీవించాడు. రోగాలు పోగొట్టవచ్చు. వస్తువులు సృష్టించవచ్చు. కానీ మరణించిన వారిని బ్రతికించడం సామాన్యులకు సాధ్యం కాదు. స్వామివారి యోగప్రజ్ఞ అసామాన్యమైనది.

20. కుర్తాళంలో గవర్నర్ లార్డ్ పెంట్లాండ్ సతీమణితో సహా వచ్చి స్వామి వారి దర్శనం చేసుకున్నాడు. స్వామివారు రెండు పెద్ద గులాబీపూల దండలు, ఒక బుట్టెడు యాపిల్ పండ్లు సృష్టించి వారికి బహూకరించారు. ఆ రోజుల్లో ఆపూలు, ఆ పండ్లు అక్కడ దొరకవు. స్వామివారు యోగశక్తి వల్ల సృష్టించినవే.

21. సువర్ణవిద్య స్వామివారి కరతలామలకమైనది. వారు లోహాలను బంగారంగా మార్చేవారు. ఏమీ లేకుండా బంగారాన్ని సృష్టించేవారు. ఇది ఎన్నోసార్లు నిరూపిత మైనది. వస్తు సృష్టి స్వామి వారి శక్తులలో సామాన్యమైనది.

22. దండాయుధపాణి ఆలయం, నిర్మించేటప్పుడు కూలీలకు దినవెచ్చము కోసము మేస్త్రీ వచ్చి అడిగితే, ఏదో చెట్టు చూపించి దాని క్రింద త్రవ్వమనేవారు. త్రవ్వితే అక్కడ ఆ రోజు కూలీ మొత్తం ఎంతో అంతమాత్రమే లభించేది.

23. ఎ.ఎస్.కె. అయ్యంగారికి స్ఫోటకము వచ్చింది. పరిస్థితి విషమించి బ్రతక దనుకున్నారు. స్వామి అనుగ్రహం వల్ల పూర్తి ఆరోగ్యం వచ్చింది.

24. దూరదృష్టి, దూరశ్రవణం స్వామివారికి పరిచారికలు. ఏది కావాలనుకుంటే అది చూచేవారు, ఏది వినాలనుకుంటే అది వినేవారు. దీనికి ఎన్నో నిదర్శనాలు.

25. కుర్తాళంలో స్వామివారి దగ్గర బంగారు, రత్నాలు ఉన్నవని దోచుకోవటానికి ఒకరోజు దొంగలు వచ్చారు. ఆశ్రమం గోడలకు వారి శరీరాలు అతుక్కుపోయినవి. మరునాడు తెల్లవారిన తరువాత వారు క్షమించమని ప్రార్థిస్తే స్వామి అనుగ్రహం వల్ల వారికి కదలిక వచ్చింది.

ఇప్పటికీ ఆ కుటుంబాల వారు సంవత్సరమునకు ఒకసారి కొలుపులు చేసుకునేటప్పుడు వచ్చి పీఠానికి కానుకలు ఇచ్చి ఆశీర్వచనము తీసుకొని వెళ్తారు.

26. దేవీ పూజ చేసేటప్పుడు స్వామివారు పూవులను సరాసరి విగ్రహంమీదనో, యంత్రం మీదనో పెట్టకుండా అప్పుడప్పుడు పైకి ఎగురవేసేవారు. అవి గాలిలో సుడులు తిరుగుతూ వచ్చి చక్కగా అమర్చినట్లుగా విగ్రహం దగ్గరపడేవి. ఈ ఆశ్చర్యకరమైన దృశ్యం ఎన్నిసార్లో ఎందరో చూశారు.

27. బళ్లారి జిల్లాలోని పొందూరు దగ్గర కొండ ప్రదేశంలో తిరుగుతూ ఒక పొదను చూచి దానిని తొలగించమని చెప్పారు. ఆ పొదల నడుమ ఒక గుహ కన్పించింది. లోపలకు పోయిచూస్తే కుమారస్వామి ఆలయం ఉంది. స్వామివారి వల్ల ఆ ఆలయం మళ్లీ పునరుద్ధరణ జరిగి ప్రసిద్ధి లోనికి వచ్చింది.

28. పొందూరు రాజదంపతులు స్వామి వారి చిన్నప్పటి రూపాన్ని చూడాలని కోరారు. స్వామివారు వారి ప్రార్థనను మన్నించి "ఫోటో తీసుకోండి" అన్నారు. ఫోటోలో వారు అప్పుడున్న రూపంకాక యువకునిగా ఉన్న రూపం వచ్చింది. అందరికీ ఆనందాశ్చర్యాలు కల్గినవి.

29. కుర్తాళంలో వసంతమండపానికి పశ్చిమంగా తోటలో అయ్యప్పను ప్రతిష్ఠించి "ఈ దేవుడు కోరిన కోర్కెలు తీరుస్తాడని" స్వామివారు చెప్పారు. వానలు లేనప్పుడు అయ్యప్పకు అభిషేకం చేసి పొంగలి నైవేద్యం పెడితే వెంటనే వానలు కురవడం అక్కడ ప్రత్యక్ష నిదర్శనం.

30. కొన్ని నాడీ జాతకములలో స్వామి వారి ప్రస్తావన కన్పిస్తున్నది. రామనాథపురం జిల్లాలోని ఒక మహమ్మదీయుడు అక్కడి ఒక హిందూ దేవాలయానికి ధర్మకర్త. సంతానములేని అతడు నాడీజాతకము చదివించుకుంటే అందులో కుర్తాళంలోని మౌనస్వామి దగ్గరకు వెళ్ళితే నీ కోర్కె నెరవేరుతుందని వ్రాయబడి ఉంది. అతడు ఆ ప్రకారము స్వామి దగ్గరకు వచ్చి ఆశీస్సులు తీసుకొని పుత్రవంతుడైనాడు.

31. స్వామివారి భక్తుడైన కొండా కోటయ్య గారి భార్యకు 'హార్ట్ ఎటాక్' వచ్చినది. పెద్దడాక్టర్లు ఎందరో చికిత్స చేశారు. ఫలితం లేదు.

స్వామివారు మంత్రించి పంపించిన యంత్రం ధరించగానే ఆమెకు ఆరోగ్యం వచ్చింది.

32. స్వామివారు సిద్ధి పొందిన తర్వాత ఎందరికో దర్శనమిచ్చారు. భక్తులైన కొండా కోటయ్యగారు మఠంలోని తోటలో తిరుగుతుంటే స్వామివారు ఎదురుగా నడిచివస్తూ కన్పించారు.

33. కొద్దికాలం క్రింద ఇబ్బందులలో ఉన్న ఒక గృహస్థు నాడీజాతకం చూపించుకొన్నాడు. అందులో నీవు పూర్వజన్మలో కుర్తాళ మౌనస్వామికి అపచారం చేశావు. ఇప్పుడు వెళ్ళి వారి సమాధి దగ్గర పూజ చేస్తే కాని నీ కష్టాలు తీరవు అని దానిలో ఉన్నది. అతడు వచ్చి అర్చనలు చేసిన తరువాత అతని కష్టాలు తీరిపోయినవి.

34. విశాఖపట్టణం సముద్రతీరంలో ఒక వ్యక్తి బ్రతుకులోని కష్టనష్టాలతో విసిగిపోయి ఆత్మహత్య చేసుకోవాలని నిశ్చయించుకొన్నాడు. ఇంతలో అతని దగ్గరికి పాత కాయితం ముక్క ఒకటి ఎవరో తినుబండరాలు పెట్టుకొని తిని పారవేసినది. గాలి వాలున కొట్టుకొని వచ్చింది. యథాలాపంగా దానిని తీసి చూశాడు. అందులో కుర్తాళం మౌనస్వామి గురించిన విశేషాలున్నవి. దానిని చదివి ఆకర్షితుడయి నా కష్టాలు తీరితే నిన్ను సేవిస్తానని మౌనస్వామికి మొక్కుకున్నాడు. ఆత్మహత్యా ప్రయత్నం మానుకొని ఇంటికి వెళ్ళాడు. ఆ క్షణం అతని జీవితాన్ని మార్చి వేసినది. అతడు తరువాత వ్యాపారం చేశాడు, కలిసి వచ్చింది. లక్షలు సంపాదించాడు. భక్తితో కుర్తాళం వచ్చి తన జీవిత పరిణామం చెప్పి మౌనస్వామి సమాధి దగ్గర తన కానుక సమర్పించుకొన్నాడు. అతడు సమర్పించిన ధనం సిద్ధేశ్వరిపీఠంలో భవన పునరుద్ధరణకు మూలయింది. శ్రీ శివచిదానందభారతీస్వామి ఈ సంఘటనను ప్రత్యేకంగా ఉదాహరించేవారు.

35. విజయవాడ దత్తాత్రేయ మఠంలో శివచిదానందభారతీస్వామి వారి దర్శనానికి వచ్చిన ఆగంతుకుడు గుండెపోటు వచ్చి కుప్పకూలిపోయినాడు. వెంటనే డాక్టరును పిలిపిస్తే వచ్చి చూచి మరణించినాడని నిర్ధారించాడు. స్వామివారి మనసు చాలా బాధపడింది.

ఏదో ఆవేశం వచ్చినట్లుగా లేచి మౌనస్వామి పిలుస్తున్నాడు. లే ! లేచిరా ! అని పెద్దగా పిలవడం మొదలుపెట్టారు. మూడుసార్లు పిలిచేసరికి చచ్చినవాడు బతికి లేచాడు. అందరూ దిగ్భ్రాంతి చెందారు. మౌనస్వామి శరీరంతో ఉన్నపుడే కాదు శరీరం విడచిపెట్టిన తరువాత కూడా చూపించిన మహామహిమల్లో యిది ఒకటి.

36. త్రివిక్రమరామానందభారతీస్వామి సిద్ధేశ్వరీపీఠంలో రెండవ పీఠాధిపతి. ఒక రోజు ఇద్దరు దంపతులు 5, 6 ఏండ్ల కుమారునితో వచ్చి మా వాడికి మాటలు రావడం లేదు. మౌనస్వామి మహిమగల వాడని విని వచ్చామని స్వామివారిని ప్రార్థించారు. స్వామివారు ఆ బాలునితో మౌనస్వామి నీకు మాటలు ఇస్తాడు. పీఠంలో సేవ చేస్తావా ? అని అడిగారు. ఆ బాలుడు చేస్తాను 'చేస్తాను' అంటూ మాట్లాడాడు. అదే మొదలు వాడికి మాటలు వచ్చేసినవి. క్షణంలో జరిగిన ఈ మార్పునకు ఆ తల్లిదండ్రులు పొంగిపోయినారు. 'మౌనస్వామి' కరుణా కటాక్షం ఆ రకంగా ప్రసరించినది.

37. విశాఖపట్టణంలో ఒక మహిళకు గుండెకు శస్త్రచికిత్స జరగబోతున్నది. ఆమె శ్రేయోభిలాషులు ఇద్దరు ప్రముఖులు లలితాపీఠంలో వేంచేసి ఉన్న సిద్ధేశ్వరానంద భారతీస్వామి వారి వద్దకు వచ్చి విషయం విన్నవించి ఆశీరక్షతలు ఇమ్మని అభ్యర్థించారు. స్వామివారు మౌనస్వామిని స్మరించి, మంత్రాక్షతలు ఇచ్చారు. వీరు ఆ అక్షతలను తీసుకొని వెళ్ళి ఆమెకు ఇచ్చి శిరస్సున ధరింపజేశారు. శస్త్రాలయంలోకి ఆమెను తీసుకొని వెళ్ళిన తరువాత కాసేపటికి ఆపరేషను అవసరం లేదు. అంతా బాగానే ఉన్నది. అని చెప్పి వెనక్కు పంపేశారు. పది నిమిషాలలో వచ్చిన ఈ మార్పు 'మౌనస్వామి' మంత్రాక్షతల మహిమ అని అందరు కీర్తించారు.

38. మౌనస్వామి జీవించి ఉండగా ఒక గొప్ప మళయాళ మంత్రవేత్త తన శిష్యునితో సహా వచ్చి స్వామివారి దర్శనం చేసుకొన్నారు. భౌతిక శరీరాన్ని విడిచి పెట్టిన తరువాత ఆ మాంత్రికుడు ఇప్పటికీ సిద్ధశరీరంతో మౌనస్వామి సమాధి దగ్గరకు, తోటలోని అయ్యప్ప గుడి దగ్గరకు వచ్చి వెళ్తున్నాడు. సిద్ధేశ్వరానందభారతీస్వామివారికి అప్పుడప్పుడూ, కన్పిస్తూనే ఉన్నారు. ఆ మాంత్రికుని శిష్యుడు కూడా తీవ్రసాధకుడే. జన్మ మారి తెలుగుదేశంలోని

ఒక గ్రామంలో పుట్టి కన్నడదేశంలో వేదం నేర్చుకొని కుర్తాళం చేరి సిద్ధేశ్వరీపీఠంలో చిన్నవయస్సులోనే అర్చకుడుగా చేరి ఉన్నాడు. పూర్వజన్మలో మౌనస్వామి దర్శనం, సేవ, అతనిని ఇక్కడకు తెచ్చినవి.

39. ఒక తమిళ ఉద్యోగి వైరాగ్యం కల్గి సన్యాసం తీసుకొని మౌనస్వామి మీదభక్తితో చాలా కాలం సిద్ధేశ్వరీ పీఠంలో ఉన్నాడు. ఆ అనుబంధం విడిచిపెట్టలేక శరీర పతనానంతరం కూడ ఇప్పటికీ ఆశ్రమంలో తిరుగుతూనే ఉన్నాడు. ఇటీవల సిద్ధేశ్వరానందభారతీస్వామి వారికి కన్పించి అరవంలో మాట్లాడాడు.

40. 'మౌనస్వామి' హిమాలయాలలో సాధన చేస్తున్న రోజులలో మిత్రుడయిన స్వామి విశుద్ధానంద కాశీలో ఉండేవాడు. ఇద్దరూ కలిసి సిద్ధాశ్రమం నుంచి తెచ్చిన శివలింగం ఆయన ఆశ్రమంలో ఇప్పటికీ ఉంది. కొద్ది నెలల క్రింద సిద్ధేశ్వరానందభారతీస్వామి వారు అక్కడకు వెళ్ళి వారి సమాధి దర్శించినప్పుడు పూర్వానుబంధం వల్ల విశుద్ధానందస్వామి వారికి దర్శనమిచ్చి మాట్లాడారు.

41. ఒక తమిళ యువకుడు శివచిదానందభారతీ స్వామి వారి దగ్గర బ్రహ్మచర్యంలోనే సన్యాసదీక్ష తీసుకొన్నారు. బ్రహ్మపుత్రా నదీ తీరంలో ఒక 'నాగ సాధువు'గా పూర్వజన్మలో ఉన్న ఆ యువకుడు హిమాలయాలలో మౌనస్వామిని దర్శించిన ఫలితంగా జన్మ మారినపుడు ద్రవిడ భూమిలో పుట్టి సిద్ధేశ్వరీ పీఠమునకు చేరువయినాడు.

42. కుర్తాళం కొండమీద మౌనస్వామి అగస్త్యమహర్షి తపస్సు చేసిన గుహలో చాలాకాలం ఏకాంత సాధన చేశారు. ఇప్పటికీ ఆ గుహలో కూర్చుని ధ్యానం చేసినవారికి మౌనస్వామి యొక్క తపస్థలం కాబట్టి దివ్యానుభవాలు కల్గుతున్నవి. మద్రాసులోని ఒక యువకుడు కలలో ఒక కొండ గుహను అందులో తపస్సు చేస్తున్న ఒక యోగిని చూశాడు. ఇటీవల సిద్ధేశ్వరానందభారతీస్వామి వారితో అనుబంధం ఏర్పడి కుర్తాళం వచ్చి మౌనస్వామి చిత్రాన్ని కొండగుహను చూచి తనకు కలలో కన్పించిన దృశ్యం ఇదే అని ఆశ్చర్యపడ్డాడు. మౌనస్వామి ఆకర్షణ బహువిధాలుగా ప్రసరిస్తున్నది.

43. మౌనస్వామి తన శిష్యుడొకడు జన్మమారి పెరిగి

యువకుడయినాడని అతని పేరు చెప్పి అతనికి మంత్రోపదేశం చేసి సాధన చేయించవలసినదిగా సిద్ధేశ్వరానందభారతీస్వామి వారికి తెలిపారు. ఆ సూచన ప్రకారం ఆ పేరు గల యువకుడు రావడం ఉపదేశం పొందడం జరిగింది. అతడిపుడు తీవ్రంగా సాధన చేస్తూ అద్భుతమైన అనుభవాలు పొందుతున్నాడు.

44. సిద్ధేశ్వరానందభారతీస్వామివారి మొదటి చాతుర్మాస్య దీక్షలో గురుదేవతాత్మకమైన యజ్ఞం చేయించారు. హోమకుండంలోకి మౌనస్వామిని ఆవాహన చేసినపుడు ఆయన స్వయంగా తేజోరూపంతో నుంచోవడాన్ని సాధక శ్రేష్ఠులు వృద్ధ యతి అయిన రామకృష్ణానందభారతీ స్వామి దర్శించి అరుగో ! మౌనస్వామి కుండం మధ్యలోకి వచ్చారు అని ఆనందంతో పలికారు. భక్తితో పిలిస్తే కదలి వచ్చే సిద్ధేశ్వరుడు 'మౌనస్వామి'.

45. గుంటూరులో ఒకభక్తుడు తాను నివసిస్తున్న ఇంటిని సిద్ధేశ్వరీ పీఠానికి సమర్పించి అక్కడ దేవి ఆలయాన్ని నిర్మించవలసినదిగ సిద్ధేశ్వరానందభారతీస్వామి వారిని ప్రార్థించాడు. ఆలయ నిర్మాణం జరుగుతుండగా మౌనస్వామి సమాధిచూడాలని, సిద్ధేశ్వరీదేవిని దర్శించాలని కుర్తాళం వచ్చాడు. వచ్చిన 3వ రోజు గుండెపోటు వచ్చి స్పృహ తప్పాడు. మౌనస్వామి సన్నిధిలో ఈ అపశ్రుతి ఏమిటా అనిపించింది. వెంటనే డాక్టర్లు పరీక్ష చేసి చాలా తీవ్రమయిన 'గుండెపోటు' వచ్చింది. బ్రతుకుతాడో లేదో చెప్పలేమన్నారు. తిరునల్‌వేలి హాస్పిటల్‌లో చేర్చిన తరువాత కొద్ది రోజులకు ఆయనకు స్పృహ వచ్చినపుడు సిద్ధేశ్వరి, మౌనస్వామి తనకు కలలో కనిపించారనీ ఆయువు తీరిపోయి వెళ్ళిపోతున్న తనను మళ్ళీ ఆయువు నిచ్చి వారు బ్రతికించారని అన్నారు. మౌనస్వామి అనుగ్రహం ఆయనపై కల్గి ప్రాణం పోశారు.

46. ఇటీవల మౌనస్వామి పాదుకలు పెట్టి అష్టోత్తర నామాలతో పూజ చేసినప్పుడల్లా ప్రతిసారీ ఆయన వస్తూనే ఉన్నారు. వివిధ ధ్యాన సంప్రదాయాలకు చెందిన భక్తులెందరో వారిరాకను చూడగల్గుతున్నారు. ఆయన చిత్రం నుంచి కాంతికిరణాలు ప్రసరించడం దివ్యచక్షువు వికసించిన వారికి ఎన్నిసార్లో అనుభూతమైంది.

D D D

# మా వద్ద లభించు గ్రంథములు

స్వామివారి రచనలు

1) అమెరికాలో దేవతలు
2) తాంత్రిక ప్రపంచం
3) దశమహావిద్యలు
4) ప్రత్యంగిరా సాధన
5) లలితాదేవి చరిత్ర
6) బృందావన భాగవతం
7) హిమాలయ సిద్ధులతో మౌనస్వామి
8) కాళీసిద్ధులు
9) భైరవసాధన
10) నాగసాధన
11) కుర్తాళ యోగులు
12) కవిబ్రహ్మ
13) కావ్యకంఠ
14) మన సమస్యలు-మంత్రసాధనలు
15) సిద్ధాశ్రమ యోగులు
16) సిద్ధేశ్వరయానము (శ్రీ స్వామిజీ వారి 5వేల యేండ్ల చరిత్ర)

మాతాజీ రమ్యానందభారతీస్వామిని రచనలు

1) Mystic Monk of Courtallam
2) మహిమాన్వితయోగి - స్వామి సిద్ధేశ్వరానంద
3) గురుదేవోభవ
4) శ్రీ సిద్ధేశ్వరీ పీఠవైభవము

## పూర్వాశ్రమంలో

సరస్వతీ కంఠాభరణ, సాహితీసార్వభౌమ, అవధాని శేఖర, ఆశుకవిచక్రవర్తి, రూపకసమ్రాట్, కవితాసుధాకర, కవిమల్ల, కవికులపతి, మంత్ర మహోదధి

**డాక్టర్ ప్రసాదరాయ కులపతి**

ప్రిన్సిపాల్, హిందూ కాలేజి, గుంటూరు

కవినుండి ఋషి, ఋషి నుండి యతి
యతి నుండి పీఠాధిపతి – **నేడు**
మహిమాన్వితయోగి, నడిచేదైవం
కుర్తాళ సిద్ధేశ్వరీ పీఠాధిపతి



పరమహంస, పరివ్రాజకాచార్య, జగద్గురు

**శ్రీ సిద్ధేశ్వరానంద భారతీస్వామి**

బృందావనేశ్వరి శ్రీరాధ కరుణించి
తన దర్శనంబు మంత్రంబు నొసగె
వజ్రవైరోచని – భద్ర – దుర్గాసఖి
నిరతంబు రక్షగా నిలిచియుండె
దివినుండి బొమ్మయై దిగివచ్చి కాళిక
షట్ శతాబ్దంబుల చరిత జెప్పె
పిలిచి సిద్ధేశ్వరీ పీఠాధిదేవత
కుర్తాళమఠ జగద్గురుని జేసె
అతడు సామాన్యుడే జగద్ధితము కొరకు
దేవతలు పంపవచ్చిన దివ్యుడెవరొ
జ్ఞానియును యోగి కవిలోకచక్రవర్తి
అతడె సిద్ధేశ్వరానంద యతివరుండు

కాళికామంత్ర సిద్ధాయ
సాక్షాత్ భైరవమూర్తయే
సిద్ధేశ్వర యతీశాయ
యోగీంద్రాయ నమోనమః